# తెలుగువారి

# జానపద కళారూపాలు




కళాప్రపూర్ణ
డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

TELUGUVARI
JAANAPADA KALARUPALU
Dr. MIKKILINENI RADHAKRISHNA MURTHY



మొదటి ముద్రణ : 1992

ప్రచురణ సంఖ్య : 129

ప్రతుల సంఖ్య : 1500

ముఖచిత్రం : బాపు



వెల : 130 రూపాయలు

ప్రతులకు :

తెలుగు విశ్వవిద్యాలయం
ప్రచురణల విభాగం
పబ్లిక్ గార్డెన్సు, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

ముద్రణ : క్రాంతిప్రెస్, మద్రాసు - 600 001.



# భూమిక



పద్మభూషణ్
ఆచార్య
డా॥ సి. నారాయణరెడ్డి

తెలుగు భాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికాసానికీ, వికాసానికీ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టప్రకారం 1985 డిసెంబరు 2 వ, తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం.

బోధన, పరిశోధన, ప్రచురణలతో పాటు విస్తరణ సేవ, రాష్ట్రేతరాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పన వంటి బహుముఖీన కార్యక్రమాలను కూడా ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది.

పూర్వం వున్న అకాడమీలు, తెలుగు భాషాసమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం, విలీనం కావడంతో విశ్వవిద్యాలయం, వివిధ పీఠాలు, కేంద్రాలు. విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది.

తెలుగుజాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాల్లో ఒకటి.

విశ్వవిద్యాలయంలో విలీనమైన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషి ద్వారా దేశ సాహిత్య రంగంలో విశిష్టస్థానం సమకూర్చుకుంది.

1957 ఆగష్టు 7-వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమీ దేశం మొత్తంమీద ప్రప్రథమ రాష్ట్ర స్థాయి అకాడమి కావడం విశేషం.

ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనా సాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవిత చరిత్రలు, అనువాదాలు మొదలైనవి 163 గ్రంథాలు ప్రచురించింది.

తెలుగు విశ్వవిద్యాలయం, ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇప్పటివరకు 123 గ్రంథాలను వెలువరించింది.

ప్రస్తుత గ్రంథం తెలుగువారి జానపద కళారూపాలు.

నన్నయకు పూర్వంనుంచే తెలుగునాట బహుళ ప్రచారంలో వున్న జానపద కళారూపాల గురించి సమగ్రమైన అవగాహనతో రచించిన గ్రంథమిది.

తెలుగు నాటకరంగాన్ని గురించి, నటరత్నాల గురించి, లోగడ విలువైన గ్రంథాలు వెలువరించిన డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు, తమకున్న పరిణతానుభావం ఫలితంగా ఈ రచనను రూపొందించారు.

నలభై ఏళ్ళకు పైగా జానపద కళారంగంలో మిక్కిలినేనిగారు చేసిన సాధన, పరిశోధన, నిజానికి 800 వందల పుటల్లో ఇమిడేది కాదు.

అయితే కొన్ని అంశాలను క్లుప్తంగా వివరిస్తూ అన్ని కోణాలను ఉల్లేఖిస్తూ ఈ బృహత్ గ్రంథాన్ని రచించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని మూడు ప్రాంతాల కళారూపాలకు సంబంధించిన విశ్లేషణ ఇందులో ఇమిడి వుండటం విశేషం.

ఈ పరిశోధన గ్రంథం జానపద కళాభిమానులకే కాకుండా, తెలుగు విశ్వవిద్యాలయంలోని జానపద కళల శాఖ విద్యార్థులకూ విశేషంగా ఉపకరిస్తుంది.

విషయపుష్టమైన ఇంత చక్కని గ్రంథం రచించి తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణగా వెలువరించే అవకాశం కలిగించిన డా॥ మిక్కిలినేనిగారికి కృతజ్ఞతలు.

యథాపూర్వకంగా ఈ ప్రచురణ కూడా అందరి ఆదరాభిమానాలు చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

హైదరాబాదు,
3.1.92.

ఆచార్య
సి. నారాయణరెడ్డి,
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం



# నే నెందుకు రాయాలి?

అసలు ఈ పని నే నెందుకు చేయాలని నటరత్నాల గ్రంథంలో నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. ఆ ప్రశ్నే మళ్ళీ ఇక్కడ కూడా వేసుకుంటున్నాను. అవును ఈ పని నే నెందుకు చేయాలి?



నాటకం, సినిమా, రేడియో, టీవీ, వీడియో, ఆడియో లేని నా చిన్ననాడు, పల్లె ప్రజలను అలరించి, ఆనందపర్చి, ఆనందడోలికలలో ఊగులాడించి, ఈ నాడు కాలగర్భంలో కలిసిపోతున్న నాటి జానపద కళారూపాలు, నన్ను ఉత్తేజ పర్చాయి. ప్రభావితుణ్ణి చేశాయి.

ఆ నాటి ప్రదర్శనాలను రాత్రి తెల్లవార్లూ కూర్చుని చూశాను. ఎన్ని కళా రూపాలు? ఎంత గొప్ప ప్రదర్శనాలు? వారు ఎంత గొప్ప కళాకారులు?

పది రూపాయల కోసం, పట్టెడన్నం కోసం వారు ఎంత నిస్వార్థంగా కళకు సేవ చేశారు? నా నటజీవితానికి తొలి రేఖలు దిద్దింది వారే, వారే నా మార్గదర్శకులు, వారే నా గురుదేవులు. నాకే కాదు నా ముందు తరాలవారికీ, ఆ మాట కొస్తే ఈ తరం కళాకారులకు కూడ వారే కళామూర్తులు.

రెండువేల సంవత్సరాల ఆంధ్రుల సాంస్కృతీ వికాసంలో, నాటకరంగం ప్రారంభమయ్యే నాటికీ, తరువాత కాలానికీ, ప్రతీకలుగా నిలిచివున్న జానపద కళా రూపాలను, ఎందరు మహామహులు సృష్టించారో? ఎంతమంది కథలు వ్రాసి, కవిత లల్లి, కాలప్రవాహంలో కలిసిపొయ్యారో? ఎంతమంది కళాకారులు ప్రదర్శనాల సేవలో తరించి తరించి, అందుకే అంకితమై అంతరించి పొయ్యారో, ఆ అభాగ్యులను గురించి పట్టించుకున్నవారే లేకపొయ్యారు.

ఒకనాడు జాతినంతా ఉర్రూత లూగించిన జానపద కళారూపాలు. ఈ నాడు అంతరించి పోతున్నాయి. ఆ కళాకారులు అన్నమో రామచంద్రా యంటూ వీథుల్లో ముష్టెత్తుకుంటున్నారు. అందరిచేతా చీదరింపబడుతూ బ్రతుకుతున్నారు. ఒకనాడు దేశానికి జాతికి విజ్ఞాన వినోద వికాసాలను కలిగించిన, ఆ మహోన్నత కళాకారుల నేటి దుస్థితి ఇది. అందుకే ఆ అపూర్వ కళారూపాలను, ఆ కళాహృదయాలను, ఒక చోటకు చేర్చి, దేశానికీ, ప్రజలకు తెలియచెయ్యాలనిపించింది.

ఇంతవరకు గట్టిగా ఆ ప్రయత్నం చేసినవారు లేరు. సంగీత నాటక అకాడమీ లాంటి సంస్థ ఏవో రెండు సదస్సులు జరిపి రెండు సావనీర్లు ప్రచురించటం తప్పా వాటి గురించి అంతగా పట్టించుకున్నట్లు కనిపించదు.

ఎంతో మంది పరిశోధక విద్యార్థులు, జానపద విజ్ఞానం గురించి యం. ఫిల్. పి. హెచ్.డీల కొరకు పరిశోధన చేశారే తప్పా, జానపద కళారూపాలకు సంబంధించిన సమాచారం గురించి పరిశోధన చేయటం జరగలేదు.

జానపద కళారూపాలను సేకరించి ఒక చోటకు చేర్చి ప్రచురించిన నా ఈ తెలుగువారి జానపద కళారూపాల గ్రంథమే యీ కోవలో ప్రప్రథమ గ్రంథం.

ఎక్కడెక్కడో మారుమూల నున్న కళారూపాలను సాధ్యమైనంతవరకు ఏర్చి కూర్చిన జానపద కళారూపాల మాల ఇది. ఇది నా ప్రథమ ప్రయత్నం కాబట్టి ఇందులో కొన్ని కళారూపాలు చేరి వుండకపోవచ్చు. ఈ ప్రయత్నాన్ని భావి రచయితలు ఇంకా ముందుకు తీసుకుపోగలరని ఆశిస్తున్నాను.

ఈ నా కృషిలో ఎన్నో గ్రంథాలు. పత్రికలు నాకు తోడ్పడ్డాయి. ఇది నా ఒక్కడి ప్రతిభా కాదు. ఎందరో మహానుభావులతో కూడిన అందరిదీ ఈ కృషి.

ఈ నాడు పేరిణి నృత్యాన్ని శాస్త్రీయ కళారూపంగా నటరాజ రామకృష్ణగారు తీర్చి దిద్దారు. అలాగే కొంతమంది హరికథా గానం కూచిపూడి నృత్యం దేవదాసీ నృత్యం మొదలైనవి కూడా శాస్త్రీయ కళారూపాల్లాగానే భావిస్తున్నారు.

కాని ఆనాడు, గొండ్లి. పేరిణి, ప్రేంఖణము మొదలైన వాటిని జాయపసేనాని దేశి కళారూపాలుగానే వర్ణించాడు. కూచిపూడి నృత్యం, హరికథా గానం, దేవదాసీ నృత్యం, జానపద కళారూపాలుగానే వర్థిల్లాయి. జానపద కళారూపాల తరువాత వచ్చినవే శాస్త్రీయ కళారూపాలు. జానపదకళారూపం లేకుండా, శాస్త్రీయకళారూపం లేదు. అందువల్ల ఈ కళారూపాలను జానపద కళారూపాలుగానే వివరించాను.

అలాగే ఆ యా కళారూపాలకు సంబంధించిన బొమ్మలు కొంతవరకు సేకరించగలిగాను. లభ్యమైన కొద్ది మంది కళామూర్తుల ఫోటోలు మాత్రం ప్రచురించగలిగాను. ఈ నా ప్రయత్నంలో ఏ కళాకారుణ్ణి కావాలని విస్మరించలేదు.

జానపద కళారూపాలను వెలుగులోకి తేవాలని, తహతహ లాడిన కళాభిమానులు ఎందరో వున్నారు. అలాంటివారిలో డా॥ కె. వి. గోపాలస్వామి, పి. యస్. ఆర్. అప్పారావు, డా॥ బి. కృష్ణంరాజు, ఎ. ఆర్. కృష్ణ, గోపాలరాజ్ భట్, డా॥ మొదలి నాగభూషణశర్మ, డా॥ అత్తిలి కృష్ణారావు, శ్రీ లక్ష్మీకాంతమోహన్, ప్రయాగ నరసింహశాస్త్రి, డా॥ జయధీర్ తిరుమలరావు, వింజమూరు సీతాదేవి,

అనసూయాదేవి, రాంభట్ల, జమున, వరదా ఆదినారాయణ, దూడల శంకరయ్య, భాగవతుల రామకోటయ్య, ఇంద్రసేనారెడ్డి, పులికంటి కృష్ణారెడ్డి, లక్ష్మీనరసయ్య, కోసూరి పున్నయ్య, ఆరవేటి శ్రీనివాసులు మొదలైన ఎందరో కాదు మరెందరో కృషి చేశారు. వారందరికీ వందనాలు.

నా ఈ గ్రంథాన్ని తమ ప్రచురణగా స్వీకరించిన తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారికి, రిజిస్ట్రారు డా॥ ఎన్. శివరామ మూర్తిగారికి, ప్రస్తుత రిజిస్ట్రారు డా॥ బి. రామకృష్ణారెడ్డిగారికి. ప్రత్యేక నిర్వహణాధి కారి శ్రీ గోవిందరాజు రామకృష్ణారావుగారికీ, ప్రచురణల విభాగం నిర్వాహకులు డా॥ టి. గౌరీశంకర్‌గారికీ, ప్రచురణల విభాగపు పరిశీలకులకూ కృతజ్ఞతలు.

ఈ గ్రంథానికి రేఖాచిత్రాలను గీసి అందించిన ప్రసిద్ధ చిత్రకారులైన గంగాధర్, టి. వెంకటరావు, ఆంధ్రప్రభ చిత్రకారుడు కీ॥ శే॥ ఆనంద్‌కూ—

అత్యంత ఆదరాభిమానాలతో ముఖచిత్రాన్ని గీసి ఇచ్చిన సుప్రసిద్ధ చిత్ర కారులు డా॥ బాపుగారికీ నా అభివందనలు.

రచయితగా నా యీ ప్రయత్నానికీ, కృషికీ ఉదతాభక్తిగా ఆర్థిక సహాయం అందించిన తిరుమల, తిరుపతి దేవస్థానంవారికీ, గ్రంథాన్ని సుందరంగా ముద్రించిన క్రాంతి ప్రెస్ శ్రీధర్‌గారికీ, నాటక జానపద కళారంగాలలో నేను చేస్తున్న కృషికి, ప్రారంభంనుండీ నా వెన్నుతట్టి నన్ను ఉత్సాహపర్చిన డా॥ అక్కినేని నాగేశ్వర రావు. డా॥ యన్. టి. రామారావు, డా॥ గుమ్మడి, శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, డా॥ వేణుమాధవ్, సవేరా అధిపతి శ్రీ ఎ. వెంకట కృష్ణారెడ్డిగారికీ కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

రాజకీయాలకూ, కళలకూ అంకితమైన నా జీవితంలో అజ్ఞాతహస్తంగా నిలిచి నాకు అండదండ లందించిన నా జీవిత భాగస్వామి, నా అర్ధాంగి సీతారత్నంకు అభి నందనాలు చెప్పకుండా వుండలేను.

జానపద కళారూపాలలో, కళాసేవలో అవిశ్రాంతంగా కృషిచేసి అనంతా కాశంలో కలిసిపోయిన అజ్ఞాత కళాకారు లందరికీ నా జోహారులు.



# బంగారు తల్లి తండ్రులకు

## అంజలి



నా చదువుకూ, సంస్కారానికీ
కృషికీ దోహదం చేసి నన్ను
కళారంగానికి అంకితం చేసిన
నా బంగారు తల్లి తండ్రులు

కీ॥ శే॥ వెంకయ్యకూ
కీ॥ శే॥ సౌభాగ్యమ్మకూ

## అంజలి



# కొందరు జానపద కళామూర్తులు



ఆచార్య డా॥ బి. రామరాజు



ఆచార్య డా॥ టి. దొణప్ప

జానపద వాఙ్మయోద్ధారక



కీ॥ శే॥ నేదునూరి గంగాధరం



కీ॥ శే॥ శ్రీనివాస చక్రవర్తి



ఆచార్య డా॥ యస్వీ. జోగారావు



పద్మశ్రీ డా॥ నటరాజ రామకృష్ణ



ఆచార్య నాయని కృష్ణకుమారి



పద్మశ్రీ షేక్ నాజరు



శ్రీ ఎల్లోరా



ఆచార్య ఎస్. గంగప్ప



డా॥ ఆర్వీ. ఎస్. సుందరం



డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు



విప్లవ, ప్రజాకవి శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య



డా॥ వై. సంపత్‌కుమార్



శ్రీ కె. వి. హనుమంతరావు
ఆకాశవాణి



డాక్టర్ బిట్టు వెంకటేశ్వర్లు



డాక్టర్ పిగిచర్ల కృష్ణారెడ్డి



జానపద బ్రహ్మ
శ్రీ కొసరాజు రాఘవయ్యా చౌదరి



ఒగ్గు కథాప్రవీణ
శ్రీ చుక్కా సత్తెయ్య



డాక్టరు డి. ఏ. నారాయణ
కుమ్మరి మాస్టారు



# ఎన్నో కళారూపాలు మరెన్నో విషయాలు





# జనసంపదే
# జానపద కళారూపాలు

నాటకరంగానికి మాతృకలై యుగయుగాలుగా; తరతరాల వైభవాన్ని సంతరించుకున్న జానపద కళారూపాలను గురించి ఈ తరంవారికి ఎవరికీ తెలియదనటం అతిశయోక్తి కాదు. అది తరతరాల వైభవం, తరగని వైభవం.

మన నాటకరంగానికి నూరేళ్ళు దాటాయి. అలాగే నాటకాలనే వృత్తిగా చేసుకుని బ్రతుకుతున్న సురభి నాటకరంగం ఏర్పడి కూడా నూరు సంవత్సరాలు దాటాయి. ఇటీవలనే చలనచిత్ర పరిశ్రమ స్వర్ణోత్సవాన్ని కూడా జరుపుకుంది. ప్రాచీన కళారూపాలను పునరుద్ధరించి ప్రగతిశీల దృక్పథంతో నూతన ప్రయోగంతో ఆధునికపద్ధతులలో ప్రజల మధ్యకుపోయి కళారూపాలలో ప్రజాసమస్యలను జోడించి నవ చైతన్యం కలిగించిన ప్రజానాట్యమండలి ఏర్పడి నలభై ఏడు సంవత్సరాలైంది.



అయితే నూరు సంవత్సరాలకు ముందు నాటకరంగం లేనినాడు మన ప్రజలకున్న కళారూపా లేమిటి? అని మనం ప్రశ్నించుకుంటే మనకు కనిపించేవి ఆనాటి జానపద కళారూపాలే.

జానపద కళారూపాలంటే ఈనాడు చాలామందికి అర్థం కావు. జనపదమంటే పల్లెటూరనీ జనపదంలో నివసించేవారు జానపదులనీ, వారు పాడుకునే పాటలుగాని, ఆటలుగాని, నృత్యంగాని, జానపద కళారూపాలనీ పెద్దలు నిర్వచించారు.

జానపద సాహిత్యమనీ, జానపద గేయాలనీ, జానపద నృత్యమనీ, జానపద సంగీతమనీ, జానపద వీధినాటకమనీ, తోలుబొమ్మలనీ, బుర్రకథలనీ, యక్షగానాలనీ, జముకుల కథలనీ, పిచ్చుకుంటుల 'కధ'లనీ, పగటి వేషాలనీ ఇలా ఎన్నో వందలాది జానపద కళారూపాలు. ఆనాడు పల్లె ప్రజలకు విజ్ఞానాన్నీ, వినోదాన్నీ కలిగించాయి.

అయితే జానపద కళారూపాలంటే అవి శాస్త్రీయమైనవి కావనీ, అవి కేవలం పామరుల కళారూపాలనీ, పనికిమాలినవనీ, ఏమాత్రం శాస్త్రీయత లేనివనీ కొంత మందిలో దురభిప్రాయముంది కాని సంగీతానికీ, నృత్యానికీ ఎలాంటి శాస్త్రీయత వుందో అలాంటి శాస్త్రీయతే వీటికీ వుంది. జానపద కళారూపాలలో సంగీతముంది, తాళం వుంది, లయ వుంది, నృత్య ముంది, అభినయం వుంది, ఆహార్య ముంది, వాయిద్య ముంది. లయబద్ధమైన కలయికా క్రమశిక్షణ వుంది.

జానపద కళలు అతి ప్రాచీనమైనవి. మానవులయొక్క అనుభూతులకూ, మానసిక చైతన్యానికీ, విజ్ఞాన వినోదాలకూ ఆనందోత్సాహాలకూ ప్రతీకలై నిలిచాయి. అన్ని కళలకూ పునాదులై అగ్రభాగాన నిలిచాయి.

ఆంధ్రుల సాంఘిక చరిత్ర రెండువేల సంవత్సరాల నాటిది. నాటినుంచి నేటి వరకూ ఆయా రాజుల కాలంలో రకరకాలుగా ఈ జానపద కళలు పోషించబడ్డాయి, ఆచరించబడ్డాయి. అభివృద్ధి చెందాయి. శాస్త్రీయ కళలతో పాటు జానపద కళలుకూడ పోషింపబడ్డాయి. ప్రజలు ఆదరించారు.

ఆదిమ కళారూపాల అభివృద్ధిలోనే శాస్త్రీయత ఉద్భవించింది. త్యాగయ్యగారి కృతులకూ, అన్నమయ్యగారి గేయాలకూ, ఎవరు స్వరాలు ఏర్పాటు చేశారు? ఎవరు తాళగతుల్ని ఏర్పరచారు? ఆదిమ జానపద కళలే లేకపోతే, ఈ శాస్త్రీయత ఎక్కడిది? శాస్త్రీయతకు పునాది జానపద కళలే, అయితే ఈ శాస్త్రీయత పేరు మీద జానపద సంగీతాన్ని శాస్త్రీయ సంగీత వాగ్గేయకారులూ, జానపద నృత్యకళను, శాస్త్రీయ నృత్యకారులు, అలాగే జానపద సాహిత్యాన్నీ గేయసాహిత్యాన్నీ గ్రాంధిక భాషా వాదులూ, శాస్త్రీయత చాటున దాగిన ఛాందసులూ, జానపద విజ్ఞానాన్ని అణచివేశారు, సర్వనాశనం చేశారు, వాటికి ఆదరణ లేకుండా చేశారు. ఈనాడు ధనికవర్గాలు బల హీన వర్గాలను ఎలా అణచివేశాయో అలాగే జానపద కళలను కూడ భూస్థాపితం చేశారు. అలా అజ్ఞాతంగా జానపద కళలు ఆదరణ లేక అలా వుండిపోయాయి.

శతాబ్దాలుగా రాజులుపోయినా, రాజ్యాలు మారినా, జానపద కళలు మాత్రం ప్రజాహృదయాలలో అలాగే నిలిచి వున్నాయి. ఎన్ని ఆటుపోటులు వచ్చినా ప్రజలు వాటిని పోషించారు. కళలనూ, కళాకారులనూ, కన్నబిడ్డలుగా చూసుకున్నారు. తెలుగు జాతి గర్వించతగిన కళారూపాలవి.

నాటకం, సినిమా, రేడియో, టెలివిజన్‌లాంటి ఆధునిక సాంకేతిక ప్రక్రి యలు రావడంతో ఈనాడు వాటిపట్ల ఆదరణ తగ్గింది. జానపద కళలను పోషించే

వారు తగ్గిపోయారు. కళాకారులు కడుపుకోసం ఆ కళలనే పట్టుకుని దేశసంచారులుగా తిరుగుతూ కళాప్రదర్శనాలను ప్రదర్శిస్తూ చాలీచాలని ఆదాయాలతో కడుపు నింపుకుంటూ జీవిస్తున్నారు.

ఎందరో నిష్ణాతులైన కళాకారులు ఎందరో కీర్తిశేషులైనారు. ఎన్నో కళారూపాలు చితికి జీర్ణమై కాలగర్భంలో కలిసిపోయి వాటి స్వరూప స్వభావాలు ఎలా వుంటాయో కూడా తెలియకుండా శిథిలమైపోయాయి. మరికొన్ని జీర్ణమౌతూ శిథిలావస్థలో వున్నాయి. సమిష్టి బృందాలు, సమిష్టి ప్రదర్శనాలు నాశనమై వ్యక్తిగత పాత్రలుగా, చిల్లర వేషాలుగా మిగిలిపోయాయి. ఆ వేషాలతో రైళ్ళలో, గ్రామాల్లో బస్సుస్టాండ్‌ల్లో బిచ్చమెత్తుకుంటూ జీవిస్తున్నారు.

1976 మార్చిలో హైదరాబాదు జానపద కళోత్సవాలలో సన్మానింపబడిన జానపద కళోద్ధారకులు



ఎడమనుంచి—1. వరదా ఆదినారాయణ 2. గోపాల్ రాజ్‌భట్టు 3. డా. బి. రామరాజు
4. డా॥ మిక్కిలినేని 5. శ్రీనివాస చక్రవర్తి 6. డా॥ యస్వీ జోగారావు
7. యం. వి. రమణమూర్తి

మరికొంత కాలం ఇలాగే సాగితే ఈనాడు కొనవూపిరితో వున్న ఈ కళారూపాలు కూడ దక్కవు.

ఒకనాడు జీవిత విధానానికీ, విజ్ఞాన, వినోద, వికాసాలకు ఆలవాలమైన ఆ కళాసంపదను కాపాడుకోవాలి, వాటిని పునరుద్ధరించాలి.

జీర్ణించి పోతున్న ఈ జానపద కళారూపాలను ఎవరు పునరుద్ధరించాలి? రాజులు లేరు, జమీందారులు లేరు, పోషకులు లేరు. ఇంతవరకూ ప్రజలే ఆదరిస్తున్నా అవి అంతంతమాత్రమే. ఆ ఆదరణ చాలదు. వారికి ఇళ్ళస్థలాలు లేవు, ఇళ్ళు లేవు. ఒక వూరంటూ కొంతమందికి స్థిరనివాసం లేదు. చివరికి కొంతమందికి ఓటు హక్కు కూడా లేదు.

ఇందుకు ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అకాడమీ పూనుకోవాలి. ఇదివరకు సంగీత, సాహిత్య, నృత్య, నాటక, లలితకళా అకాడమీలను ఏర్పాటుచేసి వాటికి ఎలా పునరుజ్జీవం కలిగించాయో జానపదకళల పునరుజ్జీవనానికి ప్రత్యేక అకాడమీని ఏర్పాటు చేయాలి. లోగడ అకాడమీలూ ప్రభుత్వమూ ఈ కళలపట్ల సవతితల్లి ప్రేమనే చూపించాయి.

జానపద కళల అకాడమీలో నిష్ణాతులైన వారిని, ఆ కళలో పరిచయమున్న వారిని ఆ కళలతో సంబంధమున్న కళాకారులకు ఆ అకాడమీలో స్థానం కల్పించాలి.

ముందు ఆంధ్రప్రదేశ్ నాలుగు చెరగులా వున్న జానపద కళారూపాలేమిటి? వాటిలో జీవించి ఉన్న కళారూపాలెన్ని? అందుకు సంబంధించిన కళాకారులు ఎంతమంది వున్నారు? వారి పరిస్థితి ఏమిటి? వారు ప్రదర్శించే కళారూపం, దానికి సంబంధించిన సంగీతం, సాహిత్యం, వేషధారణ మొదలైన వివరాలు సేకరించాలి. కళారూపాల సాహిత్యాన్ని, పాటలనూ, వాటి బాణీలనూ టేపురికార్డు చేయాలి. వారి వారి కళారూపాలకు సంబంధించిన వస్తుసామగ్రినంతా భద్రపరచాలి. మిగిలివున్న కళారూపాలను ఫిల్ములుగా తీయాలి. ఉన్న కళాకారులకు గ్రాంటులను, పెన్‌షన్‌లనూ ఇచ్చి వారిని పోషించాలి. ఆ అపురూపసంపదను రక్షించుకోవాలి. రాష్ట్రమంతటా బిక్కుబిక్కుమంటున్న కళాకారులను ఆదుకున్ననాడు, ఎన్నో కళారూపాలు ఉద్ధరించబడడమే కాక, ఎందరో కళాకారులకు జీవనాధారం ఏర్పడుతుంది.

తిరిగి జానపద కళావికాసం కలుగుతుంది. మన కళారూపాలన్నీ దేదీప్యమానంగా వెలుగొందుతాయి. తరతరాల జానపద కళావైభవం వెల్లివిరుస్తుంది.

నేటి ఆధునిక కళారూపాలతో పాటు జానపద కళారూపాలు కూడ నూతన వైభోగం సంతరించుకుంటాయి. నేటి తరాన్ని అలరించటమే కాక, ముందు తరాల వారికి, చారిత్రిక కళారూపాలుగా నిలబడతాయి. జాతిజీవితంలోనూ, అఖిల భారత స్థాయిలోనూ చరిత్రాత్మకమైన జానపద కళారూపాలు సగర్వంగా తలెత్తుకుని తిరుగుతాయి. అందుకే నా యీ చిన్న ప్రయత్నం.



# ఆనాటి ఆవిర్భావం

ఆనాడు : అంటే కొన్ని వేల సంవత్సరాలనాడు. భూమి అంతా సూర్యుని వేడితో కాలిపోయి ఆకాశమంతా ప్రచండ స్వరూపంతో నిండిపోయింది. ఎక్కడ చూచినా నీరు లేదు వాన లేదు. పశువులూ, పక్షులూ మలమల మాడిపోతున్నాయి. అడవులన్నీ దగ్ధమైపోతున్నాయి. అడవి మనుషుల గుంపు లన్నీ తల్లడిల్లి పోతున్నాయి. అడవులు వదిలి బయటికి వచ్చారు.



సూర్యుడే భగవానుడు :

సూర్యుని వేడి వాళ్ళను కూడా వెంటాడింది. తాళ లేక తల్లడిల్లిపోయారు. సూర్యుని వల్ల భయంతో కూడిన భక్తి భావం ఏర్పడింది. చేతులు జోడించి నమస్కారాలు చేశారు. సూర్యుణ్ణి దైవంగా భావించి ఆరాధించారే కాని, ఆకలికి తట్టుకోలేకపోయారు. ఈ ఆకలిని ఎలా తీర్చు కోవాలి? ఏమీ పాలుపోలేదు. ఆకాశమంతా మేఘావృత మైన మేఘాలు చల్లని గాలులతో, ఉరుములతో, పిడుగులతో వర్షం కురవనారంభిం చింది. ఎండతో మండిపోయే గుంపులకు కొంచెం శాంతి లభించింది. భూమి అంతా చల్లబడిపోయింది. అందరి దాహమూ తీరింది. జంతువులూ, పక్షులూ, క్రిమి కీటకాదులూ, శబ్దాలు మొదలుపెట్టాయి. విత్తనాలన్నీ విచ్చుకున్నాయి. దశదిశలా ఆనందం తొణికిసలాడింది. ఇది గుంపులోవారికి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అంతవరకూ సూర్యుని వేడితో మ్రగ్గిన వారందరూ ఈ వర్షంవల్ల ఓ జలదేవతా, నీవు మాకు మహోపకారం చేశావని వరుణదేవునికి సాగిలపడి మ్రొక్కారు. వేడితో మ్రగ్గిపోయినవారు జలదేవతతో ధన్యులయ్యారు.

ప్రకృతే, దేవత :

వర్షం కురవటంతో ఏ ప్రక్క చూచినా కొండవాగులూ, నదీప్రవాహాలూ, మొత్తంగా ప్రవహించి భూమిమీద అక్కడక్కడ సరస్సులు ఏర్పడ్డాయి. పచ్చబడిన భూమి పైరుల్ని పెంచుతోంది. పగిలి విచ్చిన విత్తనాల ద్వారా పండి ఒరిగిన చెట్లు

ఖారాన్ని భూమి భరిస్తోంది. ఎటు చూసినా పండ్లవాసనలు, పక్షుల కిలకిలారావాలు, ఆకలి దప్పులతో అలమటిస్తున్న అడవి గుంపులకు ఆహారం దొరికింది. ఆకలి తీరింది. హమ్మయ్య అన్నారు. దీనికంతకూ కారణం ప్రకృతే అనుకున్నారు. ప్రకృతినే దైవంగా పూజించారు.

పూజలూ, పునస్కారాలూ:

ఒక గుంపువారు సూర్యుడే భగవంతు డన్నారు. మరోగుంపు వర్షాన్నే దేవతగా చిత్రించింది. ఇంకోగుంపు ప్రకృతిమాతనే పూజించింది. ఇలా సంతోషాన్ని పట్టలేక ఎవరి నోటికి వచ్చిన పదాలను వారు సమకూర్చుకున్నారు. గొంతెత్తి కేకలు వేశారు. కేకలే పాటలైనాయి. ఆనందంతో అవయవాలన్నీ చలించాయి. స్త్రీలూ, పురుషులూ కేరింతా లకొడుతూ నోటితో పాటలు పాడ నారంభించారు. స్త్రీలు పుష్పాలను తీసుకున్నారు. పురుషులు కందమూలాల్ని తీసుకున్నారు. వారి వారి భక్తికొద్దీ నైవేద్యాలు చెల్లించారు. వారి సంతోషాన్నీ, తృప్తినీ విజయాన్నీ పాటలతో ఆటలతో వెల్లడిచేసి ఆనాడే ఆటవికజాతి జానపద కళల పునాదుల్ని వేశారు.

కడుపు కూటికై, కాట్లాటలు:

ఆనాడు ఆటవికులకు ప్రతినిత్యం ఆహార సమస్య ఘోరంగా వుండేది. వారికి పంటలు లేవు. ఎలా పండించాలో తెలియదు. నాగలికొయ్య ఆనాటికింకా పుట్టలేదు. అడవిలో మ్రగ్గిన పండ్లనూ, దుంపలనూ, జంతువుల పచ్చిమాంసాన్నీ తినేవారు. ఇలా వారు ఆహారం కోసం గుంపులు గుంపులుగా బయలుదేరి సమిష్టిగా ఆహారాన్ని సాధించేవారు.

ఈ ఆహార సాధనలో గుంపుల మధ్య కలహాలు వచ్చి ఒకరి నొకరు జయించుకునేవారు. ఈ దండయాత్రలో భీకరమైన కేకలూ, గంతులూ వేసేవారు విజయానందంతో. వీరనృత్యాలు చేసేవారు, నోటికొచ్చిన కవితలు ఆశువుగా చెప్పేవారు. ఆ కవితల్ని ఆనందంగా గానం చేసేవారు.

భజనలూ, భక్తిగీతాలూ:

ఈ విధంగా ప్రాచీన మానవజాతులు, నృత్య, గీత, అభినయాలతో కాలం వెళ్ళబుచ్చేవారు. ఇందులో కొంతమంది తన్మయీభావంతో నిపుణత్వాన్ని ప్రదర్శించే

వారు. నిపుణులు ప్రత్యేకంగా వరుసలు తీరి, వరుసక్రమంలో ఒక నాయకుని చెప్పు చేతలలో రకరకాల నాట్యవరుసల్నీ, అభినయాన్నీ నిర్ణయించేవారు.



క్రమానుగతంగా కాలం మారినకొద్దీ మానవుడు విజ్ఞానం పొందుతూ వచ్చాడు. వేష భాషల్లో మార్పు రాసాగింది. వారనుకునే దేవతాది అతీత శక్తులు క్రూరస్వభావాలు కలవి కావనీ. అవి మానవుల, లక్షలకొద్దీ జీవరాసుల రక్షణ కొరకే వచ్చిన శక్తులనీ భావించసాగారు. ఎంతో భక్తితో ఎల్లకాలం మమ్మి కాపాడాలని, ఆరాధిస్తూ భక్తిమయమైన గీతాలు, నృత్యాలు, భజనల్ని, అభినయాలతో స్త్రీ పురుషులు కలిసి తమ సంతోషాన్ని దేవతలకు తెలియచేసేవారు. తమ తమ బిడ్డలూ, పశువులూ. పంటలూ బాగుండాలనీ, వాటిని కాపాడే శక్తులు మీరేనని దేవతలను స్తుతించేవారు.

బ్రతుకు కోసం నృత్యగానాలు :

చల్లటి గాలుల్లో విహరించేటప్పుడు ఒడలు పొంగి ప్రకృతిమాత ఒడిలో ఒరిగిపోయి పాటలు పాడుతూ ఒడలు మరచి నిద్రపోయేవారు. పండువెన్నెల విరిసే సుందర రాత్రులలో స్త్రీ పురుషులు పాటలు పాడుతూ నృత్యాలు చేసేవారు. వర్షం రాకపోతే రకరకాల వాయిద్యాలతో ఘూనభోంతరాలు దద్దరిల్లిపోయేటట్లు. పాటలతో, ఆటలతో, కేకలతో వుత్సవాలు చేసేవారు. క్రూరమృగాల బారినుండి రక్షించుకోవడానికి, ఆ యా మృగాల వేషధారణలతో, వాటి అరుపులతో, వాటి అభినయంతో, కదలికలతో వెళ్ళి వాటిని సంహరించి, వాటి మాంసాన్ని తెచ్చుకునేవారు. వాటి చర్మాలను దుస్తులుగా మార్చుకునేవారు. కొన్ని జంతువుల చర్మాలను, పెద్ద వెదురు బొంగులను ముక్కలుచేసి ఆ రంధ్రాలకు చర్మాలను అమర్చి వాటిని వాయిద్యాలుగా మార్చుకునేవారు. ఈ విధంగా ఆనాటి ఆటవికులు జీవిత విధానాల కోసం, నృత్యగానాలను నేర్చుకోవడంతో జానపదకళలకు అంకురార్పణ చేశారు.

జానపద కళలకు పునాది:

ఇలా దేవతలను పొగుడుతూ. వారి గుణగణాలను కథలుగాను, పాటలుగాను వ్రాసి పాత్రలను సృష్టించి ఒకడు ప్రధానుడై, సూత్రధారుడై, మిగిలినవారిని నడిపిస్తూ కార్యక్రమం నడవటం వాడుకైంది. ఈ పద్ధతి ఎప్పుడైతే వచ్చిందో ప్రతి

ఒక్కడూ తాను అభినయించబోయే పాత్రను బాగా పోషించటానికి అనేక రకాల కృషిచేసి ఒక రూపానికి తీసుకువచ్చి, వారి వారి గుంపులలో ప్రదర్శనాలు ఇస్తూ వుండేవారు.

పై విధంగా కార్యక్రమాలు జరిగేటప్పుడు ప్రేక్షకులు పరాకుగా వుండకుండా మధ్య మధ్య హాస్యాన్ని పురికొల్పుతూ, ఆనందంకోసం గానాన్నీ, మనుషుల ను త్తేజ పర్చటానికి వీరనృత్యాలనూ, హృదయాలను కరగించటానికి శోకరసాన్నీ, యువతీ యువకుల ఆనందం కొరకు శృంగారరసాన్నీ ఎన్నుకుని జానపద నాట్య కళకు ఆదిమవాసులు ఆనాడే పునాదులు వేశారు. దేవతారాధనలోను, ఉత్సవాలలోను చాలవరకు ప్రాచీన నాటకాలు ఆడబడుతుండేవి. నాటి ఆటవిక ప్రజలు శత్రువుల మీద దాడి జరపాలనుకున్నప్పుడు శత్రువులను రాక్షసులుగా చిత్రించేవారు. వారు చేసే హింసాకాండను కళ్ళకు కట్టినట్లు చూపేవారు. వాళ్ళకు పది తలలున్నాయనీ, ఇరవై చేతులున్నాయనీ, జంతువులకున్నట్లు కోరలు, కోడిగ్రుడ్డంత కండ్లు మొద లైన వికృతాకారాలను నాటకరూపాల్లో చూపించి ప్రజలను సమీకరించేవారు.

తొలి మానవ సంఘం:

ప్రపంచంలో మానవుడు అడవుల్లో చెట్లపై కోతివలె నివాస మేర్పరచుకుని స్త్రీ పురుషులు ఎవరి నిలయాలలో వారు నివసిస్తూ వుండేవారు. ఈ విధంగా విడివడి కలుసుకున్న కుటుంబాలే మానవ కుటుంబం. ఇదే తొలి మానవ సంఘం. పశువు లను సాధుపరిచి, భూములను సాగుచేసి, అడవులను ఛేదించి కుటీరాలను నిర్మించి, నదీకాసార ప్రాంతాల గ్రామాలు నిర్మించి, గ్రామం మధ్యలో ఒక దిబ్బ పేర్చి, ఒక చెట్టును నాటిగాని, ఒక దేవునిమూర్తి స్థాపించి గాని గ్రామప్రజ లందరూ ఆరాధ నలు, పాటలు, భజనలు, నృత్యాలు, నాటకాలు ఆడుతూ వుండేవారు.

ప్రకృతిలో:

ప్రకృతిలో ప్రతి మనిషికీ, ప్రతి జంతువుకీ, త్రుళ్ళడం, గెంతడం, పాడడం, సంతోషించడం, శృంగారించుకోవడం, బాధపడడం, మొదలైన సహజగుణా లున్నాయి. మాట లేకపోయినా అవి కూడా దెబ్బతగిలితే బాధపడతాయి, ఏడుస్తాయి, మంచి ఆహారం దొరికితే, సంతోషపడతాయి, ఎగిరి గంతేస్తాయి, వర్షం వచ్చే ముందు చల్లగాలిలో విహరిస్తాయి.

ఇదే విధంగా ప్రతి మనిషీ ఈ లక్షణాలను కలిగి వున్నాడు. మనిషికి సంతోషం కలిగినప్పుడు ఎంతో మందహాసం కనబడుతుంది. అందులోనే కళ ఇమిడి

వుంది. కళ అనేది ఒక ప్రత్యేక పదార్థం కాదు. ఇది కళ అని కూడా మానవుడికి తెలియదు. కోపం వచ్చినప్పుడు ప్రతిఒక్క అవయవమూ, కళ్లూ, ముఖమూ



కంపించిపోతాయి. భావాలు ఎంతో గంభీరంగా వుంటాయి, ఆ ఆకారాన్ని ఇతరులు చూసినప్పుడు ఎంతో భీతి కలుగుతుంది. ఆతనికి తెలియకుండానే అందులో కళ ఇమిడివుంది. కాని కావాలనుకున్నప్పుడు ఆ కోపం తెప్పించలేడు. నటించకపోవచ్చు. సహజంగా అతనిలో ఉద్రేకం కలిగినప్పుడే, ఆ భావాన్ని మనం చూడగలుగుతాం. సంతోషం బాధ, క్రోధం, శత్రుత్వం మానవునికి సహజగుణాలని పైనే తెలుసుకోగలిగాం. ఈ గుణాలను కళారూపంలో అభివృద్ధి పొందించాలంటే పైవాటినన్నిటిని అవగాహన చేసుకుని జీర్ణంచేసుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది.

భావయుతమైన నటన :

ఆదిమ సమాజపు మనుష్యులు జంతు సమానులుగా వుండేవారని తెలుసుకున్నాం. అడవులలోనే వాళ్ళ నివాసం అవడంవల్ల వారు జంతువులలాగే నటించేవారు. అరుపులు, నడకలు, కూతలు, పోట్లాటలు గర్జనలు జంతువిన్యాసాలు జరిగేవి. ఇవి చూచే మానవుడు భావయుతమైన నటన మొదలుపెట్టాడు.

నాగ నృత్యం:

భావాన్నిబట్టి నటన సృష్టిలోనే వుంది. పాము వచ్చింది, పరుగెత్తింది, పడగ విప్పింది, మెలికలు తిరిగింది, కాటువేసింది. ఈ నటనను చూపించాలంటే పాము ఆడటం చూడాలి, దాని అభినయం చెయ్యాలి. మనిషి మెలికలు తిరిగిపోవాలి. కాటుతిన్న మనిషి మాదిరి, కండ్లలోను, ముఖంలోను, అభినయాన్ని చూపించాలి. దీనినే నాగనృత్యంగా పేర్కొన్నారు.

మయూర నృత్యం:

వెనుకటి రోజుల్లోనే కాక ఈనాటికీ మనం అడవులకు వెళ్ళి చూచినట్లయితే జంతు నాట్యాలు ఎన్నో చూడగలుగుతాం. వాటిలో కూతకు రాజుకోవెల అని ఈనాటికీ చెప్పుకుంటున్నాం. అలాగే నృత్యంలో నెమలి నృత్యం చూడదగింది. పింఛం విప్పి అది చేసే నృత్యం మనలనెంతో ఆహ్లాదపరుస్తుంది. ఉత్తేజపరుస్తుంది.

ఆనందపరుస్తుంది. దాని కూత కూడ వినదగిందే. మేఘాలు పట్టినప్పుడూ, చల్లని గాలులు వీచేటప్పుడూ, ఒడలుపొంగి పింఛాన్నివిప్పి మందహాసంతో నాట్యంచేస్తుంది.

మానవుని అనుకరణ:

అదే విధంగా మానవుడు కూడ చేతులతో, నడుముతో, ముఖభావాలతోనే ఆ నృత్యాన్ని చేస్తున్నాడు. ఇది ప్రత్యేకంగా నెమలిని చూచి నేర్చుకొన్నదే, ఇదే జంతువుల అనుకరణ. దీనినే భరతనాట్య ప్రముఖులు మయూర నృత్యం అని నామకరణం చేశారు.

ఈ నృత్యాలు చేయాలంటే ఎంతో శరీరసాధన వుండాలి. ఇలా ఒకదాని కొకటి, అవినాభావసంబంధ మున్నప్పటికీ నృత్యంలో రమ్యత కనబడుతుంది. ఇటు వంటి నృత్యాలు, శాస్త్రయుక్తంగాను, భావయుక్తంగాను భరతనాట్యశాస్త్రం తెలిసిన వారే చక్కగా చేయగలుగుతారు. వారే గరుడనృత్యం, సింహనృత్యం, మయూర నృత్యం, నాగనృత్యం ఇలాంటివి ఎంతో అద్భుతంగా నటిస్తారు. దీనినే భావయుత నటన అంటారు.

భూత నటన:

ఈ నటన కేవలం దేవతల్ని సంతోషపెట్టటానికి ఏర్పడింది. దుష్టభూతాలను తృప్తిపరచడానికి, అంటువ్యాధుల నిర్మూలనకోసం, వర్షంకోసం, పంటలకోసం, పశువులకోసం, నాటినుంచి నేటివరకు ఈ భూతనటన సాగుతూనే వుంది.

గ్రామాలలో అమ్మవారి జాతర్ల సమయంలో, దేవుళ్ళ ఉత్సవాలలో, స్త్రీలు పురుషులు అందరూ కలిసి ఎంతో చిత్ర విచిత్రంగా ఆటల్లో, పాటల్లో పాల్గొంటారు. ఎంతో తన్మయత్వంతో, ఒక నిండునమ్మకంతో, వుత్సాహ వుద్రేకాలతో పాత్రల్లో నటిస్తారు. ఇది ఎంతో స్వభావసిద్ధంగా వుంటుంది. కారణం వాళ్ళు ఒక ఫలితాన్ని ఆశిస్తున్నారు గనుక వారు దానికి అంకితమైపోతారు. వర్షం కురవాలని సామూహిక నృత్యాలు చేస్తారు. వర్షం కురిస్తే వుత్సవాలు జరుపుతారు. ఆ నృత్యంలో ఒక ఆవేశం వుంటుంది. అందువల్లనే దీనిని భూతనటన అన్నారు పెద్దలు. ఈ భూత నటన మానవుని అజ్ఞానదశను సూచిస్తుంది. ఇవి ఈనాటికీ వెనుకబడ్డ ప్రాంతాలలో వుంది.

నేర్చుకున్న నటనలు:

భావయుతనటన. భూతనటన మొదలైనవన్నీ అనాగరిక జాతులనుండి, అడవి జాతులనుండి వాళ్ళను అనుకరించి మనం నేర్చుకున్నాం. ఈనాటికీ కొండప్రాంతా

లలో నివసిస్తూవున్న చెంచులు, కోయలు, ఖాండులు, సవరలు, పండాలు మొదలైన కొండజాతులవారి నృత్యాలు మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంటాయి. వీరికి కళ ఎలా అబ్బిందా అనిపిస్తుంది. ఈనాటికీ ఆ ప్రాంతాలలో నివశిస్తున్న కొండజాతుల వారందరూ వారి వారి నృత్యాలను పోషించుకుంటున్నారు.

ఈ విధంగా ఆనాడు దేవుణ్ణిగూర్చీ, దేవతలగూర్చీ ప్రజలలో ప్రచారం జరిపే వారు రానురాను లౌకిక విహారార్థం శ్రీమంతుల ఇండ్లలోను, రాజమందిరాలలోను, వారి తృప్తికొరకు మాత్రమే నాటకాలు వ్రాయటం, చిత్రాలు గీయటం, నృత్యాలు చేయటం, కవిత్వం వ్రాయటంతో నాటకాది లలితకళలన్నీ ప్రజలనుండి దూర మయ్యాయి. ఎప్పుడైతే జమీందారీ, శ్రీమంతులయుగం వచ్చిందో అప్పుడు ప్రజ లను దోచుకోవడం మొదలుపెట్టారు. ప్రజలు అనేక బాధలకు గురికావడంవల్ల కళ లకు దూరమయ్యారు. కళలన్నీ రాజుల కొరకూ, వారి భోగభాగ్యాల కొరకూ అంకితమైపోయాయి.

శ్రీమంతులపోషణ :

ఆనాడు దేవకార్యాలన్నీ శ్రీమంతులే చేయిస్తూ వుండేవారు. అందువల్ల ఈ నాట్యాచార్యులూ, గాయకులూ, కవులూ, చిత్రకారులూ అందరూ రాజమందిరాలకే ఆహ్వానింపబడ్డారు. అందువల్ల సామాన్య ప్రజలలో నానాటికీ కళ దూరమైపోయింది. ప్రజల జీవితం దుర్భరమైపోయింది. ఆనందోత్సవాలు దూరమైపోయాయి. ఇందు వల్ల సామాన్య ప్రజలు రాజమందిరాలకు పోయే అవకాశం లేనందున పూర్తిగా ఆ వుత్సవాలకు ఆ ప్రదర్శనలకు దూరమయ్యారు. రానురాను ఆ కార్యక్రమాల్లో శ్రీమంతులకూ, మధ్యతరగతి ప్రజలకూ, విద్యావంతులకూ, పండితులకూ మాత్రమే స్థానం వుండేది. పేదప్రజలకు అంటుదోషాలు అంటగట్టి, దేవస్థానాల్లో ప్రవేశం లేకుండా స్వార్థపరులు కళలను దోచుకున్నారు.

ఒకనాడు జీవితానందంకొరకు వృద్ధిపొందాయి. ఒకనాడు జీవితంలో ఆనందం లేక కేవలం కష్టాలను మరచిపోవడానికి తప్పత్రాగి ఆ మత్తులో ఆటలాడారు, చిందులు త్రొక్కారు. పాటలు పాడారు. మొత్తంమీద నాట్యకళ, దేవకార్యాల నుండి, మోటుచిందుల నుండి, పురాణ కథల నుండి, భజన మేళాలనుండి వృద్ధిపొందిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.



# ఆంధ్రరాజులు ఆదరించిన కళలు

# శాతవాహన తెలుగు చక్రవర్తులు

## ఆంధ్రశబ్దం :

ఈనాటివరకూ జరిగిన పరిశోధనల ఫలితంగా ఆంధ్రుల చరిత్ర ఒక వరుస క్రమంలో తెలుస్తూవుంది. అనేక భూగర్భ పరిశోధనలద్వారా ఎన్నో క్రొత్త విషయాలు విశదమౌతున్నాయి. క్రీ. పూ. 550 నుండి బౌద్ధులు ఆంధ్రదేశంమీదుగా సింహళానికి ప్రయాణాలు చేసినట్లూ, అందుకు సంబంధించిన గాథలు బౌద్ధ గ్రంథాలలో వున్నట్లూ తెలుస్తూ వుంది. ఆంధ్ర అనే పదం అనేక ప్రాచీనగ్రంథాలలో ఉదహరింపబడి వుంది.



భరతుడు నాట్యశాస్త్రంలో ముఖ్యమైన పదకొండు జాతిరాగాలలో ఆంధ్రి (నేటి రాగం) కూడా ఒక జాతి రాగమని పేర్కొన్నాడు. ప్రాచీన గ్రంథమైన ఐతరేయ బ్రాహ్మణంలో ప్రప్రథమంగా ఆంధ్రశబ్దం ఉపయోగపరచబడడమేగాక క్రీ. పూ. వెయ్యి సంవత్సరాల ముందుగానే రచించబడిన భారత, రామాయణ గ్రంథాలలో కూడ ఆంధ్రుల ప్రశంస వుంది. ఈనాటికి సుమారు 4 వేల సంవత్సరాలనుండీ ఆంధ్రజాతి ఒక ప్రత్యేక జాతిగా నివసిస్తున్నారని చెప్పవచ్చు.

## హాలుడూ, కళాపోషణా :

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజులలో శాతవాహన తెలుగు చక్రవర్తులు మొదటివారు. వీరినే శాతవాహనులని, శాతకర్ణి రాజులని కూడ వర్ణించారు. క్రీ. పూ. 220 నుండి క్రీ. శ. 218 వరకూ, అంటే దాదాపు 4 వందల సంవత్సరాల వరకూ 30 మంది శాతవాహనరాజులు ప్రతిష్ఠానపురాన్ని రాజధానిగా చేసుకుని హైదరాబాదు సంస్థానంతో సహా కృష్ణా గోదావరి మండలం వరకూ వ్యాపించివున్న ప్రాంతాన్ని పాలించారు. ఆంధ్ర శాతవాహన రాజులలో 14 వ రాజైన హాలుడు ప్రతిష్ఠానపురం

రాజధానిగా చేసుకుని దక్షిణాపథంతోపాటు సింహళాన్ని జయించి సప్తగోదావరి వద్దనున్న ద్రాక్షారామ భీమేశ్వరాలయానికి వచ్చి, అక్కడ సింహళ రాజపుత్రిక లీలావతిని వివాహం చేసుకున్నట్లు లీలావతి కావ్యంద్వారా తెలుస్తూంది. హాలుడు తన ఆస్థానంలో కవి, పండిత, గాయక, శిల్పులను ఆదరించినట్లు తెలుస్తూ వుంది.

## కళలను చెప్పిన గాథాసప్తశతి :

క్రీస్తుకు పూర్వమే ఆంధ్రదేశంలో సంగీతం, నృత్యం, నాటకంతోపాటు అనేక వాద్య విశేషాలు ప్రచారంలో వున్నట్లు హాలశాతవాహనుడు రచించిన గాథా సప్తశతి తెలియజేస్తూ వుంది. హాలుడు గాథా సప్తశతిని మహారాష్ట్రి ప్రాకృత భాషలో రచించినా తెలుగు దేశానికి సంబంధించిన అనేక కళారూపాలను ఉదాహరించాడు. ప్రాకృత భాషలో 700 గాథల్ని రసవత్తరంగా రూపొందించాడు. ఆంధ్రదేశపు ఆనాటి సాంఘిక జీవితాన్ని తెలుసుకోవడానికి ఇదే ముఖ్యమైన గ్రంథం. క్రీస్తుశకం ప్రథమ శతాబ్దంలో నాటి లలితకళలకు సంబంధించిన ఈ క్రింది వివరాలు గాథా సప్తశతి తెలియజేస్తూ వుంది.



1. జనపచేను హరితాల (అంటే అరదళము) మండిత ముఖంతో మెరసే నటివలె అందముగా ఉన్నదట.

2. గోపికల నర్తనాన్ని శ్లాఘించే నెపాన ఒక గోపిక వారి చెక్కిళ్ళమీద ప్రతిబింబిస్తున్న కృష్ణుని ముద్దు పెట్టుకున్నదట. (2-14)

3. నర్తించి నర్తించి. అలసటగొన్న వాలుగంటి మొదలైనవారితో కలయిక ఆహ్లాదకరమట. (3-59)

4. ముఖమున అన్నం వున్నంతవరకే మద్దెల మధురంగా పలికి అది లేనిచో విరసముగా మొఱుగునట. (3-53)

పై వుదాహరణలతోపాటు గాథాసప్తశతిలో నాటకాలు, సంగీతం, మృదంగం, మురజ, వీణ మొదలైన వాద్యవిశేషాలు ప్రచారంలో వున్నట్లుకూడా తెలుపబడింది.

(పి. యస్. ఆర్. అప్పారావ్)

నాట్యశాస్త్రం.

# బౌద్ధ యుగంలో వర్ధిల్లిన కళలు

## హీనయాన, మహాయాన:

శాతవాహనరాజులు గాఢమైన హిందూమతాభిమానులైనప్పటికీ దేశంలో బౌద్ధమతం విరివిగా వ్యాపించింది. వ్యాపారులు, రైతులు, వివిధవృత్తుల పనివారు చాలావరకు బౌద్ధమతాన్ని అభిమానించారు. బ్రాహ్మణులు మాత్రం హిందూమతాన్ని, హిందూ దేవతలను ఎక్కువ ఆరాధించారు. శాతవాహనరాజులు మాత్రం వివిధ మతాలవారిని సమానదృష్టితో చూశారు. ఆనాడు రాజులకు రైతులకు వృత్తి పనివారల మధ్య వర్గకలహం తీవ్రంగా వుండేది. గ్రామ జీవితంలో పీడించేవారు, పీడింపబడే వారు వుండేవారు. కుల భేదాలను, వర్గభేదాలను నిరసించి సర్వసమానత్వాన్ని బోధించడంవల్ల పీడిత ప్రజానీకానికి బౌద్ధమతం ఒక ఆశాజ్యోతిగా నిలబడింది.



అందువల్ల ఆనాటి కార్మికులు, రైతులు ఇతర పీడిత ప్రజానీకమంతా బౌద్ధమతాన్ని గాఢంగా అభిమానించారు. ముఖ్యంగా శిల్పులు బుద్ధునిపై గల తమ భక్తిభావాన్ని ప్రదర్శించడానికి బౌద్ధ విగ్రహాలను చెక్కి పూజించడం మొదలుపెట్టారు. కాని బుద్ధుని విగ్రహరూపంలో పూజించవచ్చునా, కూడదా అన్న మీమాంసలో బౌద్ధులలో హీనయాన, మహాయాన అనే రెండు విభాగాలు ఏర్పడ్డాయి. మహాయాన శాఖవారు పూజించవచ్చునన్నారు; హీనయానవారు వ్యతిరేకించారు. కాని క్రమేపీ మహాయాన శాఖ అభివృద్ధి చెంది ప్రపంచమంతటా బౌద్ధమతం వ్యాపించింది.

## కళలు పండిన నాగార్జున కొండ:

కాని ఆర్థిక వ్యవస్థలో అణగిపోతున్న పీడిత ప్రజాసామాన్యానికి బౌద్ధమతం సాంఘిక, ఆర్థిక సమానత్వం కలిగిస్తుందని మొదట్లో ఆశించారు. కాని అలా జరుగలేదు. బౌద్ధమతంలోని సమానత్వ సిద్ధాంతాలన్నిటినీ అహింసా సూత్రాలతో బంధించడంవల్ల రాజరిక వ్యవస్థకు భంగం కలుగదని భావించిన రాజులందరూ బౌద్ధమతాన్ని

స్వీకరించారు. అంతేకాక ప్రారంభంలో వర్ణవ్యవస్థను వ్యతిరేకించిన బౌద్ధమతం క్రమేపీ వర్ణవ్యవస్థతో కూడా రాజీపడింది. ఈ విధానంవల్ల వివిధ జాతులకూ చెందిన వారు వారి కులాచారాలను అనుసరిస్తూ బుద్ధుని దేవునిగా ఆరాధించారు. శిల్పులు శిల్పాలను చెక్కారు. చిత్రాలను చిత్రించారు. సంగీత, నృత్యాలతో వారిఆనందాన్ని వెల్లడించారు. ఇలా బుద్ధుని ఆరాధించే వారందరికీ నాగార్జున కొండ కేంద్రమై అక్కడ శూద్రతీర్థం అనేది ఏర్పడింది. బౌద్ధమతంలో వచ్చిన ఈ పరిణామాలను ఆచార్య నాగార్జునుడు మరికొంత ముందుకు తీసుకు వెళ్ళాడు.



## నాగార్జున లలితకళా నిలయం:

ఆచార్య నాగార్జునుడు క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దుల మధ్య ధాన్యకటకం (నేటి ధరణికోట)ను రాజధానిగా పరిపాలించిన యజ్ఞశ్రీ శాతకర్ణి ఆస్థానంలో వుండి దేశదేశాలూ సంచారం చేసి చివరి రోజుల్లో నాగార్జునుని కొండమీద ఆశ్రయం నిర్మించుకొని అక్కడే మరణించిన ఆంధ్రుడు.

నాగార్జునుడు శూన్యవాదం - లేక, మాధ్యమికవాదం అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి బౌద్ధమతంలో ఒక పెద్ద మార్పును తీసుకువచ్చాడు. ఆంధ్రులలో విశేషంగా వ్యాపించిన బౌద్ధమతం ఆంధ్ర సంస్కృతి పరిణామంలో ఎంతో ప్రాముఖ్యం వహించింది. పండితుడైన నాగార్జునుడు దాదాపు 30 దర్శన గ్రంథాలను రచించాడు. ఆయన గొప్ప పండితుడు. ఆనాటి నాగార్జునునికొండ బౌద్ధ ఆరామంలో విద్యాబోధన, ఉచితవైద్య చికిత్సలతో పాటు శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాట్యమూ నేర్పబడేవి. లలితకళలకు నిలయమైన అనేక బౌద్ధ ఆరామాలు ఆనాడు ఆంధ్రదేశంలో—నాగార్జునుని కొండ, అమరావతి, ధరణికోట, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, నందిగామ, ఘంటసాల, గుడివాడ, గోలి,రామతీర్థం, శంఖరం మొదలైన ప్రాంతాలలోనే గాక, తెలంగాణాలోని, కొండాపురం, గుమ్మడిదుర్రు, ఫణిగిరి, గాజులబండ, అల్లూరు మొదలైనచోట్ల కూడ — ప్రసిద్ధంగా ఉండేవి.

## అందాలు చిందిన ఆరామాలు:

అంతేగాక ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ వైష్ణవ దేవాలయాలన్నీ ఒకప్పుడు బౌద్ధ ఆరామాలున్నచోట కట్టబడినవే. ఈ వైష్ణవ దేవాలయాలమీద సంగీత, నృత్య,

వాద్యాలకు సంబంధించిన శిల్పాలు చెక్కబడినాయి. బౌద్ధ ఆరామాలన్నిటిలోనూ వివిధ లలితకళలూ పోషింపబడినాయి. ఇందుకు ఉదాహరణలు ఇటీవలి నాగార్జునుని కొండ త్రవ్వకాలలో అనేకం బయటపడి, భద్రపరచబడ్డాయి. ఆ కోవకు చెందినదే శిథిలమైన నాగార్జునుని కొండ ఆరుబయలు రంగస్థలం.

## అన్ని హంగులతో ఆరుబయలు రంగస్థలం :

ఈ మధ్య నాగార్జునకొండ త్రవ్వకాలలో ఈ ఆరుబయలు రంగస్థలం బయట పడింది. ఇది దీర్ఘ చతురస్ర ప్రాంగణం గల స్టేడియం. దీనికి నాలుగు వైపులా ప్రేక్షకులు కూర్చోవడానికి వీలుగా ఇటుకలతో మెట్లు మెట్లుగా రాతిపలకలు పరచిన ఆసనాల వరుసలు ఏర్పాటు చేసి వున్నాయి. ఇది 56.3 పొడుగు, 17.3 వెడల్పు వుంది. ఇది విద్యార్థులు సమావేశమయ్యే సభారంగం కావచ్చు. ఈ రంగస్థలంలో నైరుతిమూలగా ఎత్తైన శిలాపీఠం వుంది. ఇది ప్రధానవక్తనిమిత్తమూ, సంఘారామాన్ని దర్శించటానికి వచ్చిన వారి నిమిత్తమూ ఏర్పాటు చేయబడింది. ఇది ఆరుబయలు రంగస్థలం. దీనిలో కురిసిన వర్షపు నీరంతా బయటికి పోవడానికి ఒక పెద్ద తూము వుంది. రంగస్థలం మధ్య భాగంలో ఒక గుండ్రని స్తంభంలాంటి వేదిక వుంది. వక్తలు దీనిమీద నిలబడి సభికుల నుద్దేశించి ఉపన్యాసించేవారట. ఈ రంగస్థలంలో వున్న ఒక విచిత్రం: దీనిమధ్య నిలబడి వుపన్యసిస్తే ఆ కంఠధ్వని స్పష్టంగా రెండువందల అడుగుల దూరం వరకూ వినబడుతుంది. అంతేకాక ఆసన పంక్తి అంతకంతకూ ఎత్తవుతూ వచ్చిన కొలదీ ఆ ధ్వని మరింత స్పష్టంగా వినబడుతుంది. దీనినిబట్టి అదివరకే ఆ పరిసర ప్రాంతాల నుండి వచ్చే ప్రతి శబ్ద ధ్వనుల ననుసరించి ఈ ఆరుబయలు రంగస్థలం నిర్మింపబడియుండవచ్చునని పి. యస్. ఆర్. అప్పారావుగారు వారి నాట్యశాస్త్రంలో ఉదహరించారు.

## అమరావతి శిల్పాల అందచందాలు :

ఆంధ్రుల నృత్యకళ సుమారు రెండువేల సంవత్సరాల క్రితమే శాతవాహనుల నాటికే అభివృద్ధి చెందిందనడానికి ఈనాడు అనేక ఆధారాలున్నాయి. అమరావతి, నాగార్జున కొండల్లో ఈనాడు కనుపించే అనేక పాలరాతిశిల్పాల్లో, అనేక నాట్య భంగిమలలోపాటు మన నాట్య సంప్రదాయాలన్నీ మలచబడి ఉన్నాయి.

ముఖ్యంగా అమరావతిలో దొరికిన శిల్పంలో ఒక బృంద నాట్య మున్నది. బృందంలో ఉన్న ప్రతి నర్తకీ ఏదో ఒక భావాన్ని సూచిస్తూ వుంది. ఒక నర్తకి

ప్రవేశిక నృత్యం చేస్తూవుంది. మరో నర్తకి ఆలీఢ స్థానంలో ఉండి వ్యంసిత కర ణాన్ని చూపుతూ వుంది. వేరొక నర్తకి అర్ధమత్తిల్లి స్థానంలో ఉండి స్థలితాపశ్యత కరణాన్ని చూపుతూ వుంది.



మరొక శిల్పంలో ఆరుగురు నర్తకీమణులు ఒక రాజుముందు నృత్యం చేస్తున్నట్లు చూపబడింది.

బోధిసత్వుడు తెల్ల ఏనుగు రూపంలో భూమికి వచ్చే ఘట్టాన్ని చూపే శిల్పంలో ఆయనను అనుసరించి వచ్చే దేవతల బృందం వివిధ నాట్యభంగిమలలో కని పిస్తున్నారని డిగవల్లి శివరావుగారు తమ 'కథలు-గాథల'లో తెలియజేశారు.

## లలితవిస్తరం చెప్పిన లలితకళలు :

బౌద్ధయుగంలో అనేకమైన రూపకాలు వెలిశాయి. బుద్ధుడు మొట్టమొదటి నాట్యశాస్త్రప్రవేత్త అని బుద్ధుని తొలి జీవితచరిత్ర 'లలితవిస్తరం'లో ఉదాహరణలు కనిపిస్తున్నాయి. బుద్ధుడు తన రాజగృహంలో విశ్రమించినప్పుడు ఆయన శిష్యులైన మౌద్గల్యాయనుడూ, ఉపతిష్యుడూ తమ నటనాకౌశల్యాన్ని చూపించారట. బింబి సారుని ఆస్థానానికి నాగరాజులు వచ్చినప్పుడు వారి గౌరవార్థం నాటకాలు ప్రదర్శించా రట. రాజగృహంలో బుద్ధుని సమక్షంలో దక్షిణదేశానికి సంబంధించిన కువలయ అనే ప్రసిద్ధ నర్తకురాలు బుద్ధుని జీవితాన్నే అభినయించిందట. బౌద్ధజాతక కథలలో నటులను గురించి కావలసినంత సమాచారం తెలుస్తూంది. పై వివరాలనుబట్టి బౌద్ధ యుగంలో నాటకకళ ఎలా అభివృద్ధి అయిందో సూక్ష్మంగా తెలుసుకోవచ్చును.

శాతవాహన రాజ్యవైభవం క్రీ.శ. 200తో అంతరించింది. 400 సంవత్స రాల ఆ పరిపాలనలో సంగీతం, నాట్యం, శిల్పం, చిత్రలేఖనం ఎంతగానో అభివృద్ధి నొందాయి.

## ఇక్ష్వాకులు చెక్కిన చక్కని శిల్పాలు :

శాతవాహన రాజ్యం ఛిన్నాభిన్నమైన తరువాత ఇక్ష్వాకురాజులు పరిపాలించారు. ఈ వంశంలో ముగ్గురు రాజులు 52 సంవత్సరాలు మాత్రమే రాజ్యపరిపాలన చేశారు. వాసిష్ఠీపుత్రశాంతమూలుడు ఈ వంశకర్త. ఈయన కుమారుడు మాఠరీపుత్ర

వీరపురుషదత్తుని కాలంలోనే నాగార్జునకొండ శిల్పాలన్నీ చెక్కబడినాయి. ఇక్ష్వాకు రాజులు లలితకళలను పోషించిన ఆధారాలు మనకు ఎక్కువ లేవు. కాని శాతవాహనుల కళాసంస్కృతులను చాలవరకూ కాపాడింది వీరే. పల్లవరాజులు ఆంధ్రదేశంమీద దండెత్తడంతో ఇక్ష్వాకురాజ్యం పతనమైంది. నాగార్జున కొండ, విజయపురి నగరాలను నాశనం చేయడంతో ఆ నగరాల శోభ అంతరించింది. బౌద్ధ భిక్షువులందరూ తరిమి వేయబడ్డారు. బౌద్ధ చైత్యాలన్నీ ధ్వంసం చేయబడ్డాయి.

## పల్లవ సంగీతం:

శాతవాహన చక్రవర్తుల క్రింద సామంతరాజులుగా వుండి వీరు తరువాత స్వతంత్రులై పల్లవనాడును (నేటి పలనాడు) కేంద్రంగా చేసుకుని దక్షిణాన కంచి వరకు ఆక్రమించుకుని కంచిలో రాజ్యం స్థాపించారు. పల్లవుల రాజ్యపరిపాలనా కాలంలో మొత్తం 21 మంది పల్లవరాజులు పరిపాలించారు.

వీరిలో మొదటి మహేంద్రవర్మ క్రీ. శ. 600 నుండి 630 వరకు పరిపాలించాడు. సింహవిష్ణుని మరణానంతరం అతని పుత్రుడు మొదటి మహేంద్రవర్మ కాంచీపుర పల్లవరాజ్యానికి అధిపతి అయ్యాడు. ఈతడు పల్లవ వంశపాలకులలో సుప్రసిద్ధుడు. ఇతడు కళాప్రియుడు. శిల్పకళా విద్యావిశారదుడు. సంగీత విద్యలో దిట్ట. అనేక బిరుదులు సంపాదించినవాడు. రుద్రాచార్యుడనే విఖ్యాత సంగీత విద్వాంసునికి శిష్యుడు. ఈయన ఒక సంగీత గ్రంథాన్ని రచించి కుడిమియామలై అనే చోట శిలాక్షరాలను చెక్కించాడు. ఈయన సంగీతంలో ఎంత ప్రావీణ్యం కలవాడో సాహిత్యంలోనూ అంత గొప్పవాడు.

పల్లవుల తరువాత సాలంకాయనులు పశ్చిమ గోదావరిలోని వేంగిని రాజధానిగా చేసుకుని 300 నుండి 420 వరకు పరిపాలించారు. ఈ కాలంలో వర్ధిల్లిన లలితకళా వికాసం ఎటువంటిదో ఎవరికీ తెలియదు.

## విష్ణుకుండినుల సాహిత్య కళాపోషణ:

తరువాత విష్ణుకుండినులు 420 నుండి 620 వరకు, అమరావతిని రాజధానిగా పరిపాలించారు. గుంటూరు జిల్లాలోని వినుకొండ వీరి స్వగ్రామం. వినుకొండకే విష్ణుకుండిన అనే పేరు వచ్చింది. ఈ వంశంలో మొత్తం 9 మంది రాజులు పరిపాలించారు.

విష్ణుకుండిన రాజులు కేవలం సాహిత్యపోషకులే కాక కళాపోషకులు కూడాను. వీరు హిందూ గుహాలయాలను నిర్మించి వాస్తుశాస్త్రానికి ప్రాముఖ్యమిచ్చారు. విజయవాడ వద్ద మొగల్ రాజపురంలోని గుహాలయాలు, ఉండవల్లి గుహాలయాలు వీరు నిర్మించినవే. మొగల్ రాజపురంలో బహుబాహువులు గలిగిన నటరాజమూర్తి శిథిలావస్థయం దున్నప్పటికీ కళా దృష్టిలో మాత్రం నిరుపమానమైంది.

వీరి తరువాత ఆంధ్రదేశాన్ని పరిపాలించినవారు కళింగ రాజులు. వీరి పాలనలో లలితకళా వికాసం ఎటువంటిదో మనకు తెలియరావడంలేదు.





# చాళుక్య చోళుల సొంపుపెంపులు

చాళుక్యరాజులు (32 మంది) క్రీ. శ. 624 నుండి 1118 వరకు 500 సంవత్సరాలు ఆంధ్రదేశాన్ని నిరాఘాటంగా పరిపాలించారు. పూర్వ చాళుక్యుల్లో మొదటి చాళుక్యభీముడు క్రీ. శ. 910 ప్రాంతంలో విజయవాడ ఇంద్రకీలాద్రి పర్వతంమీద శివాలయాన్ని కట్టించి అందులో పార్థి వేశ్వరస్వామిని ప్రతిష్ఠించాడు.



ఈ చాళుక్యభీమునికి లలితకళల్లో అభిమానం ఎక్కువ. గాంధర్వ నాట్య విద్యల్లో అభిరుచి ఎక్కువ. సమస్త గాంధర్వ విద్యావిశారదయగు చల్లవ అనే వారవిలాసిని ఆయున ఆస్థానంలో వర్థిల్లింది. చల్లవ తండ్రి మల్లప్ప సంగీతశాస్త్రంలో ఆరితేరిన విద్వాంసుడు. ఆనాటి గాయక శిఖామణుల్లో మల్లప్ప తుంబురుడని ప్రఖ్యాతి వహించాడు.

చాళుక్యభీముని కాలంలో సంగీతంతోపాటు సాహిత్యంకూడా పెంపొందింది. భట్టవామను డనే కవి ఈయన ఆస్థానకవిగా వుండి కావ్యాలంకార సూత్ర మనే అలంకారశాస్త్ర గ్రంథాన్ని రచించాడని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

కళ్యాణిచాళుక్యుల, కళావిన్యాసం :

క్రీస్తుశకం 1126 నుండి 1139 వరకు మూడవ సోమేశ్వరుడు (విక్రమాదిత్యుని కుమారుడు) భూలోకమల్ల బిరుదుతో 13 సంవత్సరాలు రాజ్యపాలన చేశాడు. ఈతడు సర్వజ్ఞ చక్రవర్తి అని బిరుదు పొందాడు. అభిలషితార్థచింతామణి అనే సకల భారత విజ్ఞానఖనియైన గ్రంథాన్ని రచించాడు. ఈయన అనేకమంది కవులను పోషించాడు. జాయపసేనాని నృత్తరత్నావళిలో చాళుక్య సోమేశ్వరుడు మునుపెప్పుడో కళ్యాణకటకంలో భూతమాతృ మహోత్సవంలో 'ఖిల్లి' వేషం ధరించి, నృత్యగానాలు చేసే ఒక స్త్రీని చూచి మెచ్చుకున్నాడని, ఆ నృత్యమే గొండలి, లేక గొండగి అయి, తరువాత అదే గొండ్లి అయినదని వివరించాడు. మూడవ సోమే

శ్వరుడు స్వయంగా నాట్యాచార్యుడు. నట్టువు, గొండ్లి అనే నృత్యంలోని దోషా లను ఎవరో అడుగగా. దోషాలను సరిదిద్ది ఆడి చూపించాడు. నాటి రాణులూ సంగీత, నృత్త, వాద్యాది విద్యల్లో ఆరితేరినవారు.

## గౌడుగీతాలూ, ఊయలపాటలూ :



చాళుక్యరాజులు దేశికవితను ఆంధ్రదేశంలో నిలి పారనీ, కవిత్వంలోనూ దేశి, మార్గరీతు లున్నట్లూ నన్నె చోడుడు కుమారసంభవంలో తెలియజేశాడు. కుమార సంభవమే ఆంధ్రుల మొట్టమొదటి ప్రబంధంగా పేర్కొన వచ్చు. చాళుక్యరాజుల కాలంలో ప్రజలుఊయల పాటల్ని, గౌడుగీతాలను పాడుతూ వుండేవారని అభిలషితార్థ చింతామణిలో ఉదాహరింపబడింది.

## వినోదాలను వర్ణించిన నన్నెచోడుడు :

ఆ రోజుల్లో బాలబాలికలు చిలక బొమ్మల్ని, దంతపు బొమ్మల్ని, తోలు బొమ్మల్నీ తయారుచేసి ఆడుతూవుండేవారట. నన్నెచోడుడు తన కుమార సంభ వంలో ప్రప్రథమంగా రంభ నాట్యవర్ణనను గురించి ప్రస్తావించాడు. ఆనాటి వినో దాల్లో అనేకం నేటివరకూ నిలిచివున్నాయి. ఆనాడు అంకమల్లవినోదం, కోళ్ళ పందాలు, లావకపిట్టల కొట్లాటలు, మేషమహిషయుద్ధాలు, పావురాల పోట్లాటలు, గీతవాద్య నృత్యాలు, కథలు, ప్రహేళికలు, చదరంగం, పాములాటలు, మోడీలు, గౌడి, మాధ్వి మొదలైన వెన్నో వున్నట్లు అభిలషితార్థ చింతామణినుండి సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘికచరిత్రలో ఉదహరించారు.

## సానుల్ని పోషించిన చాళుక్యచోళులు :

చాళుక్యచోళయుగంలో రాజులు యుద్ధంలో విజయం పొందినప్పుడు వారి విజయ పరంపరల ఆనందంలో శివ, విష్ణు విగ్రహాలను ప్రతిష్ఠచేసి ఆలయాలను నిర్మించడంతోపాటు, స్వామివారి ధూప, దీప, నైవేద్యాది అంగ, రంగ, వైభోగాల నిమిత్తం సాని, మాని, నిబంధనకారులను దాసరినాయకము లేర్పాటుచేసి వృత్తులిచ్చి క్షేత్రవైభవాన్ని పెంచారు.

ఈ రీతిగా ఈ కాలంలో దేవాలయాలలో సంగీతం, నాట్యం, శిల్పం, చిత్ర లేఖనం, సాహిత్యాది లలితకళలను అఖండంగా పోషించాడు. అయన తన ఆస్థానం

ఒక ప్రదర్శనశాలగాను, విద్యాస్థానంగాను అలంకరించాడు. ఆయన ఏర్పాటుచేసిన దేవాలయాలలో మూడువందలమంది సానులు, మూడువందల మంది మాసులు కలిసి దేవాలయ కార్యాలను నిర్వహించేవారట.

## ఆటకత్తెల కోలాటాలు :

సామర్లకోట భీమేశ్వరాలయంలోని నంది మండప స్తంభాలమీద చెక్కబడిన గాయకీ, నర్తకీ, శిల్పప్రతిమలు ఆ కాలపు తూర్పు చాళుక్య శిల్పకళకు ముఖ్య లక్షణాలు. ఇక్కడ హల్లీసకమనే దేశీలాస్యం (కోలాటం) చూపబడింది. ఇందులోని ఆటకత్తెలు జతలు జతలుగా చీలి ఆటయొక్క లయ కనుగుణంగా కోలాటపు కోలలతో తాళం వేస్తున్నట్లుంది.

ద్రాక్షారామంలోనూ, సామర్లకోట, భీమవరంలోనూ గల భీమేశ్వరాలయాలలో కోలాటం వేసే నర్తకీమణుల ప్రతిమల వరుసలను స్తంభాలమీద చూడవచ్చు. సంగీతం, నృత్యం మొదలైన లలితకళలమీద ఆ కాలంలో ప్రజల కుండిన ఆదరణను వ్యక్తంచేసే ఇటువంటి శిల్పకల్పన తరువాత శతాబ్దాలలో ఇంతకంటే అధిక ప్రజాదరణకు పాత్రమై వుండటం విజయనగర చరిత్రవల్ల తెలుస్తూ వుంది. ద్రాక్షారామ భీమేశ్వరాలయాన్ని 10వ శతాబ్దంలో చాళుక్యభీమరాజు నిర్మించాడని ప్రతీతి.

## అవతరించిన ఆదినన్నయ మహాభారతం :

ఒక విశిష్టమైన జాతిగా చాళుక్యరాజుల కాలంలో ఆంధ్రులు స్థిరపడ్డారు. తూర్పు చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరం రాజధానిగా వేంగిదేశాన్ని క్రీ॥ శ॥ 1022 నుండి 1063 వరకూ పాలించాడు. అన్నదమ్ముల కలహంతో వేసారిపోయిన రాజరాజనరేంద్రుడు అన్నదమ్ముల కలహగాథైన మహాభారతగాథను ఆస్థానకవియైన నన్నయ భట్టారకునిచే వ్రాయించడానికి 1050 ప్రాంతంలో పూనుకున్నాడు. కాని ఆంధ్ర మహాభారతం అసలు నన్నయ ప్రారంభించినా ఏ కారణాలవల్లనో ఆ తరువాత రెండువందల సంవత్సరాలకు - 1260లో కాకతీయ గణపతి చక్రవర్తి ఆస్థానంలో ఉన్న తిక్కన ఆ మహాభారతాన్ని పూర్తిచేశాడు. ఈ విధంగా మహాభారతం తెలుగు గడ్డమీద అవతరించింది.

## నన్నయ చెప్పిన నాటకానుభవాలు:

నన్నయ కాలానికే భాసుడు, కాళిదాసు, శూద్రకకవి, శ్రీహర్షుడు, భవభూతి మొదలైన ప్రసిద్ధ నాటకకర్తల నాటకాలు వ్యాప్తిలో వున్నాయి. కాళిదాసుని శాకుంతలంతోనూ, భవభూతి ఉత్తర రామచరిత్రంతోనూ తనకు సంబంధ మున్నట్లు నన్నయ రచనల్లో కనబడుతూ వుంది.



నన్నయ కాలంలో నాటక ప్రదర్శనాలు జరుగుతూ వుండే వనడానికి ఉదాహరణగా, రాజరాజనరేంద్రుడు తనతో చెప్పినట్లు నన్నయ మహాభారతం అవతారికలో,

చ॥ విమలమతిన్ బురాణములు వింటి ననేకము, లర్థధర్మశా
స్త్రముల తెఱం గెఱింగితి, నుదాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి, జగత్పరి పూజ్యములైన ఈశ్వరా
గమములయందు నిల్పితి ప్రకాశముగా హృదయంబు భక్తితోన్.

అని ఉదహరించాడు. ఆ కాలంలో పురాణపఠన శ్రవణం, శాస్త్రాలను గురించి తెలుసుకోవడం, నాటకాలను చూడడం మొదలైనవి వున్నట్లేకాక, కన్నులారా నాటకాలను చూచినట్లు రాజరాజనరేంద్రుడు చెప్పడమే ఆ కాలంలో నాటకా లున్నాయనడానికి బలమైన నిదర్శనం.

తిక్కన సోమయాజి భారతం విరాటపర్వంలో ఉత్తర నేర్చుకున్న విద్యల్ని వర్ణిస్తూ దండలాసకం, కుండలి, ప్రెక్కణం, ప్రేరణం మొదలైన నాట్యభేదాల్ని పేర్కొన్నాడు. విరాట ఉద్యోగపర్వాలలో నాట్యనాటకాల ప్రసక్తి కొల్లలుగా వుంది. ఆనాడు తోలుబొమ్మలు ఆడినట్లు భారతం విరాటపర్వంలో (3-164) వివరించ బడింది.

## పిచ్చుగుంటులు చెప్పిన పల్నాటి వీరచరిత్ర :

వేంగి చాళుక్యరాజుల పరిపాలన క్రీ. శ. 1100 తో అంతమైన తరువాత, చోళ, చాళుక్య మైత్రి ఫలితంగా రాజరాజనరేంద్రుని సంతతివారు కాంచీ నగరంలో పరిపాలన ప్రారంభించారు.

ఈ తరుణంలో ఆంధ్రదేశంలో వెలనాటిచోడుల ఆధిపత్యాన అనేకమంది సామంతరాజులు పరిపాలించారు. నిజానికి వీరంతా సర్వస్వతంత్రులు. ఈ చిన్న రాజ్యాల మధ్య అనేక తగాదాలు, వైషమ్యాలు పెరిగిపోయి, 1172, 1182 మధ్య కాలంలో గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా కార్యంపూడిలో పల్నాటియుద్ధంగా పరిణమించింది.

పల్నాటి వీరచరిత్రను గురించి ఆంధ్రదేశంలో తెలియనివారెవరూ లేరు. ఈ వీరకథను పలనాటిలో పర్యటించిన శ్రీనాథమహాకవి ద్విపదకావ్యంగా రచించాడు. దీనిని ఆంధ్రదేశంలో జానపద గాయకులైన పిచ్చుగుంటలవారు విపరీతంగా ప్రచారంలోకి తీసుకువచ్చారు.

## వినోదాలవర్ణనలో శ్రీనాథుని కవితావైభవం :

పలనాడులో గురజాల రాజధానిగా పరిపాలించిన నలగామరాజు దర్బారులో జరిగే ఆనాటి సంగీత నృత్యవాద్య విశేషాలను శ్రీనాథుడు ఈ విధంగా వర్ణించాడు:

వింతగా గాయనుల్ వీణలుబూని-తంత్రులు బిగియించి తగ సుతిబెట్టి
సరిగమేళములైన స్వరసప్తకంబు-ఆరోహణావరోహణ భేదములను
బహురాగసంప్రాప్తి పట్టుగా జేర్చి-సంచారి సంస్థాయి సరసభావముల
మృదుతరశబ్దార్థ మిళితమైనట్టి-ఘనతరాలంకార గతిపరంపరలు

## నాట్యమేళమువారి, నవవిలాసాలు :

మూర్ఛనల్ మొదలైన ముఖ్య ధర్మములు-జంత్రగాత్రంబులు జంటగావించి
చెలగి యెండిన చెట్లు చిగిరించునట్లు-పాడిరి తమతమ ప్రావీణ్య మెసగ
పాకశాసను కొల్వుపగిది నున్నట్టివేళ-నేతెంచిరి విద్యాధికతను
నాట్యమేళమువారు నవవిలాసముల-వచ్చి నమ్రత మ్రొక్కి ప్రక్కగా నిల్వ
ఘనవైభవంబున కామభూవిభుడు-నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుచేయ
వరమృదంగము లెస్సవాయించు మేటి-కుడిభాగమున యందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటి దిశను-నిలిచి రుత్సాహంబు నేరుపు మీర
ముఖవీణ వాయించు ముఖ్యు డొకండు-రాగ మాలాపించు రమణు లిద్దరును

నిండువేడుకతోడ నిలిచిరి వెనుక-కంజలోచన యను ఘనమైన పాత్ర
మదను పట్టపుదంతి మంజులవాణి-భరతశాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతు బాణంబు-వచ్చి సభాసదుల్
వర్ణించిచూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన-వేత్రపాణికి దగ
వినయంబు జూపి
అత డొసంగిన గజ్జె లతిభక్తితోడ-పాదములం గట్టి
పంచవర్ణముల



కాశె గట్టిగ గట్టి కడు జవం బడర-మద్దెల తాళాల మధ్య నిల్చుండి
ఓరచూపున రాజు నొయ్యనజూచి-సమపాదయుతమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి-పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్లగ్రమ్మ-కైకోలువిడుదలల్ ఘనకళాశైలి
కైముడికట్నముల్ కనుపింపజేసి-వెలయంగ తొమ్మిదివిధములయినట్టి
భూచారి నాట్యంబు పొందుగాసలిపి-పదునారు విధములై పరగినయట్టి
ఆకాశచారియు నమరంగనాడి-అంగహారాఖ్య గలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధముల నాడి-గతిచారి భేదముల్ గనుపడునట్టు
భ్రమణసంయుత దీప్తపటిమమీరంగ-పాణిభేదములను బాటించిచూపి
స్థానకసంచయ సంయుక్తి యమర-ప్రేరణిదేశిని ప్రేంఖణశుద్ధ
దండికాకుండలి తగుబాహుచారి-సప్తతాండవములు సల్పె చిత్రముగ
సభవార లాశ్చర్య సంయుక్తులైరి-తరువాత నిరుమేల దగు చెలు లమర
నంయుతా సంయుతా చలనసంకుచిత-నానార్థకరములు నాట్యహస్తములు
శిరమును చూపులు చెక్కిళ్లు బొమలు-దంతోష్ఠకంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగపక్షముల్ మొదలుగా నెన్న-అంగంబు లారు ఉపాంగంబు లారు
ప్రత్యంగసముదయం బారునుం గూడి-యెనిమిది పది యగు నెసగు నంగంబు
లమరంగ నభినయం బాశ్చర్యముగను-మాచెర్ల చెన్నుని మహిమంబు తెలుపు
ఆంధ్రసంస్కృత వాఙ్మయాది గీతముల-భావంబు లెస్సగా ప్రకటంబు చేయ
చూచి రంభాదులు చోద్యంబు నొంది-శిరసులు వంచియు సిగ్గును జెంది
రప్పుడు భూమీశు డాదరం బొప్ప-వస్త్రభూషణములు వారల కిచ్చి.

భట్టునురమ్మని పంపించెనంత —

ఈ నృత్యంలో ముఖవీణలు వాయించేవారిని, మృదంగ విద్వాంసుల్ని, లయ ప్రకారం తాళం వేయగల తాళమానజ్ఞుల్ని, బహురాగాలను అన్ని స్థాయిలలోనూ పాడగల ప్రజ్ఞావంతుల్ని జంటగాత్రాలు కలిపి రాగం ఆలాపించే రమణులగూర్చి కూడా నివరించాడు శ్రీనాథుడు.

## శైవ, వైష్ణవమతాల చైతన్యం :

ఇంతటి లలితకళావికాసంతో వర్ధిల్లిన పలనాటిసీమలో అన్నదమ్ముల కలహ కారణంగా పల్నాటియుద్ధం ప్రారంభమైంది. పల్నాటియుద్ధానికి కేవలం రాజకీయ కారణాలేకాక సాంఘికమైన ప్రాధాన్యం కూడా ఎంతో వుంది. రామానుజుని వైష్ణవ మతం 11-వ శతాబ్దంలో తమిళదేశంలో ప్రారంభమై ఆంధ్రదేశంలో ప్రవేశిస్తే, బసవయ్య వీరశైవమతం 12 వ శతాబ్దంలో కన్నడదేశంలో ప్రారంభమై ఆంధ్ర దేశంలో ప్రవేశించింది. ఈ రెండు మతాల ప్రాబల్యమూ పలనాటియుద్ధం మీద చాలా వుంది.

వైష్ణవమతం ఆంధ్రదేశంలో ప్రవేశించక ముందు నుంచీ శైవమతం చాలా కాలంగా ఆంధ్రదేశంలో ప్రచారంలో వుంది. చాళుక్యరాజులు ఎక్కువమంది శైవ మతాన్ని ప్రోత్సహిస్తే తెలుగుచోడులు శైవ, వైష్ణవమతాలు రెంటినీ సమన్వయ దృష్టితో ఆదరించారు.

ఈ మతాల విజృంభణ ఆనాటి సాంఘిక ఆచారవ్యవహారాలలో, సంగీతంలో, నృత్యంలో, సాహిత్యంలో, దేవాలయవాస్తు నిర్మాణంలో, శిల్పంలోనూ ఎంతో మార్పు తీసుకువచ్చింది.

## శైవమత చిద్విలాసాలు :

విష్ణుకుండిన వంశం తరువాత ఆంధ్రదేశాన్ని పరిపాలించిన పూర్వచాళుక్యులు వైదికమార్గ నిరతులైనప్పటికీ ఈ వంశంవారిలో చాలామంది శైవమతాన్ని అవలంబించిన పరమమాహేశ్వరు లున్నారు. వీరి కాలంలో ఇతర ప్రాంతాలనుండి పాశుపతి శివాచార్యులు తెలుగు దేశానికి వచ్చి, పాశుపత శైవసంప్రదాయాన్ని వ్యాపింపజేసి శివాలయాల్లో స్థానాపతులుగా వున్నారు. అట్టివారిలో మొట్టమొదటి సారిగా తెలుగు శాసనాలలో తెలిసినవారు వామశివ, పురుషశివ అనే పేర్లు గల శివాచార్యులు. వీరు చాళుక్య కులజుడైన మంగి యువరాజు పుత్రుడైన విష్ణువర్ధనుని

శాసనాలలో పేర్కొనబడ్డారు. ఆయన ఏలూరు దగ్గర ఉన్న వసంతవాడ గ్రామం లోని శివాలయత్రయానికి, వాద్య, వాదక, గాయక, నటకాచార్య విలాసినీ జనభృతి నిమిత్తం 'వసన్ధూ'రను ప్రాచీననామం గల వసంత వాడలో కొంత భూమిని దానంచేసి దానశాసనం వ్రాయించి ఆ శివాచార్యులపరంగా ఇచ్చియున్నాడు.



శైవమతం భక్తిసాంప్రదాయంగా వ్యాపించడంతో శివలీలలు పాడటం, అభినయించటం, శివకథలు ఆడటం, వాడుకలోకి వచ్చి నాట్య సంగీత కళలు వృద్ధిపొందాయి. శివాలయాల్లో అంతకుపూర్వం పెద్ద పెద్ద మండపాలుండేవి కావు. ఇప్పుడు వాటిలో నాట్య, సంగీత, మంటపాలు ఏర్పడినాయి.

ఆ దేవాలయాలలో స్వామి అర్చనావసరాన శివలీలలు పాడి అభినయించడానికి పాత్రధారులు నియమితులై ఉండేవారు. స్వామివారి అంగ, రంగ, వైభోగాల నిమిత్తం శ్రీమంతులు, మహారాజులు, సామంతులు, మాండలికులూ మాన్యాలను దానంచేయడం ఆచారమైంది. ఆనాడు దేవాలయాలు సంగీత, నాట్య కళలకూ, విద్యార్థులకూ ఆధారభూతమైనాయి.

## దేశికవితను పండించిన శైవకవులు :

శైవ, వైష్ణవమతాల ప్రాబల్యం వచ్చిన తరువాత సాహిత్యంలోనూ, నాటక రచనలోనూ, గేయవాఙ్మయంలో కూడ పెద్ద మార్పు రాసాగింది. గేయరచనకూ, సంగీతానికీ తెలుగుభాష అనుకూలంగా వుండడంవల్ల జనసామాన్యానికి అర్థమయ్యే రీతుల్లో శైవకవులు, శైవమత ప్రచారంకోసం, వచన నాటకాల్ని వదలి, పద్య రచనతో కూడుకున్న వాఙ్మయాన్ని సృష్టించారు.

అంతేగాక ఆనాడు దేశీయనాటక రచనకు దారి చూపించినవారు కూడ శివ కవులే. జనసామాన్యాన్ని తేలిక పద్ధతుల్లో ఆకర్షించటానికి వారు సంస్కృత నాట కాల పద్ధతిని మాని, దేశిపద్ధతిని ప్రారంభించారు.

## పంక్తి బాహ్యులు :

దేశినాటకాలు మాత్రం ప్రజాసామాన్యంలో ప్రదర్శింపబడేవి. ఈ నాటకాలను శైవమత ప్రచారకులు ఎక్కువ వ్యాప్తిలోకి తెచ్చారు. దేశినాటకాలు పురాతనకాలం

నుంచీ ప్రజాసామాన్యం యొక్క అభిమానాన్ని చూరగొన్నవి. దేశినాటక సాంప్రదాయాలు చాలావరకు శివకవుల ఆధ్వర్యంలోనే వర్థిల్లాయి. అవి బహుజనరంజకంగానూ, తేలిక పద్ధతిలోనూ సామాన్య ప్రజలకు అర్థమయ్యే శైలిలోనూ వ్రాయబడ్డాయి. ఆనాడు ఆర్య సాంప్రదాయం ప్రకారం నాటకాలాడే నటకులను పంక్తిబాహ్యులుగా నిర్ణయించారు. అటువంటివారికి సంఘంలో గౌరవమర్యాదలు శూన్యం.

## అందరూ ఆదరించిన దేశినాటకాలు :

కాని శైవమతాన్ని అవలంబించిన వారికిగాని, ఏ విధమైన జాతివిచక్షణా లేని జంగాలకుగాని ఇటువంటి నిర్ణయాలను, విధినిషేధాజ్ఞలను వారు పాటించలేదు. అంతేగాక శైవమతాన్ని అవలంబించిన బ్రాహ్మణాది అగ్రవర్ణాలవారికి కూడ ఏ విధమైన పట్టింపూ లేకపోవడంవల్ల అగ్రజాతుల వారందరూ దేశినాటకాలనే ప్రదర్శించారు.

ఇక్కడ గమనించవలసిన విషయ మేమంటే శైవభక్తులైన జంగాలు మొదలైనవారు శివ సంబంధమైన కథా ఇతివృత్తాలనే తీసుకుని రచనలు సాగించారు. వేరు కథావస్తువుల్ని వారు స్వీకరించలేదు. నాటకాలాడడంలో జంగమువారు ముఖ్యులని కృష్ణదేవరాయల కాలంలో వున్న బైచరాజు వేంకటనాథ కవి "కడివోని తెలు నాటకపు టూరిజంగాలు" అని పేర్కొన్నాడు.

పై విషయాన్నిబట్టి శైవ సంబంధమైన ఇతివృత్తాలుగల నాటకాలే ప్రథమంగా వ్రాయబడ్డాయని చెప్పవచ్చు.

## వైష్ణవమతం-కళాపోషణ :

పదకొండవ శతాబ్దంలో దేవాలయ నిర్మాణంలో పెంపు కలిగింది. అంతవరకూ ఒక గర్భగృహమూ, అంతరాళికమూ, ముఖమండపాలతో వున్న దేవాలయాలలో ప్రధానదైవాలకేకాక, పరివారాలకుకూడ గృహాలేర్పడ్డాయి. పన్నిద్దరాళ్వారులను విష్ణుభక్తులు పన్నెండవ శతాబ్దంలో విష్ణ్వాలయాలలో విగ్రహారూపంగా ప్రవేశించారు. దేవాలయ విన్యాసాలలో కల్యాణమండపం, సభామండపం, నాట్యమండపం మొదలైన అనేక మండపాలు అంతర్భాగాలైనాయి. నాట్య, సంగీత, చిత్రకళానిలయమై దేవాలయం ఒక కళాపోషక సంస్థ ఐంది.

## శైవం, వైష్ణవం చేరదీసిన నాట్యం :

శైవం, వీరశైవం, వైష్ణవం విజృంభించిన కాలంలో, దేశంలో అనేకమైన శైవ, వైష్ణవ దేవాలయాలు ఏర్పడ్డాయి. ఈ ఆలయాలన్నీ సంగీత నాట్యాలను ఎక్కువగా ఆదరించాయి. ప్రతి ఆలయంలోనూ దేవపూజా సమయంలో నాట్యం జరిగేది. ఉత్సవ సమయాల్లో ప్రత్యేకమైన ప్రదర్శనాలు జరిగేవి. ప్రతి దేవాలయంలోనూ నాట్యమండపా లుండేవి. అనేకమంది గాయకులూ, వాద్యకులూ, నర్తకీ, నర్తకులూ దేవాలయ సిబ్బందిలో ఒక భాగంగా వుండేవారు. అనేకమంది శిల్పులు దేవాలయాలమీదా, స్తంభాలమీదా, గోడలమీదా, ద్వారబంధాలమీదా అనేకమైన భరత నాట్య కళారీతుల్ని చెక్కి నాట్యకళాసేవ చేశారు.



## అంతమైన అన్నదమ్ముల కలహం :

పల్నాటి యుద్ధంవల్ల అపార జననష్టం కలిగింది. ఇరుపక్షాలకూ తోడ్పడిన అనేకమంది చిన్న చిన్న సామంతరాజు లందరూ ఈ యుద్ధంలో నాశనమయ్యారు. ప్రజలు అనేక కష్టనష్టాలకు గురైనారు. సుస్థిరమైన ప్రభుత్వంకోసం ఎదురుచూడ సాగారు. ఈ పరిస్థితిని గమనించిన కాకతీయులు దిగ్విజయయాత్రలను ప్రారంభించి, సామంతరాజు లందరినీ ఓడించి ఆంధ్రదేశా న్నంతా తమ ఏలుబడి క్రింద ఐక్యంచేసి సుమారు 200 సంవత్సరాలు రాజ్యపరిపాలన చేశారు.

పల్నాటియుద్ధం నాటికే ఆంధ్రప్రదేశమంతటా బహుళవ్యాప్తి పొందిన వీర శైవమతం కాకతీయుల కాలంలో 1200-1300 సంవత్సరాల మధ్య ఎంత వుధృతంగా వ్యాపించిందో ముందు చూడగలం.

## దేవాలయాలకు దిగివచ్చిన నాట్యకళ :

ఏ రాజులు ఏ కళాసాంప్రదాయాన్ని పోషించారో, ఏ శిల్పులు ఏ శిల్పాన్ని మలిచారో, ఏ కళాకారులు ఏ నృత్యాలను ప్రదర్శించారో మనకు సరియైన సాక్ష్యాధారాలు లేకపోయినా, నేటి ఆంధ్రదేశంలో ఉన్న పురాతన దేవాలయా లన్నిటిమీదా

నాట్యశిల్పాలు చెక్కబడి మనకు దర్శనమిస్తున్నాయి. ఒకనాడు పుష్కలంగా ఆంధ్ర దేశంలో అభివృద్ధిపొందిన నాట్యకళకు సాక్ష్యాధారాలు ఈ శిల్పాలే. నాటి దేవాలయాలు హిందూ సంస్కృతినీ, లలితకళా సంప్రదాయాలను చిత్రిస్తున్నాయి.

ఆనాడు దేవస్థాన నాటకరంగస్థలంలో దేవదాసీలు ఏయే భంగిమలతో నృత్యాలను ప్రదర్శించేవారో ఆ రూపాలన్నిటినీ శిల్పులు సుందరంగా మలిచారు. ముఖ్యంగా దేవాలయాల్లో దేవదాసీల ఆరాధన నృత్యాలు జరిగేవి. దైవసన్నిధిలో దైవాన్ని స్తోత్రం చేస్తూ నృత్యగానాలు జరిపేవారు. శైవదేవాలయాల్లో శైవ సాంప్రదాయాన్నీ, వైష్ణవ దేవాలయాల్లో వైష్ణవ సాంప్రదాయాన్నీ ప్రదర్శించేవారు. దేవాలయ శిల్పంలో నృత్యకళ కిచ్చిన ప్రాముఖ్యాన్నిబట్టి లలితకళాపోషణ ఆ నాడు ఎంతగా జరిగిందో మనం అర్థం చేసుకోవచ్చు.

శ్రీశైల దేవస్థానంలో పూర్వం శృంగనాట్యం, సప్తలాస్యం ప్రదర్శించినట్లు ఆలయ శిల్పాన్నిబట్టి పూర్వం శైవసాంప్రదాయ నృత్యాలు జరిగినట్లు తెలుస్తూ వుంది. భామాకలాప, గొల్లకలాప ఇతివృత్తాలు శ్రీశైల భ్రమరాంబస్తవంతో ప్రదర్శింపబడేవట.

## దేవాలయాల్లో - దేవదాసీ నృత్యాలు :

ఇలాగే ఆంధ్రదేశంలో ఈ క్రింద వుదాహరించిన ఆ యా ప్రాంతాల్లో దేవాలయ నృత్యకళ అభివృద్ధి చెందింది.

పిఠాపురం కుంతిమాధవుని దేవాలయంలో వైష్ణవ సాంప్రదాయ నృత్యాలైన భామాకలాపం, గొల్ల కలాపం ప్రదర్శింపబడేవి.

తిరుపతి వెంకటేశ్వర దేవస్థానం వైష్ణవసాంప్రదాయానికి చెందినప్పటికీ, ఇక్కడ నృత్య విద్యావికాసం అంతగా కనిపించడం లేదు. కాని గాన పద్ధతికి సంబంధించిన రచనలు మాత్రం కొల్లలుగా వున్నాయి. తాళ్ళపాక అన్నమాచార్యులు వెంకటేశ్వరునిపైన రచించిన సంకీర్తనలు ఆ కోవకు చెందినవే.

శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయంలో వైష్ణవసాంప్రదాయంతో ఆరాధన నృత్యకళ అభివృద్ధి చెందింది.

బాపట్ల భావనారాయణస్వామి దేవస్థానంలో సిద్దాబత్తునివారు వైష్ణవ సంప్రదాయానుసారం శాస్త్రీయ నృత్యకళను రూపొందించారు.

శ్రీకాకుళంజిల్లాలో వున్న మరో పెద్ద క్షేత్రం శ్రీకూర్మం. ఇది వైష్ణవ సాంప్రదాయానికి సంబంధించిన క్షేత్రమైనప్పటికీ, నృత్యానికి సంబంధించిన భజన సంప్రదాయం ఇక్కడ ప్రచారంలో కొచ్చింది.



మాచెర్ల శైవ, వైష్ణవసాంప్రదాయాలకు పుట్టినిల్లు. రెండు మతాలవారూ చెన్నకేశ్వర దేవాలయంలోనూ, వీరభద్రేశ్వరాలయంలోనూ, వారి వారి సాంప్రదాయాల ననుసరించి నృత్యకళను కేళిక పద్ధతిలో ఆరాధించారు.

చెయ్యూరు సుందరేశ్వరస్వామి దేవాలయం శైవ సంప్రదాయానికి సంబంధించింది.

ఈ ఆలయంలో వాద్యవిశేషాలతో ఆరాధన నృత్యాలు జరిగేవి. యక్షగాన పద్ధతి ప్రదర్శనలు కూడా జరిగేవి. ఈ స్వామిపైన అనేక భక్తిరచన లున్నాయి.

జొన్నవాడ అంబదేవస్థానంలో శైవసాంప్రదాయాల ననుసరించి అంబను స్తుతిస్తూ నృత్య ప్రదర్శనాలు జరిగేవి.

కాళహస్తి దేవాలయంలో శైవసాంప్రదాయ నృత్యాలు జరిగేవి.

మార్కాపురం వైష్ణవదేవాలయంలో కేళిక పద్ధతిలో ఆరాధన నృత్యాలు జరిగేవి.

ఈ విధంగా ఆంధ్రదేశపు నాలుగు చెరగులా అనేక దేవాలయా లున్నాయి. అన్ని ఆలయాలలోనూ, శైవ వైష్ణవ సాంప్రదాయాల ననుసరించి నాట్యశిల్పా లున్నాయి. వీటిని పరిశోధించటం ఎంతైనా అవసరం. ఇప్పటికే ఈ పరిశోధనలో పండిపోయిన నటరాజ రామకృష్ణగారు ఎంతైనా అభినందనీయులు.





# కాకతీయుల కళా విన్యాసం

ఆంధ్రుల చరిత్రలో అత్యంత ప్రసిద్ధిగాంచిన ఓరుగంటి కాకతీయ చక్రవర్తులు క్రీ. శ. 1050 మొదలు 1350 వరకు దాదాపు 300 సంవత్సరాలు రాజ్యపరిపాలన చేశారు. ఆంధ్రదేశ చరిత్రలో కాకతీయులు వర్ధిల్లిన కాలం మహోజ్జ్వలమైంది. కాకతీయ చక్రవర్తులు అనేక మహమ్మదీయ దండయాత్రలకు ఎదురు నిల్చి పోరాడి విశాల సామ్రాజ్యాన్ని నిర్మించారు. ఆంధ్రజాతికి ఒక కర్తవ్యాన్నీ, విశిష్టతనూ చేకూర్చారు. వీరి పరిపాలనా కాలాన్ని మూడు దశలుగా విభజించవచ్చు.



1000-1158 వరకూ కొంతకాలం తూర్పు చాళుక్య రాజులకూ, మరి కొంతకాలం పశ్చిమ చాళుక్యరాజులకూ సామంతులుగా వుండి చిన్న చిన్న రాజ్యాలను ఓడించి చివరకు చాళుక్యరాజుల్ని కూడా ఓడించి స్వతంత్ర ప్రభువులుగా రూపొంది, 150 సం॥ ల కాలంలో 4 గురు రాజులు పరిపాలించారు. వీరిలో చివరివాడైన రెండవ ప్రోలరాజు అతి ప్రసిద్ధుడు.

## మహోన్నత వీరులు :

తరువాత దశలో 1159-1261 వరకు తెలంగాణాను పునాదిగా చేసుకుని ఆంధ్రదేశాన్నంతా జయించారు. ఈ దశలో మొత్తం ముగ్గురు రాజులు పరిపాలించారు. వీరిలో ప్రసిద్ధుడైన కాకతీయ గణపతిదేవుడు దీర్ఘకాలం (1193-1262 వరకు) పరిపాలించి కాకతీయ రాజ్యాన్ని విస్తరింపజేశాడు.

ఆ తరువాత దశలో 1262 నుండి 1323 వరకూ పరాయిరాజుల దండయాత్రలనుండి కాకతీయ సామ్రాజ్యాన్ని కాపాడినవారు రుద్రమదేవి. ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి అనేకమంది సామంతరాజుల తిరుగుబాట్లు నోడించి, సమర్థవంతంగా రాజ్యపరిపాలన చేసింది. రెండవరాజైన ప్రతాపరుద్రుడు అల్లావుద్దీన్ దండయాత్రల్ని అనేకసార్లు త్రిప్పికొట్టి చివరకు ఓడిపోయి బందీగా చిక్కి భరించలేని కారాగార జీవితంతో ఆత్మహత్య చేసుకున్నాడు.

కాకతీయ చక్రవర్తులు లలితకళల్నీ, సారస్వతాన్నీ పోషించి వాటికి నూతన వికాసాన్ని కలిగించారు. వీరి కాలంలో నాట్యకళ బహుముఖాల విజృంభించి

నట్లు అనేక శాసనాలవల్లనూ, ఆనాటి శిల్పకళవల్లనూ, సాహిత్యంవల్లనూ విదిత మౌతోంది.

## కళాకారులకు ఘనసత్కారాలు :



దేవాలయ కైంకర్యం చేసే నర్తకీ మణులకు, మృదంగ విద్వాంసులకు, గాయ కులకూ, గృహదానాలు చేసినట్లు పిల్లలమఱ్ఱి శాసనంలో వుదాహరింపబడింది.

పానుగల్లు శాసనంలో మైలాంబ గాయకులకు, నర్తకీమణులకు పై విధమైన గృహదానాలు చేసినట్లుంది.

ధర్మసాగర శాసనంలో 'జలజక రండ' మనే అపూర్వమైన వాద్యప్రశంస వుంది. ఈ కరండవాద్యకారులకూ పది మంది, నాట్యకత్తెలకూ కొన్ని నివర్తనాల భూమిని ఇచ్చినట్లు వ్రాయబడివుంది.

చేబ్రోలు శాసనంలో కాకతిగణపతిదేవుడు నృత్తరత్నావళి రచయిత జాయప సేనాని పదహారుమంది ఆటకత్తెలకు గృహదానాలు చేసినట్లుంది.

## మాన్యాలు, సమ్మానాలు :

గుంటూరుజిల్లా, గుంటూరు తాలూకా, మందారమనే (నేటి మందడం) మల్కాపురం శాసనంలో 1183 లో కాకతీయ మహారాణి రుద్రమదేవి విశ్వేశ్వర శివాచార్యుడు స్థాపించిన గోళకీమఠ విద్యాస్థానానికి దేవాలయంలో పదిమంది నర్త కులకూ, ఎనిమిదిమంది మార్దంగికులకూ, కాశ్మీరు గాయకునికీ, పధ్నాలుగురు గాయనీమణులకూ, కరడావాద్యంలో ఆరితేరిన కళాకారులు ఆరుగురికీ, వృత్తిమాన్యా లిచ్చి నాట్య సంగీతాలకు పోషణ కల్పించినట్లుంది.

శాసనాలతోపాటు కాకతీయ చక్రవర్తులు కట్టించిన అనేక దేవాలయాలమీద నాట్య సాంప్రదాయాలను ప్రతిబింబించే అనేకమైన నాట్యశిల్పా లున్నాయి. అనేక దేవాలయాలు, శిల్పాలు తురుష్కుల దండయాత్రల్లో ఛిన్నాభిన్నమైనాయి.

## రామప్పగుడిలో రమణీయ నృత్యాలు :

శిల్పకళా విశిష్టతతో నిర్మితమైన రామప్పగుడి వరంగల్ జిల్లా ములుగు తాలూకాలో వుంది. ఇది వరంగల్లుకు 40 మైళ్ళదూరంతో వుంది. ఈ గుడిని 1162 లో రుద్రసేనాని అనే రెడ్డిసామంతుడు కట్టించాడు. రామప్పగుడి ఆలయ నిర్మాణంలోని చిత్రకౌశలం, శిల్పనైపుణ్యం వర్ణించనలవికానివి. ఈ కాకతీయ శిల్పచాతుర్యమంతా, ఇన్నేళ్ళు గడిచినా, ఈనాటికీ చూపరులకు అమితానందాన్ని కలిగిస్తూంది. భరత నాట్య శాస్త్రమంతా మూర్తీభవించి, స్తంభాలమీదా, కప్పులమీదా కనబడుతూంది.

రామప్పగుడిలోని విగ్రహాలు, స్తంభాలపై ఉన్న శిల్పాలు ముఖ్యంగా దేవాలయ మంటపంపై కోణాల్లో నాలుగు పక్కలా నిలిపిన పెద్ద నల్లరాతి నాట్యకత్తెల విగ్రహాలు అతి సుందరమైనవి. ఆ విగ్రహాల సొమ్ముల అలంకరణాలు, వాటి త్రిభంగీ నాట్యభంగిమాలూ శిల్పకారుల్నే సమ్మోహితుల్ని చేస్తున్నాయి. దేవాలయం లోని స్తంభాలపై నాట్యభంగిమలు మృదంగాది వాద్యములవారి రేఖలు చిత్రింపబడి వున్నాయి. జాయపసేనాని రచించిన నృత్తరత్నావళిలో ఉదాహరించిన నాట్యశిల్ప మంతా రామప్పగుడిలో తొణికిసలాడుతూ వుంది.

## ముద్దుగుమ్మల మద్దెల ధ్వనులు :

పాలం పేటలోని రామప్ప చెరువుకట్ట తూర్పు చివరనున్న దేవాలయం లోపలి భాగంలో స్త్రీలు మద్దెల వాయిస్తూ వుండగా, వివిధ భంగిమలలో నృత్యం చేస్తున్న అనేకమంది ఆటకత్తెల శిల్పా లున్నాయి. అదే దేవాలయం పడమటివైపు ద్వార బంధాలమీద మార్ధంగికురాండ్ర శిల్పా లున్నాయి.



వరంగల్లు రుద్రమదేవి కోట ద్వారబంధంపై రాతిపలక మీద మార్ధంగికురాండ్ర శిల్పాలు చెక్కబడి వున్నాయి.

ఆ కోటలోనే స్వయంభూదేవాలయంలో ఒక చిన్న శివ తాండవ నృత్యశిల్ప ముంది.

హనుమకొండ వెయ్యి స్తంభాల గర్భగుడి ద్వారబంధాల మీద వివిధ వాద్యాల నృత్య భంగిమలలో స్త్రీల శిల్పా లున్నాయి.

కాకతీయ యుగంలో నాట్యకళ ప్రచారంలో వున్నట్లు ఆ నాటి సంస్కృత గ్రంథాలలో ఉదాహరింపబడి వుంది. జాయపసేనాని రచించిన అపూర్వ నృత్యశాస్త్ర గ్రంథం ('నృత్తరత్నావళి' - సంస్కృత గ్రంథం) ఆ నాటిదే.



## జాయపసేనాని కత్తివీరుడే కాక కళాప్రియుడైన సేనాని :

కాకతి గణపతి దేవచక్రవర్తి కటాక్షానికి పాత్రుడైన జాయప తన స్వయంశక్తి వల్ల సేనాని కాగలిగాడు. ఈయన వీరుడే గాక, కళాకారుడు కూడాను.

నృత్యాలంటే జాయపకు అత్యంత అభిమానం. స్వయంగా నృత్తరత్నావళిని రచించాడు. ఈ నృత్తరత్నావళి భారతీయ నృత్యసంపదకు ఆభరణమని నృత్య విద్యావేత్తల అభిప్రాయం. సంస్కృతభాషలో ఆంధ్రులు రచించిన మొట్టమొదటి నృత్యశాస్త్ర గ్రంథం ఇదేనని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలియజేశారు. ఒక వ్యాసంలో.

దీనిని రచించిన జాయపసేనాని అసలు పేరు జాచున. ఈయన అయ్యకుల సంజాతుడు, పిన్నచోడన పుత్రుడు. తాతముత్తాతలది వెలనాడులోని క్రొయ్యూరు. చందవోలును రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలించిన వెలనాటి మహీపతులవద్ద ఈతని తండ్రీ, తాతా సేవలు చేశారు.

జాయన జాయచమూపతి, జాయసేనాధినాథుడు, గజసాహిణి జాయప, గజ సైన్యాధినాథుడు అనే పేర్లతో పిలువబడుతూ వుండేవాడు) గణపతిదేవ చక్రవర్తి జాయపయందు అత్యంత అభిమానంతో అతనికి సకల విద్యలనూ, కళలనూ నేర్పించాడు. ఆ తరువాతనే జాయప అత్యుత్తమమైన నృత్తరత్నావళి రచనకు పూనుకుని క్రీ॥శ॥ 1253-54 ప్రాంతంలో పూర్తి చేశాడు.

## నృత్తరత్నావళి జానపద కళారూపాల వర్ణన :

నృత్తరత్నావళిలో మార్గ, దేశినృత్యాలు రెండూ కలిసి కట్టుగా నడిచాయి. ఇందులో ఎనిమిది అధ్యాయా లున్నాయి. మొదటి అధ్యాయం నర్తన వివేకం,

రెండవ అధ్యాయం అంగనిరూపణ, మూడవ అధ్యాయం మండల లక్షణం, నాలుగవ అధ్యాయం కరణాంగహార వివేచనానికి సంబంధించింది. ఐదవ అధ్యాయం దేశీ, స్థానక, కరణ, భ్రమరీ లక్షణాలను తెలుపుతూ వుంది. ఆరవ అధ్యాయం దేశి పాట, చారీలాస్యాంగగతి లక్షణమనే పేరు గలది. 6-7-8 అధ్యాయాలు ఆ నాటి ఆంధ్ర దేశంలో వాడుకలో ఉన్న దేశి, నృత్త పద్ధతులన్నీ వివరించేవిగా వుండి గ్రంథ ప్రాముఖ్యాన్ని ఎంతగానో చాటుతున్నాయి.

జాయప నృత్తరత్నావళిలో తన కాలంలో ప్రచారంలో ఉన్న దేశి నృత్యాలన్నిటినీ అమూలంగా చిత్రించాడు. ఎనిమిది అధ్యాయాలు గల ఈ గ్రంథంలో కడపటి మూడు అధ్యాయాలూ దేశి నృత్య సాంప్రదాయాలైన పేరణి, ప్రేంఖణం, రాసకం, చర్చరి, నాట్యరాసకం, దండరాసకం, శివప్రియం, చిందు, కందుకం, భాండికం, ఘంటసరి, చరణము, బహురూపం, కోలాటం మొదలైన ప్రాంతీయములైన అనేక జానపద నృత్యాలను వివరించాడు.

జాయప నృత్తరత్నావళిని పరికించి చూస్తే భరతముని ప్రసాదించిన భరత నాట్యశాస్త్ర గ్రంథంతోనూ, భరతనాట్యంపై అభినవగుప్తాచార్యుల వ్యాఖ్యానంతోనూ జాయపకు పరిపూర్ణ పరిచయం వున్నట్లు తోస్తూవుందని కీ॥ శే॥ మల్లంపల్లివారు అదే వ్యాసంలో వ్రాశారు.

జాయప నృత్తరత్నావళిలో నృత్యానికి అనుగుణమైన సంగీత రత్నావళిని గూడ అనుబంధంగా రచించాడట. కాని దురదృష్టవశాత్తూ అది లభ్యంకాకుండా పోయింది.

జాయప 1213 వ సంవత్సరం నాటికే సకల నాట్య వైదికమణి అనీ, కవి సభాశిఖామణి అనీ పేరొందాడు. జాయప నృత్తరత్నావళిని 1253-54 నాటికి రచించడం వలన దాదాపు 60 సంవత్సరాల వయసులో వ్రాసి వుండవచ్చు. ఏమైనా ఈనాడు ఆంధ్రులు గర్వించదగిన పురాతన నృత్యశాస్త్ర గ్రంథాలలో నృత్తరత్నావళి మణిభూషణం.



# పలు కళారూపాలను వర్ణించిన పాల్కురికి సోమన్న

మొదటి ప్రతాపరుద్రుని కాలంలో జీవించిన పాల్కురికి సోమనాథుడు, కాకతీయ యుగంలో గొప్ప విప్లవ కవిగా వర్ధిల్లాడు. బసవపురాణంలోనూ, పండితారాధ్య చరిత్రలోనూ ఆయన ఆ నాటి విశేషాలను ఎన్నో తెలియ జేశాడు. కళారూపాల ద్వారా వీరశైవమతాన్ని ఎలా ప్రచారం చేసిందీ వివరించాడు. ఆ నాడు ఆచరణలో ఉన్న అనేక శాస్త్రీయ నాట్య కళారూపాలను గూర్చి, దేశి కళారూపాలను గూర్చి వివరించాడు.



బసవపురాణం చెప్పిన భక్తి పాటలు :

సోమనాథుని కాలానికి ముందే తుమ్మెదపదాలు, పర్వతపదాలు, శంకర పదాలు, నివాళిపదాలు, వాలేశుపదాలు, వెన్నెలపదాలు మొదలైన వెన్నో ఆచరణలో వుండేవి. కాని, ఈ పదా లన్నీ క్రమంగా నశించటంవల్ల జనసామాన్యంలో విద్యా ప్రచారానికి అవకాశాలు చాలావరకు తగ్గిపోయాయి. ప్రజల్లో ఎక్కువమంది పాట లకే ప్రాముఖ్య మిచ్చినట్లు బసవపురాణంలో ఈ క్రింది విధంగా ఉదాహరించ బడింది.

మేటియై చను భక్తకూటువలందు - పాటలుగా గట్టి పాడెడువారు,
ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల - విస్తారముగ జేసి వినుతించువారు,
అటుగాక సాంగభాషాంగక్రియాంగ - వటునాటకంబుల నటియించువారు,
మునుమాడి వారు వీ రన నేల కూడి - కనుగొన రోళ్ళ రోకళ్ళ బాడెదరు.

భక్తకూటువు లనే భజనమండలి సమాజాలు పాటలు కట్టి పాడుకోవడం, రోకటి పాటలుకట్టి పాడుకోవడం (రోకటి పాటలంటే, దంపుళ్ళ పాటలు) ఆ నాటికే ఏర్పడ్డాయి. ఈ నాటికీ ఈ పాటలు ప్రజాసామాన్యంలో దంపుళ్ళ పాటలుగాను, భజనసమాజాల్లో భక్తి గీతాలుగాను ఏర్పడి ఉన్నాయి. రోకటి పాటలను శివభక్తుల

ఇండ్లలో వేదాల్లాగా వల్లించేవారట. శిరియాళచరిత్రను గురించి బసవ పురాణంలో—

కరమర్థి నూరూర శిరియాలు చరిత - పాటలుగా గట్టి పాడెడువారు
అటుగాక సాంగభాషాంగక్రియాంగ - పటునాటకంబుల నటియించువారు

శిరియాలు చరితను పాటలుగా గట్టి పాడటమేగాక, ఆ కాలంలో నాటక ప్రదర్శనాలు కూడా జరిగినట్లు పై ఉదాహరణలవల్ల తెలుస్తూ వుంది.

## పండితారాధ్యచరిత్రలో ప్రజాకళారూపాలు:

ఆనాటి తెలుగు రచనల్లో కేవలం సూచనలేగాక, నృత్యకళకు సంబంధించిన అనేక వర్ణనలు మనకు లభిస్తాయి. సోమనాథుడు రచించిన పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణంలో నృత్యకళకు సంబంధించిన అనేక శాస్త్రీయ విషయాలనేగాక జాయప నృత్తరత్నావళిలో వర్ణించినట్లు జానపద నృత్యాలను కూడా వర్ణించాడు.

ఈ గ్రంథంలో సోమనాథుడు శ్రీశైలంలో శివరాత్రి మహోత్సవాలలో ప్రదర్శించే కళారూపాల నన్నిటిని ఉదాహరించాడు. నృత్యకళకు, శైవమతానికి పరస్పరసంబంధ మున్నట్లు కనబడుతూ వుంది. ప్రజానురంజకాలుగా వున్న ఆనాటి దేశినృత్యాలను ఆయన అద్భుతంగా వర్ణించాడు. యక్షగాన కళారూపాలను గూర్చి, దేశినాటక సంప్రదాయాలను గూర్చి పండితారాధ్యచరిత్రలో ఈ విధంగా వర్ణించాడు.

*ఎన్నో ఆటలు - ఎన్నో నాటకాలు బహు నాటకములు:*

ప్రమథపురాతన పటుచరిత్రములు -
గ్రమమొంద బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ - లలవడ బహురూప మాడెడువారు
గరణముల్ మెరవణుల్ గతులు జిత్రములు - నరుదుగ వెడ్డంగ
మాడెడువారు.

ఆటలు:

అమరాంగనలు దివినాడెడు మాడ్కి - నమరంగ గడలపై నాడెడువారు
నావియద్గతి బకులాడెడునట్టి - భావన మ్రోకులపై నాడువారు.

తోలుబొమ్మ లాటలు:



భారతాదికథల జీరమఱుగుల - నారంగబొమ్మ
లాడించువారు
గడునద్భుతంబుగ గంబసూత్రంబు లదరంగ
బొమ్మల నాడించువారు

యక్షగానాలు:

నాదట గంధర్వయక్షవిద్యాధ - రాదులై పాడెడు
నాడెడువారు
విధమున బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి యధికోత్సవము దులుకాడునట్లాడు.

జంతు నృత్య విన్యాసాలు:

పొలుపారుదండనంబులు నొప్పహంస - గతియును. మాతంగ గతియును,
వృషభ
గతియును, మర్కటగతియును మేష - గతియును, మయూరగతియును భోగి
గతియును, నా బెక్కుగతులు, నొప్పారు.
రంభయాదిగ నప్సరస్సమూహంబు - గుంభినీసతులతో గూడియాడంగ
జప్పట్లు వెట్టంగ జక్కన లేచి - యప్పాట వెడయాట లాడెడువారు
వేడుకతో జిందు నాడంగ వచ్చి - కోడంగియాటల గునిసెడువారు
భ్రమరముల్ సాళెముల్ బయకముల్ మెరసి - రమణ బంచాసి
పేరణి యాడువారు.

ఈ విధంగా పండితారాధ్య చరిత్రలో సోమనాథుడు దేశి కళారూపాలను గురించి వర్ణించాడు. వెడయాట (వికట నర్తనం), చిందుకోడంగియాటలు, కోణంగియాట (ఇది హాస్యనృత్యం), పేరణి, బహునాటకములు, బహురూపులు, వెర్రెంగము, అమరగంధర్వాంగనల నృత్యానుకరణలు, పక్షుల ఆటలు, గడాటలు, దొమ్మరాటలు, భారతాదికథల ఛాయాచిత్రాలు, బొమ్మలాటలు, పగటివేషాలు మొద లైనవాటి నన్నిటినీ వర్ణించాడు. అంతేగాక నర్తకుల వేషభాషలను గురించి ఈ క్రింది విధంగా వివరించాడు.

## నట్టువకత్తెల కట్టుబట్టల సోయగాలు:

నట్టువకత్తెలు ఆ కాలంలో అర్ధోరుకములు (చల్లడాలు) ధరించేవారట. ఆనాటి ప్రదర్శనాలలో, నర్తకుల రంగప్రవేశంతో నర్తనగానం ప్రదర్శింపబడేదట. దీనినే పూర్వరంగమని పేర్కొన్నారు.

అనంతరం నర్తకులు తెర వెడలిన తరువాత కన్నులూ, కనుబొమలూ మొదలైన అంగ, ప్రత్యంగ, ఉపాంగచలనాదుల ద్వారా అభినయాన్ని ప్రదర్శించే వారు. తరువాత జంత్ర సంగీతగమకాలతోనూ, వివిధ వాద్యాల దేశినామాలలోనూ వర్ణించేవారు.

ఆ నాటి నర్తకుల నర్తన తీరును ఉత్తేజంగా కావ్యధోరణిలో వివరించాడు. ఈ వర్ణనలో రకరకాల నృత్యరీతులు వర్ణించాడు. ఒంటికాలి నడక, మోకాటి నడక, మరగాళ్ళపై నడక, కూర్చుండే ముందుకు నడచుట, రొమ్ముతో ప్రాకుట, గిరగిర తిరుగుతూ పోవుట ఇత్యాదులను సోమనాథుడు పేర్కొన్నాడు. గిరగిర తిరిగే నృత్యానికి భ్రమరినృత్య మని పేరు. ఈ నృత్యాన్ని ఈనాడూ అరుదుగా చేస్తూనే వున్నారు.

అంతేగాక అనేక విధాలైన ఇతర నృత్యభేదాలను గూర్చి, వివిధ కథలను వివరించే నాటక ప్రదర్శనాలను కూడా వర్ణించాడు. ఆ నాటి వాడుకలో నున్న నాట్యకళా చరిత్రను గురించి సోమనాథుడు ఎన్నో అమూల్యమైన విషయాలను మనకు అందించాడు.

దేశిలాస్యాంగాలను వర్ణించిన సోమనాథుడు వివిధాంగాల పట్టిక నిచ్చాడు. హంస. నెమలి, పాము, ఏనుగు, ఎద్దు కోతి, మేక మొదలైన పక్షులు, మృగాలు వాటి గతుల ననుసరించి చేసే నృత్యాల పట్టిక నిచ్చారు.

## బసవపురాణంలో జానపద కళలు:

సోమనాథుడు బసవపురాణంలో కూడా కళలను గురించి వర్ణించాడు. బసవని వివాహ ఘట్టంలో కోలాటము, గొండ్లి, పేరణి మొదలైన దేశిరూపకాలను పేర్కొన్నాడు.

జాతిగీతాలైన ఆనందగీతాలు, శంకరగీతాలు వర్ణించాడు. బసవని కళ్యాణ పురప్రవేశ సమయంలో పేరణి ప్రస్తావన వుంది. ఇది సౌరాష్ట్రనర్తనాచార్యుల సంప్రదాయానుసారంగా నర్తించినట్లుంది.

ఇంకా పూర్వసంగీతం, తెర తీయడం, దేశిలాస్యంగాలు, ముఖరసం, సౌష్ఠవం, లలి, భావం, ధూకళి, ఝుంకళి, విభ్రమం, రేఖ మొదలైనవాటి ప్రస్తావన కూడా వుంది. ఈ విధంగా సోమనాథుడు ఆనాటి విషయాలను ఎన్నిటినో పొందుపరిచాడని వి. రాఘవన్‌గారు 'తెలుగు సంస్కృతి'లో వుదాహరించారు.





# మాచల్దేవి క్రీడాభిరామం

కాకతీయుల కాలంలో వేశ్యాకులానికి విశేష ప్రాధాన్య ముండేది. వేశ్యల్ని పోషించటం ఆనాటి అధికారవర్గాలు గౌరవంగా భావించేవారు. ప్రతాపరుద్రుని వుంపుడుగత్తె మాచల్దేవి భవనం ఓరుగల్లులో నాటి అత్యంత సుందర భవనాలలో ఒకటి.



## మాచల్దేవి :

మాచల్దేవి గౌరవార్థం వినుకొండ వల్లభరాయుడు క్రీడాభిరామ మనే వీధి నాటకాన్ని రచించగా అది ఓరుగల్లులో ప్రదర్శింపబడింది. రావిపాటి త్రిపురాంతకుడు సంస్కృతంలో వ్రాసిన 'ప్రేమాభిరామం' నాటకాన్ని అనుసరించి తెలుగులో వ్రాయబడిందీ క్రీడాభిరామం. ఈ వీధి నాటకాన్ని శ్రీనాథుడే వ్రాశాడని కొందరు, మరి కొందరు వల్లభరాయుడే వ్రాశాడని వివాద ముంది. ఎవరు వ్రాసినా 14 వ శతాబ్దంలో మొట్ట మొదటగా తెలుగులో వెలువడిన వీధి నాటకం ఇది. ఆ నాటి నట, విట, కవులను గురించి క్రీడాభిరామం నాందీప్రస్తావనలో ఈ విధంగా వర్ణించబడింది.

నటులది దోరసముద్రము - విటులది యొరగల్లు; కవిది వినుకొండమహా
పుటభేదనమనుత్రితయము - నిటు గూర్చెను బ్రహ్మ రసికులెల్లరు మెచ్చన్.

అని ఈ వీధినాటకాన్ని మోపూరిభైరవుని తిరునాళ్ళలో ప్రదర్శించినట్లు తెలుస్తూ వుంది.

ఆనాడు ఓరుగల్లు వుత్సవాలలో ప్రదర్శింపబడిన అనేక వినోద ప్రదర్శనాలను గురించి క్రీడాభిరామంలో వివరించబడింది.

## ఏకశిలానగరంలో ఎన్నో దేవాలయాలు:

ఏకశిలానగర మని పిలువబడే ఓరుగల్లులో ఆనాడు 5500 శివాలయాలు, 1300 విష్ణుదేవాలయాలు, మైలారదేవుడు, దుర్గ, గణపతి, వీరభద్ర ఆలయాలు ఆదిగా వేల

కొలది ఉన్నట్లు స్థానికప్రతాపరుద్ర చరిత్రవల్ల తెలుస్తూంది. ఓరుగల్లులో మైలార దేవుని వుత్సవంనాడు మైలార వీరభటులు చేసే సాహస వీరకృత్యాలు, అతి భయంకరంగా వుండేవి. వీరశైవమతోద్రేకులు మండుతూ వుండే నిప్పుగుండాలలో సాహసంగా దూకేవారు. నారసాలను గ్రుచ్చుకునేవారు. భైరవుని గుడి, చమదేశ్వరి, మహాశక్తి నగరు, వీరభద్రేశ్వరాగారం, బుద్ధదేవుని విహారభూమి, ముసానమ్మగుడి, కొమరుసామయ్య నగరు, పాండవుల గుడి మొదలైన ప్రదేశాలు కాకతీయ ప్రతాపరుద్రుని కాలంలో గొప్ప మహత్తు కలిగిన ప్రదేశాలని ప్రసిద్ధి పొందాయి.



## దిసమొలదేవత ఏకవీరాదేవి:

ఏకవీరాదేవి శైవదేవత. ఏకవీర పరశురాముని తల్లియైన రేణుకాదేవి యని ప్రతీతి. ఈమెను మూహూరం అనే గ్రామంలో వెలసి వుండడంవల్ల మూహూరమ్మ అని పిలిచేవారు. ఈమె నగ్నదేవత. ఈమెను ఆనాడు రాయలసీమలోనూ, తెలంగాణాలోనూ ఎల్లమ్మదేవత అని కూడా పిలుస్తూ వుండేవారు.

ఓరుగంటిలో ఓరుగంటి ఎల్లమ్మ అనే ప్రసిద్ధ దేవత వుండేది. ఈ ఎల్లమ్మనే రేణుక అని కూడా పిలిచేవారు. కాకతీయుల కాలంలో బవనీలు, మాదిగస్త్రీలు ఎల్లమ్మ కథను వీరావేశంతో చెపుతూ వుండేవారనీ, వారు ప్రయోగించే జవనిక జుక జూంజుం జుక జుం జుమ్మంటూ సాగేదనీ, క్రీడాభిరామంలో ఉదహరించబడింది.

వాద్యవైఖరి కడు నెరవాది యనగ ఏకవీరాదేవి యెదుట నిల్చి,
పరశురాముని కథ లెల్ల ప్రౌఢిపాడె చారుతరకీర్తి బవనీల చక్రవర్తి.

## భక్తిపారవశ్యంలో, నగ్ననృత్యాలు:

రేణుకాదేవి జమదగ్నిమహాముని భార్య; పరశురాముని తల్లి. తండ్రి ఆజ్ఞ ననుసరించి పరశురాముడు తన తల్లి తలను ఖండించగా, ఆ తలకాయ మాదిగవాడలో పడిందట. శిరస్సు లేకుండా వున్న విగ్రహం ముందు నగ్ననృత్యంలో పూజిస్తూ

వుండేవారట. నగ్నంగా వున్న ఈ విగ్రహాల ముందు స్త్రీలు కూడా నగ్నంగా పూజిస్తూ నాట్యం చేస్తూ వుండేవారట.

ఈ రేణుకాదేవే. తరువాత ఎల్లమ్మగాను, ఏకవీరగాను ప్రసిద్ధి చెందింది. ఏకవీరాదేవి ఆలయాలు మండపాక, పొలవాస, మాహూరు మొదలైన గ్రామాలలో వెలసి వున్నట్లు క్రీడాభిరామంలో ఉదహరింపబడి వుంది.

కాకతీయ రుద్రమదేవి మొగిలిచర్లలో వున్న ఏకవీరాదేవిని ఆరాధించడానికి వెళుతూ వుండేదట. ఓరుగల్లు పట్టణంలో ఏకవీరాదేవి మహోత్సవాలను కూడా తిలకించేదట.

గొండ్లి అనేది కుండలాకార నృత్యం. గొండ్లి విధానంద్వారా బతకమ్మ, బొడ్డెమ్మల వుత్సవసమయాల్లో పిల్లనగ్రోవు ఊదుతూ, ఆటలు ఆడుతూ, కుండలా కార నృత్యం చేసేవారు.

## గొరగపడుచుల గొప్ప నాట్యాలు:

ఓరుగల్లు మైలారదేవుని పూజల సమయంలో, మైలారదేవుని కొలిచే గొరగ పడుచులు పాటలు పాడుతూ, ఒక సీటిపాత్రలో ఒక వస్తువును వేసి, మొగ్గవాలి వెనుకకు వంగి నాలుకతో ఆ వస్తువందుకుని ఆ విధంగా తమ ప్రజ్ఞలను భక్తి పురస్సరంగా తెలియజేసేవారట. ఈ విధానాన్ని గూర్చి క్రీడాభిరామంలో.

చ. వెనుకకు మొగ్గవాలి కడు విన్ననువొప్పగ దొట్టెనీళ్ళలో
మునిగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చికొంచు లే
చెను రసనాప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుసమలీల నిప్పడుచుపాయము లిట్టివి యెట్లు నేర్చెనో.

ఇక పురుషులు వీరభద్రస్వామిని నెత్తిమీద పెట్టుకుని ప్రభలుగట్టి అడుగుల మడుగులతో, నగారా డోళ్ళు వాయిస్తూ నారసాలు పొడుచుకుని నృత్యం చేసేవారట. వీరిని గురించి —

వీరు మైలారదేవభటులు. గొండ్లి యాడించుచున్నారు. గొరగపడుచు నాడు చున్నది చూడు మూర్ధాభినయము. తాను నెట్టిక సీలంతగాని లేదు.

(క్రీడాభిరామం)

వీరిది శైవసాంప్రదాయం. మైలారలింగస్వామి భక్తులు. వీరు కురుబజాతికి చెందినవారు. వీరి ఇలవేల్పు వీరభద్రస్వామి. ఇంకా కాకతీయుల కాలంలో కోలాటం, గొండ్లి (గర్భ నృత్యం) పేరణి నృత్యం (అంటే కుంభంపై ఎక్కి నృత్యం చేయడం) వుప్పెన పట్టెలాటలు (అంటే చెట్టుపట్టీ) గిల్లదండల ఆట, చిట్టా గోనె, చిల్లగోడె అనే ఆటలుకూడా ప్రచారంలో వుండేవి. శైవసాంప్రదాయంలో నందికోల ఆట అనేది వుంది. అది తెలంగాణాలో ఈనాటికీ కార్తీక మాసంలో జరుగుతూ వుంది. ఈ నందికోల ఆటను గురించి సోమనాథుడు —



కోలాటమును బాత్ర గొండ్లి పేరణియు - గేళిక జోకయు లీల నటింప.
(బసవపురాణం)

జాణలు మెచ్చే జాజరపాటలు :

కాకతీయుల కాలంలో ప్రచారంలో వున్న జాజరపాటలను గురించి నాచన సోమయాజి తన వసంత విలాసంలో.

వీణాగానము వెన్నెలతేట - రాణ మీరగా రమణుల పాట
ప్రాణమైన పినబ్రహ్మణవీట - జాణలు మెత్తురు జాజరపాట.

బ్రాహ్మణవీట జాజరపాట రాణించె వనడాన్ని బట్టి అది ఆనాటి బ్రాహ్మణులలో ఎక్కువ ప్రచారంలో వుందని చెప్పవచ్చు.

ఆ కాలంలో తప్పెట్లు, కాహళాలు, కొమ్ములు, డమాయీలు, బూరలు, శంఖాలు, సన్నాయిలు, డోళ్ళు, చేగంటలు మొదలైన వాద్యాలు ప్రచారంలో వుండేవి.

కాకతీయుల కాలంలో నిర్మాణశిల్పం, విద్య, చిత్రలేఖనం, చేతిపనులు కళలుగా పరిగణింపబడ్డాయి. ప్రతి చెంబుమీదా చిత్రాలు చెక్కేవారు. బట్టలపైన అద్దకంతో బొమ్మలను అద్దేవారు. ఇండ్లగోడలపై చిత్రాలను చిత్రించేవారు. పడుచులు ఇండ్ల ముంగిట ముగ్గులతో రకరకాల చిత్రాలను చిత్రిస్తూ వుండేవారు. ప్రజలు వారి వారి అభిరుచులనుబట్టి, చిత్రపటాలు వ్రాయించుకునే వారు. వీరపూజ అభిలాష గలవారు. వీరుల చిత్రాలను వ్రాయించుకునేవారు.



# నాట్యకళను ఆరాధించిన రెడ్డిరాజులు

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం దానిని ఆశ్రయించుకున్న సామంతరాజులూ, సేనానాయకులూ, స్వతంత్ర రాజ్యాలను స్థాపించారు. అటువంటి వాటిలో రెడ్డి



రాజ్యాలు, వెలమప్రభువుల రాజ్యాలు ముఖ్యమైనవి ఈ కాలంలోనే అటు విజయనగర సామ్రాజ్యం కూడా ఏర్పడింది. వీటిలో రెడ్డిరాజ్యమే ప్రాముఖ్యం వహించింది. రెడ్డిరాజులు ముఖ్యంగా అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరం, కందుకూరు ప్రాంతాలలో క్రీ. శ. 1324 నుండి దాదాపు 1425 వరకు రాజ్యం చేశారు. వారి రాజ్యం కర్నూలు జిల్లానుండి విశాఖపట్టంవరకూ, దక్షిణాన నెల్లూరువరకూ విస్తరించింది.

కొండవీడు గుంటూరుజిల్లాలో ప్రసిద్ధికెక్కిన దుర్గం. దీని చుట్టుకొలత సుమారు ముప్ఫయి మైళ్ళుంటుంది. పర్వతాగ్రమే రెండున్నరమైళ్ళ వరకూ వుంటుంది. పర్వతాగ్రంలో మొత్తం 50 దుర్గాలవరకూ వున్నాయి. క్రింది భాగంలో వుంది కొండవీడు పట్టణం. ఆనాటి ఆ పట్టణం ఈనాడు గ్రామంగా వుంది. శత్రుదుర్భేద్యమై చూచేవారికి ఆశ్చర్యం కలిగించే ఈ దుర్గం కాకతీయాంధ్ర చక్రవర్తుల కాలం నుంచి ముఖ్యరాజధానిగా విరాజిల్లడంవల్ల బహుప్రాచీనమైనదని చెప్పడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

## రెడ్డిప్రభువుల దొడ్డతనం :

కాకతీయ సామ్రాజ్యంలో చివరివాడైన ప్రతాపరుద్రుని దగ్గర కోమటి ప్రోలయరెడ్డి సేనానిగా వుండి మొట్టమొదటగా రెడ్డి సామ్రాజ్యాన్ని స్థాపించి, అద్దంకిని రాజధానిగా చేసుకుని 1324 లో రాజ్యాన్ని పరిపాలించాడు.

ఆయన తరువాత రాజ్యానికి వచ్చినవాడు ప్రోలయవేమారెడ్డి. ఈయన చాలా పరాక్రమం కలవాడు. పండితుల్నీ, కవుల్నీ సన్మానించేవాడు. ఒంగోలు తాలూకా లోని చెదలవాడ వాస్తవ్యుడైన ఎఱ్ఱాప్రెగడ మహాకవిని తన ఆస్థానంలో వుంచు

కుని ఆదరించాడు. ఈ విధంగా ఆయన క్రీ. శ. 1350 వరకూ అజేయంగా పరిపాలించాడు.

ఆయన తరువాత క్రీ. శ. 1366 లో అనపోతారెడ్డి రాజ్యానికి వచ్చి, పదహారు సంవత్సరాలు పరిపాలించాడు. ఈయన చాలా శాసనాలు వ్రాయించాడు. బ్రాహ్మణులకు అనేక దానాలు చేశాడు. ఈయన తరువాత రాజ్యానికి వచ్చినవాడు ఆయన కుమారుడు కుమారగిరిరెడ్డి. క్లుప్తంగా ఇదీ రెడ్డిరాజుల చరిత్ర.



రెడ్డిరాజుల కాలంలో సామాన్య జనులు దొమ్మరిసానుల ప్రదర్శనాలను, వీథి భాగవతాలను చూచి ఆనందించారు. సాతానులు ఏకతారలను చేత ధరించి శ్రావ్యంగా పాటలు పాడుతూ గ్రామాల్లో ప్రతినిత్యమూ యాచిస్తూ వుండేవారు.

## ఆనాటి ఆటపాటలు :

ఆంధ్ర రెడ్డిరాజుల యుగంలో అనేక వినోదాలు అభివృద్ధి పొందాయి. వాటిలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించేవి ఆటలు, పాటలు, నాటకాలు.

ప్రజలు నాటకాలంటే ఎంతో అభిమానంతో వుండేవారు. ఎన్నో నాటకాలు ప్రదర్శించేవారు. కాని ఒక్క నాటకం కూడా సంస్కృత మర్యాదలతో తెలుగులో వ్రాయబడలేదు. ఆనాడు వుద్ధండులైన పెద్ద పెద్ద కవులు కూడా ఎక్కువగా యక్షగానాలనే రచించారు. ఆనాటికి ఉత్తరహిందూస్థానమంతటా సంస్కృత నాటకాల ప్రభావం ఎక్కువగా వుండేది. ఈ పరిస్థితుల్లో దక్షిణ హిందూదేశమంతటా యక్షగానాల ప్రభావం బహుముఖాల విజృంభించింది. నన్నయకంటె పూర్వమే దేశికవితాయుక్తమైన పాటల నాటకాలుగా యక్షగానాలు అభివృద్ధి పొందాయి. యక్షగానాల పుట్టుపూర్వోత్తరాలను గురించి మరోచోట ప్రస్తావించినా ఇక్కడ ఈ యుగంలోనూ వాటిని గురించి ఉదాహరించడం అవసరమే.

## జక్కుల పురంధ్రీకులు :

తెలుగు దేశంలో కామేశ్వర్యాది శక్తిదేవతలను గొలుచు జక్కులవారనే జాతివా రుండేవారు. వీరినే అనేకమంది మన ప్రాచీన కవులు తమ గ్రంథాలలో జక్కుల పురంధ్రీకులు అని వర్ణిస్తూ వచ్చారు. ఈ జక్కుల వారినే యక్షులుగా

వర్ణించారు. కాలక్రమేణా స్త్రీలు పాత్రలు ధరించి అఖండమైన పేరు ప్రతిష్ఠలు తీసుకువచ్చారు. ఆనాటి యక్షగానాలలో నాగి అనే స్త్రీ స్త్రీపాత్రలు ధరించి అఖండమైన పేరుప్రతిష్ఠలు సంపాదించింది.

## పెండెలనాగి :

అగ్రవర్ణపు స్త్రీ గాక తక్కువజాతి స్త్రీ కావడంవల్ల నాగి అనే పేరు వచ్చింది. పెండెలనాగి ప్రదర్శించిన పాత్రలలో ముఖ్యమైంది క్రీడాభిరామంలోని స్త్రీ పాత్ర. క్రీడాభిరామం ఆనాటి వీథినాటకాల్లో ముఖ్యమైంది.

ఆ రోజుల్లో పిచ్చుకుంటలవారు శ్రీనాథుడు రచించిన పల్నాటి వీర చరిత్రను, కాటమరాజు కథను గొల్లవారు, యల్లమ్మ కథను బవనివాండ్రు చెపుతూ ఉండేవారు. ఇలా ఆయా కులాలకు చెందినవారు వారి వారికి ప్రియమైన కథల్ని చెప్పుకుంటూ వుండేవారు.

పైన వుదాహరించిన యల్లమ్మ కథనే బవనివారు రేణుక కథగా చెప్పేవారు. దీనిని విపులంగా, ఒకే కథను రెండు రాత్రుళ్ళపాటు జవనిక (ఈనాటి జముకు) వాయిస్తూ చెపుతూ వుండేవారు. వీరే పెద్దదేవర కథను రాయలసీమ జిల్లాలలో చెపుతూవుండేవారు.

## కర్ణానందమైన కామేశ్వరి కథ :

ఆ రోజులలో అగ్రవర్ణులైన బ్రాహ్మణుల ఇండ్లలో కామేశ్వరి కథను ఎంతో ప్రసిద్ధంగా చెప్పుకుంటూ వుండేవాళ్ళు. కథను ఉదయం ప్రారంభించి, సాయంత్రం వరకూ చెపుతూవుండేవారట. ఇరుగు, పొరుగు అమ్మలక్కలందరూ, ఇండ్లలో పనిపాటలు ముగించుకుని సాయంత్రంవరకూ ఈ కామేశ్వరీ కథను కర్ణానందంగా వినేవారు. అందుకే 'అక్కలు లేచేవరకు నక్కలు కూసె' అనే సామెత వచ్చింది. ఈ కామేశ్వరి కథ ప్రథమంలో బ్రాహ్మణ స్త్రీలద్వారానే ప్రచారంలోకి వచ్చినా క్రమానుగతంగా ఇతరజాతి స్త్రీలలోకి కూడా వ్యాపించి ఇంకా ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. ఈ కథ ఆంధ్రదేశంలో గుంటూరు, కృష్ణాజిల్లాలలో బాగా వ్యాపించింది. ఈ కామేశ్వరికథను జక్కులవారు కూడ బహుళప్రచారంలోకి తెచ్చారని క్రీడాభిరామంలో వుదాహరించారు.

## కామేశ్వరీ కథే కామవల్లీ కథ:

పైన ఉదహరించిన కామేశ్వరి కథే క్రమానుగతంగా కామవల్లి కథగా పరిణామం చెందింది. దీనిని మోటతోలేవారు, కలుపుతీసేవారు, కోతలు కోసేవారు, వడ్లు దంచేవారు, తిరుగళ్ళమీద పిండి విసిరేవారూ ఎక్కువగా పాడుకునేవారు. ఆ విధంగా వారు కాలాన్ని వెళ్ళబుచ్చుతూ, కష్టాన్నీ, అలసటనీ మరచిపోయి ఆనందంగానూ, ఆహ్లాదంగానూ ఆయా పనులు పూర్తి చేసుకునేవారు.



## గొండ్లియాడే కుండలాకార నృత్యం:

పూర్వంనుంచీ కవిత్వంలోనూ, సంగీతంలోనూ దేశివిధానం, మార్గవిధానం అనే రెండు భిన్నరీతులు ఏర్పడివున్నట్లు తెలుసుకున్నాం. అందులో దేశినృత్యాలే ప్రజలకు అతిసన్నిహితంగా వ్యాప్తిలోకి వచ్చాయి. పురుషులు కోలాటంవేస్తూ, చిరతలు మ్రోగిస్తూ, చిందులు త్రొక్కుతూ నోటితో పాటలు పాడేవారు. అలాగే స్త్రీలు వలయాకారంగా చప్పట్లు చరుస్తూ బతకమ్మ పాటలు పాడేవారు; ఈ బతకమ్మ పాటలు ఆనాడే, తెలంగాణాలో విశేషప్రచారంలో వున్నాయి.

అదేవిధంగా రాయలసీమలో బొడ్డెమ్మ కథ ప్రచారంలో వుండేది. గొండ్లి అనే కుండలాకారనృత్యంద్వారా బతకమ్మ, బొడ్డెమ్మ పాటల్ని తెలంగాణాలో వున్న మైలారదేవుని పూజలసమయంలో పాడుతూ ప్రజ్ఞలను తెలియజేసేవాళ్ళు.

## కుమారగిరిరెడ్డే కర్పూర వసంతరాయలు:

రెడ్డిరాజులలో చివరిరాజు కుమారగిరిరెడ్డి. ఈయన క్రీ. శ. 1386 నుండి 1402 వరకూ - కొండవీడు రాజధానిగా - ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రసిక ప్రభువు. ఈయనను ధర్మవేముడని పిలిచేవారు. ఈయన కవుల కవిత్వాన్ని మెచ్చి అనేక పారితోషికాలు బహూకరించేవారు. కుమారగిరికి వసంతరాయలని, కర్పూర వసంతరాయలని రెండు బిరుదు లుండేవి. కుమారగిరి స్వయంగా పండితుడు; సంగీత నాట్యశాస్త్రాల్లో ప్రవీణుడు. వసంతరాజీయం అనే నాట్యశాస్త్ర గ్రంథం వ్రాసినట్లు కూడ కాటయవేమారెడ్డి రచించిన శాకుంతలవ్యాఖ్యవల్ల తెలుస్తూంది.

మునీనాం భరతాదీనాం భోజాదీనాంచ భూభుజాం
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినా
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరి భూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమం.

ఈ వసంతరాజీయం మనకు ఇంతవరకూ లభించలేదు. ఈయన ప్రతి సంవత్సరం వసంతోత్సవాలు వాసిగా జరిపిస్తూ వుండేవాడు.

## వాసిగాంచిన వసంతోత్సవాలు:

విజయనగర సామ్రాజ్యంలో, కృష్ణదేవరాయల కాలంలో, రాజధానిలో మహర్నవమిరోజున వసంతమండపంలో వసంతోత్సవాలు ఎంతటి మహావైభవంతో జరిగేవో అలాగే వేమారెడ్డి ఆస్థానంలోకూడ జరిగేవి. ఈ సమయంలో రాజ్యం నాలుగు ప్రక్కలనుంచీ, కవుల్నీ, గాయకుల్నీ, వాద్యకారుల్నీ ఆహ్వానించి, మహా వైభవంగా వసంతోత్సవం ముగించేవారు. అందుకేఆయనకు వసంతరాయ, కర్పూర వసంతరాయ బిరుదు లీయబడ్డాయి.

## ప్రతిభకు పట్టాభిషేకం, పలు దానాలు:

సంగీత సాహిత్యాలతో వినోదించే వేమారెడ్డి ప్రతిభావంతులైన కళాకారు లందర్నీ తగు విధంగా సన్మానించాడు. సంగీతసాహిత్యాల్లోనూ, భరతనాట్య శాస్త్రంలోనూ ప్రావీణ్యం కలిగిన కంచి, పొన్ని, పేరి మొదలైనవారిని సన్మానించిందేకాక పేరి అనే నర్తకికి గుంటూరు జిల్లాలో వున్న పేరుకలపూడి అనే గ్రామం గ్రామాన్నే దానంగా ఇచ్చాడు.

అలాగే కంచి అనే దేవదాసిక - నాట్యగత్తెకు - "కంచికచర్ల" అనే గ్రామాన్ని బహూకరించాడు.



పొన్ని అనే కళాకారిణికి పొన్నవరం అనే గ్రామాన్నిచ్చి, జీవితపర్యంతమే కాక వంశపారంపర్యంగా అనుభవించడానికి హక్కు కలిగించాడు.

ఆయన చేసిన దానధర్మాలను గురించీ, ఆయన విద్యాభిలాషను గూర్చీ, కళాపోషణగూర్చి స్థానికంగా వున్న కొండవీటి చరిత్రలో

సువర్ణాక్షరాలతో లిఖించి వుందని కోన వెంకటరాయశర్మగారు 'భారతి' పత్రికలో వుదాహరించారు. అంతేగాక శాలివాహన శకం 1300 నాటి వానపల్లి శాసనంలో కూడా ఆయన సంస్థానంలో నిరంతరం జరిగే కార్యక్రమ ప్రణాళిక లన్నీ లిఖింపబడి వున్నాయి.



ఈ విధంగా ఆయన కొండవీటి రాజ్యాన్నిబహు పరాక్రమం తోనూ, సకల కళావిశిష్టతలతోనూ పరిపాలించాడు. ఆయన అనంతరం ప్రోలయ దేవుని తమ్ముని కొడుకు పెదకోమటి వేమారెడ్డి రాజ్యానికి వచ్చాడు. ఈయన సంస్కృతాంధ్ర భాషల్ని రెండింటినీ కలిసికట్టుగా పోషించాడు. ఈయన విద్వత్తుకు మెచ్చి ఈయనకు సర్వజ్ఞ చక్రవర్తి అనే బిరుదుకూడ ప్రసాదించబడింది.

## వేమారెడ్డి రచనలు ఎన్నెన్నో:

ఈయన శృంగారదీపిక - అమరుశతక వ్యాఖ్య వ్రాసి దక్షిణ హిందూదేశ మంతటా ప్రఖ్యాతిపొందాడు. కుమారస్వామి, సాహిత్యచింతామణి అనే అలంకార శాస్త్రాన్ని రచించి ప్రఖ్యాతి పహించాడు. అంతేగాక 'సంగీత చింతామణి', 'వీర నారాయణ చరిత్ర', శృంగారభూషణం', 'రఘునాథాభ్యుదయం', 'వేమభూపాల చరిత్ర', 'శబ్దరత్నాకరం' మొదలైన అనేక గ్రంథాలను కూడ రచించారు.

ఈ విధంగా కోమటి వేమన క్రీ. శ. 1420 వరకూ పరిపాలించాడు. రాజ్యంలో శాంతిభద్రతల్ని నెలకొల్పిన కాటయవేముని బావమరదియైన కుమారగిరి రెడ్డి పరిపాలనా బాధ్యతలన్నీ కాటయవేమనకు నప్పజెప్పి తాను మాత్రం వసంతోత్స వాలతోనూ, కవులతోనూ, కళాకారులతోనూ, నిత్యకళ్యాణంగా పచ్చతోరణంగా కొండవీటి సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. కుమారగిరి రత్నసింహాసనాధ్యక్ష, జగద గోపాలరాయ, వేశ్యాభుజంగ, పల్లవాదిత్య, త్రిలింగాధీశ్వర జంబూద్వీపేశ్వర బిరు దాంకుడు. ఈయన బాపట్ల భావనారాయణస్వామి దేవదాసియైన పల్లెమకు బుట్టిన లకుమాదేవి ప్రియుడు. ఆయనవద్ద సేనానిగా వున్న దొరపరెడ్డిసేనాని లకుమాదేవిని కుమారగిరికి కానుకగా అర్పించాడు.

## అపర నాట్య సరస్వతి లకుమాదేవి:

లకుమాదేవి కుమారగిరి ప్రేయసి. అందాలరాణి. చక్కదనాలచుక్క. అపర నాట్య సరస్వతి. కుమారగిరి ఆస్థానంలోని కవి, గాయక, శిల్పి, సామంతాది

మహాజనుల సమక్షంలో తన అభినయచాతుర్యంతో, అందచందాలతో అందర్నీ ముగ్ధుల్ని చేస్తూ, ఆస్థానానికి ఒక నూతన శోభను చేకూరుస్తూ వుండేది. అనేకమంది పేదసాదలకు ధనాన్నీ, వస్త్రాలనూ దానంచేస్తూ వుండేది. అందుకే కాటయవేమన తన శాకుంతల వ్యాఖ్యానంలో ఈ విధంగా వుదాహరించాడు.

జయతి మహిమా లోకాతీతఃకుమారగిరిప్రభో
స్సదసి లకుమాదేవీ యస్య ప్రియాసదృ శ్రీప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థా వర్థివ్రజాయ సహస్రశః.

అని వ్యాఖ్యానించాడు. లకుమాదేవి రాజనర్తకియేకాక. కొమరగిరి ప్రియా సదృశప్రియయట. లకుమనుగూర్చి ఇంతకు మించిన ఆధారాలు చరిత్రలో లేవని కీ॥ శే॥ శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు బహు పరిశోధనచేసి ఇంగ్లీషులో 'హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్' అనే రెడ్డిరాజుల యుగాన్ని చిత్రించిన మహా గ్రంథంలో వ్రాశారు.

ఆనాడు ద్రాక్షరామ భీమేశ్వరునికి అఖండ దీపాన్ని వెలిగించడం ఎంతో పుణ్యకార్యంగా ఎంచబడేది. ఆ కారణంచేతనే లకుమాదేవి క్రీ. శ. 1402 లో తన తల్లిదండ్రులకు పుణ్యావాప్తికోసం అఖండదీపదానంచేసి విఖ్యాతి పొందింది.

## కుమారగిరి లకుమల వసంతోత్సవ విహారాలు:

కుమారగిరీ, లకుమాదేవీ వసంతోత్సవంలో అతి మనోహరంగా విహరిస్తూ వుండేవారట. లకుమ తన నృత్య ప్రదర్శనాలతో, అంగసౌష్ఠవంతో, వయ్యారపు నడకలతో, వివిధ నాట్య భంగిమలతో అజంతా సుందరిలా కుమారగిరిని, ప్రేక్షకులను ముగుల్ని చేసేదట. కుమారగిరి తన భార్యలతోపాటు లకుమాదేవితోనూ, తదితర అంతఃపుర స్త్రీలతోనూ జల క్రీడలు ఆడుతూ వుండేవాడు. ఈ క్రీడ లన్నీ గృహరాజ సౌధంలో జరిగేవి. కుమారగిరి లకుమల ఆనందభవనం కూడా ఇదే. కొండవీటిలో ఒక దిబ్బ గృహరాజదిబ్బ అనే పేరుతో కుమారగిరి



లకుమల చిహ్నంగా వెలుగొందుతూ వుంది. ఆనందకేళీ విలాసాలతో ఆ ప్రేయసీ ప్రియులు ఇరువురూ ఏకకాలంలో అనంతకాలగర్భంలో కలిసిపోయారు.



ఈ విధంగా కొండవీటి సామ్రాజ్యంలో నాట్యకళా సరస్వతి దేదీప్యమానంగా వెలుగొందింది.

ఇంచుమించు రెడ్డి రాజన్యులందరూ కూడ గొప్ప విద్వాంసులు. సకల కళాభిజ్ఞులు, కవి, పండితపోషకులు. వారిలో కొందరు సంగీత సాహిత్యాలలో అపారమైన ప్రజ్ఞకలవారు.

రాజమహేంద్రవరాన్ని ఏలిన అల్లయవీరభద్రారెడ్డి సంగీత, సాహిత్య విద్యలలో సర్వజ్ఞతను సంపాదించినవాడు.

శివలింగారెడ్డి నాట్యశాస్త్రపారంగతుడు. మల్లారెడ్డి పౌత్రుడైన శ్రీ గిరిరెడ్డి గొప్ప కళావిమర్శకుడే కాక సంగీత సాహిత్యాలలో ప్రవీణుడు.

## కొండవీటిని వర్ణించిన శ్రీనాథ కవి:

రెడ్డిరాజుల యుగంలో వర్ధిల్లిన శ్రీనాథమహాకవి పరరాజుల్ని దర్శించినప్పుడు కొండవీడు మహావైభవాన్ని గురించి ఈ విధంగా వర్ణించాడు.

పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీల గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్యబలముల బంధించు గురుతైన యురిత్రాడు కొండవీడు
ముగురును రాజులకు మోహంబు బుట్టించు కొమరుమించిన వీడు కొండవీడు
చటుల విక్రమకళాసాహసం బొనరించు కుటిలారులకు గాడు కొండవీడు
జవనఘోటక సామంతసరసవీర భట, నటానేక, హాటకప్రకటగంధ
సింధురార్భటీ మోహన శ్రీల దనరవ కూర్మి నమరావతికి జోడు కొండవీడు.

## ప్రజ్ఞానాథుడు శ్రీనాథుడు:

శ్రీనాథుడు 1385-1475 మధ్య జీవించిన మహాకవి. ఆయన జీవితంలో చాలాభాగం కొండవీడు, రాజమహేంద్రవర రెడ్డిరాజుల వద్దనే గడిచిపోయింది.

ఈయన ఆస్థానకవిగా వుండి కాశీఖండం, భీమఖండం, శృంగారనైషధం, హరవిలాసం మొదలైన శృంగార కావ్యాలను రచించిన మహాకవి. విజయనగర ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో వున్న గౌడడిండిమ భట్టు నోడించి, కంచుఢక్కను పగులకొట్టించిన ఉద్దండుడు. నానారాజసందర్శనం చేసి ఆనాటి సమాజంలో వున్న సాంఘికాచారాలను, ప్రజల జీవితవిధానాలను, లలితకళా వికాసాన్ని కళ్ళకు కట్టినట్లు తన గ్రంథాల ద్వారా తెలియజేశాడు. నలగామరాజు దర్బారులో జరిగిన సంగీత నృత్యవాద్యాది విశేషాలను పల్నాటిచరిత్రలో పేర్కొన్నాడు. 14 వ శతాబ్దపు చివరనుంచీ, 15 వ శతాబ్దపు ప్రారంభంలోనూ యక్షగానాలను గురించి వర్ణిస్తూ భీమఖండంలో "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని యక్షగానాలను గురించి పొగిడాడు. అంతేగాక, ఒక వేశ్యవేషం ధరించి ద్రాక్షారామవీథుల్లో భిక్షాటన చేసినట్లు భీమేశ్వరపురాణంలో —



సాని ఈశానియై మహోత్సవమునందు - గేల నవచంద్రకాంతంపు గిన్నె పూని
వీధి భిక్షాటనమొనర్చువేళ జేయు మరులు నృత్యంబు జగముల
మరులగొలుపు.

అని వివరించాడు.

జాదర గీతాలు :

శ్రీనాథుని కాలంలో భోగమువారు కనకవీణలను మీటుతూ, భీమనాథుని గూర్చి 'జాదర జాదర' అనే పల్లవితో మృదువుగా పాడేవారని వర్ణించాడు. ఇది వెన్నెల రాత్రుల్లో మరీ ఆహ్లాదకరంగా వున్నట్లు భీమఖండంలో వివరించాడు.

జాదరజాదరంచు మృదుచర్చరిగీతలు వారుణీ రసా
స్వాదమదాతిరేకముల చంద్రికకాయగ దక్షవాటికా
వేదుల మీఁదటన్ కనకవీణలుమీటుచు పాడి రచ్చరల్
మోద మెలర్పగా భువనమోహనవిగ్రహు భీమనాథునిన్.

శ్రీనాథుడే కాశీఖండంలో, అనేక వాద్యాది విశేషాలతో ఆనాడు ప్రదర్శనాలు ప్రదర్శించినట్లు వర్ణించాడు.



వల్లకి చక్కి కాహళము వంశము
ఢక్క హుడుక్క ఝర్ఝరుల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్ద
పరంపర తాళశబ్దమై
యుల్లసిలం బ్రబంధముల కొప్పగ
నాడుదు రగ్రవేదిపై
బల్లవపాణు లీశ్వరుని బంటుమహేశులు పూజ సేయగన్.

నాట్యంలో దేశి, మార్గనృత్యాలను గురించి శ్రీనాథుడు కాశీఖండంలో ఉదాహరించాడు. జక్కిణిచిందు అనీ అది దేశీయ నృత్యమనీ దశావతార చరిత్రలో ఈ విధంగా వర్ణించాడు.

దురుపదంబులు సొక్కు మైసిరుల నొసగ -
సరిగ నిరుగెల కుంచియల్ సవదరించి
పెక్కువగ జక్కిణీకో పుద్రొక్కె నొక్క -
జక్కని మితారి నరపతుల్ సొక్కిచూడ.





# విజయనగరరాజుల కళా విన్యాణం

కాకతీయ రాజ్యపతనానంతరం ఆంధ్రదేశమంతా మహమ్మదీయ దండయాత్రలకు లొంగిపోయే ప్రమాదం ఏర్పడింది. ఈ మహమ్మదీయ దండయాత్రల్ని జయప్రదంగా ప్రతిఘటించి, ఆంధ్రదేశాన్ని మాత్రమే కాక, దక్షిణ హిందూదేశాన్నంతా ఒకే త్రాటిమీద నడిపిన ఘనత హంపీ విజయనగర రాజులకు దక్కింది.



హంపీ విజయనగర రాజ్యాన్ని స్థాపించిన హరిహరరాయలు, బుక్కరాయలు దక్షిణ హిందూదేశంలోని ఆంధ్ర కర్నాటక తమిళ ప్రాంతాలన్నిటినీ ఒకే సామ్రాజ్యం క్రింద వ్యవస్థీకరించినప్పుడే మహమ్మదీయుల దండయాత్రల్ని జయప్రదంగా ప్రతిఘటించగలమని గ్రహించారు. ఈ ముస్లిం దండయాత్రలవల్ల నానాహింసలూ అనుభవిస్తున్న ప్రజలు కూడా ఈ ప్రయత్నాన్ని బలపరిచారు.

## హరిహరుని హంపి:

విజయనగర సామ్రాజ్య సంస్థాపకులైన హరిహరరాయలు, బుక్కరాయలు అన్నదమ్ములు. ప్రతాపరుద్రుని బంధువులు. ప్రతాపరుద్రుని ఆస్థానంలో వున్న ప్రధానోద్యోగులు. కాకతీయరాజ్య పతనానంతరం వీరిద్దరూ ఆనెగొంది వెళ్ళారు. ఆంధ్ర కన్నడ సరిహద్దులలో, తుంగభద్రాతీరంలో సహజరక్షణ కుపయోగపడే అనేక కొండలవరుసల మధ్యభాగంలో విద్యానగర పట్టణాన్ని హరిహరరాయలు స్థాపించాడు. ఈ సామ్రాజ్య స్థాపనకు మాధవవిద్యారణ్యస్వామి కూడా సహాయపడ్డాడు. హిందూ సంస్కృతీ, మతమూ రక్షింపబడాలనే ఆశయంతో విజయనగర సామ్రాజ్యసంస్థాపన 1336 లో జరిగింది. ఈ సామ్రాజ్యం వర్ధిల్లిన కాలాన్ని మూడు దశలుగా విభజించవచ్చు.

(1) 1336 నుండి 1480 వరకు ప్రథమదశ. ఈ దశలో విజయనగర రాజ్యం కన్నడ, తమిళ ప్రాంతాలనూ, రాయలసీమనూ ఆక్రమించుకున్నది.

(2) 1480 నుండి 1550 వరకూ ద్వితీయదశ. ఈ దశలో తెలంగాణా మినహా, ఆంధ్రదేశమంతా కృష్ణదేవరాయల పరిపాలన క్రింద వుంది.

(3) 1550 నుండి 1650 వరకూ మూడవదశ. ఇది పతనావస్థకు సంబంధించిన కాలం.

## తలవంచని వీరులు:

కృష్ణదేవరాయల మరణానంతరం 1565 వరకూ విజయనగర సామ్రాజ్యం మహోజ్వలంగా సాగి చివరకు తళ్ళికోట యుద్ధంలో దెబ్బతింది. దక్కను సుల్తానులందరూ ఏకమయ్యారు. రామరాజును చంపి అతని సైన్యాన్నంతా చెల్లాచెదరు చేసివేశారు. అయినా విజయనగర సేనల బలాధిక్యత ఏ మాత్రం క్షీణించక తిరుమల దేవరాయల నాయకత్వాన పెనుగొండను రాజధానిగా జేసుకొని రాజ్యపరిపాలన సాగించారు. అతని అనంతరం శ్రీరంగరాయలు దుర్బలుడవడంవల్ల రాజధానిని తిరుపతి దగ్గర ఉన్న చంద్రగిరికి మార్చుకున్నాడు. ఈ విధంగా క్రీ. శ. 1630 తరువాత విజయనగరసామ్రాజ్యం అంతరించింది. విజయనగరసామ్రాజ్యాన్ని పరిపాలించిన రాజులలో అనేకమంది లలితకళలను ఎంతగానో పోషించారు.

## విదేశీయులు మెచ్చిన విజయనగరం:

హంపివిజయనగరం ఒక కళాకేంద్రంగా వికసించింది. 15, 16 శతాబ్దాలలో, విజయనగర సామ్రాజ్య పరిపాలనాకాలంలో ఇతర దేశాల నుంచి వచ్చిన అనేకమంది రాయబారులూ, వ్యాపారులూ, యాత్రికులూ ఈ విజయనగరాన్ని దర్శించారు. విజయనగరం కళావైభవాలనుగూర్చి, శిల్పకళావైదగ్ధ్యాన్ని గూర్చి వారివారి దినచర్య పుస్తకాలలో ఉదాహరించుకున్నారు. పీట్రోడెల్లా అనే పోర్చుగీసు దేశస్థుడు విజయనగరాన్ని దర్శించాడు. ఈ వివరాలను కలకత్తా వాస్తవ్యుడు బి. జి. పాల్ 1934 లో 'సోషల్ అండ్ పొలిటికల్ లైఫ్ ఇన్ విజయనగర' అనే గ్రంథంలో ఈ క్రింది విధంగా వివరించాడు.



## కోలాహలంగా, కోలాటాలు:

పీట్రోడెల్లా వసంతోత్సవాలను సందర్శించాడు. వసంతోత్సవాలు మహా

ర్నవమి రోజున తుంగభద్రాతీరంలో జరిగేవి. ఆ వుత్సవాలలో ఆయన ఒక కోలాట నృత్యాన్ని చూశాడట. అది విజయనగరం రాజవీథిలో వూరేగింపులో అది మేళ



తాళాల కోలాహలంతో నిండివుందట. జనసమ్మర్దంతో వీథి అంతటా త్రొక్కిసలాటగా వుందట. ఊరేగింపు సాగిపోతూ వుండగా, ఒక వినోద కార్యక్రమం తరువాత మరో వినోదానికి సంబంధించిన సమూహాలు వస్తూండేవట. ఇంతలో ఒక కోలాట బృందం వచ్చేదట. అందరి చేతుల్లోనూ, వివిధ రంగులతో చిత్రింపబడిన కోలాట కఱ్ఱ లున్నాయట. తలగుడ్డలతో సకల వర్ణశోభితంగా రంగుల రంగుల ఈకెలు ధరించి వారు చూడసొంపుగా వున్నారట. బృందానికి హంగుగా జంత్రవాద్యాలు మ్రోగుతూవుండగా లయప్రకారం బృందమంతా పాట పాడుతూ, మధ్య మధ్య 'కోలే. కోలే' అనే కేకలతో అడుగు వేశారట. కోలే కోలే అంటే ఆయనకు ఏమీ అర్థం కాలేదట. కాని, అది ఒక అందమైన మాటై వుండవచ్చని సూచించాడు.

## అబ్దుల్ రజాక్ చెప్పిన అద్భుత విషయాలు:

ఇమ్మడి ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1423, క్రీ. శ, 1446 వరకూ రాజ్య పరిపాలన చేశాడు. విజయనగరాన్ని పరిపాలించిన సంగమవంశరాజులలో ప్రౌఢ దేవరాయలు అగ్రగణ్యుడు. ఈయన కాలంలోనే విజయనగరరాజ్యం మహోన్నత స్థితికి వచ్చింది. ఈయన ఆస్థానంలోనే శ్రీనాథమహాకవికి కనకాభిషేకం జరిగింది. ఈయన కాలంలో 1443 లో అబ్దుల్ రజాక్ విజయనగరాన్ని చూడవచ్చి ఆ పట్టణ వైభవాన్ని, ప్రౌఢదేవరాయల మహోన్నత స్థితిని వర్ణించాడు. ఆయన విజయనగర కళావిశిష్టతలను గురించి కొన్ని విషయాలను గ్రంథస్థం చేశాడు. ఈయన పారశీక దేశం నుండి వచ్చాడు.

విజయనగర రాజభవనంలో దసరా మహోత్సవాలు అత్యంత వైభవంగా జరిగినట్లు అబ్దుల్ రజాక్ వర్ణించాడు. అంతేగాక ఆ మహోత్సవ సమయంలో అద్భుత నాట్యప్రదర్శనాలు జరిగినట్లు పేర్కొన్నాడు. ఆ మహోత్సవాలు జగే స్థలానికి. మంటపాలకు నడుమ చక్కగా తీర్చిన ఖాళీస్థలం కలదట. అందు గాయకులు గానంచేశారట. కథకులు కథలు చెప్పారట. గాయకురాండ్రలో చాలామంది యవ్వనంలో వున్న కన్యకలేనట. వారి బుగ్గలు చంద్రునివలె వుండి, వారి ముఖార

విందాలు వసంతాన్ని అతిశయించిన శోభతో వెలుగొందుతున్నాయట. వారు ధరించిన దుస్తులు సొగసుగా వున్నాయట. వారి రూపాలు, క్రొత్తగా విచ్చిన గులాబిపువ్వు ల్లాగ, మనసుకు అమితానందాన్ని కలిగించాయట.

వారు రాయల కభిముఖంగా వున్న తెర మరుగున కూర్చుండి వున్నారట. మండపం రంగు రంగుల దీపాలతో చిత్రవిచిత్రంగా నగిషీ చెక్కబడిన చలువరాతి స్తంభాలతో వుందట. దానికి ముందు మిలమిల మెరుస్తూన్న ఒక తెర వుందట. మండపానికి ఎదుట వున్న తొమ్మిదంతస్తుల మేడలోని ఏడవ అంతస్తులో మహా రాజు కూర్చుని చూస్తున్నాడట. తెర కదిలి రెండు భాగాలుగా విడిపోయిందట. వెంటనే ఆ సుందరాంగులు ఆత్మలు ఆనందపరవశమయ్యేటట్లు, లలిత విన్యాసాలతో నృత్యం చేయడం ప్రారంభించారని, ఆ నటుల గానమాధుర్యం, నటనాసౌందర్యం ఆస్వాదించి చూసి విస్తుపోయారని, ఒడలు మైమఱచినట్లయిందని వివరించాడు.

## పగటివేషాలతో పగను సాధించారు:

మొదటి దేవరాయలు (క్రీ. శ. 1406-1422) విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన రోజులలో పెరిస్తా అనే మహమ్మదీయ చరిత్రకారుడు విజయనగర రాజుల నాటకకళా ప్రాముఖ్యాన్నీ, రాజకీయమైన ఒక అపూర్వసంఘటననూ గురించి గ్రంథస్థం చేశాడు. వివరాలను ఈ క్రింది విధంగా వివరించాడు.

ముదగల్లు రాయచూర్లపై ఆధిపత్యాన్ని గురించి అనాదినుంచీ విజయనగర రాజులకు, మహమ్మదీయులకు తీవ్రయుద్ధాలు జరుగుతూ వుండేవి. విజయనగర రాజులకు కళలపట్ల గల కాంక్షను ఆసరాగా తీసుకుని మహమ్మదీయులు ఒకనాడు చక్కని ఉపాయం ఆలోచించారు.

విజయనగరం వారి నాటకాలలో నటించే వేశ్యల్ని లోబరచుకుని, ఆ వేషాలు తామే ధరించుకుని కోటలో ప్రవేశించారు. నాటక ప్రదర్శనంలో ఒక సన్నివేశంలో కత్తియుద్ధం కూడా వుందట. తరుణం వచ్చిన వెంటనే ఈ వేషధారులు బూటకపు నటనకు స్వస్తి చెప్పి ప్రత్యక్ష హత్యాకాండకు పుపక్రమించి ప్రేక్షకులుగా కూర్చున్న రాజకుటుంబాన్ని వధించి కోటను వశపరుచుకున్నారట.



శ్రీకృష్ణదేవరాయలు 1513 లో చైత్రయాత్రలను ముగించుకుని వచ్చిన తరువాత మహర్నవమిదిబ్బను నిర్మించాడు. ఇది ఒక బ్రహ్మాండమైన కట్టడం. ఈ సింహాసనవేదిక మీద రాయలు ఆసీనుడై దసరావేడుకలను తిలకించేవాడు. ఈ వుత్సవం సెప్టెంబరు నెలలో (ఆశ్వయుజ మాసంలో) తొమ్మిది రోజులపాటు జరుగుతుండేది. ప్రభువులు, సామంతరాజులు, దండనాయకులు, రాణివాస స్త్రీలు, దేశం నాలుగు చెరగులనుంచీ వేలాది ప్రజలు ఈ వేడుకలను చూడడానికి వస్తూవుండేవారని విదేశ యాత్రికుడైన న్యూనిజ్ తెలియజేస్తున్నాడు.

## మహర్నవమి దిబ్బమీద మహానాటకాలు :

విజయనగర వైభవాన్ని దర్శించవచ్చిన విదేశయాత్రికులలో ఒకడైన పేయస్ తాను రచించిన వృత్తాంతంలో నాటి నాట్యశాలను గురించి మిక్కిలి ప్రశంసించాడు. నర్తనశాల సుదీర్ఘమైంది. కాని అంత వెడల్పైనది కాదు. దాని ఇరుప్రక్కలా శిల్పరమణీయమైన శిలాస్తంభా లున్నాయట. ఆ స్తంభ ఫలకాల మీద నాట్యాంతంలో వుండవలసిన సరియైనతీరులతో నాట్యకత్తెల రూపాలు చెక్కబడి వున్నాయట. నృత్యం అభ్యసించేవారు నృత్యాంతంలో తాముండవలసిన వైఖరిని మఱచిపోయిన యెడల ఈ శిల్ప చిత్రాలను చూచి దానిని జ్ఞప్తికి తెచ్చుకునేవారట.

ఇంకా నర్తనశాల చివరి భాగంలో వివిధ చిత్రాలతో కూడిన ఒక ఏకాంత స్థల ముందట. అక్కడ నృత్యానంతరం అలసట తీర్చుకొనడానికి నాట్యకత్తెలు తమ శరీరాలను, కాళ్ళను చక్కజూపి సడలించుకోవడానికై ప్రేలాడేవారట. శరీరం అన్నివంపులూ అవలీలగా తిరగటానికి అనువుగా ఇక్కడ అభ్యాసం చేసేవారట.

పేరొక ప్రక్కన ప్రదర్శనాన్ని దర్శించడానికి వచ్చిన రాజు కూర్చునే ప్రదేశంమీదా, నేలమీదా, గోడలమీదా, బంగారు రేకులు తాపబడి ఉన్నాయట. గోడనడిమిభాగంలో, పన్నెండేళ్ళ బాలిక ప్రమాణం కలిగిన ఒక సువర్ణ విగ్రహం వుందట. ఆ విగ్రహం చేతులు నాట్యకత్తెకు నాట్యాంతంలో వుండవలసిన తీరులో వున్నాయట.



## వైభోగం ఒలికే భోగం మేళాలు :

పేయస్ ఇంకా ఇలా వ్రాశాడు. భోగం స్త్రీలకు రాజభవనాలలో విరాఘాటంగా ప్రవేశముండేదట. హజారరామాలయంలో వివిధ భూషణాలతో మురుస్తూ వున్న సానులను స్తంభాలపై తీర్చి దిద్దారట. వాటిని చూడగా కొంతమంది బిఱ్ఱులాగులు తొడిగి వాటిపై లంగాలను కట్టారట. దేవీ నవరాత్రులలో ప్రతి ఉదయం, భువనవిజయంలో, రథోత్సవాలు అన్నిటిలోనూ, దేవాలయాలలో ప్రతి శనివారమూ వారు నృత్యం చేయవలసినవారై యున్నారట. నృత్యం నేర్పే గురువులకు రాయలవారు కొన్ని ఈనాములు ఇచ్చియున్నారట.



## వసంతోత్సవ వైభోగం :

నేటి హోలీ పండుగను రాయల కాలంలో వసంతోత్సవమని పిలిచేవారని మొదటి దేవరాయల కాలంలో విజయనగరం వచ్చిన నికోలోకాంటి ఉదాహరించాడు. ఆయన దానిని గురించి ఈ విధంగా వర్ణించాడు. వసంతోత్సవ దినాలలో వీథుల్లో ఎరుపురంగు నీరు ఉంచేవారట. వీథులలో వచ్చిపోయే వారందరిపైనా ఎవరు బిడితే వారు రంగునీరు చల్లుతుండేవారట. చివరకు రాజు కాని, రాణి కాని, ఆ దారిన వెళ్ళితే చాలు అందరిపైనా ఈ వసంతం వర్షించిందన్నమాటే! ఈ వసంతోత్సవ కాలంలో అన్ని ప్రాంతాలనుండి కవులను రప్పించి వారి కవితలు విని ఆనందించి వారికి బహుమానాలు ఇస్తూ వుండేవారని ఆ పట్టణ వైభవాన్ని పరిపరి విధాల వర్ణించాడు.

## కోలాటపు కోలాహలం :

క్రీ. శ. 1514 లో విజయనగరాన్ని సందర్శించిన బర్బోసా ఇలా వ్రాశాడు: రాయలవారికి ప్రతిదినం స్త్రీలే కడవలతో నీరు తెచ్చి స్నానం చేయించి, పాటలు పాడేవారట. చక్రవర్తి దర్బారులోనూ కమ్మ కమ్మగా గానం చేసేవారట. ఆనాటి శిలా శిల్పాలలో నృత్యాలు, వాద్యవాదనలు, కోలాటం మొదలైనవి కోలాహలంగా జరిగిన చిహ్నాలు కనిపిస్తాయి. ఆనాడు భోగంసానులు సంగీత విద్యలో ప్రత్యేక

కృషి చేసేవారట. అంతేకాక తమ పిల్లలకు పది సంవత్సరాల ముందునుంచే నృత్య విద్యను నేర్పేవారట.



నూయల్ అనే ఆయన విజయనగరం లోని ఒక నాట్యశాలను గురించీ, నర్తకులు తమ ఆంగసౌష్ఠవాన్ని పెంపొందించుకోవ డానికి ప్రతిరోజూ చేసే అభ్యాసపరిశ్రమల్ని గురించీ 'ది ఫర్గాటన్ ఎంపైర్' అనే గ్రంథంలో ఉదహరించాడు.

## ప్రయోగం పసగడితేనే రంగంపై రాణింపు :

నాటకప్రయోగం విషయంలో ఆనాటివారు ఎంతటి శ్రద్ధాసక్తుల్ని కనబరిచారో గంగాధర కవి రచించిన 'గంగాదాస ప్రతాపవిలాసం' అనే నాటకంలో వివరించ బడింది.

బొంబాయి రాష్ట్రంలోని పాంచమహల్ మండలంలోనున్న 'పావగడ' రాజ్యానికి ప్రభువైన గంగదాసు దిగ్విజయం దీని ఇతివృత్తం.

గంగాదాసు గంగాధర కవిని కోరి వ్రాయించుకున్న నాటకం ఇది. దానిని రంగప్రయోగం చేయించుకోవాలని అతనికి అమితమైన ఉబలాటం. అందుకు సమర్థుడైన ప్రయోక్తకోసం గంగాదాసు వెతికిస్తున్నాడట. ఆ వార్తను విజయ నగరం సంస్థానంలో వున్న ఒక నటుడు విని, నేను ఆ నాటకాన్ని ప్రయోగం చేస్తానని తన ప్రభువైన మల్లికార్జునుడికి విన్నవించగా ఆ ప్రభువు అతణ్ణి బహు మాన పురస్సరంగా పావగడకు పంపించాడట.

రంగప్రయోగం ఒక విశిష్టశిల్పమనీ, ఉత్తమ నాటకరచనలు వున్నప్పటికీ ప్రయోగశిల్పం తెలిసిన సమర్థులే గనక లేకపోతే అవి రంగస్థలంమీద రాణించడం కష్టసాధ్యమనీ ఆ కాలంవారు పూర్తిగా గుర్తించారనడానికి ఇది చక్కని నిదర్శనం.



# సంగీతసాగరం విజయనగరం

విజయనగర చక్రవర్తుల కాలంలో నాట్యకళతోపాటు, సంగీత విద్యకూడ ఎంతో అభివృద్ధి పొందింది. హరిహర బుక్కరాయలకు గురువైన విద్యారణ్యస్వామి 'సంగీతసార' మనే ఒక సంగీత ఉద్గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథంలో 267 రాగాలను గురించి విపులంగా వ్రాయబడిందట.



అలాగే ప్రౌఢదేవ రాయల కొలువులో వున్న కల్లనాథుడు శార్జ్గదేవుని 'సంగీత రత్నాకర' మనే గ్రంథానికివ్యాఖ్యవ్రాశాడు.

రెండవ రాయలకాలంలో, ముల్‌బాగల్ మండలేశ్వరుడైన సాళువగోప తిప్ప సంగీత, నాట్య, తాళ, అలంకార శాస్త్రగ్రంథాలు వ్రాసినట్లు తెలుస్తూ వుంది. వామనుని కావ్యాలంకార గ్రంథానికి 'కామధేను' అనే వ్యాఖ్యానాన్ని రచించాడు. 'తాళదీపిక' అనే గ్రంథాన్ని సంతరించాడు.

## కవిరాట్టే కాదు, సంగీత సామ్రాట్టు కూడా:

శ్రీకృష్ణదేవరాయలు సంగీత విద్యలో కూడా ప్రజ్ఞావంతుడు. రామరాయల వలెనే కృష్ణదేవరాయలు కూడా శ్రావ్యంగా పాడగల్గిన నేర్పరి. కృష్ణదేవరాయలు గానకళలో ప్రజ్ఞాధురీణుడని కృష్ణాపుర శాసనంలో ఉదహరింపబడింది.

కృష్ణదేవరాయలు బాల్యంలోనే కృష్ణుడనే ఒక సంగీత శాస్త్రకారునివద్ద సంగీతాన్ని సాంప్రదాయకంగా అభ్యసించినట్లూ, ఆయనకు మడులు, మాన్యాలు, వజ్రహారాలు బహూకరించినట్లూ కన్నడ గ్రంథమైన రాఘవేంద్రవిజయం తెలుపుతూ వుంది.

## కట్టుదిట్టమైన కర్ణాటక సంగీతం:

విజయనగర చక్రవర్తుల కాలంలో సంగీతం శాస్త్రయుక్తంగా అభివృద్ధి పొందింది. ఈ విధంగా కర్నాటక ప్రాంతంలో కట్టుదిట్టంగా సంగీతం అభివృద్ధి

పొందడంవల్లనే ఈ సంగీతానికి కర్నాటక సంగీతం, కర్నాటక సాంప్రదాయం అన్న పేరు నాటినుంచి నేటివరకూ దక్షిణ హిందూదేశంలో అధిక ప్రచారంలో వుంది. విజయనగరరాజుల హయాములో దేవాలయాలలో దేవదాసీలు నృత్యాన్నీ, తద్వారా గానాన్నీ ప్రదర్శించేవారు. ఆ యా ఋతువుల ననుసరించి ఋతువర్ణనలతో ఒక్కొక్క ఋతువునకు ఒక్కొక్క రాగం పాడుతూ వుండేవారు.

రాయలు గానకళను ఎంతగానో పోషించాడు. సంగీత విద్వాంసుల్ని పోషించి వారికి అవ్వారిగా ధర్మాలను చేశాడు. అన్యరాష్ట్రాల నుంచి వచ్చిన అనేకమంది సంగీత విద్వాంసుల్ని ఆదరించి, గౌరవించి సమ్మానించాడు. ఇలా వచ్చినవారిలో ఒరిస్సా రాష్ట్రం నుంచి వచ్చిన లక్ష్మీనారాయణ పండితు డొకడు. ఈయన 'సంగీత సూర్యోదయ' మనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈయన కొంతకాలం రాజాంతఃపురంలో సంగీతశాస్త్ర అధ్యాపకుడుగాను పనిచేశాడు.

### రాయల బాటే రామరాజు బాట:

అళియ రామరాజు రామయామాత్యుడనే సంగీత విద్వాంసుని తన కుమార్తెలకు సంగీతం నేర్పటానికి నియోగించాడు. రామయామాత్యుడు 'స్వరమేళ కళానిధి' అనే ఒక ప్రమాణ గ్రంథాన్ని సంస్కృతంలో వ్రాశాడు. ఈ గ్రంథాన్ని అనుసరించే కర్ణాటక సంగీత సాంప్రదాయాలన్నీ ఏర్పడినవట.

పుండలీకవిఠలు డనే ఆయన ఉత్తర హిందూస్థానం వెళ్ళి అక్కడ 'నర్తక నిర్ణయం. అనే నాట్యశాస్త్రాన్ని రచించి అక్బరు చక్రవర్తి ఆస్థానంలో గౌరవ సత్కారాల్ని పొందాడు.

కృష్ణదేవరాయాల సిబ్బందిలో ఒకడైన నాదెండ్ల గోపన్న మంత్రి 'ప్రబోధ చంద్రోదయ' మనే ఆధ్యాత్మిక రూపకానికి వ్యాఖ్య రచించాడు. అతడు నాట్యశాస్త్ర గ్రంథకర్తలలో శృంగనాచార్యుని నామం రెండు మూడు మారులు ఉదాహరించాడు.



హరిహరరాయల కుమారుడైన విరూపాక్షరాయలు విద్యారణ్య యతీంద్రుల శిష్యుడు. ఇతడు సంస్కృత భాషలో నారాయణ విలాసం, ఉన్మత్తరాఘవం అనే రెండు నాటకాలు రచించాడు.

## సంగీత రత్నాకర సౌరభం :

ఇమ్మడి ప్రౌఢదేవరాయ లనబడే మల్లికార్జున దేవరాయల కాలంలో క్రీ. శ. (1446-1465) చతుర కల్లినాథుడు రచించిన కళానిధి నామం గల సంగీత రత్నాకర వ్యాఖ్యానం విజయనగర రాజుల కాలంలో వెలువడిన గ్రంథాలలో వుత్తమమైంది.



రెండవ దేవరాయల కాలంలో దుర్గ పాలకుడైన గోపేంద్ర తిప్పరాజు 'తాళ దీపిక, అనే ప్రత్యేక తాళలక్షణ గ్రంథాన్ని రచించాడు.

కళింగాధిపతియైన వీరరుద్ర గజపతి, కృష్ణదేవరాయల పోషణలో వున్న లొల్ల లక్ష్మీధరుడు తన పూర్వులలో అయిదవ తరంవాడైన విరించి మిశ్రుడు 'భరతార్ణవ పోత' మనే నాట్యగ్రంథాన్ని రచించినట్లు తన సౌందర్యలహరి వ్యాఖ్యానంలో ఉదాహరించాడు.

## దేవాలయానికి దివ్యదానం తెచ్చిన దేవదాసి :

క్రీ. శ. 1433-34 సం॥రంలో మడమను గ్రామంలో అగ్నీశ్వర దేవాలయానికి దేవదాసి 'అరంవళత్త నాచ్చియార్' అనే తమిళదేశపు దేవదాసి. ఆమె రెండవ దేవరాయల్ని దర్శించి, అతని వలన ఒక దేవాలయం కొరకు దానం పొందింది. రాయల కాలంలో దేవదాసీలు నాట్యకళలో అద్భుతమైన ప్రావీణ్యాన్ని కలిగి వుండేవారు. రాజాదరణకు పాత్రమైన దేవదాసీలు గృహాలేకాక గృహారామాలను కూడ స్వంతంగా కలిగివుండేవారు.

విజయనగర రాజధాని హంపిలో వున్న శిల్పసంపదలో గాయక, నర్తక, నర్తకీ బృందాలు సంప్రదాయశుద్ధమైన భరతనాట్య భంగిమలతో బహుసంఖ్యలు విరాజిల్లుతున్నాయి. కోలాటపు కోపుల శిల్పాలు అనేకం గోడలమీద చెక్కబడి వున్నాయి.

## బయలాటల బంగారు ప్రదర్శనాలు :

రాయల కాలంలో దేవాలయాల ముందు జరిగే బహిరంగ నాట్య ప్రదర్శనాలకు రాజులు కూడా హాజరవుతూ వుండేవారు. విఠలస్వామి దేవాలయంలో నాట్య ప్రదర్శనాలు వీక్షించడానికి వచ్చే రాజులకు ఎత్తైన వేదికపై ఒక సింహాసనం అమర్చబడి అలంకరింపబడి వుండేది. నృత్యం చేసే నర్తకీమణులు, వివిధ వాద్యకాదుల భంగిమలు వున్న యీ వేదికపై ఉన్న సింహాసనంలో రాయలు ఆసీనులయ్యేవారు.

రాయల కాలంలోని ప్రాచీన శిల్పాలలో నాట్యకత్తెలు మహమ్మదీయ స్త్రీలు ధరించే పైజామాలను ధరించి, శరీరంపై చాలా ఆభరణాలు ధరించినట్లు కొన్ని చెక్కబడి వున్నాయి.

## దేదీప్యమానంగా వెలిగిన కళామూర్తులు :

ఆ రోజులలో గాయకులకు సంఘంలో ఎక్కువ గౌరవం వుండేదట. ఆ నాటి వాద్యపరికరాలలో వీణకు ఎక్కువ ప్రాముఖ్య మున్నట్లు అనేక ప్రబంధాలలో ఉదాహరింపబడి వుంది. అనేకమంది గాయకులూ, సంగీత విద్వాంసులూ ఉత్తర హిందూదేశంలో పర్యటించి, అనేక రాజాస్థానాలలో తమ విద్యను ప్రదర్శించి పోటీలలో నెగ్గి విజయనగరానికి పేరు ప్రఖ్యాతుల్ని తీసుకువచ్చారు. సంగీత రత్నాకరం వ్రాసిన విఠలుని తండ్రి 22 రాగాలలో విశేష ప్రవీణతను సంపాదించి గుజరాత్ మాండ్వీ సుల్తానును మెప్పించి వేయి తులాల బంగారాన్ని పారితోషికంగా పొందాడట. ఈ విధంగా విజయనగర చక్రవర్తులు కవి, పండిత, గాయక, నటీనటులను, శిల్పులను పోషించారు.



## రంగరాజూ, రంజకం కుప్పాయి :

శ్రీ కృష్ణదేవరాయల నగరులోని నాట్యశాలలో కృష్ణదేవరాయలు స్వయంగా సంగీత నాట్యాలను అభ్యసించినట్లు చరిత్రాధారాలవల్ల తెలుస్తూ వుంది. రాయలు కొలువు తీర్చివుండగా

రంజకం శ్రీరంగరాజు, రంగరాజు కుమార్తె రంజకం కుప్పాయి, నట్టువ నాగయ్య మొదలైనవారు నృత్య, నాటకాలను ప్రదర్శించేవారట.

దసరా వేడుకల్లో జెట్టీలు కుస్తీలను ప్రదర్శించేవారట. రాత్రిపూట బాణా సంచాలను కాలుస్తూ వుండేవారట. నానా విగ్రహాల ఆకారంలో వున్న బాణా సంచాలు పటపట మంటూ ఆకాశాని కెగిరి పగులుతూ వుండేవట.



రాయల కాలంలో ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క రాగానికి ప్రాముఖ్య ముండేదట. వసంత కాలంలో హిందోళరాగం పాడినట్లు ఆముక్త మాల్యదలో వుదాహరింపబడి వుంది.

## తిరుపతి వచ్చిన దివ్యతారలు :

అచ్యుతరాయల పరిపాలనలో నృత్యకళ అభివృద్ధిపొందింది. ఆయన ఆస్థానంలో అనేకమంది నర్తకీమణులు పోషింపబడ్డారు. ఆనాడు అనేకమంది నర్తకీమణులు తిరుపతి దేవస్థానానికి పంపబడినట్లు దేవస్థానంవారు ప్రకటించిన ఒక శాసనాన్నిబట్టి తెలుస్తూ వుంది.

ఆ రోజుల్లో పురుషులే స్త్రీ వేషాలు ధరించేవారనీ, నాట్యపు పోటీలు జరిగేవనీ, నిపుణులు ఉత్తమ మధ్యమాది నృత్యనిర్ణయాలను చేసినట్లూ, మృదంగం, దండెకాళం, ఋరుమకిన్నెర, సన్నగాళె వీణ, ముఖవీణ, వాగ్రోలుదోలు, మౌరి, భేరి, గౌరు, గుమ్మెట, తమ్మెటం, ఢుక్కి, ఢక్కి, చక్కి, చయ్యంకి మొదలైన వాయిద్యాలుండేవనీ ఆముక్తమాల్యదలో వుదాహరింపబడింది.

పెద్దన మనుచరిత్ర నాలుగవ ఆశ్వాసంలో స్వారోచిపుర ప్రవేశసందర్భాన- "చిలకలకొల్కి కల్కి యొక చేడియ నాటకశాల మేడపై నిలువున నాడుచుండి"రని ఒక పద్యంలో నాటకశాలను పేర్కొన్నాడు.

## భోగంపడుచుల రంగరంగ వైభోగాలు :

ఆనాడు ఆటపాటలకు భోగంవారే ప్రధానంగా వుపయోగపడేవారు. భోగం వారి సమ్మేళనాన్ని మేళమనేపిలుస్తూ వుండేవారు. ఈనాటి కీఅనుగాత్మంళ్ళ భోగం

వాళ్ళని భోగం మేళమని పిలుస్తూ వున్నారు. ప్రతి మేళానికీ ఆటలోనూ, పాటలోనూ, అభినయంలోనూ, అనుభవంలోనూ ఆరితేరిన ఒక వృద్ధవేశ్యమాత పెద్దగా వుంటూ మేళాన్ని సక్రమ పద్ధతుల్లో నిర్వహించి, నాయకత్వం వహించి మిగతా వేశ్యలైన నాట్య సుందరీమణులను కలిసికట్టుగా నడిపేది. ఇందులో వెనుకపాట పాడే వారు కొందరు ఆ పాటకు అభినయం చేస్తూ ప్రేక్షకుల ముందుకు వెళ్ళి నాట్యం చేసేవారు.



కృష్ణదేవరాయల కాలంలో దేవదాసీలు ప్రముఖ స్థానాన్ని అలంకరించారు. నాట్యకళయందు ప్రజ్ఞానిధులుగా వెలుగొందారు. రాయల దర్బారులోను, రాణివాసపు మందిరాలలోను, దేవస్థానాలలోను, వీధి మంటపాలలోను, ఎటుచూచినా దేవదాసీ సుందరాంగనలు నాట్య, నాటక, గాన మాధుర్యాలను వెదజల్లారు.

## అగ్రస్థానం వహించిన అద్వితీయ తారలు :

భోగంవారని పిలువబడే ఈ దేవదాసీలు రాయల సామ్రాజ్యంలో మహోన్నతమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. దేవదాసీలకు అన్ని సమయాల్లోనూ, రాయల అంతఃపుర సౌధాలలోనికి ప్రవేశముండేది. కొంతమంది వేశ్యలు రాణులవద్ద దాసీలుగానూ వుండేవారు. వసంతోత్సవాలలో - ఎటు చూచినా దేవదాసీలు వసంతాలను వెదజల్లేవారట.

ఆనాడు రాయల ఆస్థాన శిల్పులు దేవాలయాలమీదా, వారి మహాసౌధాలమీదా, కుడ్యాలమీదా, స్తంభాలమీదా ఆ దేవదాసీల నాట్యభంగిమాలను, వివిధ అభినయాలనూ వేషభూషణ అలంకారాలతో సహా చిత్రించారు. కొన్ని చిత్రాలు నగ్నంగా కూడా చెక్కబడి వున్నాయి. హంపీ హజారరాయాలయం ముఖద్వారం వద్దనూ, ఆలయంలోనూ, స్తంభాలపైనా నాట్యకత్తెల యొక్క ఇటువంటి చిత్రాలు మనకు కనబడుతూన్నాయి. ఈ విధంగా దేవదాసీ నాట్యకళను రాయలు ఎంతగానో ఆదరించాడు.

## దేవతా సన్నిధిలో దివ్యప్రదర్శనం :

ఆనాటి భోగంపడుచులు తొలిసారి దేవతా సన్నిధిలో నాట్యంచేసి ఆ తరువాత నాట్యాన్ని వృత్తిగా స్వీకరించేవారు. రాజులు భోగంవారి సంగీతనృత్యాలను మెచ్చు

కుని, ఆ సందర్భంలో కవులకు, కళాకారులకు 1116 ర్లు ఇచ్చేవారట. ఇందుకు ఉదాహరణగా —

అపు డాచోళవసుంధరాధిపతి నానానర్ఘ్య భూషంబరా
ది పదార్థ ప్రకరంబు త్యాగమహిగా దీనారము ల్వేయునూ
ట పదహార్లుం గృపజేసి.

అని వైజయంతిలో వివరించారు.

## వినోదాన్ని వెలిగించిన విప్రవినోదులు:

ఈనాటి ఆంధ్రదేశంలో ఎక్కడో చెదురుమదురుగా తప్ప, ఈ విప్రవినోదం ప్రచారంలో వుందని చెప్పలేం. కాని, 1600-1700 సంవత్సరాలలో ఈ వినోదాలు బహుళవ్యాప్తిలో వున్నాయి. అంటే అది విజయనగర సామ్రాజ్యకాలం. విప్రు లనగా బ్రాహ్మణులు. వారు వినోదం చేయడంవలన విప్రవినోదమని పేరు వచ్చింది. బ్రాహ్మణులలో ఒక జాతి బ్రాహ్మణులు, దేవతోపాసన వలననో, మంత్ర తంత్రాల వలననో చిత్రవిచిత్రమైన గారడీలు చేస్తూవుంటారు. గుంటుపల్లి ముత్తరాజనే విప్ర వినోది గోలకొండ సుల్తానుల తుదికాలంలో వున్నట్లు, ఆయనను గురించి ఒక చాటువు వున్నట్లు ప్రతాపరెడ్డిగారు తమ సాంఘిక చరిత్రలో తెలియజేశారు.

సంతతమారగించునెడ సజ్జనకోటుల పూజసేయు శ్రీ
మంతుడు గుంటుపల్లి కులమంత్రి శిఖామణి ముత్తమంత్రిదౌ
బంతియె బంతిగాక, కడు పంద గులాముల బంతులెల్ల మాల్
బంతులు, దుక్కిటెద్దులయెడ బంతులు, విప్రవినోదిగారడీ
బంతులు దొంగవాండ్ర ములుబంతులు సుమ్ము ధరాతలంబునన్.

## ప్రజలపాలిటి పండగైన జాతీయ జాతర్లు:



ఆ రోజుల్లో మూఢనమ్మకాలు ఎక్కువగా వుండి జాతర్లు జరుగుతూ వుండేవి. ఇవి ఎంతో ఆడంబరంగానూ జరిగేవి. వీటిని ప్రజలు ఎంతో పర్వంగా ఎంచేవారు. ఈ సమయంలో యక్ష గంధర్వ వేషాలను ధరించి, నృత్యంచేస్తూ వుండే

వారు. ఇందువల్ల కురవంజి రూపాన్ని యక్షగానంగా పిలిచేవారు. వీటిని ఆనాడు వేశ్యలు కూడా ప్రదర్శించేవారు. కళావంతుల్లో ఒక తెగను జక్కుల జాతివారు అని పిలుస్తూ వుండేవారట.

## నాటి దాసరులు :

విజయనగర సామ్రాజ్యకాలంలో ఈ పేరుతో కొందరు శంఖుచక్రాలు కలిగి, ఇత్తడితో చేయబడిన కుండలాలు ధరించి, జింకకొమ్ములు, అలుగులు, మొగిలి యాకుల గొడుగు, గుబ్బపు వెంట్రుకలతో తయారుచేయబడిన విసనకఱ్ఱ, తోలుతిత్తి, చిట్టితాళాలు, చంకన బుట్ట, మెడలో తులసిపేర్లు, ముఖాన తెల్లని పంగనామాలు మొదలైన వేషధారణ కలవారై, చాండాలిక అనే కిన్నెరను వాయిస్తూ పదాలను పాడుతూ, మాలమాదిగ గురువులుగానూ పౌరోహితులుగానూ వుంటూ యాచిస్తూ వుండేవారని ఆముక్తమాల్యదలో వివరించబడింది.

## ఎందరికో ఎరుక చెప్పిన ఎరుకలసాని :

ఎరుకలసాని పూర్వకాలంలో ఎరుక చెప్పడంద్వారా సంఘంలో మంచి పలుకుబడినీ, ప్రాబల్యాన్నీ కలిగివుండేది. రాజాధిరాజులూ, రాణులూ, పండితులూ మొదలైనవారంతా ఎరుకలసాని సోదెకు చెవులు తెగకోసుకుని, ఆమెను ఆహ్వానించి, ఎరుక చెప్పించుకుని అనేక పారితోషికాలను ఇచ్చేవారు. ఎరుకలసాని ఏ సంస్థానంలో ప్రవేశించాలన్నా, ఏ అభ్యంతరమూ లేక దర్శనానికి అనుమతి ఇచ్చేవారు.



ఈ ఎరుకలసాని సమాజంలో ఎంత పలుకుబడిని సంపాదించిందో, అంతటి స్థానాన్ని ఆనాటి సాహిత్యంలోనూ, కళారూపాల్లో కూడా పొంది, ప్రత్యేకం ఒక పాత్రగానూ వర్ధిల్లింది. ఆనాటి ప్రతి కురవంజిలోనూ, యక్షగానాల్లోనూ ఎరుకసాని ఒక పాత్రగా ప్రవేశించి నాయకికో, నాయకులకో ఎరుకచెప్పి నిష్క్రమించేది.

విజయనగర సామ్రాజ్య కాలంలో ఎరుకత ముఖ్యపాత్ర వహించింది. ఎరుకలయొక్క వేషధారణను గురించి ఆముక్తమాల్యదలో వివరించబడింది. ఎరుకత

వన్నెల రవికను తొడిగి, ముంజేతులకూ, ముఖంపైనా పచ్చబొట్టులతో, కురుమాపు పైటలో చిన్నబిడుతణ్ణి మూపున కట్టుకుని, తరతరాలనాటి పైడిబుట్ట నెత్తిన బెట్టుకుని, కనుబొమల సందున నామంపెట్టి, నొసట విభూతిపెట్టి, కన్నులకు కాటుకపెట్టేది. చారికట్టు, మొన కట్టు, కనికట్టు, స్త్రీ వశ్యం కలిగించే తాయిత్తుల్నీ, ఏరుల్నీ అమ్ముకునేది. దీనిని కురవంజి అనికూడ సంబోధించే వారు. ఆనాడు కురవంజి ఆటలు కూడా విరివిగా జరుగుతూవుండేవి. ఉదాహరణకు యాదవదాసు వ్రాసిన గరుడాచల యక్షగానంలో లక్ష్మీదేవి తెర వెడలిన తరువాత, ఎరుకల నాంచారిని ద్వారపాలకుడు ఈ విధంగా పరిచయం చేశాడు.



తెరవెడలిన నాంచారి·

కం. తరుణిరొ తెరకును వెళ్ళుము
కరుణతొ మీ కథలు మాకు కమలదళాక్షీ
సరగున జెప్పుము మ్రొక్కెదము
ఎరుకల నాంచారుబొమ్మ వెలదిరొ రమ్మా॥

అని ఎరుకల నాంచారును ప్రవేశ పెడుతాడు.

ఎరుక ఎరుకోయమ్మ - అవ్వోళ్ళయ్యో ॥ఎ॥
ఎరుకచే జగమంత - వెలుగుచు నుండును.
మరుక తిరిగేటి మగువను వినవమ్మ ॥ఎ॥
ఏడుకొండలమీద యెక్కింది ఎరుక.
జోడు గుండ్లమీద కూడిందె ఎరుక ॥ఎ॥

అంటూ ఈ నాంచారు ఒక కీర్తన పాడుతుంది.

ఎరుక జెప్పితి వినవమ్మా - ఓ ముద్దులగుమ్మా
కరుణతో కలదే కనకపుబొమ్మా॥
యెరుకా, యెరుకా, యేడు జగములు
మురియుచు నీరీతి దనముచ్చట జెప్పెద.

అంటూ వుండగా లక్ష్మీదేవి యెటువలెనో చెప్పవమ్మా' అంటుంది.

ఈ విధంగా ఆనాటి కురవంజిలోనూ, యక్షగానంలోనూ ఈ ఎరుకలసాని ప్రాముఖ్యం ఎంతగానో వుండేది.

## యక్షులైనవారే జక్కులవారు :

విజయనగర చక్రవర్తుల కాలంలో ఇతర కళారూపాలతోపాటు వర్ధిల్లిన కళారూపం యక్షగానం. మన ప్రాచీన కళారూపాల్లో అతి ప్రాచీనమైనది యక్షగానం. ఇది ఆంధ్ర, కర్ణాటక, తమిళ రాజ్యాలలో అతి విస్తారంగా వ్యాప్తిలోకి వచ్చింది. ఒకనాడు యక్షగాన వాఙ్మయం దక్షిణ భారతదేశమంతటా దేదీప్యమానంగా వెలుగొందింది.

16వ శతాబ్దంలో యక్షగాన చరిత్రలో ఒక నూతనశకం ప్రారంభమైంది. సుప్రసిద్ధులైన కవిగాయకు లనేకులు యక్షగానాల్ని రచించారు. రాజులు వారికి ప్రోత్సాహాన్నిచ్చి వారిని పోషించారు. 1506 మొదలు 1509 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల అన్నగారు వీర నరసింహ రాయలు యక్షగాన రచయితలను. ప్రదర్శకులను చాలా గౌరవించేవాడట. క్రీ. శ. 1514 లో కర్నూలు జిల్లా చెరువు బెళగల్లు గ్రామంలో తాయికొండ నాటక ప్రదర్శనాన్నిచ్చిన చేగయ్య కుమారుడు నట్టువ నాగయ్యకును, పాత్రగ నటించిన పోతవరగ్రామ వాస్తవ్యుడు నట్టువ తిమ్మయ్య కుమార్తెకును ఆ వూరి కరణం తిరుపత్తూరు సోమరసు కుమారుడు బసవరసు కొంత భూమిని దానమిచ్చినట్లు తెలుస్తూంది. తాయికొండ నాటక ప్రదర్శనాన్నిచ్చిన వారు ఆనాటి కర్నూలు జిల్లావారేనని భారతిలో నేలటూరి వెంకటరమణయ్యగారు వుదాహరించారు.

## స్థనాలకు పన్ను విధించిన సంబెట గురవరాజు :

కూచిపూడి భాగవతులను గురించి, వారి పూర్వ చరిత్రను గురించి మాచుపల్లి కైఫీయత్‌లో 1502 నాటికే సవిస్తరంగా వ్రాయబడి వుంది. ఆ రోజుల్లో సంబెట గురవ రాజు నే సామంత రాజు



విజయనగర చక్రవర్తుల పాలనలో రాజ్యంచేస్తూ వుండేవారు. ఆయన ప్రజలను నానా చిత్రహింసలకు గురిచేస్తూ దుర్భరంగా పరిపాలిస్తున్నాడు. సకాలానికి ఎవరైతే శిస్తులు చెల్లించరో వారి స్త్రీలను బలవంతంగా కోటకు తీసుకువచ్చి ఆ స్త్రీల స్తనాలను చిరుతలు పట్టించి వారివద్ద శిస్తుల్ని వసూలు చేసేవాడట. కూచిపూడి కళాకారులు దేశాటనంచేస్తూ గురవరాజు రాజ్యంనుంచే ప్రయాణంచేస్తూ ఆయన యొక్క హింసాకాండను కళ్ళారా చూచి, ఆ దృశ్యాన్నంతటినీ కథారూపంలో పెట్టి ప్రదర్శనాలిచ్చుకుంటూ విజయనగర వీరనరసింహ రాయల ఆస్థానానికి చేరుకున్నారు.



## కేళికలతోనే కావ రందించిన కూచిపూడి కళాకారులు :

కూచిపూడి కళాకారులు రాయలవారిని కేళిక అడిగారు. ఆనాటికే కూచిపూడి విద్వాంసులయొక్క కళా విశిష్టతల్ని విన్న రాయలవారు ప్రదర్శనానికి సెలవిచ్చారు. ప్రదర్శనం ప్రారంభమైంది. ప్రదర్శనంలో మన కళాకారులు గురవరాజు ప్రభుత్వ పాలనా విధానాన్నే ప్రదర్శించడం మొదలు పెట్టారు.

ప్రథమంగా గురవరాజు వేషధారణతో ఒక నటుడు ప్రవేశమై, రాయల సమక్షంలో స్త్రీల స్తనాలకు చిరుతలు పట్టించి తహశ్శీలుసొమ్ము ఇవ్వవలసిందని హింసపెట్టాడు.

రాయలవారు గురవరాజు పరిపాలనా విశేషాలను తెలుసుకున్నారు. ఆ రాత్రి ప్రదర్శన పూర్తి అయీ అవగానే దర్బారు ఏర్పాటుచేసి సైన్యాన్ని తరలించి గురవరాజు పరిపాలనను అంతమొందించే, ఈ విషయాన్ని ప్రదర్శనరూపంలో చిత్రించి కనువిప్పు కలిగించిన కళాకారులను వేనోళ్ళ పొగిడి కానుకలిచ్చి, అగ్రహారాలిచ్చి పంపారు. వారి సంస్థానంలో కళాకారులను పోషించారు.

## శిల్పకళతోపాటు చేయి చేయిగా చిత్రకళ - సకలకళా సమన్వితం-విరూపణ్ణ లేపాక్షి:

ఆ కాలంలో శిల్పకళతోపాటు చిత్రకళ కూడా అభివృద్ధి చెందింది. విజయనగర చక్రవర్తియైన అచ్యుతరాయల కాలంలో హిందూపురానికి 9 మైళ్ళ మారంలో

లేపాక్షి అనేచోట పెనుగొండ విరూపణ్ణ అనే రాయలవారి ఉద్యోగి, అతని సోదరుడైన వీరణ్ణనాయకుడూ లేపాక్షి నగర నిర్మాణానికి కారకులని తెలుస్తూవుంది.

విరూపణ్ణ లేపాక్షిలో కట్టించిన వీరభద్రేశ్వరాలయంలో ఒక నాట్య మంటపం వుంది. అందులో శివుని నటరాజమూర్తిని. గాయకబృందంతోపాటు అప్సరసలను ప్రదర్శించే శిల్పఫలకా లున్నాయి. ఈ దేవాలయంలో అపూర్వమైన నాట్యవిజ్ఞానం వెల్లివిరుస్తూ వుంది; నృత్యం చేస్తున్న నాట్యకత్తెలతోను. మార్దంగిక వాద్యకారులతోను దేవగాయక బృందాలతోనూ శిల్పకళామయమైన స్తంభాలు నిలబడి ఈ నాటికీ మనకు దర్శనమిస్తున్నాయి.

సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు మృదంగ వాయిద్యం వాయిస్తున్నట్లూ, నందికేశ్వరుడు హుడుక్క వాయిద్యాన్ని ప్రయోగిస్తున్నట్లూ, తుంబురుడు వీణాతంత్రుల్ని మీటుతున్నట్లూ, దేవనర్తకియైన రంభ నృత్యం చేస్తూన్నట్లూ మనం చూడగలం.

## నాటి జానపద కళల తియ్యందనాలు :

చంద్రశేఖర శతకాన్ని వ్రాసిన చంద్రశేఖరుడు తాను వ్రాసిన శతకంలో తాను చూచిన ఆ నాటి జానపద కళారూపాలను ఎన్నింటినో వర్ణించాడు. ఈతడు వాడిన భాషనుబట్టి ఇతడు నెల్లూరు ప్రాంతంవాడు కావచ్చని ప్రతాపరెడ్డిగారు తమ సాంఘిక చరిత్రలో వుదాహరించారు. చంద్రశేఖరుడు 17 వ శతాబ్దం వాడని వూహించవచ్చు. అంటే అది విజయనగర సామ్రాజ్యం దాదాపు అంతరించిన కాలం. ఆ నాటి ఆచార వ్యవహారాలను వెక్కిరించి తన రచన ద్వారా హేళన చేశాడు. ఈయన తందాన కథలను గూర్చి. జంగం కథలను గూర్చి, భాగవతులను గూర్చి. పంబలవారిని గూర్చి, భోగంవారిని గూర్చి, వీధిపురాణం ప్రాముఖ్యాన్ని గూర్చి చమత్కారమైన భాషలో వుదాహరించాడు. భోగం ఆటలను గూర్చి ఈ విధంగా వర్ణించాడు.



### భోగం మేళం :

సేరువ వాడపల్లి నరసిమ్ముడి తీరతమోయి బోగమ
మ్మోరులయాట సూస్తి దనిముంగల దేముడెంత, ఇద్దెలో
తీరు, పయాస గంటి, వొకతిత్తి గుకిన్నిక కూడెవాని కా
లూరికె మొక్కబుద్దెగు నహెూయను మూర్ఖుడు చంద్రశేఖరా.

*తందాన కథలు :*

ఇంటిని తిమ్మరాజుకత ఇంటిని ఈర్ల కథాప్రసంగముల్
ఇంటిని పాదులాలి,
ఇబమింటిని నాయకురాలిశౌరెమె
ప్పంటికి నందివాక్యముల పొందు
చెరితల నాదు భాగ్యమె
న్నంటికి గల్గనోయను నవజ్ఞుడు
మూర్ఖుడు చంద్రశేఖరా.



*భాగోతులు :*

రాతిరి సూస్తి యేసములు రమ్మెముగా గురులాన మొన్నబా
గోతుల సత్తెబామ యన గూడని తాపములెల్లసేసె మా
పాతకురాలు రాద వల పచ్చము రుక్మిణి సుద్దికిష్టమం
టీ తీరుగనంచు వచియించును మూర్ఖుడు చంద్రశేఖరా.

*పంబలవారు, జాతర్లు :*

ఇరిడిగసూస్తితీరతము లెన్నెనొ యావనగొండ గంగజా
తర సరిరావు పంబలును తప్పెటలున్ కొముగాండ్ల సిండ్లసం
బర మదిదెల్పు మింకొక పబావము రంకులరాటమెక్కినే
తిరిగిన సాటిరాదని నుతించును మూర్ఖుడు చంద్రశేఖరా.

ఈ విధంగా 1336 లో ప్రారంభమైన విజయనగర సామ్రాజ్యం మూడు వందల సంవత్సరాలపాటు నిలబడి, నశించింది. దక్షిణ హిందూ దేశమంతా 200 సంవత్సరాలు వీరు పరిపాలించారు. ముఖ్యంగా ఆంధ్రదేశంలో విజయనగర రాజ్య కాలం ఒక విధంగా స్వర్ణ యుగం.





# లలిత కళాక్షేత్రం తంజావూరు

**1565** తళ్ళికోట యుద్ధానంతరం విజయనగర రాజ్యం ఛిన్నాభిన్నమైపోయింది. రాయల సంతతివారు కొంతమంది పెనుగొండకూ, మరికొంతమంది చంద్రగిరికీ వెళ్ళారు. మిగిలినవారు తంజావూరుకూ, మధురకూ చేరుకున్నారు. ఈ రెండూ కూడా విజయనగర రాజుల క్రింద సామంత రాజ్యాలుగా వుండేవి. వీటిని పరిపాలించిన నాయకరాజులు చివరివరకూ ఆంధ్రభాషను పోషిస్తూనే వచ్చారు.



తంజావూరు రాజ్యాన్ని 1535 నుండి 1673 వరకు సుమారు 140 సంవత్సరాలు నాయకరాజులు పరిపాలించారు. ఈ వంశంవారు ఆఖరువరకూ విజయనగర రాజులపట్ల విశ్వాసపాత్రులుగా ఉంటూ వచ్చారు.

అచ్యుతరాయలు, రఘునాథరాయలు, విజయరాఘవరాయలు వరుసగా పరిపాలించారు. విజయరాఘవ నాయకునికి మరో పేరు మన్నారుదాసు, మధురనాయకుడైన చొక్కనాథుడికీ, ఇతనికీ జరిగిన యుద్ధంలో (1674) విజయరాఘవుడు మరణించాడు. అనంతరం రెండు సంవత్సరాల తరువాత శివాజీ తమ్ముడైన ఎక్కోజీ తంజావూరును ఆక్రమించాడు. ఒక శతాబ్దంపాటు మహారాష్ట్రులు దాన్ని పరిపాలించారు. ఎవరు పరిపాలించినా ఆ నాటికీ ఈ నాటికీ వారి సంస్కృతి అంతా అచ్చం అలా నిలిచేవుంది.

## సువర్ణయుగంగా శోభిల్లిన నాయకరాజ్య రంగుహంగులు :

దక్షిణదేశ చరిత్రలో ఆంధ్రనాయకరాజుల పరిపాలన ఒక సువర్ణయుగమని చెప్పవచ్చు. విజయనగర చక్రవర్తుల కాలంలో లలితకళలు అభివృద్ధి పొందినట్లే, తంజావూరు నాయకరాజుల కాలంలో కూడ లలితకళలన్నీ వికాసం పొందాయి. తెలుగు సాహిత్యం, సంగీతం, నాట్యం, శిల్పం, యక్షగానవాఙ్మయం ఒక మహో

న్నత స్థానాన్ని అలంకరించాయి. ఆ నాటికీ ఈ నాటికీ ఆ మహావైభోగానికి సాక్ష్యాధారాలుగా అవి తంజావూరులో మనకు దర్శనమిస్తున్నాయి.

## కవి, పండిత పోషణలో ఘనాపాఠి :

రఘునాథనాయకుడు క్రీ॥ శ॥ 1600 నుండి 1634 వరకూ రాజ్యాన్ని పరిపాలించాడు. ఈయనకు దానకర్ణుడనే పేరు కూడా ఉంది. గోవింద దీక్షితుడు ఈయనకు మంత్రి. ఈయన కర్ణాటక సంగీతశాస్త్రంలో బహుముఖ ప్రజ్ఞాశాలి. అనేక రాగాలను, తాళాలను ఈయన స్వయంగా కల్పనచేశాడు. రఘునాథ నాయకుని ఆస్థానంలో కవులు, పండితులు బహుబాగా పోషింపబడ్డారు. ఈయన ఆస్థానంలో ముద్దు చంద్రరేఖ అనే రాజనర్తకి వుండేదట. గోవింద దీక్షితుని ఇరువురు పుత్రులైన భాస్కర దీక్షితుడు, రాజాచూడామణి దీక్షితుడూ లక్ష్మీకుమార తాతాచార్యులూ నృత్య, గాన విద్యల్లో ఆరితేరిన దిట్టలు. రామభద్రాంబ మొదలైన వారందరూ రఘునాథుని ఆస్థానం అలంకరించినవారే. ఆయన ఆధ్వర్యంలో తెలుగు సాహిత్యం ఎంతో అభివృద్ధి చెందింది. ఎన్నో యక్షగానాలు నాటకరూపంలో ప్రదర్శింపబడ్డాయి.

## సంగీత సాహిత్యదోహదంలో విజయరాఘవుని వితరణ :

రఘునాథనాయకుని అనంతరం విజయరాఘవనాయకుడు రాజ్యానికి వచ్చి 1663 నుండి 1673 వరకూ పరిపాలించాడు. రఘునాథ నాయకునివలెనే ఈయన కూడ సంగీత, సాహిత్య, నాట్యకళలను పోషించాడు. మువ్వ గోపాల పద కర్తయైన క్షేత్రయ్య విజయ రాఘవనాయకుని ఆస్థానంలో చాలా సన్మానా లందుకున్నాడు. ఈ క్షేత్రయ్య పదాలు ఈనాటికీ దక్షిణాపథమంతటా బాగా ప్రచారంలో వున్నాయి. ఇంకా కళాకారులైన పురుషోత్తమ దీక్షితుడు, పసుపులేటి రంగాజమ్మ, కోనేటి దీక్షితుడు, కామరసు వెంకటపతి సోమయాజి, మన్నారుదేవుడు మొదలైన వారెందరో యక్షగాన రచయితలుగాను, ప్రదర్శకులుగాను ప్రసిద్ధి పొందారు.



నాయకరాజుల కాలంలో 54 మంది కవి పండితులు సంస్కృతాంధ్ర భాషల వ్యాప్తికి తోడ్పడ్డారు.

నాయకరాజులు ఎంతోమంది కళాకారులకు మడులు, మాన్యాలు, అగ్రహారాలు ఇచ్చి సన్మానించారు. దేవాలయాలకూ, మఠాలకూ, సత్రాలకూ, దేవదాసీలకూ మాన్యా లిచ్చారు.

## యక్షగాన వాఙ్మయానికి అక్షయమైన భిక్ష :

ఈయన హయాములో యక్షగాన వాఙ్మయం బహుముఖాల విజృంభించింది. ఈయన రాజదర్బారులో ఒక నాట్య మందిరాన్ని భవ్యంగా నిర్మించి, ఆ రంగస్థలంపై ప్రత్యక్షంగా యక్షగాన ప్రదర్శనాలను ప్రదర్శింపజేశాడు. అనేక ప్రయోగాలను చేయించాడు. రఘునాథాభ్యుదయం అనే విజయరాఘవనాయకుని నాటకంలో రాజ ప్రాసాదంలోని మనోహర చిత్ర దృశ్యాలూ, అనేక చారిత్రిక ఘట్టాలూ వర్ణింపబడ్డాయి.

ఆంధ్ర తమిళ భాషలను రెంటినీ, కన్నబిడ్డలవలె సమంగా ఆదరించి పోషించారు.

ఈ విధంగా దక్షిణదేశంలో ఆంధ్ర నాయకరాజులు ఒక ఉజ్వలోజ్వల చరిత్రను స్థాపించారు.

## తెలుగు కన్నడాలను తలదన్నిన పేరు పెంపులు :

యక్షగానాలు ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాలలోను ఎక్కువ ఖ్యాతిలో వున్నప్పటికీ ఎక్కువ ప్రతిభావికాసంతో విరాజిల్లినవి తంజావూరు యక్షగానాలు మాత్రమే. రఘునాథరాయల కాలంలో యక్షగానాలు ఆట్టే అంతగా రాణించకపోయినా, విజయరాఘవ రాయల కాలంలో చాలా ఔన్నత్యాన్ని సంపాదించాయి. రఘునాథరాయల కుమారుడైన విజయ రాఘవుడు తండ్రివలెనే కవులను, గాయకులను, నృత్యశాస్త్రకారులను అపారంగా పోషించాడు. ఈయన స్వయం కవి, నాట్యశాస్త్రవేత్త;



స్వయంగా అనేక రచనలు చేశాడు. వాటిలో ముఖ్యమైనవి యక్షగానాలే. ఈయన కృతులలో ముఖ్యమైనవి.

| | |
|---|---|
| ప్రహ్లాద చరిత్ర | రాజగోపాల విలాసం |
| ఉషాపరిణయం | రఘునాథాభ్యుదయం |
| మోహినీ విలాసం | పూతనాపహరణం |
| మంజరీ నాటకం | సముద్రమథన నాటకం |
| కృష్ణవిలాసం | జానకీకళ్యాణం |
| | పుణ్యకత్రవనాటకం. |



ఈయన అనేకమంది కవిగాయక నటులకు ఆశ్రయమిచ్చాడు. అనేక అన్నదానాలు చేశాడు. అన్నదానాన్ని కథావస్తువుగా తీసుకుని పురుషోత్తమ దీక్షితుడు విడిగా ఒక అన్నదాన నాటకాన్నే రచించాడు. ఈయన తన తండ్రి రఘునాథ రాయల చరిత్రను రఘునాథాభ్యుదయమనే యక్షగానంగా వ్రాసి ప్రచారం చేయించాడు.

## పాతనుంచి కొత్తకు:

ఆనాటి యక్షగానాలు పురాణ కథావృత్తాలతో కూడివుండేవి. కాని విజయ రాఘవుడు మహావీరుని చరిత్రను యక్షగానంగా రచించాడు.

ఈ విధంగా విజయరాఘవుని ఆధ్వర్యంలో యక్షగానాలు అజరామరంగా వెలుగొందాయి.

నాయకరాజుల కళాకాంతులను విరజిమ్మే తంజావూరు సరస్వతీ మహల్‌లో దాదాపు 30 యక్షగాన నాటకా లున్నాయి. వీటిలో ఎన్ని రఘునాథరాయల కాలంలో వ్రాయబడ్డాయో తెలియదు. ఈ 30 నాటకాలలోనూ ఒక్క శాహిరాజు పేరనే 18 నాటకాలు ఉన్నాయి.

తంజావూరును 1684 నుంచి 1710 వరకు పరిపాలించిన శాహిరాజే ఈయన అనే ప్రతీతి ఉంది. యక్షగానాల్లో చాలా భాగం క్షత్రియులు వ్రాసినట్లుగా ఉంది.

ప్రథమంలో వ్రాసిన అనేక యక్షగానాల్లో చాలా యక్షగానాలు తేలిక భాష లోనూ, ప్రజలందరికీ అర్థమయ్యే గ్రామ్యభాషలోనూ వ్రాయబడ్డాయి.

## బహిరంగ ప్రదర్శనశాల :

దీనిని 'తిరంవెళి అరంగం' అని పిలుస్తారు. ఇది నాయకరాజుల ప్రాసాదంలో సరస్వతీ గ్రంథాలయానికి పడమటి దిక్కుగా, దానిని ఆనుకుని వుంది. దీని పూర్వ రూపం ఎటువంటిదో తెలియదు. పైన కప్పు లేదు. నాలుగు దిక్కుల్లోనూ తక్కిన ప్రాసాదానికి సంబంధించిన ఎత్తైన గోడ లున్నాయి. చతురాకారంగా వున్న ఈ ప్రదేశంలో నేలమీద 2000 మంది వరకూ కూర్చునే అవకాశ ముంది. ఈశాన్య దిశలో ఎత్తైన దిమ్మ ఒక టుండేదట. దీనిమీద నిలబడి మాట్లాడినట్లయితే శబ్ద, గ్రహణ యంత్రాల సహాయం లేకుండానే రెండువేల మందికీ స్పష్టంగా వినిపించేదట.

1952 లో పళనియప్పన్ అనే జిల్లాకలెక్టరు దీనిని పునరుద్ధరించి, రమణీయమైన రంగస్థలాన్ని నిర్మింపజేశాడు. ఈనాడది బహిరంగ నాటకమండపంలాగా ఉంది. ఒక మూలగా ఉన్న ఈ రంగస్థలంమీద నిలబడి చూచినట్లయితే ప్రేక్షకస్థానం వర్తులాకారంగా ఉన్నట్లు కనబడుతుందని నాట్యశాస్త్రంలో పి. యస్. ఆర్. అప్పా గారు తెలియజేశారు.

## నాయకరాజుల వరవడినే వెళ్ళిన మహారాష్ట్ర రాజులు :

తంజావూరు ఆంధ్రనాయకరాజుల అనంతరం పరిపాలించిన మహారాష్ట్ర రాజులుకూడ తెలుగులో కవులై, కవిపండిత గాయకుల్ని పోషించారు (క్రీ. శ. 1798-1832). శరభోజీ ఆస్థాన గాయక, నర్తకులైన చిన్నయ్య, పొన్నయ్య, నదివేలు, శివానందం అనే నలుగురూ సుబ్బరాయ నట్టువవారు పుత్రులు.

వీరు నృత్యాన్ని ఏకపాత్రాభినయంగా రూపొందించారు.

## తెలుగుతేజు దీపించే తంజావూరు నాట్యం :

తంజావూరు రాజాస్థానంలో నృత్యం ఏకపాత్రాభినయ కళారూపంగా అభివృద్ధి చెందింది.



అదే నేటి తంజావూరు భరత నాట్యంగా ప్రసిద్ధి పొందింది. ఈ ప్రదర్శనకాలం మూడు గంటలు. ఆ మూడు గంటలూ ఒకే ఒక నర్తకి నృత్యం చేస్తుంది. ప్రక్కనున్న

నట్టువనారు పాడే పాటకు అనుగుణంగా అభినయం చేస్తుంది. ఇది కేవలం తెలుగు వారు సృష్టించిన నాట్యం.



ఈ ఏకపాత్రాభినయ భరతనాట్యం దాదాపు 150 సంవత్సరాల క్రిందటనే రూపొందింది. తంజావూరు భరతనాట్యం కేవలం తెలుగువారి సృష్టి. ఇందుకు ఉదాహరణ నాయకరాజులూ, మహారాష్ట్ర రాజుల కాలంలో ఎంచి ఏర్పర్చినట్లు తెలుగు వాగ్గేయ కారులూ, తెలుగు నర్తకీమణులే ఆ ఆస్థానాల్లో ఉండడమే. త్యాగరాజు కీర్తనలు, సారంగపాణి పదాలు, క్షేత్రయ్య మువ్వ గోపాల పదాలు, నారాయణ తీర్థులవారి తరంగాలు మొదలైనవన్నీ మనకు తదితర సాక్ష్యాధారాలు.

## సకలకళా సరస్వతి సరస్వతీమహల్ :

తెలుగుదేశపు ఈ భరతనాట్యాన్ని తీర్చిదిద్దింది దేవదాసీలూ, రాజనర్తకీమణులేనని పి. యస్. ఆర్. అప్పారావుగారు నాట్యశాస్త్రంలో వుద్ఘాటించారు.

విజయనగర సామ్రాజ్య వైభవం వెలుగొందినన్ని రోజులూ మన భాగవతులు రాయలవారి ఆస్థానంలోనూ, బహుధా విస్తరించిన ఆయన సామ్రాజ్యంలోనూ ప్రదర్శనలిస్తూ ప్రజాప్రబోధాన్ని గావించారు. కాని విజయనగర రాజ్య పతనానంతరం కవి గాయకులతోపాటు మన కళాకారులు కూడా విధి లేక వలస వెళ్ళిపోవలసి వచ్చింది.

ఆ రోజుల్లో (1561 నుంచి 1614 వరకూ రాజ్యాన్ని పరిపాలించిన ఆంధ్ర రాజులైన అచ్యుతప్ప నాయకులవారి ఆస్థానంలో వారి ఆదరాభిమానాన్ని పొంది నాట్యకళా సాంప్రదాయాలను అభివృద్ధిపరిచారు. తంజావూరు సరస్వతీ మహల్ కవులతోనూ, గాయకులతోనూ, కళాకారులతోనూ అద్వితీయంగా వెలుగొందింది. అచ్యుతప్పనాయకులవారు వారి పంచన చేరిన కూచిపూడి బ్రాహ్మణ కుటుంబాల వారందరికీ అగ్రహారాలను దానంగా ఇచ్చారు. అలా దానం చేసినవాటిలో కూచిపూడి భాగవతులకు దానం చేసిందే అచ్యుతాపుర అగ్రహారం. అచ్యుతప్పనాయకుని దానం

కనుకనే దానికి అచ్యుతాపురమనే పేరు వచ్చింది. దీనినే తరువాత మేరటూరవి, మెలట్టూరని, మేలటూరని వ్యవహరించారు. కాని ఈ నాటికీ తంజావూరు చుట్టు ప్రక్కలవారు మేరటూరచే పిలుస్తున్నారు.



## మేలటూరు భాగవతులు :

ఆంధ్రదేశంలో కూచిపూడి వీథి భాగవతులమాదిరే దక్షిణాదిన తంజావూరు జిల్లాలో మేలటూరు, పూర్తకూడి, శూలమంగళం గ్రామాలలో కూడ భాగవత మేళములవా రున్నారు. ఆంధ్ర రాజులు తంజావూరును పరిపాలించే కాలంలో కూచిపూడి భాగవతులు నానారాజ సందర్శనం చేస్తూ, తంజావూరు ఆంధ్రరాజులను కూడ ఆశ్రయించారు.

విజయనగర సామ్రాజ్యంలో కవులు, పండితులు, కళాకారులు అనేకమంది పోషించబడ్డారు. కాని తళ్ళికోట యుద్ధానంతరం రాయల సామ్రాజ్యం అంతరించడంతో ఈ కళాకారు లందరూ కుటుంబాలు కుటుంబాలుగా చెల్లా చెదురై అనేకమంది అనేక ప్రాంతాలకు వలస పోయారు. అలా వలసపోయిన వారిలో చాలామంది తంజావూరు చుట్టుప్రక్కల స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఆనాడు తంజావూరు రాజులు కూడా వీరిని ఆదరించి మాన్యాలూ, అగ్రహారాలూ వ్రాసి యిచ్చారు. అలా సంపాదించిందే ఈనాటి మేలటూరు.

## అపర సిద్ధేంద్రయోగి :

మహామహుడు సిద్ధేంద్రయోగి కూచిపూడి భాగవతులకు ఎలాంటివాడో మేలటూరు భాగవతులకు వెంకటరామశాస్త్రి అలాంటివారు. ఈయన 17 వ శతాబ్దంలో ఆంధ్రదేశం. గోదావరి ప్రాంతం నుంచి దక్షిణదేశానికి వెళ్ళినట్లు ఆధారా లున్నాయి. ఈయన రచించిన వీథినాటకాలు చూస్తే ఈయన కృషి, ప్రతిభ ఎలాంటిదో మనకు బోధపడుతుంది.

వీరి రచనలు: ఉషాపరిణయం, హరిశ్చంద్ర, ప్రహ్లాద, రుక్మాంగద చరిత్ర, సీతాకల్యాణం, సత్సంగరాజు, రుక్మిణీ కల్యాణం, కంస వధ మొదలైనవి.

## మేలటూరు మేల్బంతి, శూలమంగళం :

మేలటూరు తరువాత వీథినాటకాలను ప్రతిభావంతంగా ప్రదర్శించగలిగినవారు శూలమంగళ కళాకారులు. వెంకటరామశాస్త్రి నాటకాలనే కాక, కొరవంజి కళా రూపాన్ని కూడా ప్రజారంజకంగా ప్రదర్శించారు. వీరు వీథినాటకాల్లో కొన్ని హాస్యపాత్రల్ని కూడా ప్రవేశపెట్టారు. కథకు ఏ సంబంధమూ లేకుండానే ఈ పాత్రలు ప్రవేశిస్తాయి. ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్విస్తాయి. అలాంటి పాత్రల్లో ఎరుకల సింగి, సింగడు, ఘట నృత్యం చేసేవారు, తురక వేషాలు ధరించే ఫకీరు వేషగాళ్ళు మొదలైనవారు. వీరి నాటకం తెలుగులో ప్రదర్శింపబడుతున్నా హాస్య చమత్కారాలు మాత్రం తమిళ భాషలోనే సాగుతాయి.

## వూత్తుకూడి వీథినాటకాలు :

ఇక్కడ కూడా వీథి భాగవతాలు ప్రదర్శించేవా రున్నారు. ఈ వూరివారు ముఖ్యంగా మేలటూరివారి నాటకాలనే ప్రదర్శించినా, వెంకటరామశాస్త్రి నాటకాలకు ముందు ప్రదర్శించిన నాటకాలు కూడా వున్నాయి. అవి: భామాకలాపం, గొల్ల కలాపం, పార్వతీ పరిణయం, రాధాకృష్ణ విలాసం మొదలైనవి. అంతేగాక వారు యక్షగానాలైన ప్రహ్లాద, గొల్లకలాపం, ఉషాపరిణయం, కూచిపూడి సంప్రదాయా లనే ప్రదర్శించారు. కూచిపూడి సంప్రదాయమే దక్షిణదేశంలో వూత్తుకూడి సంప్రదాయంగా వెలుగొందింది.

## వివిధరాజుల ఆదరణలో వీథినాటకాలు :

తంజావూరు రాజుల్లో అచ్యుతప్పనాయకుని మరణానంతరం రాజ్యపరిపాలనకు వచ్చిన రఘునాథరాయల కాలంలో కూడ ఈ భాగవతాలు ఆదరించబడ్డాయి. తరువాత తంజావూరు రాజ్యాన్ని పరిపాలించి, మహారాష్ట్ర ప్రభువుల కాలంలో కూడ ఈ వీథి భాగవతాలు విశేష ప్రశస్తి పొందాయి. అంతేకాక ఆనాడు దక్షిణదేశంలో మైసూరు, పుదుక్కోట మొదలుగాగల సంస్థానాలలో కూడ భాగవతాల ప్రభావం పెరిగింది.



## వరదరాజు పెరుమాళ్లు వసంతోత్సవాలు:

వీధి భాగవతాలు ఎక్కువగా వైశాఖ మాసంలో జరుగుతాయి. వారంరోజులు జరుగుతాయి. నృసింహ జయంతినాడు ప్రహ్లాద నాటకంతో ప్రారంభిస్తారు. ప్రదర్శనాలను తిలకించటానికి పరిసర గ్రామాల ప్రజలు ఆబాలగోపాలం కదిలి వస్తారు. పాత్రధారులు వారు ధరించే ప్రతిపాత్ర వేషధారణతోనూ, తంజావూరు రాజస్థాన సంప్రదాయాల ననుసరించి రాజు పాత్రలకు తంజావూరు రాజదుస్తుల మాదిరివే ధరిస్తారు. బ్రహ్మ, విష్ణు, నృసింహమూర్తి, ఇంద్రుడు, యముడు మొదలైన పాత్రలకు ముసుగులను ఉపయోగిస్తారు. ప్రదర్శన రోజున, దుష్టపాత్రలను ధరించే నటులు ఆ రోజంతా ఉపవాసం చేస్తారు.

## ప్రదర్శన ప్రారంభం:

రాత్రి పది గంటలకు ప్రదర్శనం ప్రారంభమౌతుంది. వీరికి హంగుగా తిత్తి ముఖవీణ మృదంగం, తాళపుచిప్పలూ వుంటాయి. వంత పాట పాడేవారు నలుగురుంటారు. ఒకరు పద్యంగాని ఎత్తుకుంటే మిగిలిన వారందరూ అదే శ్లోకాన్ని వంత పాడుతారు. వీరందరూ ప్రారంభ శ్లోకాలను ఆశుధారగా వల్లించిన అనంతరం సభాంగణానికి ఒక విచిత్రమైన పాత్ర ప్రవేశిస్తుంది. ఆ పాత్రధారి కొంటెకోణంగి.

## కొంటె కోణంగి:

మన భాగవతాల్లోని మాధవి, సైరంధ్రి, ధర్మి, విదూషకుడు, అల్లాటప్పా, కేతిగాడు, సుంకరకొండడు, బంగారక్క, రత్నాల పోలిగాడు, మాదిరే ఈ కొంటె కోణంగి పాత్రధారి కూడా. కోణంగి పాత్రధారి ప్రవేశానికి ఒక హద్దూ పద్దూ ఏమీ లేదు. ప్రదర్శనంలో సమయానుకూలంగా ఎప్పుడు పడితే అప్పుడు ప్రత్యక్షమై ప్రేక్షకుల్ని ఆనందపరుస్తాడు. పాత్రల మధ్య కలహాలు పెంచుతాడు. వాటిని చమత్కారంగా పరిష్కరిస్తాడు. ఒకేసారి ప్రేక్షకులలో, ప్రేక్షకుడై నటిస్తాడు.



## చోపుదారు:

వెంటనే విఘ్నేశ్వర ప్రార్థన ప్రారంభమౌతుంది. వినాయక పాత్రధారి ప్రవేశించి, నృత్యం చేస్తూ నిష్క్ర-

మిస్తాడు. ఆ వెంటనే సభారంగానికి వచ్చే రాజుగారి రాకను గూర్చి కటకమువాడు ప్రవేశించి వెల్లడిస్తాడు. సభవారందర్నీ ఉద్దేశించి, రాజుగారు వస్తున్నారు. గనుక ఎక్కడివారక్కడ గప్‌చిప్ అంటూ వెళ్ళిపోతాడు. ఇతనిని కటికము వాడని చోపుదారని పిలవడం వాడుక. ఈ చోపుదారు.



చోపుదారు వచ్చే నే
రాజసభకు
చోపుదారు వచ్చే నే

అంటూ ప్రవేశిస్తాడు. ఈ విధంగా ప్రదర్శనాన్ని ప్రజాభిరుచుల ననుసరించి అందరినీ సంతృప్తిపరుస్తూ కథావిధానం అందరికీ అర్థమయ్యే పద్ధతిలో సంగీతం, సాహిత్యం, నృత్యం, శృంగారం, హాస్యం మొదలైన వాటి నన్నిటినీ సమపాళ్ళలో నడుపుతాడు.

కొంటె కోణంగి చోపుదార్ల నిష్క్రమణానంతరం సంప్రదాయం ప్రకారం నృత్యంచేస్తూ ఫలానావారు ప్రవేశిస్తున్నారు. అంటే రాజు వెడలె అంటూ రాజు పాత్రలూ, స్త్రీ పాత్రలైతే దేవినే చిత్రాంగదదేవినే, భామనే సత్యభామనే అంటూ పాత్రల ప్రవేశం జరుగుతుంది. ఆయా పాత్రధారులు తమ నటనా నిపుణత్వాన్ని నాట్య చమత్కారాన్ని చూపిస్తారు.

## తెలుగుతనం:

మేలటూరు శూలమంగళం ఊత్తుకూడి గ్రామాల్లో ప్రదర్శించే ప్రదర్శనాలన్నీ తెలుగులో వ్రాయబడినవే. ఈ నాటికి మేలటూరు వరదరాజుపెరుమాళ్ళ వసంతోత్సవంలో ప్రదర్శించే యక్షగానాలన్నీ తెలుగే, రానురాను చరిత్ర గతి మారి తెలుగు నాటకాలను అనువదించి తెలుగులో ప్రదర్శిస్తున్నారు.

## అందమైన యక్షగానాలను అందరూ ఆరాధించారు:

తంజావూరు రాజుల్లో అచ్యుతప్ప నాయకుని మరణానంతరం రాజ్యపరిపాలనకు వచ్చిన రఘునాథరాయలు, విజయరాఘవరాయలు కాలంలో కూడా ఈ భాగవతాలు ఆదరించబడ్డాయి. తరువాత తంజావూరు రాజ్యాన్ని పరిపాలించిన మహారాష్ట్ర ప్రభువుల కాలంలో కూడా ఈ వీధిభాగవతాలు విశేష ప్రశస్తి పొందాయి.

అంతేకాదు. ఆనాడు దక్షిణదేశంలో మైసూరు పుదుక్కోట మొదలుగాగల సంస్థానాలలో కూడ ఈ భాగవతాల ప్రభావం పడింది. ప్రతి గ్రామంలోనూ యక్ష



గానాలు విరివిగా ప్రదర్శింపబడేవి. ప్రతి గ్రామంలోని పండితులూ, కళాకారులు వీరి ప్రదర్శనాలను చూచి ఆనందించడమే కాక వారు కూడా నేర్చుకోవడం జరిగింది. ఆనాటినుంచి బ్రాహ్మణ పండితులు ఈ భాగవత మేళాలను సంప్రదాయ సిద్ధంగా తయారుచేయాలనుకుని ఉత్సాహంతో నడుంకట్టి శాస్త్రయుక్తంగా భాగవతాలను నేర్చుకున్నారు. అలాంటి శాస్త్రయుక్త భాగవత మేళాలను కలిగిందే మేలటూరు.

## క్షేత్రయ్య పదాలకు కొమ్ముమోసింది కూచిపూడివారే:

తంజావూరును పాలించిన విజయరాఘవనాయకుని కాలంలోని క్షేత్రయ్య ఆస్థాన గౌరవాలన్నిటినీ అక్షయంగా పొందాడు. పదాభినయానికి, సాత్వికాభినయానికి క్షేత్రయ్య పదాలకు విశిష్టంగా ప్రాధాన్యం యిచ్చేవారు. అందువల్ల ప్రదర్శనాలు ఎంతగానో విజయవంతమయ్యేవి. క్షేత్రయ్య పదాలు తమిళదేశంలో కూడా విస్తారంగా ప్రచారంలోకి వచ్చాయి. ఈ నాటికీ తమిళదేశంలో వాటిని పాడుతున్నారు. ఆ పదాలలో మధ్య మధ్య తెలుగునుడికారాలు అచ్చుగుద్దినట్లు అగుపిస్తూ వున్నాయి. ఈవిధమైన క్షేత్రయ్య పదాలను బహుళ ప్రచారంలోకి తీసుకువచ్చినవారు కూచిపూడి భాగవతులే.

తంజావూరు ఆంధ్రరాజుల సమక్షాన ప్రదర్శనాలిచ్చిన నాటినుండీ కృష్ణాజిల్లా కూచిపూడికీ, అచ్యుతాపురానికీ, వూత్తుక్కాడుకూ బంధమూ, బంధుత్వాలూ పెరిగాయి. అక్కడున్న తమిళులపై తెలుగుభాష ప్రభావంపడి వారుకూడా తెలుగువారుగా మారి, వారి పిల్లల్ని వీరి కివ్వడం, వీరి పిల్లల్ని వారు చేసుకోవడం ద్వారా బంధుత్వాలు పెరిగిపోయి, ఆంధ్రదేశంలో కూచిపూడి కళాక్షేత్ర మెలాగో, అలాగే దక్షిణదేశంలో వూత్తుక్కాడు, మేలటూరు గ్రామాలు కళాక్షేత్రాలుగా వెలుగొందు తున్నాయి.

## ఆంధ్ర, తమిళ సమరస సాంప్రదాయం:

కూచిపూడి కళాకారులు ప్రదర్శించే సంగీత నాటకాలకూ, దక్షిణాది సంగీత నాటకాలకూ చాలా దగ్గర సాంప్రదాయా లున్నాయి. వారూ వీరూ భరతనాట్య

సాంప్రదాయాలనే అనుసరిస్తూ వచ్చారు. అంతేకాకుండా తమిళంలో ఆడబడే నాటకాలూ, పాడబడే పాటలూ అన్నీ తెలుగువే. దీనినిబట్టి ఆంధ్ర తమిళ సాంప్రదాయాలకు మూలం ఒక్కటేనని మనకు బోధపడుతూ వుంది. తమిళులు ఏయే శ్లోకాలను వల్లిస్తున్నారో అదేవిధంగా ఆంధ్రులు కూడా వల్లించారు. వారూ వీరూ కూడా కృష్ణకర్ణామృతంలోని శ్లోకాలనే వుపయోగించారు.

కూచిపూడి భాగవతులు క్షేత్రయ్య పదాలను పాడి అభినయించినట్లే, దక్షిణాది కళాకారులు కూడ ఆ సాంప్రదాయాన్నే అనుసరించారు. ముఖ్యంగా క్షేత్రయ్య పదాలు దక్షిణదేశంలో బహుళ వ్యాప్తిలోకి రావడానికి కారణం కూచిపూడి భాగవతులేనని మనం చెప్పుకోవచ్చు.

అంతేకాకుండా తంజావూరును పరిపాలించిన అచ్యుతప్పనాయకుడు ఆంధ్ర దేశంనుంచి వలస వెళ్ళిన కళాపేత్తలను ఆహ్వానించి ఆదరించిన దానినిబట్టి చూచినా క్షేత్రయ్య పదాల ప్రభావం దక్షిణదేశంలో పడడంకూడ నిజమైనట్లుగా మనం గ్రహించవచ్చు. అందువల్ల తమిళ భాగవతకర్తలుకూడ ఆనాటినుంచి ఈ నాటివరకూ వంశపారంపర్యంగా ఆ సాంప్రదాయాలనే అనుసరిస్తూ ముందుకు తీసుకు పోతున్నారు.

తమిళదేశంలో భాగవత మేళనాటకాల్లో ప్రసిద్ధి వహించిన పండనల్లూరు మీనాక్షిసుందరంపిళ్ళై ఇటీవలవరకూ నివసించి ఆ ప్రాంతాల్లో కూచిపూడి భరత నాట్య సాంప్రదాయాలనూ, పదాభినయాన్నీ విద్యార్థులకు నేర్పాడు.

దీనినిబట్టి ఆంధ్ర తమిళదేశాల్లోని నాట్యసాంప్రదాయాలు ఒక్కటే అని వారి వారి పాటలూ, ఆటలూ నిరూపిస్తున్నాయి. అంతేకాక నాయిక ప్రవేశంలో తనకు తనే చరిత్ర చెప్పుకోవడంలోనూ, విదూషకపాత్రలను ప్రవేశపెట్టడంలోనూ కూడ ఆంధ్ర సాంప్రదాయాలనే అనుసరిస్తున్నారు.

దక్షిణాదిన విజయనగర చక్రవర్తుల కాలంలో కళలు ఎలా అభివృద్ధి పొందాయో అలాగే తంజావూరు, మధుర నాయకరాజుల కాలంలో కూడ సంగీత, సాహిత్య, నాట్య, నాటక విధానాలకు, కవి, పండితులకూ, ఆదరణా, పోషణా లభించాయి.



తంజావూరు నాయకరాజులకు మంత్రిగా వున్న గోవిందదీక్షితుడు. 'సంగీత సుధ' అనే ఒక శాస్త్రగ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథాన్ని రఘునాథరాయలు రచించినట్లు కూడ చెప్పుకుంటారు. రఘునాథరాయలు నృత్యంలోనూ, గానంలోనూ, ఆరితేరిన కళాకారుడు. ఈయన 'రఘునాథమేళ' అనే ఒక క్రొత్త వీణనే సృష్టించాడని ప్రతీతి.



## కళల మధురిమను కాపాడిన మధుర నాయకరాజులు:

అలాగే మధుర ఆంధ్రనాయకులు కూడ లలిత కళాసంపదలలో విజయ నగరం, తంజావూరులతో సరిసమానంగా తులతూగుతూ వుండేవారు. వీరి రాజ్యంలో. సంగీత నృత్యాలు దేవదాసీలు చేస్తూ వుండేవారు. దేవాలయాలలోనూ, పండితసభలలోనూ, ఆస్థానాలలోనూ, వీరి గానకచేరీలు జరుగుతూ వుండేవి. పండిత సన్మానాలతోపాటు దేవదాసీలకు కూడ ఇతోధిక పారితోషికాలూ, సన్మానాలూ జరుగుతూ వుండేవి.

విజయరంగ చొక్కనాథుని కాలంలో తిరువేంగడాచార్యుడనే గొప్ప గాయకుడుండేవాడట. క్షేత్రయ్యా, త్యాగరాజూ ఈ కాలంలోనే వర్ధిల్లి మధురమైన పదవాఙ్మయాన్నీ, గేయవాఙ్మయాన్నీ రచించాడు.





# విద్యావినోదాల్లో ఘనత వహించిన గోల్కొండ నవాబులు

క్రీస్తుశకం 1347 వ సంవత్సరమున ప్రారంభమైన బహమనీరాజ్యం 1512 లో అయిదు రాజ్యాలుగా విడిపోయింది. వీటిలో ఒకటైన గోల్కొండ నవాబులు తెలంగాణా ప్రాంతాన్ని పరిపాలించారు. ఈ నవాబులు 1512 నుండి 1687 వరకు 158 సంవత్సరాలకు పైగా తెలంగాణాను, కోస్తా జిల్లాలలో కొంత భాగాన్ని పరిపాలించారు.



గోల్కొండ నవాబులు మొత్తం అయిదుగురు. వీరి పేర్లు కులీ - జంషీద్ - ఇబ్రహీం - మహమద్ అబ్దుల్లా అబుల్‌హసన్. ఈ నవాబులకు దక్షిణాత్యులతో కలిగిన సాహచర్యంవల్ల ఈ అభిమాన మేర్పడింది.

గోలకొండను పరిపాలించిన నవాబు అబ్దుల్ హసన్‌తానీషా కూచిపూడి కళాకారులకు 1687 లో కూచిపూడి గ్రామాన్ని అగ్రహారంగా దానమిచ్చినట్లు మాచవల్లి కైఫీయత్‌లో వుదహరించబడి వుంది.

## విద్యాప్రియుడైన ఇబ్రహీం కుతుబ్‌షా :

గోలకొండ పాదుషాలలో ఇబ్రహీం కుతుబ్‌షా విద్యాప్రియుడు. ఈతని ఆస్థాన కవులు పండితుల్లో హిందువులూ, మహమ్మదీయులు కూడ వుండేవారు. విద్యాగోష్ఠి ఎల్లప్పుడూ జరుగుతూ వుండేది. పాదుషావారు పండితుల్ని తగురీతిని సన్మానించేవారు. తపతీసంవరణోపాఖ్యాన కావ్యం రచించి పాదుషాకు అంకితమిచ్చిన అద్దంకి గంగాధరకవిని పాదుషా సత్కరించారు. అనూరిమరింగంటి సింగరాచార్య మహాకవికి గొప్ప బిరుదులిచ్చి సత్కరించాడు. పాదుషాలు లలితకళల్నీ, వాఙ్మయాన్నీ అభివృద్ధి చేయడానికి ఇతోధికంగా ప్రయత్నించారు.



# కురవల కురవంజి

ఆ యా రాజుల కాలాల్లో ఎన్నో కళలు అభివృద్ధి చెందాయి. అయితే నాటినుంచి నేటిదాకా ఏదో ఒక రూపంలో కురవంజి కళారూపం బ్రతికే వుంది. ముఖ్యంగా



ఈ నాడు తమిళనాడులో జీవించే వుంది. ఆ మాటకొస్తే ద్రావిడ సీమ లన్నిటిలోనూ ప్రాముఖ్యంలోకి వచ్చింది. ఇక ఆంధ్ర దేశంలో సోదెమ్మో సోదె అంటూ వచ్చే ఎరుకలవారిలో కురవంజి జీవిత రేఖలు కని పిస్తూ వున్నాయి.

కురవంజి ఒక జానపద దృశ్యకావ్యం. కురవంజి అంటే, ఎరుకలసాని. పూర్వం ఈ ఎరుకలసాని సంఘంలో ఎక్కువ పలుకుబడి సంపాదించుకుంది. ఆ నాడు విజయనగరరాజుల కాలంలోనూ ఎరుకలసాని ఎంతో ప్రాముఖ్యత వహించింది. ఈ ఎరుకలసాని వినోద కాలక్షేపానికి యాదాలాపంగా ఆటలు పాటలు జోడించి ప్రారంభించిన కళారూపం కురవంజి.

అసలు అర్థం :

కురవంజి అనగా ఒక నృత్య విశేషంతో కూడిన అడుగు. అడవులలో నివసించే కురవలనేవారి అడుగు కాబట్టి, దానిని 'కురవంజి' అని కూడ పిలుస్తూ వచ్చారు. గంతులు, చిందులు, గొండ్లి, అంజె అనేవి. నృత్యవిశేషానికి సంబంధించిన పర్యాయపదాలు.

కురవంజి కళారూపం ఆటవికులది. మానవులు అడవుల్లో నివసించే కాలంలో ప్రచారంలో కొచ్చిం దీ కళారూపం. ఆ నాటికీ ఈ నాటికీ పుణ్యక్షేత్రాలుగా వున్న సింహాచలం, దేవాలయంలోనూ, మంగళగిరి నృసింహ దేవాలయంలోనూ, విజయవాడ కనకదుర్గ దేవాలయంవద్దనూ, శ్రీశైల మల్లికార్జున దేవాలయంవద్దనూ, తిరుపతి కొండమీదా సంవత్సరం పొడుగునా యాత్రా వుత్సవాలు జరుగుతూ వుండేవి. దేశం నలుప్రక్కల నుండీ, స్వామి దర్శనార్థం యాత్రికులు వచ్చి పోతూవుండేవారు.

**వినోద ప్రదర్శనగా కురవంజి:**

ఇలా వుత్సవాలకు వచ్చిన యాత్రికుల వినోదార్థం ఆటవికులైన కురవలు, వినోద ప్రదర్శనలు ఇస్తూవుండేవారు. ఈ వినోదాన్ని యాత్రికులు ఎంతగానో మెచ్చుకుని వారికి మంచి మంచి బహుమతులను దానం చేసేవారు.

ఏ మాత్రం నిర్మాణ పటుత్వం లేని అడుగులనే ప్రారంభదశలో ప్రారంభించినా క్రమేపీ వారి అడుగులకు ప్రేక్షకులు అమిత వుత్సాహాన్నిచ్చిన తరువాత, కురవంజి అడుగు ఒక కళారూపంగా అభివృద్ధి చెందింది.

కురవంజులు వేషధారణలో అడవిజంతువుల రకరకాల చర్మాలూ, నెమలి ఈకలూ, పంది ముళ్ళూ, కోరలూ, పులిగోళ్ళూ, ఎలుగుబంటి వెంట్రుకలూ మొదలైనవాటిని ధరించి నృత్యాలు చేస్తూ వుండేవారు.



ప్రారంభదశలో కాలికి వచ్చిన చిందులు తొక్కి నోటికి వచ్చిన పాటలు పాడి ఆడినా, క్రమేపీ ఒక విశిష్టరూపాన్ని పొందింది కురవంజి. ఏ యే క్షేత్రాల్లో వారు యాత్రికుల వినోదార్థం ప్రదర్శనాలు యిస్తూ వుండేవారో, ఆ యా పుణ్యక్షేత్రాల మహోత్సవాలను గురించి, కథ అల్లి వాటిని ఒక కళారూపంతో చెప్పి, యాత్రికుల్ని ముగ్ధుల్ని చేసేవారు. ఇలా ఈ వినోద కాలక్షేపంలోనే రక్తికి రక్తి, భక్తికి భక్తిగా శివలీలలూ, విష్ణుకథలూ చెపుతూ వీనులకూ, కనులకూ విందు చేసేవారు. ఈ విధంగా కురవంజులు చక్కని ఇతివృత్తాలను కథలుగా తీసుకుని వాటిని గేయాలుగా వ్రాయించి, వాటికి క్రమమైన అడుగుల నమర్చి, కురవంజి అడుగును క్రమేపీ ఒక కళారూపంగా అభివృద్ధిలోకి తెచ్చారు. ఇలా యాత్రాస్థలాల్లో పుట్టి పెరిగిన ఈ కొరవంజి కళారూపమే క్రమేపీ దేశం నాలుగు మూలలకూ వ్యాపించింది. ఈ కురవంజి కళారూపం ఒరవడినే జక్కులవారనే (యక్షులు) కళావంతులు మొదలైనవారు కూడ ప్రదర్శనాలను ప్రారంభించారు.

**కొత్త రూపానికి, కొత్త కళాకాంతులు:**

ఇలా కురవంజి అడవుల నుండి పుణ్యక్షేత్రాలకూ, క్షేత్రాల నుండి ప్రజాసామాన్యంలోకి ప్రచారం పొంది, క్రమేపీ దేవోత్సవాలలోనూ ప్రవేశం సంపా

దించి గ్రామ జాతర్లలోనూ, ఘనత గడించి, రాజసభల్లోనూ ప్రవేశం సంపాదించి, ప్రావకం పొంది ప్రదర్శింపబడింది. ఈ కళారూపాన్ని అడవిజాతులవారి తరువాత



అభివృద్ధిలోకి తెచ్చినవారు జక్కులవారు. వీరి నృత్యం కంటే గేయానికీ, గానానికీ, వచనానికీ ప్రాముఖ్య మివ్వడం వల్ల అవి యక్షగానరూపంలో అభివృద్ధి పొందాయి.

ప్రాథమిక దశలో కురవంజి ఒక క్రమం లేకుండా ప్రదర్శింపబడేదని వినికిడి. కథలో వచ్చే అన్ని పాత్రలకూ ఒక్కడే నిర్వాచనం ఇచ్చినా రాను రాను నాటకాల్లోని నాందీప్రస్తావన, సూత్రధారుడు, నటి, నర్తకి విటుడు, విదూషకుడు, చేటకుడు, మాదిరి, సింగీ సింగడూ వచ్చి పురుష పాత్రలకు సింగడూ, స్త్రీ పాత్రలకు సింగి ప్రాతినిధ్యం వహించేవారు. ఈ పాత్రల మధ్య ప్రేక్షకులను నవ్వించేందుకు తోలుబొమ్మలాటలో జుట్టుపోలిగాడి మాదిరి - కొంటెకోణంగి ఒకడు ప్రవేశించి - సింగి సింగని మధ్య చెణుకులు వేస్తూ - ఇద్దరి మధ్యా కయ్యాలు పెంచి పరిష్కరించేవాడు.

ఇలా కురవంజి కళారూపం క్రమానుగతంగా పరిణామం పొందింది. కురవలు ఈ కళారూపాన్ని ఏదో వినోదం కొరకు ప్రారంభించినా క్రమేపీ ఇది వారి జీవనోపాధికి తోడ్పడింది. ఏ క్షేత్రంలో వారి కార్యక్రమం వుంటుందో ఆ యా యాత్రా స్థలం యొక్క పవిత్ర కథల్నీ, గాథల్నీ ఆశువుగా చెప్పి వారు యాత్రికుల్ని ముగ్ధుల్ని జేసేవారు.

ద్రావిడ కళారూపం:

ఇలా పరిణామం పొందిన కురవంజి కళారూపం, ఈ నాడు మన ఆంధ్ర దేశపు ప్రదర్శనాలలో మచ్చుకు కూడా కనిపించకపోయినా, అది సోదె చెప్పేవారిలో కొంచెం మిగిలివుంది.

కాని దక్షిణదేశంలో "కొఱత్తి యాట్టమ్", కన్నడదేశంలో "కొఱవంజి", ఉగుదేశంలో "కురవంజి ఎరుకలసాని" అని ప్రచారం పొందింది.

ఆంధ్రదేశంలో జీవ కొరవంజి రాజమోహన కొఱవంజి, జానకీ సుఖోల్లాస కొఱవంజి అనే నాటకాలు ప్రచారంలో వున్నాయి.

శుకసప్తతి కథలు వ్రాసిన కదిరీపతి ఒక రాజుగారిని దర్శింప వచ్చిన కొఱవంజిని జూచి,

ఱుకువలి గుబ్బచన్నుల-యెఱుకుజవరా లొకొత్త 'ఎఱుకోయవ్వా,
యెఱుకో'యని తన చందం - బెఱుకవడంగా హజార మెలమిం గదిసెన్.

అప్పు డప్పుడంతుక తెలం గమ్మహేంద్రుండు పరిచారికా జనంబులవలన విన నవధరించి సమ్ముఖమునకు రావించిన,

సవరని వని వన్నెఱవిక పిక్కటిలంగ గులుకు పొలుబ్బు గుబ్బలు చెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింత పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసగ
గుఱుమాపు పయ్యెంటచెఱగులో నిడుకొన్న ముద్దుబల్కులచిన్నిబుడత డమర
దరతరంబులనుండి తమఇంట వెలయు పుత్తడిపైడిబుట్ట మస్తమున వెలుగ
బొమలసందున నామంబు, భూతిపూత-నెన్నొసట, బుక్కిట విడెంబు, కన్ను గొనల
గాటుక రహింప వచ్చి యా క్ష్మాతలేంద్రు-చరణముల కొరగా మొక్కి చక్క నిల్చి.

అని ఈ విధంగా ఆ నాటి ఎఱుకలసాని వేషధారణను వర్ణించాడు.

1. ఇది దారికట్టు మొనక-ట్టిది కాంతావశ్యకర మిది నీమది కిం
పొదవించు నో నరేశ్వర-పదిలంబని తెల్పి కొన్ని బదనిక లొసగెన్.

2. తలపున నిది గారడమని-తలపకుమా, సింగడల్ల తటిగొండదరిన్
దలమోచి తెచ్చినవి ఇవి తలనుంచుము పసిడితాయెతల నుంచి నృపా.

అని ఈ విధంగా ఎఱుకలసాని విద్యలను వర్ణించాడు. ఇంకా ఎఱుకలవారి పుట్టుపూర్వోత్తరాలను గురించి వెంకటరాయకవి వ్రాసిన లేపాక్షి జలక్రీడల్లో ఈ విధంగా వర్ణించాడు.



......అఖిలభూతముల-తెర గెల్ల
భంగులు తెల్లంబుగాను
ఎఱుక గల్గినవార మాటకు మమ్ము
యెరుకలవా రని యందురే చెలియ.

అంటూ తనకు వచ్చిన విద్య లన్నింటినీ వివరిస్తుంది.

కురవంజి నేర్చిన విద్యలు :

స్తంభన, వశీకరణ, ఆకర్షణ, ఉచ్చాటన, విద్వేషణ, వ్యోమగమన, పర కాయ ప్రవేశాది, విద్య లెరుంగుదునే యవ్వా, పరమంత్ర. పరయంత్ర, భేదంబు లెరుంగుదునే యవ్వా, ''అశ్వలక్షణ'' ''గజలక్షణ'' ''రత్నలక్షణ'' ''స్త్రీ లక్షణ'' ''పురుష లక్షణ'' సాముద్రిక లక్షణంబు'' లెరుంగుదునే యవ్వా అంటుంది.

ఉత్తమ ఔషధాలు అమ్మటమే కాకుండా కురవంజి చేతులు చూచి భవిష్యత్తు కూడా చెపుతుంది. తన వేష మహిమవల్లనైతేనేమి, తన మాటల చమత్కారంవల్లనైతేనేమి భూతభవిష్యత్ వర్తమానాలను కరతలామలకం చేసుకున్న తన ప్రజ్ఞవల్లనైతేనేమి ఈ కురవంజి తెలుగు వాఙ్మయంలోనే కాకుండా ద్రావిడభాష లన్నిటిలోనూ శాశ్వత స్థానం సంపాదించుకుంది.

తెలుగు ప్రబంధాలలో అక్కడక్కడ కొరవంజి రచనలు కనిపిస్తాయి. కొన్ని యక్షగానాలలో కొరవంజి పాత్ర వుంది. సుగ్రీవ విజయం లాంటి పాత యక్షగానాలలో కొరవంజి పాత్ర లేదు. కొరవంజి పాత్రప్రవేశం గల యక్షగాన రచనకు....కొరవంజి అనే పేరని (ఆంధ్ర వాఙ్మయ సూచికి తెలియ చేస్తూ వుంది.)

పార్వతీదేవే కొరవంజి :

కొరవంజి కేవలం వినోదం కల్పించడానికి మాత్రమే కాక కథానిర్వహణానికి ఎంతగానో తోడ్పడుతుంది. సంస్కృత నాటకాల్లో విదూషకుని మాదిరే, యక్ష గానాల్లో వున్న ఈ కొరవంజి తెలుగు కృష్ణలీలలు మొదలైన యక్షగానాల్లో చల్లమ్మే గొల్లది ఈ కొరవంజి లాంటిదే నంటారు. చింతాదీక్షితులుగారు, వారి ప్రజావాఙ్మయంలో, భామాకలాపంలో గొల్లది ఏ విధంగా వేదాంతోపన్యాసం చేసి ప్రజలను ఎలా అలరిస్తుందో ఆ విధంగానే కొన్ని యక్షగానాల్లో కొరవంజి పూర్తిగా వేదాంత బోధే చేస్తుంది.



ఇంతకీ యక్షగానాల్లో వేషం వేసుకునివచ్చే కొరవంజి మామూలు ఎరుకలసాని కాదని పెద్దల నిర్వచనం, పార్వతీపరమేశ్వరుల విలాసార్థం కిరాతక వేషం ధరించిన విధంగా, పార్వతీదేవే కొరవంజి వేషం ధరించి యక్షగానాల్లో వినోదంకల్పిస్తూ వుంది.

మన తెలుగు కొరవంజి నాటకాల్లో వర్ణించబడ్డ ఎరుకలసాని ఎటువంటిదో, దాని వాకచక్యం ఎటువంటిదో, దాని మాటల చాతుర్యం ఎటువంటిదో గోకులపాటి కూర్మనాథకవి రచించిన మృత్యుంజయ విలాసం ద్వారా తెలుసుకోవచ్చు.



కొరవంజే శివుడు :

పార్వతి శివుని గూర్చి తపస్సు చేస్తుందనీ, శివుడు సమాధిలో వుంటాడనీ, మన్మథుడు తపోభంగం చేసి దగ్ధమైపోతాడనీ, పార్వతిని హిమవంతుడు తీసుకుపోతాడనీ, అప్పుడు శివుడు విరహవేదనను భరించలేక, పార్వతిని చూడాలని తహ తహ లాడతాడనీ. అందుకోసం తాను కొరవంజి వేషం వేసుకుని పార్వతి దగ్గరకు వెళ్ళి ఎరుక చెపుతాడనీ, ఇలా వేషం ధరిస్తాడనీ వివరించబడింది.

ముక్కున బలు కెంపు ముక్కెర చెలగ
పెక్కు రత్నము పూస పేర్లు చెన్నొంద
సిరమున రత్నభాసిత పాత్ర బూని
యెరుకతయై వచ్చె హిమశైలమునకు.

ఎరుకలసాని ప్రవేశం ఈ విధంగా సాగుతుంది.

ఎరుకసాని వచ్చె ఎరుకనుచు ''అను''
ఎరుకలసాని వచ్చె నెరుకో యెరుకో యెరుకో యనుచు ''ఎరు''

మురిపెంపు నడకలతోడ, ముంగురు లల్లాడ సరసంపు మాటల - చతురతతో - శిరమున నవరత్నఖచితమైన బుట్ట పెట్టి మెఱుపువలెను మేను మెఱయగను వచ్చి తన గొప్ప చెప్పుకుంటుంది.

అటతాళం

సరసిజ భవురాణి, పరిణయమౌటమా యెరుకదు కాదటవే -
తరుణి మదికి నేదార్కాణగా జెప్పి తగు కోర్కెలందెదనే - యోదేవి
''యెరుకగలవారు గల రెందరైన మా సరివత్తురే, రమణి''

అని.

అందుకు సమ్మతించిన పార్వతీదేవి.

ద్విపద

అంగద యా మాట లాలించి వేడ్క
బంగారు చేటలోపలి ముత్తియములు
ముమ్మారు తన కరాంబుజమున బట్టి
సమ్మతిపాలందేశం బుజమున నిలిపి
మ్రొక్కి యిట్లనె జిత్తమున దలపోసి
మిక్కిలి కంటిసామికిని నామీద
నెన్నడు దయవచ్చు నెపుడు పెండ్లాడు
నెన్నడు నా కోర్కె లీడేరు ననుచు
చేతి ముత్తియములు చేటలో బోసి
నాతియందిచ్చెను నను మోముతోడ.

భవిష్యత్తు చెప్పే ఎరుకలసాని:

ఆ తరువాత ప్రార్థన చేసి ఎరుకలసాని ఈ విధంగా భవిష్యత్తు చెపుతుంది.

అదో దేవియొక్క తలంపు చేసినావు. యొక్క కోరిక కోరినావు, యొక దొడ్డ మేలడిగినావు. అది కాయో పండో, కల్లో నిజమో, అవునో కాదో, చేకూడునో, చేకూడదో యని వెనుక ముందు తొక్కిసలాడుతున్నావు.

ఇదిగో నీ యెదలో తలంపు యెన్నాళ్ళకంటె వకటే, రెండే, మూడే. వకటంటే వకయేడు గాదు. రెండంటే రెండేళ్ళు కావు. మూడంటే మూడేండ్లు కావు. శీఘ్రంబె. ఇంతలోనే చేకూడుతున్నది.

ఇంక దాపేల, కోడెగాడితో తక్కిర బిక్కిరలాడుకుంటా కులకనున్నావె, అప్పుడు నన్ను మెచ్చేవే కోర్కె లిచ్చేవే" అంటూ తన స్వరూపాన్ని ఈ విధంగా వెల్లడిస్తుంది.



నీకు నాథుండ నయ్యెదనని యిప్పు డిచ్చటనే
యున్నాడు, నీపై చాలా దయవచ్చింది
శీఘ్రంబె పెండ్లియాడు, నీ కోర్కె చేకూరు
నమ్ము నా బుట్ట తోడని నమ్మించి చెప్పిన.

ద్విపద

అంత నయ్యింతి యింతంతన రాని
సంతోషమంది యాశ్చర్యంబు నొంది
యెరుకలసాని గాదెన్న నా పాలి
హరకృపామూర్తియై యవతరించినది.



కథా నిర్వహణకూ, వినోదం చేకూర్చడానికీ ఈ కొరవంజి ఏ విధంగా తోడ్పడిందో తెలుసుకోవచ్చు.

**అలాగే** మన్నారు దాసవిలాసం :

రంగాజమ్మ వ్రాసిన, మన్నారు దాసవిలాస నాటకంలో

దరువు

చెలువు మన్నారుదాసుపై వలపు నిలుప
లేక, కలవరింపుచు నున్న కాంతిమతికి
దలచిన తలపెల్ల దార్కాణగా దెల్ప
నలచెంగమ్మ యెరుక చెలువయై వచ్చె.

అని పాడుతూ, ఈ కలికి తలంచిన తలంపు నిజముగా బలుకవయ్యా, నిక్కముగా బలుకవయ్యా, తార్కాణముగా బలుకవయ్యా. అంటూ —

అమ్మా యమ్మ, అమ్మా యమ్మ శెయి సూపు
శెయి సూపు శెయి సూపవే.
సూడకనే శెప్పె గురి ఊంకొని
వినవేమండి, కండ్లంటే తోడు, కడు
పంటే కొడుకు, కంటంటే మగండు.
వొండే రెండే వొండు......
ఆతండే వితము వాడంటా అడిగేవే

......అయితే తెలిపేను వినవే దుండీ

వేయారు వెలమల వెలయుచు దక్షిణ
నాయకుండని మించి నలువొందు వాడు
అతడె నీపతి యగు నందుకు తార్కాణ
యితవైన నెచ్చెలి యిదిగో వచ్చితినే.

అని పలికి యా కలికి చిలుకల కొలికిచేత, సకల బహుమతులు తెంది విజ మందిరంబు సేరె.

లేపాక్షి జలక్రీడ :

అలాగే వెంకటరాయకవి వ్రాసిన లేపాక్షి జలక్రీడలనే నాటకంలో ఎరుకల వారి పుట్టుపూర్వోత్తరాలు వర్ణించబడ్డాయి.

అఖిల భూతముల తెరగెల్ల
భంగులు తెల్లంబుగాను
ఎఱుక గల్గిన వారమౌటకు మమ్ము
యెరుకలవారని యందురే చెలియ.

అని వివరిస్తుంది.

తులాభారం :

యక్షగానంలో కురవంజి పాత్ర ఎటువంటిదో, తులాభారం అనే యక్షగానంలో ఎరుకల వేషం యొక్క వర్ణన ఈ విధంగా వుంది.

బ్రహ్మసమ్మతిని యా భారతీదేవి.
యెరుకల వేషంబు యింపుగా దాల్చి.
భామను చూడంగ భామిని వచ్చె.



కురు జంపె

జిలుగు బంగారు చీర తెల్లని జారుకుచ్చులు
మెరయుగా గరిమతో గుత్తంపు చం
దురు కావి రవికయు దొడగుచూ
వచ్చెనెరుకత అహహా॥

చొక్కమగు రత్నములు జెక్కిన
బుట్ట శిరసున బెట్టుకోని
కుందనపు కట్ల మర వేసిన
కురచ బెత్తము చేతబట్టుకు ॥వచ్చె॥



ఫాలమున నసియాడు అలమేల వంక
పాపిట బొట్టుతో సోగ కన్నులు వాలు
చూపులు వైడూర్య పచ్చా బొట్టుతో ॥వచ్చె॥

అందమలరగ యెడమ మూపున ఆడశిశువును గట్టుకూ మందయానలతోటి వీథులు మళ్ళీ మళ్ళీ దిరుగుచూ వచ్చె ...అని వివరించాడు తులాభారంలో పేరు తెలి యని కవి.

ఏనుగులూరి పాపరాజు :

యక్షగానంలో కురవంజి ఎలాంటి పాత్ర వహించిందో, ఏనుగులూరి పాప రాజు వ్రాసిన రుక్మాంగద చరిత్ర యక్షగానంలో, మోహిని విరహబాధ పడుతూంటే నీరజగర్భుని పనుపున గారవమున యోగమాయ, ఎరుకత వేషంతో ఎలా వచ్చిందో ఈ విధంగా వివరించబడింది.

అంగన! నాదు పేరు కొర
    వంజి యటందురు, నాదు సామియున్
సింగడు, తావు ద్రోణగిరి
    సేదు, జనుల్కొనియాడ నెప్పుడున్
పొంగుచు సోదె చెప్పి వర
    భూషణముల్ కొని వార్త కెక్క మా
బంగరు పల్లెవాని మీది
    బాయక నమ్మిన వార మెయ్యెడన్

అని ఎరుక చెపుతుంది.

ఈ విధంగా కొరవంజి నాటకాలలో ఎరుకలవారిని గురించి ఎన్ని ఉదాహర ణలనైనా ఇవ్వవచ్చును.

ఈనాడు ఆంధ్రదేశంలో ఏ ఒక్క కొరవంజి నాటకమూ ప్రదర్శింపబడటము లేదు. కాని ఎఱుకలపాట మాత్రము ఏకపాత్రగా "సోదెమ్మ సోదో" అంటూ ఈ నాటికీ తన సహజ వేషధారణతో గ్రామాల్లో కనిపిస్తూ స్త్రీలకు సోదె చెప్తుతూ వుంది. ఎఱుకలసానులు సోదె చెప్పే విధానం అద్భుతంగా వుంటుంది. సోదె విన్న ప్రతివారికీ ఈ విషయం విదితమే.





# బహురూపాల బహురూపం

బ్రహ్మాణీ, బ్రహ్మ జననీ
బహురూపా బుధార్చితా
ప్రసవిత్రీ ప్రజండా
జ్ఞాప్రతిష్ఠా ప్రికటాకృతి.



బహునామాలతో పూజించే జగజ్జననినే బహురూపిగా లాక్షణికులు వర్ణించారు. భరతనాట్య శాస్త్రకారుడైన భరతముని కాలం నుంచీ, దశవిధ రూపకాలు మొదలు అనేక రకాల నాట్య ప్రక్రియలు వెలుగొందినట్లు మనకు అనేక ఆధారాలున్నాయి. అనేక లక్షణ గ్రంథాలలో వివిధ ప్రక్రియలకు సంబంధించి వివరణ లున్నాయి కాని బహురూపానికి సరియైన నిర్వచన మిచ్చినవారు లేరు.

బహురూప మంటే ?

బహురూపమంటే అన్నిటికంటే పెద్ద రూపమా? లేక కొంతమంది నటులు కొన్ని విభిన్న పాత్రలను పోషించడమా? అలాకాక ఒకే నటుడు విభిన్న పాత్రలను అభినయించటమా? లేక పగటి వేషధారులు రోజు కొక వేషం చొప్పున ప్రదర్శించే వివిధ రకాల పగటి వేషాలా? వీటిలో ఏదో ఒకటై యుండాలి. బహురూపాలను నటించే నటుణ్ణి బహురూపిగా వర్ణించి వుండవచ్చు. వారే పగటి వేషధారులు కావచ్చు. వారే బహురూపులని నా అభిప్రాయం.

బహురూప ప్రసక్తి వున్న మన గ్రంథాలలో బహురూపాన్ని గూర్చి ఎటువంటి వివరాలూ లేవు. కాని తెలుగు వాఙ్మయంలో మాత్రం బహురూప ప్రశస్తి ఎక్కువగా కనిపిస్తూ వుంది. అయితే బహురూప కళారూపానికి సంబంధించిన గ్రంథాలు మాత్రం మనకు లభ్యం కావడం లేదు.

సోమనాథుడు :

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో అనేక ప్రాచీన కళా రూపాల ప్రసక్తితోపాటు బహురూప కళారూపాన్ని గూర్చి పర్వతప్రకరణంలో శివరాత్రి జాగరణ వినోద కాలక్షేప ప్రస్తావనలో—

లలితాంగ రస కళా లంకారరేఖ
లలవడ బహురూప మాడెడు వారు.

అని పేర్కొనబడింది. బహురూప వివరణలో నేపథ్య వైవిధ్యంతోపాటు అభినయ వైవిధ్యం కూడా చూపబడింది. పై ఉదాహరణలో చతుర్విధ అభినయాలూ బహురూపంలో చోటు చేసుకున్నాయి.

యథా వాక్కుల అన్నమయ్య :

పదమూడవ శతాబ్దానికి చెందిన యథావాక్కుల అన్నమయ్య తన "సర్వే శ్వర శతకం"లో బహురూపాన్ని గూర్చి ఇలా వివరించాడు.

అమరంగన్ స్ఫుట భక్తి నాటకము భాషాంగ
క్రియాంగ భిర
మ్యముగా జూపిన మెచ్చి మీరలు పురే
యన్నంతకున్ యోనిగే
హములన్ రూపులు పన్ని కొంచును
నటుండై వచ్చి సంసార రం
గము లోనన్ బహురూప మాడు వెలయంగా
జీవి సర్వేశ్వరా



అంటూ నాటకాలలో బహువేషాలున్నట్లు వివరించాడు. అంటే నాటకంలో బహువేషా లున్నట్లా, లేక ఒకే వ్యక్తి వివిధ పాత్రలను అభినయించటమా? అని మనం ఆలోచించినప్పుడు బహురూపాల్ని ఒకే వ్యక్తి నటించి, ప్రేక్షకులను మెప్పించటం, నిజంగా నటునియొక్క ప్రజ్ఞావిశేషంగా భావించవచ్చును.

ప్రబంధ రత్నావళి వివరణ :

దామరాజు సోమయ్య భరతమున కి॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారి సంపాదకత్వంలో వెలువడిన ప్రబంధ రత్నావళిలో—

కుండలి బహురూప దండలాస్య విలాస
దేశి మార్గంబుల తెరువు లెరిగి
నయము, బిరుసును సరిగతుల్ కడదిగాను
తిరువు మురుపును నిలకడ తిన్న నగును.

పాత్ర గొనిపించ గొనఁగను బ్రౌఢి యైన
వాడె నటుడన బరునీ వసుధ యందు.

అని వుదహరించడాన్నిబట్టి బహురూప మనేది ఒక దేశి నృత్య విశేషమనీ, నేర్పుగల నటునియొక్క ప్రతిభావిశేషమనీ తెలుస్తూంది.

ఆలాగే పోతనగారి భాగవతంలో

గోప కుమారులం గూడికొని కృష్ణుండు
ఏ సూత్రధారి మీ రిందఱు బహురూపు
లని చెలంగుచు నాటలాడ.

అనే పంక్తుల్నిబట్టి బహురూప ప్రయోక్తగా సూత్రధారుడనేవాడు ఒక డుంటాడని తెలుస్తూంది.

అన్నమయ్య ఆధారాలు :

అలాగే పదిహేనవ శతాబ్దానికి చెందిన తాళ్ళపాక అన్నమాచార్యులవారి సంకీర్తనల్లో బహువారములు, బహురూపప్రసక్తి వచ్చింది. అన్నమాచార్య లొకచోట బహురూపుండవైతి అని అంటాడు.

మరొకచోట, ప్రకటము బహురూపము లయినా డతడు. అకుటిలమహిమల యనంతుడే అని అంటాడు.

ఇంకొకచోట... కొండంత దొరతనము కోరి మీద వేసుకొంటి నండనే యా బహురూప మాడకపోదు. అంటూ, మరికొన్ని సంకీర్తనల్లో బహురూపాన్ని గురించి క్రింది విధంగా ఉదహరించాడని ఉదహరించారు.



పాయమంటా ముదిమంటా బహురూపము యింక
నే యెడగాచెదు మము నిందిరారమణ ॥పల్లవి॥

అలాగే—

అన్నలంటా, తమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా
పన్ను కొని తిరిగేరు బహురూపాలు —

అంటూ, బహురూపాలను గురించి సంకీర్తనలలో ఎన్నో చోట్ల ప్రస్తావించారు.

జోగారావుగారి నిర్వచనం :

ఈ ప్రసక్తినిబట్టి బహురూపమనేది ఒక అక్కజపు వినోద విద్య అనీ, అది



బహుళా బహు కంఠస్వర విక్షేపసహితమైన బహు రూప వేషధారణతో కూడినదనీ, అది మేళంగట్టి ప్రదర్శింపబడేదనీ, అందులో భాషకు సంబంధించిన క్రియలన్నీ వుంటాయనీ ప్రదర్శన ప్రవర్తకుడుగా ఒక సూత్రధారుడు వుంటాడనీ పై విషయాలనుబట్టి విదితమౌతుందని, యస్వీ జోగారావు గారు నాట్యకళ జానపద కళా సంచికలో ఉదహరించారు.

అన్నమాచార్య పెద్ద కుమారుడు పెద తిరుమలయ్య తాను వ్రాసిన వెంకటేశ్వర విన్నపాలలో బహురూపాల్ని గురించి మరింత వివరంగా విశదీకరించారు.

సర్వేశ్వరా అవధారు జగంబు నీ నాటకశాల
నే నెత్తిన తొలి జన్మంబుల యాకారంబులు
నీ ముందర నాడెడు బహురూపంబులు
దార సుత బంధు జనులు మేళగాండ్రు
నిన్ను నుతియించు వేదశాస్త్ర పురాణ
చయంబు తూర్యత్రయంబు.

బహురూపానికి తిరుమలయ్యగా రిచ్చిన వివరణలో మేళగాండ్రు, తూర్య త్రయం. నాట్యం, భాషావిషయాలు, కొలువు, నర్తకులం అనే మాటలు బహురూప విశేషాలను వివరిస్తూంది.

దీనినిబట్టి బహురూప మనేది సామాన్యమైన నాట్యప్రక్రియవంటిది కాదని తెలుస్తూవుంది.

ఏదో ఒక విశిష్టమైన ప్రక్రియగా మనకి తోస్తూంది.

చతుర్విధాభినయాల సమ్మేళనంతో నృత్యగీత వాద్యాలతో మేళం కట్టి, నాటక రంగస్థలాలలో ప్రయోగింపబడే సర్వాంగసుందరమైన నాట్యప్రబంధమని, ఆచార్య యస్వీ జోగారావుగారు, నాట్యకళ జానపద కళల సంచికలో ఉదహరించారు.

ఎందరో ఇచ్చిన వివరణలు :

16 వ శతాబ్దానికి చెందిన ఎడపాటి ఎఱ్ఱన తాను వ్రాసిన "మల్హణ చరిత్ర" ద్వితీయా శ్వాసంలో—

చారణ బాగడ చర్చరీ బహురూప మండలాపాదిక ఖాండికములు అని బహు రూపాన్ని ఒక ఖాండిక విశేషంగా పేర్కొన్నాడు.

అలాగే అయ్యలరాజు నారాయణకవి తన "హంస వింశతి"లో బహురూప మునూ దానితోపాటు ఖాండికమును షోడశవిధాలైన నృత్యాలుగా పరిగణించాడు.

కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణ కవి తమ రచన "భరతకోశం"లో బహు రూపాన్ని గూర్చి,

దేశినృత్తం, నానా వేషధరం, యత్తద్వ బహురూప మితీరితమ్—అని భరత కోశం 418 పుటలో నిర్వచించారు.

బహురూపమంటే కొందరు దానిని ఏకపాత్రాభినయంగా భావించారు. ఏక పాత్రాభినయం అంటే— ఒకే వ్యక్తి విభిన్న మనస్తత్వాలను అభినయించటంగా భావించవచ్చు.

తాను పాత్రధారియై ఆ యా పాత్రల స్వరూపస్వభావాలను అభినయించటంగా ఎంచవచ్చు. ఇందుకు ఉదాహరణ, హరిదాసులు వారి కథాగానంలో వివిధ పాత్రలను అభినయించినట్లు,

అందుకు ఉదాహరణ అర్ధనారీశ్వర పాత్రనూ, దశావతారాలు మొదలైన వేషా లను ప్రదర్శించే పగటివేషధారులను మనం బహురూప ప్రదర్శకులుగా ఎంచవచ్చు.

బహురూప మంటే రూపాన్ని మార్చటమే కదా అంటే ఊసరవెల్లి లాంటిది.

బహురూప మంటే ఇంద్రజాలికుడనే అర్థం కూడా ఇచ్చారు కాని ఇది బహురూపానికి సరిపోని నిర్వచనం.

ఈ బహురూపం ఒక్క ఆంధ్రదేశంలోనే కాక, మైసూరు, బెంగాల్, మహారాష్ట్ర మొదలైన రాష్ట్రాలలో బహురూపం ఏదో ఒక రూపంలో బహుళ వ్యాప్తి చెందిం దని మనం ఊహించవచ్చు.



బహురూపాలే పగటి వేషాలు :

అయితే బహురూపం అంటే ఇదీ అనే నిర్వచనా న్నిచ్చే గ్రంథాలు లేనందువల్ల బహురూపం అంటే ఇదీ అని, దీని స్వరూప స్వభావాలు ఇలా వుంటాయనీ నిర్వచించటానికి మనకు తగిన ఆధారాలు లేవు. అయినా ఇంతమంది బహురూపాన్ని నిర్వచించడంవల్ల అది మనకు తెలియని ఒక అద్భుత కళా రూపంగా పేర్కొనవచ్చు. ఇంతకు పూర్వం బహురూపాన్ని గురించి లాక్షణికు లందరూ బహురూపులు అన్న పదానికి సరియైన నిర్వచనం ఇవ్వక ఎవరికి వారు తప్పుకున్నారు. కాని కర్నాటకలోనూ, మహారాష్ట్రలోనూ బహు రూపుల్ని గురించి వర్ణించినవారు, బహురూపాలను ధరించేవారే, బహురూపాలని నిర్ధారించారు. అంటే బహురూపాల ప్రతిబింబాలే పగటివేషాలు.





# అక్షయంగా వెలుగొందిన యక్షగానం

ఒకనాడు యక్షగాన వాఙ్మయం దక్షిణ భారతదేశంలో అంతటా దేదీప్యమానంగా వెలుగొందిందనటానికి కారకులు మన జక్కులవారే.

యక్షగానాలన్నా జక్కులవారన్నా ఈనాటి వారిలో కొంత హీనదృష్టి వుంది. కాని ఆంధ్రదేశంలో శతాబ్దాల తరబడి యక్షగాన వాఙ్మయం, యక్షగాన కళా రూపాలు విచ్చలవిడిగా ప్రచారంలో వున్నాయి.



జక్కులవారు విద్యా వివేకాల్లో ఘటికులు. ప్రాచీన జాతుల్లో జక్కులు.... బవనివాండ్లు మొదలైనవారు, మేధావివర్గంగా ఎంచబడేవారు. సంగీత సాహిత్యాల లోనూ, చిత్రశిల్ప కళాప్రతిభల్లోనూ, అద్వితీయ స్థానాన్ని సంపాదించారు. ప్రతిభా వంతులుగా పేరు పొందారు.

ఈనాటి వైదుష్యం :

ఈనాడు కూచిపూడి భాగవతుల కళావైదుష్యాన్ని మనం ఎలా స్తుతిస్తు న్నామో అలాగే నాటి జక్కుల వారిని, బవనివాండ్లనూ స్తుతించేవారు. కాని వంశ పారంపర్యంగా వీరి కళాకౌశలం క్షీణిస్తూ వచ్చింది. ఉన్నతాదర్శాలు నశించాయి. ఆనాటి యక్షగాన వాఙ్మయానికి ప్రతీకగా ఈ నాడు, అచ్చుగ్రంథాలైతేనేమి, వ్రాత ప్రతులైన తాళపత్ర, సాధారణ పత్రగ్రంథాలైతేనేమి నాలుగువందల వరకూ యక్షగాన రచన లున్నాయని వినికిడి.

అయితే కొండవీటి రెడ్డిరాజుల కాలంలోనూ విజయనగర రాజుల కాలం లోనూ, తంజావూరు ఆంధ్రనాయక రాజుల కాలంలోనూ, యక్షగానాలూ, యక్షగాన వాఙ్మయం దేదీప్యమానంగా వెలుగొందిన విషయం సర్వసామాన్యంగా అందరికీ తెలిసిందే.

ప్రాచీనంలో ప్రాచీనం : యక్షగానం

మన ప్రాచీన కళారూపాల్లో అతి ప్రాచీనమైంది యక్షగానం. ఆంధ్ర, తమిళ, కర్ణాటక రాష్ట్రాలలో అతి విస్తారంగా వ్యాప్తిలోకి వచ్చింది. ఈ నాడు మనం చూస్తున్న వీధి భాగవతాల మాత్రుకలు ఈ యక్షగానాలే.

యక్షగానాల తరువాత ప్రచారంలోకి వచ్చింది వీధి భాగవతాలు. యక్షగానం అంటే యక్షులచే పాడబడే సంగీత విశేషం అనీ, యక్షగానాలు ఎక్కువగానూ, మక్కువగానూ జక్కు జాతివారు ప్రదర్శిస్తారు గనుక యక్ష శబ్దం జక్కు శబ్దంగా మారిందనీ, ఇది యక్షులతో పాడబడే సంగీత విశేషమనీ, ఇంకెన్నో రీతుల వ్యాఖ్యానించారు. వ్యాఖ్యానించిన వారందరూ వారి వారి రచనల్లో నాటకాలను ప్రస్తావించారు. వారు ఉదహరించిన నాటకాలు, యక్షగానాలా? లేక యక్షగానాలనే నాటకాలుగా ఉదహరించారా? తెలుసుకోవడం ఎంతైనా అవసరం.



మన అలంకారికులు :

నాటకాంతం హి సాహిత్యం, కావ్యేషు నాటకం రమ్యం, అని మన సంస్కృత అలంకారికులు సాహిత్య ప్రక్రియలో నాటకానికి అత్యంత ప్రాముఖ్యమిచ్చినా మన పూర్వాంధ్ర కవు లెవరూ నాటక రచనకు పూనుకోలేదనీ, సంస్కృత లక్షణ గ్రంథాలను అనువాదం చేసిన పూర్వాంధ్ర లాక్షిణికులు, నాటకాన్ని వదిలివేస్తూ వచ్చారనీ శ్రీనివాసచక్రవర్తిగారు (నాట్యకళ జానపద సంచికలో) ిపరించారు)

అయితే తిక్కనగారి విరాటపర్వం చదివినా పింగళ సూరనగారి ప్రభావతీ ప్రద్యుమ్నం చదివినా వారిద్దరికీ, నాటక కళలో ప్రవేశమున్నట్లు మనకు అర్థం అవుతుంది కాని వీరిరువురూ తెలుగులో నాటకం మాత్రం వ్రాయలేదు.

అలాగే, పిల్లలమర్రి పినవీరభద్రుడూ, నందిమల్లయ్యా, ఘంటసింగయ్యా. మంచన మొదలైన కవులు ''శాకుంతలం'' ప్రబోధ చంద్రోదయం విద్దసాల భంజికలను ప్రబంధాలుగానే వ్రాశారు కావి, నాటకాలు మాత్రం వ్రాయలేదు.

తెలుగు కవుల, సంస్కృత నాటకాలు :

ప్రసిద్ధ సంస్కృత నాటక కర్తలైన భవభూతి ''మురారి'' భట్టనారాయణ ఆంధ్రులే. సంస్కృతంలో ఉన్మత్తరాఘవం, మదనవిలాస బాణం ''మహాభారతం'' నరకాసురవిజయవ్యాయోగం, రత్నపాంచాలిక; రచించిన భాస్కరుడూ. ''పశుపతీ'' నాగనాథుడూ గంగాధర కవి ''ధర్మసూరి'' సింగభూపాలుడు మొదలైన కవు లందరూ ఆంధ్రులే.

వీరేకాక ఆంధ్రకవులైన ''వెంకటాధ్వరి'' ''నృసింహకవి'' భట్టభాణుడు మొదలైన ఆంధ్రకవులు. సంస్కృతంలోనే నాటకాలను వ్రాశారు. ఆ విధంగా సంస్కృతంలో నాటకాలు వ్రాసిన వారిలో దేశం మొత్తంమీద అగ్రతాంబూలం అందుకున్న వారు ఆంధ్రసంస్కృత నాటక కర్తలే.

అలాగే కాటయవేముడూ, సుప్రసిద్ధ తెలుగు నాటక రచయిత కోలాచలం శ్రీనివాసరావు మొదలైనవారు ఆంధ్రులైనా, సంస్కృత నాటకాలకు వ్యాఖ్యానాలు మాత్రమే రచించారు.

నన్నయభట్టూ, నాటకాల ప్రస్తావనా? :

పై వివరాలనుబట్టి తెలుగులో నాటకాలను ఎవరూ రచించకపోయినా, నన్నయ్యభట్టు అవతారికను పరిశీలించినట్లైతే—

విమల మతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మ
శాస్త్రముల తెఱంగెఱింగితి నుదాత్తరసాన్విత కావ్య నాటక
క్రమములు పెక్కు సూచితి, జగత్పరిపూజ్యములైన
యీశ్వ రా
గమముల యందు నిల్చితి, బ్రకాశముగా హృదయంబు
భక్తితోన్



అని రాజరాజ నరేంద్రునిచేత చెప్పించడంవల్లనూ, అలాగే పాలకురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో —

ప్రమథ పురాతన పటు చరిత్రముల
గ్రమమంద బహు నాటకములాడువారు. అనీ

అలాగే క్రీడాభిరామంలో,

లెస్సగాగ కిరాట యీలేమచరిత
మాడుదురు నాటకంబుగ నవనిలోన,

అనీ విస్పష్టంగా చెప్పటంవల్ల పూర్వం ఏదో ఒక విధమైన నాటకా లాడేవా రని నిర్ధారణ అవుతూంది. అయితే అవి ఎలాంటి నాటకాలు? అని మనం తెలుసు కోవాలంటే ఈ నాడు కోకొల్లలుగా దొరుకుతున్న యక్షగానాలే ఆ నాటి తొలి నాటకా లని చరిత్రకారుల అభిప్రాయం.

ఇంతకీ యక్షు లెవరు? :

ఇంతకీ యక్షు లెవరో తెలుసుకోవాలనుకుంటే మన కీ క్రింది ఆధారాలు లభి స్తున్నాయి. బౌద్ధ, జైన, బ్రాహ్మణ సారస్వతాలలో "యక్షులను" దేవతాగణంగా పేర్కొన్నారు. వారు నీతి ప్రవర్తకులనీ, కామరూపులనీ, శూరులనీ, జిజ్ఞాసకులనీ వివరించారు.

ప్రారంభంలో వారి నివాసభూమి సింహళమనీ, వారి రాజు కుబేరుడనీ, బలి చక్రవర్తి సేనాని సుమాలి ఈ యక్షులను ఓడించి రాక్షస రాజ్యం స్థాపించాడనీ, మరికొన్ని గ్రంథాలలో రావణుడు లంకను జయించి కుబేరుని వెడలగొట్టి రాక్షస రాజ్యం స్థాపించాడనీ, వివరింపబడింది.



ఓడిపోయిన కుబేరుడు దక్షిణ భారతదేశానికి తన అనుయాయు లతో వలస వచ్చాడనీ, చెపుతారు.

యక్షులు "అక్షసీ" నదీ ప్రాంతంవారో లేక "గూచి" అన బడే మంగోలియన్‌లో అనీ.

కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

ఈ యక్షులు ఎవరైనా,

....మేళముగూడి పాడుచుందురు దిక్పాలసభల (అని పారి జాతాపహరణం) లోనూ.

కిన్నెరలు పాట పాడుచుండగా, తాళసంఘ ప్రభేదంబుల గతులచే యక్ష కామినులు నాట్యంబు లాడేవారని (రామాభ్యుదయం) లోనూ.



మంగళమస్తు రమానాథ యని, యక్షవనితలు కర్ణపర్వముగా పాడేవారని (చిత్రభారతం) లోనూ వివరించడాన్నిబట్టి, యక్షులు నృత్యగానాల్లో ప్రజ్ఞావంతులని వెల్లడౌతోంది.

ఇలా నృత్యగానాలలో ప్రజ్ఞావంతులైన యక్షులు సింహళం వదలి దక్షిణ భారతదేశానికి వలస వచ్చిన జక్కు జాతివారని పలువురి అభిప్రాయం.

సింహళంలో వాడుక భాష పాళి. సంస్కృత యక్ష శబ్దానికి ప్రాకృతం ''ఎక్కులు''. తెలుగు తద్భవం ''జక్కులు''. జక్కుల వారు వలసవచ్చిన వారైనా. ఆదిమవాసులైనా వారు సంగీత నృత్య కళాకారులన్న మాట నిజమంటూ, వీరి పేరనే ''జక్కిణి రేకులు'' ''జక్కిణి దరువు'' ''జక్కిణి నృత్యం'' వెలిశాయని, శ్రీనివాస చక్రవర్తిగారు నాట్యకళ సంచికలో వుదహరించారు.

### భామ వేష కథ యక్షగానం:

నృత్యగానాలలో ప్రజ్ఞావంతులైన యక్షులు జక్కిణిరేకులు, జక్కిణి నృత్యం చేసినట్లు భామవేష కథ అనే యక్షగానంలో—

జోకగ గీత వాద్యముల సొంపుగ నింపుగ పంచ
జిక్కిణి ప్రాగటమైన నాట్య రసభావముల విన్పింతు వేడుకన్.
అనీ—

అణునిభమధ్యలాక్రియలు నా పరిభాషలు నొప్ప జిందు
జిక్కిణి, కొరవంజి మేళముల గేళిక సల్పిరి దేవతా నటీ
మణులకు బొమ్మవెట్టు క్రియ మర్దళ తాళ నినాద పద్ధతిన్
రణుదురు రత్ననూపుర ఝణం ఝణముల్ మెలయం బదాహతిన్

అనీ కవులు వర్ణించినారు.

అలాగే తంజావూరు ఆంధ్రనాయకుల దర్బారులలో జిక్కిణి నాట్యగోష్ఠి జరిగేదనీ —

విజయరాఘవుని ఆస్థానంలో మూర్తి జక్కిణి నృత్యం చేసేదని (రాజగోపాల విలాసంలో ఉదహరించబడింది).

అలాగే, విజయరాఘవరాయలు కొరవంజి శుభలీల. గుజరాతి, దేశి, చౌపదియు "జిక్కిణి....నాట్యముల్ హావణించు నవరజ్ఞు" అనీ (ప్రహ్లాద చరిత్రలో వ్యవహరించారు.)

అలాగే, తంజావూరు "అన్నదాన" నాటకంలో జక్కుల రంగసాని పదకేళిక పట్టినట్లు వర్ణించాడు. వీరి పేరన "జక్కసాని కుంట్ల, జక్కుల చెఱువు" మొదలైన గ్రామాలు కానవస్తున్నాయి.

పారిజాతాపహరణంలోని "యక్ష గ్రామ వాస్తవ్యులు" అనే ప్రయోగంవల్ల బ్రాహ్మణ అగ్రహారాలవలెనే జక్కులవారు ప్రత్యేకంగా గ్రామాలు నిర్మించుకున్నారని చెప్పుకోవచ్చు. వీరు ఆంధ్రదేశంలో ముఖ్యంగా గుంటూరు, గోదావరి జిల్లాలలో ఎక్కువగా నివసిస్తున్నారని, దక్షిణ భారతదేశంలోని "కులాలు - తెగలు" అనే గ్రంథంలో "ఈథర్స్టన్" ఇలా ఉదహరించాడు. జక్కులవారు తక్కువ తరగతి వ్యభిచారిణులనీ, బలిజకులస్థులనీ. మంత్రవేత్తలనీ, నృత్యనాటకరంగోపజీవనులనీ, వీరు ఎక్కువగా కృష్ణా జిల్లా తెనాలి దగ్గర వున్నారనీ, వీరిలో ప్రతి కుటుంబమూ, ఒక బాలికను వ్యభిచార వృత్తికి కేటాయించటం మామూలని తెలియజేశారు.

శిలప్పదికారంలో :

యక్షగాన వాఙ్మయమూ, యక్షగాన ప్రదర్శనాలూ దక్షిణ భారతదేశంలో అతి ప్రాచీనకాలం నుండీ బహుముఖాల విజృంభించాయి. క్రీ॥ శ॥ 8 వ శతాబ్దానికి ముందుగానో, ఆ తరువాతనో తమిళంలో వ్రాయబడిన "శిలప్పదికార" మనే కావ్యంలో నాటకాలను గూర్చి, నాట్యశాస్త్రానికి సంబంధించిన అనేక శాస్త్రీయ విషయాలూ ఉదహరింపబడి ఉన్నాయని శ్రీ నేలటూరి వెంకటరమణయ్య తెలియజేశారు.



పండితారాధ్య చరిత్రలో :

ఇకపోతే 13 వ శతాబ్దంలో వుద్భవించిన పాల్కురికి సోమనాథుడు దేశి నాటక సాంప్ర

దాయాలను గూర్చి, శ్రీశైలం శివరాత్రి మహోత్సవాలలో జరిగే నాటక రూపాలను గూర్చి, పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో "నాదట గంధర్వ యక్ష విద్యాధు రాదులై పాడెదు నాడెదువా''రని వివరించాడు. యక్షగానం ఎంతో ప్రాచీన కళా రూపమైనప్పటికీ, పండితారాధ్య చరిత్రలో వివిధ కళారూపాలను చర్చించినంత విపు లంగా యక్షగానాన్ని గూర్చి వివరించకపోవడాన్నిబట్టి 1280 కి పూర్వం యక్షగాన కళారూపం అంతగా ప్రచారంలో లేదని తెలుస్తూంది.

చెన్నశౌరి మొదటి యక్షగానం :

చరిత్రను బట్టి చూస్తే 15 వ శతాబ్దం ప్రథమ పాదంనుంచే మనకు యక్షగానాల ప్రసక్తి కనబడుతూ వుంది. పదిహేనవ శతాబ్దంనాటి ప్రోలుగంటి చెన్నశౌరి "సౌభరి



చరిత్ర'' గాథను జక్కులవారు ఆనాడు కథా గానంగా పాడివుండవచ్చు. 1550 నాటి చిత్రకవి పెద్దన, తన లక్షణసార సంగ్రహంలో చెన్నశౌరి రచించిన "సౌభరి చరి తాన్ని'' ఉదహరించడాన్ని బట్టి తెలుగులో ప్రథమంగా వెలువడిన యక్షగానం అదే నని చెప్పవచ్చు.

ఎందరో చెప్పిన, యక్షగాన వివరణ :

16 వ శతాబ్దంలో రచించబడిన చిత్రభారతం యక్షగానంలో యక్షవనితల పాట, యక్షకామినుల నాట్యం పేర్కొనబడ్డాయి. 16-వ శతాబ్దంలో యక్షగానాల ప్రభావం ఎక్కువగా వున్నట్లు తెలుస్తూ వుంది.

సుగ్రీవ విజయం :

కందుకూరి రుద్రయ్య సుగ్రీవ విజయాన్ని యక్షగానంగా వ్రాసి ఆ వూరి జనార్దనదేవునికి అంకిత మిచ్చాడు. సుగ్రీవ విజయం అతి ప్రాచీనమైనదిగాను, ప్రాముఖ్యమైనదిగాను గుర్తింపబడింది. రుద్రయ్య సుగ్రీవ విజయాన్ని యక్షగాన మనే పేర్కొన్నాడు. ఇందులో విశిష్టమైన రగడ భేదాలేగాక. ద్విపదలు, అర్ధ చంద్రికలు, ధవళాలు, శోభనాలు, పద్యాలు, చిన్న చిన్న వచనాలే గాక, సంవాదాల తోనూ, దరువులతోనూ, సంభాషణలతోనూ, ప్రియదర్శనయోగ్యంగా, వీథినాటకంగా ఆడబడి వుండవచ్చుని నేలటూరివారు వివరించారు

16.వ శతాబ్దపు ప్రాంతపువాడైన చిత్రపురి రాఘవాచార్యుని 'విప్రనారాయణ చరిత్ర' 'బాలపాపాంబ అక్కమహాదేవి చరిత్ర' రచనా విధానం కూడ సుగ్రీవ విజయం కోవకే చెందివున్నాయి.

కర్నూలుజిల్లా వాసియైన పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నంలోనూ, గంగావతరణం నాటకంలోనూ ఆనాటి ప్రదర్శనా పద్ధతి గూర్చి వివరించాడు.

అహోబిల ప్రాంతంలో గుళదుర్తి అగ్రహార వాస్తవ్యుడు కాజవేంకటాద్రి 'వాసంతికా పరిణయం' అనే యక్షగాన ప్రబంధాన్ని వ్రాశాడు.

ఆ రోజుల్లోనే నెల్లూరు ప్రాంతంలో కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాస మనే యక్షగానంలో అనేక విశేషాలను వివరించాడు.

సేలపురం చేరువలో వున్న వుద్దండమల్లి సముద్రవాసియైన ఎల్లకవి శేషము వెంకటపతి శశాంక విజయాన్ని అనుసరించి 'చంద్ర తారావిలాస' మనే యక్ష గానాన్ని రచించాడు.

ఇప్పటికి షుమారు రెండు వందల ఏభై సంవత్సరాల క్రితం సేలం జిల్లా హోసూరు తాలూకా తోగిరయ అనే అగ్రహార నివాసిని అన్నదానం వేంకటాంబ రామాయణం బాలకాండను యక్షగానంగా రచించింది.



రాయల సీమలో జక్కుల వారి కులదేవతైన అక్కదేవతల కొండ వుండడాన్ని బట్టి యక్ష గానానికిది మూలమని చెప్పవచ్చు. ఈనాటికీ గుంటూరు గోదావరి

జిల్లాలో వున్న జక్కులవారు కళావంతుల కోవకుచెంది అభినయ కళలో ప్రావీణ్యం సంపాదించారు.

యక్షగానాన్ని గూర్చి బ్రౌణ్యనిఘంటువులో యక్షగాన మంటే ఒక విధమైన పాటగానే నిర్వ చించబడింది.



అప్పకవి మెప్పులుగొన్న గొప్పతనం:

అప్పకవీయాన్ని వ్రాసిన కాకునూర్యప్ప కవి తన్ను గూర్చి ఈ విధంగా వ్రాసుకున్నాడు:

లలిత కవికల్ప కాఖ్యాన లక్షణంబు
మహిత సాధ్వీ జనౌఘధర్మ ద్విపదయు
అంబికా వాదనామక యక్షగాన
కృతియు జేసితి కాకునూరి కులప్ప.

అని అప్పకవి అంతటివాడు అంబికావాదమనే యక్షగానాన్ని వ్రాశాడు.

అప్పకవీయంలో ''అర్ధచంద్రికలు'' త్రిపుటజంపె, అటతాళము, వీన యక్ష గాన ప్రబంధము లతకవచ్చ అని అప్పకవి వ్యాఖ్యానించాడు. అంటే పాటలు గల ఒక ప్రబంధంగానే అప్పకవి అభిప్రాయంగా మనం తెలుసుకోవచ్చు.

వేషధారణలో అందచందాలు :

ఈనాటి యక్షగాన ప్రదర్శనంలో వేష భూషణ అలంకారాల నన్నిటినీ చూస్తూనే వున్నాం. అయితే ఆ నాటి వేషధారణ ఎలా వుండేదో పాలకురికి సోమ నాథుడు పండితారాధ్య చరిత్రలో ఈ విధంగా వర్ణించాడు:

శిరమున నురమున జెవుల గంతమున
గరముల గూకటి గాళ్ళ జెల్వార
గవదండలును గనుగవ గదలికలు
నవరంబులును గలశంపు దండలును
భసితంపు బూతపై బరగు బచ్చెనలు
నరరారు చిరు గజ్జియలును నందియలు

సరిరత్న పంక్తుల జలపోషణములు
గరమొప్ప తొంగళ్ళు గల చల్లడములు



బొల్చు దంతావళుల్ పుష్పమాలికలు
ధాల్చి యత్యద్భుతోత్సవ లీలదనర
జనులు హర్షింప నాస్థానముల్ సొబ్బ
యనుకూల వివిధ వాద్య సమ్మేళనమున్
నార్భటం బిబ్బ యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వత్రిల్ల.

అని పండితారాధ్య చరిత్రలో ఉదాహరించాడు.

యక్షగాన కథానాయికి
జక్కుల పురంధ్రి:

వేషభాషలతోనూ, ముగ్ధమోహనమైన ముఖాలంకరణతోనూ శృతిపక్వమైన వాయిద్యంతోనూ, వీనులవిందైన సంగీతంతోనూ, తాళలయ సమన్వితమైన నృత్యంతోనూ, జక్కుల పురంధ్రి అంటే యక్షగానపు కథానాయకి ఎలా రంగస్థలాన్ని అలరించేదో శ్రీనాథుడు క్రీడాభిరామంలో ఈ విధంగా వర్ణించాడు:

కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వనితార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాననలు కొల్పిన కన్ను
కొడుపుచే దాటించు నెడపదడప
శ్రుతికి నుత్కర్షంబు జూపంగవలయు బో
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కు గిల్కున మోయు కింకిణీ గుచ్ఛంబు తాళ
మానంబుతో మేళవింప.

రాగమున నుంకి లంఘించు రాగమునకు
నురు మయూరు ద్వయంబుపై నొత్తిగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కుల పురంధ్రి. (క్రీడాభిరామం)

శ్రీనాథుని వివరణ :

శ్రీనాథుడు దక్షవాటీ మహాపురమును (అంటే నేటి ద్రాక్షారామ) భీమ ఖండంలో వర్ణిస్తూ,

కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి.

అన్నాడు. అంటే శ్రీనాథుని కాలంనాటికి కూడా యక్షగానాలను మనం పాట గానే గుర్తించవచ్చు.



యక్షగాన బృందం

అలాగే కాశీఖండంలో

వల్లకి చక్కి కాహళము వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్
ఝల్లరి యాదిగా గలుగు శబ్ద పరంపర తాళ శబ్దమై
యుల్లసిలం బ్రబంధముల నొప్పగ నాడుదు రగ్రవేదిపై
బల్లవపాణులీశ్వరుని బంట మహేశులు పూజసేయగన్.

అని ఉదహరించాడు.

యక్షగాన కలాపం :

యక్షకన్యల నృత్యాని కనువైన ఆహార్యం కాక ఏదో ఒక నాయక పాత్ర ఆహార్యాన్ని ధరించి ఆడుతూ, పాడుతూ. తన కథను తానే వినిపించే యక్షగాన రూపమే కలాపం.

ఏకపాత్రాభినయానికి సంబంధించిన ఈ కలాపాలు, శ్రీనాథుని కాలంనాటికే వర్ధిల్లిన వనటానికి ఉదాహరణగా ఈ క్రింది పద్యంవల్ల వెల్లడౌతూవుంది.

విరుల దండల తోడి వేణికా భరంబు
　　పొంకంబు పిరుదుల బొరలియాడ
మణితులాకోటి కోమల ఝుణత్కారంబు
　　రవళి మెట్టెల మ్రోత యవఘళింప
కుదురు నిండిన చిన్ని గుబ్బచన్నుల మీద
　　ముత్యాల త్రిసరంబు మురుపుజూప
వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ
　　లేత వెన్నెల బుక్కలించి యుమియ
సాని ఈశానియై మహోత్సవమునందు
　　గేల నవచంద్ర కాంతంబు గిన్నెపూని
వీథి భిక్షాటన మొనర్చువేళ జేయు
　　మరులు నృత్యంబు జగముల మరులు కొలుపు



ఆనాడు భీమేశ్వరుని కొలువులో ఎన్నో కళారూపాలు ప్రదర్శింపబడినట్లు శ్రీనాథుడు భీమఖండం ప్రథమాశ్వాసంలో ఈ రీతిగా వర్ణించాడు.

అల్లయ వేమభూపాల రాజ్యభార ధురంధరుడై
బెండపూడన్నయామాత్యుడు గట్టించి
మొగసాల వాకిటి మహోత్సవ మండపంబునందు
బేరోలగంబుండి కుండలీదండలాసక
ప్రేరణీ ప్రేంఖణ సింధు కందు కథ మాళిచేల
మతల్లీ హల్లీ సకాది నృత్యంబు లవలోకింపుచు

జంపూచాటు నాటకోదాహరణ జయఘోష
చక్రవాళ, చతుర్భద్ర చతురాతి ప్రబంధంబు లాకర్షింపుచు.

అని భీమేశ్వర ఖండంలో శ్రీనాథుడు ఉదహరించిన నాటక ప్రబంధాలు యక్ష గానాలే కావచ్చని చింతాదీక్షితులుగారు. (ప్రజా వాఙ్మయంలో) ఉదహరించారు.



అయ్యగారి వీరకవి :

అలాగే అయ్యగారి వీరకవి తాను వ్రాసిన చిత్రాంగద విలాసమనే యక్ష గానంలో ఈ విధంగా వివరించాడు.

...............నాకు దోచు
నట్టు లానంద మొప్ప ధర్మాంగ చరిత
మనగ చిత్రాంగద విలాస మనగ
యక్షగాన మొనరింతు వేషముల్ గట్టి జనులు
పాడి వినిపింప బుణ్యసంపద ఘటింప.

ఈ వుదాహరణను బట్టి. యక్షగానాలను జనులు వేషాలు గట్టి పాడి విని పించేవారని తెలుస్తూ వుంది. ఈ రోజుల్లో మాదిరి కాక ఆ కాలంలో ఎవరో ఒకరు వేషాలు వేసుకుని కథంతా వారే పాడేవారని ఊహించవచ్చు. అందుకు ఈనాటి హరి కథాగానాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు.

కంకంటి పాపరాజు :

ఉత్తర రామచరిత్రను అద్వితీయంగా రచించిన, కంకంటి పాపరాజు "విష్ణు మాయావిలాస"మనే యక్షగానం వ్రాశాడు. అందులో ఇలా వివరించాడు.

కంకంటి అప్పనార్గణి కుమారుండు
పంకజలోచన పంచబాణుండు
పాపరా జొనరించె బహుపదార్థముల
వ్యాపించి విష్ణుమాయా విలాసంబు
భూమిని తిలకించి బుధులెల్ల బొగడ
ఆ మిత్ర తారాభమై విభాసిల్ల.

అని, ఈ వివరణబట్టి చూచినా జనులు వేషముల్ గట్టి పాడగా బుధులు చూచి ఆనందించేవారని అర్థమౌతూంది.



కూర్మనాథ కవి :

1624 సంవత్సర ప్రాంతంలో గోకులపాటి కూర్మనాథ కవి మృత్యుంజయ విలాసమనే యక్ష గానాన్ని వ్రాశాడు. అది అతి ప్రౌఢంగా వుందని దీక్షితులుగా రన్నారు.

వైకుంఠ వామన వారిజనాభ
నీ కంకితముగ నా నేర్చిన రీతి
మృత్యుంజయ విలాస మృదుతర కావ్య
మత్యంత భక్తితో యకగానంబు
రచియించి నీకు నర్పణ సేయదలచి

అని ఒకచోట తన గ్రంథాన్ని యక్షగానమన్నాడనీ మరి ఒకచోట నాటకమనీ అన్నాడు.

అత్యంత భక్తితో నంకితంబైన
మృత్యుంజయ విలాస మృదుల నాటకము
హరి కంకితం బౌట హరికథ యౌట.

అని అనడాన్ని బట్టి యక్షగానమన్నా, నాటకమన్నా ఒకటిగానే భావించారన దానికి పై ఉదాహరణను తీసుకోవచ్చు.

భామ వేషంలో, యకగాన పోకడ :

తరతరాలుగా ప్రదర్శిస్తున్న కూచిపూడివారి భామ వేషం, యక్షగానమవే నా ఊహ అంటున్నారు చింతావారు.

భామ వేషంలో కథ పారిజాత పుష్పానికి సంబంధించిన ప్రసంగానికి సంబం ఓచింది. తనకు నారదు డిచ్చిన పువ్వును. శ్రీకృష్ణుడు రుక్మిణికి ఇవ్వగా సత్యభామ ని కోపించటం, విరహం చెందటం. కృష్ణునికి సందేశం పంపటం; కృష్ణుని కలుసు కోవటం, అలకపానుపెక్కటం, తరువాత విరహం తీరటం.

ఉపపాత్రలు :

ఇందులో వేషం కట్టేది సత్యభామ మాత్రమే. ప్రక్కనున్న బ్రాహ్మణుడు, సమయాన్ని బట్టి చెలికత్తె అవటం, వైశ్యు డవటం, హాస్యగా డవటం, ఈ విధంగా ప్రతి పాత్రకూ తానే అవుతాడు. చివరకు మాత్రం కృష్ణుడు ప్రవేశిస్తాడు. కాని మాట్లాడడు. ఈ భామ వేషాన్ని రచించిన సిద్ధేంద్రయోగి తన గ్రంథాన్ని శృంగార ప్రబంధంగా పేర్కొన్నాడు. యక్షగానాలను ప్రబంధా లనడాన్నిబట్టి, పై భామా వేషాన్ని కూడా యక్షగానంగా భావించవచ్చు.

పై వివరాలనుబట్టి యక్షగానమంటే పాటలతో కూడిన ఒక ప్రబంధ మనిన్నీ, దానిని ఎవరో ఒకరు వేషం వేసుకుని పాడుతూ, ఆడేవారని బోధపడుతూంది.



సలక్షణ యక్షగానంలోని విలక్షణత:

యక్షగాన ప్రదర్శనంలో వున్న విశేషమేమంటే మన వీథి భాగవతాలలో వచ్చే పాత్రధారులు ఎవరి పాత్రను వారు ప్రదర్శిస్తారు. యక్షగానంలో ఈ మాదిరి కాక, ప్రదర్శనంలో వచ్చే ప్రతి పాత్రా తన్ను గూర్చి తాను చెప్పుకోవడంతో పాటు కథను కమ్మగా, గుమ్ముగా నడుపుతూ వుంటుంది. ఇదే యక్షగాన ప్రదర్శన స్వరూపం. ఉదాహరణకు: ''రాజు వెడలే యమధర్మరాజు సభకు'' అని తన్ను గూర్చి తాను చెప్పుకుంటాడు. ఈ మాదిరి వీథి భాగవతాలలో సూత్రధారుని ప్రవేశంలోనూ, ప్రధాన పాత్రల ప్రవేశ సమయాల్లోనూ యక్షగాన పోలికలు కనబడుతున్నాయి.

మన్నెకొండ విలాసం :

ఉదాహరణకు మన్నెకొండ విలాసం యక్షగానంలో చిత్రాంగద తన ప్రవేశాన్ని గూర్చి

దేవినే చిత్రాంగద ॥దేవినే॥

దేవినే పాండ్య దేశాధిపునకు
కేవల సుతనై కీర్తి వహించిన ॥దేవినే॥

భామనే, రాజిత గుణధామనే
కామిని సలలిత సోముని సమమగు
మోహము గలిగిన సామజయానను ॥దేవినే॥

ఎరుకలసాని ప్రవేశం :

యక్షగానంలో కథకు సంబంధించిన పాత్రలతోపాటు ఎరుకసాని పాత్ర కూడా విశేషంగా ప్రవేశింపబడేది. ఎరుకసాని. ప్రవేశంతో—

ఎరుక జెప్పితి వినవమ్మా - ఓ ముద్దులగుమ్మా
కరుణతో కలవే కనకపు బొమ్మా
ఎరుకా, ఎరుకా యేడు జగములు
మురియుచు నీ రీతి జనముచ్చట జెప్పెద.

అంటూ వుండగా కథానాయకి, 'ఇంకా ఎటువలెనే చెప్పవమ్మా' అనగా ఎరుకసాని,



ఓ తరుణీమణీ - వో పువ్వుబోణి
ప్రీతితో వినవమ్మా - నిత్యకళ్యాణి
కర్ణాట కొంకణ - కాంభోజ ద్రవిడ
కర్ణాట సింధుకు సామీప్యమూన
అంగ - వంగ - కళింగ - వంగదేశముల
బంగాళ నేపాళ బర్బర శౌరి
ఆంధ్రపు శీంద్రము అంతట దిరిగి
చంద్రసూర్యుల యందు చరియించి మించి
గరుడ గంధర్వుల గగన మార్గమున
నారద తుంబురు నాట్యంబు జూచి
అన్ని లోకంబులు అంతయు దిరిగి
వున్నాడు జగమంత ఒప్పుగా తిరిగి

అంటూ కథానాయకి చేయి చూచి సోదె చెప్పడం ప్రారంభిస్తుంది.

యక్షగాన బాణీ :

సుగ్రీవ విజయం యక్షగానంలో, ''యక్షగాన కథాక్రమం బెట్టిదనిన'' అని కథాప్రవేశం చేశాడు. దీనినిబట్టి యక్షగానా లను ప్రబంధాలుగా గుర్తించవచ్చు.



ఉదాహరణగా కథ :

శ్రీరాముడు లక్ష్మణ సమేతుడై ఋష్యమూకమునకు వెళ్ళటం, సుగ్రీవుడు భయపడి హనుమంతుని పంపటం, హనుమంతుని రాయబారం, సుగ్రీవునితో స్నేహమూ, శ్రీరాముని బల ప్రదర్శనమూ, వాలి సంహారమూ, సుగ్రీవ పట్టాభిషేకమూ.

సీతను వెదకుతూ శ్రీరాముడు లక్ష్మణునితో పంపా ప్రాంతమున సంచరిస్తూ వున్నప్పుడు సుగ్రీవుడు వారిని చూచి ఇలా హనుమంతునితో అన్నాడు :

వీరు మనలను వధియింప వేషమొందె
వాలిపంపున వచ్చిన వారు గాను
నాకు గాన్పించుచున్నది గాకయున్న
తాపసుల కేల శరచాపధారణములు

అప్పుడు హనుమంతుడు ఈ విధంగా చెప్పాడు:

ఈ మనోహర రూపవైఖరు
లిట్టి తేజము గలుగువారికి
భూమి నెటువలె దుష్ట గుణములు
బొడము నయ్యా
ఏను నచటికి బోయి వారల
పూని కంతయు తెలిపి వచ్చెద
భానునందన వెరువ నేటికి
బంపు నన్నూ.

సుగ్రీవుడు హనుమంతుని పంపి భయంతో మలయాద్రికి పోయాడు. హను మంతుడు రామ లక్ష్మణుల సంగతి పూర్తిగా తెలిపి వచ్చి సుగ్రీవునితో వివరాలు చెప్పాడు.



.........ఓ కపికులాధీశ
ఆ రూఢి నీ కనాయాసంబు కతన
శ్రీరాము డనెడి నిక్షేపంబు దొరకె
నింక నీ యక్కర లెల్లను దీరె
గొంకక రఘురాము కొల్వ కేతెంచి.

దుఃఖిస్తున్న రాముడు :

త్రిపుట

నన్ను విడిచియు నిలువజాలక
నాతి వచ్చితి వడవి దిరుగను
నిన్ను విడిచే నెట్టులోర్తును
నీలవేణీ
రమణిరో నిను బాసినప్పుడె
రాతిరే శివరాతి రాయెను
నిమిషమైనను నాదు కంటికి
నిదుర రాక॥

అంటూ విలపిస్తాడు. తరువాత శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహం చేసి వాలిని బాణంతో కొట్టాడు. అప్పుడు వాలి శ్రీరామునితో ఇలా అంటున్నాడు:

వాలి విలాపం :

నను బేరుకొని పిలిచి నా ముఖాముఖి నిలిచి
జననాథ పోరాడి జంపరే ప్రీతి
పొంచి వేసితి రామభూపాల! నృపధర్మ
మెంచికోతేవైతి వెంతజేసితివి
శ్రీరామ నీరామ జెరగొన్న రావణుని
వారిధుల ముంచితిని వాలమున జుట్టి

ఒక మాట నాతోడ నొనరంగ దెల్పవై
తట రావణుని దున్మి యా సీతదేనె॥

**తార దుఃఖం :**

వాలి మూర్ఛనొందిన సంగతి తారకి తెలిసింది. దుర్భర దుఃఖంతో ఆమె వారివద్దకు వచ్చి విలపించింది. సుగ్రీవుని దూరింది. శ్రీరాముణ్ణి చూచి ఈవిధంగా దెప్పిపొడుస్తూంది.

"ఆలి చెరగొని పోయినట్టి దశాశ్వు డుండగ నిర్నిమిత్తము
వాలి నేటికి జంపితివి రఘువంశ తిలకా
న్యాయమేటికి దప్పితివి నరనాథ జానకీ తోడనే చెర
బోయెనేని రాజనీతియు భూరిమహిమల్.

**తేరుకున్న వాలి :**

మూర్ఛ నుంచి తేరుకున్న వాలి అంగదుణ్ణి ఓదార్చి రామునితో ఈ విధంగా అంటున్నాడు:

ఓ మహాత్మ! దయాపయోనిధి! రామ
భూమితలేశ నా పుణ్యమెట్టిదియొ
నీచేత మృతినొంద నేడు తుర్యాశ్ర
మాచార పరులకు నందగారాది
వైకుంఠ పదవి నిర్వక్రంబుగాగ
గైకొంటి నా పాతకము లెల్ల బాసె
భానువంశాధీశ భవనాశరామ
ప్రాణముల్ నిర్వహింపవు మేన నింక
బాణంబు దీయవే పార్థివోత్తంస

అనగా రాముడు చేరవచ్చి —

"......నిజ భుజాఖదుర్వార
త్రైలోక్యరక్షణ ధర్మప్రశస్తి
నెలమి పెంపగునట్టి నిజహస్తమునను



కపికులాధీశు వక్షము గాడియున్న
విపుల సాయకము బల్విడి పెల్లగింప

వాలి యూర్ధ్వలోకానికి పోయెను. కపు లప్పుడు సుగ్రీవునకు కనక కుంభముల నభి షేకము జేసి,

అర్ధచంద్రికలు ఫాలమున
బంగారు పట్టమును గట్టి
అరుదండ రత్నసింహాసనము మీదన్
పుణ్యాంగనలు ధవళములు పాడిరట.

ఎటువలెను.

శ్రీరాముడు గుణధాముడు వారిజలోచనుడు
శూరత రావణు గూలిచి నారీమణి దేవలయున్
రాముని గృప కపిరాజ్యము క్షేమంబున బాలించే
శ్రీమంతుడు సుగ్రీవుడు భూమండలి బొగడొందున్

అపుడు సుగ్రీవుడు శ్రీరామునకు కానుకలు తీసుకొని వచ్చెను. ఆ గిరి ప్రాంతాలలో ఉండే చెంచీతలు ఈ విధంగా ఏలలు పాడిరి;

భానువంశమున బుట్టి
దానవకామిని గొట్టి
మౌనివరులు సన్నుతించగా ఓ రామచంద్రా!
పూని మఖము నిర్వహింపవా
రాతి నాతి జేసివురా
రాతి చేతి విల్లువిరిచి
భూతలేంద్రు లెల్ల మెచ్చగా! ఓ రామచంద్రా
సీతను వివాహమాడవా?



పైన ఉదహరింపబడ్డ గ్రంథభాగములను బట్టి చూస్తే సుగ్రీవ విజయమనే యక్షగానము ఎంత రసవత్తర మైనదో బోధపడుతుందంటున్నారు చింతాదీక్షితులుగారు వారి ప్రజావాఙ్మయంలో.

యక్షగాన రచనా పసందు :

పూర్వ కవుల కవితా వైభవమంతా వారి రచనలలో పొందు పరిచారు. ప్రతి కార్యాన్నీ శుభముహూర్తంతో ప్రారంభించినట్లే, ప్రతి రచనా ప్రారంభం దైవ ప్రార్థనతో ప్రారంభించేవారు. అదే విధానాన్ని యక్షగానాల్లో అవలంబించారు. అది భారతీయ సంప్రదాయం.

యక్షగాన రచనలో భగవత్ ప్రార్థన తరువాత ఏ విఘ్నాలు కలుగకుండా, విఘ్నేశ్వర ప్రార్థన, షష్ఠ్యంతాలు తరువాత యక్షగానం పేరు, గ్రంథకర్త పేరు, తరువాత కథ ప్రారంభం. ఈ ప్రారంభానికి ఎవరో ఒక రుండాలి. అయితే మార్గ నాటకాలలో మాదిరి సూత్ర ధారుని ప్రవేశం యక్షగానంలో లేదు.



ఆడుతూ పాడుతూ కథ వినిపించే నటియే ఈ పూర్వరంగం ప్రయోగించేదని తెలుస్తూ వుంది. మధ్య మధ్య కథాసంధి అని పలికి ఉదాహరణకు ''భయపడు తున్న సుగ్రీవునితో హనుమంతు డేమనుచున్నాడు'' అని కథాసంధి జరిపేవారు.

చివరకు ఏలలు, ధవళాలు, యాలలు, హారతులు గద్యలో తిరిగి కృతిభర్త, కృతికర్త పేరు, కవిత్వం చిన్న చిన్న మాటలతో సులభశైలిలో వుంటుంది. శృంగార, వీర, కరుణ ప్రధాన రసాలు. గరుడాచల యక్షగానంలో శృంగారానికి ప్రాధాన్యమిస్తే. సుగ్రీవ విజయంలో విప్ర లంభ కరుణరసాలకు ప్రాధాన్యం. డొంకతిరుగుడు లేని కథతో సాఫీగా నడిచిపోతుంది. కథాశిల్పం పరవళ్ళు తొక్కుతుంది. వీటిలో ఒక్కొక్క పాత్రనూ ఒక్కొక్క వ్యక్తి ధరించే ఆచారం లేదు. నర్తకి మాత్రమే ఆడుతూ పాడుతూ వినిపిస్తుంది.

యక్షగాన సుందర ప్రదర్శనం :

పూర్వం యక్షగానాలను వ్రాయించీ, ఆదరించీ, ప్రదర్శింప జేసింది చాల వరకు ప్రభువులే. ఆ తరువాతే అవి ప్రజల మధ్య ధారావాహికంగా ప్రదర్శింప

బడ్డాయి. ఆనాడు రాజాంతఃపురాలలో శాశ్వత నాటకశాల లుండేవి. అక్కడ ప్రదర్శించే ప్రదర్శనాల నన్నిటినీ ప్రభువులు చూచి ఆనందించేవారు.

ప్రజా ప్రదర్శనాలన్నీ గ్రామం మధ్యలో నాలుగు వీథులూ కలిసేచోట ఎత్తు పాటి దిబ్బమీద పందిరివేసి రంగస్థలాన్ని ఏర్పాటు చేసేవారు. పందిరికి ఒక తెరను వ్రేలాడతీసేవారు. ఈ తెరను గురించి పండితారాధ్య చరిత్రలో —

....''యొయ్య జవనికల గర్భంబు వెడలి'' అని చెప్పటాన్ని బట్టి ఆనాడు కూడా తెరలు వుపయోగించేవారని అర్థమౌతోంది. అయితే ఆ తెరలు కిందికి పైకి వెళ్ళేవి. ప్రక్కకు లాగేవి కావంటారు శ్రీనివాస చక్రవర్తిగారు.

అలాగే బసవపురాణంలో ''జవనిక రప్పించి'' అని ప్రయోగించటంవల్ల ఆనాటి తెర అప్పటి కప్పుడు అడ్డుపెట్టే దుకూలమని తెలుస్తూ వుంది. ఆనాటి దీపాలు కాగడాల వెలుతురే. తెర తొలగగానే నటీ నటుల ముఖం స్పష్టంగా కనిపించటానికి కాగడాల మీద గుగ్గిలాన్ని చల్లి పెద్ద వెలుగు తెప్పించేవారు. ఇక ప్రేక్షకులు రంగస్థలానికి చుట్టూ కూర్చునేవారు. నటీ నటులు నాలుగు ప్రక్కల తిరుగుతూ, అందరికీ కనిపించేలా అభినయించేవారు.

పలు రూపాలూ, పలు పదాలూ:

యక్షగాన వాఙ్మయాన్ని దేశిసంప్రదాయంగా పండితులు పరిగణిస్తున్నారు. సంస్కృతమార్గ పద్ధతికి భిన్నమైనదీ, దేశిపద్ధతి, యక్షగానాలలోని ప్రధానమైన గేయ రచనల్ని రగడలలో కొంత మార్పు జరిపి, త్రిపుట—జంపె—ఏక—అట— అనే తాళాల కనుగుణంగా కల్పించబడ్డాయి. యక్షగానాలలో ఇంకా అనేక రకాలైన దేశిరచనలు ఇమిడి వున్నాయి. ఏల పాటలు—జోలపాటలు—ఆరతులు—ధవళాలు - ందమామ పాటలు—వెన్నెల పదాలు మొదలైనవి ఉన్నాయి.

విరాళి పదాలు—తుమ్మెద పదాలు—కోవెల పదాలు—చిలుక పదాలు— అల్లో నేరేళ్ళు—సీసకందార్థాలు - త్రిభంగులు—ద్విపదలు—చౌపదులు—షట్పదులు మంజరులు — జక్కుల రేకులు — ఈ మొదలైనవన్నీ అనేక యక్షగానాల్లో ఉదాహరింప



బడినాయని వేటూరి ప్రభాకరశాస్త్రుల వారి వంటి చరిత్రకారులూ, భాషాకారులూ చెపుతూ వచ్చారు. యక్షగానాల్లో ఇంకా అనేక రకాలైన ఉత్పల మాలలు-సీసాలు - కందార్థాలు-తేట గీతలూ మొదలైనవి అనేకం వున్నాయి.



యక్షగానపు అలంకారాలు :

పైన ఉదహరించిన యక్షగానంలోని అలంకారాలు ఈ క్రింది విధంగా వున్నాయి.

వెన్నెల పాటలు :

నూకాలమ్మను కొలవగానే
వెన్నెలాలో
మీద—నూకానికీ పెండ్లియయ్యో
వెన్నెలాలో

విన్నపాలు :

శ్రీరామ జయరామ శృంగార రామ
గారాము నను బ్రోవు కరుణాసముద్రా?
నాలోని జాలి నీకేలా, తోచదురా?
మనసిచ్చి నాతోను మాటాడవేరా?

ఈ రకమైన విన్నపాలను ఈనాటికీ మన గ్రామాలలో జేగంట భాగవతులు, హరిదాసులు, హరిభక్తులూ పాడుతూ వుంటారు.

మేలుకొలుపులు :

తెల్లవారే నమ్మ చెల్లెనేమంచు నల్లని స్వామి లేరా?
మరలపడుకునేవు మసలుచున్నావు మర్యాద గాదింక లేవరా
కోళ్ళు గూసెను అలకదీరెను కోమలులకు
తెల్లనాయెను తేజమణిగెను దీపములకు
కృష్ణా మేలుకొనవే.

సువ్వి పాటలు :

సువ్వి సువ్వాలే, సువ్వి సువ్వాలే
సువ్వి సువ్వి
యనుచును,
సువ్వి యనుచు
సువ్వి యనుచూను
సువ్వి పాడరారే
సుదతు లందారూ



త్రిభంగులు :

పసపూ నందరు మేనబూసి
మంచి పాలు నేతులు
మంచీ పాలు నేతులు
చల్లా బోసి
బసరుహాక్షులు గుములుకూడి
దొడ్ల — బడ్డని వాసంతమాడి

సిందు (చిందు) :

భామామణి వినుము
యమపట్టణములోని చట్టము తెల్లా
వెయ్యర - దమ్‌వెయ్ - మరియొయ్యర అమ్మోర్ని

రగడ :

సిరివరుడు నత్తెరవు
చేరవచ్చిన జూడ
కరము మదమొదవ మిది
కలకలన్నియు ద్రోచి॥

నాపారతి, దీపారతులు :

ధూపోయం ఘోర పాపా మారాయితే
సర్వతాపస హృదయ ధ్వాంత దీపాయతే - హర, హర

మంగళం సీతాకుమారి లోకమాతకూ మంగళం
ఇందిరా వరపుత్రికి, జయమంగళం నిత్య శుభమంగళం.

త్రిపుటలు - కురుజంపెలు :

మగని నీవని పల్కకూడదు
మహిత భక్తిని మీరటంచును
తగునుబల్కగ నెట్టి యాటల
దనరి యున్నన్.

కురుజంపె :

పతిని నరుడనుచునే
మతిహీనమైన దేవ
తలి గొలిగి ఈ నరక
తతిలోన బడితిన్.
కుమత గురువుల మాటకోరి విని పతిని
దైవమని కొల్వక నరక వనధిలో బడితిన్॥

లాలిపాటలు :

లాలీ పాడుచు నూచారమ్మా
కృష్ణ లీలామృతమూ గ్రోలరమ్మా
లాలీ బాడి లాలించారే బాలకృష్ణుని
భక్తిలోలుడై వర్తింపగదరే శీలకృష్ణునీ.

జంపె :

శ్రీ రమేశ పురారి తిథులను — చేరి కొలుతున్
ముదమున శ్రీరమాసతి గౌరివాణుల సేవజేతున్.



కందార్థం :

గురు పరమేశుల భక్తిని
పరగగ మది నిల్పి తత్వపరాయణులై

పరతత్వ బోధ తెల్పెడు
పరిపూర్ణుల భక్తి దలతు — పరముగ నిల్సి॥

## పరిశిష్ట గానాలు

ఏలలు :

మొదలు మీదా
కొనలు క్రిందా
మొలచియున్నా
చింతలోనా
పదిలమై పద్మములు
పూచెనే ఓ గొల్లభామా.
కదిసిచూడ, కానూపించునే!

మంగళ హారతులు :

సీతా సమేతాయ
శ్రిత మనోల్లాస నీతివాక్యాయ
అతి నిర్మలాయ
రాతి నాతిగ జేసి రక్షించు జగములను
దాతవై బ్రోచు దశరథ సుతాయ ॥జయమంగళం॥

అల్లో నేరేళ్ళు :

అల్లో నేరే డల్లో
చెలగి కృష్ణుం డనుచు
జెప్పరే మీరు
కరి వేల్పు మన దొరకు
కలిగెనే నేడు
సిరివరుని వలె నితడు
చెలగుచున్నాడు
॥అల్లో నేరేడల్లో॥



చంద్రికలు, అర్థ చంద్రికలు:

పడతికిని పాలిండ్లపై
నలుపు దోచెన్
మట్టిపై రుచిగల్గె
మానినీ మణికిన్
సన్నుతాంగియు
భర్త సంగతిని గోరెన్
ఇభరాజ వదన
పతియెడ ప్రేమ హెచ్చెన్॥



ద్విపద:

నవ్వుచూ దీవించె నలినాయతాక్షి
రతిరాజ సుందరా రణరంగధీర
కమలబాంధవతేజ కరుణాలవాల
రవికాంతియుతుడువై రంజిల్లుచుండి
అలరాజు పగ దీర్పు మనుజుల తోడ.

ద్విపదార్థము:

కొందరు మందులు కూర్మితో సుతుల యందు
నలరుదు రెప్పుడుగాని బుత్రుల దుఃఖము
వినవయ్య తెల్పెదా పూని కనుగొను మనిశము.

ప్రభువులూ, ప్రజలూ మెచ్చిన యక్షగాన సొబగులు:

యక్షగానాల్లో హాస్యం అతి విస్తారంగా కనిపిస్తుంది. యక్షగానంలోని కటకంవాడు....సింగి సింగడు సుంకరకొండడు మొదలైన సాంప్రదాయక పాత్రలు ఈ నాటికీ ప్రజాహృదయాల్లో నిలిచిపోయాయి. కొన్ని యక్షగానాల్లో ఎఱుకలు గొల్లలు మొదలైనవారి జాతి చరిత్ర, వారి సాంఘికాచారాలు, వారి వాలకాలు, మాటల తీరు వృత్తి ధర్మాలు, కట్టు బొట్టులతో సహా తరగతుల వారీగా ప్రజా జీవిత వివరాలన్నీ తెలుస్తాయి. శృంగార హాస్యరసాలు అందరికీ బోధపడే భాషలో వున్నాయి. రాజులకూ ప్రజలకూ ఆదరపాత్రమైనాయి ఆనాటి యక్షగానాలు.

ఈ యక్షగానాలు ముఖ్యంగా సర్కారు జిల్లాలలోనూ, తెలంగాణా మండలం లోనూ, ఒరిస్సా సరిహద్దుల్లోనూ, దక్షిణ దేశం తంజావూరు, మధుర, పుదుక్కోట మొదలైన ప్రదేశాల్లో తెలుగు మాట్లాడే ప్రతిచోటా ప్రదర్శించబడ్డాయి. ఆయా ప్రాంతాల మాండలిక శబ్దజాలం ఎంతో ఆ యక్షగానాల్లో వుంది.



యక్షగాన ఇతివృత్తాలు కేవలం పురాణ కథలకే కట్టుబడక తాత్కాలిక విషయాలకు కూడా ప్రాముఖ్యమిచ్చాయి.

రకరకాల వస్తువులతో ఆనాటి రాజుల ఆచార వ్యవహారాలు, ఆహార విహారాలు, కొలువూ, సింగారం, వివిధ రాజుల, ఉద్యోగుల వేషధారణ, వివాహాది సందర్భాలలో పురోహితుల సంభావన తగవులు, ముత్తైదుల ముచ్చట్లు మొదలైన ఎన్నో విషయాలు తెలుస్తాయి.

ఆంధ్రదేశంలో యక్షగాన ప్రదర్శనాలు బహుముఖంగా ప్రదర్శించబడ్డాయి. ఆనాటి ప్రదర్శకులైన శ్రీనాథుని జక్కులపురంధ్రి — ప్రతాపరుద్రుని వుంపుడు గత్తె మాచల్దేవి, భాగోతుల బుబ్బగాడు. పెండెలనాగి దోరసముద్రపు నటులు, తాయికొండ నాటక సమాజ ప్రదర్శకులు ఆదర్శప్రాయులు.

కోలాచలం వారి వివరణ:

సుప్రసిద్ధ నాటక రచయిత కోలాచలం శ్రీనివాసరావుగారు 1911 వ సంవత్సరంలో, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో యక్షగానాలను గురించి ఈ విధంగా వివరించారని చింతాదీక్షితులుగారు (ప్రజావాఙ్మయంలో) ఉదహరించారు.

నన్నయార్యుని మొదలుకొని 19 వ, శకం అంతము వరకు నాంధ్రమున నాటకములు లేవని పలువురు పండితులు వాకొనుచున్నారు. ఇది విశ్వసనీయముగాదు. ఆంధ్రనాటక సాంఘికు లనేకు లుండిరి. వారు భాగవత, భారత, రామాయణాది గ్రంథసంబంధ కథలను సంపూర్ణముగా నాడుచుండిరి. గోపికాలీలలు, పారిజాతాపహరణము — విష్ణుమాయా విలాసము, సైంధవ వధ — కీచక వధ — ద్రౌపదీ వస్త్రాపహరణము — హరిశ్చంద్ర, నలచరిత్రలు — సారంగధరకుమార రామ చరిత్రలు — లేపాక్షి రామాయణము — ధర్మపురి రామాయణము మొదలగు

ఆంధ్రనాటకము లనేకము లుండెను. వీనికి యక్షగాన నాటకములని ప్రసిద్ధినామ ముండెను. వానిని రాజగృహములలోనేమి, ధనికుల ఇండ్లలో నేమి, వీధులలో నేమి చక్కగా ప్రదర్శించుచుండిరి.

ఈ నాటక సాంఘికులలో అనేకులు పండితు లుండిరి. వారి వంశస్థులు ఇప్పటికీ అచ్చటచట నున్నారు. వారు ఘట్టుదేశపువారు, లేపాక్షివారు, ధర్మపురి వారు — భాగవతుల రంగయ్యగారు (కూచిపూడి) మొదలగువారు దేశదేశములు సంచరించుచు నాటకములాడి పొగడిక గనివారని ఉదహరించారు.

తెలంగాణాలో యక్షగానాలు :

తెలంగాణాలో యక్షగానాలు దాదాపు నూరుకు పైగా వున్నాయని యస్వీ జోగారావుగారు తెలియజేస్తున్నారు (తమ యక్షగాన వాఙ్మయంలో).

తెలంగాణాలో యక్షగాన రచన 18 వ శతాబ్దంలో విరివిగా సాగింది. యక్షగానాలకు ప్రదర్శన రూపంలోకాక, పురాణపఠనం మాదిరి పారాయణం ద్వారా ప్రారంభ దశలో ప్రచారం జరిగింది.

1780 లో రచింపబడిన, శేషాచలకవి ధర్మపురి రామాయణం, 1834 నాటి ముద్దకవి మంథన రామాయణం ఈ కోవకు చెందినవే.

ఆనాడు ధర్మపురి రామాయణం, ఒక్క తెలంగాణాలోనేకాక సర్కారు ఆంధ్రదేశమంతటా వ్యాప్తిలో వుంది. ఆంధ్రదేశపు ప్రదర్శకులు అందులోని దరువుల్ని చక్కగా వినియోగించుకున్నారు.

ఎటుతిరిగి 19 వ శతాబ్దపు ఉత్తరార్థంలోనే యక్షగాన ప్రదర్శనాలు రంగస్థల మెక్కాయి. ఈ కాలంలో శేషభట్టరు కృష్ణమాచార్యులు. గోవర్ధన నరసింహాచార్యులు, దట్టము పాపకవి మొదలైనవారు యక్షగానాలు వ్రాశారు. ఆ నాడు యక్షగాన కవుల్ని మహారాజులు పోషించారు. ఆత్మకూరు సంస్థానాధీశుడైన, ముక్కర సీతారామభూపాలుడు రామదాసనే కవి చేత "తారా శశాంకం" "భీమసేన విలాసం"



అనే యక్షగానాలను వ్రాయించారు. ఈ సమయంలోనే గోవర్ధనంగారి గొల్ల కలాపం, రూప్ఖాన్ పేట రత్నమ్మగారి కురవంజి వెలువడ్డాయి.

యక్షగాన రచనలో అందెవేసిన చేయి :

20 వ శతాబ్దం నాటికి తెలంగాణాలో యక్షగానాలు రచనలోనూ, ప్రదర్శన లోనూ గణుతికెక్కాయి. పల్లెగ్రామాలలో ప్రజలు పదాలుకట్టి పాడుకుంటూ వుండే వారు. ''కాంభోజరాజు'' ''బాలనాగమ్మ'' ''పెద్దబొబ్బిలిరాజు కథ'' ''ఆరె మరాఠీల కథ'' మొదలైన యక్షగానాలు బహుళ ప్రచారాన్ని పొందాయి. చెర్వీరాల భాగయ్యగారు ప్రదర్శన యోగ్యమైన యక్షగాన రచనలో అందెవేసిన చేయిగా పేరు పొందారు. ఈయన రచించిన యక్షగానాలు 32. ఈయన అనేకమంది యక్షగాన కవులకు గురుతుల్యుడుగా నిలబడ్డాడు. యక్షగాన కవుల్లో ప్రసిద్ధులైనవారు బూరుగు పల్లి సోదరులు. వీరి కృతులను నాటకాలనే వ్యవహరించారు.

పల్లోరి వీరన్నగారి ''రైతు విజయం'' సామ్యవాద సిద్ధాంతానికి అనుగుణంగా రచించబడింది. తెలంగాణాలో యక్షగాన వాఙ్మయమూ, యక్షగాన ప్రదర్శనాలూ ఆలస్యంగా ప్రారంభమైనప్పటికీ, ఆంధ్రదేశపు యక్షగాన చరిత్రలో ఒక స్థానాన్ని సంపాదించుకున్నాయి.

అంధకవి రాసిన వంద యక్షగానాలు :

ఆంధ్రదేశంలో యక్షగానాల యుగం అనంతంగా నడిచింది కొన్ని వందల సంవత్సరాలు. రచనలోనూ, ప్రదర్శనలోనూ రాజ్య మేలాయి. ఎందరో మహా మహులు, పండితులు మొదలు జానపద రచయితలవరకూ యక్షగానాలను వ్రాశారు. అయితే ఒకే వ్యక్తి వంద యక్షగానాలను వ్రాసిన కవులు కనబడరు. కాని వంద యక్షగానాలను వ్రాసిన ఒక మహాకవి ఏ వెలుగు చూడక, అంధకవిగా అజ్ఞాతంగా వుండిపోయాడు.



బెల్లోజు రమణాచారి:

సాహిత్యాన్ని మధిస్తే రమణాచారి లాంటివారు ఎందరు కాలగర్భంలో కలిసి పోయారో చెప్పలేం. మెదక్ జిల్లా, దుబ్బాక మండలంలోని రామేశ్వరపల్లి గ్రామం రమణాచారి జన్మస్థలం. 77 ఏళ్ళు గల

రమణాచారి, 36 సంవత్సరాల నుంచీ కంటిచూపు దూరమైనా పట్టుదలను వీడక రచనను సాగిస్తూనే వచ్చారు.



తెలంగాణాలో అత్యధిక యక్షగానాలను రచించినవారు చెర్విరాల భాగయ్యగారు. ఆయన 40 యక్షగానాలను రచించారు. ఆయన యక్షగానాలు విరివిగా ప్రదర్శింపబడ్డాయి కూడా. కాని వంద యక్షగానాలను వ్రాసిన రమణాచారి యక్షగానాలు, రెండు మూడు తప్పా ముద్రణకు నోచుకోలేదు, కాని విరివిగా ప్రదర్శింపబడ్డాయి. ప్రదర్శనానికి వచ్చిన డబ్బు వారి జీవనాధారానికి సరిపోయింది. భారత, భాగవత, రామాయణాలకు సంబంధించిన గాథలే ఆయన యక్షగానాలకు ఇతివృత్తం.

వీరి యక్షగానాలన్నీ స్థానిక తెలుగు లెక్చరర్ దాశరథుల బాలయ్య వద్ద భద్రపరిచారు. ఉన్నత సాహిత్య విలువలన్నీ, రమణాచారి యక్షగానాల్లో వున్నవంటారు బాలయ్య. ఆయనకు కళ్ళు కనిపించకపోయినా వెంకటేశం అనే తన బంధువుకు చెప్పి వ్రాయించాడు.

ఈ నాటికీ రమణాచారి యక్షగానాలు ఒక్క మెదక్ జిల్లాలోనే కాక, వివిధ జిల్లాలలో ప్రదర్శింపబడుతున్నాయి. ఆయన యక్షగానాలు పల్లెప్రజలకు అర్థమయ్యే భాషలో రచియించటం ఎంతో గొప్ప విషయం.

కొన్ని అంశాలను వాస్తవానికి దగ్గరగా వుండేటట్లు ప్రదర్శిస్తామని ఉదాహరణకు అశోకవనంలోని సీతాదేవి శోకిస్తున్న ఘట్టం - సహజత్వానికి దగ్గరగా వుండేందుకు ప్రదర్శనాస్థలంలో వున్న చెట్టుక్రిందే సీతాదేవిని కూర్చుండబెట్టేవారమని 'న్యూస్ టుడే'కి వెల్లడించారు.

**అవి ఆవే ఇవి ఇవే :**

ఆ నాడు కూచిపూడి భాగవతులు ఊరూరా తిరుగుతూ దేశసంచారం చేయడంవలన ఉత్సాహం పొందిన కళాప్రియులైన అనేకమంది ఏనాదులు, గొల్లలు, మాలలు మొదలైన వారందరూ యక్షగానాలను ప్రదర్శిస్తూ వచ్చారు. కట్టుదిట్టమైన కూచిపూడివారి యక్షగానాలకూ, ఇతరులు ప్రదర్శించే యక్షగానాలకూ సారూప్యం లేదు. కూచిపూడి సంప్రదాయం కంటే వారి ప్రదర్శనాలస్థాయి తక్కువ.

ఆనాటి మేళాలు :

ఆనాడు ఆంధ్రదేశంలో యక్షగానప్రదర్శనాల్లో పేరెన్నికగన్న మేళాలు: సిద్ధేంద్రయోగి మేళం, భాగవతుల దశరథరామయ్యగారి మేళం, 18-వ శతాబ్దంలోని భాగవతుల బుబ్బగాని మేళం, 19-వ శతాబ్దంలోరాయలసీమలో లేపాక్షి, వేములపల్లి, తాడిపత్రి మేళాలు, నెల్లూరు మండలంలో పిడకండ్ల రామస్వామిరాయ కవి, త్వరకవి రామకృష్ణయ్యగారి మేళాలు, విశాఖ మండలంలో, నరసింగపల్లి, కశేపల్లి, కందాళ చిదంబరకవి మేళాలు మొదలైనవి బహు ప్రసిద్ధిపొందాయి.



ఆంజనేయ యక్షగానం

ఆనాటి ప్రాముఖ్యమూ అందుకు దాఖలాలూ :

యక్షగాన కళారూపం ఆ నాడు ఎంతటి ప్రాముఖ్యం వహించిందో ఈ క్రింది వివరాలు మనకు తెలియజేస్తాయి.

ఆంధ్ర ప్రాంతంలో యక్షగానాలను రచించిన కవులు. 174 మంది.

| | |
|---|---|
| దక్షిణదేశపు యక్షగాన కవులు | 36 మంది |
| తెలంగాణ యక్షగాన కవులు | 47 మంది |
| పరిశిష్టాలు రచించిన కవులు | 65 మంది |
| అనుబంధాలు రచించినవారు | 140 మంది |

అందరూ కలిసి 465 మంది కవులు యక్షగాన వాఙ్మయానికి కృషి చేశారు.

ఈనాడు లభ్యమయ్యే యక్షగానాలు 542. అలభ్య యక్షగానాలు 260. మొత్తం 802. యక్షగానాలు వెలువడ్డాయి. ఈ విధంగా యక్షగాన వాఙ్మయం దక్షిణ దేశంలో ధారావాహికంగా వెలుగొందింది. వీటిలో 19 పారిజాతాలు, 28 భామా కలాపాలు. 14 గొల్ల కలాపాలు, 21 కొరవంజులు వెలువడ్డాయని యస్వీ జోగారావు గారు తమ ''యక్షగాన వాఙ్మయ చరిత్ర'' ప్రరోచనలో వివరించారు. యక్షగాన వాఙ్మయ చరిత్ర ద్వారా జోగారావుగారు అమూల్యమైన సమాచారాన్ని అందజేశారు

యక్షగానాన్ని వెలుగులోకి తెచ్చిన మహామహులు :

యక్షగాన వాఙ్మయ పరిశోధనలో శ్రీయుతులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, డా॥ గిడుగు సీతాపతి, కళాప్రపూర్ణ జయంతి రామయ్య, శ్రీనివాసచక్రవర్తి. మల్లంపల్లి సోమశేఖరశర్మ, అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు, ఆచార్య కోరాడ రామకృష్ణయ్య, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం, చింతాదీక్షితులు, డా॥ నేలటూరి వెంకటరమణయ్య, ఆచార్య గంటి సోమయాజి, ఎల్లోరా ఆచార్య గంటి సోమయాజి, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, డా॥ కె. వి. ఆర్. నరసింహం. ఆచార్య రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, ఆచార్య విస్సా అప్పారావు, డా॥ యస్వీ జోగారావు, సురవరం ప్రతాపరెడ్డి, డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, కొమ్మనమంచి జోగయ్యశర్మ, ముట్నూరి సంగమేశం, ఆచార్య తూమాటి దొణప్ప, ఆచార్య బి. రామరాజు, ఆదిలక్ష్మి. డా॥ ఆర్వీ యస్ సుందరం మొదలైన ప్రముఖులెందరో యక్షగాన వాఙ్మయం గురించీ, జానపద విజ్ఞానాన్ని గూర్చీ తెలియజేశారు.





# శిల్పులు చెక్కిన చెక్క బొమ్మలాటలు

ఏ దేశంలోనైనా నాటకానికి పూర్వరంగం వీథి నాటకాలూ, చెక్కబొమ్మలూ, కొయ్యబొమ్మలూ. పేడబొమ్మలూ, లక్కబొమ్మలూ అని మనం తెలుసుకోవచ్చును; 'కాళిదాసు' 'భవభూతి' 'బాసుడు' మొదలైన వారంతా వ్రాసిన సంస్కృత నాటకాలకు నాంది. ఈ కొయ్య బొమ్మలూ, భాగవతాలనే ప్రతీతి కూడా వుంది.



ఈనాడు మన కున్నది నాటకరంగం. ఆనాడు వారి నాటకరంగస్థలం వీధులే. విగ్రహాలమీద నమ్మకం వచ్చిన తరువాత, దేవతల క్రింద, దేవుళ్ళ క్రింద బొమ్మల పూజలు వచ్చిన అనంతరం వారికి ప్రియమైన భక్తియుత మైన బొమ్మలకు చక్కగా రంగులు దిద్ది, దీపపు స్తంభాల వెలుతురులో ఈ కొయ్యబొమ్మలను ఆడిస్తూ వుండేవారు.

ఈ బొమ్మల నిర్మాణం తేలికగా వుండే కొయ్యతోనూ, పేడతోనూ ఆడించ డానికి వీలుగా వుండేటంత తేలిక వస్తువులతో తయారు చేసుకునేవారు. దసరాకు పిల్లలు ఆడించుకునే హనుమంతుడి బొమ్మల్ని, సంక్రాంతికి పెట్టే బొమ్మల కొలు వులూ, పెళ్ళిళ్ళకు ఆడించే బుట్టబొమ్మలూ, దేవుళ్ళ వాహనాలైన గరుత్మంతుడు, నెమలి. హంస మొదలైన బొమ్మలను గుర్తుకు తెచ్చుకోవచ్చు.

ఈనాటికీ, ఈ ఆటలు :

ఈ నాటికీ ఆంధ్రదేశంలో అక్కడక్కడ తోలుబొమ్మలాటల్ని, బుట్టబొమ్మ లాటల్ని, కొయ్యకావళ్ళవారి ప్రదర్శనలనూ చూస్తూనే వున్నాం. కాని కొయ్య బొమ్మ లాటల్ని మాత్రం ఎక్కడా చూడలేకపోతున్నాం. అయితే ఈ కొయ్యబొమ్మలాటలు ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడి, ప్రజల అభిమానాన్ని చూరగొన్నాయి.

అనంతపురంజిల్లా హిందూపురంలో ఒకప్పుడు ఈ కొయ్యబొమ్మలాటలను ప్రదర్శించేవారు. ఈ కట్టెబొమ్మలు కళ్ళతో కూడా అభినయం చేయగలంతటి పని తనాన్ని నిపుణులైన గ్రామ వడ్రంగులు తయారు చేసేవారు. ఇది చాలా

అర్చుతో కూడుకున్న పని. నలభై సంవత్సరాల క్రితం వరకూ ఈ కట్టెబొమ్మ లున్నాయి.

**సూత్రక్రీడ :**

అయితే మన దేశంలో కొయ్యబొమ్మలాటకు వేల సంవత్సరాల చరిత్ర వుందంటున్నారు ఆర్వీ. యస్. సుందరంగారు. వారి జానపద విజ్ఞానం 469 పేజీలు, సూత్రక్రీడ అనేది అరవై నాలుగు కళల్లో ఒకటనీ, ఇదే కొయ్యబొమ్మలాటనీ కొందరి అభిప్రాయంగా వుంది. కొయ్యబొమ్మలాట లాడించడానికి సూత్రాలు వుంటాయి. అంటే దారాలన్న మాట. దారాలు బొమ్మలకు కట్టి ఆడించటంవల్ల దీనికి సూత్రక్రీడ అనే పేరు వచ్చి వుండవచ్చు.

అది నిజం కూడ. అందుకు నిదర్శనం ఈ నాడు తమిళనాడులో "బొమ్మలాటం" అనే ఈ సూత్రక్రీడ అత్యద్భుతంగా ప్రదర్శిస్తు న్నారు. అయితే ఈ బొమ్మలన్నీ కొయ్య బొమ్మలే అని చెప్పలేం. ఇదే ఒకనాడు కొయ్యబొమ్మలుగా ప్రదర్శింపబడి వుండ వచ్చు. ఈ నాటికీ రాజస్థాన్‌లో "కట్ పుల్లీ" అనే కొయ్యబొమ్మలనే అత్యద్భు తంగా ప్రదర్శిస్తున్నారు.



(మైసూరు మ్యూజియం)

**సూత్రధారుడు :**

కొయ్యబొమ్మలాటల్లో సూత్రాలుండడంవల్ల ఆ సూత్రాలతో బొమ్మల నాడించే వ్యక్తికి సూత్రధారి అనే పేరు వచ్చింది. దానిని అనుసరించే సంస్కృత నాట కాలలో కథా విధానాన్ని నడిపే వ్యక్తికి సూత్రధారి అని పేరు వచ్చింది. సూత్రధారి నాటినుంచి నేటివరకూ ప్రదర్శించే యక్షగానాల్లో, వీధి నాటకాల్లో, భాగవతాల్లో, సూత్రధారుడు అత్యధిక ప్రాధాన్యాన్ని వహిస్తున్నాడు.

ఇందుకు ఉదాహరణగా కన్నడంలో సూత్రద గొంబె యాట (అంటే సూత్రాల బొమ్మలాట) అనే కొయ్యబొమ్మ లాటలు ఈ నాటికీ వున్నాయి. బొమ్మల్ని చిత్రవిచిత్రంగా ఆడించే చాకచక్యం గల కొయ్యబొమ్మలాటల సూత్రధారి తెర వెనుక వుండి బొమ్మలను సూత్రాల సహాయంతో ఆడిస్తూ వుంటాడు. ఆడించే

ఈ సూత్రధారి మన కంటికి కనిపించడు. వెలుగు తక్కువలో ప్రదర్శించడంవల్ల, ఆడించే ఆ సూత్రాలూ, త్రాళ్ళు మనకు కనిపించవు. జీవం లేని ఆ కొయ్యబొమ్మలు జీవం గల బొమ్మలుగా ప్రదర్శింపబడుతున్నాయనే భ్రమను చూపరులకు కలిగిస్తాయి. ఈ ప్రదర్శనం చూడడానికి పరమాద్భుతంగా వుంటుంది.

బొమ్మలాటల్ని ఆడించేవారి ఇంటిపేర్లు కూడా బొమ్మలాట సోలయ్య—బొమ్మలాట వెంకయ్య — బొమ్మలాట గురవయ్యగా మారిపోయాయి. అలాగే వూళ్ళ పేర్లు కూడా బొమ్మలాట పేరుమీద వున్నాయి. అందుకు వుదాహరణ బళ్ళారి జిల్లాలో "బొమ్మలాటపల్లె" అనే వూరు వుండటమే. దాదాపుగా నశించిపోయిన ఈ కొయ్యబొమ్మలాటలకు నిదర్శనంగా మైసూరు జానపద వస్తుప్రదర్శనాలయంలో.... రావణాసురుడు లాంటి కొయ్య బొమ్మల్ని చూడవచ్చును.

అయితే ఈ కొయ్యబొమ్మలాటలు అనాదిగా ఆంధ్రదేశంలో ఉన్నాయని చెప్పవచ్చు. నాటకాలు రాక ముందు ఈ బొమ్మలాటలే ప్రజల విజ్ఞాన వినోదాలకు తోడ్పడ్డాయి. కేవలం బొమ్మలాటల్నే వృత్తిగా పెట్టుకుని జీవించినవారు ఆ నాటికీ ఈ నాటికీ వున్నారు. అంతదాకా ఎందుకు? దసరా వుత్సవాలలో, ఆ రోజుల్లో పిల్లలు తాడుగట్టి ఆడించే హనుమంతుడి బొమ్మ చూడడానికి ఎంతో వినోదాన్ని కలిగించేది.

బొమ్మలు తయారై ప్రదర్శనానికి సిద్ధపడిన తరువాత బొమ్మను ఆడించే వ్యక్తి ఆ బొమ్మ యొక్క పూర్తి మనస్తత్వాన్నీ. పాత్రాభినయాన్నీ క్షుణ్ణంగా తెలుసుకుని అందుకు అనుగుణంగా ఆ పాత్రయొక్క ఔచిత్యాన్ని తాను అనుభవించి ఆ యా బొమ్మలపాత్ర ఔచిత్యాన్ని కాపాడుతూ హృద్యమంగా ప్రదర్శించేవారు.

బొమ్మలాటల కోసం కాకపోయినా ఈ నాటికీ బ్రతుకుతెరువు కోసం కొయ్య బొమ్మలను తయారుచేసి ఆయా యాత్రాస్థలాలలో ప్రదర్శించేవారిని అనేకమందిని చూడవచ్చు. ఆ నాడు ఒకందుకు తోడ్పడిన బొమ్మలు ఈనాడు ఒకందుకు తోడ్పడుతున్నాయి.



బొమ్మల తయారీ:

కొయ్యబొమ్మలకి తేలికైన బూరుగ, బాడిసె మొదలైన బరువు తక్కువ చెక్కలను ఉపయోగిస్తారు. బొమ్మల్ని చెక్కడానికి అనువైన తేలికగా చెక్కడానికి వీలుండే కొయ్యను ఎంచుకుంటారు.

ముఖ్యంగా, చేతులు, కాళ్ళు తయారుచేయడానికి సరివి కొయ్యను వినియోగిస్తారు. స్త్రీ పురుష బొమ్మలు నకిలీబొమ్మ లనేవి వుంటాయి. పురుష పాత్రలకు సంబంధించిన బొమ్మలు ఒకటిన్నర అడుగుల నుంచి రెండున్నర అడుగుల వరకూ వుంటాయనీ, స్త్రీ పాత్రలకు సంబంధించిన బొమ్మలు, కొంచెం చిన్నవిగా వుంటాయనీ సుందరంగారు అంటున్నారు.



ఆయా బొమ్మల మనస్తత్వాలనుబట్టీ ఆకారాలను బట్టీ అభినయాలను బట్టీ అభినయించే రసాలను బట్టీ, రాబోయే సన్నివేశాల కనుగుణంగా రసప్రాధాన్యాన్ని బట్టి కొయ్యబొమ్మలకు రంగులను చిత్రించి, ఆ బొమ్మలకు జీవాన్ని కలుగచేస్తారు. అలాగే స్త్రీ పాత్రలకు కావలసిన ఆహార్యం, రంగురంగుల గాజులు, ధగధగ మెరిసే రాళ్ళతో హారాలూ, రంగు రంగుల వస్త్రాలూ మొదలైనవి ఏర్పాటు చేస్తారు.

అలాగే మగ పాత్రలకు, అవసరమైతే విల్లు, గద, కత్తి, చక్రం, కిరీటం మొదలైన వాటిని ఏర్పాటు చేసుకుంటారు.

ఆట విధానం :

ఇక ఈ బొమ్మల్ని ఆడించే విధానాన్ని గూర్చి కొంచెం తెలుసుకుందాం. ప్రదర్శించబోయే బొమ్మ తలకు రెండు సూత్రాలు, ప్రేక్షలకు కనిపించని నల్లని దారాలు వుంటాయి. ఆధారాలను సూత్రధారుడు తన తలకు కట్టుకుంటాడు .... చేతులకు కొక్కీలుంటాయి. వాటిని చేతిలో పట్టుకుని హృద్యమంగా జనరంజకంగా ప్రదర్శిస్తారు.

అయితే ఈ బొమ్మలాటలు ఆంధ్రదేశంలో అంత ప్రచారం లేకపోయినా, ఒకనాడు రాయలసీమలో ఎంతో ప్రచారంలో ఉండేవి. ఇటీవల పదిహేను సంవత్సరాల వరకూ అనంతపురం జిల్లాలో వున్నట్లూ వాటిని చూచినట్లూ మిత్రుడు ఏ. ఆర్. కృష్ణ తెలియచేస్తున్నారు. బహుశా వాటి ఛాయలు ఇప్పుడు కూడా వుండవచ్చును.

చారిత్రక సత్యాలు :

చారిత్రకంగా చూస్తే రాయలసీమలో ఈ బొమ్మలు విస్తృత ప్రచారంలో వుండేవి. ఇందుకు ఉదాహరణగా, కోలారు జిల్లాలో వున్న ఒక శాసనంలో

(E.e × SD 100 - P.P - 238.39) బొమ్మలాట వారు అగ్రహారాన్ని పొందినట్లు వున్నది. (క్రీ. శ. 152) నాటిది అని ఆర్వీయస్ తెలియచేస్తున్నారు.



రాయల సామ్రాజ్యంలో రాయలకు ఆప్తుడైన ఒక బొమ్మలాట వాడుండేవాడట. అతడు విరూపాక్షుని కొడుకైన "బొమ్మలాట కాళడు" కడప మండలంలో కమలాపురం తాలూకా "చిడిపిరాల" గ్రామాన్ని "బొమ్మలాట చంద్రయ్య" బొమ్మలాట అమృతకవి తెర నాటకం ఆడడానికి పెద చిట్టయ్యకు ఇచ్చారని ఒక శాసనంలో ఉంది. (A.R. 316 - OF 1928) పై ఉదాహరణ బొమ్మలాటకు సంబంధించినదే. అంటే ఇది కొయ్య బొమ్మలాటకు సంబంధించిందని తెలుసుకోవచ్చును — లేదా తోలుబొమ్మలాటలకు సంబంధించింది కావచ్చును.

అలాగే కీలుబొమ్మ లనేవి కూడా, కొయ్యతో తయారుచేసినవే, కీలుబొమ్మలు, జంత్రబొమ్మలు అనేవాటి ప్రసక్తి తెలుగు కావ్యాలలో వుందనడానికి అనేక ఉదాహరణలు తెలుగు కావ్యాలలో వున్నాయి.

కీలుబొమ్మలాటకు వెనక తెర మాత్రమే వుంటుంది. సన్నివేశాలనుబట్టి, ఆయా బొమ్మలు తెరమీద ప్రవేశిస్తాయి.

నశించిపోయే ఈ బొమ్మలను, కథలకు సంబంధించిన బొమ్మలుగాకాక, ఎరుకలసానులూ, లంబాడీలూ ఈ బొమ్మలను తీసుకుని బ్రతుకుతెరువు కోసం ఆడిస్తూ వుంటారు — పెళ్ళాడే బొమ్మ అని, వధూవరుల బొమ్మలతో ఆడిస్తారు.

అయితే సాంప్రదాయమైన, ఈ కళనూ ఈ బొమ్మలనూ, ఆడించే విధానాలనూ, పరిరక్షించడం ఎంతో అవసరం. ఇది భావి తరాల వారికి, ప్రాచీన కళారూపాలను గురించి తెలుసుకోవడం కోసం అవకాశం కలుగుతుంది.





# బొమ్మలాా, తోలు బొమ్మలాా

ఆంధ్రదేశంలో ఆబాలగోపాలాన్నీ ఆనందింపజేసి, అన్ని కళారూపాలతోపాటు దీర్ఘకాలం దివ్యంగా వర్ధిల్లిన కళారూపం తోలుబొమ్మలాట.

## సకల కళా సమన్వితం:

మన లలిత కళలకు ఈ కళ వుపాంగంగా వున్నా, లలితకళలు అన్నీ ఈ ప్రదర్శనంలో మూర్తీభవించి వున్నాయి. కావలసినంత కవిత్వం వుంది. సాహిత్యం



వుంది. సంగీతం వుంది. శిల్ప, చిత్ర కళలు తొణికిసలాడుతూ వుంటాయి. కడుపుబ్బ నవ్వించే హాస్యరస ఘట్టాలున్నాయి. లలిత కళ అన్నిటిలోనూ ఈ ప్రదర్శనం ఎంతో కన్నుల పండువుగా వుంటుంది.

బొమ్మలతో చక్కగా నాట్యం త్రొక్కిస్తారు. ఆ పైన వెనుక నుంచి సూత్రధారుడు ఎంతో చాకచక్యంగా పాత్రాభినయం చేయిస్తూ వుంటాడు. నాటక ప్రదర్శనానికి ఎన్ని హంగు లుండాలో దాదాపు అన్ని హంగులూ బొమ్మలాటలోనూ వుండాలి. ఇన్ని హంగుల్నీ వారు ఎక్కడ నుంచి పూర్తిచేసుకొంటారు? కిరాయి నటీ నటుల్ని ఎక్కడ నుంచీ దించరు. జట్టుపెద్దలు పురుష పాత్రలు, వారి స్త్రీలు స్త్రీ పాత్రలు వహిస్తారు. భర్త శ్రీరాముడుగా వాచికం చెప్పి పాట పాడితే, భార్య సీతగా వాచికం చెప్పి వంత పాడుతుంది. ఇక వారి బిడ్డలు బాల బాలికల పాత్రలకు అభినయా న్నిస్తారు.

ఈ విధంగా ఆయా పాత్రల బొమ్మలు పుచ్చుకుని కార్యక్రమాన్ని దిగ్విజయంగా నడుపుతారు. తెరమీది బొమ్మలు ఎంత వుధృతంగా నాట్యం త్రొక్కుతూ వుంటాయో, లోపలి భాగంలో వున్న వ్యక్తులు కూడా దాదాపు అంతటి అభినయాన్నీ వ్యక్తం చేస్తూ వుంటారు.

## దేశవ్యాప్తంగా బొమ్మలాటలు :

ఈ బొమ్మలాటలు - ఒక్క ఆంధ్రదేశంలోనే కాకుండా పరిసర ప్రాంతాలైన మహారాష్ట్రం, మళయాళం, తమిళం, బెంగాల్ మొదలైన ప్రాంతాల్లోనూ వ్యాపించి వున్నాయి. ఉత్తర దేశంలో 'కట్‌పుత్లీ' అనే కొయ్య బొమ్మలాటలూ, దక్షిణదేశంలో కీలుగుఱ్ఱపు బొమ్మలాటలూ. బొమ్మలాట్టం అనబడే కొయ్య బొమ్మలాటలూ ప్రచారంలో వున్నాయి. ఈనాడు మనం చూసే బొమ్మల వస్త్రధారణా, భూషణాలంకార పరిశోధనా చూస్తే - ఈ మాదిరి అలంకారం గల నాగరికత తంజావూరు ఆంధ్రరాజుల కాలంలోనిదిగాను, మహారాష్ట్ర రాజుల కాలంలోనిదిగాను నిదర్శనాలు కనుపిస్తున్నాయి.

తోలుబొమ్మలాటలు ప్రదర్శించేవారు చాలవరకు మరాఠీవారు. వీరిని కన్నడంలో 'కిషేషిక్యాత' జాతివారని, తమిళదేశంలో 'కిల్లెక్యాతవా'రని, తెలుగుదేశంలో బొమ్మలాట వారని, చర్మ నాటకులని వ్యవహరిస్తున్నారు.

ఆంధ్రదేశంలో ప్రదర్శించే తోలుబొమ్మలాటలు మహారాష్ట్రం నుంచి సంక్రమించాయనే చరిత్రాధారా లున్నప్పటికీ, చాళుక్య రాజుల కాలంనాటికే తోలుబొమ్మలాట లాడినట్లు భారతం విరాటపర్వంలో వివరించబడింది.

బొమ్మలాటలవారు బెల్గాం, కొల్హాపూర్, సతారా, పూనా, బిజాపూర్ ప్రాంతాల నుండి, పరిపాలకుల జైత్రయాత్రల్లోనూ, ఆయాదేశాలలో వచ్చిన విప్లవోద్యమాల మూలంగానూ వలస వచ్చారు.



శ్రీశైలం శివరాత్రి మహోత్సవాలలో తోలుబొమ్మలాటలు ప్రదర్శించినట్లు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో పాల్కురికి సోమనాథుడు ఈ విధంగా వివరించాడు.

భారతాది కథల జీరమఱుగుల -
నారంగ బొమ్మల నాడించువారు
గడు నద్భుతంబుగ గంబసూత్రంబు -
లడరంగ బొమ్మల నాడించువారు.

అనడాన్నిబట్టి శ్రీశైలం వెళ్ళే ద్రావిడ యాత్రికులతోపాటు పైవలస వచ్చిన బొమ్మలాటవారు కూడా వుండి వుండవచ్చు. దీనినిబట్టి ఆంధ్రదేశంలో కొన్ని వందల సంవత్సరాల ముందునుంచే ఈ బొమ్మలాటలు ఆదరింపబడి ప్రజాభిమానం పొందుతూ వున్నాయని స్పష్టమౌతూంది.

మన వాఙ్మయంలో పాల్కురికి సోమనాథుని కాలంనుండి తంజావూరు రఘునాథరాయల కాలం వరకూ అనేకమంది కవులు బొమ్మలాటలను పేర్కొన్నారు. "ప్రతిమ లాడగ బట్టిన యట్లు'' అని పల్నాటి చరిత్రలో శ్రీనాథ మహాకవి పేర్కొన్నాడు.

బొమ్మలాటలను గురించి నాచనసోమన ఉత్తర హరివంశంలో —

''యంత్రకు డాడించి యవని ద్రోచిన వ్రాలు
బొమ్మల గతి రథపూగములును''

అని వివరించాడు. బొమ్మలాటల వారు గోన బుద్ధారెడ్డి రామాయణంలోని ద్విపదలను పాడేవా రని సురవరం ప్రతాపరెడ్డిగారు 'సాంఘిక చరిత్ర'లో వివరించారు. భాస్కర శతకాన్ని వ్రాసిం దెప్పుడో తెలియదు గాని, అతని కాలంలో తోలుబొమ్మలాటలు వ్యాప్తిలో వున్నట్లు భాస్కరశతకంలో ఈ క్రింది పద్యం ద్వారా తెలియవస్తూంది.

"ఇంచుక నేర్పు చాలక విహీనత జెందిన నాకవిత్వమున్
మించు వహించె నీకతన మిక్కిలి; యెట్లన తోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెరమాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే? జనుల డెందము నింపవె ప్రీతి భాస్కరా!



యం. వి. రమణమూర్తి,
హనుమంతుని తోలుబొమ్మ

## శాసనాలు, తోలుబొమ్మలు :

తోలుబొమ్మలాటలను గురించి అనేక శాసనాల్లో వుదాహరింపబడి వుంది. బొమ్మలాట వారిని గురించి చాగంటి శేషయ్యగారు ఒక శాసనాన్ని బయట పెట్టారు. కడపజిల్లా కమలాపురం తాలూకా చిడిపిరాల అన్న గ్రామాన్ని చంద్రయ్యా, బొమ్మలాట అమృతకవీ అనే వారిద్దరూ తెరనాటకా లాడడానికి పెద చిట్టెయ్య అనే ఆయనకు దానం ఇచ్చినట్లు శాసనంలో వుంది.

## ముక్కామల భూదానశాసనం :

అలాగే క్రీ॥శ॥ 1208 లో దుర్జయాన్వయులైన విప్పరుల కొండప, గుండప నాయకుల ముక్కామల భూదాన శాసనంలో, సూత్రధారి బోమలయ అనే ఆయన ప్రతి గృహీతగా పేర్కొన బడ్డాడు. అతను బొమ్మలాటవాడే కావచ్చని యస్వీ జోగా రావుగారు వ్రాస్తున్నారు.



## గూడూరు శాసనం :

ఇంకా కాకతీయులకు సంబంధించిన తెలంగాణా శాసనాలలో వరంగల్ జిల్లా గూడూరు శాసనం ఒకటి ఈ బొమ్మలాట సమాచారాన్ని తెలియజేస్తూంది. శాసనం చివరి భాగంలో సూత్రధారి కొమ్మోజనహా బరహా అని వుంది. అంటే సూత్రధారి కొమ్మోజు వ్రాసినదన్న మాట. ఇది తెలుగు శాసనం.

అలాగే పానుగల్లు శాసనంలో సూత్రధారి బ్రహ్మోజు బెరసిన సూత్రధారుల కాన్యపల్లిని బానుగంట దశవృత్తి పుదపండ్లు 20. భీమసముద్రము వెనుక పుదమటు తరు అని వుంది.

## కొమ్మోజు, బ్రమ్మోజు :

పై సూత్రధారులు - కొమ్మోజు, బ్రహ్మోజు అనే పేర్లనుబట్టి బొమ్మలాట వారని తెలుసుకోవచ్చు. అంతేగాక పై పేరులను బట్టి వీరు తప్పక మహారాష్ట్రులే ఐవుండవచ్చు.

అంతేగాక వా రుపయోగించిన మాటలు బరహా, బెరసిన అన్నవి కన్నడ భాషకు చెందినవి. దీనినిబట్టి మనకు విశదమయ్యే దేమంటే మరాటీ బొమ్మలాటవారు దేశదేశాలూ తిరిగారు. అలాగే వీరు కన్నడదేశం కూడా సంచారం చేశారు. అంతే గాక మహారాష్ట్రపు సరిహద్దునున్న దేశం కన్నడ దేశం. అందువల్ల వీరికి ఆ బరహా, బెరసిన అనే కన్నడ మాటలు కూడ వచ్చి వుండవచ్చు. దేశదిమ్మరు లైనవారికి ఆయా భాషలు వంటబట్టడం సహజమే.

## అరెకాపులు, గంధోళీలు:

ఈ బొమ్మలాటలాడేవారిని ఆరెకాపు లంటారు. ఈ అరెకాపులు ఈ నాటికీ మహారాష్ట్ర దేశంలో వున్నారు. అక్కడ వారి పేరు గంధోలీ లంటారు. ఈనాడు తెలుగుదేశపు బొమ్మలాటల వారందరూ ఒకనాడు మహారాష్ట్రులే. ఈ నాటికీ బొమ్మ లాటలవారు బయట ఎంత తెలుగు మాట్లాడినా ఇంట్లో మాత్రం మరాఠీభాషనే మాట్లా డుతూ వుంటారు. అంతేగాక మరాఠీ బొమ్మలాటలో వుండే హాస్య పాత్రధారి



గంధోలి గాడికీ, మన జుట్టుపోలిగాడికీ చాలా దగ్గర సంబంధముంది. ఒకేరకమైన హాస్యమూ వేషధారణలో పోలికలూ వున్నాయి.

## రకరకాల జాతులు, పేర్లు:

కాని దక్షిణదేశంలోని బొమ్మలాట ప్రదర్శకు లందరూ మహారాష్ట్ర జాతికి సంబంధించిన వారని చెప్పలేము. మైసూరు ప్రాంతంలో వూరు జంగాలు, బొందాయి, మైసూరు సరిహద్దు ప్రాంతాల్లో కుతుబువారు, మధుర, తంజావూరు

ప్రాంతాలలో కత్తాడీ లనే నట్టువ జాతివారు, బళ్ళారి జిల్లాలో కొన్ని ప్రాంతాల్లో బలిజలు, విశాఖ జిల్లాలో ఈటె బొందిలీ తెగలవారు, గోదావరి మండలంలో తెలుగు గొల్లలూ, గుంపు తెగలవారు, జంగాలు మొదలైన వారు కూడ వున్నారు.



## బొమ్మలాటల వారి కేంద్రాలు:

ఈ బొమ్మలాటల కుటుంబాలవారి నివాసాలు ఆంధ్ర దేశంలో విశాఖపట్టణం జిల్లాలో సర్వసిద్ధి, శృంగవరపు కోట, కశ్శేపల్లి అగ్రహారం, గోదావరి జిల్లాలో మండ పేట, అంగర, ఎలమంచిలి, తణుకు, నెల్లూరు జిల్లాలో సింగరాయకొండ, కర్నూలు జిల్లాలో రాయదుర్గం, బెళగల్లు, అనంతపురం జిల్లాలో కదమలకుంట, అవులన్న, జరుట్ల రామపురం, బళ్ళారి జిల్లా సొండూరు, తోరణగల్లు, బొమ్మలాట పల్లి మొదలైనవి, ఆ ప్రాంతాలలో బొమ్మలాటలవారు ఎక్కువగా వున్నారు. కాకినాడ వద్ద మాధవపట్నంలో మాత్రం ఈ కుటుంబాలవారు చాలామంది వున్నారు.

## బొమ్మలాట పల్లి:

బొమ్మలాట లాడేవారు ఎక్కువ మంది వుండడం వల్లనే ఈ గ్రామానికి బొమ్మలాట పల్లి అనే పేరు వచ్చింది. బొమ్మలాట పల్లి బళ్ళారి జిల్లాకు చెందిన గ్రామం.

ఇక్కడున్న బొమ్మలాట వారిలో మహారాష్ట్ర వాసనలు చాలా వున్నాయి. వీరిని బొందిలీ క్షత్రియు లంటారు. గంధోలి అనే శబ్దవికృతే బొందిలీ అని కూడా వాడుక వుంది. ఈనాటికీ వీరు బొమ్మలాటల్ని ప్రదర్శిస్తున్నారు.

ముఖ్యంగా వీరు ప్రదర్శించే కథా ఇతివృత్తాలు భారత రామాయణ గాథలకు సంబంధించినవి. లంకాదహనం, మైరావణ చరిత్ర, ఇంద్రజిత్తు వధ, యయాతికథ, కీచక వధ, దుశ్శాసన కథ, ప్రహ్లాద చరిత్ర, రంగనాథ రామాయణం మొదలైనవే కాక, దేశీయ కథలైన దేశింగురాజు కథ, పల్నాటి వీరచరిత్ర, కరెభంటన కథ, కుమార రాముని కథలను కూడ ప్రదర్శిస్తూ వుంటారు.

## రామ నాటకం :

తోలుబొమ్మల ఆటలు ఆడేవారి సాహిత్యమంటూ మనకు ఈనాడు ఏదీ లభ్యం కాదు. కాని వారు యక్షగానాలనే బొమ్మలాట సాహిత్యంగా కూడా ఉపయోగించు కున్నారు. క్రీస్తుశకం 1850 ప్రాంతాల్లో గంజాం జిల్లా గుజ్జువాడ నివాసి మరింగంటి భట్టరు రామానుజాచార్యుల శ్రీరామ నాటకం బొమ్మలాటగా ప్రసిద్ధిజెందింది. ఇందులో కథ ముఖ్యంగా లక్ష్మణమూర్ఛ. ఇందులోని పాటలూ, పద్యాలూ, దరువులూ మొదలైనవి మాధవపట్నం బొమ్మలాటవారి లక్షణమూర్ఛలో కనబడుతాయి. భట్టరు రామానుజాచార్యులు వ్రాసిన తాళపత్ర ప్రతి చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వుంది.

## బాణాసుర నాటకం :



1893 లో కోట వెంకటప్పయ్య శాస్త్రిగారనే ఆయన బాణాసుర నాటకాన్ని రచించాడు. వీరి నివాసస్థలం పర్లాకిమిడికి దగ్గరలో వున్న పాత పట్నం గ్రామం. ఆయన ఆ నాటకానికి పీఠిక వ్రాస్తూ "ఈ గేయ ప్రబంధము వర్మ విగ్రహముల చేత ఆడించుటకును, వేషములు ధరించి నాటక మాడుటకును అనుకూలముగ నుండునట్లు రచింపుడని నా మిత్రులు కొందరు ప్రోత్సాహపఱచినందున నేనిందుల కియ్యకొంటి" నని వ్రాశారు. దీనిని 1894 లో ఇండియన్ లా ప్రెస్‌లో ముద్రించారు. వీరు బాణాసుర నాటకంలో తోలుబొమ్మల జుట్టుపోలిగాడి మాదిరి 'లొట్టకిత్తడు', 'రత్నాల పోలిగాడు' అనే రెండు హాస్యపాత్రల్ని సృష్టించారు.

## సంతవేలూరు కుశలవుల నాటకం :

అలాగే వీఔ సుబ్బరాజు, గాజుల పెండ్లూరి శేషగిరిరాజు అనే ఇరువురు కవులు కలిసి సంతవేలూరు కుశలవుల నాటకాన్ని, ఆరు రాత్రిళ్ళు ప్రదర్శించడానికి అనువుగా వ్రాశారు. దీనిని బొమ్మలాటగాను, వీధి నాటకంగాను, యక్షగానంగా కూడ ప్రదర్శించేవారట. 'బొమ్మలాట హాస్య నాటక' మనే కేతిగాని పెళ్ళి ఇతివృత్తంగా ఒక తాళపత్ర నాటకం మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వుంది.

తోలుబొమ్మల్ని ఎక్కడో మార్కెట్టుల్లో కొనుక్కురారు. ఈ బొమ్మలను తయారుచేసే చిత్రకారులు వారి వారి దళంలోనే వుంటారు. ఎప్పుడు బొమ్మ అవసర మనుకుంటే అప్పుడు అప్పటి కప్పుడు తయారు చేసు కుంటారు. ఈ బొమ్మలు మేక చర్మంతోను, జింక చర్మం తోనూ, దుప్పి చర్మంతోనూ తయారుచేస్తారు.



## పాత్రలకు తగిన ప్రతిమలు :

బొమ్మలాట కథా విధానంలో వచ్చే ఉదాత్తమైన పాత్రలన్నింటికీ రాముడు, కృష్ణుడు, విష్ణువు, ఇంద్రుడు, దేవతలు, సీత, సావిత్రి, ద్రౌపది మొదలైన పాత్ర లన్నింటికీ జింక చర్మాన్ని ఉపయోగిస్తారు. జింక చర్మాన్ని పూజా సమయాలలో ఎంత పవిత్రంగా ఉపయోగిస్తామో, అలాగే వారుకూడా ఆ చర్మాన్ని ఎంతో పవిత్రంగా ఎంచుకుంటారు. రాక్షస పాత్రలకు, దుష్టపాత్రలకు ఇంకా మిగిలిన చిల్లర పాత్రలకు మేక చర్మాన్ని ఉపయోగిస్తారు. ఈ విధంగా పాత్రల పవిత్రతను బట్టి చర్మాలను వుపయోగిస్తారు.

## బొమ్మల సౌందర్యం :

పైన వుదహరించిన చర్మాలను సేకరించి చక్కగా శుద్ధిచేసి, చర్మంలో వున్న దుర్వాసన నంతటినీ పోగొట్టి, వారికి కావలసిన బొమ్మల సైజుకు చక్కగా గీతగీసి దానిని సొంపుగా కత్తిరించి చిత్ర విచిత్రమైన రంగులను అద్దుతారు. రంగులు వేసిన తరువాత ఆ బొమ్మలో జీవం వుట్టిపడుతూ వుంటుంది. ఈ రంగుల్ని అద్దడంలో కూడా పాత్ర ఔచిత్యాన్నిబట్టే రంగుల్ని చిత్రిస్తారు, ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుష లక్షణాలతోనూ, పద్మిని, చిత్తిని, శంకిని మొదలైన నాయకీ, నాయకులకుండే భేదాలను రంగుల్లో చిత్రిస్తారు.

ముఖ్య పాత్రలు అంటే ప్రదర్శనంలో చివరంటా వచ్చే పాత్రలు. ఆయా రంగాలలో ఘట్టాల ననుసరించి ఒకే పాత్ర నాలుగు రకాలుగా తయారు చేసు కుంటారు. ఉదాహరణకు - బాల్యంలో రాముడు, అడవిలో రాముడు, యుద్ధంలో రాముడు, పట్టాభిరాముడు, ఈ విధంగా ఆయా దశల ననుసరించి చిత్రాలను తయారు చేసుకుంటారు.

## హంగులు, ఆయుధాలు, అలంకారాలు :

ఇక ప్రదర్శనానికి కావలసిన పరికరాలను, మిగిలిన హంగు లన్నింటినీ కూడ తయారు చేసుకుంటారు. రథాలు, గుఱ్ఱాలు, అంబులు, బాణాలు, గదలు, ఈటెలు, సైన్యం మొదలైన వాటినన్నిటినీ కూడ తయారుచేసుకుని ప్రదర్శనం రోజున వివరంగా విడదీసి ప్రదర్శన గమనాన్నిబట్టి ఈ బొమ్మలన్నిటినీ సక్రమంగా, సిద్ధంగా అమర్చిపెట్టుకుని, ఒక బొమ్మ తరువాత మరొక బొమ్మను తెరమీదికి ఎక్కించి కథను ముందుకు నడుపుతారు. ఈ బొమ్మల్నిగాని, పరికరాలను గాని విడిగా చూస్తే ఏదో తోళ్ళముక్కల్లాగ కనిపిస్తాయి. వీటి నిజమైన అందం అముదపు దీపాల వెలుగులో తెరమీదే చూడాలి. ఎంతో రమణీయంగా వుంటాయి. కష్టమో, నష్టమోపడి ఒక్కసారి ఈ బొమ్మల్ని తయారుచేసుకుంటే ఇంక అవి 20 సంవత్సరాలవరకూ చెక్కు చెదరకుండా వుంటాయి.



ఒకవేళ మధ్య మధ్య కొన్ని బొమ్మలు శిథిలమైతే వాటిని అప్పటికప్పుడు పూర్తి చేసుకుంటారు. ఈ బొమ్మల్ని అన్నిటికన్నా పెద్ద సైజు బొమ్మకు తగినంత వెడల్పు, పొడవూ గల మేదర పెట్టెల్లో అమరుస్తారు. ఒక్కో ప్రదర్శనానికి ఒక్కొక్క పెట్టెను వుంచుకుంటారు.

## బహిరంగ ప్రదర్శనశాల :

ఈ బొమ్మలాట ప్రదర్శకులు ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి బండ్లమీద ప్రయాణం చేస్తారు. ఒక్కొక్క దళానికి ఒకటిగాని, రెండుగాని బండ్లు వుంటాయి. ఒక బండి మీద సామాన్లు, రెండవ బండిమీద మనుషులు ప్రయాణం చేస్తారు.

గ్రామంలో ప్రవేశించి పెద్దల్ని, పిన్నల్ని కలుసుకుని పరిచయం చేసుకుంటారు. అందరూ కూర్చోవడానికి అనువుగా వున్న బహిరంగస్థలంలో పందిరి ప్రారంభించి, మూడు ప్రక్కలా మూయబడి ఒక ప్రక్కన తెరకట్టడానికి వీలుగా పందిరి వేస్తారు. ఈ పందిరి కొంచెం ముందుకు వాలివుండేటట్లు కడతారు. ఇలా కట్టడంవల్ల వారు ఆడించే బొమ్మలు జారిపోకుండా వుంటాయి. పందిరి లోపలి భాగంలో వారి మొత్తం సామగ్రి, పిల్లలూ, భార్యలూ - సంసారమంతా అందులోనే

వున్నదా అనిపిస్తుంది. వెనుక ప్రక్క కూడా మూతతో అందరూ లోపలే వుంటారు. లోపలిప్రక్క తెరను ఆనుకుని ఒక పెద్ద బల్లను వేస్తారు.

వరుసగా ఆముదపు దీపాలను అమరుస్తారు. ఈనాడు కొందరు పెట్రోమాక్సు లైట్లను వాడుతున్నారు. కాంతి తగ్గకుండా ఎప్పుడూ ఒకరు ఆముదపు దీపాల ఒత్తులు ఎగదోస్తూ, కొరతబడ్డ ఆముదాన్ని పూర్తిచేస్తూ వుంటాడు. దీపాల కాంతి తగ్గితే బొమ్మల అందచందాలు తగ్గుతాయి.



## తెరమీద బొమ్మలతో ప్రదర్శన ప్రారంభం :

ప్రదర్శనం ప్రారంభించే రోజున 'ఈ రాత్రికి బొమ్మలాట వుందహో' అని చాటింపు ద్వారాగాని, ఇంటింటికీ వెళ్ళి చెప్పడం ద్వారాగాని అందరికీ ఈ వర్తమానం తెలియజేయబడుతుంది.

బొమ్మలాటకు తెర సిద్ధంచేసిన తరువాత ప్రప్రథమంగా విఘ్నేశ్వరుని బొమ్మను తెరకు మధ్యగా ఎక్కించి వుంచుతారు. ఒక ప్రక్క మాత్రం దిష్టిబొమ్మ నొకదానిని, రెండవ ప్రక్క జుట్టుపోలిగాణ్ణి ఎక్కించి వుంచుతారు.

తోలుబొమ్మల్ని తెరమీద ఆడించడానికి వీలుగా ఒక వెదురుబద్దను బొమ్మకు మధ్య భాగంలో కడతారు. బొమ్మను ఆడించాలంటే ఈ బద్దే ఆధారం. బొమ్మను ఆడించే సమయంలో చేతిని తెరమీదకు ఏమాత్రం రానీయరు. ఒకవేళ వస్తే మనిషి బొమ్మ కనబడుతుంది. అందువల్ల దూరంగా వుండి ఒక చేతిలో బొమ్మను బట్టి రెండవ చేతిలో మరో చిన్న కొంకిగల బద్దను పట్టుకుని బొమ్మయొక్క చేతులకు తగిలించి, సంభాషణల ప్రకారం బొమ్మల్ని కదిలిస్తూ వుంటారు. కాళ్ళు మాత్రం ఎటుబడితే అటు కదిలేలాగా మన దసరా వుత్సవాల్లో పిల్లలు పుచ్చుకునే కోతి బొమ్మ మాదిరి కీలు కీలువద్దా రంధ్రాలు పొడిచి ఎటుపడితే అటు తిరగడానికి వీలుగా అమరుస్తారు. ఒకవేళ తెరమీద బొమ్మ కొంచెంసేపు చలనం లేకుండా వుండాలంటే ఒక

తుమ్మ ముల్లుతో నాటువేసి బొమ్మను తెరమీద నిలబెడతారు. ఒక్కొక్కసారి ఒకే వ్యక్తి రెండేసి బొమ్మల్ని కూడా ఆడిస్తూ వుంటాడు.

విఘ్నేశ్వర పూజ :

ప్రదర్శన ప్రారంభంలో తోడిరాగంతో కూడిన మంగళహారతి పాడుతారు. ఏ విఘ్నాలూ కలుగకుండా విఘ్నేశ్వరుని ప్రార్థిస్తారు. తరువాత సభావర్ణన చేస్తూ పాట పాడతారు. "అందరూ వచ్చారా? కరణంగా రొచ్చారా? మున్సిఫ్‌గా రొచ్చారా? పండితులంతా వచ్చారా? పెద్దరెడ్డి వచ్చాడా?" అంటూ హెచ్చరించి ప్రేక్షకుల్ని అదుపులో పెట్టుకుంటారు.



ఆటకు తగ్గ పాటలు,
పాటకు తగ్గ మోతలు :

పాటపాడేవారు, హార్మోనియం వాయించేవారూ, తాళం వేసేవారూ, మద్దెల కొట్టేవారూ, అదనపు మోతల్నిచ్చేవారూ, వంతపాటలు పాడేవారూ అందరూ లోపలే కూర్చుంటారు. పిల్లల పడకలూ, వుయ్యాలలూ అన్నీ నేపథ్యంలోనే అమర్చుకుంటారు.

వీరికి హార్మోనియం శృతిగా వుంటుంది. తాళా లుంటాయి. హార్మోనియం, తాళాలు, మద్దెల వాయించే వ్యక్తులు కూడా వెనుక వంతపాట పాడుతూ వుంటారు. అంతేకాదు. వాళ్ళ కాళ్ళక్రింద బల్లచెక్క లుంటాయి. ఆ యా ఘట్టాల ననుసరించి ఈ చెక్కలను త్రొక్కుతూ వుంటారు. ముఖ్యంగా రథాలు, గుఱ్ఱాలు. పరుగులెత్తే టప్పుడూ. యుద్ధఘట్టాలలోనూ ఈ చెక్కలు టకటకా త్రొక్కుతూవుంటే బలే రస వత్తరంగా వుంటుంది.

అంతేగాక నగారామోతలకు ఖాళీ డబ్బాలు వుపయోగిస్తారు. పిడుగులు పడ్డట్టూ, వురుములు వురిమినటు డబ్బాలను మ్రోగిస్తారు. ఈ విధంగా వారు ప్రదర్శనాన్ని జయప్రదంగా రక్తి కట్టిస్తారు. ఆట ఆడినంతసేపూ పరస్పర సహకారం వారిలో కనబడుతుంది. అందువల్లనే వారి ప్రదర్శనాలు అంత బాగా రక్తి కడతాయి.

## ఆటగాండ్ల అష్టావధానం :

ముఖ్యంగా ఏ వ్యక్తి బొమ్మల్ని ఆడిస్తాడో ఆ వ్యక్తి నోటితో పాటపాడుతూ పాటకు తగిన విధంగా బొమ్మను ఆడిస్తాడు. సంభాషణలకు కూడా ఇదే విధానాన్ని అనుసరిస్తాడు. ఇక రెండు బొమ్మల్నీ ఆడించే సమయంలో బొమ్మల మధ్య వచ్చే పోరాటంలో, రెండు బొమ్మల్ని రెండు చేతులతోకొట్టిస్తాడు. అలా కొట్టడంలో సమయానికిక్రింద బల్లచెక్క టకామని త్రొక్కుతాడు. నిజంగా పాత్రలు కొట్టుకున్నట్లే వుంటుంది. ఈ సమయంలో ఇతర వంతదారులు కావలసిన అల్లరి, హంగామా చేస్తారు. ఒక యుద్ధ ఘట్టం వచ్చిందంటే, డోళ్లూ, డబ్బాలూ, ఈలలూ, కేకలతో వానకురిసి వెలిసినట్లు చేస్తారు. ఈ విధంగా వారు ప్రదర్శనను సమిష్టి కృషితో జయప్రదంగా నిర్వహించి ప్రేక్షకుల్ని మెప్పిస్తారు.

## బొమ్మలాటకు బ్రహ్మ :

నాటకానికి దర్శకుడు ఎంత అవసరమో అలాగే ఈ బొమ్మలాటలకు బ్రహ్మ లాంటి వాడు సూత్రధారుడు. తెరలోపల నుండి ప్రదర్శనాన్ని వరుసక్రమంలో నడిపే బాధ్యతలన్నీ ఈతనిమీదే వుంటాయి. మిగతా వారందరూ ఈతనిని అనుసరిస్తూ వుంటారు. ఈ సూత్రధారుడు సంస్కృత రూపకాలలోనూ, తెలుగు భాగవతాలలోనూ, యక్షగానాలలోనూ, నాటకాలలోనూ కూడా ప్రాముఖ్యం వహిస్తూ వచ్చాడు.

బొమ్మలాట సూత్రధారుడు కథను చాలా వివరంగానూ, చాకచక్యంగానూ చెప్తాడు. ప్రథమంలో కొన్ని శ్లోకాలు చదివి, ఆ శ్లోకాల అర్థాన్ని మరలా తెలుగులో అందరికీ అర్థమయ్యే స్థాయిలో విపులీకరిస్తాడు. కొన్ని పద్యాలనూ, గేయాలనూ అతి మృదుమధురంగా ఇతను పాడితే మిగిలినవారు, పై శృతిలో ఆలాపిస్తారు. వచనాన్నికూడా రాగయుక్తంగా చదువుతారు. ఆయా పాత్రల ఔచిత్యానికి భంగం లేకుండా గొంతులు మారుస్తూ వుంటారు. సూత్రధారుడు అడుగడుగునా ప్రేక్షకుల యొక్క ఆదరణను గమనించి, కథనుసాగించి విజయం పొందుతాడు.



## ప్రదర్శనం, ప్రేక్షకుల హడావిడి :

తోలుబొమ్మలాట ప్రదర్శిస్తున్నారని తెలిస్తే చాలు, గ్రామం చుట్టుప్రక్క-లున్న పెద్దలు - పిల్లలూ, స్త్రీలూ అందరూ హెచ్చు తగ్గుల భేదాలు లేకుండా ఒకరి కంటే ఒకరు ముందుకు వచ్చి కూర్చుంటారు. కథా ప్రారంభం నుండి ఆసాంతం వరకూ రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చుంటారు. ప్రతి ఘట్టంలోనూ వారు కదలిపోతారు. హాస్యఘట్టాలలో ఎంతగా పగలబడి నవ్వుతారో అలాగే కష్టాలతో కూడుకున్న ఘట్టాల్లో కళ్ళవెంట నీరు కారుస్తారు. ఇక దౌర్జన్య ఘట్టాలలోనూ, దుర్మార్గపు సన్నివేశాలలోనూ, ఆయాపాత్రలమీద పళ్ళు పటపటా కొరుకుతారు. ఈ విధంగా పండితుల మొదలు పామరుల వరకు ఆబాలగోపాలం ఆనందంలో మునిగిపోతారు.

## జుట్టుపోలిగాడు, బంగారక్క :



ఈ బొమ్మలాట ప్రదర్శనాలను ఇంత ఆపేక్షగా ప్రజలు చూడడానికి కారణం లేకపోలేదు. తెలుగు నాట బొమ్మల ప్రదర్శనాలలో విచిత్రమైన హాస్య పాత్రలను చూపుతారు. ఈ పాత్రలు కథాప్రారంభంనుండి కథాంతం వరకూ అడుగడుగునా కథాగమనంతో ఒక ఘట్టం అయిన తరువాత రెండవ ఘట్టం ప్రారంభమయ్యే వ్యవధిలో ప్రత్యక్షమౌతూ వుంటాయి. ఆ పాత్రలే జుట్టుపోలిగాడు, బంగారక్క. ఈ రెండు పాత్రలూ హాస్యం ద్వారా, దీర్ఘ కాలం ప్రదర్శించే ప్రదర్శనంలో మధ్య మధ్య వారిని కడుపుబ్బ నవ్వించి నిద్రమత్తు వదలగొడుతూ వుంటాయి. ఈ పాత్రల హాస్యం బహుమోటుగా వుంటుంది. నవ్వుతో కడుపు చెక్క-లయ్యే పనులు ఈ బొమ్మలతో చేయిస్తారు. సమాజంలోవున్న కుళ్ళును, ఈ బొమ్మలను అడ్డంగా పెట్టుకుని కుళ్ళగిస్తుంటారు. మధ్యమధ్య విసుర్లు విసురుతూ వుంటారు.

## మరో బఫూన్ అల్లాటప్పగాడు :

తోలుబొమ్మలాటల్లో హాస్యం ఎంతవరకెళ్ళిందో అల్లాటప్పగాడిని గురించి తెలుసుకుంటే బోధపడుతుంది. జుట్టుపోలిగాడు, బంగారక్క కాక వీడు మూడవ `డు. వీడి పాత్ర ఎటువంటిదంటే 'తాడెక్కే వాడుంటే వాడి తలదన్నేవాడుంటా'

దనే సామెత ప్రకారం పై రెండు పాత్రలనూ తలతన్నేవాడు ఈ అల్లాటప్పగాడు. ప్రదర్శనంలో బంగారక్కను గడసరి పెండ్లాంగా సృష్టిస్తారు. ఈమెకు, పోలిగాడికి నిరంతరం కయ్యం నడుస్తూ వుంటుంది. కాసేపు రెండు పాత్రలూ అతి విచిత్రంగా అసభ్య శృంగారాన్ని అభినయిస్తాయి. కొంచెంసేపు పోట్లాట, మరల రాజీ, ఇంతలో పోలిగాడి అంతర్ధానం. ఈ సమయంలో అల్లాటప్పగాడు బంగారక్క దగ్గర ప్రత్యక్ష మౌతాడు. బంగారక్కకు, అల్లాటప్పకు సంబంధాన్ని కుదురుస్తాడు. రెండు పాత్రలూ మంచి శృంగారపు పట్టులో వుండగా మరో పాత్ర ప్రవేశిస్తుంది. అది కేతిగాని పాత్ర.

### కేతిగాడు :



కేతిగాడి పాత్ర అతి విచిత్రమైంది. అన్ని బొమ్మలకన్నా కేతిగాడి బొమ్మ చిన్నది. ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు పానకంలో పుల్లలాగా ఒక అడుగు చోటు తెరమీద వుంటే చాలు హఠాత్తుగా ప్రవేశిస్తాడు. శృంగార ఘట్టంలో వున్న అల్లాటప్పగాణ్ని టకీమని ఒక్క దెబ్బ కొడతాడు కేతిగాడు. వెంటనే అంతర్ధాన మౌతాడు అల్లాటప్పా. ఇంకేముంది కేతిగాడు బంగారక్కను ఏడిపిస్తాడు. ఇలాంటి ఘట్టాలు ప్రదర్శనంలో వచ్చే వ్యవధిని కమ్మివేస్తూ వుంటాయి. చాలామంది ప్రేక్షకులు కథకంటే హాస్యపాత్రల ప్రవేశంకొరకే ఎదురు చూస్తూవుంటారు. అందువల్లనే ప్రదర్శనం తెల్లవార్లూ ప్రదర్శించినా విసుగుజెందరు.

### వానలు రాకపోతే, వాటమైన కిటుకు :

గ్రామాల్లో ముఖ్యంగా వ్యవసాయతరుణం అయిపోయిన తరువాత ఈ బొమ్మలాటల ప్రదర్శనాలు జరుగుతూ వుంటాయి. బొమ్మలాటల్ని ప్రదర్శించడంలో జానపదులకు కొన్ని నమ్మకాలు కూడా వున్నాయి. ఉత్తర గోగ్రహణం కథ ఆడిస్తే వర్షాలు కురుస్తాయని, వర్షాలు లేని ప్రాంతంలో ఆ ఆటలను ఆడిస్తూ వుంటారు. ఈ నాటికీ కాకినాడ ప్రాంతంలో వర్షాలు కురవనప్పుడల్లా దగ్గరలో వున్న మాధవపట్నం బొమ్మలాట వారిని ఆహ్వానించి శ్రీ ధేనువు కొండవెంకయ్యగారు రచించిన ఉత్తర గోగ్రహణాన్ని, విరాటపర్వాన్ని ప్రదర్శిస్తారు.

## దేశదిమ్మర్లు :

బొమ్మలాట లాడేవారు వూరు తరువాత వూరు చాంద్రాయణం చేసుకుంటూ ప్రదర్శన లిచ్చుకుంటూ దేశదిమ్మర్లుగా తిరుగుతూ వుంటారు. చావులూ, పుట్టుకలూ, వివాహాలూ, వేడుకలూ అన్నీ దానిలోనే జరిగిపోతూ వుంటాయి.

వీరిలో ఒక్కొక్కరికి ఇద్దరు ముగ్గురు భార్యలు కూడా వుంటారు. ఇలా వుండటం వారికేమీ తప్పు కాదు. కారణం ఈ స్త్రీలందరూ ప్రదర్శనంలో పాటలు పాడటానికీ, బొమ్మల నాడించటానికీ ఉపయోగపడతారు. అందువల్ల బయటనుంచి కిరాయి నటుల్ని తెచ్చుకోవాల్సిన అవసరం వుండదు. అంతేగాక ప్రదర్శనంరోజున ఒకరికి జబ్బు చేసినా, గొంతు పోయినా ప్రదర్శనం ఆగదు. ఈ బాధ్యతలు అదనంగా వున్న స్త్రీలు పంచుకుంటారు. బొమ్మలాటవారిలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువ మంది వుంటారు. ఎంతమంది వున్నా వారి కంఠాలన్నీ కోకిల కంఠాలే. పుట్టుకతోనే వారికి ఆ లక్షణాలు అబ్బుతాయా అన్నట్లుంటుంది.

తోలుబొమ్మలు ఒకనాడు తెలుగు విజ్ఞాన వికాసాలకు పట్టుగొమ్మలు. తోలు బొమ్మల్ని ఆనాడు ప్రజలు ఎంతగానో పోషించారు. రానురాను నాటకాలు అభివృద్ధి లోకి రావడంవల్లా, సినిమాకళ అభివృద్ధి చెందటంవల్లా ఈ కళ కొంతవరకు దెబ్బ తినిపోయిందని చెప్పవచ్చు.

ఆనాటి తోలుబొమ్మలాటవారిలో ఎంతో సంగీతం, సాహిత్యం, శిల్పం మొదలైనవాటిలో విద్వాంసు లుండేవారు. ఈనాడు అటువంటివారు తగ్గిపోయారు. ఉన్న కొద్దిమందీ నాశిరకం ప్రదర్శనాల నిస్తున్నారు.

## ఆచార్య యం. వి. రమణమూర్తి :

శిథిలమైన తోలుబొమ్మలాటలను ఆధునిక రీతిలో పునరుద్ధరించటానికి కాకినాడ వాస్తవ్యులు యం. వి. రమణమూర్తిగారు ఎంతో కాలంగా కృషి చేస్తున్నారు. వీరికి భారత ప్రభుత్వం రెండు సంవత్సరాలు స్కాలర్‌షిప్ ఇచ్చి, తోలుబొమ్మల పరిశోధనకు అవకాశం కల్పించారు. రమణమూర్తి గారు దాదాపు 15 సంవత్సరాలు ఈ కృషిలో వుండి అనేక మహాసభల్లోనూ, ప్రముఖ నాయకుల సమక్షంలోనూ, విదేశీ రాయ



వారుల సమక్షంలోనూ ప్రదర్శించి, ఆనాటి తోలుబొమ్మల ఆట విశిష్టతను చాటారు. బొమ్మల ప్రదర్శనంలో పూర్వం ఉపయోగించే ఆముదపు దీపాలను తొలగించి, ట్యూబులైటుల ద్వారా ప్రదర్శిస్తున్నారు. తెరకు కూడ ఇనుపగొట్టాల ఫ్రేమును తయారు చేసి, ప్రదర్శనాన్ని అవలీలగా ప్రదర్శించే ఏర్పాటు చేశారు. తోలుబొమ్మలతోపాటు గ్లోవీ బొమ్మలను కూడ (గ్లోవీపపెట్సు) ప్రదర్శిస్తున్నారు.



ఎం. వి. రమణమూర్తి

ఎక్కువ మంది హంగుదారులు అవసరం లేకుండా కథావృత్తాన్నంతా టేపురికార్డుచేసి బొమ్మలను అందించటానికి మాత్రం ఇద్దరు ముగ్గురు మనుషులతో ప్రదర్శనాలు సాగిస్తున్నారు. కథల్లో లంకాదహనం మొదలైన పౌరాణిక గాథలతోపాటు పంచతంత్ర కథలు, కుటుంబ నియంత్రణ మొదలైన ఇతివృత్తాలకు సరిపడే బొమ్మలను తయారుచేసి ప్రదర్శనాల నిచ్చారు.

కొంతకాలం వారు మద్రాసు అడయారులో సెంట్రల్ లెదర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో, బొమ్మల పరిశోధనలో ఆచార్యులుగా పని చేశారు. బొమ్మలను తయారు చేయటంలో తరిఫీదు ఇచ్చారు. బొమ్మలను తయారు చేయడంలో ఆధునికమైన పరికరాలను వుపయోగించారు. ఎన్నో బొమ్మలను ఇతర రాష్ట్రాలకు, ఇతర దేశాలకు ఎగుమతి చేశారు. వీరికి సహాయంగా సీత, ఇతర కుటుంబ సభ్యులు ఎంతగానో సహాయపడ్డారు. రమణమూర్తిగారు కీర్తిశేషులయ్యారు.



# బొమ్మలాట కళాకారులు

## నిమ్మల గోవిందు :

షుమారు అయిదువందల సంవత్సరాల క్రితం మహారాష్ట్ర నుంచి వలసవచ్చి, అనంతపురం జిల్లా, ధర్మవరం మండలంలోని నిమ్మలకుంట గ్రామంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఆ సంతతికి చెందిన దళవాయి గోవిందు, ఈ నాటికీ ఆ వృత్తినే కొనసాగిస్తున్నారు. ప్రభుత్వ సమాచారశాఖ ద్వారా, ఫామిలీ ప్లానింగ్ గురించి బొమ్మలాట ద్వారా ప్రచారం చేస్తున్నారు. బొమ్మలను తయారుచేయడం, ప్రదర్శించే కథలలోని మాటల్నీ పాటల్నీ పాడుతూ, సూత్రధారుడుగా వ్యవహరిస్తున్నారు. వీరు ప్రదర్శించే ముఖ్య ప్రదర్శనాలు ''సుందరకాండ'', మైరావణ, ''సతీ సులోచన'', ''ఇంద్రజిత్తు'' మొదలైనవి ముఖ్యమైనవి.



## కుమారరాజారావు :

అలాగే నెల్లూరు జిల్లా ధర్మారావు చెరువుపల్లి వాస్తవ్యుడు. కుమారరాజారావుగారు బొమ్మలాట ప్రదర్శనలో అవార్డు నందు కున్నారు. భారతదేశంలోనూ, విదేశాలలోనూ పలు ప్రదర్శనలిచ్చి, ప్రఖ్యాతి వహించారు.

## అనపర్తి చిన్నకృష్ణ :

తూర్పు గోదావరి జిల్లా, కాకినాడ సమీప గ్రామం, మాధవపట్నం. బొమ్మ లాట కళాకారులకు ప్రసిద్ధి. ఈ నాటికీ బొమ్మలాటలనే నమ్ముకుని జీవిస్తున్నారు, ఈ నాడు శ్రీ సీతారామ నిలయ చర్మ చిత్రకళా ప్రదర్శన కమిటీ అధ్యక్షులుగా, దర్శకులుగా అనపర్తి చిన్నకృష్ణగారు వ్యవహరిస్తున్నారు.

## తోట పవన్‌కుమార్ :

సామర్లకోట మండలం, మాధవపట్నంలో, శ్రీ నటరాజ నిలయ చర్మ చిత్ర కళాప్రదర్శన కమిటీ అధ్యక్షులుగా పవన్‌కుమార్ వ్యవహరిస్తున్నారు. భారత

రామాయణ గాథలకు సంబంధించిన, బొమ్మలాట ప్రదర్శనాలను భారతదేశమంతటా ప్రదర్శించారు.

తోట రంగారావు :

మాధవపట్నానికి చెందిన తోట రంగారావు, పద్మనిలయ చర్మ చిత్రకళా సంస్థను ఏర్పాటుచేసి ప్రదర్శనాల నిస్తున్నారు. మహాభారత గాథల్ని, బొంబాయి లాంటి ముఖ్యపట్టణాలలోనూ, ఆకాశవాణిలోనూ ప్రదర్శనలు ఇచ్చారు.



తోట వెంకటరావు :

తూర్పుగోదావరి జిల్లా తాళ్ళపాలెంకు చెందిన తోట వెంకటరావు, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోనూ, విశాఖ జిల్లాలోనూ, ఆలిండియా రేడియోలోనూ నూటఇరవై బొమ్మలతో పదిమంది కళాకారులతో రామాయణ, భారతాది కథలను ప్రదర్శిస్తున్నారు.

తోట బాలకృష్ణ :

శ్రీ లక్ష్మీనిలయ చర్మ చిత్రకళా సంస్థను, కాకినాడ సమీపంలోని చౌదిగ గ్రామంలో స్థాపించి రామాయణ, భారత గాథలను ప్రదర్శిస్తున్నారు. పదిహేను నిమిషాల నుంచి ఏడు గంటలవరకూ ఏకబిగిన ప్రదర్శనాన్ని ప్రదర్శించటం వీరి ప్రత్యేకత.

తోట ధవనేశ్వరరావు :

సామర్లకోట మండలంలోని మాధవపట్నంలో ధవనేశ్వరరావు, శ్రీ హనుమాన్ చర్మ చిత్రకళా బృందాన్ని ఏర్పాటుచేసి. ఆ సంస్థకు దర్శకుడుగా వుండి, రామాయణంలోని సుందరకాండ ''అంగద రాయబారం'', ''లక్ష్మణ మూర్ఛ'', ''లవకుశ''. భారతంలోని ఉత్తర గోగ్రహణం, కీచకవధ, పద్మవ్యూహము, శశిరేఖా పరిణయం మొదలైన ఘట్టాలను ప్రదర్శిస్తున్నారు.

ఎ. త్రినాథ్ :

కాకినాడ సమీపంలోని ''చౌదిగ''లో త్రినాథ్ శ్రీ. వాణీ నిలయ చర్మ చిత్ర కళాప్రదర్శన కమిటీకి అధ్యక్షుడుగా వుండి, భారతదేశమంతటా బొమ్మలాటలను ప్రదర్శిస్తున్నారు.

తోట నాగభూషణం :

తూర్పుగోదావరి జిల్లా జెల్లావారి పేటకు చెందిన నాగభూషణం, బొమ్మలాట ప్రదర్శనాన్ని సమర్థవంతంగా ప్రదర్శించటమే కాక, రామాయణ, భారత గాథలకు సంబంధించిన; ఘట్టాలకు సంబంధించిన బొమ్మ లన్నిటినీ తయారుచేయగల నిపుణుడు.

తోట సింహాచలం :

తూర్పు గోదావరి జిల్లా జెల్లావారిపేటకు చెందిన సింహాచలం - శ్రీఅన్నపూర్ణ నిలయ చర్మ చిత్రకళా సంస్థను స్థాపించి, బొమ్మలాట ప్రదర్శనంలో ప్రజామన్ననల్ని అందుకున్నాడు. రామాయణంలోని పది భాగాలనూ, భారతంలోని పది భాగాలనూ ప్రదర్శించగల సమర్థుడు.



తోట మావుళ్లు :

మావుళ్ళు, శ్రీ తిరుపతి శ్రీనివాస చర్మ చిత్రకళా సంస్థను స్థాపించి, ఆకాశ వాణి విజయవాడ కేంద్రంలోనూ, దూరదర్శన్‌లోనూ - రామాయణ, భారత, కథా ఇతివృత్తాలను సమర్థవంతంగా ప్రదర్శిస్తున్నారు. వీరు మారేడుపాకలో జన్మించినా, మాధవపట్నంలో స్థిరపడి ప్రదర్శనాలను ఇస్తున్నారు.

తోలుబొమ్మల తయారీ కేంద్రం :

రాష్ట్ర వ్యాపితంగా తోలుబొమ్మల తయారీలో అనంతపురం జిల్లా ధర్మవరం మండలంలోని ''నిమ్మల కుంట'' పేరుప్రఖ్యాతులు సొంతం చేసుకుంది. అనంతపురం జిల్లాలోని సుమారు అయిదు వందల కుటుంబాలు ఈ వృత్తిపై ఆధారపడి జీవిస్తున్నారు. మండల కేంద్రమైన గోరంట్ల ''కళ్యాణదుర్గం'' మండలంలోని, ఆవులన్న, దుద్దేకుంట, పిల్లల పల్లి, అయ్యగారి పల్లె, ధర్మవరం మండలంలోని నిమ్మలకుంట, రాళ్ళ అనంతపురం రాయదుర్గం మండలంలోని సోమలాపురం. ''చదం, జుంజురం పల్లి'', బొమ్మనహాళ్ మండలంలోని ఉడేగోళం, మల్లాపురం, బ్రహ్మసముద్రం మొదలైన గ్రామాలలో బొమ్మలాట కళాకారులు ఎక్కువగా వున్నారు.



ఛాయా నాటికలు:

తోలు బొమ్మలాటలకు సైదోడులే ఛాయా నాటికలు. బొమ్మలాటల అనంతరం వచ్చిన పరిణామమే ఈ ఛాయా నాటికలు. వీటినే షాడో ప్లేస్ అంటారు. ముఖ్యంగా ఈ ఛాయా నాటికలు దేశం మొత్తంలో చాలా తక్కువమందే ప్రదర్శిస్తున్నారు. మన వుత్తమ కళారూపాల్లో ఛాయా నాటికను కూడ ఒక వుత్తమ కళాఖండంగా ఎంచవచ్చు. ఈ ఛాయా నాటికలు ఇతర దేశాల్లో ముఖ్యంగా అమెరికా, ఇంగ్లండు దేశాల్లో సాంకేతికంగా బాగా అభివృద్ధి పొందాయని ప్రతీతి.

ఛాయా నాటికలు మన దేశంలో సుప్రసిద్ధ నర్తకుడు ఉదయశంకర్ తన నృత్య ప్రదర్శనాలతో పాటు ఈ ఛాయానాటికను కూడా వ్యాప్తిలోకి తీసుకువచ్చాడు. ఈయన ఛాయా నాటిక ద్వారా బుద్ధుని జీవితాన్ని ఎంతో నిపుణంగా ప్రదర్శించాడు. ప్రేక్షకులలో ఎంతో అనుభూతి కలిగించాడు.

అలాగే ఆంధ్ర దేశంలో బాపట్ల ప్రజా నాట్యమండలి కార్యకర్తలైన మురళీ ధర రావు, జొన్నలగడ్డ జోషీ మొదలైనవారు. ఇతర కళారూపాలతోపాటు ఈ ఛాయా నాటికలను దేశానికీ ప్రజలకూ ఉపయోగపడే కథా ఇతివృత్తాలను తీసుకుని ఎంతో ముచ్చటగా ప్రదర్శించారు.

## మాతృకలు తోలుబొమ్మలే :

ఛాయా నాటికలకు మాతృకలు తోలుబొమ్మలే. తోలుబొమ్మలాటల్లో కేవలం తోలుతో తయారుచేయబడిన బొమ్మలను మనుషుల సహాయంతో ఆడిస్తారు. ఒక్కొక్కరు ఒక బొమ్మ. మరికొందరు రెండు బొమ్మలను రెండు చేతులతోనూ ఆడిస్తూ వుంటారు. కాని ఛాయా నాటికల్లో, కేవలం ఆయా పాత్రలకు సంబంధించిన వ్యక్తులు తెర వెనుక నుండి నటిస్తూ వుంటే వారి నీడలు, వారి అభినయం తెల్లని తెరమీద ఎంతో స్ఫుటంగా కనపడతాయి. కాని ఛాయా నాటికల్లో పాత్రలు ధరించిన దుస్తుల యొక్క రంగులుగాని ముఖానికి పట్టించిన రంగులుగాని కనపడవు. అలా కనపడవు కనుకనే ఏ విధమైన రంగులూ, రంగుల దుస్తులూ వుండవు. ఇందుకు కారణం ఏమంటే తోలుబొమ్మ తెరకు అంటిపెట్టుకుని



వుండటంవల్లా ఆ బొమ్మ వెనుకనే బలమైన దీపపుకాంతి వుండటంవల్లా బొమ్మలు పలుచని చర్మంతో తయారుచేయడం వల్లా, బొమ్మలో చిత్రించిన అన్ని రంగులూ మనకు స్ఫుటంగా గోచరిస్తాయి. కాని ఛాయా నాటికలో నటులు తెరకు సాధ్యమైనంత దూరంగా వుంటారు. వారికి కొంచెం దూరంగా ప్రొజెక్టు చేసే కాంతివంతమైన లైటు వుంటుంది. నటీనటులు ముందుకు వచ్చిన కొలదీ నీడలు పెద్దవిగాను, వెనుకకు పోయిన కొద్దీ నీడలు చిన్నవిగానూ కనబడతాయి. ఇందులోకూడా ఆయా రంగులు చూపించవచ్చు. ఈ రంగులు లైటుకు దగ్గరగా చూపించినట్లైతే రంగులుకూడ వివరంగా కనపడతాయి. ఇందులో కూడా ఆయా రంగులు చూపించవచ్చు. ఈ రంగులు లైటుకు దగ్గరగా చూపించినట్లైతే రంగులు వివరంగా కనపడతాయి ఉదాహరణకు ఒక ఇల్లు దహనం అయిపోయినట్లూ ఆ మంటలు సహజంగా వున్నట్లూ చూపించ

వచ్చు. ఎట్టికాగితాలను సన్నగా జూల్సుగా కత్తిరించి లైటు ముందు విసనకట్టిలాగా విసరినట్లయితే ఆ రంగు నీడలు మంటలుగా కనిపిస్తాయి. ఇలా మనకు కావలసిన ఇతర రంగులను ప్రకృతి దృశ్యాలను ప్రదర్శించవచ్చు.

ముఖ్యంగా ఛాయా నాటికలు ఆయా సన్నివేశాల ననుసరించి నేపథ్య సంగీతాన్ని వినిపించడంతో ఎంతో రమణీయంగా వుంటాయి.

## సురభివారి ఈతమట్టల బొమ్మలాట:

ఆంధ్రనాటకరంగ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యం వహించే సురభివారు ప్రారంభదశలో ఈతమట్టల బొమ్మలాటల్నీ, తోలుబొమ్మలాటల్నీ, తరువాత నాటకాలనూ ప్రదర్శించారు.

సురభి కళాకారుల నివాసం పూనా సమీపంలో వున్న ఒక కుగ్రామం. శివాజీ ఆస్థానంలో ఉద్యోగులుగానూ, సేనానాయకులుగానూ, ఉపనాయకులుగానూ వుండేవారు. వీరందరూ క్షత్రియకులానికి చెందినవారు. వీరందరూ బహు విద్యావంతులుగాను, సంగీత సాహిత్యాలలో ఆరితేరినవారై యుండేవారు. శివాజీ, శంభాజీ గతించిన తరువాత, మహమ్మదీయ దండయాత్రల్ని తట్టుకోలేక భార్యా బిడ్డలతో వలసలు పోయారు. అలా వలసలు పోయిన వారిలో, కొంతమంది బళ్ళారి, రాయదుర్గం, ఆదోని ప్రాంతాలకు చేరుకున్నారు. వారినే ఆరెకాపులనేవారు.

## దాత కరువు:

ఆనాడు దాతకరువుతో ఆంధ్రదేశమంతా అలమటిస్తోంది. వారితో తెచ్చుకున్న ఆభరణాలన్నీ అమ్ముకుని జీవించారు. తరువాత జీవనోపాధి కష్టమైంది. వారిలో అనేకమంది శ్రావ్యమైన గాత్రాలు కలవారున్నారు. పాటలను ప్రారంభించారు. తరువాత కొన్ని వినోద కార్యక్రమాలు ప్రదర్శించారు. కూటికోసం కోటి విద్యలన్నట్టు ఆ తరువాత ఈతమట్టల బొమ్మలాటను ప్రారంభించారు. ఈత ఆకులను మట్టలతోను తీసుకువచ్చి వాటిని ఎండబెట్టి, వాటిని బరువుక్రింద మణగిబెట్టి, వాటిని సైజులువారీగా, చిన్న పెద్ద పాత్రలను ఎంచుకుని, ఆయా పాత్రల ఆకారంలో ఆకులను బొమ్మల ఆకారంగా కత్తిరించి, రామాయణ



కథను ఎన్నుకుని, ఆయా పాత్రలకు వెనుకభాగాన మాటనూ పాటనూ కూర్చి, తెర చాటున దీపాలు పెట్టి, తోలుబొమ్మల ఆటల మాదిరి ప్రదర్శించేవారు. ఈతమట్ట పిడిని పట్టుకుని ఈ బొమ్మలను చక్కగా ప్రదర్శించి తద్వారా వచ్చిన డబ్బుతో తమ జీవనాన్ని సాగించేవారు. అలా ఈతమట్టల బొమ్మలాటలను ప్రదర్శించిన సురభివారు ఆ తరువాత తోలుబొమ్మలాటల్ని ప్రదర్శించారు.

ఊచబొమ్మలాట :

తోలుబొమ్మలు, కొయ్యబొమ్మలు, బుట్టబొమ్మలుతోపాటు ఈతమట్టల బొమ్మలాటలను, ఊచబొమ్మలాటలను కూడ ఆంధ్రదేశంలో ప్రదర్శించారు.

క్రింద నుండి ఊచలతో బొమ్మలాడించటంవల్ల వీటికి ఊచబొమ్మలని పేరు వచ్చిందని కె. వి. గోపాలస్వామిగారు నాట్యకళ జానపద నృత్యాల సంచికలో ఉదహరించారు.

ఈ విధంగా బొమ్మలాడించే పద్ధతి బెంగాల్‌లో ప్రచారంలో వుంది. ఆంధ్రదేశంలో ఒకప్పుడు ఊచబొమ్మలాటలను ప్రదర్శించినా ఇటీవల కాలంలో వాటిజాడ అంతగా తెలియటం లేదు.

కఱ్ఱబొమ్మ తలను తయారుచేసి సన్నకఱ్ఱ నొకదానిని క్రిందకు వుండేటట్లు ఈ రంధ్రంలో అమరుస్తారు. బొమ్మను పట్టుకుని ఆడించటానికి ఇది అనువుగా ఉపయోగపడుతుంది.

అంగవిభాగంలో మొండెము, నిటారుగా వున్న కఱ్ఱకు సమాంతరంగా తగిలించిన చెక్క భుజాలు వుంటాయి. త్రాళ్ళబొమ్మల మాదిరి చేతుల్ని అమర్చుతారు. వాటి అరచేతులకు సూత్రాలు తగిలించి క్రిందనుంచి ఆడిస్తారు. ఈ బొమ్మలకు కాళ్ళుకాని, పాదాలుకాని వుండవు. కఱ్ఱబొమ్మల అవయవాలను కూర్చటం కష్టంతో కూడుకున్న పని.



తల గుల్లగా వుంటుంది. దానిని మెడమీద అమర్చుతారు. తల, మెడ, భుజాలు ఏకాంతంగా వుంటాయి. తలలోని నిర్దిష్టభాగంలో అమర్చిన త్రాళ్ళు క్రిందకు వ్రేలాడటానికి వీలుగా ఒక్కొసారి కఱ్ఱలకు బదులుగా సన్నటి గొట్టాలను వాడటం కూడా కద్దు. త్రాళ్ళు లాగటం ద్వారా

సూత్రధారుడు తలను ఆడిస్తాడు. త్రాళ్ళబొమ్మలు, చేతి బొమ్మలకంటే ఊచబొమ్మల చలనం నెమ్మదిగా వుంటుంది. అయితే వీటి కదలికలలో ఎక్కువ అందం ఉంటుందంటారు గోపాలస్వామిగారు.

ఒక్క విషయంలో తప్పా, ఊచబొమ్మల రంగస్థలం, నిర్మాణం కూడా చేతి బొమ్మల రంగస్థలంవలెనే ఉంటుంది. బొమ్మలకు అమర్చిన కర్రల్ని గుచ్చి నిలబెట్టటానికి వీలుగా చిల్లులు పొడిచిన చెక్కలను రంగస్థలానికి క్రిందగా అవసరమైన చోట్ల వుంచుతారు. కొన్ని బొమ్మలకు, ఖాళీసమయంలో సూత్రధారుడు నిలబెట్టటానికి వీలుగా కర్రలకు అడుగున ఒక అంగుళం దూరంగా ఉండేటట్లు రెండు బిళ్ళలను అమరుస్తారు. చేతిబొమ్మల మాదిరే దీపాలను ఏర్పాటుచేస్తారు.





# మితారి తొక్కిన జిక్కిణీ కోపు

రుక్కిణీ లాస్యం మతంగ మహామునివల్ల ఆవిర్భవించిందని, ఆయన రచన బృహద్దేశివలన తెలుస్తూ వుంది.



ఒకనాడు ఆంధ్రదేశంలో జిక్కిణి నృత్యం బహుళ ప్రచారంలో వున్నట్లు 17 వ శతాబ్దంలో వెలువడిన అనేక ప్రబంధాలలో జిక్కిణి ఒక ప్రముఖమైన నాట్య విన్యాసమని తెలుస్తూంది.

రామాభ్యుదయంలోనూ, చంద్రభాను చరిత్రలోనూ, ఉత్తర రామాయణం లోనూ, పాంచాలీ పరిణయం మొదలైన ప్రబంధాలలో జిక్కిణి ప్రశంస వుంది.

ఇక తంజావూరు ఆంధ్రనాయకరాజుల ఆస్థానంలో "జిక్కిణి" నాట్యప్రదర్శ నలు విరివిగా జరిగినట్లు (క్రీ॥ శ॥ 1631-73) ప్రాంతాలలో వెలువడిన రఘునాథ నాయకుని ప్రహ్లాద యక్షగానాలవల్లనూ అదే ఆస్థానంలో వెలుగొందిన చెంగల్వకాళ కవి, రాజగోపాల విలాస ప్రబంధాలవల్లా.

అలాగే తంజావూరు రాజాస్థానానికి చెందిన "అన్నదాన నాటకంలో" కూడ జక్కులి రంగసాని పదకేళిక ప్రసక్తి వుంది.

## తంజావూరులో జిక్కిణి వెలుగు :

విజయరాఘవ నాయకుని ఆస్థానంలో యక్షగానం ఒక సుందర కళారూపమై వర్ధిల్లినట్లు "జిక్కిణీ" నాట్యం కూడ గీత ప్రబంధాలలో ప్రసిద్ధి చెందినట్లు క్రీ॥ శ॥ 1500-1550 ప్రాంతాల్లో వెన్నెలకంటి సూరన రచించిన "విష్ణుపురాణం"లో జిక్కిణిని, ఒక వర్ణ విశేషంగా పేర్కొన్నాడు.



అలాగే తంజావూరు మహారాష్ట్ర ప్రభువైన "శహాజీ" క్రీ॥ శ॥ 1684-1712 ప్రాంతాల్లో రచించిన "చిత్రప్రబంధం" లోనూ

మధుర విజయరంగ చొక్కనాథనాయకుని ఆస్థానంలో క్రీ॥ శ॥ 1706-32లో వెలసిన తిరుమల కవి రచించిన "చిత్రకుంట మహాత్మ్యం"లోనూ జిక్కిణి దరువులు ఉదాహరింపబడ్డాయి.

అలాగే కూచిపూడివారి నాట్య పద్ధతుల్లో "జిక్కిణీ" దరువు కూడా యక్షగానంతోపాటు ప్రాముఖ్యం వహించినట్లు తెలుస్తూంది.

జక్కులవారే అసలు యక్షగాన ప్రదర్శకులైనట్లు "క్రీడాభిరామం"లో "కామవల్లీ మహాలక్ష్మి కైటభారి" వలపు బాడుచువచ్చె జక్కుల పురంధ్రి అని.

ఆ కామవల్లియే, కామేశ్వరీ పాటలోని కామేశ్వరి యనీ, ఆ కామేశ్వరి కథను కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "క్రీడాభిరామం పీఠికలో వివరించినట్లు, యస్వీ జోగారావుగారు తమ యక్షగాన వాఙ్మయం" లో వివరించారు.

ఈ కథలో మహాలక్ష్మి శాపంవల్ల పార్వతికి సద్యోగర్భాన సప్త కన్యలు ఉద్భవించినట్లూ అందులో ఒక కన్య పేరు "జక్కులమ్మ" అనీ అందరికంటే చివరిదీ చిన్నదీ "కామవల్లి" అనీ తెలుస్తూంది.

ఆ సప్తకన్యలనే "అక్కలు" లేక అక్క దేవతలనీ అంటారు. యక్షులు శివాజ్ఞవల్ల వంశపారంపర్యంగా కామవల్లిని కొలుస్తారు. వారే జక్కులనీ, శివుడు వారికి వాద్య ప్రదానం గావించాడనీ ఐతిహ్యం వుంది.

మరో గాథ కూడా ఇలా తెలుస్తూంది. ఒక గృహస్థు సంతానార్థియై ఏడుగురి అక్కల్నీ ఆరాధించినట్లూ, ఆ సందర్భంలో ఏడుగురు అక్కలూ లేచి నృత్యం చేశారనీ, ఆ అక్కలే యక్షకన్యలనీ చెప్పబడింది.

యక్ష శబ్దం జక్క - ఎక్క అనే రూపాంతరాలే కాక, అక్క అనే రూప వికృతి కూడ అంగీకరించతగిందే అని గంటి సోమయాజిగారన్నారు.

నాట్యంలో దేశిమార్గ నృత్యాలను గురించి శ్రీనాథుడు కాశీఖండంలో ఉదహరించాడు. జిక్కిణి చిందు అనీ, అది దేశీయ నృత్యమనీ దశావతార చరిత్రలో ఈ క్రింది విధంగా వర్ణించాడు.

దురు పదంబులు సొక్కు మైసిరుల నొసగ
సరిగె నిరుగెల కుంచియల్ సవదరించి
పెక్కువగ జిక్కిణీ కోపుద్రొక్కి
చక్కని మిత్రారి నరపతుల్ సొక్కి చూడ.

అనడాన్ని బట్టి, జిక్కిణి దరువు, జిక్కిణి కోపు చాలా ప్రాచీనమైనవిగా ఎంచవచ్చు.

యక్షుల జిక్కిణి:

నృత్యగానాలలో ప్రజ్ఞావంతులైన యక్షులు, సింహళం వదిలి దక్షిణ భారత దేశానికి వలసవచ్చిన జక్కుల జాతివారనీ, ఇది పలువురి అభిప్రాయమనీ కీ॥ శే॥ శ్రీనివాస చక్రవర్తిగారు వివరించారు.

సింహళంలో వాడుక భాష పాళీ భాష సంస్కృత యక్ష శబ్దానికి ప్రాకృతం, ఎక్కులు తెలుగు తద్భవం జక్కులు. జక్కులవారు వలస వచ్చినవారైనా, ఆదిమ వాసులైనా, వారు సంగీత నృత్యకళాకారు లన్నమాట తథ్యం. వీరి పేరనే జిక్కిణి రేకులు, జిక్కిణి నృత్యం వెలిశాయి. ఇందుకు ఉదాహరణ: ''భామవేష కథ'' అనే యక్షగానంలో—



జోగక గీత వాద్యముల సొంపుగ నింపుగ
పంచ జక్కిని ప్రాగటమైన నాట్య
రసభావముల విన్పింతు వేడుకన్ — అని

అలాగే—

అణునిభ మధ్య లాక్రియలు నాపరిభాషలు నొప్ప జిందు జ
క్కిణి కొరవంజి మేళముల గోళిక సల్పిరి దేవతా నటీ
మణులకు బొమ్మవెట్టు క్రియమర్దళ తాళ నివాద పద్ధతిన్
రణదురు రత్ననూపుర ఝణముల్ మెఱయం బాదాహతిన్

అని కవులు వర్ణించినారు. ఆనాడు తంజావూరు ఆంధ్ర నాయకరాజుల దర్బారులలో జిక్కిణి నాట్యగోష్టి జరిగేదట — విజయ రాఘవుని ఆస్థానంలో మూర్తి జిక్కిణి నృత్యం చేసేదట. (రాజగోపాల విలాసం) విజయరాఘవ రాయలు, "కొర వంజి శుభలీల" గుజరాతి "దేశి" చౌపదియు జిక్కిణి.... ....నాట్యములో హవణించు నవరసజ్ఞు.

(ప్రహ్లాద చరిత్ర)



జిక్కిణి దరువు :

జిక్కిణి దరువు అనేది ఒక కైవార గీతం. అది దేవతలకు సంబంధించింది గానీ, రాజులకు సంబంధించిందిగానీ అయివుండవచ్చు. కొన్ని మృదంగ జతులతో మిశితం చేసి నృత్యం చేయడానికి అనుకూలంగా కూర్చిన సంగీత రచనయే జిక్కిణి.

ఈ జిక్కిణి యక్షగానాల్లోనూ, వీథి నాటకాలలోనూ. సలాంజతిగా ప్రదర్శి స్తారు. అయితే ఈ దరువులు సలాంజతులకంటే అతి ప్రాచీనమైనవి సంప్రదాయ నృత్యకళకి సంబంధించినవి.

కవుతములు, శబ్దాలు, (అంటే సలాంజతులు) జిక్కిణి రచనలు ఒక విధ మైన నృత్యసంగీత రచనలుగా కనిపించినా, ఆటక్రమంలో మాత్రం చాలా భేదం వుందంటారు నటరాజరామకృష్ణగారు.

కవుతాలంటే దేవాలయాల్లో దేవతల ఆరాధనా సమయాల్లో ఉపయోగపడే సంగీత రచనా విశేషం. ఈ కవుతాలు ప్రత్యేక తాళగతులతో ఆయా దేవతల ప్రీత్యర్థం చేయబడిన రచనలు.

సలాంజతులంటే రాజులపైన స్తోత్రాలుగానూ, రామాయణ భారతాది పురాణ గాథలకు సంబంధించిన వర్ణనలుగా వుండి, ఆ కథకు అంగికాభినయ ప్రాధాన్యమైన నృత్యం, మృదంగజతులతో నృత్యం ప్రదర్శింపబడుతుంది.

జిక్కిణి విధానం :



జిక్కిణికి సంబంధించిన రచనలు కూడా శబ్దాల మాదిరే రచన చేయబడినప్పటికీ ఇందులోని అభినయ విధానం మాత్రం అడుగులకు సంబంధించిన సాంప్రదాయాలు మాత్రం భిన్నంగా వుంటాయి.

కవుతం, సమతాళం, శబ్దం సలాంజతి మొదలైనవాటి వివరాలకు పోకుండా జిక్కిణి విధానం ఎలా వుంటుందో పరిశీలిద్దాం.

ఉదాహరణకు జిక్కిణి.

తాం దణత జణు జణు తకతా కిటతక
తజణు తదణు దణు దణుదణు జనుతక
జణుత జణుత జణు జగన గదికి తక
దణుం జణుత జణుం తనత
దణుం దనత దదదా గిణుతక
విజయనగర పురపాల నురే
వీణాగాన వినోదరే
విజయశీల శ్రీ పూసపాటి కుల
విజయరామరాజా రవితేజ
జణుం దణుత జణు। జగనగ నగనగ
ఝగన జంత జగ నగతా గిటతక
ఝం ఝం నాంగిట ననంగ దదిగిణుతోం॥



జిక్కిణి దరువు ఈనాడు ఎక్కడా ప్రచారంలో వున్నట్లు మనకు పెద్దగా ఆధారాలు లేవు. అయితే, ఈ జిక్కిణి దరువు ఎలాంటిదో, దాని సంప్రదాయం ఎటువంటిదో దానిని నిలబెట్టుకోవలసిన అవసరం ఎంతో వుంది. పేరణి నృత్యానికి ప్రాణం పోసిన నటరాజ రామకృష్ణగారే దీనికి పూనుకోవాలి.

# చూడచక్కని చోడిగాని కలాపం

వచ్చెర బాబు సోలిగాడు
ముక్కుమీద చుక్కబొట్టు
నిక్కి నిక్కి చూసుకుంటు
వచ్చెర బాబు సోలిగాడు.

అంటూ ఆంధ్రదేశంలో దసరా వుత్సవ సమయాల్లోనూ, హరిజనులు జరుపుకునే గొంతాలమ్మ పండుగలో ప్రదర్శించే విచిత్ర వేషాలలో ఈ సో(డి)లిగాడి వేషం అతి ముఖ్యమైంది.



## ఆరవెల్లి వెంకటాఖ్యుడు :

వెంకటాఖ్యుడు రచించిన సింగి పింగడి కథే, సోడిగాడి కలాపం. సోడిగాడు వంకర దుడ్డుకర్రతో ప్రవేశించి పిల్లలందర్నీ హడలగొట్టేవాడు. వేషధారణ అంతా హాస్యపూరితంగా వుండేది.

ముఖం నిండా సున్నపుబొట్లూ, బొట్టుల మధ్య నల్లచుక్కలు, నల్లటి గుడ్డ, అంటగట్టిన తలకు ఒక పక్కగా కాకి ఈకల కుచ్చుబెట్టి మొలకు గోచిపెట్టి, ఒక చేతిలో వంకర దుడ్డుకఱ్ఱ, మరొక చేతిలో చింకిజోలె వేసుకుని వున్నట్టుండి ఏదో ఒక మూల నుండి గొంతాలమ్మ పండుగ సందర్భంలో పిల్లలందర్నీ హడలగొట్టి ప్రేక్షకులందరినీ ఒక అదుపులో వుంచేవాడు. ఇదే ఈనాడు మనకు కనిపించే సోలి గాని వేషం. ఈ సోలిగానిని చోడిగాడనీ, సోడిగాడనీ, సింగడనీ పేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరు పేర్లతో పిలుస్తూ వుంటారు. ఈ సోలిగాడి పేరు ప్రాచీనం నుండీ ప్రస్తుతం వరకూ ఆంధ్రప్రజాజీవితంలో జీవించి వుంది.

తోలుబొమ్మలాటలో జుట్టుపోలిగాడు, బంగారక్క, అల్లాటప్పాగాడు, కేతిగాడు ఎటువంటి ప్రాముఖ్యం వహిస్తున్నారో, ఈ చోడిగాడు కూడ చోడిగాని కలాపంలో అంతటి ప్రాముఖ్యం వహిస్తున్నాడు. కాని బొమ్మలాటలో పాత్రలు కేవలం హాస్యపాత్రలు మాత్రమే.

చోడిగాని పాత్ర అలా కాక, కథానాయకుడుగానూ, హాస్యపాత్రగానూ జీవిస్తున్నాడు. సోలిగాని పేరు ప్రజా జీవితంలో ఎలా హత్తుకుపోయిందో ఉదాహరణలు చూస్తే మనకు బోధపడుతుంది. పెళ్ళి పందిళ్ళలో ఫలానావాడు సోలిగాడులా వున్నాడనీ, గాలిగా తిరిగేవాళ్ళను సోడిగాడిలా తిరుగుతున్నాడనీ, భార్య తోడు లేకుండా వచ్చినవాడిని సోలిగాడులా వచ్చాడనీ రకరకాలుగా పిలుస్తూ వుంటారు.

## కరకు గుండెల్ని కదిలించే కథావస్తువు :

కూచిపూడివారు ప్రదర్శించే భామాకలాపం, గొల్లకలాపం, మాదిరి ఈ చోడిగానిది కూడ ఒక కలాపమే. ఈ చోడిగాని కలాపానికి కథావస్తువు పింగణ్ణి మరిపించి పారిపోయిన పింగిని వెదుక్కుంటూ వియోగాన్ని అభినయిస్తూ తుదకు పింగిని కలుసుకుని తనను వదిలి ఎక్కడికి వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో మొదలైన ప్రశ్నల ద్వారా వాగ్వివాదం జరిపి చివరికి పింగిని తీసుకుని ఇరువురూ ఒక ఇంటికి చేరడంతో చోడిగాని కలాపం కథ సమాప్తమౌతుంది. తొలిఘట్టంలో చోడిగాడు తెర వెడలి



దరువు :

చోడిగాని జూడరే ఎరుకల చోడి గాని జూడరే
అడాడ సింగిజాడ - వేడుకుంటు వచ్చి నట్టి ॥చో॥



చక్కనైన చుక్కబొట్టు - ముక్కు మీద బెట్టెనే
వెక్కసముగ పంటనొక్క - పొక్కర బెట్టెనే
కొంగపిట్ట చంకబెట్టి - గొంగళి వహించెనే
రంగు మీర పురులుకోల - పొంగుచు ధరించెనే ॥చో॥

చంక చింకి పెట్టె కప్పు - పొంకము కలిగించెనే
బింకమైన వంక కట్టె - బెదర జూపు కొనుచు వచ్చె ॥చో॥

వచనం :

సుందరీ ఎందు బోయితివే :

మరియు సింగడు అంగజుని హోరంగైన మెరుంగు తూపులకు కరంగి, సింగిని కౌగలించుకుని, యెడతెగని తమకంబున రతి పారవశ్యంబున కొంత తడవు పెజ్జపై నిమరించి పరాకున పరుపుపై దడువ సింగి గానరాకున్న ఉలిక్కిపడి దిగ్గున లేచి దిక్కులం బెదరి చూచి యెట్టకేలకు బెట్టిదంబైన నిట్టూర్పు నిగిడించుచు అంగనాభంగ పెట్టితివిగదే అని గొంగళిం దులుపుచు పెక్కు గతులు మక్కువలు దలపోయుచు పొక్కర దడుముచు కేలంగోల గీలించి సుందరీ ఎందు బోయితివే అంటూ తన పరిస్థితినంతా ఈ విధంగా వివరంగా చెప్పడం ప్రారంభిస్తాడు.

అయ్యలారా! అమ్మలారా! నా పేరు సింగడు. నా భార్య పేరు సింగి. మే మిద్దరం పడకగదిలో పడుకుని వుండగా అర్ధరాత్రి నా సింగి పక్కలోనుంచి మాయమైపోయింది. అని ఆ వృత్తాంతమంతా చెపుతూ హా! నా సుందరీ, ఎందు బోయితివే అని వెదకటం ప్రారంభించడంతో కథలో తొలిఘట్టం ఆరంభమౌతుంది.

## హాస్యగాడు సింగడే :

ఈ కలాపంలో హాస్యగాడు వుండడు. సింగని పాత్రే హాస్యరసాన్ని అందిస్తుంది. సింగడే నాయకుడు. సింగి సింగని పాటలకు వంత పాడే ఇరువురు

తాళగాళ్ళలో ఒకడు ఈ నాయకీ నాయకులకు మధ్యవర్తిగా తోడ్పడుతూ, అనేక ప్రశ్నలువేసి సమాధానాలు చెప్పిస్తూ, కథా సంధుల్ని విపులంగా సభ వారికి ఎరుకపరుస్తూ వుంటాడు.

సింగికోసం విసిగి వేసారిన సింగడు, సింగిని చూపమని స్వామిని ఇలా ప్రార్థిస్తాడు.

సింగినీ గానవుగా ఓ నా స్వామీ, సింగినీ గానవుగా
అంగ వంగ కళింగ బంగాళ జనులకు
కొంగు బంగారమై, కోర్కెలిచ్చిన స్వామి. ॥సిం॥

తాటకి తలగొట్టీ, సుబాహుని గొట్టీ
మారీచుని మట్టీ, గాథిరాజు పట్టీ
యజ్ఞము చేతబట్టి, హరుని విల్లు ముట్టి
ముక్కలు జేసి దట్టి, జగజ్జట్టీ. ॥సిం॥

అని వేడుకుంటాడు. కథా గమనంలో సింగిని వెదుక్కుంటూ, సింగడు అడవిలో కనపడిన మృగాలను వేటాడి, అవి లభించినప్పుడు ఆయా దేవతల్ని సింగిని చూపమని ప్రార్థిస్తూ పోతాడు. ఈ ఘట్టంలో అఖేట నృత్యం ప్రదర్శింపబడేది. ఆ తరువాత దశావతారాలను అభినయించి నారాయణమూర్తిని ప్రార్థించేవాడు. తరువాత రామాయణ గాథను సంస్మరించి శ్రీరాముని వేడుకుని రామాయణ గాథనంతనూ, పదాభినయంద్వారా అభినయిస్తూ సింగి కనపడలేదనే ఆవేదనతో స్పృహతప్పి తూలిపడిపోతూ నిష్క్రమిస్తాడు.



ఇంతలో సింగి :

ఇంతలో సింగి ఎరుకో ఎరుకో అంటూ ప్రవేశిస్తుంది. సూత్రధారుడు సింగి మీద ప్రశ్నల వర్షం కురిపిస్తాడు. అంతట సింగి అతనికి సమాధానంగా తనయొక్క కులగోత్రాలను గూర్చి, వృత్తి విద్యా విలాసాలను గురించి తన వన్నెచిన్నెలు అందచందాలను వివరిస్తూ సింగని వర్ణిస్తుంది. ఈ సమయానికి సింగడు ప్రవేశించి, సింగి దొరి

కిందన్న సంతోషంతో ఉబ్బితబ్బిబ్బైపోతూ, తన సంతోషాన్ని మాత్రం పైకి కనపడనీయక వాగ్వివాదానికి దిగుతాడు. ఈ సింగి సింగని వాగ్వివాదంలో మొరటు హాస్యం ఎక్కువ దొర్లటం వలన కొంచెం విరసంగా వుంటుంది. సవతుల కయ్యం మాదిరి చోడిగాడు, సింగి ఈ విధంగా ప్రారంభిస్తారు.



సింగీ, సింగన్నల వాదవివాదాలు :

చోడిగాడు :

మనసు లాకపోతే మునుపెరుంగనె సింగి
అదును లంటినోరు అగలించి
కళ్ళెమంటి బిగ్గ కఱచియు బట్టితే
కొరడ దెబ్బలనుచు ఎరుగవటవె?

సింగి :

కొరడ దెబ్బలనుచు మరి మరి బలికేవు
తరముగాదు నాదుదరికి రాకు
మురువు పరువులేని పురుషత్వమేల నీ
సరసమెల్ల నాకు చాలుపోర.

చోడిగాడు :

సింగీ నను జూచితె నే
నంగజుడను రూపురేఖలందును నా
సంగతి నీవిటులైన తిరు
గంగను న్యాయంబు గాదు గట్టిగ సింగీ.

సింగి :

చేకువలె నుండు మీసాలు, చీపికళ్ళు
చింకితలగుడ్డ, గొంగళీచంకబెట్టి
కప్పుపొక్కుడి పొగసిద్ధ వొప్పుజూచి
నయమె నిన్నంగజుడవన్న నవ్వరటర?

ఈ విధమైన వాగ్వివాదంతో సంవాదం ముగిసి, ఇరువురికీ సఖ్యత కుదిరి, ఇంటికి పోవడంతో కథ సుఖాంతమై మంగళాంతం అవుతుంది.

పైన వివరించిన ఈ చోడిగాని కలాపం రాత్రి తెల్లవార్లూ ప్రదర్శిస్తారు. కథావస్తువు దంపతుల కయ్యానికి సంబంధించింది. దీనిలో శృంగారం రసాభాసమైనది. కురవంజిలో సింగి సింగని వాగ్వివాద లక్షణాలు, నృత్యాలే ఈ చోడిగాని కలాపంలోనూ కనిపిస్తున్నాయి. ఈ కలాపంలో జిక్కిణీ చిందు మొదలైనవి విశేష నాట్యాలు. ఇది భార్యాభర్తల సంవాదం అవడం వలన ప్రేక్షకులను ఎక్కువ ఆనందపరిచేది.



భామాకలాపం, గొల్లకలాపం మాదిరే ఈ చోడిగాని కలాపంకూడ నృత్య రూపకం. సూత్రధారుడే విదూషకస్థానాన్ని అలంకరిస్తాడు.

చోడిగాని కలాపంలో ఉపయోగించే ఒంకి కఱ్ఱ ఒక ముఖ్యమైన విశేషమనీ, భరతశాస్త్రంలో 'బ్రహ్మకుటిలకందద్యా' త్తని ఒక వాక్యం వుందనీ ఆ కుటిలకం విదూషకోపయోగిగా అభినవగుప్తులు వ్యాఖ్యానించారనీ, ఆనాడు బ్రహ్మదేవు డిచ్చిన వంకకఱ్ర ఈనాటికీ తెలుగువారివద్ద ఉండటమే చోడిగాని కలాపంలోని ఒక శాస్త్రీయమైన విశేషమనీ, శ్రీ ముట్నూరి సంగమేశం, సాళ్వ కృష్ణమూరి గార్లు భారతిలో ఉదాహరించారు.

## అసలు ఆధారం ఇల్లిదిగో ఇదీ :

చెంచునాటకం, ఎఱుకల కథ, ఎఱ్ఱగొల్లల భాగవతం మొదలైన వాటన్నిటికీ మూలమైన చెంచులక్ష్మి నృసింహుల ప్రణయగాథే ఈ చోడిగాని కలాపానికి ఆధారం. అనేక కురవంజి రచనలకు మూలాధారం ఈ ప్రణయ కలహమే.

ఈ కథావస్తువైన చెంచులక్ష్మి నృసింహుల వివాహ గాథను క్రీ॥ శ॥ 1600 ప్రాంతంలో గరుడాచల మాహాత్మ్య మను పేర ఓబయమంత్రి యక్షగానంగా వ్రాశాడు. ఆ నాటికీ, ఈ నాటికీ దక్షిణ దేశభాషల్లో కొరవంజులలో దీనినే ప్రాచీన కృతిగా చెప్పుకోవచ్చు.

ఈ చోడిగాడి కలాపానికి ఎఱుకల కథ అని కూడ పేరు. తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో 'ఎఱుకత కథ' అనే పేరుతో ఒక రచనవుంది. ముఖ్యంగా ఈ కలాపాలు వ్రాసిన వారిలో చెంగల్వరాయ కవి - అరవెల్లి వేంకటార్యుడు - వంకాయల బలరామభుక్త - గౌడవర్తి జగన్నాథం మొదలైన వారి రచనలు ముఖ్యమైనవి.



# వీథి నలంకరించిన వీథి నాటకం

ఈ నాటకాలంటే పురాతన కాలంనుంచీ ప్రజాసామాన్యం అభిమానాన్ని చూరగొన్న నాటకాలు ముఖ్యంగా దేశినాటక సంప్రదాయాలు, చాలవరకు శివకవుల అధ్వర్యంలోనే వర్ధిల్లాయి. కారణం శైవమతం విజృంభించిన రోజుల్లో శైవమత సంప్రదాయాలను ప్రజా సామాన్యానికి విశదపరచడానికి అనేక విధాలయిన ప్రచార సాధనాలను ఉపయోగించారు. శివకవులే అటువంటి రూపకాలను వ్రాయడము వారే వాటిని వ్యాప్తిలోకి తేవడంవల్ల దేశి సంప్రదాయపు కళాఖండాలన్నీ శైవమతస్థుల సొమ్మని చెప్పవచ్చు.



పంక్తి బాహ్యులు :

ఆర్య సంప్రదాయ ప్రకారం నటులను పంక్తిబాహ్యులుగా నిర్ణయించారు. అటువంటివారికి సంఘంలో గౌరవ మర్యాదలు శూన్యం. కాని శైవమతాన్ని అవలంబించిన వారుగాని, వివిధమైన జాతి మత విచక్షణలేని జంగాలుగాని ఇటువంటి నిర్ణయాలను విధి నిషేధాజ్ఞలను పాటించలేదు. అంతేకాక శైవమతాన్ని అవలంబించిన అగ్రవర్ణములైన బ్రాహ్మణాది కులములవారికి కూడ ఏ విధమైన పట్టింపు లేకపోవడం వల్ల అగ్రజాతుల వారందరూ దేశి నాటకాలను ప్రదర్శించారు. శైవభక్తులైన జంగాలు మొదలైనవారు శివ సంబంధమైన నాటకాలను ప్రదర్శించారు. నాటకాలు ఆడటంలో జంగమువారు ముఖ్యులు. కృష్ణదేవరాయల కాలంలో వున్న బైచరాజు

వేంకటనాథ కవి పంచతంత్రంలో కడివోని తెలనాటకపుటూరి జంగాలు అని వ్రాశారు.

## వీథి ప్రాముఖ్యం :

ఆనాడు వినోద కార్యక్రమాలన్నీ వీథుల్లోనే జరుపబడేవి. మహాభారతం, భాగవతం, రామాయణం, గరుడపురాణం, బసవపురాణం మొదలైన పురాణ గాథలు చదవటం, తేటతెలుగులో ప్రేక్షకులకు అర్థమయ్యేశైలిలో అర్థం చెప్పడం ఆచారంగా వుండేది. గ్రామాలలో గ్రామరెడ్లు, పండితులు, బ్రాహ్మణులు మొదలైన వారు. వీటిని నిర్వహించేవారు.

ఆనాడు తగూలు, పంచాయితీలు, అన్నీ వీథుల్లోనే జరిగేవి. ఆనాడు వీథికి అంతటి ప్రాముఖ్యముండేది. వీథుల్లోనే వీథి బడులుపెట్టి చదువు చెప్పేవారు. భాగవతులు మొదలైనవారు ఎవరు వచ్చినా నడివీథిలో కార్యక్రమం జరిగేది. వివాహానంతరం ఊరేగింపులు, మేజువాణీలు, దేవదాసి నృత్యాలు వీథుల్లోనే జరిగేవి. జాతర్ల ఉత్సవాలూ, ఊరేగింపులూ, ఆటపాటలూ అన్నీ వీథుల్లోనే జరిగేవి. వీథికి అంతటి ప్రాముఖ్యముండేది. వీథుల్లో నాటకాలు ఆడేవారు గనుక వీథినాటకాలనీ, ప్రదర్శించేవారిని భాగవతులనీ పిలిచేవారు.

## రంగస్థలం :

క్రీ॥ శ॥ 16 వ శతాబ్దం నుండి ఆంధ్రదేశంలో ఎక్కువగా యక్షగానాలు రచించబడ్డాయి. ఆనాటికే దొర సముద్రపు నటులు, కూచిపూడి భాగవతులు, జంగాలు మొదలైనవారందరూ, వివిధ రకాలుగా వీథినాటకాలను, తెరనాటకాలను, బయలాటలను ప్రతి వూరిలోనూ ప్రసిద్ధంగా ప్రదర్శించేవారు.



దేశి నాటకాలను విశేషంగా ప్రదర్శించారనీ యక్షగానాల్లో నాటకోచితమైన రచనా విధానాలు ప్రవేశపెట్టబడ్డాయనీ, అందుకు తార్కాణం సుగ్రీవ విజయమేననీ, సుగ్రీవ విజయం నాటకంలో ఆ యా పాత్రల్లో కొందరు పాటలు పాడేవారనీ, తక్కిన సంధి వచనాలు మొదలైనవి ఒక రిద్దరు సూత్రధారులు పఠించడం వల్లనూ సుగ్రీవ విజయంలాంటి యక్షగానం వీథి నాటకంగా

ప్రదర్శించేవారనీ నేలటూరి వెంకట రమణయ్యగారి లాంటి చరిత్రకారులు సూచిస్తున్నారు.

## తంజావూరు రాజులు :

17 వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో యక్షగానానికి కూచిపూడి కలాపంతో సంబంధం కలిగి ఆనాటినుంచీ యక్షగానాలలో వివిధ ప్రక్రియలను ప్రవేశపెట్టారు.

18 వ శతాబ్దం నాటికి ఆంధ్రదేశపు యక్షగానాలమీద, కొన్నిటిపైన మార్గ నాటకాల ప్రభావం కూడా గోచరించింది.

17 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఆధునిక నాటకరంగ ఛాయలు కూడ యక్ష



గానాలమీద బడడంతో వీథి నాటకరంగం విపరీతంగా అభివృద్ధి చెందింది. దీనితో అనాదిగా వస్తున్న యక్షగాన ప్రదర్శనా ప్రక్రియ అభివృద్ధి సన్నగిల్లుతూ వచ్చింది.

17 వ శతాబ్దంలో తంజావూరులో యక్షగానాలకు రాజాశ్రయం లభించింది.

## రాజులు రచించిన యక్షగానాలు :

రఘునాథనాయకుడు, విజయరాఘవ నాయకుల కాలంలో నాటకశాలలు వెలిశాయి. ఈ రాజులు స్వయంగా యక్షగానాలనే రచించారు. కాని విజయరాఘవ నాయకుని ఆస్థానంలో ఎక్కువ ప్రోత్సహింపబడి వీథినాటకం వైఖరిలో అభివృద్ధి చెందింది, ఉదాహరణకు విజయరాఘవుని "పూతనాపహరణం" "ప్రహ్లాద చరిత్ర" మొదలైనవాటిలో రంగప్రయోగ సూచనలు అనేకం వున్నాయి. ప్రహ్లాద చరిత్రలో

నాటకాలను గురించి, విదూషక ప్రశంసలూ వున్నాయి. దీనినిబట్టి, యక్షగానాలు రంగస్థల మెక్కి వీథినాటక వైఖరులను అందంగా సంతరించుకున్నాయని చెప్పుకోవచ్చు.

యక్షగానం కూచిపూడి భాగవతులు మొదలైన వీథినాటక ప్రదర్శకుల దృష్టి నాకర్షించిన తరువాత అది వీథినాటకంగా వర్ధిల్లి జక్కులవారితోనే ఆ సంబంధం తెగిపోయింది.

నాటకీయత కలిగి వీథుల్లో ప్రదర్శించడంవల్ల, అటువంటివాటికి వీథినాటకా లనే పేరు వచ్చింది. తమిళ దేశంలోనూ, కన్నడ దేశంలోనూ ఈ వీథినాటకాలకు ''బయలాటలనీ'' తెరుకూత్తు అనీ పిలువబడుతున్నాయి.

## వీథి నాటకం లాక్షిణికుల నిర్వచనం :

గ్రామాల్లో సామాన్య ప్రజలకు వీథి నాటకాలు; బహురూపాలు మొదలైన తెర నాటకాలు ప్రదర్శించినట్లు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో ఉదహ రింపబడింది.

జంగాలు తెరనాటకా లాడినట్లు ''బైచరాజు వేంకటనాథ కవి పంచతంత్రం లోనూ, అయ్యలరాజు నారాయణ కవి ''హంసవింశతి'' లోనూ ఉదాహ రించారు.

వీథిని గురించి భరతుడు భరతనాట్య శాస్త్రంలో దేశిరూపకాల వర్ణనలో కథ కల్పితమనీ, రెండు మూడు పాత్రలు కలిగిన ఏకాంతమనీ, నటునికి శృంగారరసం ప్రధానమనీ ప్రస్తావన, ముఖ నిర్వహణ సంధులు వుండాలనీ, గీత నృత్తాదులతో కూడిన ప్రశంసలు ఉండవచ్చుననీ బాణంవలె ఇది వర్ణన ప్రధానమనీ, వ్యాఖ్యా నించారు.



ధనికుడు వీథి నాటకాన్ని గురించి, వీథులలోని మార్గపంక్తులవలె తీర్చబడిన వీథి అంగములు కలవని నిర్వచించారు. వీథి నాటక లక్షణాన్ని గూర్చి ప్రతాప రుద్రీయంలో బాణంవలె సంధ్యంగము లుండి కైసికీ వృత్తి శృంగార పరిపూర్ణత ఉద్ఘాత్యకాది వీథ్యంగములు కలిగి యుండుట వీథి లక్షణంగా జెప్పబడింది.

## ప్రసిద్ధిచెందిన వీథి నాటకాలు :

16 వ శతాబ్దంలోని తాయికొండ నాటక సమాజంలో ఒక స్త్రీ పాత్రను స్త్రీయే ధరించినట్లు తెలుస్తూ వుంది. తాయికొండ నాటక సమాజం — యక్షగాన సమాజమని ఊహించటానికి అవ కాశం లేదనీ, అది ఒక వీథి నాటకమే అయి వుంటుందనీ యస్వీ. జోగారావుగారు, తమ యక్షగాన వాఙ్మయంలో తెలియ చేశారు.



18 వ శతాబ్దంలో కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపం .... ఆడు భాగవతుని జూడ గడ్డము మూలి నున్నగా గొరిగించుకొన్నవారు అనే దానిని బట్టీ. తురగారామకవి ఒక చాటువులో బాగోతుల బుచ్చిగానిని స్త్రీ పాత్రధారిగా పేర్కొనడాన్ని బట్టీ.

## స్త్రీ పాత్రలు, పురుషులే :

నాటి నుండి నేటివరకు కూచిపూడి వారు స్త్రీ పాత్రల్ని పురుషులే ధరిస్తున్నారు. కూచిపూడి నటుల్ని సంబోధించడంలో "భామ వేషగాడనీ" "రాణి వేషగాడనీ" "ఆడవేషగాడనీ" పిలవడాన్నిబట్టి "యక్షగానాల" అనంతరం ఆయా నాటక సమాజాలు, వీథి నాటక సమాజాలు, వీథి నాటకాలు ప్రదర్శించినట్లు విదితమౌతూంది.

కూచిపూడి మేళాల్లో ప్రసిద్ధమైనది ఆనాడు సిద్ధేంద్రయోగి మేళం "అంతకు పూర్వం 18 వ శతాబ్దంలో భాగోతుల బుచ్చిగాని మేళం, 19 వ శతాబ్దంలో రాయలసీమ లేపాక్షి వేములపల్లి, తాడిపత్రి మేళాలు, 19, 20 శతాబ్దాల మధ్య, నెల్లూరు మండలంలో, పడకండ్ల రామకృష్ణయ్యగారి మేళాలు - "విశాఖపట్నం" "నరసింగపల్లి" "కళ్ళేపల్లి" కందాళ చిదంబర మేళాలు, పల్నాటి సీమ మేళాలు మొదలైనవి ప్రసిద్ధిజెందాయి.

## నాటి వీథినాటక రంగస్థలం :

నాటి నుంచీ నేటి వరకూ వీథి నాటకాలు వీథుల్లోనే ప్రదర్శింపబడు తున్నాయి. నాలుగు వీథుల కూడలిలో గానీ, వూరి వెలుపల బయలు ప్రదేశంలో

గాని, లేక భాగ్యవంతుల ఇండ్ల ముందరో ప్రదర్శనాలు జరిగేవి. ఈనాటి మాదిరి ఆనాడు రంగస్థలాలు లేవు. ఎత్తైన ప్రదేశమే రంగస్థలంగా చూచేవారు. లేనట్టయితే మట్టిని దిబ్బగా పోసేవారు. ప్రదర్శనం నాలుగు ప్రక్కలకూ కనిపించేటట్లు పందిరిని నిర్మించేవారు. పైన తాటిఆకులుగాని, ఈతచాపలుగాని కప్పేవారు. ఈనాటి తెరలు ఆనాడు లేవు. మామూలు కలంకారీ అద్దకం బొమ్మల దుప్పటిలాంటిది. ఇరువురూ చెరొకప్రక్కనా పట్టుకుని నిలబడేవారు. ఈనాడున్న లైట్లు ఆనాడు లేవు. కేవలం నూనె కాగడాలమీద, ఇలాయి కర్రల దీపాలమీద ఆధారపడేవారు. ఇరు ప్రక్కలా వెలుగునిచ్చే రెండు కంచునూనె కాగడాలు వేసేవారు. పాత్రల ప్రవేశంలో రాజుగాని, రాణిగాని, యముడుగాని, కంసుడుగాని ముఖ్య పాత్రల ప్రవేశంలో ఇంత గుగ్గిలాన్ని ఆ కాగడాలపై గుప్పేవారు. ఆ సమయంలో గొప్ప కాంతితో గుప్పుమని మెరిసేది. ఆ మెరుపులో పాత్రలు ప్రవేశమయ్యేవి.

ఈ విధంగా వారు వారి రంగస్థలాన్ని నిర్మించుకునేవారు. అందుకు గ్రామస్థులందరూ సహాయపడేవారు. ప్రదర్శనానికి కాకితో కబురంపితేసరి చుట్టుప్రక్కల గ్రామాలనుండి, జనం గుంపులు గుంపులుగా వచ్చేవారు. ఇందుకు కారణం. ఇంతకు మినహా ఆనాడు వినోద కార్యక్రమాలు లేనేలేవు కనుక.

## ప్రదర్శన ప్రారంభం ఎలా జరిగేది :

రాత్రి సుమారు పది గంటలకు, ప్రదర్శనం ప్రారంభమయ్యేది. ఈలోగా



భాగవతు లందరూ గ్రామంలో వున్న ఆ యా ఇండ్లలో భోజనం చేయడంగాని, స్వయం పాకం కాని చేసుకునేవారు. రంగస్థలానికి కొంచెం దూరంలో వున్న ఇంటిలో ముఖాలంకరణ చేసుకునే వారు. ప్రేక్షకు లందరూ వచ్చేవరకూ, సూత్రధారులు వాద్య విశేషాలతో వివిధరకాలయిన పాటలను పాడుతూ గణపతి ప్రార్థన, సరస్వతి, లక్ష్మి ప్రార్థనలు చేసేవారు. ఒక ప్రక్క వేషాలు తయారవుతూ వుండేవి. మరోప్రక్క ప్రేక్షకు లందరూ, ఆసీనులై వుండేవారు. గ్రామంలో వున్న పండితులూ, గ్రామపెద్దలూ, మున్సిఫ్ కరణం మొదలైన పెద్దలందరూ

వచ్చి ముందు వరుసలో కూర్చునేవారు. పెద్దలందరూ వస్తేగాని ప్రదర్శనం ప్రారంభమయ్యేది కాదు. వచ్చినవారందర్నీ వారికి సహాయాలు చేసినవారినీ ఈ విధంగా సంబోధించేవారు. ఈ సభా రంగమునకు అందరూ వచ్చియున్నారటరా: చిత్తం, కరణంగారు, చిత్తం, మునిసిఫ్‌గారు, చిత్తం, పెద్దలందరూ వచ్చియున్నారటరా. చిత్తం సెహభాష్, వారందరికీ ఉచితాసనాలను అలంకరింప చేసియుంటివా: చిత్తం ఈ విధంగా ప్రేక్షకులందర్నీ ఆకర్షించి, ప్రదర్శన ప్రారంభించేవారు. ప్రతి జట్టులోనూ సమర్థులైన ఇద్దరు ముగ్గురు హాస్యనటు లుండేవారు. వీరు ఏ పాత్ర బడితే ఆ పాత్రను అచ్చుగుద్దినట్లు చెప్పేవారు. వేషధారణలో ఈ నాటికీ కేకులుగానీ, పౌడర్లుగానీ. బ్రష్‌లుగానీ లేవు. ముఖాలంకరణకు అర్దళం, మణిశిల, బొగ్గుపొడి, సింధూరం ఉపయోగించేవారు. క్రీప్ హెయిర్‌కు బదులు నారపీచు ఉపయోగించేవారు.



## ప్రేక్షకుల్ని ఇలా ఆకర్షించేవారు:

ప్రదర్శనంలో ప్రతిపాత్రా రంగస్థలంలో మూడు ప్రక్కలకూ తిరిగి అభినయించేవారు. దూరంగా వున్నవారికి వినబడేందుకు సూత్రధారులు హెచ్చుస్థాయిలో పాడేవారు. ప్రతి చరణాన్ని ఒక సారికి రెండుసార్లు రెట్టించి పాడేవారు. ఇలా రెట్టించడంవల్ల, అందరికీ ఇట్టే అర్థమయ్యేది. ఈ ప్రదర్శనంలో సాత్విక భావాలు దగ్గరగా వున్నవారికి తప్పా, దూరాన వున్నవారికి కనిపించేవి కావు. అందు వల్ల కాళ్ళతో నృత్యంచేసేవారు, నోటితో పాట పాడేవారు, చేతులతో భావానికి తగినట్లు అంగ చలనాన్ని ప్రదర్శించేవారు, మధ్య మధ్య శ్లోకాలను చదివేవారు. ఈ శ్లోకాలు చాలామందికి అర్థం కావని హాస్యగానిద్వారా వివర మడిగించి, శ్లోకార్థాన్ని విశదపర్చేవారు. ప్రదర్శనంలో ఏ మాత్రం విసుగు జనించకుండా, హాస్య పాత్ర ధారులైన మాధవి, చోపుదారు, ద్వారపాలకుల ద్వారా చిత్ర విచిత్రమైన లోక ధర్మాలనూ, సాంఘిక ఆచారాలనూ ప్రవేశపెట్టి మధ్య మధ్య కడుపుబ్బ నవ్వు పుట్టించేవారు. ప్రదర్శనం పది గంటలకు ప్రారంభిస్తే, తెల్లవారి ఆరు గంటలవరకూ ప్రదర్శనాన్ని సాగించేవారు. ప్రేక్షకులు తెల్లవార్లూ, రెప్పవాల్చకుండా ఈ ప్రదర్శనాలను చూచి ఆనందించేవారు.

## వీథినాటక సూత్రధారుని విశిష్టత :

పూర్వం మన గ్రామాలలో ప్రదర్శించే వీథి భాగవత ప్రదర్శనాలలోనూ, కొన్ని పౌరాణిక నాటక ప్రదర్శనాలలోనూ, ప్రదర్శనానికి ముందు, సూత్రధారుడు ప్రవేశించేవాడు. ఈనాటికీ జానపద కళారూపాల్లో సూత్రధారుడు ప్రత్యక్షమౌతూనే వున్నాడు.

ఆ రోజుల్లో ప్రదర్శనాలు వీథుల్లో ప్రదర్శింపబడేవి. ప్రేక్షకులు ఏడు గంటలకే తెరముందు కూర్చునేవారు, ప్రదర్శనం ప్రారంభించమని వత్తిడి చేసేవారు. ఈ వత్తిడినుంచి తప్పుకోవటానికి ఈ సూత్రధారుని నాందీ ప్రస్తావన తెచ్చేవారు. అతగాడు ప్రదర్శించబోయే, ప్రదర్శనాన్ని గూర్చి ప్రజలకు టూకీగా కథ చెప్పేవాడు. తన హాస్య చతురతతో ప్రేక్షకుల్ని అదుపులోకి తెచ్చేవాడు.

## సూత్రధారుని లక్షణం :

నాటక రచయిత గుణగణాలను, కథావస్తువు విశిష్టతను గురించి స్పష్టంగా వివరించగలిగినవాడు. అంతేకాక రంగస్థలంలోవి పాత్రధారు లందరిని సిద్ధం చేయగలిగినవాడు. లయ తాళం - సంగీత విద్యల్లో ప్రజ్ఞ కలిగినవాడు, పాత్రల నిర్ణయంలో సహకారి, అన్నిదేశాల నృత్య భేదాలను ఎరిగినవాడు, సూత్రధారుడని కాళిదాసుని శాకుంతలంలో ఉదాహరింపబడింది.

నాటకాల్లోనూ, జానపద కళారూపాల్లోనూ విటుడూ, విదూషకుడు, చేటకుడు, పీఠమర్ధుడు, మొదలైన కొందరు పాత్రధారు లుండేవారు. కాని అందరూ ఒకే నాటకంలో వుండేవారని మాత్రం చెప్పలేం ఆయా కథా విధానాలనుబట్టి ఈ పాత్రలు వస్తూ వుండేవి.



## నాయకుని నమ్మిన నేస్తం :

విటుడు ముఖ్యంగా శృంగార నాయకునికి సహాయంగా వుండేవాడు. నాయకుడు నాయకికోసం, అన్వేషించడంలో తగిన సలహాలనిస్తూ అటు నాయిక చర్యలూ, ఇటు నాయకుని చర్యలూ గమనిస్తూ వా రిద్దరినీ ఒకచోట కలిపేటందుకూ కలిపిన తర్వాత వారి మధ్య శృంగారం తొణికిసలాడేటట్టు చమత్కారంగా మాట్లాడటం, వా

రిద్దరి మధ్య ప్రణయకోపాలను తెప్పించటం. ఇరువురి మధ్యాచేరి చమత్కార సంభాషణలతో ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్విస్తూ, ధర్మాలనూ, నీతులనూ, బోధించడం చేస్తూ వుండేవాడు. అలాంటి విటులవల్లనే ఆనాటి ప్రదర్శన సారాంశం ప్రేక్షకులకు చక్కగా అర్థమయ్యేది.



విదూషకుడు :

ఈతని పాత్ర కూడ హాస్యంతో కూడుకున్నదే విరహంతో కూడుకున్న నాయకీ నాయకుల మధ్య వుండి వారిని నవ్విస్తూ సరియైన త్రోవలోకి తీసుకురావడమే విదూషకుని కర్తవ్యం, అంతేకాక ఆనాటి ప్రజలకు అక్షర జ్ఞానం తక్కువ. ప్రదర్శనాకారుల భాష, ప్రదర్శన ఇతివృత్తం, కఠినమైన భాషలో వుండటంవల్ల, వాటిని ప్రజలకు అర్థమయ్యే భాషలో తెనిగిస్తూ ఆ యా పాత్రల మధ్య చేరి హాస్యాన్ని గుప్పిస్తూ వుంటాడు. ఈ విదూషకుడు.

కూర్మిని కూర్చే చేటకుడు :

సూత్రధారుడూ, విటుడూ, విదూషకుడూ, కాక ఈయన నాలుగవ వాడు. ప్రదర్శనాల్లో ఈతని పాత్ర, నాయికా నాయకుల మధ్య వచ్చే కలహాలను తీర్చడం. నాయిక చెప్పిన విషయాలను, నాయకునికి చెప్పడం. వీ రిద్దరిమధ్యా రంగస్థలంపైనే వార్తలు మోస్తూ, ఏదో విధంగా వారిని సమాధానపరచి, నేర్పుతో ఆ కార్యాన్ని నిర్వహించేవాడు. ఇలా నిర్వహించిన తరువాత నాయికా నాయకులద్వారా పారితోషికం పొందేవాడు. ఈ దృశ్యమంతా ప్రేక్షకులకు కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించడంవల్ల, ప్రేక్షకులు ఎంతో ఆనందించేవారు. నిత్య జీవితంలో దంపతుల మధ్యా, ప్రేమికుల మధ్యా జరిగే సంఘటనలే గనుక ఇవి ప్రేక్షకుల నెంతో ఆనంద పరచేవి.





# సిద్ధేంద్రుని కూచిపూడి కళాక్షేత్రం

కూచిపూడి భాగవతుల పేరు విననివా రుండరు. ఆంధ్రదేశంలో ప్రతి మారుమూల గ్రామంలోనూ, వారి ప్రదర్శనాలు ప్రదర్శింపబడ్డాయి. పెద్ద పెద్ద రాజాస్థానాలలోనూ, దేవుళ్ళ కళ్యాణ ఉత్సవ సమయాలలోనూ, తిరునాళ్ళ సమయంలోనూ, కూచిపూడి భాగవతుల ప్రదర్శనాలు తప్పనిసరిగా ఉండేది. ఆ విధంగా వారు కొన్ని శతాబ్దాల బట్టి ఏకఛత్రాధిపత్యంగా విశాలాంధ్రలో విశేషంగా ప్రదర్శనా లిచ్చి వేనోళ్ళ వినతులు గొన్నారు.



వీరు ఆట ప్రారంభించారంటే భరతముని ప్రసాదించిన భరతనాట్యాన్నీ, నందికేశ్వరుని అభినయదర్పణాన్నీ శాస్త్రయుక్తంగా తెల్లవార్లూ ప్రదర్శిస్తూ వుండేవారు. వేలాది ప్రజలు, వీరి ప్రదర్శనాలు చూచి ఉప్పొంగి పోయేవారు. ప్రదర్శనమంతా, ఆధ్యాత్మిక వాతావరణంతో నిండివున్నప్పటికీ, ప్రజల చిత్త ప్రవృత్తులు కూడ ఆధ్యాత్మిక చింతనతో వుండడంవల్ల ప్రదర్శనంలో వచ్చే ప్రతి విషయమూ, అర్థమైనట్లుగానే వారు ఆహ్లాదంలో మునిగి ఆనందించేవారు. ఎంతో మంది పండితులు సైతం వీరి విద్యను పరీక్షించటానికి పోటీలుపడి మరీ కూర్చునేవారు.

## కుచేల పురం అంటే :

కూచిపూడి గ్రామం కృష్ణా జిల్లాలో మచిలీపట్టణానికి పదిహేను మైళ్ళ దూరంలో, శాతవాహన చక్రవర్తుల ముఖ్య పట్టణమైన శ్రీకాకుళానికి చేరువలో వుంది. మువ్వ గోపాల పదాలతో దక్షిణదేశాన్నంతా ఉఱ్ఱూతలూగించిన క్షేత్రయ్య స్వగ్రామ మని చెప్పబడే మువ్వ గ్రామానికి అతి సమీపం లోనేవుంది. ఈ కూచిపూడి కళాక్షేత్రం, ఒక బ్రాహ్మణ అగ్రహారం దీనిని కుచేల పురమని కూడ కొంతకాలం క్రితం వరకూ పిలుస్తూ వుండేవారని ప్రతీతి. దాదాపు అయిదువందల సంవత్సరాలకు పూర్వమే ఇక్కడ నాట్యకళకు అంకురార్పణ చేశారని చరిత్రకారులవల్ల తెలుస్తూవుంది.



## సిద్ధేంద్రయోగి సుద్దులు :

అసలు కూచిపూడికి ఈ సంప్రదాయం ఎలా వచ్చిందో కొంచెం తెలుసుకుని ముందుకు నడిస్తే మనకు చరిత్ర బోధపడుతుంది. ఈనాటికీ కూచిపూడి వారిని, మీకీ నాట్య సంప్రదాయంగాని, భాగవత సంప్రదాయంగాని ఎక్కడనుండి వచ్చిందీ అని ప్రశ్నిస్తే, వారు ఈ క్రింది గాథను తెలియజేస్తారు. కూచిపూడి భాగవతుల ప్రదర్శనానికి మూలపురుషుడు సిద్ధేంద్రయోగి అని చెపుతారు. ఈయన కూచిపూడి గ్రామస్థుడే అని కొందరూ, యాత్రలుచేస్తూ కూచిపూడి చేరిన పరదేశి అని కొందరూ ఆయన కాపుర స్థలాన్నీ కాలాన్నీ నిర్ణయించలేకుండా వున్నారు.

## గురువును మించిన శిష్యుడు :

కొన్ని శతాబ్దాల క్రింద కూచిపూడి గ్రామంలో సిద్దయ్య అనే ఒకాయన వుండేవారట. ఆ సిద్దయ్యగారు చాలా అమాయకుడు. నిరక్షరాస్యుడు. సోమరితనంగా తిరుగుతూ వుండేవాడు. ఆ వూరి తక్కిన బాలురచే పరిహసింపబడుతూ, ఏమాత్రం విద్యాసక్తి లేక అయోమయంగా వుండేవాడట.

కొంతకాలానికి యుక్తవయస్సు వచ్చింది. సంప్రదాయసిద్ధంగా ఆ గ్రామం లోనే అన్ని విధాల తగిన కన్యనిచ్చి వివాహం చేశారు. వివాహం అయిన కొద్ది దినాలకెల్లా సిద్దయ్యగారిలో ఒక కొత్త మార్పు రాసాగింది. విద్యాసక్తి కలిగింది. తల్లిదండ్రులవద్ద శెలవు తీసుకుని ప్రయాణమయ్యాడు. ఆ గ్రామానికి పశ్చిమంగా వున్న కృష్ణానదిని దాటి విద్యాభ్యాసం కోసం వెళ్ళిపోయాడు. సిద్దయ్యలో కలిగిన ఈ వింతమార్పు గ్రామవాసులందర్నీ చకితులను గావించింది. కొంతకాలం ఇలా గడిచిపోయింది. సిద్దయ్యను గురించి చెప్పుకున్నవారు లేరు.

## అన్ని విద్యలలోనూ ఆరితేరిన దిట్ట:

కాని ఇంతలోనే సిద్దయ్యగారు సకలవిద్యాపారంగతుడై అన్ని విద్యలలోనూ మరి ఇంతటివాడు లేడన్న పేరు తెచ్చుకొని తిరిగి వచ్చారు.

వచ్చే ముందు సిద్దయ్యగారి గురువు, ''నాయనా! నీవు నా దగ్గర అభ్యసించ వలసినదేమీ యిక లేదు. పోయి గృహస్థాశ్రమ ధర్మం అనుసరించి సుఖంగా జీవించు'' అని ఆశీర్వదించి పంపించాడు. గురువు దగ్గర సెలవు తీసుకుని ఇంటికి ప్రయాణమయ్యాడు సిద్దయ్య.

అది సంధ్యాసమయం. సూర్యుడు అరుణకాంతులు విరజిమ్ముతున్నాడు. సరిగ్గా ఆ వేళకు కృష్ణాతీరం చేరుకున్నాడు. సంజచీకట్లు కమ్ముకుంటున్నాయి. సిద్దయ్యగారు స్నానంచేసి సాయంసంధ్యావందనం చేస్తున్నారు. ఇంతలో ఉన్నదున్నట్లు కృష్ణానది పొంగి నీటి ప్రవాహం ఒక్క పెట్టున ఆయన కంఠంవరకూ ముంచుకొచ్చింది. సిద్దయ్య ప్రమాదస్థితిలో పడ్డాడు. తన ప్రమాదస్థితి గమనించి ఆత్మసన్యాసం చేశాడట.

ఇంతలో ఒక తరంగం హఠాత్తుగా వచ్చి సిద్దప్పను చిత్రంగా ఒడ్డుకు చేర్చిందట. అంతట ఆయన సంసారాన్ని త్యజించి తన శృంగార భావాలను శ్రీకృష్ణ భక్తితో మిళితం చేసి భామాకలాపమనే పారిజాతాపహరణ యక్షగానాన్ని రచించి కూచిపూడి భాగవతులకు బోధించి ధన్యుడైనాడని ఒక కథ.



## ఆత్మసన్యాసం తరువాత కథ:

సిద్ధేంద్రయోగి మొదట శృంగేరీ మఠంలో ఒక చదువురాని మొద్దబ్బాయిగా వుండి ఊనుపోకకు

కృష్ణకీర్తనలు పాడుతూ వుండగా - యాదాలాపంగా నయితేనేమి - అందులో అబ్బాయి తన్మయతను గమనించిన శృంగేరీ పీఠాధిపతి కృష్ణభక్తిని ప్రచారం చేయడానికి అతనిని దేశసంచారం పంపినట్లూ, యాత్రలు చేసుకుంటూ చేసుకుంటూ అతడు కూచిపూడి గ్రామం వచ్చినట్లూ, వూరి వెలుపల దేవాలయంవద్ద మకాం వేసినట్లూ, ఇంతలో ఆ వూరి బ్రాహ్మణ స్త్రీలు ఊరివెలుపల నున్న ఊరబావికి నీళ్ళకు వచ్చి, ఈ సిద్ధేంద్రుని దర్శించి నట్లూ చెప్పుతారు.



ఆనాటి ఆచారం ఏమంటే గ్రామంలోకి ఎవరైనా అతిథులు వస్తే ప్రథమంగా వారిని సత్కరించాలి. అలాగే వీరిని సత్కరించటానికై కూచిపూడి బ్రాహ్మణులు వారిని దర్శించి ఆతిథ్యాన్ని అందుకోమన్నారు. అందుకు ఆయన సమ్మతించి అన్నం దగ్గర కూర్చుని ఒక కోరిక కోరినట్లూ, దానిని వీరు శిరసావహించినట్లూ చెబుతారు. ఏమిటా కోరిక? తాను ఒక భాగవతం వ్రాశాడట. దానిని వారు ప్రదర్శించాలట. అదే ఆయన కోరికట. ఆ కోరికను తిన్నగా తీరుస్తానంటేనే భోజనం చేస్తానని తీర్మానంగా చెప్పాడట. అందుకు వారు మారుమాట మాట్లాడక సరే నన్నారట. ఇందుపై సిద్ధేంద్రుడు నాట్యశాస్త్రాన్ని వారికి బోధించదానికి ఇష్టపడి, వారు ఈ శాస్త్రాన్ని వంశపారంపర్యంగా ప్రతిగృహంలోనూ కులవృత్తిగా గ్రహించి, ప్రతి బ్రాహ్మణ యువకుడూ ముక్కు కుట్టించుకుని, కాలికి గజ్జె కట్టి, ఆవూరి నటరాజు ఆలయంలో ఒక్కసారైనా నాట్యప్రదర్శనం చేసేటట్లు వాగ్దానం చేయించుకుని, పారిజాతాపహరణమనే భామాకలాపాన్ని వారికి ఉపదేశించాడట. ఆయన ఆదేశాను సారం ఆనాటి నుండి ఈనాటి వరకూ వారు నాట్యవిద్యలో దినదినాభివృద్ధి పొంది వివిధ దేశాలను సందర్శించి నానారాజ సందర్శనం చేసి శతాబ్దాల తరబడి పేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

## అక్షరాభ్యాసానికి ఆరంభం :

ఆనాటినుంచే నాట్యంలో అక్షరాభ్యాసం చేయబడింది. వెంటనే సిద్ధేంద్రుడు బాలురవందర్నీ సమకూర్చి, వారికి నాట్యాభినయాన్నీ, సంగీతాన్నీ నేర్పాడు. ఆనాటినుంచి వారి భాగవతాల ప్రదర్శనలకు అంకురార్పణ జరిగింది. ఈ రీతిగా

సిద్ధేంద్ర యోగి నాట్య గీతాభినయాలను కూచిపూడి కళాకారులకు అంకితం చేశాడు.

ఆనాటినుంచీ ఈనాటివరకూ కూచిపూడి నాట్యప్రదర్శనలూ, వారి భాగవతాలూ, వారి పగటివేషాలూ విశాలాంధ్రదేశంలో వంశపారంపర్యంగా ప్రచారం పొందాయి.

## వంశపారంపర్య వారసత్వం :

ఇలా ఆ కళను వంశపారంపర్య విద్యగా చేసి, దానిని నశింపనీయక కాపాడేందుకు కూచిపూడి గడ్డ మీద పుట్టిన ప్రతి బ్రాహ్మణ మగబిడ్డకూ ముక్కులూ చెవులూ కుట్టిస్తారు. కారణం ముక్కులకూ చెవులకూ రంధ్రాలుంటే ఆభరణాలు ధరించడానికి అనువుగా వుంటుంది. అది స్త్రీపాత్రగాని, పురుషపాత్రగాని రంధ్రాలు వుంచడం అవసరం. అందువల్ల, వయస్సు ముదిరితే రంధ్రాలు వేయడం కష్టం కనుక, ఆ పనిని బాల్యంలోనే ముగిస్తారు. పసిపిల్లలకు విద్యాభ్యాస మెటువంటిదో వారి కీకర్ణవేధ అటువంటిది. ముక్కులూ చెవులూ కుట్టించిన తరువాత మరి కాలికి గజ్జె కట్టించి నటరాజు ముందు నాట్యాభ్యాసాన్ని ప్రారంభిస్తారు.

## పదిహేనవ శతాబ్దికే ప్రబలంగా ప్రఖ్యాతి :

కూచిపూడి భాగవతులు 15-వ శతాబ్దంనాటికే వారి కళా ప్రదర్శనలను ప్రదర్శించటంలో ప్రఖ్యాతి వహించారు. ఇందుకు ఆధారం 1502 నాటి మచ్చుపల్లి కైఫీయతే. 16-వ శతాబ్దం చివరి భాగం నుండి ఈనాటివరకూ వారి జాతాపహరణాన్ని ప్రదర్శిస్తూ వారు ప్రశంసల్ని అందుకుంటున్నారు.



భామాకలాపంలో శ్రీకృష్ణుడు నాయకుడు. సత్యభామ నాయిక. శ్రీకృష్ణుడు రుక్మిణి యందుంచిన అనురాగం తనపట్ల చూపలేదని, సత్యభామ శ్రీకృష్ణునితో కయ్యమాడి విడిగా వుండిపోయి ఆ వియోగాన్ని మరి భరించలేక దూతికతో రాయబారం పంపడం, దూతిక సత్యభామ విరహవేదనను

ఉపశమింపజేయడం అందులో కథ. శ్రీకృష్ణుని దక్షిణ నాయక లక్షణాలను, సత్యభామ అష్టవిధ నాయిక లక్షణాలను అవస్థా భేదాలను అద్భుతంగా చిత్రిస్తారు. భామా కలాపంలో సత్యభామ ఒక్కతే పాత్రధారి. సూత్రధారుడు కథకుడుగాను, చెలికత్తె మాధవిగాను సమయానుకూలంగా ద్విపాత్రలనూ ధరించి చక్కని హాస్యాన్ని ప్రదర్శిస్తారు. భామాకలాపం సిద్ధేంద్రుడే వ్రాసినట్లు ఈ క్రింది నాందీ పద్యం ద్వారా వెల్లడౌతుంది.

వినరండి హరికథను :

జనులార, వినుడి హరికథ
విన వేడుక గలిగెనేని వీనులకొలదిన్
కొనుడీ కర్ణామృతముగ
ఘనుడగు సిద్ధేంద్రయోగి కవితారచనన్.

అనే పద్యంతో ప్రారంభించిన తరువాత సత్యభామ ఈ విధంగా పాడుతూ తెర వెడలుతుంది:

భామనే, సత్యభామనే
భామనే, పదహారువేల
కోమలు లందరిలోనూ
భామరో, గోపాలమూర్తికి
ప్రేమదాసినగు సత్య ॥భామ॥

అట్టహాసము చేసి సురల
నట్టె గెలుచుక పారిజాతపు
చెట్టు దెచ్చి నాదు పెరటా
గట్టిగా నాటించుకొన్నా ॥భామ॥



అంటూ గర్వాతిశయంతో నృత్యం తొక్కుతూ అభినయం చేస్తుంది.

## భామాకలాపంలో - భామవాచిక విధానం :

భామాకలాపంలో కథయొక్క సందర్భాన్ని బట్టి వచనం నడుస్తూ వుంటుంది. సత్యభామ ఒక్కతే — ఏకపాత్రధారి. ప్రక్కనున్న విదూషకుడు తా నొక్కడే, అవసరాన్నిబట్టి పురుష హాస్యగానివలెను, మాధవి అనే స్త్రీ పాత్రధారిగాను రెండందాలా నిర్వహిస్తాడు. ఉదాహరణకు భామాకలాపంలో సత్యభామ వాచికం చూడండి:



ఓ యమ్మా :

"ఓ యమ్మా, వకావకనాడు పడక మందిరంలో హంసతూలికా తల్పమందు కాకేళి గృహములయందు వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యములు స్థాపించినటువంటి నగరియందు పవళించి యుండగా, స్వామి వారు వచ్చి శయ్యామీద కూర్చున్నారమ్మా, లేచి పరిమళ ద్రవ్యములు మొదలైన చందనగోష్టి చేసినానే, అంతట స్వామివారు పరున్నారే, నేను కూర్చు న్నానే, పాదసేవ చేసినానే. అప్పుడు స్వామివారు నన్ను తొడపై కూర్చుండ బెట్టుకుని అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి నిలువుటద్దం తెచ్చి ఎదుటనుంచి నీడలు చూచి, సత్యభామా! నీవే చక్కని దానవా, నేనే చక్కని వాడనా? అని అడిగేనే, వోశమ్మా అడిగేటంతవరకు. ఆడబుద్ధి గనుక, తెలియక, నేనే చక్కనిదాని నంటినే వోశమ్మా, అంతట స్వామివారు నా మీద కోపంచేసి దిగ్గున లేచి చక్కా పోయెనే వోశమ్మా! మన స్వామివారు ఎందుబోయెనో, యెక్కడ బోయెనో వెదుకుతారటే వోశమ్మా!"

అంటూ మాధవితో ఎంతో అద్భుతంగా వాచికాభినయం నడుస్తుంది. ఇది వినడానికి ఆహ్లాదకరమైన వాచికవిధానం.

భామా కలాపాన్ని కూచిపూడివారు ఒక మహాకావ్యంగా తీర్చిదిద్దారు. ఏండ్ల తరబడి ప్రదర్శించి ప్రజా హృదయాలను చూరగొన్నారు. దీని తరువాత వారి ప్రదర్శనాల్లో ముఖ్యమైంది గొల్లకలాపం.

## గొల్ల కలాపం తీర్చిన గొప్ప సందేహం :

గొల్లకలాపంలో నాయిక గోపకన్య. ఆమె "బ్రాహ్మణ, గోప జన్మలో ఏది ఉత్తమమైంది? బాపడు గొప్పవాడా? గోపుడు గొప్పవాడా?" అని బ్రాహ్మణునితో వాదోపవాదాలు జరుపుతుంది. ఈ గొల్ల కలాపాన్ని భాగవతుల రామలింగ శాస్త్రిగారు రచించారని ప్రతీతి. గొల్లకలాపంలో గొల్ల భామ వేషం ధరించి వీధిలో చల్ల అమ్మినట్లు అభినయిస్తూ వుండగా శిష్టాచారం గలిగిన బ్రాహ్మణుడు చల్ల కొనాలని గొల్ల భామను పిలుస్తాడు. ఇరువురూ ఏ కులం గొప్పదో అని వాదోపవాదాలు జరుపుతారు. మానవ సమాజమంతా సమానంగానే సృష్టింపబడిందని, బ్రాహ్మణులు అధికం కారని వాదిస్తుంది. ఇందుకని ప్రదర్శనంలో ఇద్దరు గొల్లపడతులు చల్లి అమ్మేటట్లు వేషాలు ధరించి, భాగవతంలో వర్ణించిన పిండోత్పత్తిని గురించీ, నవమాసాల పిండచలనాన్నీ, పిండం బయటపడిన తరువాత, ప్రపంచసృష్టి ఏ విధంగా వుండేదీ అభినయంతో వర్ణించేవారు. ఇందులో వేదాంతచర్చ జరుగుతుంది.

## గొల్ల కలాపంలో ఘనాపాటి :

ఈ భామా, గొల్ల కలాపాలలో పేరు ప్రఖ్యాతులు గడించి అనేక మన్ననలు పొందిన సిద్ధహస్తులు వెంపటి వెంకట నారాయణగారు. ఆయన తరువాత కొంత మంది ఆ పాత్రను ధరించినప్పటికీ ఆయనతో సరితూగరనే చెప్పవచ్చు. ఎంతో కాలం - ఏళ్ళతరబడి ఈ గొల్ల కలాపాన్ని ప్రదర్శించారు. ఇదంతా యక్షగాన రూపంలోనే జరిగింది.

కూచిపూడి వీధి భాగవతులు భారత - భాగవత - రామాయణాల నుండి కథలను తీసుకుని యక్షగాన నాటక రూపంలో భరత నాట్య శాస్త్ర సాంప్రదాయాలను అనుసరించి ప్రదర్శనాలను ఇస్తూ వుంటారు. వీరు ప్రదర్శించిన యక్షగానాల్లో గిరిజా కళ్యాణము - కీచక వధ - హరిశ్చంద్ర - కిరాతార్జునీయం - కాళీయమర్దనం శశిరేఖాపరిణయం - రామనాటకం - రుక్మాంగద - లవకుశ - ఉషాపరిణయం మొదలైనవి ముఖ్యమైనవి. ఈ కోవకు చెందిన పురాణ సంబంధమైన గాథలనే యక్షగానరూపంలో ప్రదర్శించేవారు. రాను



రాను వారు ఈ యక్షగాన రూపాలను కొంతవరకుమార్చి వీధి నాటకాలుగా ప్రదర్శించారు.

## తెరమీద జడ పండితుల ప్రతాప ప్రదర్శనం :

కూచిపూడి భాగవతుల ప్రదర్శనల్లో ముఖ్యంగా భామాకలాప ప్రదర్శనంలో తెర మీద ఒక జడపేసి తద్వారా తమ పాండితీప్రకర్షను వెల్లడించేవారు. ఈ జడవర్ణనను పరిశీలించి తప్పులుపట్టడానికి పండితప్రకాండు లందరూ ముందువరుసలో వుండేవారు.

జడను 27 నక్షత్రాలతో ఒక నక్షత్రమాలగా అలంకరించి తెరవెలుపలి భాగంలో ప్రేక్షకులకు కనబడేటట్లు వ్రేలాడదీసేవారు. ఒక్కొక్కటి ఒక శ్లోకం చదివేవారు. జడగంటల్ని నవగ్రహా లనేవారు. ఆ జడను మయుడనే శిల్పి స్వయంగా సృష్టించాడని ప్రతీతి. తలకు సూర్యుడూ, చంద్రుడూ అలంకరింపబడేవి. ఇదీ ఆ జడ స్వరూపం. ప్రదర్శన ప్రారంభంలో ఈ జడవర్ణనను ప్రదర్శిస్తూ వుండగా, ప్రేక్షకులుగా కూర్చున్న పండితుల్లో యెవరైనా లేచి జడను గురించి ప్రశ్నిస్తే తగిన సమాధానం చెప్పి వారిని ఆశ్చర్యచకితుల్ని చేసేవారు. అలా సమాధానం చెప్పలేనట్లయితే పై పండితోత్తములు ఆ జడను కత్తిరించి కళాకారులను అవమానపరిచేవారు. అలాంటి సందర్భాలను రానీయకుండా వేదాంతం లక్ష్మీ నారాయణలాంటి వుద్దండులు యెంతో ప్రావీణ్యంతో ఒక మహాపర్వతంలా నిలబడి జడవర్ణనను పూర్తిచేసి ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేసి పండితుల్ని, పామరుల్ని రంజింప జేసేవారు.



## వ్యాయామం ద్వారా నాట్యశిక్షణ :

కూచిపూడి కళాకారుల నాట్యాభ్యాసం వ్యాయామంతో ప్రారంభమవుతుంది. వారు బస్కీలు తీస్తారు; దండెములను తీస్తారు. ఇలా చేయడంవల్ల అవయవసౌష్ఠవం చక్కగా అమరుతుంది, తరువాత అభినయాన్ని నేర్పుతారు. నాట్యంలో పాదగతులు - అడుగులు, ప్రత్యాళి మొదలైనవన్నీ నేర్పుతారు. హస్తముద్రల్ని, అంగవిన్యాసాల్ని మూడు కాలాలలో అడుగులూ నేర్చుకుంటారు. ఇక నాలుగవ దశలో నవరసాలను అనుభవించడం, ముక్తాయింపులు, పాటల్లోని భావాన్ని అనుసరించి భావవిన్యాసాన్ని అభ్యసిస్తారు. ఈ విధంగా

నాలుగు దశలుగా విభజించుకుని నాట్యంలో వుత్తీర్ణులుగా తయారవుతారు. ఇందువల్ల విద్యాభ్యాసమేకాక వ్యాయామశిక్షణద్వారా అంగసౌష్ఠవం, కుదిరికలూ, ఆరోగ్యం ఎంతో బాగుండి ఎక్కువకాలం జీవించడానికీ, ఆయాసం లేకుండా ఎక్కువ కాలం నృత్యం చేయడానికీ వీలవుతుంది.



## కూచిపూడి భరతనాట్యం :

భావ, రాగ, తాళ యుక్తంగా నటించే నాట్యాన్నే భరత నాట్య మంటారు. నాట్యం నృత్యమనీ, నృత్తమనీ రెండు భాగాలు. భావాన్ని స్పష్టపరచేది నృత్యం, భాషతో భావాలను వ్యక్తంచేసేది నృత్తం. కూచిపూడి నాట్యాచార్యుడు వీటన్నిటినీ మేళవించి నృత్యం చేస్తారు. పాటలో వున్న ప్రతిపదం యొక్క భావాన్నీ అభినయం ద్వారా చూపిస్తారు. ఈ విధంగా సంగీతం, సంగీతం ద్వారా పదం, పదం ద్వారా అభినయం, అభినయం ద్వారా భావవిశిష్టత వెల్లడిస్తూ నృత్తమూ, నృత్యమూ కూచిపూడి సాంప్రదాయంలో ప్రాముఖ్యం వహించాయి.

## ముద్దులొలికే క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు :

మువ్వగోపాల పదాలను కూచిపూడి భాగవతులు వారి వీథి భాగవతాల్లో పాడడం, భరతనాట్య సంప్రదాయం ప్రకారం అభినయించడం చేశారు. క్షేత్రయ్య పదాలను ఎక్కువ ప్రచారంలోకి తీసుకువచ్చినవారు కూచిపూడి భాగవతులే. ప్రాచీన కాలంనుంచీ మన కళారూపాలు ఎలా ఎలా పరిణామం చెందాయో, అలాగే మన గేయవాఙ్మయం కూడా అభివృద్ధి పొందింది. క్షేత్రయ్య నివాసస్థానం కృష్ణాజిల్లా దివి తాలూకా మువ్వగ్రామం. ఆ గ్రామంలోని గోపాలస్వామి మీదే క్షేత్రయ్య గోపాల పదాలను రచించి దక్షిణదేశమంతా సంచారం చేశాడు. అనేక యాత్రా స్థలాలకు పోయి కంచివరదునిపైనా, తిల్ల గోవిందునిపైనా, యదుగిరిస్వామి, శ్రీ వెంకటరమణుడు, ఇనపురిధాముడు, పాలగిరి చెన్నుడు, మధురాపురాధీశుడు మొదలైన దేవుళ్ళపైనా క్షేత్రయ్య అక్షయంగా పాటలను రచించాడు. క్షేత్రయ్య తన పదాలను భక్తిభావంతోనే గాక సంగీత సమ్మేళనాలతో, అభినయ ప్రదర్శనానికి కూడా ఎన్నో గీతాలను రచించాడు. దక్షిణదేశంలో త్యాగరాజు, ఉత్తరదేశంలో జయదేవుని మాదిరి క్షేత్రయ్య కూడా అశేష ప్రాముఖ్యత వహించిన గేయ

వాఙ్మయ కారుడు. ఆంధ్రుల నాట్యకళా సాంప్రదాయాలలో క్షేత్రయ్య మువ్వ గోపాల పదాలు ఒక మెట్టులాంటివి.

## ఏ హంగామా లేని వీధి నాటక రంగస్థలం:

కూచిపూడి వీధి నాటకాలు ఆనాటినుంచి ఈనాటివరకూ వీథుల్లోనే ప్రదర్శింపబడుతూ వున్నాయి. నాలుగు వీథుల కూడలిగాని. ఊరిమధ్య పెద్ద బజారులో



వీథి నాటకంలో యముడు

గాని, ఊరి వెలుపల బయలు ప్రదేశంలోగాని ఈ ప్రదర్శనాలు జరిగేవి. ఈనాటి మాదిరి ఆనాడు రంగస్థలాలు లేవు. ఎత్తైన ప్రదేశమే రంగస్థలంగా ఎంచుకొనేవారు. లేనట్టయితే మట్టిని దిబ్బగా పోసేవారు. ఇంకా జనసమ్మర్దం ఎక్కువగా వుంటే ఎత్తుగా బల్లలతో ఒక బల్లకట్టు నిర్మించేవారు. ప్రదర్శనం నాలుగు ప్రక్కలకూ స్పష్టంగా కనిపించేటట్లు పందిరి నిర్మించేవారు. పైన తాటి ఆకులుగాని, ఈతచాపలు గాని కప్పేవారు. ఈనాటి తెరలు ఆనాడు లేవు. మామూలు కలంకారీ అద్దకం బొమ్మల దుప్పటిలాంటిది ఇరువురు వ్యక్తులు చెరో ప్రక్క పట్టుకుని నిలబడేవారు. ఈనాటి లైట్లు ఆనాడు లేవు. కేవలం నూనె కాగడాలమీదా, విలాయి కర్రలమీదా

ఆధారపడేవారు. ఇరుప్రక్కలా వెలుగునిచ్చే రెండు కంచు నూనె కాగడాలు వేసే వారు. పాత్రల ప్రవేశంలో రాజు, రాణి, యముడు, కంసుడు మొదలగు ముఖ్య పాత్రల ప్రవేశంలో ఇంత గుగ్గిలాన్ని ఆ కాగడాలపై గుప్పేవారు. అది ఆ సమయంలో గొప్ప కాంతితో గుప్పు మని మెరిసేది. ఈ మెరుపులో పాత్రలు ప్రవేశమయ్యేవి.



ఈ విధంగా వారి రంగస్థలాన్ని నిర్మించి సిద్ధపరుచుకునేవారు. ఇందుకు గ్రామస్థు లందరూ సహాయపడేవారు. ప్రదర్శనానికి కాకితో కబురంపితే చాలు చుట్టుప్రక్కల గ్రామాల నుండి జనం గుంపులు గుంపులుగా వచ్చేవారు.

## ఊరి పెద్ద లందరికి పిలుపు - ప్రదర్శన ప్రారంభం :

రాత్రి సుమారు 10 గంటలకు ప్రదర్శనం ప్రారంభమయ్యేది. ఈలోగా భాగవతు లందరూ గ్రామంలో వున్న బ్రాహ్మణుల ఇండ్లలో భోజనం చేయడంగాని, స్వయం పాకంగాని చేసుకునేవారు. రంగస్థలానికి కొంచెం దూరంలోనే వున్న ఒక ఇంటిలో ముఖాలంకరణ చేసుకునేవారు. ప్రేక్షకు లందరూ వచ్చేవరకూ సూత్రధారులు వాద్య విశేషాలతో వివిధ రకాలైన పాటలు పాడుతూ గణపతి ప్రార్థన, సరస్వతీ స్తుతి, లక్ష్మి స్తోత్రం పల్లించేవారు. ఒకప్రక్క వేషాలు తయారవుతూ వుండేవి. మరోప్రక్క ప్రేక్షకులందరూ ఆసీనులై వుండేవారు. గ్రామంలో వున్న పండితులు, గ్రామ పెద్ద, మున్సిఫ్, కరణం మొదలైన పెద్ద లందరూ వచ్చి ముందు వరుసలో కూర్చునేవారు. పెద్ద లందరూ వస్తేనేగాని ప్రదర్శన ప్రారంభమయ్యేది కాదు. వచ్చిన వారందర్నీ, వారికి సహాయాలు చేసేవారినీ ఈ విధంగా సంబోధించేవారు.

## అందరూ వచ్చియున్నారటరా? :

ఈ సభారంగమునకు అందరూ వచ్చియున్నా రటరా?
చిత్తం!
కరణంగారు?

చిత్తం!
మున్సిఫ్‌గారు?
చిత్తం!

ఈ విధంగా ప్రేక్షకు లందర్నీ ఆకర్షించి ప్రదర్శనం ప్రారంభించేవారు. ప్రతి జట్టులోనూ సమర్థులైన ఇద్దరు ముగ్గురు హాస్యనటు లుండేవారు. వారు యే పాత్ర బడితే ఆ పాత్రను అచ్చుగుద్దినట్లు చెప్పేవారు. వేషధారణలో ఈ నాటి కలరు కేకులుగాని, పౌడర్లుగాని, బ్రష్‌లుగాని లేవు. ముఖాలంకరణకు అరదళం, మణిశిల, బొగ్గుపొడి, సింధూరం వుపయోగించేవారు. క్రేప్‌హెయిర్ బదులు నారపీచు వుపయోగించేవారు.

ప్రదర్శనంలో ప్రతి పాత్రా రంగస్థలంలో మూడు ప్రక్కలకూ తిరిగి అభినయించేవారు. దూరంగా వున్నవారికి వినబడేటందుకు సూత్రధారులు హెచ్చు స్థాయిలో, ప్రతి చరణాన్నీ ఒకసారికి రెండు సార్లు రెట్టించి పాడేవారు. ఇలా రెట్టించటంవల్ల అందరికీ ఇట్టే అర్థమయ్యేది.

## మాధవీ - చోపుదారు :

ఈ ప్రదర్శనంలో సాత్వికభావాలు ముందు కూర్చున్న వారికి తప్ప దూరాన వున్నవారికి కనిపించేవి కావు. అందువల్ల కాళ్ళతో నృత్యం చేసేవారు. నోటితో పాట పాడేవారు. చేతులతో భావానికి తగ్గట్టు అంగచలనం చేసేవారు. మధ్య శ్లోకాలను చదివేవారు. ఈ శ్లోకాలు చాలా మందికి అర్థంకావని హాస్యగాని ద్వారా వివర మడిగించి శ్లోకార్థాన్ని విశదపరిచేవారు. ప్రదర్శనంలో ఏమాత్రం విసుగు జనించకుండా హాస్యపాత్రధారులైన మాధవి, చోపుదారు, ద్వారపాలకుల ద్వారా చిత్ర విచిత్రమైన లోకధర్మాలను, సాంఘికాచారాలను ప్రవేశపెట్టి మధ్య మధ్య కడుపుబ్బ నవ్వు పుట్టించేవారు. ప్రదర్శనం 10 గంటలకు ప్రారంభిస్తే తెల్లవారి 6 గంటల వరకూ బ్రేకు లేకుండా సాగించేవారు. ప్రేక్షకులు తెల్లవార్లూ రెప్పవాల్చకుండా ఈ ప్రదర్శనాలను చూచి ఆనందించేవారు.



## అందరికీ మక్కువైన పెక్కు నాటకాలు :

కూచిపూడి భాగవతులు నాటకాల్లో రామాయణ, భారత, భాగవత గాథలకు సంబంధించిన గాథలను యక్షగాన వీథినాటకాల రూపంలో సాంప్రదాయ సిద్ధంగా ఈ క్రింద వుదాహరించిన వాటి నన్నిటినీ ప్రదర్శించేవారు.

త్యాగరాయ కృతులు — జయదేవుని అష్టపదులు — మువ్వ గోపాలపదాలు — భద్రాచల రామదాసు కీర్తనలు — నారాయణతీర్థుల తరంగాలు — సారంగపాణి కీర్తనలు — తుంగతుర్తి కృష్ణదాసు కృష్ణలీలలు — తాళ్ళపాక అన్నమాచార్యులు గారి ప్రహ్లాద — హరిశ్చంద్ర — రామనాకటం — ఉషాపరిణయం గొల్ల కలాపం - భామాకలాపం — దాదినమ్మవేషం — దశావతారాలు — మండూకశబ్దం ప్రహ్లాద పట్టాభిషేకం — బాలగోపాల తరంగం మొదలైన వెన్నో ప్రదర్శించేవారు.

## ప్రతిభావంతులైన కళాకారులు :

కూచిపూడి కళాకారులు ఒక్క నాట్య సంగీతాల్లోనేగాక అలంకారశాస్త్రం లోనూ, మంత్రశాస్త్రంలోనూ, భాషాశాస్త్రంలోనూ, వాద్యశాస్త్రంలోనూ కూడ నిరుపమానమైన ప్రజ్ఞానైపుణ్యం గలవారు. కూచిపూడివారిలో వేదాంతంవారనీ, చింతావారనీ, పసుమర్తి వారనీ, భాగవతులవారనీ, వెంపటివారనీ, ఇంగువవారనీ, బుక్కా వారనీ ప్రసిద్ధ కుటుంబాలవా రున్నారు. కొన్ని శతాబ్దాలపాటు దీర్ఘప్రశస్తిని పొందారు. 19 వ శతాబ్దం ప్రారంభం నుండి నేటివరకు అఖండమైన కీర్తి నార్జించు కుని కూచిపూడి సాంప్రదాయాన్ని వుద్ధరించిన ఈ క్రింది కళాకారులు కీర్తిశేషులైనారు.

## ఎందరో మహానుభావులు :

1. చింతా వెంకటరామయ్య
2. చింతా రత్తయ్య
3. చింతా నారాయణమూర్తి
4. చింతా ఆదినారాయణ
5. చింతా రామమూర్తి
6. వెంపటి వెంకటనారాయణ
7. వెంపటి పరదేశి



8. వెంపటి సుబ్బారావు
9. వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి
10. వేదాంతం వెంకటరత్నం
11. వేదాంతం వెంకటాచలపతి
12. వేదాంతం పెదరామయ్య
13. వేదాంతం చినరామయ్య
14. వేదాంతం లక్ష్మీనారాయణ
15. మహాకాళి గంగయ్య
16. మహాకాళి సీతారామయ్య
17. మహాకాళి సూరయ్య
18. మహాకాళి చలపతి
19. మహాకాళి శ్రీరాములు
20. బొక్కా రామబ్రహ్మం
21. బొక్కా వెంకటాచలపతి
22. బొక్కా సీతారామయ్య
23. భాగవతుల రామయ్య
24. భాగవతుల అనంతరామయ్య
25. భాగవతుల రామదాసు
26. భాగవతుల రామలింగం
27. భాగవతుల విస్సయ్య
28. భాగవతుల కుటుంబశాస్త్రి
29. పసుమర్తి భగవంతం
30. పసుమర్తి కొండలరాయుడు
31. యేలేశ్వరపు రామకృష్ణయ్య
32. యేలేశ్వరపు వెంకటేశ్వర్లు
33. తాడేపల్లి పేరయ్య
34. జోస్యుల నారాయణమూర్తి
35. హరిచలపతి



## వయసును మించిన విద్వత్తు:

పై వారిలో శ్రీ చింతా వెంకటరామయ్యగారు సుప్రసిద్ధులు. ఆనాటి వెంకటరామా నాట్యమండలిని 100 సంవత్సరాల క్రితం స్థాపించి, అవిచ్ఛిన్నంగా



చింతా వెంకటరామయ్య

నిర్వహించి, ఆ సంస్థద్వారా అనేకమంది వుత్తమ నటశేఖరులను సృష్టించి, ఈనాటి కూచిపూడి నాట్యకళకు దివ్య యశస్సును ఘటిల్లజేసిన ప్రముఖ నాట్యాచారుడు.

శ్రీ వెంపటి వెంకటనారాయణగారు భామాకలాప, గొల్లకలాప ప్రదర్శనాల ద్వారా విశేషఖ్యాతి నార్జించుకున్న నటశేఖరుడు. అనేక సంస్థానాలలోనూ, విద్వత్సభలలోనూ విద్వత్తును ప్రదర్శించి అనేక సువర్ణఘంటాకంకణాది అమూల్య సత్కారాలను పొందిన లయబ్రహ్మ. పాత్రధారణలోనూ, నాట్యశిక్షణలోనూ ఆరితేరి, మిగిలిన వారు కూడ - ఈ క్రిందివారితోపాటు సేవచేశారు.

## సాటిలేని మేటివారు :

వేదాంతం రామకృష్ణయ్య
వేదాంతం ప్రహ్లాదశర్మ
వేదాంతం సత్యనారాయణశర్మ
వేదాంతం వీరరాఘవయ్య

వేదాంతం ఆంజనేయులు
చింతా రాధాకృష్ణమూర్తి
చింతా కృష్ణమూర్తి
మహంకాళి సత్యనారాయణ
మహంకాళి సుబ్బారావు
మహంకాళి వెంకటాచలపతి
మహంకాళి శ్రీరాములు
మహంకాళి శ్రీమన్నారాయణ
పసుమర్తి ఆదినారాయణ
పసుమర్తి రత్తయ్య
భాగవతుల రాజేశ్వరరావు
భాగవతుల లక్ష్మీనరసింహం
హరి పున్నయ్య
దర్భా వెంకటేశ్వర్లు



చింతా కృష్ణమూర్తి

పైన వుదాహరించిన వారిలో చింతా కృష్ణమూర్తి కీ॥ శే॥ చింతా వెంకట రామయ్యగారి పుత్రులు. ఆనాటి వెంకటరామా నాట్యమండలికి మేనేజరు. ఢిల్లీ, బొంబాయి, హైదరాబాదు మొదలైన ప్రముఖ నగరాలలో అమూల్యమైన సన్మానాల నందుకున్నారు. తండ్రిగారి వలె వీరుకూడ ప్రధానపాత్రల్లోనూ, సూత్రధారుడుగాను

ప్రఖ్యాతి వహించారు. ఆ మధ్య హైదరాబాదులో జరిగిన సంగీత నాటక అకాడమీ వారి నాట్యసదస్సులో సన్మానించబడ్డారు. నేటి నటశేఖరుడైన వేదాంతం సత్యనారాయణ శర్మకు గురువులు.

## ఆడవేషాల్లో అందెవేసిన మగధీరుడు వేదాంత సత్యనారాయణశర్మ :



ఈనాటి యువనటుల్లో పేర్కొనదగిన వారు, వేదాంత సత్యనారాయణశర్మగారు. వీరు గొప్ప నటశేఖరులు. సత్యభామ, ఉష, మోహిని మొదలైన స్త్రీ భూమికల్ని ధరించి అనేక విద్వత్సభలలో అనేక పారితోషికాలను పొందడమేకాక కేంద్రప్రభుత్వం వారిచే అవార్డును అందుకుని సన్మానించబడ్డారు. నేటి నటుల్లో ప్రముఖుడు.

## ఈ తరం రత్నాలు :

వేదాంతం పార్వతీశం
వేదాంతం మల్లికార్జునశర్మ
భాగవతుల రామతారకం
భాగవతుల రామకోటయ్య
భాగవతుల యజ్ఞనారాయణశర్మ
పసుమర్తి సీతారామయ్య
పసుమర్తి వేణుగోపాలశర్మ
పసుమర్తి సీతారామశాస్త్రి
జోస్యుల సీతారామశాస్త్రి
హేమాద్రి చిదంబరదీక్షితులు
చింతా సీతారామాంజనేయులు
యేలేశ్వరపు నాగేంద్రశర్మ

## కూచిపూడి ఆచార్యులపై సినిమాల ప్రభావం :

కూచిపూడి నాట్యాచార్యులపై సినిమా ప్రభావంకూడ జోరుగా పడింది. సినిమాలలో నృత్యాలు ప్రవేశపెట్టబడడంతో కూచిపూడి నాట్యాచార్యులు సినిమాల మీదికి దృష్టిని మళ్ళించారు. అలా సినిమాల్లో ప్రవేశించి కీర్తి ప్రతిష్ఠలు గడించిన వారు వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యనారాయణ, పసుమర్తి కృష్ణమూర్తి, వెంపటి చినసత్యం, వేదాంతం జగన్నాథశర్మ మొదలైనవారు సినిమాలలో నృత్య దర్శకులుగా వెలుగొందుతున్నారు. వీరిలో వేదాంతం రాఘవయ్యగారు కొంతకాలం నృత్యదర్శకులుగా వుండి ఆ తరువాత కొన్ని చిత్రాలకు దర్శకత్వమూ వహించి ప్రసిద్ధ దర్శకులలో ఒకరుగా వెలుగొందారు.

## దాదినమ్మ భాగవత ప్రదర్శనం :

లీలావతి విజయగాథ వీథిభాగవతంగా రచించబడి అల్లంపాటీశ్వరునకు అంకితం చెయ్యబడింది. దీని వ్రాతప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. ఈ గాథను దాదినమ్మ భాగవత ప్రదర్శనంగా కూచిపూడి వీథి భాగవతులు నాలుగు దశాబ్దాల క్రితం వరకూ ఆంధ్రదేశం అంతటా జేగీయమానంగా ప్రదర్శించారు. ఆ గాథ ఇది:

ఉజ్జయిని రాజైన భోజరాజుకు శివుని వరాన జన్మించిన గారాల బిడ్డ లీలావతి. లేక లేక కలిగిన ఆ బిడ్డకు ఏడుకోటల నడుమ ఒంటి స్తంభపు మేడ నిర్మించి అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.



దినదినప్రవర్ధమాన అవుతున్న ఆ సౌందర్యరాశి లీలావతి అందచందాలను గురించి పురోహితుని ద్వారా విన్న మగధదేశపు రాజు ముగ్ధుడై, లీలావతిని వివాహం చేసుకోవాలని నిశ్చయించి ఉజ్జయిని రాజుకు వార్తాహరుని ద్వారా వర్తమానం పంపిస్తాడు. ఇందుకు ఉజ్జయిని రాజు సమ్మతించడు. ఆ వార్త విని ఉగ్రుడైన మగధరాజు రాజ్యంలోని గజదొంగలను పిలిపించి ఎవరైతే లీలావతిని తెచ్చి తన కిస్తారో వారికి తన దేశంలో సగం భాగాన్ని దానంగా ఇస్తానని ప్రకటిస్తాడు. కర్ణకరుడనే దొంగ అందుకు అంగీకరించి ఉజ్జయిని నగరానికి బయలుదేరుతాడు.

అక్కడ ఉజ్జయిని నగరంలో లీలావతి చెలికత్తెలతో ఆటపాటలతో అలిసిపోయి, దోమ తెరమంచంలో హాయిగా నిద్రిస్తూ వున్న సమయంలో దొంగ అయిన కర్ణకరుడు దొంగచాటుగా ఆ ఒంటి స్తంభపు మేడకు కన్నంవేసి లీలావతిపై మత్తుమందు చల్లి ఆమెను మంచంతో సహా కోట దాటించి అరణ్యంలోకి తీసుకొని పోతూవుండగా మధ్యలో మేల్కొంచిన లీలావతి దిగ్గునలేచి దిగ్భ్రమచెంది దుఃఖిస్తుంది. చెలికత్తెలందరిని వరస వరసన పేర్కొని విలపిస్తుంది. ఆ దొంగను అనేకవిధాల శపిస్తుంది. రాజదండన తప్పదని వాణ్ణి పలువిధాల బెదిరిస్తుంది. ఏమీ పాలుపోక చివరికి భగవంతుణ్ణి వేయివిధాల ప్రార్థిస్తుంది. పుణ్యాత్ము లెవరైనా వచ్చి తనను రక్షించవలసిందిగా అరణ్యమంతా దద్దరిల్లిపోయేటట్లు రోదిస్తుంది.



ఇంతలో ఆ అడవికి వేటకు వచ్చి విశ్రాంతి తీసుకుంటున్న మాళవరాజుకు లీలావతి రోదన వినిపిస్తుంది. అతడు దిగ్గున లేచి రోదన వినిపించే దిక్కుకు వెడలి మంచంలో ఉన్న సుకుమారిని ఉజ్జయిని రాకుమార్తె లీలావతిగా తెలుసుకుని తగిన దండప్రయోగంతో దొంగల బారినుండి తప్పించి ఉజ్జయినికి తీసుకుపోయి భోజరాజుకు అప్పగిస్తాడు. మాళవరాజు ఉపకారాన్ని మెచ్చుకున్న భోజరాజు లీలావతిని అతని కిచ్చి వైభవోపేతంగా వివాహం చేస్తాడు. ఇదీ ఆ కథ.

ఈ రచనలో దరువులు, ద్విపదలు, పద్యాలు, వచనాలు రకరకాలుగా ఉన్నాయి. ఉదాహరణకు: కర్ణకరుడు మత్తుమందు చల్లి తీసుకుపోయే సమయంలో మంచంపో పరున్న లీలావతి ఈ విధంగా తన వృత్తాంతాన్ని ప్రారంభిస్తుంది.

దాదినమ్మో, నే దాదినమ్మో! :

దాదినమ్మో నే దాదినమ్మో
దాదిలో చిన్నదాననే యమ్మో
బాలనమ్మో నే బాలనమ్మో
బాల నపకీర్తి పాలైతినమ్మో
పుట్టకోటా, భూమికోటా
కంచుకోటా, కల్వకోటా

ఇనుపకోటా, ఇత్తడికోటా
వెండికోటా వెలసినాదీ
ఏడుకోటల నట్టనడుమా
ఒంటిస్తంభం మేడమీదా
పవ్వళించి నే నుండగా
మాయదారి కర్ణకరుడూ
మత్తుచల్లీ నన్ను తెచ్చే.

అంటూ దరువుతో లీలావతి పాత్రధారిణిపై కథ అంతా వివరిస్తుంది.

## తంత్రమూ, తంతూ:

దాదినమ్మ ఉంటూ వచ్చిన పందిరిపట్టి మంచం ఒక వ్యక్తి పరుండడానికి సరిపోయేటంత పొడవూ, వెడల్పూ కలిగివుంటుంది. ఆ మంచానికి ఒక చిన్న పందిరి. ఆ పందిరికి చాందినీ దోమతెర, లోపల పందిరికి వ్రేలాడుతూ రకరకాల పక్షిబొమ్మలు. మంచం వెదురు కర్రలతో చెయ్యబడి చాలా తేలికగా వుంటుంది.



లీలావతి పాత్రధారి మంచాన్ని రొమ్ముకు దిగువ కదలకుండా గట్టిగా కట్టివేసు కుంటాడు. నడుము కింది భాగమంతా పాదాలవరకూ కాళ్ళు కనబడకుండా మంచం కోళ్ళ చుట్టూ మంచానికి జాలరు దించిఉంటుంది. చూచేవారికి మంచం అలంకారం ఎంతో శోభాయమానంగా కనిపిస్తుంది. కాళ్ళవద్ద మంచంమీద రెండు లక్కకాళ్ళు బయటికి కనబడేటట్లు అమరుస్తారు. ఇలా కాళ్ళు అమర్చడంవల్ల మంచంలో

దిగబడిన లీలావతి పాత్రధారి మంచంలో పరుండినట్లే ప్రేక్షకులకు భ్రాంతి కలిగించేది. భూమిమీద ఆనకుండా మంచం దానంతట అదే మధ్య - అంతరంలో నిలబడినట్లు కనబడేది. కాళ్ళకు గజ్జెలు కట్టి లీలావతి పాత్రధారి పాట ప్రారంభించి నృత్యం చేస్తూవుంటే పరుండిన వ్యక్తి పరుండినట్లుగానే ఉన్నప్పుడు మంచం ఎలా నృత్యం చెయ్యగలుగుతున్నదా అని ప్రేక్షకులకు ఆశ్చర్యాన్ని కలిగించేది.

ఈ ప్రదర్శనం మూడు గంటల కాలం జరిగేవి. మంచం బరువుతో మూడు గంటల కాలం ఒకే పాత్రధారి విసుగు జనించకుండా పాడుతూ, అభినయిస్తూ, నృత్యం చేస్తూ ప్రేక్షకులను ఆనందింపజేసేవాడు. ఈ ప్రదర్శన ఇవ్వడంలో కూచిపూడి భాగవతులు సిద్ధహస్తులు. వీరిలోనైనా అందరూ దీనిని ప్రదర్శించగలిగేవారు కారు. దాదినమ్మ వేషం వెయ్యడంలో పూర్వం నాట్యకళానిధి వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, వెంపటి వెంకటనారాయణగార్లు సుప్రసిద్ధులు. వీరి తరువాత చెప్పుకోదగినవారు చింతా రామమూర్తి, భాగవతుల రాజయ్య, వేదాంతం జగన్నాథశర్మ మొదలైనవారు.

వీధి భాగవతానికి వలెనే గ్రామంలోని నాలుగు వీథుల నడుమ రచ్చబండ వద్ద వేసిన పందిరిలో ప్రదర్శనం. తెర, కాగడాలూ, వంతపాటగాండ్రూ, హాస్యగాడూ మొదలైన హంగులతో, ఇరువైపులా జోడించి పట్టిన కాగడాలమీద చల్లిన గుగ్గిలం భగ్గుమనడంతో తెర తొలగిపోయేది. తరువాత వెంటనే దాదినమ్మ పాత్ర ప్రవేశమై భాగవతం ఆరంభమయ్యేది. ఈనాడు ఈ ప్రదర్శనం మచ్చుకు కూడా కనబడకుండా పోయింది. ప్రదర్శించే సమర్థులూ ఎవరూ లేరు. ఇది ఏకపాత్రాభినయం లాంటిది.

## ఆభరణాలూ, అలంకారాలూ :

కూచిపూడి భాగవతులువారు ప్రదర్శించే ప్రదర్శనాలలో ప్రతి పాత్రకు ఒక ప్రత్యేకమైన వేషధారణను, ప్రాచీన సంప్రదాయాలతో కూడుకున్న ఆభరణాలను ప్రవేశపెట్టారు. నాయిక, నాయకుడు, విదూషకుడు, చెలికత్తె, వుపనాయకులు మొదలైన అనేక పాత్రలు వారి వారి తారతమ్యంతో కూడుకున్న శరీరాలంకరణాలను, కంఠాభరణాల్ని, శిరోభూషణాలను ధరించేవారు.



పురుషపాత్రల్లో ముఖ్యంగా రాజు కిరీటాన్ని, శంఖచక్రగదాదండాల్ని, భుజకీర్తుల్ని గండభేరుండ పతకాలు, కర్ణపత్రాలు, కాశికోక, కండువాలు, నల్లకోటు మొదలైనవాటిని ప్రధాన భూషణాలుగా ధరించేవారు.



ఇంకా పురుషపాత్రల్లో తారతమ్యాలను బట్టి తదితర కోట్లు, ఘర్వాలు, చొక్కాలు, అంగరఖాలు వుపయోగించేవారు.

నరసింహస్వామి, శక్తి, రావణుడు, హిరణ్యకశిపుడు, హనుమంతుడు మొదలైన భీకర పాత్రలకు కరాళములను, ముఖాలకు ముసుగులను వాడేవారు.

## అందమైన ఆభరణాలు:

నిత్యజీవితంలోనే పురుషులకంటే స్త్రీలకు ఆభరణాలు ఎక్కువ. అలాగే ప్రదర్శనాలలో కూడ ఎక్కువగా ధరించేవారు. నిజంగా కూచిపూడి కళాకారులు వారి భాగవతాలలో స్త్రీ పాత్రలకు ఒక ప్రత్యేకమైన ఆభరణాలను ధరింపజేసేవారు. ఆ కాలంలో ఆచరణలో వున్న స్త్రీల ఆభరణాల నన్నింటినీ వుపయోగించేవారు. కొన్ని లోహాలకు సంబంధించినవి. మరికొన్ని పేడతో తయారుచేసినవి. మరికొన్ని కాగితాలతో మోల్డింగ్సుగా తయారుచేసినవి ధరించేవారు.

## భామ వేషపు నగలు:

భామ వేషానికి ఎన్నో ప్రాచీన ఆభరణాలను వుపయోగించేవారు. వారావికి కొన్ని నగలు చొప్పున, ఏడు వారాలకు ఏడు రకాలైన వివిధ ఆభరణాలను ధరించేవారు: పెద్ద జడ—చిన్న జడ—శిఖ—రాగిరేకులు—మొగలిరేకులు—రాగిడి—చంద్రవంక—కమ్మలు—జూకాలు — తాయెత్తులు—చేర్లు — పాపిటచురాయి—పాపిడి పింజరాలు—కడియాలు — దండ కడియాలు—పోచీలు — దస్టెడ—అడ్డవాస—బిళ్ళల మొలత్రాడు—కట్టడపు బులాకి—ముక్కుపుల్ల మొ॥ ఇవిగాక కాసుల పేరు—సూర్యుడు — ముత్యాలు — తాయెత్తులు—కితకి వడ్డాణము—జడకుప్పెలు మొదలైనవి కూడా ధరిస్తారు. వారి జడబిళ్ళలు నవరత్నాలు చెక్కిన ట్లుండేవి. ఆ బిళ్ళల్లో సూర్యుడు—చంద్రుడు — నక్షత్రాలు మొదలైన ఖగోళశాస్త్రానికి సంబంధించిన విశేషా లుండేవి.

## అసలు తానీషా భూరి విరాళం :

సిద్ధేంద్రయోగి పెట్టిన భిక్షతో అనేక సంవత్సరాలు కూచిపూడివారు యక్ష గానాల ద్వారాను, వీథిభాగవతాల ద్వారాను నానాదేశ సందర్శనం చేసి విరాళాలను పొందారు. ఆ విధంగానే గోల్కొండను పరిపాలించిన నవాబ్ అబ్దుల్‌హసన్ తానీషా కూడా కూచిపూడి కళాకారులకు 1687 లో కూచిపూడి గ్రామాన్ని అగ్ర హారంగా దాన మిచ్చారు. ఆ కాలంలో సిద్ధేంద్రయోగి జీవించేవున్నాడనీ, నవాబుతో రాగిరేకుమీద అగ్రహారపు దానపట్టాను వ్రాయించింది కూడా సిద్ధేంద్రుడేననీ కొంద రంటున్నారు. ఏది ఏమైనా నాట్యకళా సాంప్రదాయాలకు తమ జీవితాన్ని అంకితం చేసిన బ్రాహ్మణ కుటుంబాల కళాకారు లందరూ ఈ అగ్రహారపు దానాన్ని పొందే టట్లు పట్టాలో వ్రాయబడిందట. ఆ నాటి నుండి ఈ నాటివరకూ తర తరాలుగా ఆ కుటుంబాలన్నీ దీనిని అనుభవిస్తూనే వున్నాయి.

## 'సాహెబా సల్లాముర'తో సన్మానం :

కూచిపూడి భాగవతులు ఆ నాటి ఆంధ్రదేశమే కాక హైదరాబాదు, విజయ నగరం, తంజావూరు మొదలైన సంస్థానా లన్నిటిని సందర్శించేవారు. అనేకమంది రాజుల్నీ సామంతుల్నీ ఆశ్రయించారు. అలా సంచారం చేసే రోజుల్లో బనగానిపల్లె నవాబు వారిని ఆహ్వానించి వారి ప్రదర్శన లన్నిటినీ చూచి వారి కౌశల్యాన్ని వేనోళ్ళ పొగిడి వారికి తగిన పారితోషికాన్నిచ్చారు.

కూచిపూడి ఇలా మహమ్మదీయ నవాబుల సన్నిధికి వెళ్ళినప్పుడల్లా వారిని స్తోత్రం చేస్తూ వుండేవారు. వారి పాటల్లో ఎక్కడో ఒకచోట వారిని స్తుతిస్తూ వుండేవారు. వారి జతులు రాముని మీదో, విష్ణువు మీదో, కృష్ణుని మీదో రచింపబడి, కీర్తనాంతంలో తుది పాదంలో 'సాహెబా సల్లాముర' అని స్తుతించేవారు. అంటే అటు హిందువులకు ఆగ్రహం లేకుండా హిందూమత సాంప్రదాయ ప్రకారం విష్ణునీ కృష్ణునీ కీర్తించి, ఇటు 'సాహెబా సల్లాముర' అని నవా బుల మెప్పును పొందేవారు. ఇలా లౌకిక వృత్తితో కళా ప్రచారాన్ని అన్ని మార్గాలా, అన్ని మతాల ప్రజల్లోకీ చొప్పించారు. ఉదాహరణకు వారు కీర్తించిన ఒక జతిలో —



తాకు ఝుకుకు ఝుకు రేకిణ
 సారెసారెకు పరశురాముని
సన్నుతించె నీరజాక్షవినయా
 రతిరతిందరి
తాకిణాంత ఝుకిణాంత
 రవికులాంబుధి సోమ దశరథ
రామచంద్ర నిండుపున్నమ
 వెన్నెలాయెర మన్నెధీర
భళిర మేల్ సెబాసు సల్లాముర!

అని దీవించేవారు. వారు ఈ విధంగా తురుష్క ప్రభువుల్ని మెప్పించి అనేక జాగీర్లను పొందారు. అలాంటివే పైన వివరించిన బనగానిపల్లె నవాబు వ్రాసి యిచ్చిన గ్రామాలు కోటకొండ - కపత్రాల.

## రాచగద్దె ఎక్కిన రాణ కెక్కిన వేదాంతం సాంబయ్య:

వేదాంతం సాంబయ్యగా రనే కూచిపూడి భరతనాట్యాచారుడు 18-వ శతాబ్దంలో అనంతశయనం మహారాజుగారి ఆస్థానంలో ప్రవేశించి తన పాండిత్య ప్రావీణ్యాన్ని, నటనాకౌశల్యాన్ని ప్రదర్శించాడు. అనంతశయనం మహారాజు అబ్బురపడ్డాడు. ఆయనను తన సింహాసనంమీద ఒక గంటకాలం తృప్తిదీరా కూర్చుండబెట్టి సువర్ణహస్త కంకణాలను ధరింపజేసి సాంబయ్యగారిని సన్మానించాడు.

## అశక్త దుర్జనత్వం, మంత్ర తంత్రాల ప్రయోగం:

కూచిపూడివారు వుధృతంగా ప్రదర్శనా లిస్తున్న రోజుల్లో చాతబడులు, మంత్రతంత్రాలతో మచ్చుజల్లడం మొదలైనవి ఎక్కువగా వుండేవి. కళాకారుల్లో విపరీతమైన పోటీభావం వుండడంవల్ల ఒకరికంటె ఒకరు ఎత్తుకు పైఎత్తులు వేస్తుండేవారు. శాస్త్ర పరీక్షతోపాటు ఈ మంత్రపరీక్షలు కూడా వుండేవి. ముఖ్యంగా ఒకర్ని మరొకరు జయించలే మనుకున్నప్పుడు ఈర్ష్యాభావం తోనూ, రాజాధిరాజులూ, మహారాజుల మెప్పు పొందడానికి పడే



పోటీలవల్ల కుళ్ళుబుద్ధితోనూ ఒకరిమీద ఒకరు మంత్రప్రయోగాలు చేసుకునేవారు. అలా ప్రయోగించిన ప్రయోగాలలో మచ్చుకు ఒక ఉదాహరణ.



కుక్క కాటుకు చెప్పు దెబ్బ:

ఒకసారి మన భాగవతులు మలయాళ దేశానికి సంచారం వెళ్ళగా ఒక గ్రామంలో వీరి ప్రదర్శనానికి అనుమతి ఇవ్వలేదు. కారణం ఆ గ్రామంలో ఒక మంత్ర వేత్త వున్నాడట. అతని అనుమతి లేక ఎవరూ ప్రదర్శన ఇవ్వకూడదట. అయినా మన కూచిపూడివారు ఆ మంత్ర వేత్తని లెక్కచేయకుండా ప్రదర్శనాన్ని ఇవ్వడానికి నిర్ణ యించుకున్నారు.

ఆనాడు వుదయం మన భాగవత శిఖామణి భాగవతుల దశరథరామయ్యగారు ఆ మలయాళ మాంత్రికుని ఇంటికి వెళ్ళాడు. మాంత్రికుడు ఇంటివద్ద లేడు. ఈయన ఆ మాంత్రికుని భార్యను చుట్ట కాల్చుకోడానికి నిప్పు అర్థించగా ఆమె నిప్పు ఇవ్వడం, ఈయన చుట్ట కాల్చుకోవడం, తదనంతరం ఆ అగ్నిని ఈయన గుడ్డలో మూటగట్టు కుని వెళ్ళిపోవడం జరిగిందట. ఎక్కడికో వెళ్ళివచ్చిన మలయాళ మాంత్రికునికి భార్య ఈ వృత్తాంతం చెప్పగా అతగాడు మండిపోయి ఆనాటి ప్రదర్శనంలో ప్రతి క్రియగా భామవేషకారునికి కడుపుబ్బునట్లు జలోదర ప్రయోగం చేశాడట. ఇంకేముంది? దశరథరామయ్యగారు చూచి కించిత్తు చలించకుండా, 'చూడు నా తడాఖా' అని ప్రతీ కారంగా ఒక గంటాన్ని తీసుకుని ఒక స్తంభాన్ని పొడవగా ఆ రంధ్రంనుంచి నీరు కారడం ప్రారంభించి, భామవేషధారికి కడుపునొప్పి చట్టున తగ్గిందట.

దెబ్బపై దెబ్బ:

దశరథరామయ్యగారు అంతలో ఊరుకోలేదు. మలయాళ మాంత్రికునికి ప్రాయశ్చిత్తం చేయాలనుకున్నాడు. వెంటనే ప్రేక్షకుల మధ్యలో కూర్చున్న మల యాళ మాంత్రికుణ్ణి కదలలేకుండా కూర్చున్నట్లే బంధించివేశాడు. ప్రదర్శనం తెల్ల వారులూ జరిగింది. కాని మాంత్రికుడు కదలలేదు. ప్రదర్శనం ఆసాంతమై అందరూ వెళ్ళిపోయారు. కాని మాంత్రికుడు మాత్రం శిలలాగా అలాగే కూలబడి వున్నాడు. ఈ స్థితిని చూచిన మాంత్రికుని భార్య దశరథరామయ్యగారిని వేడుకోగా ఆయన జాలి దలచి మంత్ర బంధనాన్ని సడలించాడు. తరువాత మాంత్రికుడు ఇల్లు చేరాడట. ఈ

విధంగా వాళ్ళు యెప్పటికప్పుడు వచ్చే ఇటువంటి ప్రమాదాల నన్నిటినీ తప్పించు కుంటూ వుండేవారని అనేక కథ లున్నాయి.



## గొల్లకు గొల్ల, భామకు భామ! :

భాగవతుల దశరథరామయ్యగారు గొల్లకలాపపు ప్రదర్శనాల నిర్వహణలో అఖండ ప్రఖ్యాతి పొందిన వారు. బాల్యంలో గొల్లవేషం; కౌమారదశనుండి యవ్వన దశవరకూ భామవేషం, ఆ తరువాత భామాకలాపంలో సూత్రధారిగా వుండి గొప్ప ప్రతిష్ఠ పొందారు.

దశరథరామయ్యగారు ఈ విధంగా కొంతకాలం భామాకలాప ప్రదర్శనలో వుండి, తరువాత భూతవైద్యవిద్య కూడా అభ్యసించారు. ఒక సమాజానికి దర్శకత్వం వహించి ఆ బృందాన్ని నడుపుతూ దేశపర్యటన చేస్తూ వుండేవారట. ఈయన సకల శాస్త్ర పారంగతుడైన భాగవతుల లక్ష్మీనారాయణగారికి, భాగవతుల రామనాథశాస్త్రి గారికి సమకాలికులు. వీరు తమ జట్టులతో దేశసంచారం చేస్తూ గొప్ప గొప్ప సంస్థానాల కేగి పండితసభల్లో ప్రదర్శనాలు ఇచ్చి అఖండమైన ఖ్యాతి ఆర్జించారు. ఈ విధంగా వీరు విజయయాత్ర చేస్తూ వుండేవారు. వీరి విద్యాప్రభావానికి ఆబాల గోపాలం ఆనందపడుతూ వుండేవారు.

## పండితుల సవాళ్ళు :

ఆ రోజుల్లో కేవలం ప్రదర్శనమిచ్చే మామూలు నటులుగానే గాక, సభా ముఖంలో అప్పటికప్పుడు పరీక్షలతో ప్రశ్నించే పండితులకు సమర్థతతో సమాధానం చెప్పి ఎటువంటి పరీక్షలకైనా తట్టుకోకలిగిన పండితులూ సమాజాల్లో — స్త్రీల లోనూ, పురుషులలోనూ - వుండేవారట.

ఇటువంటి కుటుంబాలు కృష్ణాజిల్లా నంగిగెడ్డ గ్రామంలో అనేకం వుండేవి. గుంటూరు జిల్లాలోని బోడాయిపాలెంలో చిన్న రాణి అనే ఒక నర్తకి ప్రదర్శనాన్ని ప్రసిద్ధ పండితులందరూ మెచ్చుకునేవారట. అలాగే రేపల్లెతాలూకా, ధూళిపూడి గ్రామస్థులు మహంకాళి సీతయ్యగారు, ఒంగోలు తాలూకాలోని తమ్మవరం కాపు రస్తుడు తమ్మవరం వెంకటస్వామి మొదలైనవారు ప్రసిద్ధులు.

## గజ్జె కట్టిన అందరికీ గురువు :

చింతా వెంకటరామయ్యగారు 1860 వ సంవత్సరంలో జన్మించారు. తండ్రి శివరామయ్య; తల్లి అరుంధతమ్మ. పది సంవత్సరాల ప్రాయంలోనే పాటలో, ఆటలో, హాస్యంలో అనుభవం సంపాదించి, భామవేషపు దరువుల్ని పాడుతూ వుండే వారు. వెంకటరామయ్యగారి ప్రతిభా విశేషాలను గమనించి ఏలేశ్వరపు నారాయణప్ప గారు వారి మేళంలో చేర్చుకున్నారు. 12 వ సంవత్సరంలోనే అన్నగారైన వెంకట రత్నంగారివద్ద నాట్యశిక్షణను ప్రారంభించి 16 సంవత్సరాలకే విశేష నాట్యశాస్త్రాను భవాన్ని సంపాదించారు.

వీరు భాగవతమేళాన్ని 1875 నుండి దాదాపు 1936 వరకూ నిర్వహించారు. ఈనాడు నిర్వహింపబడుతున్న వెంకటరామా నాట్యమండలి 1875 లో వెంకట రామయ్యగారితో ప్రారంభింపబడిందే.

కొంతకాలం భాగవత మనే పేరుమీద, భామాకలాపాన్ని ప్రదర్శించారు. ప్రజాభిరుచుల్ని అనుసరించి యక్షగానాలను ప్రవేశపెట్టి, ప్రహ్లాద, ఉషాపరిణయం, గయనాటకము, రుక్మాంగద, రామనాటకం, హరిశ్చంద్ర, శశిరేఖా పరిణయం మొద లైన నాటకాలను ప్రదర్శించి ప్రజామన్ననల్ని పొందారు.

ప్రయాణసౌకర్యాలు లేని ఆనాడు ఆంధ్రదేశపు నాలుగుచెరగులా ఎద్దుబండ్లలో ప్రయాణంచేసి ప్రదర్శనా లిచ్చి, ఉన్నతాధికారుల వద్దా, సంస్థానాధీశ్వరుల వద్దా పారితోషికాలు పొందారు.

ఆ నాటినుండి చనిపోయేవరకూ కూచిపూడిలో గజ్జెకట్టిన ప్రతి కళాకారుడూ ఆయన వద్ద శిష్యరికం చేసినవారే. ప్రాచీనులైన చింతా నారాయణమూర్తి, వెంపటి వరదేశి వేదాంతం చలపతి, చింతా ఆదినారాయణ మొదలైన ప్రముఖులు ఆయన శిష్యులే.

ఆధునికులలో వేదాంతం రాఘవయ్య, వెంపటి పెదసత్యం, పసుమర్తి కృష్ణమూర్తిగార్లు ముఖ్యులు.



వేదాంతం రాఘవయ్యగారిని పాత్ర నిర్వహణలో సర్వసమర్థునిగా తయారు చేసి 1934 లో మద్రాసులో గూడవల్లి

రామబ్రహ్మంగారి అధ్యక్షతను జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తులో, తాము సూత్ర ధారులుగా ప్రదర్శన మిప్పించి, 'సెహభాష్' అనిపించి, నాటి రాఘవయ్యగారి ఉన్నత స్థానానికి పునాదులు వేశారు.

వెంకట రామయ్యగారి శిష్యులలో పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ కడపటి వారు.

వెంకటరామయ్యగారి శిక్షణ విచిత్రమైంది. వారికి ఏ సమయంలో, ఏ అడుగు, ఏ భావం, ఏ రీతి, ఏ భంగిమ స్ఫురణకు వస్తే అదల్లా అప్పుడే అక్కడే శిష్యులకు బోధించేవారు. ఇంతటి ప్రతిభావంతుడైన వెంకట్రామయ్యగారు 90 సంవత్సరాలు ధృవతారగా వెలుగొంది 6-1-1949 లో కీర్తి శేషులైనారు.

## బహువేషధారి భాగవతుల విస్సయ్య:

భాగవతుల విస్సయ్యగారు వృషభనామ సంవత్సర ఫాల్గుణ మాసంలో కూచిపూడిలో జన్మించారు. వీరి తండ్రిగారు భాగవతుల రామయ్యగారు, విస్సయ్య గారు 7 సంవత్సరాల ప్రాయంలోనే సిద్ధేంద్ర యోగీంద్రుల భామాకలాపాన్ని



భాగవతుల విస్సయ్య

రాగ, తాళ, హావ, భావాలతో అభ్యసించారు. తండ్రిగారి వద్దా, భాగవతుల యజ్ఞ నారాయణగారివద్దా భరతశాస్త్రాన్నంతా అభ్యసించారు. 10 సంవత్సరాల ప్రాయం లోనే బాలింత వేషం వేసి ప్రఖ్యాతి వహించారు. బహుమతుల్ని అందుకున్నారు. యుక్తవయస్సు రాగానే బాలింత వేషం, దాదినమ్మ వేషం, ప్రహ్లాదలో లీలావతి, ఉషాపరిణయంలో చిత్రరేఖ, ఉషా కన్యల పాత్రల్ని ధరించి ప్రఖ్యాతి వహించారు. సువర్ణ ఘంటాకంకణాలతో సన్మానాలు పొందారు. తరువాత నాటకాలలో పాత్రలు

ధరించటం విరమించి నంగెగడ్డలో కళావంతులకు వారికి నచ్చిన విద్యనంతా నేర్పి, ఆ గ్రామంలో ఏడెనిమిది మేళాల్ని తయారుచేశారు.

## నాట్యకళానిధి వేదాంతం :

కూచిపూడి నాట్యకళాకారులలో అగ్రశ్రేణికి చెందిన వారిలో ముఖ్యులు బ్రహ్మశ్రీ నాట్యకళానిధి వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు.

యక్షగానాలూ, వీధి భాగవతాల్లో పారంపర్యంగా వచ్చే సాధారణ నృత్యాల బాణీకి భిన్నంగా శాస్త్రిగారు కొత్తపద్ధతి అనుసరించారు. భరతనాట్యశాస్త్ర సంప్ర



వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి

దాయాల ఆధారంతో శ్రీ నారాయణతీర్థుల కృష్ణలీలా తరంగిణి తరంగాలకు, శ్రీ జయదేవ కవి అష్టపదులకు, క్షేత్రయ్య మువ్వగోపాల పదాలకు, కృష్ణకర్ణామృతం, పుష్పబాణ విలాసం శ్లోకాలకు నృత్యాలు సరికొత్తగా కల్పించి, ప్రధాన పాత్రల లక్షణాలు, మనస్తత్వాలు నిరూపించి, శాస్త్రోక్తంగా ఒక నూతన నాట్యశాస్త్రమే కల్పనచేసి, శిష్య ప్రశిష్యుల్ని తయారుచేసి ఆంధ్రదేశానికి ప్రసాదించిన మహనీయులు వీరు భామాకలాపంలో సత్యభామ నాయిక, సత్యభామ పాత్ర నిర్వహణలో అపూర్వంగా అఖండ ప్రజ్ఞ ప్రదర్శించిన వ్యక్తి ఈయన. ఈయన ఒక్క భామాకలాపం. గొల్ల కలాపాలే కాకుండా, దాదినమ్మ వేషం, లీలావతి విజయంలో బాలింత వేషం. శ్రీకృష్ణ జననం మొదలైన యక్షగానాల పాత్రలనూ అత్యద్భుతంగా నిర్వహించేవారు.

శాస్త్రిగారి విద్యను దర్శించిన ఉత్తరాది ఉజ్వల నటుడు ఉదయశంకర్ ఉండబట్టలేక ఈయనకు అమాంతంగా సాష్టాంగమే పడ్డాడు.

శాస్త్రిగారి జీవితం అంతా రాజుల ఆస్థానాల్లోనే గడిచింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రప్రభుత్వం భావనగర్ మహారాజా గవర్నరు గిరీకింద శ్రీ పి. వి. రాజమన్నారు సమక్షంలో ప్రముఖ కళాకారులుగా శాస్త్రిగారిని గుర్తించి సువర్ణ ఘంటాకంకణాలతో సత్కరించింది.

## ఎందరో శిష్యులు :

శాస్త్రిగారి దగ్గిర భామాకలాపం, గొల్ల కలాపం నేర్చుకున్న శిష్యులు అసంఖ్యాకం. ఈనాడు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ప్రముఖులుగా కీర్తి సంపా



వెంపటి చినసత్యం

దించిన వేదాంతం రాఘవయ్య. వెంపటి సత్యం, వెంపటి చినసత్యం మొదలైనవారు శాస్త్రిగారి శిష్యులే. మద్రాసులోని సుప్రసిద్ధ నాట్యాచార్యుడు శ్రీ రామయ్యాపిళ్ళై స్వయంగా కొన్ని నాట్యరీతులు శాస్త్రిగారి వద్ద అభ్యసించారు.

రామాయణం, మండూకశబ్దం, ప్రహ్లాద పట్టాభిషేకం, తాటకి సంహారం, శివతాండవం మొదలైన వాటిని శబ్దరూపంలో శ్రీ శాస్త్రిగారు నృత్యం చేసేవారు.

ఆంధ్రదేశం అంతటా జరిగిన ఆయన నృత్య ప్రదర్శనాలు విశేషంగా ప్రశంసలు అందుకున్నాయి. ఆయన 82 సంవత్సరాలు జీవించి 1957 జులై 13 వ తేదీన హైదరాబాదులో కీర్తి శేషులైనారు.

## హరిపున్నయ్య :

కూచిపూడి నృత్య నాటక సంప్రదాయంలో, భయానక, బీభత్స, రౌద్ర, వీరరసాలను పోషించే పాత్రలను ధరించి ప్రేక్షకుల హృదయాలను రంజింపచేసి



హరి పున్నయ్య

సుప్రసిద్ధ కళాకారులుగా వెలుగొందారు హరిపున్నయ్యగారు. వీరిది కూచిపూడి గ్రామం. చిరకాలంగా కళాలక్ష్మిని ఆరాధించిన కళాజీవి.

## సాత్విక వేషాల్లో 'సై' అనిపించుకొన్న సవ్యసాచి :

కూచిపూడి వీథి నాటకాలలో సాత్విక పాత్రల్ని రసవంతంగా అభినయించ డంలో ఆరితేరినవారు వేదాంతం రామకృష్ణయ్యగారు. యక్షగాన విద్యలోనూ, కలాపవిద్యలోనూ అపారమైన జ్ఞానాన్ని ఆర్జించిన ప్రముఖ కళాకారులు. వృద్ధా ప్యంలో వుండిన్నీ సంగీత నాటక అకాడమీ వారి పారితోషికాలు పైపైతం పొందు తున్నారు.

## క్షీణదశ :

ప్రాచీన నాట్యకళ ప్రచారమవడానికి కూచిపూడివారు ఎంతో కృషిచేశారు. కాని ఎంత చేసినా, పాత పరిధిని మించి క్రొత్త పరిధిని చేపట్టలేకపోయారు. పౌరాణిక గాథలు తప్పితే చారిత్రిక, సాంఘిక ప్రదర్శనాలను తయారుచేయలేక పోయారు. కాగా రాను రాను రాజుల ఆదరణ తగ్గింది. పరిణామ స్థితిగతుల ననుసరించి వారి భాగవతాలు ముందుకు రాలేదు. వారు కాలంతోపాటు కాలు వేయ లేకపోయారు. అవి ప్రేక్షకులకు కూడా కొంతవరకు విసుగు పుట్టించాయనే చెప్పాలి.



అయ్యంకి తాండవకృష్ణ

## శుక్లపక్షం నుంచి కృష్ణపక్షం :

కూచిపూడివారి నాట్యకళా సాంప్రదాయాలు ఆంధ్రదేశమంతటా, వెలిగినంత మట్టుకు, క్రీ॥ శ॥ 1880 వరకూ వేయివెలుగులతో వెలుగొందాయి. ఆ రోజుల్లోనే ధార్వాడ నాటకసమాజాలు ఆంధ్రదేశానికి వచ్చి ప్రదర్శనలిచ్చి, వేనోళ్ళ పొగడ బడుతూ వచ్చాయి. దేశకాలా లెరిగి రంగస్థలంలో వారు అనేక మార్పులు తీసుకు వచ్చారు. చెమ్కీ దుస్తులతో రమణీయంగా ప్రదర్శనలిచ్చారు. తహతహతో, మార్పు కావాలనుకుంటున్న ప్రజలకు ఒక నూతన ఆనందాన్ని కలుగజేశాయి. ఈ

ప్రదర్శనలు. ఈ రోజుల్లోనే కూచిపూడివారి ప్రదర్శనల ప్రభావం మగ్గుపట్టి తగ్గుతూ తగ్గుతూ వచ్చింది. అంతేకాక ధార్వాడవారు వచ్చి వెళ్ళిన తరువాత వారి ప్రదిల్ల ప్రచారంతో ఆంధ్రదేశ ప్రముఖ పట్టణాలలో ఎన్నో విద్యావంతుల నాటక సంఘాలు బయలుదేరి, అచ్చంగా ధార్వాడవారి అడుగుజాడల్లో ప్రదర్శనాలిచ్చాయి. ఈ పరి స్థితుల్లో కూచిపూడివారి ప్రదర్శనాలమీద మోజు బాగా తగ్గిపోయింది.



యామిని కృష్ణమూర్తి

1930 నాటికి నాటకాల ఉధృతం కూడ కొంతవరకు తగ్గి సినిమాల ప్రభావం బహు ఎక్కువైంది. ఆ సినిమా ప్రభావంతో రంగస్థల నాటకాలూ కూచిపూడి వారి నాటకాలు కూడా బాగా దెబ్బతిని పోయాయి.

## మేలుకోలు - క్రొత్త మెరుగులు:

1880 నుంచి 1930 మధ్యకాలంలో కూచిపూడివారు ఏటికెదురీదలేక తమ ప్రదర్శనాలలో కూడ కొన్ని మార్పులు తీసుకువచ్చాడు. రంగస్థల నాటకాలు

ప్రేక్షకులను ఏ విధంగా ఎందుకు ఆకర్షిస్తున్నాయో ఆ కీలకాలన్నిటినీ తెలుసుకొని భాగవత సంప్రదాయాలలో కొంత సంస్కారం తీసుకువచ్చి, తెరలు, హార్మోనియం, పద్యాలు, పాటలు, చెమ్కీ దుస్తులు ప్రవేశపెట్టి భరతనాట్య సంప్రదాయాల ననుసరించి ప్రదర్శనాలను ఇచ్చారు.

## ఎందరో నిష్ణాతులు :

ఈనాడు కూచిపూడిలో వెనుకటి వైభవం లేదు ఆ తరం వారెవ్వరూ లేరు. ఆ నాటకాలను ప్రదర్శించే వేదాంతం సత్యనారాయణగారు తప్పా మరొకరు లేరు. ఆయన స్త్రీ పాత్రలో, భామాకలాపాన్ని అభినయించడంలో దిట్ట. పద్మశ్రీ అవార్డుతోపాటు ఎన్నో అవార్డుల నందుకున్నారు.

కూచిపూడి నాట్యం జానపద నాట్యమే కాని దానికి శాస్త్రీయత లేదని కొందరు వక్రభాష్యాలు చెప్పారు. కూచిపూడి నృత్యాన్ని శాస్త్రీయ నృత్యంగా గుర్తింపు తీసుకురావడానికి సంగీత నాటక అకాడమీ ద్వారా కృషిచేసి, శాస్త్రీయ నృత్యంగా స్థిరపరచారు. ఇందుకోసం ఎందరో మహానుభావులు కృషిచేశారు.

శిథిలమౌతున్న కూచిపూడి నృత్య కళను పునరుద్ధరించటానికి సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని ఏర్పాటుచేసి గురుకుల పద్ధతిలో శిక్షణ ఇస్తున్నారు. ఇందుకు, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలూ, సంగీత నాటక అకాడమీ గ్రాంటుల నిచ్చి పోషించింది. సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని ఈనాడు తెలుగు విశ్వవిద్యాలయం పరిధిలోకి తీసుకుని, కూచిపూడి నృత్యకళను కాలేజీ స్థాయిలో పాఠ్యాంశంగా చేయాలని కృషి చేస్తూ వుంది. కూచిపూడి వీథినాటకాన్ని ఇటీవల వేదాంతం సత్యనారాయణగారు వెలుగులోకి తీసుకువస్తే, మరోప్రక్క వెంపటి చినసత్యంగారు ముప్పది సంవత్సరాలుగా మద్రాసులో కూచిపూడి ఆర్టు అకాడమీని స్థాపించి, ఎంతోమంది ప్రముఖులకు కూచిపూడి నృత్య కళలో శిక్షణ నిచ్చి....పద్మావతీ శ్రీనివాస కల్యాణం లాంటి నృత్య నాటకాలను కూచిపూడి శైలిలో తయారుచేసి దేశం అన్ని ప్రాంతాల్లోనూ, విదేశాల్లోనూ ప్రదర్శనాలను ప్రదర్శించి కూచిపూడి నాట్యానికి విశ్వవిఖ్యాత కీర్తిని సాధించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం సత్యంగారికి, కళాప్రపూర్ణ బిరుదు నిచ్చి సత్కరించింది. ఇంకా మరెన్నో అవార్డుల అందుకున్నారు. ఈనాడు అడయారులో, కూచిపూడి ఆర్టు అకాడమీ పేరున స్వంత భవనాలను నిర్మించి, దాని నొక విఖ్యాత కూచిపూడి నృత్య కళాకేంద్రంగా తీర్చి దిద్దటానికి కృషిచేస్తున్నారు.

కూచిపూడి నృత్యంలో ప్రవీణురాలైన, యామినీ కృష్ణమూర్తి వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి, వెంపటి గోపాలశర్మ, చింతా కృష్ణమూర్తి మొదలైనవారివద్ద నృత్యం నేర్చుకుని విదేశాలలో కూచిపూడి నృత్యకళకు పేరు తీసుకువచ్చారు. ప్రభుత్వం పద్మశ్రీతో గౌరవించింది.

ఎం. ఏ. పట్టభద్రుడైన కోరాడ, అంతర్జాతీయ నృత్య సదస్సు పారిస్‌లో జరిగి నప్పుడు కూచిపూడి నృత్యం ప్రదర్శించి ప్రథమ పురస్కారాన్ని అందుకున్నారు. గుడిమెట్ల కృష్ణ, వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి గార్ల వద్ద విద్య నభ్యసించి 1957 లో ఢిల్లీలో జరిగిన ప్రజా నాట్య మండలి మహాసభలో కూచిపూడి నృత్యం ప్రదర్శించి ప్రథమ బహుమతి నందుకున్నారు.



అన్ని నృత్యాలనూ ఆకళింపు చేసుకున్న డా॥ నటరాజ రామకృష్ణ కూచిపూడి నృత్యంలో ఆరితేరి దేవదాసీ నృత్య సంప్రదాయాన్నీ ఆంధ్ర నాట్యాన్నీ పునరుద్ధరించి నృత్యకళమీద ఎన్నో గ్రంథాలను వ్రాసి, ఎంతోమంది శిష్యులను తయారుచేసి నృత్య కళకు ఎంతో సేవచేసిన రామకృష్ణగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయం - కళాప్రపూర్ణ నిచ్చి గౌరవించింది.

సంగీత నాటక అకాడమీ భరతకళా ప్రపూర్ణ బిరుదు నిచ్చింది. నిజమైన కళా తపస్వి నటరాజ రామకృష్ణగారు.

అలాగే విజయనగరానికి చెందిన డి. వై. సంపత్‌కుమార్, దువ్వూరి జగన్నాథశర్మ వద్ద నృత్యం నేర్చుకుని గీతాంజలి, నృత్యాంజలి సంస్థలను స్థాపించి, శాస్త్రీయ జానపద రీతుల్ని వెలుగులోకి తీసుకువచ్చి, రాధాకృష్ణన్‌లాంటివారి ప్రశంసల నందుకున్నారు. ఆంధ్ర జాలరి నృత్యాన్ని 1968 లో బెర్లిన్ అంతర్జాతీయ యువజనోత్సవాలలో ప్రదర్శించి బంగారు పతకాన్ని అందుకున్నారు. జానపద నృత్యాలను ప్రచారంలోకి తీసుకువచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం, కళాప్రపూర్ణ బిరుదు నిచ్చి సత్కరించింది.

పైవారే కాక, రాజారెడ్డి, రాధారెడ్డి బృందం ఢిల్లీని కేంద్రంగా చేసుకుని కూచిపూడి నృత్యాన్ని ఇతర దేశాలలో ప్రదర్శించి ప్రఖ్యాతి వహించారు.

కూచిపూడి నృత్యంలో రాజసులోచనకు ప్రత్యేక స్థానముంది. సినీనటిగా, నర్తకిగా ఆమె ఒక బృందాన్ని ఏర్పాటుచేసి, శిక్షణ విచ్చి కూచిపూడి నృత్యానికి మంచి పేరు తీసుకువచ్చింది.

అలాగే రత్నపాప, పతివాడ రాధిక, కనకదుర్గ, ఉమాభారతి, అన్నపూర్ణ, సుమతీకౌశల్, శోభానాయుడు, యడవల్లి రమ, చంద్రకళ, కళ్యాణి, మంజుభార్గవి మొదలైన ఎంతోమంది కూచిపూడి నృత్యకళకి ప్రాణం పోశారు. మరెందరి పేర్లో ఉదహరించలేకపోయినందుకు విచారిస్తున్నాను. కావాలని ఎవరినీ విస్మరించలేదు. ప్రతిభావంతులు మరుగునపడి వుండవచ్చును.



రాజసులోచన

ఈ నాడు రాష్ట్రవ్యాప్తంగా ఎంతోమంది కూచిపూడి నృత్య విద్యాలయాలను స్థాపించి శిక్షణ ఇస్తున్నారు. కాని ఈ శిక్షణాలయాలను ప్రతిభావంతులు కానివారుకూడా నడుపుతూ కూచిపూడి నృత్యకళకు అపకీర్తి తెస్తున్నారు. ఏది ఏమైనా కూచిపూడి నృత్యంతో పాటు వారి యక్షగాన కళనూ, వీధి నాటకాలనూ, పగటివేషాలనూ సంప్రదాయ పద్ధతిలో రక్షించడం ఎంతైనా అవసరం.



# ప్రజలు మెచ్చిన బయలు నాటకాలు

జానపద కళాకారు లందరూ, జానపద కళారూపాలను వీథుల్లోనే ప్రదర్శించేవారు. పల్లెలో వుండే విశాల బహిరంగస్థలమే వారి రంగస్థలం.



అయితే ఇలాంటి ప్రదర్శనాలను రాయలసీమ ప్రాంతంలో బయిల్నాటకా లంటారు. యక్షగానాలనూ, వీథి నాటకాలనూ బయలు నాటకా లనే పిలుస్తారు.

## గరుడాచల మహాత్మ్యం :

గరుడాచల మహాత్మ్యంలోని ఇతివృత్తాన్ని, పాటల్ని తీసుకుని జానపదులు ఈ నాటకాన్ని ప్రదర్శిస్తారు. ఇందులో నాటకం, నృత్యం రెండూ కలిసివుంటాయి. హార్మోనియం, గజ్జలు, తాళాలు మాత్రమే ప్రదర్శనంలో ఉపయోగిస్తారు.

ఈ నాటకంలో సింగి నాయకుడు—రంభ—ఊర్వశి, నరసింహస్వామి—ఆదిలక్ష్మి, చెంచులక్ష్మి, ఎరుకలసాని (సింగి), సింగడు, ద్వారపాలకులు వుంటారు. వారే కిరీటాల్ని—భుజకీర్తులను తయారుచేసుకుంటారు. పురుషులే స్త్రీ పాత్రలను ధరిస్తారు. పాత్రధారు లందరూ వేషాలు ధరించిన తరువాత మిగిలినవారు వంతలుగా నిలబడతారు. ప్రతి పాత్రధారీ ప్రవేశించి గుండ్రంగా తిరుగుతూ వయ్యారంగా చేతులు వూపుతూ, కూర్చుని లేస్తూవుంటారు.

నరసింహస్వామి పాత్రధారి ఠీవిగా చేతుల్ని త్రిప్పుతూ, రౌద్ర రూపంలో అడుగులు వేస్తూ కళ్ళుప్పగించి చూడటం అభినయిస్తాడు. నరసింహస్వామితో ఆదిలక్ష్మి, చెంచులక్ష్మిల సంవాదం. అతను ఏమీ తెలియనివానివలె ఉండటం, చెంచులక్ష్మి ఈ విషయాన్ని ఎరుకలసాని (సింగి) ఆదిలక్ష్మికి చెప్పటం ముఖ్యమైన కథ. ఇంకా సింగి నాయకుల బిడ్డలుగా, రంభ, ఊర్వశులు చిత్రీకరించారు. దీంట్లో సింగి, సింగడు సన్నివేశంలో పాడుకునే రెండు గేయాల్ని పరిశీలించటం జరుగుతోంది.

## సింగి, సింగడి సంవాదం :

సింగని భార్య సింగి ఇంటికి వచ్చి, సింగణ్ణి ఇలా నిలదీస్తుంది. మేకల్ని, గాడిదల్ని, ముసలిదాన్ని, పిల్లల్ని వదలివచ్చావ్. అని అడగడంతో సింగడి సమాధానాలు చాలా ఆసక్తిదాయకంగా వుంటాయి. వారి సంవాదం ఇలా వుంటుంది.

సింగి :

మేకలన్ని యాడ యిడిచి
ఎప్పు డొస్తివిరా సింగా.
నువ్వెప్పుడొస్తివిరా సింగా.

సింగడు :

మేకలన్ని కొండకు తోలి
కత్తె కొరకను కావలి పెట్టి
ఇప్పుడు వత్తినే సింగి.
నే నిప్పుడె వత్తినే సింగి.

సింగడు :

కట్టుకున్న పట్టుచీర
ఎటుల వచ్చెనే సింగి
ఎటుల వచ్చానే

సింగి :

వూరిలోని అమ్మగారికి
అడిగినట్లా గద్దె సెప్పి
తెచ్చుకున్న పట్టుచీరకు
వాదులేలారా సింగా, గుద్దులాటేలా

సింగడు :

ముక్కులోని ముక్కురాయి
యట్ల వచ్చానే సింగీ నీకు,
యట్లా వచ్చానే సింగీ.

సింగి :

కమస లింటికి నేనే బోతి
వప్పగానే గద్దె సెప్పి
తెచ్చుకొన్న సొమ్ములాకె
వాదులాటేరా సింగా,
గుద్దులాటేరా.

ఇలా, సింగీ, సింగని మధ్య వాదోపవాదాలు జరుగుతాయి. ఈ సంవాదం వ్యంగ్యానికి తావిచ్చేదిగా వుంటుంది.

## సందకాడ, నరసింహులు :

ఈ నాటకాన్ని తెల్లవార్లూ ప్రదర్శిస్తారు. నరసింహుని పాత్రను ఇద్దరు వేయటం ఆచారం. వీరిని సందకాడ నరసింహుడు, తెల్లవారుజామున నరసింహుడు అని అంటారు.

ఇద్దరు నరసింహుల గురించి ఒక ఆసక్తికరమైన విషయం ఇలా ప్రచారంలో వుంది—సందకాడ నరసింహుని కథ జరుగుతుండగా, వేషం వేసుకున్న తెల్లవారి నరసింహుడు, ప్రక్కనే వున్న ఎరువు బండిపై నిదరపోయాడట. ఇంతలో రైతు వచ్చి బండి కట్టి పొలంలో ఎరువు వదిలాడు. ఎరువుతో క్రిందపడ్డ నరసింహుడు మేల్కొని—వచ్చే చెంచీతా చూడరే, అంటూ పాడేసరికి భయపడిన రైతు వెంటనే వచ్చి, సమాజంవారికి చెప్పగా, అప్పటికే తెల్లవారి నరసింహుని కోసం వెతికి వేసారి, సందకాడ నరసింహునితోనే నాటకం పూర్తిచేశారని, ఈనాటి పెద్దలు చెపుతారని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు వారి జానపద నృత్యకళా గ్రంథంలో ఉదహరించారు.



## కళాకారులు :

ఇలాంటి బయలు నాటకాలు రాయలసీమప్రాంతంలో ఇంకా ప్రదర్శింపబడుతూనే వున్నాయి. ఈ నాటకాల్లో ప్రసిద్ధిచెందిన నటులు సింగినాయకుడు, మాలచంద్రప్ప—రంభ—కుమ్మరి నారాయణ—ఊర్వసి - చాకలి గంగన్న-నరసింహస్వామి—కుమ్మరి నారాయణస్వామి—ఆదిలక్ష్మి

హరిజన నాగన్న-చెంచులక్ష్మి, మాల నాగప్ప-సింగి, కుమ్మరి నారాయణ, సింగడు-కుమ్మరి నారాయణస్వామి మొదలైనవారు. అనంతపురం జిల్లా - ధర్మవరం తాలూకా, సుబ్బరావుపేట గ్రామంలో వున్నారు.

# జంఖండీ వీథి నాటకం

మహారాష్ట్రం నుండి ఆంధ్రదేశం వచ్చిన సురభి కళాకారులు, తొలిరోజుల్లో ఊతపట్టల బొమ్మలాటల్నీ, జంఖండీ నాటక ప్రదర్శనాలను ప్రదర్శించారు.

ఖండే అనే ఆయన మహారాష్ట్ర కళాకారుడు. ఈ నాటకరూపాన్ని ప్రారంభించడంవల్ల ఈ నాటకానికి జంఖండీ నాటకమని పేరు వచ్చింది. ఏ రామాయణాన్నో, భారతాన్నో ప్రదర్శించాలనుకున్నప్పుడు, కావలసిన పాత్రధారులందర్నీ కొద్ది కొద్ది వేషధారణ మార్పులతో రంగస్థలంమీద కూర్చోబెట్టి, రామాయణాన్ని భాగాలు భాగాలుగా ప్రదర్శించేవారు. రంగస్థలంమీద కూర్చున్న ఏ పాత్రా మాట్లాడదు.

ఖండేగారు రాముని పాత్ర దగ్గర కొచ్చి శ్రీరామచంద్రులవారు, ఏమంటున్నారండీ అని రాముని సంభాషణలు తానే పలికి అన్నగారైన రామచంద్రుల వారి మాటకు తమ్ముడు లక్ష్మణస్వామి ఏమి బదులు చెపుతున్నారంటే, అంటూ వివిధ పాత్రలకు ఆయనే సంభాషణలనూ, శ్లోకాలనూ, పాటలనూ వల్లించేవాడు. మధ్య మధ్య విసుగు లేకుండా అనేక సామెతలూ, గమ్మత్తులూ, ప్రజల అలవాట్లు నీతులూ చెప్పి రంజింప చేసేవారు. ఖండేగారు మంచి మాటకారి, బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఎప్పుడైతే ఆంధ్రదేశంలో ప్రతకాల్సి వచ్చిందో దాని ప్రాముఖ్యాన్ని గుర్తించి, తెలుగు నేర్చుకుని తెలుగువారిని ముగ్ధులను చేశాడు.

జంఖండీ నాటక ప్రదర్శనంలో రెండు రకాల వాయిద్యాలు వుండేవి. ఒకటి కోలుతో చేయబడ్డ శ్రుతి బూర, రెండవది ఒక పెద్ద పళ్ళెంమీద ఒక పుల్లను హరించడం ద్వారా ఒక శ్రావ్యమైన ధ్వనిని తెప్పించేవారు. ఈ ధ్వని ప్రేక్షకులకు ఎంతో ఆనందాన్ని కలిగించేది. ఈ నాటకానికి తెర లేదు. స్త్రీ పాత్రలు కూడా పురుషులే. ముఖాలంకరణకు అర్దళం, మసిబొగ్గు, మీసాలకు గడ్డాలకు జనపనార ఉపయోగించేవారు. ఇలా ఖండేగారి వీథి నాటకాలు కొంతకాలం నడిచాయి.

# తమ్మారపు వెంకటస్వామి వీధి నాటకాలు

కూచిపూడి భాగవతులు వీధి నాటక ప్రదర్శనాలతో ఆంధ్రదేశం అంతటా విజయ యాత్ర సాగిస్తున్న రోజుల్లో అంత వుత్తమం గానూ వీధి నాటకాలు ప్రదర్శించి సెహబాస్ అనిపించు కున్న వ్యక్తి శ్రీ తమ్మారపు వెంకటస్వామి.



ఆయన స్వగ్రామం ఒంగోలు తాలూకాలోని తమ్మ వరం. ఆయన దేవదాసి కులానికిచెందిన వ్యక్తి. బాల్యంలో ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తిచేసిన వెంటనే ఆ గ్రామం లోని కుందుర్తి వారివద్ద సంస్కృతం నేర్చుకుని తరువాత పగటివేషాలను అద్భుతంగా ప్రదర్శించి ఆ తరువాత కట్టు దిట్టమైన వీధి నాటక సమాజాన్ని నడిపిన దిట్ట.

## జట్టులో కట్టుబాటులు :

వెంకటస్వామి జట్టులో చేరిన వారందరూ కళావంతుల కులానికి చెందిన వ్యక్తులే ఆయన జట్టులో పురుషలు పురుషపాత్రలు, స్త్రీ పాత్రలు స్త్రీలు ధరిస్తూ వుండేవారు. అందరిదీ అమ్మనబ్రోలు గ్రామమే. అందులో పెద్ద హనుమయ్య నాయక పాత్రలను చెల్లయ్య, చిన్న హనుమయ్య, మాణిక్యం ఇతర పాత్రలు ధరించే వారు. అలివేలమ్మ నాయక పాత్రలు నిర్వహిస్తూ వుండేది. మంగ తాయమ్మ మాత్రం పురుష పాత్రలు ధరించేది.

ఈ జట్టు ధేనువుకొండ వెంకయ్య రచించిన ఉత్తర గోగ్రహణ నాటకాన్ని అమ్మనబ్రోలు వాస్తవ్యులు నాగినేని వెంకటప్పయ్య వ్రాసిన హరిశ్చంద్ర నాటకాన్ని ప్రదర్శిస్తూ వుండేది. అవిగాక శశిరేఖా పరిణయం, ఉషాపరిణయం, నలచరిత్ర, భామాకలాపం, గొల్లకలాపం మొదలైన ప్రదర్శనాలను కూడా కొనసాగిస్తూ వుండే వారు.

## జట్టు జట్టంతకూ చక్కని విందు :

వెంకటస్వామి జట్టు ఒక వూరిలో ప్రదర్శనాలు ప్రారంభిస్తే ఇక రోజుల తరబడి ఆ గ్రామంలోనే వివిధ నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవారు. ప్రతి ప్రదర్శనా

నికీ నాలుగు రూపాయ లిచ్చేటట్లూ ఇంటికి ఒకరు చొప్పున జట్టులోని వాళ్ళకు భోజనాలు పెట్టేటట్లు ఏర్పాటు జరగగానే ప్రదర్శనం జరుగుతూ వుండేది.

ఆ జట్టులో సత్యభామ పాత్రధారిణి అలివేలు చాలా అందకత్తె కావటంవల్ల ప్రతివాళ్ళు ఆమెనే భోజనానికి ఆహ్వానిస్తూ వుండేవాళ్ళట. ఆమె అందుకు అంగీకరిస్తే విందు షడ్రసోపేతంగా జరిగేదట. ఈ సంగతి గ్రహించిన వెంకటస్వామి ప్రతి ఇంటివారికీ, సత్యభామే భోజనానికి వస్తుందని చెప్పి వచ్చేవాడట. ఆ విధంగా ఆ జట్టులోని వాళ్ళందరికీ జక్కని విందు అందేదట.

## ప్రదర్శన ప్రారంభం :

నాటక ప్రదర్శనం నాడు రంగస్థలానికి ముందు వరుసలో కరణం, మునసబు ఆదిగా అన్ని వర్గాలవారూ కూర్చునేవారట. సాధారణంగా ఈ జట్టు ప్రదర్శనలు భాగవతంతో ఆరంభమయ్యేవి, అందులో ముఖ్య పాత్రలు శ్రీకృష్ణుడు, సత్యభామ, గొల్లభామ, సుంకరి కొండడు.

ఈ పాత్రలు తెర వెడలే ముందు రంగస్థలానికి రెండుప్రక్కలా రెండు దివిటీల్ని పాత్రధారుల ముఖాలకు దగ్గరగా వుంచి వాటిపై గుప్పెడు గుగ్గిలం చల్లేవారు. ఆ వెలుగులో శీవిగా విఱ్ఱవీగుతూ పాత్రలు రంగస్థలంలో ప్రవేశించేవి. ఆనాటి రంగస్థలానికి యవనిక. అడ్డంగా పట్టే వెడల్పయిన గుడ్డ మాత్రమే వేషధారణలో ఉపయోగించే ఆభరణాలన్నీ తేలిక కొయ్యతో కాకి బంగారం అంటింపులతో తయారయ్యేవి.

## పండితులకు పాత్రధారుల సవాలు :

ఆ కాలంలో వీథి నాటకాల్లో సత్యభామ తన జడను తెర వెలుపల వేయడం. సభలో కూర్చున్న పండితులు భాగవతం విషయమై ప్రశ్నిస్తే జవాబు చెప్పగలనని సత్యభామ పాత్రధారిణి సూచించటం ఒక సంప్రదాయంగా వుండేది. ఈ సూచనకు పండితులు ఆగ్రహించి భాగవతం పద్యాలకూ కృష్ణ కర్ణామృతంలోని శ్లోకాలకూ భావార్థాలు చెప్పమని అడిగేవారు.

అలివేలమ్మ వాటిని క్షుణ్ణంగా వల్లించేది పండితులు అంతటితో తృప్తిచెందక ఆమెకు భరత శాస్త్రం, అలంకార శాస్త్రం గురించి ప్రశ్నలు అందించేవారు. వాటికి

ఆమె తృప్తిగా జవాబు చెప్పగానే కొందరు పండితులు ఆమెను ప్రశంసించేవారు. మరి కొంతమంది తృప్తిపడకుండా ఆమెపై మంత్ర తంత్రాలు ప్రయోగించేవారు. అందుచేత ప్రతి నాటకం జట్టులోనూ ఒక మంత్ర శాస్త్రవేత్త వుండి ఇటువంటి మంత్ర ప్రయోగాల్ని విఫలీకృతం చేసేవారు.

నాటక ప్రదర్శనానంతరం అందరూ ఆ వేషాలతోనే గ్రామంలోని ప్రతి గడపకూ వెళ్ళి చీరలూ, ధోవతులు దండుకునేవారు. ప్రదర్శనం చూసి ముగ్ధులైన గ్రామస్థులు ఎంతో ఆదరంతో వాళ్ళకు బహుమతులు ఇచ్చేవారు. ఈ విధంగా వెంకటస్వామి వీధి నాటకాల ప్రదర్శనలతో అరవై సంవత్సరాలు కళాసేవ చేసి ఎనభైవ ఏట తమ్మవరంలో మరణించాడు.

# మాల నాటకములు

కూచిపూడి భాగవతులు వీధి నాటకాలను ఉధృతంగా ప్రదర్శిస్తున్న రోజులలో ఆయా కులాలవారు కూడా వీధి నాటకాలను ప్రదర్శిస్తూ వుండేవారు. అలా యానాదులు, గొల్లలు, చెంచులు నాటకాలను ప్రదర్శిస్తూ వుండేవారు. అలాగే మాలవారు కూడ వీధి నాటకాలను ప్రదర్శించేవారు.

అలాంటి నాటకాలను నా చిన్నతనంలో చూశాను బయట వూరి నుండి వచ్చి, ఊరి వెలుపల పందిరి వేసి నాటకాలను ప్రదర్శించేవారు. అగ్రజాతులు తప్పా ఇతర కులాల వారందరూ ఆ నాటకాలను తిలకించేవారు.

ముఖ్యంగా వారు రామాయణానికి సంబంధించిన నాటకాలను ఆడేవారు. రాముడు, సీత, లక్ష్మణుడు, హనుమంతుడు మొదలైన పాత్రలు ధరించి నాటకాలాడేవారు.

ఆయా పాత్రలు ధరించే పాత్రలు మాత్రం అంత అందంగా వుండేవి కావు. మాసిపోయిన దుస్తులతో లక్కతో చేసిన రంగుల ఆభరణాలను ధరించేవారు. కాళ్ళకు గజ్జెలు కట్టుకుని కీర్తనలు పాడుతూ పాటకు తగిన విధంగా నృత్యంచేస్తూ రంగస్థలం మీద కలియ తిరిగేవారు. వారి నృత్యానికి అనుగుణంగా తప్పెట్లు తాళాలతో హంగు చేసేవారు. హార్మోనియం హంగుగా వుండేది. వారు పాడే పాటకు తలా తోక వుండేదికాదు. రామాయణ



కథను కీర్తనలుగా పద్యాలుగా వారి వారి ఇష్టప్రకారం కవనం చేసి పాడేవారు ఆయా ఘట్టాలలో కేకలు వేసి ప్రేక్షకులను ఉత్తేజపర్చేవారు. ఈ నాటకాలను ప్రదర్శించే మాలవారు బ్రాహ్మణులను ఆశ్రయించేవారు కారు.



పాత్రలనన్నిటినీ పురుషులే ధరించేవారు. సీతారామ లక్ష్మణులఅరణ్యావాసము, లక్ష్మణ మూర్ఛ, సీతమ్మ శోకము ప్రదర్శించేవారు. సీతమ్మ శోకం ప్రదర్శించేటప్పుడు ప్రేక్షకులు కళ్ళ వెంట నీరు పెట్టుకునేవారు. ఒకనాటి ప్రదర్శనానికి ప్రదర్శకు లందరికీ ఇంటికొకరి చొప్పున భోజనం పెట్టి వడ్లు, దుస్తుల్ని ఇచ్చేవారు. ఆ రోజుల్లో వారు గ్యాసులైట్లు భరించలేక, ఆముదపు దివిటీల వెలుతురులో ఈ నాటకాలను ప్రదర్శించేవారు. దివిటీలకుగాను ఆముదాన్ని నాటకాన్ని ఆడించేవారే ఇచ్చేవారు. ఆ రోజుల్లో పేదవారికి ఈ ప్రదర్శనాలు కన్నుల పండువుగా వుండేవి. తెల్లవారేవరకూ ప్రదర్శించి తెల్లవారి ఇళ్ళకు వెళ్ళి యాచించేవారు.

# యానాదుల భాగవతాలు

ఆంధ్ర దేశంలో కూచిపూడి వీథి భాగవతాలు రాష్ట్ర వ్యాపికంగా ప్రచారం పొందాయి. అయితే ఆయాప్రాంతాలలో తూర్పు భాగవతమనీ, చిందు భాగవతమనీ, గొల్ల భాగవతమనీ, మాల భాగవతమనీ, ఇలా ప్రాంతీయంగా కులాలవారీగా భాగవతాలు ప్రచారంలోకి వచ్చాయి. అలా ప్రాంతీయంగా ప్రాచుర్యం పొందిన కళారూపమే యానాదుల భాగవతం కేవలం యానాదులు భాగవతాలకే పరిమితంకాక వివిధ కళారూపాలను కూడా ప్రదర్శిస్తారు.

ఈ తరం వారికి తెలియకపోవచ్చును గానీ, నా చిన్నతనంలో, ఏంవిటిరా ఆ యానాది కళలూ, యానాది గంతులూ, యానాది చిందులూ, అనే మాటలు వింటూ ండేవాడిని. దీనిని బట్టి యానాదుల కళలు కొన్ని వున్నాయనీ, మనం అర్థం సుకోవచ్చును.

అయితే ఈ యానాదులు ఆంధ్రదేశ మంతటా వున్నారని మనం చెప్పలేము. యానాదులు ఎక్కువగా, నెల్లూరు గుంటూరు జిల్లాలలో ఎక్కువగా వున్నారు. వీరి అసలు వృత్తి ఒకప్పుడు బందిపోటు దొంగల బారినుండి గ్రామాలను కాపాడే కావలా యడం. రాత్రిళ్ళు ఊరంతా వీధుల్లో తిరగటం పొలాలవద్ద పంటలను కాపాడటం.

ఒకనాడు కూచిపూడి భాగవతుల ప్రభావం, అనేక జాతులమీదా, కులాలమీదా పడినట్లే ఒక నాటక సమాజాన్ని చూచి, అనేక సమాజాలు ఉద్భవించినట్లే యానాదుల మీద కూడా ఆ ప్రభావం పడింది.

## యానాది భాగవతులు :

యానాదుల్లో ఉత్సాహవంతులైన యువకులు ఒక ప్రక్క వూరి కాపలా చూసుకుంటూ భాగవతాలు నేర్చుకుని, జట్టులు జట్టులుగా, ఏభై సంవత్సరాల క్రితం, సర్కారు జిల్లాలలో ప్రదర్శనాలు ఇస్తూ వుండేవారు. యానాది భాగవతుల్లో కుటుంబమంతా భాగవతాల్లో పాత్రలు ధరించేవారు. ఆనాడు ముఖ్యంగా కూచిపూడి భాగవతుల్లో పురుషులే స్త్రీ పాత్రలు ధరించేవారు.

యానాది భాగవతాల్లో ముఖ్యంగా స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించడంవల్ల ప్రేక్షకుల్ని అధికంగా ఆకర్షించేవారు. దాదాపు జట్టులోని వారందరూ పాత్రలు ధరించినా, ఏదో ఒక వాయిద్యాన్ని కూడా వాయించగలిగేవారు. ముఖ్యంగా వీరి నాటకాల్లో ప్రతి పాటకూ నృత్యం చేసేవారు. ఆ నృత్యం సున్నితంగా కాక కొంచెం మొరటుగా వుండేది. చిందులు మాత్రం ఉధృతంగా త్రొక్కేవారు, అందుకే యానాది చిందులనే పేరు వచ్చిందేమో.

ఏభై సంవత్సరాలనాడు, నెల్లూరు జిల్లా నుంచి బెందాళం గరవయ్య, ముతరాజు నర్సయ్య అనే పురుషులూ, చింతపువ్వు మాణిక్యమనీ, పెద మాణిక్యమనీ, చినమాణిక్యమనీ అందమైన యువతులు స్త్రీ పాత్రలు ధరించేవారు. శ్రావ్యంగా పాడుతూ, చిందులు త్రొక్కేవాళ్ళు. ఒక్కో గ్రామంలో బజారు బజారుకూ ప్రదర్శన లిచ్చి, పారితోషికాలు అందుకుంటూ వుండేవారు.

## పూట భోజనం, పది రూపాయలు :

ఒకరాత్రి ప్రదర్శనానికి, రాత్రిపూట అందరికీ భోజనాలు పెట్టి పది రూపాయలిస్తే చాలు. ప్రదర్శనం తెల్లవార్లూ జరిగిపోతుంది. వీరి ప్రదర్శనాలు అంత శాస్త్రయుక్తంగా లేకపోయినా ముఖ్యంగా యవ్వనంలో వున్న స్త్రీ పాత్రల అభినయమూ, సంగీతమూ ప్రేక్షకుల్ని మాత్రం అమితంగా ఆకర్షించాయి.

వీరు ప్రదర్శించే భాగవతాలు, ఉషాపరిణయం, కృష్ణలీలలు, సావిత్రి, శశిరేఖా పరిణయం మొదలైనవి ప్రచారం పొందాయి. వీరి వాయిద్యాలు - మద్దెల - తాళాలు—

శృతిపక్వమైన హార్మోనియం, వీరి ముఖానికి రంగులు, అర్ధళం, గంగసింధూరం, కాటుక, దుస్తులు, పూసల కోట్లు మొదలైనవి. ప్రదర్శన కాలం, ప్రారంభించింది మొదలు తెల్లవార్లూ ప్రదర్శించేవారు. ఈమధ్య వీరి భాగవత ప్రదర్శనాల ప్రభావం చాలా తగ్గిపోయింది.



## యానాదుల వేషాలు :

ముఖ్యంగా ఈనాటికి కూడా ఆంధ్రదేశంలో పట్టణాలలోనూ, పల్లెలలోనూ దసరాపండుగ దినాలలోనూ, చిత్రవిచిత్రమైన వేషాలను చూస్తూనే వున్నాం.

అలాగే యానాదులు కూడా పండుగకు చిత్రవిచిత్రమైన వేషాలు ధరించి చిందులు వేస్తూ వుంటారు. ఇది ఒక ప్రదర్శనంగా వుండదు. ఇంటింటికీ తిరుగుతూ వ్యాచిస్తూ వుంటారు.

ముఖానికి రంగులు పూసుకుని రాగాలను తీస్తూ, చిందులుతొక్కుతారు. కొంత మంది గుర్రపు తలను ధరించిన డమ్మీ గుర్రాలలో దూరి వెనక్కూ ముందుకూ, తాళం ప్రకారం గుఱ్ఱపు నృత్యం చేస్తారు.

ముఖ్యంగా యానాది వేషాలలో చెంచులక్ష్మి, నారసింహుల పాత్రలూ, శ్రీకృష్ణుడూ, దుర్యోధనుడూ, భీముడూ, శివుడూ, రాముడూ మొదలైన పాత్రలు ధరిస్తారు.

వీరి పాత్రలకు కిరీటాలుగా అట్ట కిరీటాలనూ, కాగితపు పిండితో తయారు చేసిన గదల్ని ధరించి, ఆ యా పాత్రల ప్రగల్భాలతో ఒక పాత్రమీదకు మరొక పాత్రధారి లంఘిస్తూ వుండేవారు.

వారు ధరించే దుస్తులు పాత్రకు ఔచిత్యం ఏమీ వుండదు. ముఖం చూస్తే కృష్ణుడైనా ప్యాంట్లు తొడిగి బూట్లువేసే కృష్ణుణ్ణి యానాది వేషాల్లోనే చూడగలుగుతాము. రాముడు పాత్రధారి కోటు తొడుగుతాడు. ఇలాంటి అస్తవ్యస్త వేషధారణతో హాస్యాన్ని గుప్పించి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించేవారు. అందువల్లే యానాది వేషాలు వేయకు, యానాది చిందులుతొక్కకు అనే మాటలు పుట్టాయేమో తెలియదు. కాలం మారినకొద్దీ ఆ యా జాతుల కులాలకు సంబంధించిన సాంప్రదాయ కళారూపాలన్నీ క్రమేపే నశించిపోతున్నాయి. అయితే ఆ నశించిపోయే కళారూపం

యొక్క వేషభాషల్నీ సంగీత నృత్యబాణీలనూ, వైనాలనూ రక్షించటం ఎంతైనా అవసరం.

# వెన్నెల నాటకాలు

పూర్వం ప్రతి వైశాఖ పౌర్ణమికీ ఆరుబయట నిండు వెన్నెలలో రెండు మూడు రోజులు ఈ వెన్నెల నాటకాలు ఆడుతూ వుండేవారు. వీటిని రాస నాటకా లనేవారు. బందరులో కానుకొల్లు నరసింహంగారు బృందావనపురం ప్రాంతంలో ఈ రాసలీలలు ప్రదర్శించటంవల్లనే ఆ ప్రదేశానికి బృందావనపురమని పేరు వచ్చింది. భజనగీతాల మాదిరి భాగవతంలోని భ్రమరగీతాలను పాడేవారు.

ఈ ప్రదర్శనాలకు వెన్నెలలో, ఇసుకదిబ్బలమీద తులసికొమ్మలు పాతి, ఆ తులసికొమ్మల చాటున గోపికాలీలలు ప్రదర్శించేవారు. తులసి అంటే బృంద. అందుకే వాటిని బృందావనగీతా లనేవారు. ఇందులోని నటీనటులు! ఆ యా కుటుం బాలకు సంబంధించిన బాలబాలికలు, బాలు లందరూ కృష్ణులుగానూ, బాలికలందరూ గోపికలుగానూ, అందరూ ఒకేరకమైన బట్టలు ధరించేవారు.

## జడ కోలాటాల కోలాహలం :

ఆ రోజుల్లో బందరులో పెద్ద పెద్ద పందిళ్ళలో జడ కోలాటాలు వేసేవారు. ఆ కోలాటాలు వేసే వారందరూ రాసనాటకాలకు ప్రేక్షకులుగాను వారి పిల్లలు నటీనటులు గాను వుండేవారు. ప్రదర్శనలు ఒక ఎత్తు దిబ్బ మీద జరుగుతూ వుంటే చుట్టూ ఎత్తుగా గ్యాలరీ మాదిరి ఇసుక తిన్నెలను ఏర్పాటు చేసేవారు.

ఒక ప్రక్క తంబురా హార్మోనియం, మద్దెల మొదలైన వాటి శ్రుతితో భజన లకు సంబంధించిన భజనపరులు గోపికా గీతాలను పాడుతూ వుంటే బాలనటు లందరూ రాధాకృష్ణులుగానూ, కృష్ణులూ గోపికలుగానూ అభినయిస్తూ వుండేవారు పాట వచ్చిన పిల్లలు పాట కూడా పాడుతూ వుండేవారు. ఈ ప్రద ర్శనం చూడటానికి కొంతమంది ప్రేక్షకులు ప్రక్కనున్న చెట్లెక్కి కూర్చునేవారు. ఈ ప్రదర్శనాలకు దాదాపు వెయ్యిమంది ప్రేక్షకులు హాజరయ్యేవారు. వీటిని చిలకలపూడి ప్రాంతంలోకూడా ప్రద ర్శించేవారు.



# పేరెన్నికగన్న పేరిణి తాండవ నృత్యం

పరమశివుడు పార్వతి ప్రీతికోసం రజతోత్సవ సమయంలో కైలాసగిరిలో ప్రదర్శించిన తాండవాలలో పేరిణి తాండవము ముఖ్యమైనది.

పేరిణి శివతాండవం వీర నాట్యశైలికి చెందింది. వీరావేశంతో చేసే తాండవమిది. దక్షయజ్ఞ దండకం చదువుతూ నారసాలు పొడుచుకుని, 'శరభ శరభ అశ్శరభ శరభ అంటూ పరవళ్ళు తొక్కుతూ వీరభద్ర పళ్ళెం పట్టి, తాండవం చేసే ఈనాటి వరముష్టివారిని ఉదాహరణగా తీసుకుంటే నాటి పేరిణి శైలి ఎటువంటి విశిష్టమైనదో మనకు అర్థమౌతుంది.



ఆంధ్రుల చరిత్రలో అత్యంత సిద్ధిగాంచిన ఓరుగంటి కాకతీయ చక్రవర్తులు, క్రీ॥శ॥ 1050 మొదలు 1350 వరకూ దాదాపు మూడువందల సంవత్సరాలు రాజ్యపరిపాలన చేశారు. ఆంధ్రదేశ చరిత్రలో కాకతీయులు వర్ధిల్లినకాలం మహోజ్వలమైంది.

## రమణీయమైన రామప్ప గుడి :

శిల్పకళా నిర్మితమైన రామప్పగుడి వరంగల్ జిల్లా, ములుగు తాలూకాలో వుంది. ఇది వరంగల్‌కు నలభై మైళ్ళ దూరంలో వుంది. ఈ గుడిని 1162 లో రుద్ర

పేనాని అనే రెడ్డి సామంతుడు కట్టించాడు. రామప్ప గుడి ఆలయ నిర్మాణంలోని చిత్రకళా కౌశలం శిల్పనైపుణ్యం వర్ణించ నలవికానివి. ఈ కాకతీయ శిల్పచాతుర్య మంతా, ఇన్నేళ్ళు గడిచినా ఈ నాటికీ చూపరులకు ఆనందాన్ని కలిగిస్తూ వుంది. భరత నాట్యమంతా మూర్తీభవించి స్తంభాలమీదా, కప్పులమీదా కనబడుతూ వుంది.

## జాయప సేనాని :

కాకతి గణపతిదేవ చక్రవర్తి కటాక్షానికి పాత్రుడైన జాయప తన స్వయం శక్తివల్ల సేనాని కాగలిగాడు. ఈయన వీరుడే కాక కళాకారుడు కూడా.

జాయపకు నృత్యాలంటే అత్యంత అభిమానం. స్వయంగా నృత్తరత్నావళిని రచించాడు. ఈ నృత్తరత్నావళి భారతీయ నృత్యకళాసంపదకు, ఆభరణం లాంటి దని నృత్యశాస్త్రవేత్తల అభిప్రాయం. సంస్కృత భాషలో ఆంధ్రులు రచించిన ప్రప్రథమ నృత్యశాస్త్ర గ్రంథం ఇదేనని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలియ జేశారు.

గణపతిదేవ చక్రవర్తి జాయప యందు అత్యంత ఆదరాభిమానాలతో అతనికి సకల విద్యల్నీ, కళలనూ నేర్పించాడు. ఆ తరువాతనే జాయప అత్యుత్తమైన, అత్యున్నతమైన నృత్తరత్నావళి రచనకు పూనుకున్నాడు. దానిని క్రీ॥శ॥ 1253-54 ప్రాంతాల్లో పూర్తిచేశాడు.

## మేటి నాట్య గ్రంథం :

నృత్తరత్నావళిలో. మార్గదేశి నృత్యాలు. రెండూ కలిసినట్టుగా నడిచాయి. ఇందులో ఎనిమిది అధ్యాయా లున్నాయి.

జాయప నృత్త రత్నావళిలో తన కాలంలో ప్రచారంలో వున్న దేశి నృత్యా లన్నిటినీ ఆమూలాగ్రంగా చిత్రించాడు. ఎనిమిది అధ్యాయాలు గల ఈ గ్రంథంలో చిట్టచివరి మూడు అధ్యాయాలూ, దేశి నృత్య సంప్రదాయాలైన, పేరణి ప్రేంఖణం. రాసకం, చర్చరి, నాట్యరాసకం, దండరాసకం, శివప్రియం, చిందు, కందుకం, ఖాండికం ఘంటసరి, చరణము, బహురూపము. కోలాటం మొదలైన అనేక జానపద నృత్యాలను వివరించాడు.

జాయప నృత్తరత్నావళిలో వివరించిన నాట్య సాంప్రదాయానికి అను గుణంగా శిల్పి రామప్ప, అత్యద్భుతంగా నాట్య శిల్పాలను మలిచారు. సజీవకళ వుట్టి పడే ఆ నల్లరాతి నాట్యశిల్పాలు, శృంగార, వీరలాశ్యాలతో తొణికిసలాడుతున్నాయి. ముఖ్యంగా పురుషవిగ్రహాలు, వీరరసాన్ని వెల్లడిస్తూవుంటే, స్త్రీమూర్తులు లాస్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

నృత్తరత్నావళిలో వివరించిన నాట్య రీతులన్నీ వాటి వైనా లేమిటో మనకు తెలియకపోయినా, ఈనాడు అవి ఆచరణలో లేకపోయినా, ఒక్క పేరిణి, నృత్యాన్ని వెలికితీయడానికి, ఎంతో పరిశోధన చేసి, నటరాజ రామకృష్ణగారు దానిని ఉత్తమ నృత్యకళా రూపంగా తీర్చిదిద్ది, ఈనాడు ఆంధ్రదేశంలో బహుళప్రచారంలోకి తీసుకు వచ్చారు.

పేరిణి ప్రశంస :

పేరిణి నృత్య సంప్రదాయం శైవమతానికి సంబంధించింది. పేరిణికి సంబం ధించిన ప్రస్తావన, పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోనూ, శ్రీనాథుని కాశీఖండం భీమఖండంలోనూ, వెంకటగిరి ప్రభువు, సర్వజ్ఞకుమార యాచేంద్ర రచన సభారంజనిలోనూ, నందికేశ్వరుని భరతార్ణవంలోనూ వర్ణించబడింది.

పేరిణి వర్ణన :

అన్ని నృత్యాలను గురించీ, నృత్తరత్నావళిలో వర్ణించినట్లే, పేరణిని గురించి కూడా జాయప ఈ క్రింది విధంగా వర్ణించాడు.

శ్లోకం

"రంజకో రూప సంపన్నః...
భావకో రసిక స్తాలవే దిగమక కోవిదః
ధ్వని శరీర సంపన్నో..."

అంటూ.

సురేఖో వాద్యవిరీ ప్రేరణీ మతః.

అని వర్ణించాడు. ఈ వర్ణననుబట్టే ఈనాడు రామకృష్ణగారు పేరిణికి ఒక రూపకల్పన చేశారనుకోవచ్చు.

పేరిణి నృత్యకాడుడు, రక్తి కలిగించేవారుగా, రూప సంపన్నుడుగా, అందాన్ని భావింపగలవాడుగా, రసానుభావం కలవాడుగా, తాళజ్ఞుడుగా, గమకంలో నేర్పరిగా, ధ్వని గల శరీరం కలవాడుగా, మంచి రేఖ గలవాడుగా, వాయిద్యాలను ఎరిగినవాడుగా వుండాలనీ, అటువంటివాడే, పేరిణి నృత్యానికి తగినవారనీ పై శ్లోకార్థం——అంటాడు జాయపసేనాని.



## తాండవ నృత్యం :

ఈ ఆధారాలు తప్పా, పేరిణిని గురించి మరిన్ని ఆధారాలు దొరకవు. పై వర్ణనను అర్థం చేసుకోగలిగినప్పుడు, ఆ నృత్యం ఎలా వుంటుందో ఊహించవచ్చు. ఆ ఊహతోనే సృజనాత్మకంగా రామకృష్ణగారు, చరిత్రాత్మకమైన, చిరస్మరణీయమైన ఈ ఉద్ధృతతాండవ నృత్యాన్ని, వ్యయ ప్రయాసలతో తీర్చిదిద్దారు. పేరిణి తాండవ

శైలికి సంబంధించింది. తాండవం అంటే తనలో తాను లయం చేసుకోవడ మంటారు ఉమా వైజయంతీమాలగారు.

లయ విన్యాసాన్ని తెలియజేసే నృత్తమే గాక, భావప్రకటనకు అనువైన భంగిమ గల నృత్యం. పేరణి ఈ నృత్యం, నృత్తంతో ప్రారంభమై....నృత్యంతో వికశించి ఆంగికాభినయంతో ముగుస్తుంది.

పేరిణి తాండవం రెండు విధాలు. ఒకటి పురుషులచేతా, రెండవది స్త్రీలచేతా చేయబడుతుంది. పురుషుని యొక్క పురుషత్వాన్ని లోకానికి తెలియచేస్తూ ప్రదర్శించే నర్తనమే ''పేరిణి శివతాండవం''. ఇది వీరులు చేసిన వీర నాట్యం. భారతీయ నృత్య రీతుల్లో ఎక్కడ ఈ పేరిణి నృత్యం కనిపించదు.

రామప్ప ప్రజ్ఞ :

సంగీతానికి సప్తస్వరాలు ప్రాణం. అలాగే మృదంగానికీ త, ది, తో, ఝం, ఆధారమైనట్లు, నృత్యం ఎన్ని విధాలుగా రూపొందినా దానికి ప్రధాన స్థానాలు ఎనిమిది మాత్రమే. ఇటువంటి మూలసూత్ర స్థానాలు రామప్ప శిల్పంలో రూపొందించబడ్డాయి. అంతేకాదు ఆ స్థానాలను ప్రయోగించేటప్పుడు, వాయించవలసిన తొలి మృదంగ శబ్దాన్ని ఎంత తూకంలో ప్రయోగిస్తే ఆ విన్యాసం పూర్తిగా వికసించటానికి అవకాశముందో ఆ హస్తవిన్యాస క్రమం, మొదలైనవెన్నో ఆ మృదంగ భంగిమలలో రామప్ప మలిచా డంటుంది ఉమా వైజయంతీమాల.

రామకృష్ణ ఉవాచ :

ఇది ఒక అద్భుత ప్రక్రియ అంటారు నటరాజ రామకృష్ణ. నేను శాస్త్రాన్ని, సంప్రదాయాన్ని గురుముఖంగా అధ్యయనం చేయడంవల్ల ఆ భంగిమల్ని పరిశీలించి అభ్యసించగలిగా నంటారు.

ఆ మృదంగ భంగిమల్ని పరిశీలించి అభ్యసించగలిగాను. ఆ మృదంగ ధ్వనుల్ని మార్దంగికునికి నేర్పి వాయింప చేశాను. నేను పేరిణి తాండవాన్ని పునర్మించటానికి ఆ మాతృకలే నా కెంతో సహాయపడ్డాయి. ప్రతి శబ్దానికి ఉత్పత్తి, పరాకాష్ట. అంతర్ధానం అనే మూడు దశ లున్నాయి. ఆ నాదోత్పత్తి, విజృంభణ నిశ్చ

ద్ధతలను గురించి వివరంగా తెలిసియున్న నర్తకుడు ఏ రూపాన్నైనా సృష్టించగల డని నా దృఢ విశ్వాసమంటారు రామకృష్ణగారు.

## శైవమత విజృంభణ :

కాకతీయ సామ్రాజ్యంలో శైవం, వీరశైవం విశృంఖలంగా విజృంభించింది.

ఆ రోజుల్లో పశుపతి సాంప్రదాయం, వీరశైవం ముమ్మరంగా ప్రచారంలో వుంది. పశుపతులూ, మహేశులూ, వీరశైవులూ, మైలారదేవులూ, వీరందరూ శైవమతాన్ని స్వీకరించినవారే. ప్రతిరోజూ వీరు ఆరుసార్లు శివుని నృత్యరీతుల్లో ప్రార్థనలు చేసేవారు. అందువల్లనే శైవ నృత్యాలు అత్యంత ప్రచారంలో వచ్చాయి.

శివాలయాల్లో పురుషులే నృత్యం చేసేవారు. దేవుని దర్బారని పిలువబడే కళ్యాణమండపాలలో స్త్రీలు కేశిక నృత్యాలను చేసేవారు. దేవాలయాల్లో చేసేది సంప్రదాయ సిద్ధమైన నృత్యాలు. ఇవి అనేక తాళగతులకు చెందేవిగా వుంటాయి. తాండవంలో అభినయానికి అంతగా తావులేదు. శివస్తోత్రానికి సంబంధించిన శ్లోకాలు మాత్రమే చదువబడతాయి. ఇవి నృత్యరీతులకు అనుగుణ్యంగా వుండి నూట ఇరవై అయిదు విన్యాసాలతో విరాజిల్లుతుంటాయట.

కేశిక ప్రదర్శనంలో నృత్త నృత్య అభినయాలు వుంటాయి. ఇది నృత్యంతో ప్రారంభమై అభినయంతో ముగించబడుతుంది.

కాకతీయుల కాలంలో ఆరాధనా నృత్యాలు బహుళ ప్రచారంలో వుండేవి. ఇవన్నీ శివపరంగా, పశుపతి సంప్రదాయానికి అనువుగా వుండేవి. నాటి పశుపతులు, సంగీత నృత్యాలతో శివుని పూజించేవారు. అవి కాలానుగుణ్యంగా ఉదయమూ, మధ్యాహ్నమూ, రాత్రి సమయంలోనూ ప్రదర్శింపబడేవి. ఇవి మూలవిరాట్టుకు ఎదురుగా వున్న నాట్యవేదికలలో ప్రదర్శింపబడేవి. అలాంటి నాట్యవేదికలు ఈ నాటికీ వరంగల్ కోటలోనూ, హనుమకొండ వెయ్యిస్థంభాల గుడి ముఖమండపంలోనూ, పాలంపేట రామప్ప దేవాలయంలోనూ చూడవచ్చును.



## వీర శైవం, వీర వైష్ణవం :

వీరవైష్ణవం, తమిళనాడులో ప్రారంభమై ఆంధ్రదేశంలో ప్రవేశిస్తే వీర శైవం, కర్ణాటకలో ప్రారంభమై ఆంధ్రదేశంలో ప్రవేశించింది. రెండు మతాల మధ్యా బద్ధవైరుధ్యం చెలరేగింది. ఉభయ మతాలమధ్యా సామరస్య సాధనకు ఆంధ్ర దేశంలో పలనాటి బ్రహ్మనాయుడూ, తిక్కన సోమయాజీ కలసి హరిహర ఉద్యమాన్ని లేవదీసినట్లూ, ఆ వుద్యమంలో వీరశైవుల్నీ, వైష్ణవుల్నీ కూడచేర్చుకుని మాచర్లలో చెన్నకేశవ స్వామి ఆలయాన్ని స్థాపించి ఆ ప్రాంగణంలోనే వీరభద్రస్వామిని కూడా ప్రతిష్టించాడు.

## శివకేశవుల ఎదుట పేరిణి :

మాచర్లలో నున్న శివకేశవుల దేవాలయాల్లో, దేవతామూర్తుల ముందు పేరిణి నృత్యాన్ని భక్తిభావంతో ప్రదర్శించేవారు. అంతే కాదు శైవక్షేత్రాలైన కోటప్ప కొండ, శ్రీశైలం మొదలైన పుణ్యక్షేత్రాలలో శివరాత్రి మహోత్సవాలలో పేరిణి నృత్యానికి సంబంధించిన కొన్ని జతులు ప్రదర్శింపబడేవి.

ఈనాటికీ మాచర్ల సమీపంలో వున్న కారంపూడి గ్రామంలో పల్నాటి యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వీరుల దినోత్సవం ప్రతి సంవత్సరమూ జనవరిలో జరుగుతుంది. అక్కడ వీరుళ్ళ దేవాలయా లున్నాయి. ఆ వుత్సవాల్లో నేను కళ్ళారా చూచిన పేరిణి నృత్యంలోని కొన్ని జతులు ప్రదర్శింపబడ్డాయి. ఆ నృత్యాలు మహా ఉత్తేజంగా వుండేవి. ప్రేక్షకులను ఉద్రేకపర్చేవి. పూర్వ వీరుల ఔన్నత్యాన్ని చాటేవి. నిజానికి అవి జానపద నృత్యంగా కనిపించినా అది శాస్త్రీయ నృత్యంగానే కనిపించేది. వీరుల ప్రతిమలకు ఎదురుగా నిలబడి, సాంబ్రాణి రూపంలో మునిగిపోయి, సన్నాయి వాయిద్యాల వీరంగంతో ఉత్తేజం పొంది చేసే ఆ పేరిణి జతుల నృత్యం ప్రేక్షకులకు కూడా వెర్రి ఎక్కించేది. వీర శైవ పేరిణి నృత్య ప్రభావం అంతటిది. అయితే అది ఈనాడు శాస్త్రీయతను కోల్పోయి, గణాచారుల నృత్యంగా మిగిలిపోయింది.



## అలాంటి పేరిణి నృత్యం :

పేరిణి నృత్యమంటే, అలాంటిది. పేరిణి నృత్యం చేసే ప్రతి వ్యక్తీ శివుణ్ణి తనలో ఆవహించుకుని ఆవేశంతో నృత్యం చేస్తాడు. మేళవింపు విధానం పేరణికి అతిముఖ్యమైనది.

ఓ పరమశివా? నాలో శివశక్తిని ప్రవేశంపచేసి, నా శరీరాన్ని పవిత్రమొనరించి, నా శరీరం ద్వారా నీ పవిత్ర నృత్యాన్ని లోకానికి ప్రసాదించు అని ప్రార్థిస్తూ, ఈ నర్తనాన్ని ప్రారంభించాలి. ఈ ప్రారంభమే నృత్యకారుల్లో ఆవేశపరుస్తుంది. ఆ ఆవేశంతోనే నృత్యకారుడు పేరిణి నృత్యాన్ని శివతాండవ నృత్యంగా మలుచుకుంటాడు. నిజానికి ఇది ఎంతటి ఔన్నత్యంతో కూడుకున్న నృత్యమో మనం అర్థం చేసుకోవచ్చును.

చరిత్రగతిలో బతికి జీర్ణమైపోయి పేరిణి అని పేరు మాత్రమే మిగిలిపోయిన ఈ విశిష్ట నృత్యాన్ని, నటరాజ రామకృష్ణగారు పరిశోధించి, పరిష్కరించి, దానికొక సజీవ రూపకల్పన చేసి, పూర్వ వైభవాన్ని మన కళ్ళముందుంచారు. పేరిణి చరితార్థమైనట్లే, నటరాజ రామకృష్ణగారు కూడ చరితార్థులు.





# ప్రజలకు నచ్చిన
# పగటి వేషాలు



## జానపద కళల్లో మరో జాతీయ కళ :

నాటకం, సినిమా, రేడియో, టీవీలు అభివృద్ధి పొందిన ఈ నాటి దశనుంచి, కొంచెం వెనక్కు వెళ్ళి ఆలోచిస్తే మనకు జానపద కళారూపాలలో విరివిగా కనిపించేవి పగటి వేషాలు.

పట్టపగలు వేషాలు వేసుకుని, హావభావాలను బలికిస్తూ, రాగ మేళ తాళాలతో, పండిత పామరులను మెప్పించి, మురిపింప చేయటం పగటి వేషధారులకు వెన్నతో పెట్టిన విద్య.

అభినయంలో, వాక్చాతుర్యంలో కొందరిని అనుకరించడం అది కూడా గుర్తు పట్టలేనంతగా ఆయా పాత్రల్లో లీనం కావడం వారి ప్రత్యేకత. ఆయా వేషాలద్వారా, సంఘంలోని దురాచారాల్నీ, బలహీనతల్నీ వ్యంగ్యంగా ఎత్తిచూపటం వీరి వృత్తిలోని మూలసూత్రం.

## పురాణకాలం నుంచీ :

పురాణకాలం నుంచీ ఈ పగటి వేషాలు వేయటం ఆనవాయితీగా వస్తోందని పెద్దల అభిప్రాయం. దశరథుడు సంతానం కోసం పరితపిస్తున్నప్పుడు బుడబుక్కల వేషంలో వచ్చి, యాగ రహస్యం చెప్పాడనీ, ఈ వేషధారణ కోసం డుంబకాసురుడనే రాక్షసుని చంపి, అతని దేహాన్ని బుడబుక్కగాను, నరాలు రాళ్ళుగాను, మెడను మైనంగానూ విష్ణువు ఉపయోగించాడని చెపుతూ వుంటారు.

ఒకనాడు భారతదేశంలో స్వతంత్ర సామంత రాజుల పరిపాలనలోనూ, చిత్ర విచిత్ర వేషాలు వ్యాప్తిలోకి వచ్చాయని ప్రతీతి. గూఢచారులుగా మారువేషాలు ధరించి, వర్తమానాలు చేరవేసే బారులుగానూ, రత్నాలు పచ్చలు కెంపులు అమ్మే వ్యాపారులుగాను, రాణులు ధరించే ఖరీదైన చీరల వర్తకులుగానూ చిత్ర విచిత్రమైన

మారువేషాలతో కోటల్లో జొరబడి, ఒక రాజు మరొక రాజును వంచించడం కోట లోని గుట్టుమట్టులూ, బలహీనతలూ తెలుసుకుని యుద్ధం ప్రకటించడం జరుగుతూ వుండేది ఈ విధంగా బయలుదేరినవే పగటి వేషాలు.

## పేరువచ్చిన కారణమూ, తీరూ :

ప్రజా వినోదానికి ఏర్పడిన అనేక కళారూపాలు బహుళంగా రాత్రివేళలయందే ప్రయోగిస్తూ వుండేవారు. అలాకాక పగటిపూట ప్రదర్శించే ప్రదర్శనం అవడంవల్ల ఈ ప్రదర్శనకు పగటి వేష ప్రదర్శనమని పేరు వచ్చింది.

పగటి వేషాల్లో ముఖ్యంగా గమనించాల్సిన విషయ మేమిటంటే వారు కేవలం తమ వేషధారణతోనే కాక వారి పాత్రలద్వారా సంఘంలో వుండే మూఢనమ్మకాలనూ, మతాచారాలనూ, ప్రజాపీడననూ హాస్యధోరణిలో పెట్టి ప్రజలకు వినోదంద్వారా విజ్ఞానపరుస్తూ వుండేవారు. ఈ నాటికంటే ఆ నాడు ముఖ్యంగా గ్రామాల్లో పెత్తం దారులూ, కరణాలూ, మునసబులూ, వర్తకులూ, లంచగొండి ఉద్యోగులూ మొద లైన వారంతా ఎలా మోసం చేస్తూ వుండేవారో వీరు వేషణ ద్వారా తగిన సాహి త్యంతో ఎవ్వరికీ నొప్పి తగలకుండా హాస్యధోరణిలో వ్యంగ్యంగా గుట్టును బట్ట బయలు చేసేవారం.

## ప్రాచీనం నుండీ, ప్రచారంలో ఉన్నవే :

ఎన్నో సంవత్సరాల నుండీ జానపద కళారూపాలు ఎలా ప్రచారంలో వున్నాయో అలాగే ఈ పగటి వేషాలు కూడా ప్రచారంలో వున్నాయి.

ఈ నాటి పగటి వేషాలను పూర్వం, బహురూపాలని పిలిచేవారు. బహు రూపాల గూర్చి భరతకోశంలో ఈ క్రింది విధంగా ఉదహరించబడి వుంది.

దేశి నృత్యం నానావేష ధరం.

యత్తత్ బహురూప మితీరితమ్ (భరత కోశం పుట 418 క్రీస్తుశకం 1242వ సంవత్సరంలో యథావాక్కుల అన్నమయ్య తనచే రచింపబడిన సర్వేశ్వర శతకంలో నాటక ప్రదర్శనాలను గురించి వ్రాస్తూ ఈ క్రింది పద్యంద్వారా నాటకాలు బహురూపా లని వివరించాడు.

పద్యం

అమరంగ స్ఫుట భక్తి నాటకము భాషాంగ క్రియాంగాభి, ర
మ్యముగా జూపిన మెచ్చిమీరలు పురేయన్నంతకున్‌యో నిగే
హములన్ రూపులు పన్నుకొంచును నటుండై వచ్చి సంసార రం
గములోనన్ బహురూపమాడు వెలయంగా జీవి సర్వేశ్వరా.

(సర్వేశ్వర శతకం 20 వ పేజీ)

నాటకాలు బహురూపాలని పాల్కురికి సోమనాథుడు కూడా (బసవపురాణంలో) వివరించాడు.

అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు.

బహురూపాలంటే ఒకే వ్యక్తి వివిధ పాత్రల్ని ధరించటం. అవి పగటి వేషాలు కావచ్చు. పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణంలో సోమనాథుడు.

ప్రమథ పురాతనపటు చరిత్రములు - గ్రమమొంద బహునాటకము లాడువారు
లలితాంగరస కళాలంకారరేఖ - లలవడ బహురూప మాడెడివారు.

శ్రీశైలంలో శివరాత్రి వుత్సవాలలో ఈ నాటకాలను ప్రదర్శించేవారు, ఆనాడు ఈ రూపకాలకు ఎక్కువ ప్రచార మున్నట్లు సోమనాథుని పండితారాధ్య చరిత్రవల్ల తెలుస్తూ వుంది.

బహురూపాలను గురించి మరోచోట వివరంగా ప్రస్తావించ బడింది.



## జానపద గాథలతో రాజకీయాలను సాధించిన జాణ :

శివాజీకి సింహగడ విజయాన్ని చేకూర్చిన వాడు 'తానాజీ మాల్‌సురే'. తానాజీ, మరి కొందరు మరాఠీ సైనికులూ పవాడాగాయకుల వేషాలతో కోటలో ప్రవేశించి దానిని జయించారు. జానపద గాథల పద్ధతిని రాజకీయాలకు ఉపయోగించిన వారిలో ప్రథముడు తానాజీ.

అంతేగాక కళింగ గంగరాజు పగటివేషాలవారి సహాయంతో శత్రువుల్ని జయించాడనే కథ కూడా వుంది.

కాకతీయ యుగంలో యుగంధర మహామంత్రి పిచ్చి యుగంధరుడుగా నటించి 'ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్' అంటూ ఢిల్లీ సుల్తానులను జయించింది పగటి వేషం తోనే.

## పల్లావఝ్ఝలవారి ప్రతిభ :

ఇలా ఎన్ని వుదాహరణలనైనా మన చరిత్రల నుంచి తీసి చూడవచ్చు. కాని పగటివేషాల చరిత్ర మాత్రం మనకు సరిగా లభించడంలేదు. కాని రెండు మూడు వందల సంవత్సరాల క్రితం మైసూరు ప్రాంతం నుంచి పల్లావఝుల వెంకటరామయ్య అనే ఆయన వచ్చి రేపల్లెలో వుండిపోయి, కొంతమందికి పగటివేషాలు నేర్పి, ప్రదర్శించి, ఆంధ్రప్రజల మన్నన పొందారట. క్రమానుగతంగా ఆ పగటి వేషధారులకు, తరువాత, గడ్డిపాడు నివాసస్థానమైందని శ్రీనివాస చక్రవర్తిగారు తమ నాట్య కళ గ్రంథంలో వివరించారు.

## గడ్డిపాడు పగటి వేషధారులు :

వీథి భాగవతాలకు కూచిపూడి ఎలా కేంద్రమైందో అలాగే పగటి వేషధారులకు గడ్డిపాడు కేంద్రమైంది.

కృష్ణా జిల్లాలో వీరంకిలాకుకు మైలు దూరంలో వున్న గడ్డిపాడు (హనుమంత రాయపురాగ్రహారం) ఈ భాగవతులకు కేంద్రం. గడ్డిపాడు భాగవతులుగా ప్రసిద్ధి నందినవారు పల్లా వఝులవారు — శ్రీకారంవారు — కూచివారు — కనుపూరి వారు — బెల్లంకొండవారు — బాపట్లవారు — కవులవారు మొదలైన వారందరూ గడ్డిపాడు భాగవతులే. వీరందరికీ గురువు మైసూరు తెలుగు బ్రాహ్మణుడు. పల్లావఝుల వెంకటరామయ్య. వీరి ప్రతిభ ననుసరించి చూస్తే తెలుగు దేశంలో కంటే మైసూరులో పగటి వేషాలు ఎక్కువ వ్యాప్తిలో వున్నట్లు తెలుస్తూ వుందని శ్రీనివాస చక్రవర్తిగారు తమ నాట్యకళ గ్రంథంలో వివరించారు. రెండు శతాబ్దాలకు పూర్వం వచ్చిన పల్లావఝుల వెంకట రామయ్యగారు ఆంధ్రదేశంలో పగటి వేషాలతో సంచారం చేసి చివరకు రేపల్లెలో స్థిరపడి కృష్ణాజిల్లా గడ్డిపాటి వారికి ఈ విద్యను నేర్పి ఆద్యులైనారు.

ఆంధ్రదేశంలో పగటి వేషాలకు భిక్షపెట్టినవారు గడ్డిపాడు పగటి వేషధారులే. ఆ గ్రామంలో అందరూ పగటి వేషాలు వేయగల సమర్థులుగా వుండేవారు. వారు దాదాపు అరవై రకాల చిత్ర విచిత్రమైన పగటి వేషాలను ధరించేవారు. ఆ పగటి వేషాలతో నిత్యజీవితానికి సంబంధించినవి కొన్ని, హాస్యరసంతో కూడుకున్నది కొన్ని, మరికొన్ని పౌరాణిక వేషాలూ, కల్పనా వేషాలూ, కొన్ని కేవలం హాస్య రసంతో కూడుకున్నవి. మొత్తంమీద సంఘంలో వుండే అన్ని జాతీయ పాత్రలూ వీరి వేషాల్లో మూర్తీభవించి వుండేది.

## వేషగాండ్ల ప్రతిభ :

వేషం ఊరికే ధరించడం కాక తద్రూపంగానే నమ్మించేవారు. గొఱ్ఱెలు కాచే గొల్లల పాత్రలు ధరించి, సుద్దులు చెపితే అక్షరాలా గొఱ్ఱెల కాపరులను గుర్తుకు తెచ్చేవారు. వేషం వెయ్యవచ్చును కాని దానిని నమ్మించడం ఎలా? అదే గడ్డిపాడు పగటి వేషధారుల్లో వున్న ప్రత్యేకత. తెలుగుదేశంలో ఎన్ని వర్గాలూ, కులాలూ, జాతులూ వున్నాయో ఆయా జాతులకు సంబంధించిన అన్ని భాషలనూ ఆకళింపు చేసుకుని వారు ధరించే ప్రతిపాత్రకూ సాహిత్యాన్ని కల్పించి స్వతంత్రం చేసుకునే వారు. అన్ని మనస్తత్వాలనూ, ఆటనూ, పాటనూ, మాటనూ, వుచ్చారణనూ, వేష ధారణనూ, ఒంపులూ వయ్యారాలనూ విధిగా ఒక విద్యగా అభ్యసించేవారు. అందు వల్లనే వారు పగటి వేషాల్లో ప్రఖ్యాతి వహించారు. పగటి వేషధారులు అంటే గడ్డి పాటి వారేననీ, ఆ ప్రతిభకు వారే అర్హులనీ తేలిపోతుంది.

## కృత్రిమ అలంకారాలు లేని సహజ కళ :

ప్రయోగాత్మకమైన కళారూపాలలో నాటకం వుత్తమమైంది. అలాగే జానపద కళారూపాలలో పగటి వేషధారణ కూడ వుత్తమమైంది. ఈ పగటి వేష ప్రయోగంలో చతుర్విధ అభినయాలూ ప్రాముఖ్యం వహిస్తున్నాయి. రంగస్థల పరికరాలూ, రంగ ప్రదీపనం మొదలైన కృత్రిమ అలంకారా లేవీ లేకుండా ప్రజలను రంజింపచేసే పగటి కళారూప మిది.



పగటి వేషధారులు ఆంధ్రదేశం నాలుగు చెరగులా పర్యటించి ఆయా ప్రాంతాలలో వున్న మాండలిక వ్యవ

హారిక యాసలనూ, మాండలిక పదాలూ గట్టిగా వంట బట్టించుకున్నారు. ఆ వేష ధారులు ఆంధ్రదేశంలో అన్ని పాత్రల మాండలిక వ్యవహారిక యాసలనూ ఆకళువుగా బట్టీపట్టినట్లు బయట పెట్టగలరు.

# కూచిపూడి పగటి వేషాలు

కూచిపూడి కళాకారులు వీధి భాగవతాలలో ఎంతటి ప్రసిద్ధులో పగటి వేషాలలో కూడా అంతటి ప్రసిద్ధులే. ఈ పగటి వేషాలను కూచిపూడివారు ప్రారంభం నుండే వీటిని ధరించలేదు. వారి వీధి భాగవతాలకూ యక్షగానాలకూ కొంత ప్రచారం తగ్గిపోయిన తరువాత భాగవతులలో చీలిక వచ్చి ఎవరికివారై ఏదో రకంగా ఉదర పోషణార్థం ఈ పగటి వేషాలను ప్రారంభించారు.

ఆ నాడు కొన్ని యక్షగాన ప్రదర్శనాల్లోనూ, వీధి భాగవత ప్రదర్శనాల లోనూ మధ్య మధ్య వచ్చే కొద్ది కొద్ది విరామ సమయాలలో ప్రేక్షకుల వినోదం కొరకు పంతుల వేషం, పఠాను వేషం, రెడ్డి వేషం, త్రాగుబోతు వేషం మొదలైన వాటిని ప్రదర్శించేవారు. పగటిపూట అంటే తెల్లవార్లూ ప్రదర్శనం ముగిసిన తరువాత ఆట ముగించి, అదే వేషాలతో ఇంటింటికీ యాచనకు బయలుదేరేవారు. వెంటనే బయలుదేరడానికి కూడా కారణం లేకపోలేదు. తెల్లవార్లూ ప్రదర్శనం చూచిన ప్రేక్షకులు ముగ్ధులై ఇంకా ఆనందంలో వారుండగానే వారి నుంచి ఎక్కువ ప్రతిఫలాన్ని రాబట్టేవారు - అలా ప్రారంభించబడిన పగటి వేషాలే అలా అలా అల్లుకుపోయి కళాఖండాలుగా ప్రచారం పొందాయి.

## సహజ పాత్రలూ, సజీవ భాషా:

వీరు కూడ అనేక వేషాలు ధరించేవారు. కోమటిసెట్టి పాత్ర ధరిస్తే వైశ్యుల భాష, యాస, మాటతీరు, బొంగురు గొంతు, యుక్తిమాటలు. సునిశిత హాస్యం, వ్యాపార చమత్కారం, ఇతరులకు నొప్పిగలుగని అతిలౌకికమైన నటనా అచ్చు గుద్దినట్లు ఒప్పించేవారు.

గారడీ వేషంలో ఇంద్రజాల మహేంద్రజాలాన్ని అద్భుతంగా ప్రదర్శించే వారు. బట్టల నేత, బట్టల అమ్మకం, కోడి పోరులో పందెగాళ్ళ జోరు, వారి వికటాట్టహాసాలు, బైరాగి వేషాలతో ప్రజలను మోసపుచ్చే దొంగ సన్యాసుల

వైఖరులు, చమత్కార సంభాషణలూ, అచ్చం అలాగే తెలుపుతారు. సోమిదేవమ్మ పాత్రలో వైదిక సంఘంలో వుండే మంచి చెడులనూ లోపాలనూ వెల్లడిస్తారు. తర్కశాస్త్రాన్నీ, వ్యాకరణ శాస్త్రాన్నీ, వేదస్వరూపాన్నీ హాస్యపూరితులైన సంస్కృత శ్లోకాలను కలిపి కట్టుదిట్టంగా చర్చించేవారు.

చిట్టిపంతులు వేషంలో, చిట్టిపంతులు వేశ్యాలోలుడై వ్యాపారులనూ, రైతులనూ బాధించి ఏ విధంగా ధన మార్జిస్తారో ఆర్జించిన ధనమంతా వేశ్యలనూ, రైతులనూ, కూలీలనూ బాధించి ఏ విధంగా ధనమార్జిస్తాడో, ఆర్జించిన ధనమంతా వేశ్యలకెలా ధారపోస్తాడో కళ్ళకు కట్టినట్లు చూపిస్తారు.

యాచనలో ప్రతివారినీ పొగడుతూ భట్రాజులు ప్రజలను ఎలా పీడిస్తారో చూపించేవారు.

ఖురాన్ చదువుతూ, పాడిపంటల్ సత్‌గుండాలి అల్లాకెనాం, అంటూ ఫకీర్ల వేషంలోనూ, అంబ పల్కు జగదాంబ పల్కు, మాయమ్మా పల్కు, కంచికామాక్షి పల్కు, అంటూ బుడబుక్కల వేషంలోనూ, ఆయా పాత్రలకూ, ఆయా వేషాలకూ కావలసిన అన్ని రకాల సాహిత్యాన్నీ ఆకళింపు చేసుకుని, ఆయా వేషాలను సజీవంగా ప్రదర్శించేవారు.

# సున్నపు వీరయ్యా పగటి వేషాలు

పగటి వేషధారుల్లో బహుముఖ ప్రజ్ఞావంతుడు కీ॥శే॥ సున్నపు వీరయ్యగారు పశ్చిమ గోదావరి జిల్లా, పెందులూరుకు దగ్గరగానున్న అప్పారావు పాలెం, తరువాత ఏలూరును స్థిర నివాసంగా చేసుకుని రాష్ట్ర వ్యాపితంగా పగటి వేషాలను ప్రదర్శించి బహురూప చక్రవర్తిగా ప్రశంసలందుకున్నారు.

ఇంటి పేరు సున్నంవారు విశ్వబ్రాహ్మణ కులానికి చెందినవారు. ఆజానుబాహుడు నిండైన విగ్రహం, స్థూలకాయుడు. పెద్ద జరీ అంచు తెల్లని తలపాగా ధరించేవారు. బొద్దు మీసం నల్లని లాంకోటు, తెల్లని పంచకట్టు, చేతికి సువర్ణ కంకణాలు, కాలికి పెద్ద అందె ధరించి కిర్రు చెప్పులతో బయలుదేరితే చూచేవారికి అమిత గంభీరంగా కనిపించేవారు. అలాంటి నిండైన విగ్రహం, ఆంధ్రదేశంలో పగటివేషధారుల్లో మరెవరికీ లేదనటం అతిశయోక్తి కాదు.

వీరయ్యగారు పగటి వేషాలు ధరించి, ఆంధ్రదేశమంతా పర్యటించారు.

నాలుగు మూలలా ప్రదర్శనాల నిచ్చి, ఎంతో మంది జమీందార్లనూ, శ్రీమంతులనూ వారి పగటి వేషాలద్వారా మెప్పించి అనేక ఘనబహుమతుల్ని అందుకున్నారు.



బహురూప చక్రవర్తి సున్నపు వీరయ్య

వారి బృందం పగటి వేషాలంటే చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలందరూ గుంపులు గుంపులుగా వచ్చేవారు. కూచిపూడి పగటివేషధారులు సాత్విక ప్రధానమైన

వేషాలు ధరిస్తే వీరయ్యగారు సత్వగుణ ప్రధానమైనవి, తామసగుణ ప్రధానమైనవీ రెంటినీ ప్రదర్శించేవారు. తామస గుణానికి చెందినవే. వారి శక్తివేషమూ, బేతాళుని వేషమూ.

## సున్నపువారి శక్తివేషం:

వీరయ్యగారు ప్రదర్శించే ఇతర వేషాలన్నిటికీ ప్రేక్షకులు మూగేవారు కాని, ఈ శక్తివేష ప్రదర్శనంనాడు గ్రామంలో వున్న అనేకమంది పొలాలకు వెళ్ళిపోయేవారు. ఇక గ్రామంలో కొద్దిమంది తలుపులు బిగించుకుని ఇళ్ళలో వుండేవారు. వీరయ్యగారి శక్తివేషం సరిగా మధ్యాహ్నం పన్నెండు గంటలకు మండుటెండలో తప్పెట్ల వాయిద్యంతో బయలుదేరేది. వేషధారణ అతిభయంకరంగా వుండేది. కన్నులకు కోడిగ్రుడ్లు, ముఖానికి నల్లరందు, పెద్ద పెద్ద కోరలు, నల్లని దుస్తులు, విరబోసిన జుట్టు, చేతిలో శూలం, నోటినుంచి కారే రక్తంతో మహా బీభత్సంగా వుండేది ఆయన శక్తి వేషం.

## అట్టహాసంగా అద్భుత ప్రదర్శనం:

ఆయనను బండిమీద ఎక్కించేవారు. తప్పెట్ల నృత్యంతో వూరేగింపు సాగేది. ఈలోగా గ్రామంలోని వీథులన్నీ నిర్మానుష్యం. పిల్లల్ని ఎవర్నీ ఈ దృశ్యం చూడనిచ్చేవారుకారు. పెద్దలు మాత్రం తలుపు కంతల్లోంచీ, దూరంగా వుండే దర్శించేవాళ్ళు. ఈవిధంగా అంతమయ్యేది ఆయన శక్తివేష ప్రదర్శనం. ప్రదర్శనాలన్నీ వరుసగా ఒక నెల రోజులు రోజుకొక వేషం చొప్పున, ప్రదర్శించిన తరువాత వీరయ్యగారు ఈ శక్తి వేష ప్రదర్శనాన్ని, బేతాళుడి వేషాన్నీ దేవరపెట్టె వేషాన్నీ ధరించేవారు.

## భీతావహమైన బేతాళుని పాత్ర:

వీరయ్యగారి బేతాళుని పాత్ర ధోరణిలో రెండు చేతులకూ రెండు బలమైన తాళ్ళు గట్టి వెనుక కొంతమంది లాగి పట్టుకునేవారు. వీరయ్యగారు బుగ్గకు కత్తి పొడుచుకునేవారు. నోటి నుండి రక్తం రొమ్ముమీదికి కారుతూ వుండేది. ఒక్క-

**లంగోటి** మినహా మరే దుస్తులూ వుండేవి కావు. తప్పెట వాయిద్యాల గమకంతో ఒక వీరసింహలా వీథిలో నడిచేవారు.

## దేవరపెట్టె మహిమలు:

దేవరపెట్టె అంటే తిరుపతమ్మ దేవరపెట్టె. ఈ ప్రదర్శనానికి ప్రేక్షకులు విపరీతంగా హాజరయ్యేవారు. ఈ ప్రదర్శనంలో మంత్ర తంత్రాలనూ, మ్యాజిక్ లనూ, మహాజోరుగా చేసేవారు.



సున్నపు వీరయ్య దేవర వేషం

పాట

అమ్మసత్తెం చూడండీ, మల్లేలా, మల్లేలా
దేవిసత్తెం చూడండీ
సందుగొందులు తిరిగే తల్లి
సన్నపు కోకలు కట్టిందోయ్
మాయమ్మా, మాయమ్మా
ఎన్నోమాయల గలతల్లోయ్
మల్లేలా, మల్లేలా.

అంటూ నెత్తినవున్న దేవరపెట్టెను క్రిందికి దింపి కుడిచేతిలో వీరభద్ర తాడును పట్టి ఫళఫళా అంటూ నాదంచేస్తూ చూడండి బాబయ్యా, మా అమ్మోరు సత్తెం, అమ్మోరును ఎక్కడనుండి తీసుకువచ్చాననుకున్నారు.

సీమకొండ, బెల్లంకొండ, నాగరాజకొండ, గోల్కొండ, కోరుకొండ, తిరుపతి కొండ, తిరుచునాపల్లి కొండ, తిరువళ్ళూరు కొండ, ఆ కొండ, ఈ కొండ అనేక కొండలు తిరిగి తీసుకువచ్చిన తల్లి బాబయ్యా. అమ్మోరు నామకరణాలు అనేకం వున్నై బాబయ్యా. కంచి కామాక్షమ్మ, గంటాలమ్మ, పెద్దింటమ్మ, పోలేరమ్మ, నలజారమ్మ. నాంచారమ్మ, కలకత్తా మహాకాళి తల్లండి. అమ్మోరు సత్తెం మీలో వుంటది నాలో వుంటది, చెట్లో వుంటది, పుట్లో వుంటది, చేమల్లో వుంటది, దోమల్లో వుంటది. అండ పిండ బ్రహ్మాండంలో ఆవరించి వుంది బాబయ్యా.

గజకర్ణ, గోకర్ణ
టక్కుటమాయిాలు
గల తల్లె దిగుమఖతల్లె దిగుమఖతల్లె.

బయ్యా ఇదిగోండి ఇది కంకవండి. ఈ కుంకాన్ని అమ్మోరు సత్తెంవల్ల ఎర్రగా త్తాను బాబయ్యా అంటూ కొండలు మొదలుకుని దేవతలపేర్లూ, చెట్లూ పుట్టలపేర్లూ అన్నీ గుక్కతిరగకుండా వల్లించి ఆ చేతిలోవున్న కుంకాన్ని రెండు చేతులకు మర్దించి అమ్మోరు సత్తెంవల్ల రక్తం అయింది చూడండి బాబయ్యా.

ఇది అమ్మోరు సత్తెమండి
ఇది పసుపండి

పసుపును పచ్చగ చేస్తాను బాబయ్యా
ఇది అమ్మోరు సత్తెమండి.

ఇది మజ్జిగండి. మజ్జిగను చల్లచేస్తది బాబయ్యా. ఇదిగోండి ఇది పిడక కచ్చికండి. ఈ కచ్చికను బూడిద చేస్తంది బాబయ్యా. అమ్మోరు సత్తెం చూడండి. మల్లేలా, మల్లేలా.

అంటూ వీరభద్ర కొరడాతో గిఱ్ఱున తిరుగుతూ, భీకరాకారంగా నృత్యం చేస్తూ ఫెళఫెళామని కొరడా నాదములు భయంకరంగా మ్రోగిస్తూ గిరు గిర్రున తిప్పి, మోదుకుంటూ పాత గాయాలను పగులకొట్టి, రక్తాన్ని చిందించేవారు. ఆ దృశ్యాన్ని చూచిన ప్రేక్షకులు భయపడి ఇది అచ్చం అమ్మవారి సత్యమనుకుని తోచిన ధర్మం చేసేవారు.

## ఔరా అనిపించే మంత్ర తంత్రాలు :

ఇంకా వేషాకులు దూసి తేళ్ళనూ మండ్రకప్పలనూ ప్రవేశపెట్టేవారు. పొడి ఇసుకను నీళ్ళలోవేసి మరలా పొడి ఇసుకను తీసేవారు. తడి బట్టను ఆరబెట్టి అందులో జొన్నగింజలు జల్లితే పేలాలవలె వేగేది. కొబ్బరికాయను నేలమీద పెడితే కొంతదూరం దానంతటది నడిచి వెళ్ళేది. ఒక రూపాయను వంద రూపాయలుగా ప్రత్యక్షం చేసి చూపించేవారు.

ఈ విధంగా కనికట్టూ, హస్తలాఘవం ద్వారా ఆయన దేవరవేషం పూర్తి అయ్యేది. ఈ వేషం గ్రామంలో సంచారం చేసేదికాదు. గ్రామం మధ్యన పెద్ద బజారులో రచ్చబండవద్ద జరిగేది. ఈ విధంగా వీరయ్యగారి బృందం ప్రదర్శనాలు భారీ యెత్తున జరిగేవి. వారి ప్రదర్శనాల్లో ఇంకా చెప్పుకోతగింది భోగం మేళం.



## అర్ధనారీశ్వరి :

అర్ధనారీశ్వరి పగటి వేషాన్ని ధరించటంలో కూచిపూడివారు బహు ప్రసిద్ధులు. దశావతార చరిత్రలో స్త్రీలు అర్ధనారీశ్వరి వేషం ధరించినట్లు, ఈ క్రింది పద్యం వర్ణనను బట్టి తెలుసుకోవచ్చును.

ఇంతియొక్కతె అర్ధనారీశ వేష
మూని సాక్షాత్కరించిన మౌనిజనులు
భ్రమసి సద్భక్తి జయజయ పార్వతీశ
యనుచుమ్రొక్కిరి నృపులు సన్నెనుచుననగ.

[దశావతార చరిత్ర]



అర్ధనారీశ్వర వేషం

కూచిపూడివారిలో పురుషులే ఈ అర్ధనారీశ్వరి పగటి వేషాన్ని ధరించేవారు. ఈ పగటివేషం జానపదుల్ని ఎంతగానో ఆకర్షించి, ఆనందింప జేసింది. ఈ అర్ధ నారీశ్వరి పగటి వేషాన్ని కూచిపూడివారు....శంభోశంకర సాంబ సదాశివ, అంచిత కేశ, దిగంబర రూపా అని పాడుతూ, భృంగి వేషంలో ఒకరు, అర్ధనారీశ్వర వేషంలో ఒకరు, హార్మోనియం మద్దెల వాయిస్తూ - మరిద్దరు భాగవతులు - కవీ సంగా వస్తారు. అర్ధనారీశ్వర వేషానికి, కుడి చెంప శివుడుగానూ, ఎడమచెంప పార్వతిగానూ ఒక మనిషి రెండు వేషాలువేసి తల మధ్యనుండి ముక్కుమీదనుండి పాదం వరకూ క్రిందికి ఒక తెర కడతారు. శివునివేషం వైపు పులి చర్మం, మెడలో పాము, భుజానికి చేతులకు రుద్రాక్షమాలలు ముఖాన విభూతి బొట్టు, కంఠానికి నలుపు మచ్చ, మూతిపై ఒకవైపు మీసం, జటాజూటంపై గంగను ధరిస్తాడు. అప్పుడప్పుడు జటాజూటంలోని గంగ గొట్టంలో పైకి తన్ని ధారగా పడుతుంటే విచిత్రంగా వుంటుంది.

పార్వతి :

పార్వతి వేషం వైపు ముక్కుకు ముక్కెర. ముఖాన కుంకుమబొట్టు, చీరకట్టు, రవిక, చేతికి గాజులు, భుజకీర్తులు, తలకు ఒక ప్రక్క స్త్రీ విగ్గు అలంకరిస్తారు. శివుని పాత్ర అభినయించేటప్పుడు మధ్య తెరతో పార్వతి వేషము మూసేస్తూ పార్వతి పాత్ర వచ్చినప్పుడు, అదే తెరతో శివుని ముఖాన్ని కప్పివేస్తూ నాట్యంలో ఈ మార్పు కనురెప్పపాటు కాలంతో చేస్తూ ప్రేక్షకుల నలరిస్తారు.

ఈ వేషంలో బహుభార్యాత్వంవల్ల చిక్కులు. గంగా గౌరీ సంవాదం, సవతుల కయ్యం, త్రిపురాసుర సంహారం, దక్షయజ్ఞం, దేవాసుర, అమృత మథనం, పార్వతీ పరిణయం — మొదలైన శివలీలలు, పద్యాల రూపంలోనూ, పాటల రూపంలోనూ, నాట్యాల రూపంలోనూ ప్రదర్శిస్తారు. పగటి వేషాల్లో ఆది నుంచీ ప్రత్యేకతగన్న వేషం ఇది. నవరసాలూ చోటుచేసుకున్న వేషం ఇది.

## పిట్టల దొర:

అయ్యా మాకేం తక్కువైందని మీ దగ్గిరకి వచ్చామనుకుంటున్నారు. ఏడంతస్తుల మేడ, ఏడు దున్నల పాడి వీపుమీద ఇస్తరి. పిర్రలమీద పీట, బాగా



పిట్టల దొర

ఖోంచేసేవాళ్ళమే. ఇంతెందుకు గుమ్మడికాయంత బంగారం కుక్క మూచ్చూసిందని, దిబ్బలో వెయ్యడానికి, మైలబడతాయని ముగ్గురు కూలీలకి మూడు దమ్మిడీల కూలిచ్చి, వూరవతల కోనేట్లో పారేయించాం. ఈ సంగతి తెలిసి పక్కింటి పరమేశం భార్య దాన్ని తెచ్చుకుని, కాళ్ళ కడ్డదిడ్డాలు, నడుముకు నానాతిప్పలు, ముక్కుకు ముంగిర, చెంపకు చెంపసెరాలు, నెత్తికి మూకుడుచిప్ప చేయించు కున్నది. మాకు నీళ్ళకు కూడా ఇబ్బంది లేదు. ఇంట్లో పంపు, వీధిలో పంపు, పొయ్యిగడ్డమీద పంపు, పొయ్యిలో పంపు, అన్నీ వున్న పొయ్యిమీదికి, పైవంట మీదికి రెండు మాత్రమే తక్కువై వచ్చాం.

ఔను మొన్న మా నాయనమ్మ పెండ్లికి విమానం బంపితే రాలేదేమండీ, వూళ్లో వుండే ముండమోపులంతా వచ్చారే? పెళ్ళికి చాటెడు బియ్యం చెరువులో పోసి రూముకు మందు పెట్టి ఆ బియ్యం కళాపెళా వుడుకుతుంటే, చెలకపొరల తోడి తిరగేయించాం, కూరలేమి చేయించామంటే, విచిత్రం పచ్చిపులుసు, ఇటుక రాయి ఇగురు, పలుగురాయి పచ్చడి, లోయలో తోటాకు, వేపాకు కూర, ఈగల తాలింపు, నల్లుల తిరగమోత, వంకాయ వరుగేసి, గుమ్మడికాయ గుడించి, ముగ్గురికి ఒక, మెతుకు, నలుగురికి ఒక బద్ద....వచ్చిన వాళ్ళకు వాత, రానివాళ్ళకు గీత వడ్డించాం. అదీ చాలకపోతే, ఒకరి మూతి వొకర్ని నాక్కోమన్నాం.

పెళ్ళికి వచ్చిన పేరంటాళ్ళు కాటుక లేదన్నారండీ ఆక్షేపణ పడలేక చాటెడు మిరపకాయలు, కళాపెళావేయించి, ఇద్దరు కూలీలతో మెత్తగా పొడిగొట్టించి, రెప్ప తప్పించి గుడ్లకతికించాం. అంతే చిర్రున చీది, చర్రున గోడకతుక్కున్నారు. తమలపాకులు లేవండీ, వెంటనే మునిసిపాలిటీ వాళ్ళకు కబురుపెట్టి, దిబ్బమీది ఇస్తరాకులు తెప్పించాం. ఇలా ఏమీ ఇబ్బంది లేకుండా పెళ్ళి జరిపించాం. మీరు రాకపోవట మొక్కటే లోటు.

నేనూ మా ఆవిడ మొన్న జరిగిన కృష్ణా పుష్కరాలకు వెళ్ళామండీ. ఆవిడ స్నానం చెయ్యబోయి, నీళ్ళలో మునిగిపోతుంటే, కొప్పు అయితే చేతికొచ్చింది కానీ, ఆమె రాలేదు. ఆ రోజు నుంచి, ఈ రోజు వరకు కుండెడు అన్నం ముందు బెట్టుకుంటే లోపలికి పొయ్యే ముద్దేగాని బయటికి వచ్చే మెతుకే లేదంటే నమ్మండి.



## కొరువాసాని సోమయాజులు:

పగటి వేషాల్లో వినోద ప్రధానమైనది కొరువాసాని సోమయాజులు వేషం. కొరువాసాని తురకవేశ్య, సోమయాజులు ఛాందస బ్రాహ్మణుడు ఆమె తురకంలో మాట్లాడే మాటల్ని సోమయాజులు, తెలుగు భాషలో సంభాషించే తీరు ప్రేక్షకుల్ని నవ్విస్తుంది. ఎలా?

ఆమె ముసల్మాన్ అంటే, ముసలమ్మవా? అంటాడు. కోన్ హై? అంటే, మాది కోనసీమ కాదంటాడు. గానా సునే గాయా....అంటే, గానుగ సున్నం వద్దు అంటాడు.

ఇక శాస్త్ర ప్రకారం పాప పుణ్యాల విషయం చెపుతూ, అవును దానంచేస్తే పుణ్యం అంటాడు. దూడతోనున్న ఆవును దానంచేస్తే మహాపుణ్యం అంటాడు. ఈ ప్రకారం చూస్తే కన్యాదానం పుణ్యం గనుక గర్భిణీ స్త్రీని దానం చెయ్యడం మరీ పుణ్యం అంటాడు. అంతేకాదు పిల్లల తల్లిని దానం చెయ్యడం మహా పుణ్యం అవుతుందని సిద్ధాంతీకరిస్తూ ప్రేక్షకుల్ని నవ్వుల్లో ముంచేస్తా డంటారు. పడా రామకృష్ణారెడ్డిగారు విశాలాంధ్ర వ్యాసంలో.

తనను గురించి తాను ఈ విధంగా చెపుతాడు. మేము బ్రాహ్మణులం, మా అన్నయ్యగారు వేరు. నిరక్షర కుక్షి విరూపాక్ష దీక్షితులుగారు. పొట్ట చింపినా అక్షరం ముక్కరాదు. ఇక మా తమ్ముడు తస్కర సోమయాజులు, పోలీసువాళ్ళతో మంచి దోస్తి. నా శిష్యులు గోంగూర పేరిశాస్త్రులు, వుల్లిపాయల లింగావధాన్లు, దొమ్మరి రాఘవాచార్యులు, దూదేకుల పెద్దిభొట్లు సాతాని శంభులింగం అని చెప్పుతుంటే ఆ మాటలకు పగలబడి నవ్వుతూ వుంటారు జనం.

ఇక సన్మానాలను గురించి చెపుతూ కనకాభిషేకం, రత్నాభిషేకం, పుష్పాభిషేకంతోపాటు శిరాభిషేకం అని ఓ కొత్తది చెబుతాడు. శిరాభిషేకం అంటే ఆ మనిషి నెత్తిమీద రాళ్లు రువ్వటమట...ఇదీ తీరు. ఈ విధంగా అస్తవ్యస్త పదాలను వాడుతూ, ప్రేక్షకులను నవ్విస్తారు. ఇందులో ఛాందసుల్ని విమర్శిస్తూ ప్రజలను వినోదపరుస్తారు.

## మాదిగ వేషం:

పగటి వేషాల్లో మాదిగవేషం కూడ ప్రాముఖ్యమున్న వేషం. ఈ వేషాన్ని ఏలూరు వాస్తవ్యుడు సున్నపు వీరయ్య అద్భుతంగా ధరించేవాడు. తలకు పెద్ద

పాగా, చుట్టి నల్లని ముఖంమీద ఎర్రని కుంకంబొట్టు పెట్టి, మెడలో తాయిత్తు కట్టి, కట్టు పంచను పైకి ఎగకట్టి. డప్పు వాయిస్తూ — తాలే విల్లియ్యాలోయ్. రామా రాఘవ విల్లి య్యాలోయ్, ఊరికి వెలుపల ఉన్నామండోయ్. ఊర పందిని తిన్నామండోయ్. తాలేవిల్లియ్యాలోయ్, శివతాలేవిల్లియ్యాలోయ్ అని పాడుతూ. దానికి



సున్నపు వీరయ్య చాటింపు వేషం

అనుగుణంగా గంతులువేస్తూ, వేదాలను గురించీ, జాతులను గురించీ, అంటరానితనాన్ని గూర్చీ, కులాల గురించీ, పాటల్లోనూ, మాటల్లోనూ విమర్శనాత్మకంగా చెపుతూ, విన్న ప్రతివారినీ ఆలోచింప చేస్తాడు. అంటరానితనాన్ని గురించి ఈ విధంగా పాడుకాడు.

అంటరానితనం పాట :

కుక్కని కోతిని కొల్చుతారయా
నందిని పందిని పూజ సేతురూ

తోటి మానవుడు ఎదురై వస్తే
దూర దూరమని తొలగిపోదురు. ॥తాలే॥

కుక్కంటే కాలభైరవుడనీ, కోతంటే హనుమంతుడనీ, పంది అంటే వరాహావతార మని గ్రహించాలి.

కులాల గురించి :

శునక గర్భమున జన్మించిన ఆ శౌనకముని
గోత్రమ్ము చెప్పుతా - మండూకమునకు
పుట్టినట్టి ఆ మాండవ్యుని కులమేదో తెల్పుడి ॥తాలే॥

రకరకాలైన కులాలు లేవనీ, రంగు రంగుల మతాలు లేవని, కలిగినవారిది గొప్ప కులమూ, లేనివారిది లేని కులమూ అంటూ.

వశిష్టుని గురించి :

తల్లి తొలుత లంజ తన యాలి మాదిగ
తాను బ్రహ్మడనగ తగునె జగతి
తపస్సువల్ల ద్విజుడు తర్కించప కులమేది
విశ్వదాభిరామ వినురవేమ.

అలాగే శూద్రుల గురించీ, బ్రాహ్మణుల గురించీ.

జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః
వేదభ్యాసే విప్రశ్యాతేః
బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః.

అంటూ. ఇలా అనేక గ్రంథాలలోని పద్యాలూ, శ్లోకాలూ ఉదహరిస్తూ, కులవ్యవస్థను తూర్పారబడుతుంటే అతని శాస్త్రవిజ్ఞానానికి ఆశ్చర్యమేస్తుందని, పడాల రామకృష్ణా రెడ్డి గారు విశాలాంధ్రలో ఉదహరించారు.

పై విధంగా అంతా వర్ణించి, దండోరా వేసినట్లు ఊళ్లోకి, ధాన్యమూ, పప్పులూ, ఉప్పులూ వచ్చాయనీ, ఉప్పు కుంచం వంద రూపాయలని, కావలసిన వాళ్ళంతా వచ్చి కొనుక్కోండహో. అని అంటూ వుంటే పల్లెజనం బిత్తరపోయి చూస్తూ వుంటారు. ఇలా ఈ వేషం ద్వారా విజ్ఞానాన్నీ వినోదాన్నీ కలిగించేవారు.

## పగటివేషంలో సాతాని వైష్ణవులు:

పైన వుదహరించిన సాతాని వైష్ణవుల మాదిరి. ముఖంమీదా, గుండెలమీదా, భుజాలమీదా పెద్ద పెద్దనామాలు దిద్ది, అక్షయపాత్రలు ధరించి, హార్మోనియం, మద్దెళ్ళతో త్యాగరాయ కీర్తనలు పాడుకుంటూ వచ్చి మేమంతా వైష్ణవుల మందీ. అయితే శ్రీ వైష్ణవులం మాత్రం కాదు. నూట అయిదు దివ్యక్షేత్రాలు సేవించుకుని తిరుపతికి వెళుతున్నామనీ, కంచెలుగానీ, కాసుల పేర్లుగానీ, దుద్దులుగానీ, జూకాలు గానీ, వడ్డాణం గానీ, వెండి బంగారు రూపేణా మీవద్ద ముడుపులుంటే మా అక్షయపాత్రలో వెయ్యండి. మీ రిచ్చే ముడుపులన్నీ స్వామిపేర కైంకర్యం చేసేస్తాం. మీరే వెళ్ళాలంటే, రానూపోనూ చాలా ఖర్చు అవుతుంది. పైగా శ్రమ అందువల్ల మా వంటి భక్తులకు ఇచ్చారంటే, మరేదో కాలేదు. అంటూ ఈ విధంగా ఊదరగొడుతూ వుంటే చుట్టూ చేరిన జనం, దొంగభక్తుల మాటలకు ఉబ్బి తబ్బిబ్బు అవుతూ వుంటారు. ఈ వేషధారులు సమయానుకూలంగా విష్ణుపురాణంలోని ఘట్టాల ననుసరించీ, శ్లోకాలనూ, పద్యాలనూ ఉదాహరిస్తూ వుంటారు.

## బాలరండా రుక్మాబాయి (వెధవముండల వేషం):

గోవింద నామాలు - ద్విపద నడక



ఆయువూ లేకను, గోవిందారామ,
అయనే పోయెను ॥గోవిందా॥
భుజముమీదా కొంగు ॥గో॥
బుర్రకు వచ్చెను ॥గో॥
బుట్టలో విభూతి ॥గో॥
నొస్టకు వచ్చెను ॥గో॥
కాలిమట్టెలు పోయి ॥గో॥
కంట కాటిక బోయె ॥గో॥

ముక్కు వత్తూ బోయె ॥గో॥
మొగము కుంకుమ పోయె ॥గో॥
చెవుల కమ్మలు పోయె ॥గో॥
చేతి గాజులు పోయె ॥గో॥
నొసట కుంకమ పోయె ॥గో॥
నెత్తి జుట్టును పోయె ॥గో॥
చాకలి సుబ్బని కోరిక తీరెను ॥గో॥
మంగలి గురవని మనసును దీరె ॥గో॥
పోయిన మగడును పోతేపోయె ॥గో॥
పొన్నకాయ వలె కుదిరింది తల ॥గో॥
వారి వీరి పుణ్యాన గోవిందారామ
అబ్బాయి పుట్టెను గోవిందారామ
తాళిబొట్టూ పోయె గోవిందారామ
తలవెంద్రుకలు పోయె ॥గో॥

మొదటి వారు: అయ్యో నాయనా, ఏం చెప్పేది నాయనా (అని ముక్కు చీదుతుంది)

రెండ: ఏమిచేయమ్మ - చెప్పరాదుటే అమ్మ.

మొద: కోటప్ప కొండ ప్రభ అంతే మనిషే అమ్మ.

రెండ: అట్టాగుటే అమ్మ.

మొ: ఏం చెప్పేదే అమ్మ.

రెండ: ఏమిటే అమ్మ.

మొ: మా వారూ నేనూ కలిసి, తీర్థయాత్రకని వెళ్ళామే అమ్మ.

రెండ: ఏం జరిగిందే అమ్మ.

మొ: తిరుగుతూ, తిరుగుతూ, శ్రీరంగం, కంచి, కాళాస్త్రి, రామేశ్వరం వెళ్ళాం.

రెండ: ఏం జరిగిందే అమ్మ.

మొ: అక్కడ సత్రంలో దిగి స్నానికని బయలుదేరినామే, నేనేం చేశానంటే మళ్ళీ వచ్చేటప్పటికి ఆలస్యం అవుతుందని వంటచేస్తున్నా. ఆయనేం చేశారంటే. నువ్వు వెనకరావే, నే వెళ్ళి తీర్థ శ్రార్ధం పెడుతూ వుంటాను అని చెప్పి వెళ్ళి స్నానంచేసి శ్రార్ధం పెట్టి నేను వెళ్ళేసరికి బాగా లోతుకు వెళ్ళారే అమ్మ.

రెండ: ఏమైందే అమ్మ.

మొ: లోతుకు వెళ్ళిపోతున్నా పోతున్నానే అన్నారు ఆయన.

రెండ: నువ్వేమన్నావే అమ్మ.

మొ: పోయేవారు పోతూనే వున్నారు — సోదుల్లోకి స్వప్నాల్లోకి రాకండి అని చెప్పి, ఇంటికి వచ్చి చేసిన పిండివంటలు తిని బయలుదేరి వస్తుండగా మార్గ మధ్యంలో మగదక్షత లేకుంటే బాగుండదని ఈ ఆచారిగారి దగ్గర శిష్యరికం చేస్తూ, వీరితోనే జన్మ తరింపచేసుకోవాలని చూస్తున్నాను.

(అయితే నేనూ నీతో వస్తానే గోవింద నామాలతో నిష్క్రమిస్తుంది.) ఈ విధంగా ద్వంద్వార్థాలలో గోవింద నామాలు సాగుతాయి.

## శారదవేషం:

పగటి వేషధారులు ఏ గ్రామంలో పగటివేషాలను ప్రారంభిస్తారో, అక్కడే అని వేషాలనూ రోజుకొక వేషం చొప్పున ప్రదర్శించి చివరి రోజున ప్రతి ఇంటికీ పారితోషికాల కోసం తిరుగుతూ, ప్రతివారినీ పొగుడుతూ ఇలా ప్రారంభిస్తారు.

రాజాధిరాజ మహరాజ
రవికోటి చంద్రతేజ
కళాపోషకా నటరాజ
కళారాధనయె శివపూజ
అంగాభినయమె హరిపూజ
సన్మానమో కల్పభూజ

ఓ, శారదే, కరుణానిధే.

కళారాజ్య విస్తారం
శారదాంబ పరివారం
కృష్ణా ప్రాగ్దిశ తీరం
కూచిపూడి అగ్రహారం
కులమున బ్రాహ్మణవారం
కళాకేళిచే హారం
మిక్కిలి యడుగ నేరం

చందమామ ఆకారం - మీ
మెడలో చంద్రహారం - ఆ
హార మీవె అలంకారం.

ఇలా పాడుతూ —

తెలుగు మాగాణిమోయి
భాషకు తెలుగే మెరుగోయి
టంగుటూరి మనవాడు
ఆంధ్ర కేసరిగ వెలిగాడు.
ఓ శారదే, కరుణానిధే, దాశరథీ, సుగుణానిధే.

అంటూ

మేలిమి కన్నులే సోగ - ఆ
కల్కి తురాయి పాగ - మీ
సిరమున వెలిగేలోగ - ఆ
కోరమీసములు సరిగాగ
దానకర్ణుడని మీ లాగ ॥ఓ శారదే, కరుణానిధే॥

అంటూ

ఇది నాలుగుజాముల ప్రొద్దు
న న్నెగదిగ చూడవద్దు.
నా పేరే శారద పద్దు
తమ కీర్తి వింటే ముద్దు - ఆ
ముద్దుల మీసం దిద్దు
మాపు రేపు అనవద్దు

అన్నా

మీకే తెలుసుర ఆ పద్దు
కూచిపూడి రామాయన్న
పార్వతీశుడర న న్నెన్న
తాంబూల మిచ్చి పంపన్న.



ఓ శారదీ, కరుణానిధీ - అంటూ ఇంటింటికి తిరిగి వారిని వుబ్బి తబ్బిబ్బుచేసి బాగా డబ్బు గుంజుతారు. నెలరోజులూ వేషాలు చూచిన గ్రామ ప్రజలు కూడా తృప్తిగా ముట్టచెపుతారు.

శారద వేషంలో ప్రధానాంశం, రామాయణ కథా భాగాన్ని గేయరూపంలో వర్ణించి చెప్పటం ముఖ్యం. రాముడు సీతారామ లక్ష్మణులతో పర్ణశాలయందుండగా, మారీచుడు మాయలేడి రూపంలో వచ్చి, దానిని కోరటం, సీతాపహరణం, జటాయువు కథ, లంకాదహనం, రావణ సంహారం మొదలైనవి ఉంటాయి.

## దాష్టిక పంతులు, చిట్టి పంతులు :

దర్జాను వెలగబెట్టేవారిని దారికి తీసుకువచ్చే విధంగా దాష్టికపంతులు - చిట్టి పంతులు సంవాదం ఇలా ప్రారంభ మౌతుంది.

భళదాష్టిక పండితేంద్రా, బిరాబరి.

పంతు: వారెవరే, శహభాష్, అవునోయి చిట్టి పంతులు. పంతులుగారు వస్తున్నా రంటే, ఎదురుగా రావటం కౌగలించుకోవడం, ఏమీ లేకపోయెనేమోయ్.



సున్నపు వీరయ్య చిట్టిపంతులు

చిట్టిపంతులు: అయ్యా చిత్తం. ఇంతగా బహువచనంగా సెలవిస్తున్నందున, మాకు తెలవలేదండీ.

ఇలా దాష్టికం పంతులు తన గొప్పతనాన్ని చాటుకుంటూ వుంటాడు. అయితే ఎవరూ లెక్కచేయరు. ఉదాహరణకు — అవునోయ్ పంతులూ, యీ పిల్లలంతా ఏమిటోయి?

చిట్టి: భాగవతం ఆడుతున్నారండి.

దాష్టి: అవునోయి పంతులు ఎవరాడిస్తే ఆడుతున్నారు.

చిట్టి: మహారాజరాజేశ్వరులు, లక్ష్మీ పుత్రులు.

దాష్టి: ఎందు నిమిత్త మాడుతున్నారు.

చిట్టి: ఉదర నిమిత్తం బహుకృతవేషం—అవునోయ్ మేము అధికారులము నువ్వు ముందు నడుస్తావటోయ్.

చిట్టి: చిత్తం మహాప్రభో, వాళ్ళను వెనుక నడిపిస్తాను లెండి.

దాష్టి: అవునోయ్ చిట్టీ, నాకు నుయ్యి అయినదీ తెలియదు, గొయ్యి అయినదీ తెలియదు. ఈ గోతిలో పడమన్నావటోయ్.

చిట్టి: ముందు నడిస్తే ముందు నడుస్తారా అంటిరి. వెనుక నడిస్తే ఇలా అంటున్నారు. ఎలా అయ్యా —

ఇలా సంవాదం జరుగుతూ వుండగా భోగంవాళ్ళు వస్తారు.

చిట్టి: అయ్యా భోగంవారు వచ్చారు వారికి బస ఎక్కడ కుదరలేదు.

పంతు: మన దేవతార్చన గదిలో దించు.

చిట్టి: చిత్తం, అయ్యా. అక్కడ దేముడున్నాడండి.

పంతు: దేముణ్ణి తీసి ముసలమ్మ కొట్లో పడవెయ్యవోయ్.

చిట్టి: ముసలమ్మగా రున్నారండి.

పంతు: ముసలమ్మను తీసి గుఱ్ఱాలసావిట్లో పడవెయ్యి.

ఇంతలో: భట్రాజులు వస్తారు.

భట్రాజులు: చిత్తం, అయ్యా, మోదుకూరు భట్టు మూర్తులం మీ సందర్శనానికి వచ్చాం.

పంతు: అవునోయ్ పంతులు, మీ సందర్శనానికి వచ్చామంటున్నారు. అది మానేసి, గడ్డం దర్శనం చేసుకోమనవోయ్—

ఇలా భట్రాజులకూ, దాష్టికం పంతులుకూ మధ్య చాలా సంభాషణ జరుగుతుంది. అంతా లోకంలో జరిగే విశేషాలన్నిటిని చర్చిస్తారు. ప్రశ్న సమాధానాలతో,

పాత్రల మన స్తత్వాలను తెలియజేస్తారు. ముఖ్యంగా సమాజంలో వుండే గొప్పవారి అహంభావాలనూ, అహంకారాలనూ, వానితోపాటు వారి తెలివి తక్కువ తనాన్నీ వెల్లడిస్తారు.

చివరికి చిట్టి పంతులు ఇలా అంటాడు భట్రాజులతో, ఏమోయ్ భట్రాజులూ, పంతులుగారు మీకు సన్మానం, శాంక్షన్ చేశారు - తీసుకోండి.

భట్రాజులు: భళీ భళీ, దాష్టిక పండితాతము ఉదారము. దరిద్ర దేవత తొలగి పోయింది. మహానందమని నిష్క్రమిస్తారు.

## పఠాన్, గులాం:

ఈ వేషం ముఖ్యంగా ఉర్దూలో వుంటుంది. పాత్రలు, పఠాన్, గులాం, బైరాగి వారి సంభాషణ ఉదాహరణకి ఇలా సాగుతుంది.

పఠాన్: అరే, ఖోనా, పేనా, పైరే, గులాం.
అరే గులాం, బిచానా తయార్‌కరో.
అలే గులాం. యేబీ అచ్ఛానై హిసిడాలో,
అరే గులాం, కోనా, పేనా, హుక్కా తయార్‌కరో.

గులాం: తయార్, కర్తాహుం సర్దార్.

పఠాని: హుక్కామే క్యా బనాహై.

గులాం: హుక్కామే, లవంగి, యాలకి, జాజి, జాపత్రి, యేబీ సబీ మిళాకర్కె డాల్తాహుం, సర్దార్?

పఠాని: అచ్ఛాహై. అరే గులాం, అంగార్ దేఖో.

గులాం: ఏ అంగార్ నహీ సర్దార్.

పఠాని: గులాం అంగార్ లావో.

గులాం: లాతే హజరత్ సర్దార్.

పఠాను: హుక్కా లావ్.

గులాం: హం సర్దార్.

ఇంతలో దర్వాజా దగ్గరకు బైరాగి వస్తాడు.

పఠాన్: యే దర్వాజాయే గడబిడ కడై — కోన్ ఆయా.

గులాం: బైరాగి ఆయా సర్దార్.

పఠాన్: యే బైరాగి ఆయా, కిత్నే జనే ఆయా.

పఠాన్: అరే గులాం, బైరాగిని బులావ్.

ఇలా బైరాగితోనూ, గులాంతోనూ, పఠాన్ దర్జానంతా చూపిస్తాడు. పైమాదిరే సంభాషణా ముగ్గురి మధ్యా జరుగుతుంది. చివరికి పఠాన్ ఇలా అంటారు.

పఠా: అరే కోనాధీ నా పైరే గులాం.

గులాం: అరే గులాం గులాం అంటావ్. కైకుపుకార్తేకే గులాం మే?

పఠా: నేనా గులాం, నువ్వా గులాం?

గులాం: నువ్వు గులాం. నీ తాత గులాం.

పఠా: ఏ బార్ రూప్యా నౌకరి హై?

గులాం: ఏక్ రూప్యా నౌకరీ హై?

పఠా: తేరే నిఖాయె తుంహె?

గులాం: మైహు మేరె నిఖాయె తుంహె?

పఠా: చల్తి చల్తి — యేహిస్ ఫర్, ఖద్గరెగ జాగిరా దారుహై. హమార్ వాఃఖోదా పంజలేగ.

గులాం: శినేకు మేరాఆయా — సేనా జూదా కరే జావ్.

పఠా: దీన్ మౌలా ఉందీం మౌలా, — యాహూదస్తహై, మహమ్మద్ దరసూ లిల్లా, యా మహమ్మదరసో లిల్లా.

పఠాని సాహెబ్, పకీరయ్యాడు.



# జంగం దేవర వేషం

శైవ వైష్ణవ మతాల విజృంభణలో ఎవరి మతాన్ని వారు ప్రచారం చేయడంలో శైవభక్తులైన జంగాలు, జంగం దేవర వేషాలు ధరించి శైవమత ప్రచారం చేసే వారు.

ఈ ప్రచారంలో శత్రు మిత్ర భేదమనేది లేదనే విశాల విశ్వమంతా నిండి యున్నది. పరబ్రహ్మ స్వరూపమనీ, శైవమతాన్ని గూర్చి, శైవ క్షేత్రాల విశిష్టతను గూర్చి, పెడితే జంగానికే పెట్టాలనీ, కడితే లింగాన్నే కట్టుకోవాలనే తత్వాలను పాడుతూ, శైవమతాన్ని ప్రచారం చేస్తూ భుక్తితో పాటు ముక్తినీ పొందుతూ ఆ ప్రచారానికి అంకితమైపోయేవారు.

అయితే ఈ వేషాన్ని పగటి వేషధారులు ధరిస్తూ వ్యంగ్యంగా ఇలా పాటపాడే వారు.

ఏమిసేతురా లింగ ఏమి సేతురా నీదు
మతము ఎవరికి తెలియరాదు
గంగ ఉదకము దెచ్చి నీకు లింగపూజలు
సేతమంటే గంగలోన కప్ప చేప
లెంగిలంటున్నాయి లింగా.

అచ్చ ఆవుల పాలు దెచ్చి అరిపితంబు
సేతమంటే అచ్చ ఆవుల లేగదూడ
లెంగి లంటున్నాయి లింగా.

తుమ్మిపూవులు దెచ్చి నీకు తృప్తిగా
పూజ సేతమంటే కొమ్మ కొమ్మకు కోటి
తుమ్మెద లెంగిలంటున్నాయి లింగా.

యనుచు తత్త్వాన్నాలాపిస్తూ

జాజీఫల రసపానమత్తః కేరో యథా
తథా ఆనంద అమనస్క రాజయోగోధి రాజతే.

జాజీ ఫల రసపానం చేసి మత్తెక్కిన చిలుక చందము తెలియ రాజయోగాను భవము అలా వుంటుందనీ కొంతపేపైనా మనసు నిల్పర విశ్వమంతయు సీవని



జంగం దేవర వేషం

మదిని దల్పర యని తాత్వికాన్ని ప్రబోధించేదీ వేషమని, భాగవతుల లక్ష్మీ నరసింహం గారంటున్నారు.

## మందులవాళ్లు :

సహజంగా భద్రాచల ప్రాంతం నుంచి గిరిజన జాతులకు చెందిన కోయ స్త్రీ పురుషులు, కొండమూలికలు తెచ్చి ఆ మందులు ఏయే జబ్బులకు పనిచేస్తాయో వాటిని వల్లిస్తూ బజారులన్నీ తిరుగుతూ ఏ జబ్బుకు ఏ మందు లున్నాయో ఏకరువు పెట్టటం మనకు తెలిసిందే.

అదే మాదిరి పగటి వేషధారులు. ఓ వాత నొప్పులకు మందులు, ఓ కీళ్ళ నొప్పులకు మందులు, ఓ శిరోవాతానికి మందులు, ఓ సీత పైత్యానికి మందులు, ఓ కాళ్ళతీతలకు, అరికాలి మంటలకు మందు.

ఓ దొరగారు, మంచి మంచి మందు లుండాయి. ఓ, మేలాడి, దోమతిరుగుడు, దేశ తిరుగుడు, తల తిరుగుడు, రోగాలకు మేలైన మందులు గాడిదలమీద మోయించుకొచ్చాము దొర.

ఓ పాము కరిస్తే, దోమ కుడితే, ఎలుక కరిస్తే, ఓ దొర కుక్కకరిస్తే, ముల్లు కొడితే, కెముడుకు మందు, పైత్యానికి మందు, ఓ దొర ఎన్నో మందు లుండాయి.



విభూతి భవానీలింగం పార్టీ - మందులవాళ్లు

ఓ దొర, తెల్లి ఈశ్వరి, నల్ల ఈశ్వరి, ఓ పిల్లి అడుగు, ఓ పిట్టకాలు, కస్తూరి, గోరోజనం, సీతమ్మరసం, ఆనందభైరవి, వంగభస్మం, రాతిభస్మం, ఓ సువర్ణభస్మం, తామ్రభస్మం. మకరధ్వజం. చంద్రోదయం. ఓ ఎన్నో మంచి మంచి మందులున్నాయి దొర.

ఇలా మందు ఆయుర్వేదానికి సంబంధించిన అన్ని మందుల్ని వివరిస్తూ, ఆ మందుల్లో ఏయే మందు, ఏయే జబ్బుకు వాడవచ్చునో. ఆయుర్వేదశాస్త్రాన్నంతా వివరిస్తారు. పెద్దవాళ్ళకు, ఆడవాళ్ళకు పిల్లలకు, ఎవరికి వాడే మందులు, వారికి చెప్పి చివరికి.

ఓయమ్మో, ఓ తల్లో...ఊరికే సూత్తారేమమ్మో, మాదా కవళం వెయ్యమ్మో అంటూ, ఓ రామయ్యగోరో. ఓ రంగయ్యగోరో, ఓ రత్తయ్యగోరో. అయ్యో, మా అయ్యో, ఓ అయ్యో.

కమ్మని, కమ్మని కళలను జూపే
కళాక్షేత్రమే మాదయ్యా
కళాకారులము మేమయ్యా.
అబ్బో, - ఓ అబ్బో - ఓ - లబ్బో
పుట్టుక కళలకు మాది
పొట్టల నింపుట మీది
కోటకు దీటగు కళల కెల్లను
కూచిపూడియే మాది.

ఓ అబ్బో: ఓ అబ్బో, ఓ అబ్బో అంటూ మా భాకపళం మాయమ్మా, మడి మాన్యాలే తేవమ్మా అంటూ పారితోషికాన్నందుకుంటారు.

వెంకటరాముడు :

ఈ వేషాన్ని కూచిపూడివారు ఒక పద్ధతిలో ప్రదర్శిస్తే వెంకటరాముడు సామెతలతో హాస్యోక్తులతో మూడుపందల ఇరవై రోగాలకు మందుల పేర్లు చెప్పి ఆకిరిపిల్లి గట్టుకాడ, అవ్వసరికాడ, ఔషధ క్రియలు తెచ్చానని చెపుతూ, హాస్య ధోరణిలో.

పందిపిల్ల నిచ్చి పరువు నిలిపినట్లుగను
కుక్కపిల్ల నిచ్చి కులము నిల్పినట్లుగను

కడుపుబ్బ నవ్విస్తూ కేవలం వినోదం బోధించటమే కాక ఆరోగ్య నియమాలను పాటించకుండా, ఆరోగ్యం చెడగొట్టుకున్న వారిని, హేళనచేస్తూ, సన్మార్గం బోధించటమే మందులవాని వేషంయొక్క ముఖ్య ఉద్దేశం.

## సిద్ధి-కంచెనీ వేషాలు

జానపద కళారూపాలలో ఎక్కువ స్థానాన్ని ఆక్రమించినవీ, బహురూపాలుగా ప్రజలను అలరించినవీ, పగటి వేషాలే, అలాంటి వాటిలో నాటి సామాజిక పరిస్థితుల్ని వివరించేదే సిద్ధి-కంచెనీ వేషాలు.

తురకజాతికి చెందినవాడు సిద్దీ...ముఖానికి నల్లటిరంగు పూసుకుని, రెండు అంగుళాల పొడవైన గడ్డం పెట్టుకుని, చొక్కాపైన వేస్టు కోటు ధరించి టర్కీ టోపీ, సిల్కు లుంగీ, బఫూన్‌లా వుంటాడు.

కంచెనీ అంటే భోగంవారు. నాట్యకత్తెలైన వీరు ఇద్దరు ముగ్గు రుంటారు. వీరు జావళీలనూ కృష్ణ శబ్దాన్నీ, మండూక శబ్దాన్నీ, దశావతారా లనూ, అష్టపదులను, తరంగాలను, అధ్యాత్మిక రామాయణ కీర్తనలను, త్యాగ రాయ కీర్తనలను పాడుతూ; సుందరంగా నృత్యం చేస్తూ చక్కగా అభిన యిస్తారు. వీరికి హంగుగా, హార్మోనీ వాయించేవారూ మద్దెల వాయించేవారూ వుంటారు.

ఇంతలో సిద్దీ ప్రవేశించి నే నిక్కడ పాదుషావారి కాపలాదారుననీ, అల్లరి చేయవద్దనీ - అంటాడు

# సోమయాజులు, సోమిదేవమ్మ

వినోదం కలిగిస్తూ, నవ్విస్తూ పరిహసిస్తూ సంఘంలోని దురాచారాలను. దుర న్యాయాలను బట్టబయలుచేస్తూ సంఘానికి దర్పణంగా దిక్సూచిగా వ్యవహ రించటమే పగటి వేషాల ప్రధాన ఆశయం.

పాత్రోచిత భాషతో జాను తెలుగు నుడికారంతో వెలువడే వేషాలలో సోమ యాజులు, సోమిదేవమ్మ వేషం ముఖ్యమైనది.

ఛహనా వైదిక మతస్థులను పరిహసించడమే ఈ వేషంయొక్క పరమాశయం. ఇందులో మూడే పాత్రలు ఒకటి సోమయాజులు, రెండు సోమిదేవమ్మ మూడు శిష్యుడు. ఈ మూడు పాత్రల సంభాషణలూ వ్యంగ్యార్థాలతో కూడి చమత్కారంగా వుంటాయి. ఈ పాత్రలు, పంచాంగ శ్రవణాన్నీ, రామాయణ శ్రవణాన్నీ వైదిక కార్యకలాపాల్నీ అవహేళన చేశాయి.

కూచిపూడి పగటి వేషధారులు ప్రదర్శించిన ఈ పాత్రలు బహుళ ప్రచారాన్ని పొందాయి. ఒక రకంగా చూస్తే ముసలి మొగుడు, పడుచు పెళ్ళాం మన స్తత్వా లను తెలియచేసేవే ఈ రెండు వేషాలు. సోమయాజులు ముసలివాడు. ఆయన భార్య సోమిదేవమ్మ పడుచుపిల్ల. వీ రిద్దరిమధ్యా ఆసులో గొట్టంలా ఒక శిష్యుడు. ఆ దంపతుల మధ్య సంవాదం ఇలా సాగుతుంది.

సోమయాజులు ఇలా ప్రవేశిస్తాడు, మహాప్రభో మేము అయితాగ్నులం, పరాన్నప్రియులం, శ్రోత్రియులం, ముమ్మారూ వెళ్ళి మూడు కావెళ్ళు తెచ్చినాము. కాశీ గంగ కావెళ్ళు.... చెయ్యా చేయించగల సమర్థులం. ఏమిటంటే యజ్ఞ యాగాది క్రతువులు, వివాహ ఉపనయనములునూ నాయనా! మా సోమిదేవి ఇక్కడ వుందా లేదా? వాసే సోమీ, వాసే సోమీ, వాసేసోమీ .... అని పిలుస్తాడు.

సోమిదేవి: సోమీ సోమీ అన్న నోటికి విధివిరామం లేదుకదా? ఆ నోరు ఎన్నడైనా పచ్చి వెలక్కాయ చిప్పల్లాగా నొక్కుకుపోతే సుఖపడుదును.

సోమ: ఏమిశ్రా నాయనా! అంఘోంది.

శిష్యుడు: తాతగారూ మిమ్మల్ని తిడుతోందండి.

సోమ: ఒరే, శిష్యా మిమ్మల్ని తిడితే నాతో చెపుతారేంరా దౌర్భాగ్యుల్లారా!



గొల్లపడుచు, బ్రాహ్మణుడు సంవాదం

శిష్యు: నిన్ను తిడుతోంది.

సోమ: నిన్న తిడితే ఇవ్వాళ చెపుతారేంరా!

శిష్యు: కాదండీ తాతగారూ. అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నారు గనుక మిమ్మల్నే తిడుతోందండీ.

సోమ: నన్నే తిడుతోందీ. అసే సోమీ నన్నే తిడుతున్నావటే?

సోమి: ఇదుగో ఏమో విన్నారు కాదుకదా? నేను మాట్లాడితేనే మీకు తిట్టు.

సోమ: తిడితే తిట్టు అవుతుందిగాని, మాటంటే తిట్టు యెలా అవుతుంది? సరే నీవు తిట్టినా నాకు సమాధానమే.

సోమి: అదిగో మీ ఇల్లు బంగారంగానూ. మీరన్నా నాకు సమాధానమే.

సోమ: నేనంటే నీకు ఎలా సమాధానమో చెప్పు.

సోమి: నేనంటే మీకు యెలా సమాధానమో చెప్పండి.

సోమ: ఇదిగో నిన్ను చూచినా, నీ పాటలు చూచినా, నీ మాటలు చూచినా, నీ చక్కదనం చూచినా, నీ సౌందర్యం చూచినా, నీ నగలు చూచినా, నీయొక్క నవ్వు చూచినా, నీ కులుకు చూచినా, నీ టక్కు చూచినా, నీ టమారం చూచినా, ఆ రెండూ చూచినా, ఆనందో బ్రహ్మానంద మౌతుంది.

శిష్యు: ఏమిటండోయ్ తాతగారూ, ఆ రెండూ అంటున్నారు?

సోమ: కంటె, కాసులపేరురా?

సోమి: అదుగో యేమో విన్నారు కాదు కదా: నాకు మిమ్మల్నిచూస్తే చాలా సంతోషంగా వుంది.

సోమ: నేనంటే నీకు యెలా సంతోషమో చెప్పవే!

సోమి: అదిగో మిమ్మల్ని చూచినా, మీ రుద్రాక్షలు చూచినా, మీ పురిపిడికాయ చూచినా, మీ దొప్ప చెవులు చూచినా, దోనె కడుపు చూచినా, మీ ముసలి గడ్డం చూచినా, మీ తలకాయ చూచినా, తట్ట తలపాగ చూచినా చాలా సంతోషంగా వుంటుంది.

సోమ: నా ముఖం, నా ముఖం అని ముమ్మారు శ్లాఘించావు. నా ముఖానికేమే.

సోమి: ....దూరంగా వుండండి ముసలికంపేస్తోంది.

సోమ: .... నా కంపే నీకు గిట్టదు. నిన్ను వదలి యే బ్రాహ్మడి మెళ్ళో జంధ్యాలు తెంచైనా గంగా యాత్ర పోతాను.

సోమి: అంతమాత్రం పోశెమి పుట్టాలిగాని నేనూ ఆ శిష్యుణ్ణి తీసుకుని రామేశ్వరం వెడతా నంటుంది.

ఇలా ఒకరిమీద ఒకరు నిందలు వేసుకుంటూ, భార్యాభర్తల మధ్య వుండే కగవులాటల్నీ ఏకరువు పెడతారు. మధ్యలో బొమ్మలాటలో గంధోళిగాడిలా శిష్యుడు ఇద్దరి మధ్యా ప్రశ్నలువేసి రెచ్చకొడతాడు. ఆద్యంతం వారి మధ్య జరిగే సంభాషణా విధానం, చతురతా, ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేస్తుంది.

భాగవతుల్ని అదలిస్తాడు. బృందంలోని గురుమూర్తిని, గొట్టెమూతనీ, గోవిందప్పను గోంగ్రుకప్పనీ, భరతనాట్యాన్ని బడితె నాట్యమనీ, ఇలా వక్రంగా మాట్లాడుతూ ప్రేక్షకులను నవ్విస్తాడు.

## అమ్మాయిల్ని చూసి ఆడమంటాడు :

నృత్యంచేసే అమ్మాయిల్ని చూసి ఆనందపడిపోయి ఆడమంటాడు. అప్పుడు అమ్మాయిలు వివిధ నాట్యరీతుల్ని, శాస్త్ర విషయాలనూ, శ్లోకాల ద్వారా వర్ణించి వాటి అర్థం వివరించి తల పండిన పండితులు కూడా తలలూపే విధంగా మెప్పిస్తారు. ముఖ్యంగా బాలగోపాల తరంగం, దశావతారాలవంటి రూపాలను నడివీధిలోనే ముద్రలుపట్టి అభినయిస్తారు. అంటే శాస్త్రీయ రూపాలైన వీటిని సామాన్య జనానికి అందుబాటులో ప్రదర్శిస్తారన్న మాట.



అందంగా, సుందరంగా అభినయించిన నాట్యకత్తెల అభినయం చూసి, సిద్దీ ఏమీ ఇవ్వకపోగా చివరికి నవాబు దర్శనానికి అంగీకరించడు.

అందుకు జవాబుగా పళ్ళుమండిన భాగవతుడు, తుమ్మిచెట్టు తినే పళ్ళు కాయదు. పైగా పళ్ళచెట్టు ఎవ్వరూ ఎక్కకుండా ఈ తుమ్మకంచె కాపలా అంటూ, అలాంటి తుమ్మచెట్టులాంటి వాడవు అని తిట్టడంతో, ఈ ఉపమానాన్ని సాహిత్య ప్రియులు కూడా మెచ్చుకుంటారు — ముఖ్యంగా నాటి భాగవతుల ప్రావీణ్యాన్ని ప్రకటించే అవకాశం వున్న కళారూప మిది. శృంగార, హాస్యరసాలకు పట్టుకొమ్మ అంటారు. (పడాల రామకృష్ణారెడ్డిగారు, విశాలాంధ్ర వ్యాసంలో).

## గంగిరెద్దు :

డూడూ బసవన్నా, దొడ్డదొరండీ బసవన్న
అయ్యగారికీ దండం పెట్టు, అమ్మగారికీ దండం పెట్టు
కోటి లాభములు కలగాలండి, కోట వేల్పుల దయ గలగాలి
డూడూ వెంకన్నా - తిరుపతి కొండకు ప్రయాణముందీ, కుండీ
దేముని మొక్కులు తీర్చాలండీ, బంగరు గిత్తల బసవన్నండీ
పయిడి కొమ్ముల బసవన్నండీ, పాలమెరుగుల బసవన్నండీ
భాగ్యము లిచ్చే బసవన్నండీ - వెండి కొండపై విహారముండీ
విశ్వనాథునీ వాహనమండీ, పప్పు బియ్యం పట్టుకురండీ
పట్టువస్త్రముల బట్టుకురండి - బసవన దయ సంపాదించండి
డూ, డూ, బసవన్న

డూ డూ డూ డూ బసవన్నా - డూ డూ వెంకన్నా
పెబువుగారికి దండం పెట్టు - పాదం వంచీ భక్తిని పెట్టు
పట్టు శాలువలు కప్పేదరంటా. కాసుల మువ్వలు కట్టెదరంటా -
డూ డూ

చెన్నపట్నం, చేరువకాదు - కాశీపట్నం కానకపోదు
బాబుగారికీ భాగ్యం గలిగే, పిల్లలు పాపలు చల్లగ వుండి
పైరు పంటలు గాదులు నిండి - పచ్చగాను పది కాలా లుండి
ఇంటి కొక్కడు వీరభద్రుడు - పంచ కొక్కడు బసవేశ్వరుడు
చల్లగ వెలసె పెబువులు వుంటె, కళ్ళ వేడుకలు మన కంతాను,

హెచ్చరిక :

హెచ్చరిక వేషాలని. కూచిపూడివారు సాధువుల వేషంలో తత్వాల ద్వారా నీతులను చెప్పేవారు.

సత్యామయా, గురుడ సత్యామయా,
వీరబ్రహ్మం మాట నిత్యామయా ॥నందామయా గురుడ॥

దోసకాయలు తిన్న పోసముండల కెల్ల
ఆసనం బుడ బుడ అరచే నయా ॥నం॥

పల్లాన కూర్చుండి మెరక నుచ్చోస్తేను
కాలి కిందా మడుగు కట్టేనురా ॥నం॥

తాటిచెట్టూమీద తాబేలు కూకుంటె
గద్ద వచ్చి దాన్ని తన్నేనురా ॥నం॥

మునగచెట్టూ క్రింద ముగ్గురు ముండలు
ముత్తైదు వేషాలు వేసిరిరా ప్రభో ॥నం॥

గోలుకొండవతల గోవిందపురములో
డబ్బుకు ముంతెడు నీళ్ళయేనురా బ్రహ్మం ॥నం॥

అత్తలకు పీటలు, కోడళ్ళకు మంచాలు,
కలియుగంబున జనులు చేసేనురా ॥నం॥

వారు వీరవుతారు, వీరు వారవుతారు,
తారతమ్యము లేక మెలగేనురా ॥నం॥

నందామయా గురుడ, నందామయా, ఆనందదేవికి నందామయా.

## వైష్ణవ వేషం :

వైష్ణవ వేషంలో గురుశిష్య పాత్రలు రెండు వుంటాయి. వీరి ముఖ్య బోధన భక్తిలేని సర్వకార్యాలూ ఫలితార్థ శూన్యములనీ, గర్వంతో సర్వశక్తుల్నీ కోల్పోయిన, అహంకారులను ఉదహరిస్తూ, బుద్ధిబలానికీ, కార్యసాధనకూ, చిన్నా పెద్దా అనే తేడా లేదనీ వైష్ణవ వేషంలో.

హరి గోవింద, గోవింద, శ్రీ హరే హరి గోవింద,
గోవింద అనుకుంటు, కొబ్బరి తినుకుంటు,
నారాయణనుకుంటు, నములుకుంటు,
సర్వేశ్వరు డనుకుంటు, సర్వం తినుకుంటు,
పరమేశ్వరు డనుకుంటు, పాట పాడుకుంటు.

పరమేశ్వర, పరమేశ్వర అంటూ పాడుకుంటూ ప్రవేశిస్తారు. ఈ కళారూప ఇతి వృత్తం, అధ్యాత్మిక ప్రచారానికి సంబంధించింది. తిరుపతి అదిగో, శ్రీరంగ మదిగో, భద్రాచల మదిగో అంటూ వైష్ణవ క్షేత్రాల వైభవాన్ని వర్ణిస్తూ ప్రచారం చేస్తారు.

## గారడి వేషం :

పగటి వేషాలతో పాటు కూచిపూడివారు, మంత్ర తంత్ర విద్యల్నీ, గారడీలను కూడా చేసేవారు.

ఈ గారడీ వేషం చాలా సాహసవంతమైనది. ప్రేక్షకులకు భయం కలిగిస్తుంది. ముఖ్యంగా ఇది అగ్నికి సంబంధించింది.

గ్రామంలో కమ్మరిని పిలిచి బజారులో కొలిమిని పెట్టించి, గడ్డపారల్ని, పలుగుల్నీ, ఇనప గుళ్ళనీ ఎఱ్ఱగా



కాల్పించి, ఎఱ్ఱగాకాల్చిన పలుగుల్ని చేతితో దూయటం, ఇనపగుళ్ళు పళ్ళతో పట్టించటం, నెత్తిమీద పొయ్యిపెట్టి — దానిమీద పెనం పెట్టి, గారెలు వండటం. ఇలా చూపరుల్ని ఆశ్చర్యంలో ముంచివేసే వాళ్ళు.

ఈ పనులు చేసేటప్పుడు వాయిద్యాలను ఉధృతంగా వాయిస్తూ, పాటలు పాడుతూ, కేకలు వేస్తూ



సున్నపు వీరయ్య పాములవాడి వేషం

భాయి భాయిమే గారడి, భల్లె భల్లె గారడి
కట్టుమోతు విద్యలకు దిట్టమైన గారడి ॥భా॥

ఇలా గారడి వాళ్ళు చేసే పనులు కూడా చేసి మాకూ మంత్ర తంత్ర విద్యలొచ్చునని నిరూపించుకున్నారు. ఇవి రెండు వందల సంవత్సరాల నాటి మాట.

## ప్రతిభకు ప్రతిఫలం :

కూచిపూడి పగటి వేషధారులు ప్రదర్శనాలన్నీ అయిన తరువాత చివరిరోజున శారద రామాయణం కథగా చెప్పి, పారితోషికాల కోసం ఇంటింటికీ తిరుగుతూ, కూచిపూడి ప్రశస్తిని ఈ విధంగా వివరించేవారు.

హారం త్రిపురాసుర సంహారం
ఈ నర్తకు లాడే బేరం
చూపుకైతే బహుదూరం
మే మున్నది కృష్ణాతీరం
మాది కూచిపూడి అగ్రహారం
మేము కులమున బ్రాహ్మణవారం
తమ మెడలో చంద్రహారం
ఆహార మిస్తే మీ భారం
దాశరథీ కరుణాపయోనిధీ.

అంటూ అది లౌకికంగా ఇంటి యజమానిని వుదరపెట్టి కానుకలు లాగేవారు.

# ప్రసిద్ధులైన పగటి వేషధారులు

## పసుమర్తి శేషయ్య :

పసుమర్తి శేషయ్యగారు భట్రాజు వేషం వేసి, నానార్థరూపాలలో పద్యాలను చదివేవారు. ప్రేక్షకులు సూచించిన ప్రతి అక్షరానికీ పద్యం చెప్పేవారు. జక్కుల పురంధ్రీ వేషంవేసి, బొబ్బిలి, మరాఠీ మొదలైన కథలను నేర్పుగా ప్రదర్శించేవారు. ఉపమానం లేకుండా ఏ విషయమూ చెప్పేవారు కాదు. ఇంకా బైరాగి వేషం — సోమయాజులు — సోమి దేవమ్మ వేషాలను రమ్యంగా ప్రదర్శించేవారు. వీరిని శిరోమణిగారూ అని పిలుస్తూ వుండేవారు.

## భాగవతుల కుమారస్వామి :

కుమారస్వామి గారు పఠానీ, సోమయాజులు, సోమిదేవమ్మ, కోమటి, అర్ధ నారీశ్వర మొదలైన ముప్పై రెండు వేషాలను సమర్థవంతంగా పోషించేవారు. వీరు మద్దెల వాయిద్యంలో ప్రసిద్ధులు. నోటితోనే అద్భుతంగా మద్దెల వాయించేవారు. ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలు కొన్ని ప్రదర్శించేవారు. కళాతపస్వియైన కుమారస్వామిగారు ఆజానుబాహుడు.

## దర్భా శ్రీనివాసులు :

శ్రీనివాసులుగారు — దాష్టిక పంతులు — మందుల వేషం, ఎరుకల వేషం, పాముల వాడి వేషధారణలో ప్రఖ్యాతి నార్జించిన వారు. వీరి తమ్ముడు దుర్గయ్యగారు వివిధరకాలైన కూతలు కూయడంలో దిట్ట. కంఠస్వర మార్పుతో ప్రేక్షకులను దిగ్భ్రాంతులను చేసేవారు — ఈయన భలే చమత్కారి.

చింతా ప్రకాశశర్మ - చింతా బాలకృష్ణగార్లు వైష్ణవ, సాతానులు, చెంచు వేషాలను ప్రతిభావంతంగా పోషించేవారు.

మహంకాళి సత్యనారాయణగారు. జంగం దేవర వేషంలో సమర్థులు, వేదాంతం మల్లిఖార్జున శర్మ శారద, అర్ధనారీశ్వరుడి వేషంలో ప్రసిద్ధులు.

పిల్లలమఱ్ఱి కామయ్యగారు. బైరాగివేషం వేసి భగవద్గీత చమత్కారంగా వ్యాఖ్యానంచేసి ప్రేక్షకులను రంజింపజేసిన కళాకారుడు ఈయన. హస్తలాఘవాన్నీ, జలస్తంభననూ చేసేవారు.

వసుమర్తి చలపతిగారు, ఏలేశ్వరపు వెంకటనారాయగారు కాశీ కావడి వేషం వేసి యమపురిని వర్ణిస్తూ - కాలకింకరులు పెట్టే యమయాతనల్ని పటంలో చూపిస్తూ ప్రేక్షకులకు జ్ఞానోదయాన్ని కలిగించేవారు. బజారులో కాశీ కావడితో పోతూవుంటే జనం తండోపతండములుగా మూగేవారు. పెద్దిభొట్ల దశరథ రామయ్యగారు పఠానీ వేషంవేసి కృష్ణాజిల్లా కలెక్టరుగారిని దిగ్భ్రాంతుల్ని చేశారట.

# పగటివేషధారులు - కూచిపూడివారు

## మొదటితరం :

వసుమర్తి శేషయ్య, వసుమర్తి చలపతి - వేదాంతం పెదరామయ్య - వేదాంతం నీలకంఠయ్య - వేదాంతం పేరయ్య - భాగవతుల కుమారస్వామి - భాగవతుల పిచ్చయ్య - భాగవతుల యల్లయ్య - భాగవతుల కామయ్య - భాగవతుల నాగలింగయ్య - భాగవతుల రామలింగం, భాగవతుల రామదాసు.

ఏలేశ్వరపు వెంకటనారాయణ, ఏలేశ్వరపు కృష్ణయ్య - తాడేపల్లి సూరయ్య - దర్భా లింగయ్య - మహంకాళి లక్ష్మయ్య - వేము ఆదినారాయణ - హరిలక్ష్మీ నారాయణ.

రెండవతరం :

పసుమర్తి రామయ్య - పసుమర్తి ఆంజనేయులు-పసుమర్తి సత్యనారాయణ-వేదాంతం సాంబయ్య - వేదాంతం వెంకటరత్నయ్య - వేదాంతం సత్యనారాయణ - వేదాంతం లక్ష్మీనరసింహం - వేదాంతం ఘంటయ్య - వేదాంతం వెంకటేశ్వర్లు - భాగవతుల జగ్గయ్య - భాగవతుల అనంతయ్య - భాగవతుల ఆదినారాయణ - ఏలేశ్వరపు వెంకటేశ్వర్లు - ఏలేశ్వరపు పున్నయ్య- ఏలేశ్వరపు ఆంజనేయులు - ఏలేశ్వరపు నారాయణమూర్తి - హేమాద్రి వెంకటేశ్వర్లు - హేమాద్రి శివయ్య - దర్భా దుర్గయ్య - దర్భా కృష్ణయ్య - మహంకాళి పెద సత్యనారాయణ - మహంకాళి సుబ్బరామయ్య - చింతా శివరామయ్య.



మూడవతరం :

పసుమర్తి విశ్వనాథం - పసుమర్తి శ్రీరామమూర్తి - పసుమర్తి సూర్యనారాయణ - వేదాంతం పార్థసారథి - వేదాంతం శ్రీమన్నారాయణ - వేదాంతం మల్లిఖార్జునుడు - భాగవతుల నాగలింగయ్య - భాగవతుల వెంకటరాజయ్య - ఏలేశ్వరపు ప్రకాశరావు - శివరామయ్య రాఘవయ్య - శ్రీరామమూర్తి - తాడేపల్లి సుబ్బయ్య - తాడేపల్లి - చంద్రయ్య - హేమాద్రి శివరామకృష్ణశర్మ - మహంకాళి కృష్ణమూర్తి - చింతా సూర్యప్రకాశం - బాలకృష్ణయ్య - జోశ్యుల దుర్గయ్య.

కూచిపూడివారి పగటివేషాలు:

1. బైరాగి
2. ఫకీరు
3. బుడబుడక్కల
4. జంగం
5. వైష్ణవులు
6. కోయ
7. కోమటి-లింగబల్జి
8. లంబాడీ
9. సోమయాజులు-మధ్వాచార్యులు
10. దాక్షికం పంతులు
11. పఠాను-గులాము
12. గొల్లబోయడు

13. జాంగ్రవేషం
14. సూరత్ కంచెనీ
15. గారడీ
16. ఈడిగ
17. శారదగాని
18. మాదిగవేషం
19. అర్ధనారీశ్వరుడు
20. మందులవేషం
21. పాములవాని వేషం
22. దేవరపెట్టి
23. పిట్టలదొర
24. రంగురింగుల రామిరెడ్డి
25. గంగిరెద్దు
26. బాలరండా రుక్మాబాయి
27. హెచ్చరిక వేషాలు.

కూచిపూడి పగటి వేషాలు భాగవత సంబంధమైనవి:

పారిజాతాపహరణం
ఎరుకల వేషం
చోడిగాడి వేషం
బాలింత వేషం
దాదినమ్మ వేషం
భిల్లిని వేషం
గోపికాగీతలు
శారదగాని వేషం
అర్ధనారీశ్వరుడు
త్రిపురాసుర సంహారం
రాధ వేషం
కొండాయ వేషం
ప్రహ్లాదచరితం
నారద వేషం
బ్రాహ్మణ వేషం
తత్వాలు
గొల్లకలాపం

మరెన్నో పగటి వేషాలు:

ఉదహరించిన పగటి వేషాలుకాక, ఈ క్రింద వుదహరించిన మరెన్నో పగటి వేషాలు...కొన్ని వందల సంవత్సరాలు, ఆంధ్ర ప్రజలను అలరించాయి. అలాంటి వాటిలో కొన్ని.

ఎరుకల వేషం
భిల్లినీ వేషం
రాధ వేషం
బ్రాహ్మణ వేషం
కోయ వేషం
జాంగ్ర వేషం
లంబాడి వేషం
సూరత్ కంచెనీ వేషం
ఫకీరు వేషం
పాములవాని వేషం

బాలింత వేషం
ప్రహ్లాదచరితం
త్రిపురాసుర సంహారం
కొండాయ వేషం
షేకుసాహెబు
గొల్ల బోయెడు వేషం
మధ్వాచార్యుల వేషం
జాంగ్ర వేషం
బైరాగి
గారడివాని వేషం
గోపికా గీతలు



## వివిధ పగటి వేషధారులు :

పగటి వేషాలను బహుముఖాలుగా ప్రదర్శించిన వారిలో, గోదావరి మండలంలో పాలంకి నారప్ప, రావూరు సూరయ్య, వేముల బాపయ్య, భాగవతుల కోనయ్య, కాలనాథభట్ట వెంకయ్య, అనకాపల్లి గంగాధరం, విభూతి భవానిలింగం. వీరి ట్రూపు అనేక పగటి వేషాలను ధరించి, ఆంధ్ర దేశంలో ముఖ్య కేంద్రాలలో ప్రదర్శనాల నిచ్చారు. క్రిష్టపాడు జంగాలు నెల్లూరు మూలపేట జంగాలు, కాకినాడ రెడ్లు, నరసరావు పేట ఎర్రగొల్లలు మొదలైనవారు ఆరాధించారు. ఈ నాటికీ పగటి వేషాల సాహిత్యం కూచిపూడిలో కొల్లలుగా వుంది.

## ప్రజానాట్య మండలి :

ఇటీవల ఆంధ్ర దేశంలో ఆంధ్ర ప్రజానాట్య మండలికి సంబంధించిన అనేక దళాలు, ఫకీర్లు, చెంచులు, కోయలు, సుద్దులు, జంతరుపెట్టె, పిట్టలదొర సోదె మొదలైన వేషాలు ధరించి, తద్వారా రాజకీయ ప్రబోధాన్ని కలిగించారు. సంఘ విద్రోహుల్ని చీల్చిచెండాడే సాహిత్యంద్వారా, ప్రజాప్రబోధాన్ని కలిగించారు. ఇలా పగటి వేషాలను ధరించిన వారిలో కోగంటి గోపాలకృష్ణయ్య-కోసూరి మాచినేని డా॥ మిక్కిలినేని, డా॥ రాజారామ-నాజరు. రామకోటి మొదలైనవారు ముఖ్యులు.





# వినోదాల
# విప్ర వినోదులు

ఈనాటి ఆంధ్రదేశంలో ఎక్కడో చెదురుమదురుగా విప్రవినోదం ప్రచారంలో వుందని చెప్పలేం కాని 1600—1700 సంవత్సరాలలో ఈ వినోదాలు వ్యాప్తిలో వున్నాయి అంటే అది విజయనగర సామ్రాజ్యకాలం.

విప్రు లనగా బ్రాహ్మణులు. వారు వినోదం చేయడంవలన విప్రవినోదమని పేరు వచ్చింది. బ్రాహ్మణులలో ఒక తెగ బ్రాహ్మణులు దేవతోపాసనవలననో, మంత్ర తంత్రాల వలననో, ఒక విచిత్రమైన గారడీలు చేస్తూ వుంటారు. అష్టావధానాన్ని కూడ చేస్తూ వుంటారు. ఆంధ్రదేశంలో ఈ వినోదం చేసేవారు అక్కడక్కడా వున్నారు. గుంటుపల్లిముత్తరాజనే విప్రవినోది గోలకొండ సుల్తానుల తుదికాలంలో వున్నట్లు సురవరం ప్రతాపరెడ్డిగారు తెలియచేస్తున్నారు.

చాటువు

సంతత మారగించు నెడ సజ్జనకోటుల
పూజసేయు శ్రీమంతుడు గుంటుపల్లి
కులమంత్రి శిఖామణి ముత్త మంత్రి చౌ
బంతియె బంతిగాక కడుపంద గులా
ముల బంతు లెల్ల దూల్ బంతులు దుక్కి
డెల్ల యెడ బంతులు విప్రవినోది
గారడీ బంతులు సుమ్ము ధరాతలంబునన్

అని వర్ణించాడు. ఈ విధంగా ఆ కాలంలో విప్రవినోదాలు జరుగుతూ వుండేవి. విప్రవినోదం చేసేవారు ఆంధ్రదేశమంతటా వున్నట్లు మనకు ఆధారా లున్నాయి.

## మాణిక్యాలపురం విప్ర వినోదులు:

తెలంగాణాలో ఈ విప్రవినోదులు కరీంనగర్ జిల్లా మాణిక్యాల పురంలో వున్నట్లు తెలుస్తోంది. వీరి వృత్తి విప్రులను యాచించడమే. వీరి ప్రదర్శనం కూడ ఇంద్రజాలమే. వీరిదళ సభ్యులు నలుగు రుంటారు. వీరి ప్రదర్శనం విప్రుల ఇండ్ల లోనూ, విశాల బహిరంగ స్థలాల్లోనూ కూడా ప్రదర్శిస్తారు. వీరి ప్రదర్శనాసామగ్రి అయిదు శాలువలు, ఒక కొయ్య అలమారా; ఒక తాళపత్ర గ్రంథం, రెండు జతల తాళాలు. ప్రదర్శనం విశాల ప్రదేశంలో ఒక చిన్న పందిరిలో జరుగుతుంది. పందిరి చుట్టూ శాలువలు కడతారు. ఆ తెరల మధ్య ఖాళీ అలమారా వుంచుతారు. ఇరువురు వ్యక్తులు చెరో ప్రక్క చేరి తాళాలతో భజన చేస్తారు. ఇంతలో ప్రేక్షకులు గుమి కూడతారు. తెరలన్నీ ఎత్తి ఖాళీ అలమారా చూపిస్తారు. తరువాత దళ సభ్యుడు ప్రాచీన తాటాకుల గ్రంథంతో తెరల మధ్యకు వెళతాడు. ఒక పావుగంట వరకూ ఆయన బయటకు రాడు. ఈలోగా భజన జరుగుతూనే వుంటుంది. లోపల ఏం జరుగుతూందో అనే ఆసక్తి ప్రేక్షకులలో రేకెత్తిస్తుంది.

ఇంతలో తెరను తొలగిస్తారు. అదివరకు ఖాళీగా వున్న అలమారాలో దేవతా విగ్రహాలూ, దీపారాధన కుందులూ, పుష్పాలూ, ఫలాలూ, పిండివంటలూ, గంట, శంఖు వివిధ పూజాపాత్రలు అనేక రకాల పిండివంటలు ప్రత్యక్షమౌతాయి. అలాగే ఒక మామిడి టెంకను పాతిపెట్టి పది నిమిషాల్లో అడుగు ఎత్తున పెరిగిన మామిడి మొక్కను చూపిస్తారు. ఈ ప్రదర్శనం ప్రేక్షకులను ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. ప్రదర్శనానికి ముందే అలమారాలను పరీక్షించవచ్చు. అంతేకాక వీరు ఇంటింటికి తిరుగునప్పుడు విగ్రహాలను, కప్పలను, చిలకలను, విభూతిని అరచేతిలో సృష్టించి ఇంద్రజాల మహేంద్రజాల విద్యను ప్రదర్శిస్తారు.

## రాయలసీమ విప్రవినోదులు:

విప్రవినోదులు జాతర్లలోనూ, తిరునాళ్ళలోనూ, గుడారాలను నిర్మిస్తారు. ఈ గుడారాల్లో రామాయణం మొదలైన కథలను అత్యద్భుతంగా చిత్రిస్తారు.

వీరు గొప్ప మాటకారులు, హాస్యప్రియులు. చెప్పింది చెప్పకుండా చెపుతారు. ప్రేక్షకులను తమ హాస్య ప్రసంగాలతో ఆనందంలో ముంచెత్తుతారు.

వీరు భలే తమాషాలు చేసి, ప్రేక్షకులను ఆనందపరుస్తారు. వీరు ముందు మన పేరు అడిగి తెలుసుకుంటారు. దూరంగా వుండే తమ జట్టు వారికి అర్థమయ్యే రీతిలో, పద్యాలద్వారా, సైగలుద్వారా, మన పేరును తెలియచేస్తారు. వారు అక్కడ నుంచే మన పేరులను వారితోనే చెప్పించి చుట్టూ మూగిన ప్రేక్షకులను ఆశ్చర్య చకితుల్ని చేస్తారు.

వీరు రాయలసీమ ప్రాంతాల్లో ఒకప్పుడు విరివిగా ప్రదర్శనలనిచ్చే వారు. ఈ నాడు వీరి జాడవున్నట్లు ఆధారాలు లేవు.

## విప్రవినోదుల రోప్‌ట్రిక్ :

విప్రవినోదులు ఆ రోజుల్లో రోప్‌ట్రిక్‌ను చేసేవారు. అంటే ఒక త్రాడును ఆకాశంలో ఎగరేస్తే అది అలాగే నిలబడితే, దానిమీద మనిషి ఎక్కి అంతర్థాన మయ్యేవాడట. ఎలా మాయమయ్యేవాడో వివరంగా ఇంద్రజాలం శీర్షికలో వివరించ బడింది.

ఇలా ఆ రోజుల్లో రోప్‌ట్రిక్ చేసే విప్రవినోదులు, కృష్ణా నదీ ప్రాంతంలో నివశించేవారట. బ్రిటిష్‌వారు పరిపాలిస్తున్న కాలంలో ప్రదర్శించిన ఒక అద్భుతకార్యం. ఆ కాలంలో మన దేశానికి వచ్చిన విదేశీయు లెందరో ఈ అద్భుతమైన ఇండియన్ రోప్‌ట్రిక్‌ను ఎంతగానో ప్రశంసించారు. ఇది విప్రవినోదుల విద్య.





# రోప్ ట్రిక్, ఇంద్రజాలం



ఒక మైదానంలో గారడి ప్రదర్శనం జరుగుతూ వుంది. ప్రదర్శనలిస్తున్న సోదరులిద్దరిలో ఒకరు అందరి ముందూ నిలబడి ఒక పొడుగైన త్రాడును పరీక్షకోసం ప్రేక్షకుల కిచ్చి, తరువాత దానిని గాలిలోకి పైకి విసిరాడు. అంతే మరుక్షణం ఆ త్రాడు ఒక కర్రలాగ ధృఢంగా నిలబడిపోయింది. అప్పుడు అతని సోదరుడు, ఆ కర్రలాంటి త్రాడును ఆధారంగా చేసుకుని పైకి పాకుకుంటూ వెళ్ళి అందరూ చూస్తూ వుండగా అంతర్ధానమయ్యాడు. ఆ ప్రదర్శన చూస్తున్న ప్రేక్షకులకు, అది కలా నిజమా అన్నంత సందేహం కలిగింది. ఇంతలో త్రాడు క్రింద పడింది. మొదటి సోదరుడు, నా తమ్ముడేడీ? నా తమ్ముడేడీ అంటూ గట్టిగా అరవటం మొదలుపెట్టాడు. రెండు నిమిషాల అనంతరం, రెండవ సోదరుడు దూరం నుంచి పరుగెత్తుకుంటూ వచ్చి ప్రేక్షకులందరినీ ఆశ్చర్యంలో ముంచాడు.

## ఇది కథ కాదు :

ఇది కథ కాదనీ, కల్పించిన సంఘటన కానేకాదనీ, బి. వి. పట్టాభిరాంగారు తెలియచేస్తున్నారు. కృష్ణానదీ ప్రాంతంలో నివశించే విప్రవినోదులు - బ్రిటిష్‌వారు పరిపాలన సాగిస్తున్న కాలంలో ప్రదర్శించిన ఒక అద్భుతకార్యం ఇది. ఆ కాలంలో ఈ ఫీట్‌ను వారు మాత్రమే దేశం నలుమూలలా ప్రదర్శించేవారు. ఆ కాలంలో మన దేశానికి విచ్చేసిన విదేశీయు లెందరో ఈ అద్భుతమైన ఇండియన్ రోప్ ట్రిక్‌ను ఎంతగానో ప్రశంసించారు. విదేశాలలోని వార్తాపత్రికలు దీనికి బహుళప్రచారం ఇచ్చాయి.

## పాల్ డేనియల్ ప్రశంస :

భారతీయ ఇంద్రజాల విద్యలో ఒకప్పుడు ప్రాముఖ్యం వహించిన ''రోప్ ట్రిక్''ను గురించి ఒక వ్యాఖ్యానం చేస్తూ ప్రముఖ లండన్ ఇంద్రజాలికుడు

"పాల్‌డేనియల్" ఈ ఇండియన్ రోప్‌ట్రిక్‌ను ఏ భారతీయ ఇంద్రజాలికుడూ ఇప్పుడు ప్రదర్శించడం లేదనీ ఆ కళ అంతరించిందని, తను వ్రాసిన "మేన్ విత్ అండ్ మ్యాజిక్" పుస్తకంలో ప్రకటించారు. ఇటీవల కాలంలో ఇండియా వారు తమ అద్భుతమైన ఆ కళను ప్రదర్శించలేక పోవడానికి కారణంకూడా పాల్ ఆ పుస్తకంలో పేర్కొన్నాడు.

భారతీయులు నాగరికత వ్యామోహంలో పడి అడవులను నరికి వేయటమేనన్న పాల్ వ్యాఖ్యలను పట్టాభిరాం గారు ఉటంకించారు.

## ఆరు బయలులో, అద్భుత ప్రదర్శన :

ఈ ఇండియన్ రోప్‌ట్రిక్ ఒక పెద్ద ఆరుబయలు రంగస్థలంలో ప్రదర్శిస్తారని, అప్పుడు చెట్లతో నిండియున్న ఆ ప్రదర్శనంలో ఇంద్రజాలికుడు ప్రదర్శనకు ముందు రోజు రాత్రి రెండు చెట్లకు ఒక ధృఢమైన త్రాడును బిగించి ఉంచుతాడని ప్రదర్శన సమయంలో తన చేతిలో వున్న త్రాడును పట్టుకునే విధంగా విసురుతాడు. అప్పుడు ఆ త్రాడు నిలబడి వున్నట్లుగా ఉన్న తరువాత తనతోటి ఇంద్రజాలికుని దాని పైకి ఎక్కి వెళ్ళమంటాడు. అప్పుడు ఆ రెండవ అతను ఎక్కి వెళ్ళి మాయమై పోతాడు. నిజానికి అతను మాయమైపోవటం జరగదు. చెట్ల గుబురుల్లో నుంచి క్రిందికి దిగి వస్తాడు. ఇదే ఆ ట్రిక్.

## శిథిలమైపోయిన కళ :

రాను రాను ఈ ప్రాచీన కళ క్షీణించిపోయింది. ఆదరణ లేకపోవటం వల్ల వంశ పారంపర్యంగా వస్తున్న ఈ వృత్తిని అభ్యసించడానికి వారి సంతతి ఇష్టపడక పోవటం వలన ఈ కళ దాదాపు అంతరించిపోయింది.

పందొమ్మిదవ శతాబ్దాంతానికి మన దేశంలో "రోప్‌ట్రిక్" చేసేవారు లేకుండా పోయారు. కొంతమంది స్వార్థపరులు తమవద్ద నున్న తాయిత్తులను, వేళ్ళను, త్రాళ్ళను అమ్ముకోవటానికి తమకు తెలియని చిన్న చిన్న మేజిక్కులను ప్రదర్శించి ఈ కళను పూర్తిగా రోడ్ స్థాయి ప్రదర్శనంగా చేసేశారు. ఈ అద్భుత ప్రదర్శనను పునరుద్ధరించటం ఎంతైనా అవసరం.



# ప్రజల సమ్రాతలూగించిన జంగం కథలు, బుర్ర కథలు



ఆంధ్రదేశంలో ఆ నాటి నుండి ఈ నాటి వరకు బహుళ ప్రచారం పొందిన జంగం కథలు ఈనాడు, బుర్ర కథలుగా పిలువబడుతున్నాయి. ఒకనాడు మత ప్రబోధానికి, దేశభక్తికీ ప్రతిబింబంగా నిలబడిన జంగం కథా కళారూపం రాను రాను యాచనకూ, వుదరపోషణకూ ఉపయోగపడి తిరిగి ఈనాడు దేశభక్తిని ప్రబోధిస్తూ, ప్రజా సమస్యలను చిత్రిస్తున్నది.

జంగం కథలను ఎక్కువగా జంగాలే చెప్పడంవల్ల వీటికి జంగం కథలనే పేరు వచ్చింది. ఈ కథలను సిరికి జంగాలూ, బుడిగె జంగాలూ, సెట్టి బలిజెలూ, సెట్టి ఫణిజెలూ, ఈతముక్కు జంగాలూ, వంశపారంపర్యంగా ప్రచారంలోకి తీసుకు వచ్చారు. జంగాలందరూ శైవభక్తులు కావడంవల్ల, శైవవైష్ణవ మతాల మధ్య వచ్చిన సంఘర్షణ కాలంలో శైవమత ప్రచారానికి ఈ కథలను ఉపయోగించారు. వీరు శైవమతం బాగా వ్యాప్తిలోకి వచ్చేనాటికి, అంటే క్రీ॥ శ॥ 1150 నాటికే ఈ కథలను జంగాలు పాడుతూ వుండేవారు. వీరు ఈ కథలతోపాటు పగటివేషాలను కూడ ప్రదర్శించేవారు. బైచరాజు వేంకటనాథ కవి, పంచతంత్రంలో ....కడివోని తెరనాటకపుటూరి జంగాలు అని వుదాహరించడాన్నిబట్టి, జంగాలు నాటకాలను కూడా ప్రదర్శించేవారని తెలుస్తూ వుంది.

దాసరులందరూ వైష్ణవ భక్తులైనట్లే జంగాలందరూ శైవభక్తులు. వీరు చెప్పే కథలకు జంగం కథలని పేరు. వీరికే బుడిగె జంగాలనే పేరు కూడా వాడుకలో వుంది. అందుకు కారణం వారు కథలో వుపయోగించే వాయిద్యానికి బుడిగె అనే పేరునుబట్టి బుడిగె జంగాలనే పేరు సార్థకనామమైంది. ఈ బుడిగెనే డక్కి అనీ, డిక్కి అనీ, గుమ్మెటనీ అనేక రీతులలో ఆయా ప్రాంతాలలో ఉదాహరిస్తున్నారు. బుడిగెలు మామూలు గుమ్మెట్లకంటే చిన్నవి. ఇవి ఇత్తడితోనూ, కంచుతోనూ చేయబడి వుంటాయి.

జంగాలు ప్రారంభంలో శైవ కథలనే ప్రచారంచేసేవారు. తరువాత శైవేతర కథలైన దేశింగురాజు, విరాటపర్వం, భల్లాణ, సిరియాళ, దేవయాని, వామన

విజయం, అంబరీషోపాఖ్యానం మొదలైన కథలను కూడ ప్రచారంలోకి తెచ్చారు. జంగాలు వీరశైవ ప్రచారకులు కావడంవల్ల వారి కథలన్నీ వీరావేశంతో చెప్ప బడుతూ వుండేవి. ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వం జంగం కథలో జంగాలయొక్క వేషధారణ, వాయిద్యాల వర్ణన వుంది....అడిదం సూరకవి జంగాలుపాలు దేవాంగుల విత్తంబు అని వర్ణించడంవల్ల, దేవాంగులైన సాలెవారిని యాచిస్తారని తెలుస్తూ వుంది.

ఆంధ్రదేశంలో శారదకాండ్రు అనే ఒక జాతివారు, ఒక్క తెలంగాణాలో తప్ప మరెక్కడా అంతగా కనిపించరనీ. జానపద గాయకులుగా భిక్షకులుగా వుండే వారిలో కూడ వీరెక్కువనీ, మున్నూరు, ముతరాసి మొదలైన కులముల నుండి ఉద్భవించిన జాతుల్లో శారద కాండ్రజాతి ఒకటని జానపద వాఙ్మయంలో.... బి. రామరాజుగారు వుదహరించారు. ఓ భారతీ, కరుణామతీ భళీ. శారదా, కరుణానిధి అనే వంతపాట పాడటం వలన కూడా వీరికి శారదకాండ్రు అనే పేరు వచ్చి వుండవచ్చు. అంతేకాక, వీ రుపయోగించే వా ద్యం లో భుజముమీద ధరించే తంబురాకు శారద అని పేరు. బుర్ర కథలో ఉపయోగించే తంబురాకూ దీనికీ ఏమీ తేడాలేదు. శారదను ఒక భుజంమీద ధరించి వాయిస్తారు. శారద అంటే సరస్వతి. విద్యల తల్లి. సరస్వతి పేరును వా రుపయోగించే తంబురా వాయిద్యానికి మారు పేరుగా శారద అని నామకరణం చేశారు. వీరికథ శారదాదేవి స్తోత్రంతో ప్రారంభ మౌతుంది. ముఖ్యంగా వీరి జట్టులో పురుషుడు కథ చెపితే అతని ఇద్దరు భార్యలూ వంత పాడుతారు. ఒక భార్యను కలిగివున్న కథకుడు కథ చెపితే, అతని భార్య డక్కీ కొడుతుంది. దీనిని వీరు డిమ్కీ అని కూడా పిలుస్తారు. వీరు పాడే పాటల్లో శారద వరుసలనేకాక చరిత్రాత్మకమైన గేయాలను వీరావేశంతో పాడుతారు. తెలంగాణాలో ప్రచారంలో వున్న ప్రసిద్ధ వీరకథలైన సదాశివరెడ్డి కథ, సర్వాయి పాపడు కథలనూ, సర్కారు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిన బొబ్బిలియుద్ధం, పల్నాటి వీరచరిత్ర, బాలనాగమ్మ మొదలైన కథలనూ శారదకాండ్రు చెపుతూ వుంటారు. పైన వుదాహరించిన ఒక్కొక్క కథనూ, మూడు నాలుగు రాత్రులు చెపుతారు. ఈ కథలు చెప్పేవారు ఎక్కువమంది వరంగల్లు తాలుకా వెంకట్రావుల పల్లి మొదలైన చుట్టుపట్ల గ్రామాలలో వున్నారు. శారదకాండ్రు అందరూ శైవ మతస్థులు మాంసాహారులైన జంగమ జాతివలన కలిగిన జాతి ఈ శారదకాండ్రు అని కొందరి అభిప్రాయం. వీరు ఎల్లమ్మ, పోచమ్మ మొదలైన ముఖ్య దేవతల్ని

పూజిస్తారు. వీరు ఎంతమంది భార్యలనైనా చేసుకొనవచ్చు. వీరందరూ శైవ మతస్థులైనప్పటికీ లింగధారణలో కొంతమందికి పట్టింపులేదు.

## ఉత్తమ కళారూపం :

ఈ జంగం కథలను ప్రజా ప్రబోధానికి ఆయుధంగా వుపయోగించారంటే అందులో ఒక విశేషం లేకపోలేదు. బుర్రకథ ఫణితులు చాల వుత్తేజకరమైనవీ, వుద్రేకమైనవీ, అన్ని రసాలనూ తేలికగా ప్రజా హృదయాల్లో చొప్పించగల శక్తి ఈ జంగం కథలకుంది. వీరరసం ద్వారా ప్రజలను వుద్రేకపరచవచ్చును. కరుణరసం ద్వారా ఏడ్పించవచ్చును. హాస్య రసంద్వారా కడుపుబ్బ నవ్వించవచ్చు.



బుర్రకథ

శృంగార బీభత్సరసాలకు ప్రాముఖ్యం తక్కువైనా నవరసాలూ ఈ జంగం కథా విధానంలో మిళితమై యున్నాయి. సంగీతం, సాహిత్యం, నృత్యం, వాద్యం, శిల్పం, తాళం, లయ, అభినయం, ఆహార్యం మొదలైన హంగులన్నీ ఈ కథలో తొణికిసలాడుతూ వుంటాయి. ఈ కథల్లో వుపయోగించే గుమ్మెటలు వీరణపు మ్రోతలను గుర్తుకు తెస్తాయి. జంగం కథా కళారూపంలో ప్రజలను మేల్కొల్పే మహత్తర శక్తి వుంది. ఈనాటికీ ఈ కళారూపం విద్యాధికుల నుండి అతి సామాన్యుల వరకూ ఆనందింపజేయగల ఉత్తమ జానపద సంగీత కళారూపంగా తయారైంది.

జంగం కథను తెలుగు జాతియొక్క సంగీత జానపద కళారూపంగా చెప్ప వచ్చు. ఈ జంగం కథల్లో విద్వత్తును ప్రదర్శించే శ్లోకాలూ, దేశీయ ఛందస్సు అయిన మంజరీ ద్విపదలూ, దరువులూ, కీర్తనలూ, కందార్థాలూ మొదలైనవన్నీ ప్రవేశపెట్టబడ్డాయి. ఉదాహరణకు శ్రీనాథుడు వ్రాసిన పల్నాటి వీరచరిత్ర మంజరీ ద్విపదలో రచించిందే.

## పూర్వ కథలు :

ఆంధ్రదేశపు పల్లెల్లో రైతు కూలీలకు పనిలేని తీరిక సమయాలలోనూ, దేవుని వుత్సవాలలోనూ ఈ కథలను చెప్పిస్తుండేవారు. ఈ కథలను చెప్పే జంగాలు పగటిపూట శంఖు, గంటలతో ఇంటింటా వ్యాపకం చేస్తూ, ఈ రాత్రికి నడిబజారులో ఫలానా కథ జంగం కథగా చెపుతున్నామని, ఫలానావారు చెప్పిస్తున్నారని ఇంటింటా ప్రచారం చేస్తూ, పది లాంతర్లను ప్రోగుచేసి తెల్లవారేవరకూ ఈ కథలను చెప్పి వేలాది ప్రజలను ఆనందింపజేసేవారు. ఆనాడు జంగం కథలకు మంచి ఆదరణ వుండేది. ఈ కథకులు ఏ మారుమూల గ్రామంలో కథ చెప్పుకున్నా హాయిగా రెండు మూడు బస్తాల ధాన్యం, డబ్బు సంపాదించుకోగలిగేవారు. రాను రాను కుటుంబంలోని సభ్యులందరూ ఈ కథల్లో పాల్గొనేవారు. పురుషుడు కథ చెప్పితే ఆయన భార్య వంత పాడేది. కొంతమంది ఇద్దరు భార్యలను చేసుకుని జీవన భృతిని తేలికగా సంపాదించుకునేవారు. వృత్తిరీత్యా ఇరువురు భార్యలను చేసుకోవడం తప్పుగా ఎంచేవారు కారు. ఇలాంటి వీరికి ఏవిధమైన ఆశయమూ వున్నదని చెప్పలేము. ఒకనాడు ప్రబోధం కొరకు ఏర్పాటైన జంగం కథా కళా రూపం పారంపర్యంగా జీవనోపాధికి అంకితమైంది. ఈ కథలను ముగ్గురు స్త్రీలు కలిసి చెప్పడం కూడ పరిపాటైంది. మూడు స్త్రీ కంఠాలు కలిసి ఏ బాలనాగమ్మ కథనో చెపుతూ వుంటే పల్లెల్లో కథలు వినే అమ్మలక్కలు కథలో వచ్చే హృదయ విదారక దృశ్యాలకు కండ్లవెంట నీరు కార్చేవారు. స్త్రీ గొంతులతో చెప్పబడే ఈ కథలు అతి శ్రావ్యంగా వుండేవి.

## ప్రదర్శనం, పరికరాలు :

వీరి ప్రదర్శనాలకు రంగస్థలమంటూ ఏమీలేదు. విశాలమైన ఒక వీధిలో పందిరి వేసి చుట్టూ కిరసనాయిలు లాంతర్లు వ్రేలాడకట్టేవారు. ఈ లాంతర్లు లేని

రోజుల్లో ఆముదపు దీపాలనూ, నూనె కాగడాలనూ లేదా ఇలాయి కట్టెలనూ వెలిగించేవారు. ఈనాడు పెట్రోమాక్సు లైట్లను వాడుతున్నారు. ముగ్గురు వ్యక్తులుండి, రెండు పెట్రోమాక్సు లైట్లుంటే అతి తేలికగా జంగం కథా కార్యక్రమం జరిగిపోతుంది. కథకునికి ఒక తంబురా, మూడు అందెలు, రెండు కాళ్ళకు గజ్జెలు, వంతకు రెండు గుమ్మెట్లు, ముగ్గురికీ మూడు గౌన్లూ, మూడు తలగుడ్డలూ వుంటేసరి కథ జరిగిపోతుంది. ఒక్కసారి ఈ సామగ్రిని ఏర్పాటు చేసుకోగలిగితే రోజువారీగా కావలసిన సామగ్రి ఏమీ వుండదు. ముగ్గురు వ్యక్తులూ వేలాది ప్రజలకు తెల్లవార్లూ



వువ్వుగుండూరు బుర్రకథ దళం

కథ వినిపించి కూర్చోబెట్టగలరు. వీరి బృందం ఒక గ్రామం నుంచి మరో గ్రామం వెళ్ళాలంటే ఎవరి సామాను వారు భుజాలకు తగిలించుకుని సునాయాసంగా ప్రయాణం చేస్తారు.

## కథావిధానం, కథల కట్టు, పట్టు :

జంగం కథల్లో కథకుడు తంబురాను ధరించి శృతిని మీటుకుంటూ చేతి అందెలతో తాళం వేస్తూ కాళ్ళతో నృత్యం చేస్తూ కథను ప్రారంభిస్తాడు. ప్రక్క

సున్న వంతదారులు రెండు గుమ్మెటలను భుజాలకు తగిలించుకుని 'దద్దో తిమి, తధిమి తత్తధిమి, తకిట తతధిమి, దింతక్కదాతద్దిందా. తక తక్కి, తకతక్కా' అనే దరువు వేస్తూ 'తధిగిణతోం' అంటూ మధ్య మధ్య గమకాలనిస్తూ కథా సన్నివేశాల ననుసరించి మధ్య మధ్య అరరె, అరరె, భళి, భళీ అంటూ కథకుడికి హుషారు నిస్తూ, వుధృతంగా నృత్యం చేస్తూ ప్రజల కందుబాటులో అన్ని ప్రక్కలకూ తిరుగుతూ వుంటారు. కథకుని లయప్రకారం, వంతలు గమకంగా వాయిస్తారు. కథకుడు చక్కగా చరణం పాడితే దానిని వంతదార్లు తిరిగి వంతపాడుతారు. కథకుడు కథను వివరిస్తే మరో వంతదారు (ఇతడు హాస్యగాడు) ప్రేక్షకులకు వచ్చే అనుమానాలను హాస్య ధోరణిలో కథకుని ప్రశ్నించి, సున్నిత హాస్యంతో ప్రజలను ముగ్ధుల్ని చేసి కథను ముందుకు నడిపేవారు. ఈ హాస్యంవల్ల పరాకుగా వున్న ప్రేక్షకులందర్నీ ఒక హద్దులో వుంచి కథను వినేటట్లు అభిలాషను కలిగించేవారు. కథకునికీ, వంతలకూ మధ్య నున్న అవినాభావ సంబంధం ఇంతా అంతా అని చెప్పలేం. కథా గమనంలో ఆ యా ఘట్టాలలో ఎక్కడా వీసమంత వెలితి రానీయరు. కావాలను కున్నప్పుడు ప్రేక్షకులను నవ్వించగలరు, ఏడ్పించగలరు, వుద్రేకపరచగలరు. కథను విన్న ఆ కొంచెంసేపూ ప్రేక్షకులను ఒడలు మరచేటట్లు చేయగలరు. వంతలు కథను ఆలాపిస్తుంటే కథకుడు చేతిలో వున్న అందెలతోబాటు ఒక అందమైన చేతిగుడ్డను వూపుకుంటూ రెండవ చేతితో తంబురాను మీటుతూ, కాళ్ళ గజ్జెలు ఘల్లుమనేటట్లు నృత్యం చేస్తూ అటూ ఇటూ చేతులు వూపుకుంటూ సాత్విక, ఆంగిక చలనాదులతో రంగస్థలం అంతా కలియదిరుగుతూ యుద్ధఘట్టాలలోనూ, రౌద్ర ఘట్టాలలోనూ పిడుగులు బడ్డట్లు ఎగిరి ఎగిరి గంతులు వేస్తూ, గిఱ్ఱుగిఱ్ఱున గిరికీలు కొడుతూ, పళ్ళు పటపట కొరుకుతూ అరరే, అరరే అంటూ వంతలను కేకలతో అదలిస్తూ హంగామా చేసి ప్రేక్షకులను నివ్వెరపోయేటట్లు చేసేవారు. పైన వివరించిన ప్రదర్శన విధానాన్నిబట్టి, జంగం కథా కళారూపం ఎంత పదునైనదో మనకు బోధపడుతుంది. ముగ్గురు వ్యక్తులతో కూడిన ఈ కళారూపం యొక్క ప్రాముఖ్యం అనిర్వచనీయమైనది. ఇది ఇంతటి వుత్తమ కళాయుధం గనుకనే చరిత్రాత్మకంగా ఆంధ్ర ప్రజాహృదయాలలో హత్తుకుపోయింది.

## బుర్రకథ అంటే?

ప్రజాహృదయాలను ఇంతగా చూరగొన్న ఈ జంగం కథల యొక్క పూర్వ చరిత్ర మనకు సరిగా తెలియడం లేదు. జంగం కథగా వర్ధిల్లి ఈ కళారూపం నేడు

బుర్రకథ అనీ, తంబురా కథ అనీ. తందాన కథ అనీ, గుమ్మెట్ల కథ అనీ, అనేక ప్రాంతీయమైన భేదాలతో పిలువబడుతూ వుంది. కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఈనాడు జంగం కథలంటే చాలామందికి తెలియదు. బుర్రకథ అనే పేరు ఆబాల గోపాలానికీ తెలుసు. అలాగే రాయలసీమ జిల్లాలలో బుర్రకథ అంటే ఎవరికీ తెలియదు. అక్కడ 'తందాన కథ'లనే వ్యవహరిస్తున్నారు. ఈ విధంగా జంగం కథ ప్రాంతీయమైన భేదాలతో వివిధ నామాలతో పిలువబడుతూ వుంది. ఈ కథకు ఇన్ని పేరులు రావడానికి కారణం కూడా లేకపోలేదు.



ఈ కథల్లో ప్రధాన కథకుడు తంబురాను వుపయోగిస్తున్నాడు. ఆ తంబురాకు ఉపయోగించే బుర్రనుబట్టి దీనికి తంబురా కథ అనీ, బుర్రకథ అనీ పేరు వచ్చి వుండవచ్చు. ఈ కథలో ఉపయోగించే గుమ్మెట్లను డక్కీలనీ, బుర్రలనీ వ్యవహరించటంవల్ల ఈ కథలకు డక్కీ కథలు, బుర్రకథలు అనే పేర్లు సార్థకమై యుండవచ్చునని కొందరి అభిప్రాయం.

## ఈనాటివి కావు, అక్షరాలా ఆనాటివే :

అలాగే ఈ కథలకు తందాన కథలనీ తందాన పాటలనీ కూడ ప్రచారముంది. ముఖ్యంగా బుర్రకథలలో గుమ్మెట్లు వాయిస్తూ వంతలు పాడేవారు తందానా, తాని తందానా అనే వంతపాట పాడటంవల్ల కూడా ఈ కథలకు తందాన కథలని పేరు వచ్చివుండవచ్చు. తందాన కథలు ప్రాచీన కాలం నుండీ వున్నవనడానికి వుదాహరణగా క్రీడాభిరామంలో

అకలంక స్థితిగోరి కొల్చెదరు బ్రహ్మానంద సంభావనన్
సకలానందమయైక మాతలగుచున్ సంతోష చిత్తంబునన్
తకదుమ్ముల్ యకతాళముల్ జవనికల్ తందాన లమ్మయ్యకున్
ఏకవీరమ్మకు మూహురమ్మకు నధోహ్రీంకారమాధ్యాత్మకున్.

అని పేర్కొనడాన్ని బట్టి కాకతీయ యుగంనాటికే ఈ జంగం కథలు బహుళ ప్రచారంలో వున్నాయని తెలుస్తూంది. 'యకతాళముల్ జవనికల్ తందాన లమ్మయ్యకున్' అనడంవల్ల ఆనాటి జంగం కథల్లో జవనిక వాద్యం కూడ వుపయోగించినట్లు వూహించవచ్చు. 'తందాన' అనే వంతపదం ఆనాడు పాడబడే ప్రతి కథలోనూ వంతగా పాడి వుండవచ్చు.

ఆంధ్రప్రజా జీవితంలో ఇంత విశిష్టస్థానాన్ని సంపాదించుకున్న ఈ బుర్ర కథను గూర్చి పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలోగాని, పండితారాధ్య చరిత్రలోగాని, తొలి వీథినాటకం క్రీడాభిరామంలో కాని ఎవ్వరూ దీనిని పేరు పెట్టి స్పష్టంగా పేర్కొనకపోవడం చూడగా ద్విపద భూయిష్ఠమైన ఈ రచనకు ప్రక్క వాద్యాల ప్రాబల్యాన్నిబట్టి క్రమేపీ ఈ పేరు రూఢమై యుండవచ్చు. ప్రాచీన కళా రూపాలైన యక్షగాన, వీథినాటకాల పూర్వరూపం బుర్రకథ కావచ్చుననీ శ్రీనాథుని కాలానికి ముందునుంచే ద్విపద ప్రబంధం బుర్రకథ వంటిది గానరూపంలో వుందన డానికి క్రీడాభిరామంలోని ఈ క్రింది పద్యమే తార్కాణమనీ తిరుమల రామచంద్ర గారు 'జయంతి' పత్రికలో 'తెలుగువారి తొలి సంగీత కళారూప' మనే వ్యాసంలో వుదాహరించారు.

ద్రుత తాళంబున వీరగుంభితక ధుంధుం ధుంకి టాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంగా

యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కతె ప్రత్యక్షరముం గుమారకులు ఫీత్కారంబునం దూలగన్.



ప్రజానాట్యమండలి మహిళా బుర్రకథ దళం. శ్రీ రాజమ్మ, కొండేపూడి రాధ, వి. సరోజిని

అని 14 వ శతాబ్దంలో రచింపబడిన క్రీడాభిరామ కాలానికే బుర్రకథ కళా రూపం ప్రచారంలో వుందనడానికి ఈ పద్యంలో వుదాహరించిన ఇతివృత్తే

నిదర్శనం. దీని ఇతివృత్తం వీరచరిత్రకు సంబంధించింది. పాడింది ద్విపదకావ్యం. వీరగుంభితను వాయించింది ఒక స్త్రీ. పైన వివరించిన వీరగుంభిత నేటి గుమ్మెటని పండితుల అభిప్రాయం. గుమ్మెట్లవాద్యం గంభీరంగానూ, గుంభనంగానూ వుండే ధ్వని విశేషం అవడంవల్ల దీనికి గుంభిత అనే పేరు వచ్చి వుండవచ్చు. ఈ గుంభితను ఆనాడు స్త్రీలు వాయించినట్లే ఈనాటి కథల్లో స్త్రీలూ, పురుషులూ కూడ వాయిస్తున్నారు. ఈ డక్కీలు పూర్వం నుంచీ వున్నవనడానికి కాశీఖండంలో శ్రీనాథుడు

వల్లకి చక్కి కాహళము వంశము డక్క హుడుక్క ఝర్ఝరుల్
ఝల్లని యాదిగా గలుగు శబ్దపరంపర తాళ శబ్దమై.

అని వుదాహరించడాన్నిబట్టి, డక్కహుడుక్క అనే దానినిబట్టి కాహళము మొదలైన వివిధ వాద్యాలతోపాటు డక్క అనే నేటి డక్కీనీ బుడబుక్కలవారుపయోగించే హుడుక్కను కూడ వుపయోగించి వుండవచ్చు. అలాగే పండితారాధ్య చరిత్రలో

అలరుచు బడిహారులట్ల యందరును
లలినుచ్చి చాంగు భళాయనువారు

అనే దానినిబట్టి నేటివంతలు పాడే 'భళానోయిభాయి తమ్ముడూ, మేల్ భళానోయి దాదానా' అనే దానికి దగ్గరగా వుండడాన్నిబట్టి 'తందానా తాని తంధనా, బళా, భళి' మొదలైన వంత విశేషాలు ఆనాటినుంచీ ప్రచారంలో వున్నట్లు మనం తెలుసుకోవచ్చు.

బుర్రకథ గానవిశేషంగా రూపొందిందనడానికి పై ఉదాహరణలేగాక, క్రీడాభిరామంలో

రాగములనుండి లంఘించ రాగమునకు నురుదు నూరుదయ్యంబుపైనొత్తిగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు బాడుచు వచ్చె జక్కులపురంధ్రి.

జక్కులపురంధ్రి వలపు బాడుచువచ్చె అనే దానినిబట్టి గానవిశేషంగా రుజువౌతోంది.

అలాగే బసవపురాణంలో సోమనాథుడు శ్రీయాళచరితను గురించి

కరమర్థి నూరూర శిరియాలుచరిత—
పాటలుగా గట్టి పాడెడివాడు.

అనడాన్నిబట్టీ,
శ్రీనాథుడు కాశీఖండంలో దక్షవాటి పురమును వర్ణిస్తూ

కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి.

అనడాన్నిబట్టీ గంధర్వగానాన్ని యక్షగాన సరణిలో పాడి వినిపించేవారని అర్థమౌతోంది. పై వుదాహరణలనుబట్టి - ఒకే నటి వివిధ వాద్య విశేషాలతో వివిధ పాత్రల్ని అభినయించేదని తెలుస్తూంది.

ఈ జాతికి చెందిన కథలను స్త్రీలే కాక, పురుషులు కూడ పాడి వినిపించినట్లు క్రీడాభిరామంలో

వాద్యవైఖరి కడునెరవాది యనగ-ఏకవీరా మహాదేవి ఎదుటనిల్చి,
పరశురాముని కథలెల్ల ప్రౌఢిపాడె-చారుతరకీర్తి బవనీల చక్రవర్తి.

వివిధ వాద్యాలలో పరశురాముని కథలు బవనివారు పాడి వినిపించినట్లుగా వుంది. జవనికలు, డక్కీలు మొదలైన వాద్య వైఖరులన్నీ చేరి వుండవచ్చును. ఇందుకు మరో వుదాహరణగా పండితారాధ్య చరిత్రలో ....



నాదట గంధర్వ యక్షవిద్యాధి-
రాదులై పాడెదు నాడెడువారు.

పై వర్ణనలనుబట్టి నటి నాట్యానికి అనుకూలమైన దుస్తులు ధరించి యక్షిణి లాగా తంబురాలాంటి జంత్రవాయిద్యాన్ని వాయిస్తూ, పాడుతూ, ఆడుతూ కథ విని పించేదని తెలుస్తూ వుంది.

ఈమాదిరి కథ వినిపించింది జక్కులపురంధ్రి అని విదితమౌతోంది. దీనిని బట్టి మూల యక్షగానం సంగీత నృత్యసహాయంతో కథ వినిపించే కళారూపమని స్పష్టమౌతోంది.

ధర్మాంగద చరిత్ర, చిత్రాంగద విలాసం మొదలైన యక్షగానాలు 'వేషముల్ గట్టి జనులు పాడి వినిపింప' అనడాన్నిబట్టి 'వలపుబాడుచు వచ్చె జక్కులపురంధ్రి' అనే దానినిబట్టి గోవిందదీక్షితుడు సంగీతసుధ అనే లక్షణ గ్రంథంలో యక్షగానం యక్షులచేత పాడబడే ఒక సంగీత విశేషమని వుదాహరించడాన్నిబట్టి పాడి వినిపించడానికీ వుపయోగపడ్డాయని అర్థమౌతూంది. అతి ప్రాచీన యక్షగానాలైన ఓబయమంత్రి గరుడాచల యక్షగానమూ. కందుకూరి రుద్రయ్య రచించిన సుగ్రీవ విజయమూ పాడి వినిపించినవేగాని యక్షగానాలుగా ప్రదర్శింపబడినవి కావు. కేవలం ఒకే నటి వివిధ పాత్రల్ని అభినయించేదని ఉదాహరణలనుబట్టి తెలుస్తూంది. అయ్యగారి వీరకవి రచించిన చిత్రాంగద విలాసమనే యక్షగానంలో

చిత్రాంగద విలాసమనగ యక్షగాన మొనరింతు.
వేషముల్ గట్టి జనులుపాడి వినిపింప.

అని పేర్కొనడాన్నిబట్టి యక్షగాన రూపంలో వున్న వీథినాటకమని బోధపడుతూంది. పై వుదాహరణలను బట్టి యక్షగానాలు, వీథి నాటకాలు, బుర్రకథలు మొదలైనవన్నీ దేశి సారస్వతానికి చెందిన సంగీత రూపకాలుగా పరిణామం చెందుతూ, దేనికి దానికే ఒక ప్రత్యేకమైన రూపాన్ని సంతరించుకుని, వివిధ కళా రూపాలుగా వృద్ధిచెంది వుండవచ్చు. ఇలా గానరూపంగా అభివృద్ధి పొందుతూ వచ్చిన యక్షగానంలో సూత్రధారుడు ప్రవేశించి, నటియొక్క పాటకు వంత పాడుతూ, కథాగమనంలో వచ్చే చిల్లర పాత్రలకు వాచికం చెపుతూ వుండేవాడు. నటి వివిధ పాత్రల్ని అభినయిస్తూ కథ వినిపించేది. ఈ విధానమే భామాకలాపం. గొల్లకలాపంగా రూపొంది వుండవచ్చు. సూత్రధారుడు విదూషకుడుగా మారి వుండవచ్చు.

తరువాత యక్షగానంలో వచ్చిన మార్పుల ననుసరించి మరో దశ నందుకుంది. ఒకే నటుడు వివిధ రకాల పాత్రల్ని అభినయించడమే కాకుండా విడి విడిగా ఒక్కొక్కరూ ఒక్కొక్క పాత్రను అభినయించే సాంప్రదాయం ఏర్పడింది. తంజావూరు యక్షగానాల్లోనూ, యాదవదాసు గరుడాచల యక్షగానంలోనూ, పాత్రల

ప్రవేశం ప్రవేశపెట్టబడి వుంది. అంటే ప్రవేశించే ప్రతి పాత్రా తన వూరు, పేరు తెలుపుతూ, 'వెడలె సత్యభామ' అని స్త్రీ పాత్రలూ, 'వెడలె యమధర్మరాజు' అని పురుషపాత్రలూ ప్రవేశించేవన్న మాట. ఈ దశలో పరిణామం చెందిన యక్షగానా లను యక్షగాన నాటకాలని, వీథి నాటకాలని పిలిచారు.

ఈ విధంగా యక్షగానాలు రచనలో, ప్రదర్శనలో అభివృద్ధి చెందుతున్నా మూల యక్షగానమైన సంగీతరూపం బుర్ర కథగాను, హరికథగానూ రూపొందింది. ఇందుకు వుదాహరణ - హరికథా పితామహుడైన అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారు తమ కథలన్నిటినీ యక్షగానాలనే వ్యవహరించారు.

యక్షగానంలో సూత్రధారుడూ, విదూషకుడూ వున్నట్లే బుర్ర కథలో వంత దారులు ప్రవేశించారు.

యక్షగానంలో విదూషకుడు హాస్యం చెపితే బుర్రకథలో వంతదారు హాస్యం చెపుతాడు.

ఆనాటి నుండి ఈనాటి వరకూ కొన్ని బుర్ర కథలను స్త్రీలు కూడ చెప్పడం వల్ల ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించగలిగేవారు.

ఈ విధంగా పరిశీలన చేసేటట్లయితే మూల యక్షగానం రూపాంతరం పొంది బుర్రకథగా పరిణామం చెందిందని శ్రీనివాస చక్రవర్తిగారు నాజరు సన్మాన సంచికలో వుదాహరించారు.

## మహారాష్ట్ర కళారూపమా :

ఈ బుర్ర కథ కళారూపం మహా రాష్ట్రం నుండి మనకు దిగుమతి అయిందనే వాదం కూడా వుంది. చాళుక్యరాజులు తూర్పు కోస్తాను పరిపాలించిన రోజుల్లో పశ్చిమ దేశాన్నుంచి తూర్పుకు వచ్చిన చాళుక్య రాజులతోపాటు ఈ బుర్ర కథలు, తోలు బొమ్మలాటలు మొదలైన జానపద కళా రూపాలు దిగుమతి అయినాయని కొంత మంది చరిత్రకారుల అభిప్రాయం. కాని చరిత్రగతిని బట్టి కొంచెం వెనుకకు వెళ్ళి



పరిశీలిస్తే ఒకనాడు దక్షిణ భారత దేశమంతా అనేక పర్యాయాలు, అనేక చక్రవర్తుల ఏలుబడిలో ఏకఖండంగా వుంది. కృష్ణదేవరాయ పాలనలో కన్నడ, తెలుగు, తమిళ రాష్ట్రాలు కలిసే వుండేవి. ఆనాడు ఆంధ్ర కళారూపాలు విజయనగరం తంజావూరు సరస్వతీ మహల్ యక్షగానాలూ, తెలుగు నాటకాలను ప్రదర్శించే మేలటూరు భాగవత మేళాలు ఉదాహరణలుగా నిలిచి వున్నాయి. ఈ విధంగా ఆ యా కాలాల్లో కళల యొక్క, సారస్వతంయొక్క ప్రభావం ఆ యా జాతులమీద పడి వుండవచ్చు. అందువల్ల ఏ కళారూపం ఎక్కడి నుంచి దిగుమతి అయిందనే మీమాంసకు తావు లేదు. కాని ఇందుకు ఉదాహరణగా తిరుమల రామచంద్రగారు 'జయంతి' పత్రికలో బుర్రకథ తెలుగు వారి సంగీత కళారూపమేననీ అది ఎక్కడ నుండో దిగుమతి కాలేదనీ, కన్నడ మహారాష్ట్ర కళారూపాలైన పవాడా, లావణీలకూ మన బుర్రకథకూ వున్న వ్యత్యాసాలను గురించి చర్చిస్తూ ఈ క్రింది విధంగా ఉదాహరించారు.

తెలుగు బుర్ర కథకు, మహారాష్ట్రుల పవాడాకు, కన్నడుల లావణీకి 'జానపద కళారూపా' లనడం తప్ప మరేమీ పోలిక లేదు.

పవాడాను కూర్చునీ, నిలబడీ పాడుతారు. ఇది మన భజనగోష్ఠిలాంటిది. ఈ కథలో వీరరసం ప్రాధాన్యం వహిస్తుంది. వెనుక వంతదార్లు - పురుషులు - దీదీ దీదీ అంటూ వంతరాగాలు పాడుతారు.

బుర్రకథలో మాదిరి అభినయంగాని, నిలబడి నృత్యం చేయడంగాని పవాడాలో లేదు.

ఇక కన్నడ లావణీ ప్రాచీనమైనది. 16 వ శతాబ్దంనుంచీ లావణీ ప్రచారంలో వుంది.

17 వ శతాబ్దంలో నందివర్మ దీనిని తన ఛందోగ్రంథంలో ఉదాహరించి లక్షణం చెప్పాడు.

లావణి అనేది జనపదగాథలను తెలిపే ఛందో విశేషం. ఇవి గ్రామీణ జీవిత గాథలను వివిధ రసాలతో ప్రకృతి సౌందర్యాన్ని వివిధ రీతులలోను వర్ణిస్తుంది. ఇద్దరుగాని ఒక్కరుగాని నిలబడి పాడుతారు. దీనికి వంతపాట వుండదు. దీనికీ మన బుర్రకథకూ నిలబడి పాడడమనే పోలిక తప్ప మరే పోలికా లేదు.

పోతే మరాఠీలో కూడా లావణి వుంది. దానిలో స్త్రీలు పాడడం, చేతులు త్రిప్పడం వంటి ఆంగికాభినయం వుంది. కాని కథా విధానం వుండదు. గుమ్మెట్ల వంటి వాద్యాల ప్రసక్తి లేదు. అది కేవలం పేరంటపు పాటలవంటిది కావచ్చు. పై

ఉదాహరణల ననుసరించి. బుర్ర కథ కన్నడ మహారాష్ట్రాలనుంచి గాని, మరే రాష్ట్రం నుంచి గాని దిగుమతి కాలేదని స్పష్టమౌతోంది.

## బుర్ర కథ :

జానపద వాఙ్మయంలో జంగం కథల సాహిత్యం ఒక ప్రత్యేక స్థానాన్ని వహిస్తూ వుంది. ఈ సాహిత్యంలో చాలా రకాలు కనిపిస్తున్నాయి. చాలవరకు పూర్వపు యక్షగానాల్లో ఇతివృత్తమంతా పురాణగాథలకు సంబంధించింది. యక్ష గానాలు బుర్ర కథలుగా అభివృద్ధిచెందిన తరువాత బొబ్బిలియుద్ధం, పల్నాటి వీర చరిత్ర మొదలైన చారిత్రిక యుద్ధ కథలూ, బాలనాగమ్మ, కామమ్మ, చిన్నమ్మ,



ప్రజానాట్యమండలి బుర్రకథ దళం. కథకుడు ఉమామహేశ్వరరావు - వంతలు మిక్కిలినేని - మాచినేని

లక్ష్మమ్మ, తిరుపతమ్మ, జానకీవాసం మొదలైన కరుణరస ప్రధానమైన పాతివ్రత్య గాథలూ, ఉత్తర గోగ్రహణం, వామన విజయం, దేవయాని చరిత్ర, అంబరీషో పాఖ్యానం మొదలైన భారత రామాయణ గాథలకు సంబంధించిన అనేక కథలూ వచ్చాయి.

ఆ నాటినుండి ఈ నాటివరకు జంగం కథలు ప్రచారంలో వున్నాయి. ఈనాడు జంగం కథల పద్ధతిని రాజకీయ, సాంఘిక పరిస్థితులకు అన్వయించి ప్రచారం చేస్తు

న్నారు. వెనుకటి వీరరస గాథల్నీ దేశభక్తిని పురికొల్పే దేశనాయకుల జీవితాలైన, "గాంధీ జీవితం, అల్లూరు సీతారామరాజు, సుభాష్ చంద్రబోస్" మొదలైన దేశ భక్తుల జీవిత గాథలూ, కష్టజీవి, రైతు విజయం మొదలైన కష్టజీవుల గాథలూ చెప్పి ప్రజాప్రబోధం చేస్తున్నారు.



## పూర్వపు విధానా లేమిటి? :

పూర్వపు జంగం కథల రచనా విధానం ఎటువంటిదో ఇదమిత్థంగా మనకు పూర్తిగా తెలియలేదు. కాని ఇటీవల రచించిన కథలు ఒక పద్ధతిలో జంగం కథలు గానే వ్రాయబడ్డాయి. ఈ రూపంలో పూర్వం నుంచీ చెప్పబడిన సంగీతరూపకమైన బుర్ర కథ, కురవంజి, యక్షగాన రచనలనే బుర్ర కథలుగా చెప్పినట్లు ఒకే ఛందస్సును వివిధ కళారూపాలకు ఎలా వినియోగించుకున్నారో, వీటి స్వరూపణం అప్పకవీయంలో "అప్పకవి" ఎలా వర్ణించాడో ప్రసిద్ధ బుర్రకథ గాయకుడు తన సన్మాన సంచికలో ఈ విధంగా వర్ణించాడు.

## అప్పకవీయం :

తుద నేడు లఘువులు తొలగించి చదివిన
త్రిప్పుటకు వృషభగతి పదయుగము.
లలి గడపల నొక్క లఘువు దూసిన జంపె
మను ద్విరద గతి సమపద యుగము.
గురుతుగ రబ్బరకు డురుగ వల్లనా
హ్వాయమేక తాళియా మధురగతికి.

అంగి కిర్వదినాలు గటతాళమున
మాత్రలివి విశ్రాంతి పథ్నాలుగింట
తెలియ నర్ధ చంద్రికల దీన

యక్షగాన ప్రబంధంబు లతుకవచ్చు
రగడ భేదంబు లివి. యందు రసకవీంద్రు.

(అప్పకవీయం)

ఉదాహరణకు:

వృషభగతి రగడ యననేమి?
కుపికలోత్తము నాకు చూడగ
కపటవేషము కానరానిది.

(కందుకూరి రుద్రయ్య, సుగ్రీవ విజయం, యక్షగానం)

ఈనాడు ఆచరణలో నున్నది.

రాయు డొచ్చె ఢాకలాకు
కొంగలే కోలాట మేసె.

(సర్వాయి పాపడు బుర్ర కథ)

ఇక రెండవది ద్విరతగతి రగడ

వనచరోత్తము లెల్లివచ్చి - మంచి
దినము చేకొని నన్ను దెచ్చి.

(సుగ్రీవ విజయం)

ఈనాడు కనుపిస్తున్నది.

ఓ రామరాఘవా నేడు భళీ భళీ
శ్రీ రామరాఘవా నేడు.

(జానకీవాసం లేక లవ కుశ బుర్రకథ)

మూడవదైన తురగవల్గము.

ముక్కులు చెక్కులు మూపులు వీపుల్
ప్రక్కలు పెక్కలు బరులు మదరులున్.

(సుగ్రీవ విజయం)

ప్రస్తుతం కనిపిస్తున్న బుర్రకథ

మందులు మందులు మందులంటడే
మహావ్యాధులకు మందులంటడే. (శరాబంది రాజు బుర్రకథ)

నాల్గవదైన అటతాళము

కుపికులోత్తమా - నాకు చూడగా కపటవేషమేగా.

(సుగ్రీవ విజయం)

ప్రస్తుతమున్న బుర్రకథ

శ్రీ ధేనువు గిరిధామా - యదుకుల క్షీరాంబుధి సోమా.

(ధేనువుకొండ వారి, విరాటపర్వం)

అయిదవ అర్ధచంద్రికలు

కుపికులోత్తమా నాకు చూడగన్
కపట వేషము కానరాదిదిన్.

(సుగ్రీవ విజయం)

ప్రస్తుతమున్న బుర్రకథ

ఉత్తరాదియా భూమే అమ్మయ్యో
అందమైన లింగాల పురంలో.

(లక్ష్మమ్మ కథ)

ఇవే కాక అర్ధచంద్రికలు అనేక పణుతుల్లో కనిపిస్తున్నాయి. ప్రాచీన కురవంజి నృత్యకారులకోవకు చెందిన చెంచులు పాడే పణుతులు.

ఏ వూరు ఏ భామా - తంధానా
ఎవ్వారి భామవే - వై భామా
చేతిడే ముద్దమ్మా - తంధానా
చేయెత్తి దానాలు - వై భామా
వడ్డిచ్చేతల్లో వడ్డిచ్చేతల్లో.

(చెంచులు)

ఇలాగే కోయలు.

మోకాళ్ళ నొప్పులకు
వాత నొప్పులకు
అమ్మా నే నింతగల్ల శ్రద్ధనే, ॥ఈ॥
నే నీ యింటే ఉన్నానే ॥ఈ॥

(కురవంజి)

ఈ విధంగా అనేక విధాలుగా ప్రజల్లో వినిపిస్తున్న విధానాలు భరతుడు నిర్వచించిన కొరవంజి....యక్షగానాల నుండీ గాంధర్వ గానము ఉద్భవించాయని మనం అర్థం చేసుకోవచ్చు....పై ఉదాహరణలను బట్టి మన జంగం కథలు, బుర్ర కథలు, కురవంజి, యక్షగానం మొదలైనవి అనేక దశలను దాటి నేటి సంగీత కళా రూపంగా నిలబడిందని చెప్పుకోవచ్చును.

జంగం కథలు ఎప్పటినుండో వస్తున్నా జంగం చరిత్ర కథలనేవి ఇటీవలనే రచింపబడినాయనీ ఇవి ఒక పోషకుని కోరికమీద వ్రాయబడి అతనికిగాని, మరొకనికిగాని అంకితమీయబడతాయనీ, అటువంటి జంగం కథారచయితలు కొందరున్నారనీ వారి కాలాన్ని గురించి వారు రచించిన జంగం కథలను గురించి.... చేకుమళ్ళ కామేశ్వరరావుగారు కొంతకాలం క్రితం ఆంధ్ర మహిళ పత్రికలో వివరించారు.

## జంగం కథలు, కొందరు రచయితలు

### ధేనువుకొండ వెంకయామాత్యుడు :

ధేనువుకొండ వెంకయామాత్యుడు 1890 ప్రాంతానికి చెందినవారు. ఒంగోలు తాలూకా గార్లపాడు గ్రామస్తులు. ధేనువుకొండ పిచ్చయ్యగారి పుత్రులు. ఈయన విరాటపర్వం అనే జంగం కథను రచించి ఆ వూరి విష్ణుదేవునికి అంకితమిచ్చారు. ఈయన యక్షగానాల్ని రక్షించినట్లు పీఠికలో వ్రాసుకున్నారు.

వీరు ఉషాపరిణయం, మైరావణ చరిత్ర .... విరాటపర్వం .... ఉత్తర గోగ్రహణం, దక్షిణ గోగ్రహణం, కీచకవధ ....వామన చరిత్ర....ప్రత్యేకంగా వ్రాశారు. యక్షగాన కవిత్వంలో ఆయనకు ఆయనే సాటి.

ప్రహ్లాద చరిత్ర .... ప్రద్యుమ్న విజయం....సుందరాకాండ .... సీతాకళ్యాణం మొదలైన హరికథలను కూడా రచించారు.



వెంకయ్యగారి కథలన్నిటినీ, కీ॥ శే॥ దొడ్డారపు వెంకటస్వామిగారు మహాద్భుతంగా చెప్పి ప్రచారంలోకి తీసుకువచ్చారు.

వెంకయ్యగారిని గురించి గృహలక్ష్మి సంపాదకులు కేసరిగారు తమ చిన్ననాటి ముచ్చట్లలో ఉదాహరించారు.

వెంకయ్యగారు విరాటపర్వంలో ఉపయోగించిన రగడ.

రగడ

అనిన ద్రౌపదిని గనుగొని భామిను లాశ్చర్యంబునను
ఘనముగ నిట్లని బల్కిరి తమలో వనిత లందరును గూడి
ఏమి చోద్య మిది నమ్మవచ్చునా ఇంతులార మనము
భామామణి యొక రింటివద్ద తా బానిసంబు చేయ.

## గంజి నాగదాసు:

గంజి నాగదాసు 1895 ప్రాంతానికి చెందినవాడు. స్వగ్రామం ఫలానా అని ఎక్కడా చెప్పుకోలేదు కాని ప్రతి కీర్తనలోనూ మంగళాద్రి అని చెప్పుకొనడంవల్ల అది గుంటూరు జిల్లాలోని మంగళగిరి కావచ్చును.

ఈయన శ్రీయాళ చరిత్రను రసవంతంగా రచించాడు. సరియైన పాత్ర పోషణతోపాటు కరుణ రసం నేర్పుగా చిత్రింపబడింది. సులభశైలిలో వ్రాయబడిన ఈ కథలో రగడలు, కంద పద్యాలు అక్కడక్కడ కీర్తనలు, ఇతర ఛందస్సులతోపాటు కొన్ని శ్లోకాలు ఉదాహరింపబడ్డాయి.

## కిలారు బ్రహ్మయోగి:

కమ్మ కులానికి చెందిన కిలారి బ్రహ్మయోగి....భల్లాణరాయ కథ అనే జంగం కథను రచించాడు. ఈయన 1895 ప్రాంతానికి చెందినవాడు. ఈయనది మొదట పెంద్రేల గ్రామం, తరువాత చింతలపాలెంలో వున్నట్లుగా పీఠికలో వ్రాసుకన్నారు.

బ్రహ్మయోగి విష్ణుభక్తుడైనప్పటికీ వీరశైవ కథను రచించాడు.... భల్లాణరాయ కథ....1180 ప్రాంతంలో పాల్కురికి సోమనాథుడు రచించిన బసవ పురాణంలో వుంది. బ్రహ్మయోగి కవిత్వం వినసొంపుగా వుంది. జంగాలు

పెట్టుకునే అనేక పేర్లనూ ఆనాటి జంగాలయొక్క ప్రాముఖ్యాన్ని ఇలా వివరించాడు.

రగడ

కోటి సంఖ్యలకు మిగిలిన జంగము లటకు చేరి రపుడు
ఘణం ఘణా యని ఘంటానాదము మింటికి నెగియగను
ధణం ధణా యని తాళనాదములు ధ్వనులట చెలగగను
ధిమి ధిమి ధిమి యని దిమ్మోట లపుడటు సమముగ వాయగను

ఈ విధంగా ఆనాటి జంగాల ఉద్రేకాలను రమణీయంగా వర్ణించాడు. ఈయన కథా రచనలో యక్షగానాన్నీ, కందార్థ దరువుల్ని, రగడల్ని, శృంగార నాటకంగా కథా నరళిని చెపుతానని 14-వ పేజీలో చెప్పుకున్నారు.

## ఉప్పలపాటి వెంకటరామయ్య:

ఈయన స్వగ్రామం నెల్లూరు జిల్లాలోని ఉప్పలపాడు. ఆరువేల శాఖీయుడు. ఈ కవి అంబరీషోపాఖ్యానం ....జంగం చరిత్ర కథను వ్రాశాడు. రావినూతలపాటి కాపురస్థుడు. వీరగుంట శేషయ్య. ఈ కవిని అంబరీషోపాఖ్యానాన్ని రచించమని కోరగా దీనిని రచించి ఆ వూరి చెన్నకేశవస్వామికి అంకిత మిచ్చాడు.

ఈ కవి ఇలా వ్రాసుకున్నాడు.

రంగుగ తాంబురా చిటి తాళములు
ఖణింగున మ్రోయగను
ఛంగు ఛంగున జంగమువారలు పొంగుచు
నిక్కథను
చెప్పుట కొరకే రగడ పద్ధతి గజేసి నిక్కథను.



ఈయన రచన సులభమైన రచనలో సాగింది.

## గంధి వెంకటసుబ్బయ్య:

ఈ కవి వైశ్యుడు గుంటూరుజిల్లా నంబూరు నివాసి. ఈయన వామన విజయం, దేవయాని

చరిత్రను రచించాడు. వామన విజయం కథను ఈయన మిత్రులైన పొట్టి పానయ్య, వెంకటసుబ్బయ్యను, వామన విజయాన్ని రచించి, నంబూరు గ్రామం లోని మల్లిఖార్జునస్వామికి అంకిత మియ్యమని కోరారు. అందుమీదట కవి ఈ జంగం కథను రచించాడు.

## జంగం కథకులు, బుర్ర కథకులు :

పూర్వం జంగం కథలు చెప్పిన వారిలో ప్రముఖులు దొడ్డారప్ప వెంకట స్వామి, అంజే కోటదాసు, జంగా సుబ్బదాసు, యాదవదాసు, రెంటపాళ్ళ గుడ్డిజంగం, కోలవెన్ను సమ్మెట రామలింగం, జంగయ్య సుబ్బయ్య దేవర వావులూరు యల్లమంద, మంతెన జంగాలు మొదలైన ఎందరో మహామహులు జంగం కథకులుగా వర్ధిల్లారు. మరెందరో పేర్లు తెలియనంతగా కాలగర్భంలో కలిసిపోయారు.

## ఆధునిక బుర్ర కథకులు :

పద్మశ్రీ షేక్ నాజరు, సుంకర సత్యనారాయణ, కోగంటి కాకుమాను సుబ్బారావు, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు, శరివిశెట్టి సుబ్బారావు, డా॥ మిక్కిలి నేని, పెరుమాళ్ళు .... మాచినేని, వడ్లపూడి నాగేశ్వరరావు, ఉప్పుగుండూరు కృష్ణమూర్తి .... భీమవరం బాలికలు, చుండ్రు చిన్నబ్బాయి .... కడప హుసేన్ బాబా, గిద్దలూరు తుపాకుల బసవయ్య, నిట్టల బ్రదర్సు, సలాది భాస్కరరావు, జూనియర్ నాజర్ బెనర్జీ, ప్రసాద్ మోటూరి వుదయం, తుమ్మల కేశవరావు, గుడివాడ రాఘవులు. కాజబుర్ర కథ దళంనందిగం బ్రదర్సు సబ్బి కనకారావు, కొండేపూడి రాధ, రాఘవరెడ్డి దళం మొదలైనవారంతా ప్రజానాట్యమండలి కళల ద్వారా బుర్ర కథలను చెప్పారు.

## పైవారే కాక :

డా. కుమ్మరి మాష్టారు, భద్రకాళి - పున్నమరాజు, హనుమంతరాజు, వింజ మూరు రామారావు, గొత్తిల రామలింగం, సైదులు, నదీరా, జయంతి, త్యాగరాజు, బూర్గుల రామమూర్తి, వందన కోటేశ్వరరావు, శిష్టా సాంబశివరావు, రెడ్డి చిన వెంకటరెడ్డి, కృష్ణమోహన్, తాత నాగేశ్వరరావు, జిల్లెళ్ళమూడి ప్రసాద దళం,

పురుషోత్తం, కనకయ్య, చిట్టాల నారాయణరావు, నీలా జంగయ్య, రొంగ సత్యనారాయణ, రాజోలు లక్ష్మణరావు, భువనగిరి నారాయణ, కొమర శ్రీదళం,



బుర్ర కథకురాలు భద్రకాళి

బిళ్ళ గంగరాజు, బిళ్ళా ఈశ్వరుడు, శ్రీమతి శారద, కుమారి వాణి, గంగా పట్నం ఆదిశేషయ్య, తిరుపతమ్మ - తిరుపతి, మానాపురం నరసింగరావు, కవిశ్రీ ప్రకాశం, డి. ప్రసాదరావు, పైపూరి పాపారావు, దేవాదుల బ్రహ్మానందం, మహమ్మద్ బాజ్జీ దళం, పూసల రజనీ గంగాధర్, మరిపల్లి రాఘవకుమార్, నీలకంఠం, రామ సుబ్బరాయుడు, రామిశెట్టి వీరేశం, తిరుపతి వెంకటసుబ్బమ్మ, చేజర్ల శివరామయ్య, మంగం సత్యనారాయణ, కంభంపాటి హనుమంతరావు మొదలైన వారెందరో బుర్ర కథకులుగా వర్ధిల్లారు.

## కొందరు వంతలు:

కోగంటి రామకోటి, రాఘవాపురపు అప్పారావు, మాచినేని డా॥ మిక్కిలినేని, పురుషోత్తం, రాజబాబు, పండు, చక్కా సూర్యనారాయణ, నిట్టల శతృఘ్నరావు, నిట్టల హనుమంతరావు, చంద్రు సూర్యనారాయణ, చదలవాడ కుటుంబరావు, సూరపనేని లక్ష్మీపెరుమాళ్ళు, కోసూరు పున్నయ్య, పురుషోత్తం, లక్ష్మీనరసయ్య,

మండలీక కృష్ణ, అల్లాడ బాలశంకరరావు, డొక్కా అనంతరామమూర్తి, చిన్న బ్బాయి, కట్టా సీరయ్య, సుబ్బారెడ్డి, నూకల అప్పన్న శాస్త్రి, నలాది నాగరాజు, పిళ్ళా అప్పారావు, అడబాల కృష్ణమూర్తి, గంగాద్రి, వింజమూరి లక్ష్మణరావు, వద్దే రాజయ్య, లక్ష్మణ్, యాదగిరి, పి. ప్రభాకరరావు, ఎ. ఎ. శర్మ, జిన్నాభట్ల రామం, కుసుమంజ యూన్సీ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజిని, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి లక్ష్మితులసి, మండలీక రామం, బళ్ళ అబ్బిరాజు మొదలైన వారంతా బుర్ర కథల్లో వంతలుగా ప్రసిద్ధిచెందినట్లు నదీరాగారు ప్రపంచ తెలుగు మహాసభల్లో వెలువరించిన బుర్ర కథలు గ్రంథంలో ఉదహరించారు.

## ప్రత్యేక వంతలు:

సంప్రదాయమైన బుర్ర కథ వాయిద్యాలతో పాటు హార్మోనియం, తబలా మొదలైన వాయిద్యాలను ప్రవేశపెట్టి కథలు చెప్పిన వారిలో నిడదవోలు అచ్యుత రామయ్య, సుంకర కృష్ణ, మాధవరావు, కుమ్మరి మాష్టారు, డి. ఏ. నారాయణ, కప్పగంతుల రామం మొదలైనవారు కథలు చెప్పగా, మల్లిక్ కూచి వీరభద్రశర్మ, నలాది వెంకన్న, మండలీక కృష్ణ, భాస్కరం మొదలైన వారు వంతలుగా వ్యవహ రించారు.

## కొందరు బుర్రకథా రచయితలు:



ప్రజాకవి సుంకర సత్యనారాయణ, కాకుమాను సుబ్బారావు, షేక్ నాజర్, వాన మామలై వరదాచార్యులు, మాచిరాజు లక్ష్మీ పతి, కోగంటి గోపాలకృష్ణయ్య, కవి కుమార్, జంపన చంద్రశేఖరరావు, కొస రాజు రాఘవయ్య చౌదరి, లక్ష్మీకాంత మోహన్, తెల్లాకుల వెంకటేశ్వరగుప్త, రుక్కాభట్ల విధుమౌళి శర్మ, పేరి సుబ్బా రావు, తిరునగరి టి. రామాంజనేయులు, సీలా జంగయ్య, శ్రీపాద రామమూర్తి, వారణాసి వేంకట నారాయణ శాస్త్రి, రామ కవచం సత్యనారాయణ, పి. బాలకృష్ణ,

ప్రయాగ నరసింహశాస్త్రి, రెడ్డి, చిన వెంకటరెడ్డి, ఎనమంద్ర సుబ్బారావు, దంటు కృష్ణమూర్తి, నదీరా మొదలైన వారెందరో సాంఘిక రాజకీయాలకు సంబంధించిన బుర్రకథలను ఎన్నిటినో రచించారు.

## గుమ్మెట్ల వాయిద్యం :

ముఖ్యంగా జంగం కథలకుగానీ, బుర్రకథలకుగానీ జీవం పోసేది గుమ్మెట్లను ధరించిన వంతదారులే. బుర్రకథను దద్దోతిమి అనే మూడు దెబ్బలతో కూడా కథను చెప్పవచ్చు కాని ఈ గుమ్మెట వాయిద్యాన్ని శాస్త్రీయమైన వరుసలతో కను విందు చేస్తారు. ఈ వాయిద్యంలో ఖమ్మం వాస్తవ్యుడు బుర్రపంతులు గుమ్మెట మీద అన్ని ధ్వనులనూ శాస్త్రీయంగా పలికిస్తాడు. సన్నివేశానికి అనుగుణంగా ధ్వనులను పలికించగలరు. అలాగే దొడ్డారపు వెంకటస్వామి వంతదారు. తాడికొండ సుబ్బయ్య - యల్లమందగార్లు గుమ్మెట్ల వాయిద్యంలో సిద్ధహస్తులు. యల్లమంద వద్ద మిక్కిలినేని, మాచినేని అనేక వరుసల్ని నేర్చుకుని ప్రజానాట్య మండలి దళాలకు శిక్షణ ఇచ్చారు. ఎంతో సాధన చేస్తేగానీ, ఈ వరుసలు అంకెకు రావు. కథకు ఈ వరుసలే ప్రాణం. ఉదాహరణకు

దద్దో తిమి, దద్దో తిమి.
తక తక్క తక తక్క.
తక తక్క తత ధిమి.
తక తకిట్ట తక్కిట తక్కిట
తక తక్కిట్ట, దరికిట తక్కిట్ట,
త, ఝుణం తకత, ఝుణ తకత.
త, ఝుణం తక తకత ఝుణం తక్కిట త.
దరికిట తక్కిట్ట, ధిత్తరికిట తక్కిట్ట, తక దికిట
తక్కిట్ట.

ధిత్తరికిట తక తరికిట, ధిత్తరికిట తకదరికిట
తకిట తకిట తక - ఇదే - దిం తత ధిమి తక.
దరికిట దరికిట - ధోంకి తధోంకి.
తక ధింతక, దరికిట ధింతక.

ఈ విధంగా ఎన్నో వరుసలతో జోడు గుమ్మెటలు ముక్తాయింపులతో వాయిస్తూ వుండే కథ ఎంతో రసవత్తరంగా నడుస్తుంది. వరుసలకు తగినట్లుగా కథకుడు నృత్యం చేస్తూ వుంటే ప్రజలు వుత్తేజితులౌతారు. ముఖ్యంగా రౌద్ర ఘట్టాలతో గుమ్మెటల మ్రోతలు, పిడుగులు పడినట్లూ, ఉరుములు ఉరిమినట్లూ వుంటాయి. కథకీ, కథకునకు గుమ్మెట్లే ప్రాణం.

బుర్రకథలో వంతపాటలు :

బుర్రకథకు జీవం వంతలు. వంతల బలం లేకపోతే బుర్రకథకు అందం లేదు. కథకుడు చరణం పాడిన తరువాత ఆయా కథకులు వారికి తోచిన వంత పాటను కథకునకు అందగా ఈ విధంగా పాడతారు.

శ్రీ ధేనువు గిరిధామా యదుకుల క్షీరాంబుధి సోమా.

అనీ,

వినరా భారత వీరకుమారా, విజయము మనదేరా

అనీ,

కూడి చరించిన విజయము మనదే కూలిరైతులారా

అనీ,

జయము జయము మన మహిళలందరకు జయము కలుగుగాక

అనీ,

సంఘోద్ధరణ విచారాధీరా, సాహస గుణధామ.
పండిత వితండవాద ఖండనా, ప్రజాభాష పోష.
మహిళా వుద్యమ నిర్మాతా, ఓ మహిత గుణవిశాల.

అనీ,

వినరా నైజాం తెలుగు ప్రజల ఘన వీర సమర చరిత.

అనీ,

తంధానా, తానతందనానా,
భళానోయి భాయి తమ్ముడా భాయి భళానోయి తమ్ముడా,
భాయి భళానోయి దాదానా.
తందన భాయిదేవ నందనానా.

అంటూ వివిధ కథలలో వివిధ ఘట్టాల ననుసరించి భళి భళీ, అరెరే, అవీ హరి హరీ అనీ, అయ్యో అనీ. ఒరేయ్ అనీ, శహభాష్ అనీ, వహ్వా అంటూ కథకునికి ఊత యిచ్చి కథను రక్తికట్టిస్తారు.

బుర్రకథ రగడలు :

జంగం కథల్లో బుర్రకథల్లో ఆయా రచయితలు ఎవరికి వారు వారి ధోరణిలో ఎన్నో రగడలను కీర్తనలను బాణీలను వివరించారు. అలా సుంకర సత్యనారాయణ గారు వారి కథలకు ప్రార్థన ఈ విధంగా వివరించారు.

ప్రార్థన :

మాతృదేశము కొరకు మరణించు భక్తుల
పూలతో పూజింపరావ ॥మా॥

స్వాతంత్ర్య పోరాటములో
చావు బ్రతుకో తేల్చుకొనెడి
వీరదేశ సేవాకులకు
వేగరార పూజ సేయ ॥మా॥

ఇలా ప్రార్థన అయిన తరువాత పల్లవితో కథ ప్రారంభమౌతుంది. అలా నాజరు వ్రాసిన పల్నాటి వీరచరిత్రలో

వినరా భారత వీరకుమారా
విజయము మనదేర.
వినరా ఆంధ్రుడ పల్లనాటి
ఘన వీరచరిత నేడు.



అంటూ, నాగమ్మ నేర్చిన విద్యల్ని ఇలా వివరించారు:

శాస్త్రాలన్నీ చరచర నేర్చెను.
కొండల యుద్ధం మెండుగ నేర్చెను
నీటిలో చేపను ఇట్టే కొట్టెను.
వడిసెల యుద్ధం వడిగా నేర్చెను -

భిండివాలము లన్నిటీ
దండిగ పట్టుట నేర్చిందా?

భళా భళానోయి తమ్ముడా భాయి భళానోయి దాదానా?

అలాగే మరో రగడ

రహస్య తంత్రము లెన్నో నేర్చిందీ, ॥తంధానో॥
మల్లయుద్ధమున మగవారిని మించే ॥తం॥

అలాగే నాగమ్మ బ్రహ్మనాయుడు కోడిపందాల కోసం ఎలాంటి కోళ్ళను తెచ్చారు

డేగలు, నెమిళ్ళు, మైలా, కీతువ,
కాకి కథేలా కోడి డేగలు
జింకిణి ఆసిలి, బంకిణి పుంజుల.
తపినీపుంజుల గాజుల కెత్తిరి
కోడేరు గుట్టలకేగారా, కత్తుల దస్తా తీశారా.
భళా భళానోయి తమ్ముడా,
భాయి భళానోయి దాదానా.



ఇలా పలనాటి యుద్ధం బుర్రకథలో ఆయా ఘట్టాల ననుసరించి నవరసాలనూ ప్రతిబింబిస్తూ రసవత్తరంగా ప్రదర్శిస్తారు.



# బుడిగె వాయిద్యకారులే బుడిగె జంగాలు



వీరినే బేడ, బుడ్గ జంగంవారు అని కూడా అంటారు. దాసరులందరూ, వైష్ణవ భక్తులైనట్లే జంగాలందరూ శైవభక్తులు, వీరు చెప్పే కథలకు, జంగం కథలని పేరు. జంగాలే ఈ కథలను ప్రారంభించడంవల్ల వీరికి ఆ పేరు వచ్చి వుండవచ్చు. వీరికే బుడిగె జంగాలనే పేరు కూడా వాడుకలో వుంది. అందుకు కారణం వారు కథలో వుపయోగించే వాయిద్యానికి .... బుడిగె .... అనే పేరు కావటమే. ఈ బుడిగెనే....డక్కి అనీ, డిక్కి అనీ, గుమ్మెట అనీ, అనేక రీతులలో, ఆయా ప్రాంతాలలో ఉదాహరిస్తున్నారు. బుడిగెలు మామూలుకంటే చిన్నవి.

## శైవ కథలనే ప్రచారం చేశారు:

జంగాలు ప్రారంభంలో శైవ కథలనే ప్రచారం చేశాదు. తరువాత శైవ కథలనూ, ఇతర కథలనూ కూడా ప్రచారం చేశారు. వారు ప్రచారం చేసిన కథలు - దేశింగురాజు కథ - పలనాటి బాలచంద్రుడు కథ - మైరావణ - విరాటపర్వం భిల్లాణ చరిత్ర - సిరియాళ - దేవయాని - వామన విజయం - అంబరీషోపాఖ్యానం - బసవ పురాణం - నిజలింగ చిక్కయ్య - దక్షయజ్ఞం - సుందరాకాండ - గయోపాఖ్యానం - నీలకుంతినీ విలాసం - ఉషా పరిణయం - ఉత్తరగోగ్రహణం మొదలైన అనేక కథలను ప్రచారంలోకి తీసుకువచ్చారు. ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వంలో జంగం కథలో జంగాలు యొక్క వేషధారణ, వాయిద్యాల వర్ణన వుంది. 'అడిదం సూరకవి' జంగాల పాలు దేవాంగుల విత్తంబు అని వర్ణించడం వల్ల దేవాంగులైన సాలెవారిని యాచిస్తారని తెలుస్తూంది.

## బేడ (బుడ్గ) జంగాలు:

బేడ - బుడ్గ - జంగం కులస్తులు, జన్మతోనే కళాకారులని చెప్పవచ్చును. వీరికి చదువు సంధ్యలు లేకపోయినా, బ్రతుకు తెరువుకోసం ఈశ్వరుడు ప్రసా

దించిన....జంగం కథలను చెపుతూ. శవ సంస్కార సందర్భంలో శంఖాన్ని ఊదుతూ. గంట వాయిస్తూ తమ జీవిత విధానాన్ని కొనసాగిస్తూ వస్తున్నారు.

## బుడిగె స్వరూపం :

జంగం కథలు చెప్పేవారిని బుడిగె జంగాలని పిలుస్తారు. బుడిగెను కంచుతో గానీ, ఇత్తడితోగానీ, మట్టితోగానీ తయారుచేస్తారు.

గుమ్మెటకు ఒకవైపున బెత్తపు చట్రాన్ని బిగించి, తోలుతో మూస్తారు. రెండవ ప్రక్కన రాజా మూతిలాగా, అనాచ్ఛాతీతంగా వుంటుంది. కథకునికి ఇరుప్రక్కలా వున్న వంతగాళ్ళు ఒక్కొక్కరూ, తమ గుమ్మెటను చంకకు తగిలించుకుంటారు. కుడిచేతి వ్రేళ్ళతో, చర్మముపైన వాయిస్తూ రెండవ ప్రక్క మూస్తూ - గుంభనగా శబ్దాన్ని తెప్పిస్తారు.

## బుడిగె జంగాల వేషధారణ :

కథ చెప్పే బుడిగె జంగం నిలువుటంగీ తొడిగి, తలపాగా చుట్టి, కాళ్ళకు గజ్జెలు, మువ్వలు కట్టుకుని, భుజంమీద తంబురాను ధరించి, చేతి వ్రేలికి అందెలు తొడిగి, వాటిని తంబురాకు తట్టుతూ, రెండవ చేతితో తంబురా తీగను మీటుతూ కథను ప్రారంభిస్తాడు.

కథకునికి వంతలుగా వున్నవారు గుమ్మెటలు ధరించి కథకునికి వంత పాడుతూ, పాట వరుస ననుసరించి గుమ్మెటలను వాయిస్తూ మధ్య మధ్య హాస్యగాడు ఛలోక్తులతో హాస్యాన్ని క్రుమ్మరిస్తూ, ప్రేక్షకుల్ని నవ్విస్తూ వారి మెప్పు పొందుతాడు.

జంగం కథ చెప్పదలచుకున్న గ్రామంలో ముఖ్యమైనచోట్ల గుమ్మెటలను ఉధృతంగా వాయిస్తూ ఫలానా చోట జంగం కథ చెప్పబడుతుందనీ. అందరూ రావాలని చెపుతూ, పాడుతూ వూరంతా తిరుగుతారు.

## పగటిపూట ఇంటింటా కథ :

రాత్రిపూట కథలు చెప్పటమే కాక, వీరు పగటిపూట కూడ ఇంటింటికీ తిరిగి కథలు చెపుతారు. ఏవిధమైన వర్ణభేదాన్నీ పాటించక, హరిజన, గిరిజన, తదితర శూద్ర గృహాల ముందు కూడ నిలబడి, జంగం కథలు చెప్పి వారి వద్ద డబ్బుల్ని,

ధాన్యాన్ని సేకరిస్తారు. ఒకవేళ అది భోజన సమయమైతే ఎవరు అన్నం పెట్టినా తింటారు. ఇటువంటివారిని బుడిగె జంగంవారని పిలవటం కద్దు.

బుడిగెజంగాలు హరిజన, గిరిజన, మాల మాదిగల ఇండ్లలోనూ, ఇంకా వెనుకబడినవారి ఇళ్ళల్లోనూ ఎవరైనా చనిపోతే శవ సంస్కార కార్యాన్ని శాస్త్ర యుక్తంగా జరిపిస్తారు. శంఖాన్ని వూదుతూ, గంట వాయిస్తూ, శవం ముందుండి శ్మశానవాటిక వరకూ వెళ్ళి ఆ కార్యక్రమాన్ని పూర్తి చేస్తారు. అందుకు వారు బేడ డబ్బులు మాత్రం ఇస్తే వారిని పొగడుతారు. బేడ డబ్బులతో తృప్తిపడతారు కనుక బేడజంగాలనే పేరు సార్థకమైంది.



బుడిగెజంగం వీరశైవం

## సంస్కారులు :

జంగమయ్యలు, జంగమ దేవరలు, వీర మహేశ్వరులు - వీరశైవ జంగాలనబడే వీరు, మాల మాదిగ గృహాలలో శవ సంస్కారం చేస్తూ శైవులైన మాలలకు బుడిగె జంగాలు గురువులుగా వున్నారు. వీరు మాంసాహారులు, తక్కువమంది మాత్రమే శాఖాహారులు. వీరిలో వివాహాలకు ఓలి, అంటే కన్యాశుల్కం. 9 రూపాయల నుంచి 25 రూపాయల వరకూ తీసుకునే పద్ధతి ఈ నాటికీ వుంది. అంటరానితనాన్ని రూపు మాపటానికే బసవేశ్వరుడు చెప్పిన విధంగా వీరు అందరితో కలసి

మెలసి జీవిస్తూ, జానపద కళారూపమైన జంగం కథాప్రదర్శనాల నిస్తూ, ఈ నాటికీ తెలుగుదేశంలో ఆ యా జిల్లాల్లో వున్నారు.

శరభ, శరభ :

వీరు శివరాత్రి పర్వదినాలలో వారున్న గ్రామంలో బండ్ల మీద ప్రభలు కడతారు. వీటిని వీధి వీధికీ ఊరేగిస్తారు. శివాలయం వద్దకు చేర్చుతారు.

శరభ, శరభా, దశ్శరభ శరభా



దేవర వేషం

అని ప్రభముందు, సన్నాయి వీరంగానికి అనుగుణంగా నృత్యం చేస్తారు. ఇది ఎంతో ఆవేశంతో కూడుకుని వుంటుంది.

కొంతమంది పులితోలు కట్టుకుని పెద్ద పులి నృత్యం చేస్తారు. మరి కొంత మంది రంగు రంగుల గుడ్డముక్కలతో నిలువుటంగి తొడిగి విభూది రేఖలను తీర్చి దిద్దుకుని, లింగ కాయను అందరికీ కనిపించేలాగా మెడలో ధరించి శివరాత్రి పర్వ దినాన నృత్యం చేస్తారు.

## పగటి వేషాలు :

వీరు పగటి వేషాలను కూడా అద్భుతంగా ప్రదర్శిస్తారు. ఏకపాత్రాభినయాలు చేస్తారు. అర్ధనారీశ్వర వేషం, అల్లూరి సీతారామరాజు, రామాయణ భారత కథలకు సంబంధించిన వేషాలు నాటకరూపంలో, పద్యాలు, పాటలు పాడుతూ - హార్మో నియం, తబలా, తాళాలతో ఇంటింటి ముందూ, ప్రతిరోజూ తిరుగుతూ, పదిహేను రోజుల్లో వేషాలను పూర్తి చేసుకుని ఇంటింటికీ తిరిగి, డబ్బునూ, ధాన్యాన్నీ సంపా దిస్తారు.

## కొమ్ము బాకాలు :

బుడిగె జంగాలలో కొంతమంది కవిత్వాన్ని చెపుతారు. కొంతమంది కథలు చెపుతారు. మరి కొంతమంది వైద్యం చేస్తారు. సాముద్రికాన్ని చెపుతారు. ఇలా ఎన్నో ఉపవృత్తుల్లో వారు జీవిస్తున్నారు.

ముఖ్యంగా భాగ్యవంతుల ఇళ్ళలో వివాహ సమయాల్లో ఇద్దరు ముగ్గురు కలిపి ఊరేగింపులో అప్పుడప్పుడు ఈ బాకాలను ఊదుతారు. బాకాల ధ్వని గంభీరంగా వుండి విజయ చిహ్నంగా ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ కలిగిస్తుంది ఈ బాకాలు. ఇత్తడి తోనూ, రాగితోనూ తయారుచేస్తారు. కొమ్ములాగా వంకర తిరిగి వుంటుంది.

అలాగే దేవాలయ ఉత్సవాలలో కూడా ఊదుతారు. ఇది ఎంతో విన సొంపుగా వుంటుంది.

## నిప్పుల గుండం, వీరభద్రుని పళ్ళెం :

వీర శైవ జంగంవారు కొన్ని గ్రామాలలో వీరభద్రుని పళ్ళెం పట్టి, నిప్పుల గుండాలను ఏర్పాటు చేస్తారు. దక్షయజ్ఞం చేస్తారు. ఆ ఉత్సవానికి బుడిగె జంగా లనూ, వీరముష్టివారినీ ఆహ్వానిస్తారు.

పది అడుగుల వెడల్పు, 25 అడుగుల పొడుగూ మూడు అడుగుల లోతు గుండాన్ని ఏర్పాటుచేస్తారు. ఆ గుండంలో కణకణమండే నిప్పు లుంటాయి.

బుడిగె జంగంవారు వీరావేశంతో దక్షయజ్ఞ దండకం చదువుతూ, నారసాలను నాలుకలో గ్రుచ్చుకుని ఆవేశంతో నిప్పుల్లో నడిచిపోతారు.

దండకం :

భజే భద్ర! భద్రాంబికా ప్రాణనాథా! సురరాతిభంగా! ప్రభో! రుద్ర! రౌద్రావతారా! సునాశీరముఖ్యామకానేక సంభావితా సల్ప సుశ్లోక॥ చారిత్ర! కోట్యర్క సంకాశ! దేదీప్యమాన! ప్రభా దివ్యగాత్రా! శివా! పాలితా! శేషబ్రహ్మాండ భాండోదరా! మేరుధీరా! విరాడ్రూపా! వారాశి గంభీర! సౌజన్య రత్నాకరా! వారిదశ్యామ—

మహాదివ్యవేషా! హరా! భక్తపోషా! దయావార్ధి! వీరేశ్వరా! నిత్యకళ్యాణ సంధానధౌశీయ! పాపాలు నీ కేల! దావానలా! పుణ్యమూర్తీ! నమస్తే! నమస్తే- నమః.

అంటూ ముగిస్తారు.

ఖడ్గం :

మూడడుగుల వంకర ఖడ్గాన్ని చేతిలో ధరించి, పై దండకాన్ని చదువుతూ, ఖడ్గాన్ని ఊపుతూ, కనుగ్రుడ్లు పెద్దవిచేసి నారసాలను శరీరంలో పొడుచుకుని, వీరావేశంతో వళ్ళు మరిచి నృత్యంచేస్తూ, దక్షయజ్ఞగుండంలో నడుస్తూ అవతల ప్రక్కనున్న దక్షుణ్ణి నరుకుతారు. ఈ ప్రదర్శనాన్ని చూడవలసిందే గాని వ్రాయలేము. జంగాల్లో అనేక తెగలున్నా, అందర్నీ జంగాలనే పిలుస్తున్నారు.

ఆంధ్రదేశంలో ఈ బుడిగె జంగంవారు అన్ని జిల్లాల్లో కలిపి పదివేలమంది వున్నారు. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక విద్యావిషయాలలో షెడ్యూల్డ్ కులాల జాబితాలో నున్న 58 కులాల కన్నా తక్కువగా జీవిస్తున్నారు.

బుడిగె జంగాలు ఎక్కువగా, శ్రీకాకుళం జిల్లా, విజయనగరం జిల్లా, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, చిత్తూరు, నెల్లూరు, నిజామాబాద్, మెదక్ జిల్లాలలో ఆయా వృత్తులలో ఈ నాటికీ జీవిస్తున్నారు. ఈ బుడిగె జంగాలను ప్రభుత్వం ఆదరించి వారిని పరిగణనలోకి తీసుకుని, ఇతర షెడ్యూల్డు జాతుల కిచ్చే సౌకర్యాలన్నీ కలిగించే ఏర్పాట్లు చేయాలి.



# గమ్మత్తుల గారడీ విద్యలు



ఈనాటికీ ఆంధ్రదేశంలో గారడీ వేషాలనూ, కత్తులగారడీలనూ చూస్తూనే వున్నాం.

గారడీ విద్యను సంస్కృతంలో ఇంద్రజాలమనీ. గారడీ వాళ్ళను ఐంద్రజాలికు లనీ వ్యవహరిస్తారు. ఈ గారడీ విద్య పూర్వకాలం నుండీ నేటివరకూ ప్రచారంలో వుంది. పూర్వం రాజాస్థానాలలో విరివిగా ఈ విద్యను ప్రదర్శించి అఖండమైన సన్మానాలను, లాంఛనాలను పొందేవారు. ఈనాటికీ గ్రామాలలో ఈ విద్యను ప్రదర్శిస్తున్నారు.

## మాయదారి విద్యలు :

వేపాకులు దూసి తేళ్ళను తెప్పించటం, అరచేతిలో రూపాయలు సృష్టించటం, అప్పటి కప్పుడు మామిడి టెంకను పాతి మొక్కను మొలిపించటం, మనిషిని బుట్టలో పెట్టి మాయం చేయటం....గొంతును కోసి రక్తం చూపించటం, మనవద్ద నున్న వస్తువును మాయం చేసి మరొకరి జేబులో నుండి తెప్పించటం మొదలైన అనేక విచిత్రాలను చూస్తూనే వున్నాం. ఈ గారడీ విద్య పూర్వం నుంచీ ప్రచారంలో వుందనటానికి మన ప్రాచీన గ్రంథాల నుండి అనేక ఉదాహరణలు కనిపిస్తున్నాయి. గారడీ విద్యల్ని గూర్చి పండితారాధ్య చరిత్రలో—

నావి యద్గతి బఖులాడెడు నట్టి
భావన మ్రోకులపై నాడెడువారు.

అని వుంది. దొమ్మరసానులు గడలపై ఆడినట్లే గారడీవారు మ్రోకులపై ఆడినట్లు పై రెండు పదాలనుబట్టి అర్థం చేసుకోవచ్చు.

## అంతరిక్షంలో వింత విద్యలు :

పొడవైన మ్రోకును ఆకాశంలోకి విసరగానే అది వెదురుగడలా నిలుస్తుందట. తరువాత గారడీవాడు త్రాడుమీద నిచ్చెన ఎక్కినట్లు జర జరా ఆకాశంలోకి

పోయినట్లు పోయి మాయమై తిరిగి కనిపించి అక్కడ చిత్ర విచిత్రమైన విద్యల్ని ప్రదర్శించేవాడట.

ఈ విద్యను ఇంగ్లీషువారు రోప్‌ట్రిక్ అనేవారట. ఈ విద్యను గురించి నూటయాభై సంవత్సరాల క్రితం ఒక ఆంగ్లేయుడు భారతదేశంతో ఒక ఇంద్రజాల ప్రదర్శనం చూచి మెచ్చుకుని ఆనాడే పత్రికలలో వ్రాశాడట. ఆ ఇంద్రజాలంలో ఒకడు త్రాడు నొకదానిని పైకి నిలువుగా విసిరి గాలిలో నిలబెట్టి దానిపైకి ఎగబ్రాకి మాయమైనాడట. తరువాత అతని అంగాలన్నీ ఖండాలుగా క్రిందపడిపోయాయనీ మరికొంతసేపటికి యథాప్రకారంగా వాడు త్రాటిమీద నుండి గబగబా దిగి వచ్చాడనీ వ్రాశాడు. ఇలాంటి కథనే "కొరవి గోపరాజు" సింహాసనద్వాత్రింశికలో వివరించాడు.

## కొరవి గోపరాజు :

ఒక ఇంద్రజాలికుడు తన భార్యను వెంటబెట్టుకుని రాజసన్నిధిలో ఆమెను రక్షణార్థం విడిచి తాను దేవసహాయార్థమై యుద్ధం చేయడానికి వెళుతున్నానని చెప్పి ఒక త్రాటిని పైకి నిలువుగా విసిరి దానిని నిలబెట్టి, దానిపైకి ఎగబ్రాకి మాయమయ్యాడట. తరువాత కొంతసేపటికి వాని కాళ్ళూ, చేతులూ, తల, మొండెం తుంపులై క్రిందబడ్డాయట. రాజువద్ద రక్షణగా వుంచిన అతని భార్య రాజును వేడుకుని సెలవు పొంది, భర్తతో సహగమనం చేసిందట. వెంటనే త్రాడు పైకిపోయిన ఇంద్రజాలికుడు పైనుండి దిగివచ్చి తన భార్యను పంపమన్నాడట. అంతట రాజు విచారగ్రస్తుడై ఆమె సహగమనం చేసిందని చెప్పాడట. అంతట అతను—

## ఇంద్రజాల విద్యలు :

ఆ వీరుం డప్పుడె నిజ
భావము ప్రకటముగ
నాత్మభామిని తోడన్
దావైతాళికు డగుచున్
గైవారము చేసె జనులు కడువెరగందన్
నరనాథ, నిన్ను నపుడవ
వరమడిగినాట నైంద్రజాలికు రీతిన్

నరుల వణకించి నీచే
సిరి వొందం జోద్యమిట్లు చేసితివనియెన్.

ఇది ఆనాటి ఇంద్రజాల విద్య అని, అదే సందర్భంలో చతుష్షష్టి కళలైన ఈ క్రిందివాటిని కూడా వివరించాడు. అవే వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, వాస్తు ఆయుర్వేదం, ధనుర్వేదం, మాంత్రికత్వం, సంగీతం, జల స్తంభన, మహేంద్ర జాలం, జూదం, అష్టావధానం, వాద్య నృత్యకౌశలం, బహురూప పటుత్వం అనగా పగటి వేషాలు, పరిహాసం మొదలైనవి. ''సింహాసన ద్వాత్రింశిక'' 111-112 పేజీ లలో ఉదహరింపబడిందని సురవరంవారు సాంఘిక చరిత్ర 185 వ పుటలో ఉదాహ రించారు.

ఈ ఇంద్రజాల విద్యల్లో జైనులు ప్రసిద్ధులని పైన ఉదాహరించిన ఇంద్ర జాలికుని కథ జైనుల త్రిషష్టికా పురుష చరిత్రలో వుదహరింపబడింది.

ఈ క్రింది జాలవిద్యను గురించి యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం 12 వ పద్యంలో వివరించాడు.

ఇదే ఇంద్రజాలానికి సంబంధించిన మరియొక కళారూపం కూడా ప్రాచీన కాలం నుంచీ ప్రచారంలో వుంది. అదే విప్రవినోదం.

## గారడీవాళ్లు

### రత్నావళి నాటకంలో గారడీవాడు :

శ్రీహర్షుని రత్నావళి నాటకం నాలుగవ అంశంలో ఇంద్రజాలికుని ప్రస్తావన వుంది. సాగరికమీద విరహంతో వున్న .... ఉదయనవత్సరాజుకు ప్రథ మంలో వినోదం కల్పించటానికి, తరు వాత సాగరికతో సంబంధాన్ని చేకూర్చి పెట్టటానికి .... యౌగంధరాయణుడు వేసిన ఎత్తు సాగరికయే రత్నావళి. అదే ఈ ఇంద్రజాలికుడైన గారడీవాని ప్రవేశం.



ఈతని పేరు సంవరణసిద్ధి. ఉజ్జయినీవాడు. వాసవదత్తది కూడా ఉజ్జయినే, తన వూరివాడు కావటంవల్ల వీడి గారడీ చూడటానికి ఆమెకు ఆసక్తి ఆ పేరుమీద రాజుగారి దర్శనం వీడికి తేలికగా దొరుకుతుంది. కుతూహలంతో వున్న రాజుగారు గారడీవాణ్ణి వెంటనే ప్రవేశపెట్టమంటాడు.

ఇంద్రజాలికుడు ప్రవేశించి నా పేరులో ఏ ఇంద్రుని పేరు ఇమిడి వుందో ఆ యింద్రునికి నమస్కరించమంటాడు. తరువాత మహారాజా భూమి పైన చంద్రుడు, ఆకాశంలో పర్వతం, మధ్యాహ్నంలో సాయంత్రం వీటిలో ఏది కావాలి!

అడగండి అంటాడు. అలా వాడి కోతలను విన్న, విదూషకుడు మిత్రమా శ్రద్ధగా విను. వీడు అలా చేసేటట్లే వున్నాడు....అని తాను ఉబలాట పడతాడు.

ఈ వుబలాటాన్ని చూసిన గారడీవాడు అంటాడు. వూరికే నేను మీకు మాటలు చెప్పటం దేనికి, మీరు ఏది చూపించమంటే అదే చూపిస్తానంటాడు.

వాడి మాటలు విన్న రాజు వాసవదత్తను కూడా రమ్మంటాడు. చూడటానికి సరే అందరూ గారడీ చూడటానికి ఆసక్తితో వుంటారు. ఇంద్రజాలాన్ని చూపించమంటారు.

మళ్ళీ వాడు పింఛికను అటూ ఇటు త్రిప్పి ఇదుగో చూడండి నృత్యంతో కూడిన దేవేంద్రుని దర్బారును చూడండి అంటూ చుట్టూ మూగిన జనాన్ని చూపిస్తాడు. రాజు ఆశ్చర్యపోతాడు.



ఒరే సన్యాసీ, వీళ్ళందరు ఎందుకోయ్. సాగరికను జూడమంటాడు. అప్పుడు గానీ రాజుగారు తృప్తిపడరని విదూషకుడు చెపుతాడు.

ఇంతలో యౌగంధరాయణుడు పంపిన ఒక వార్త కారణంగా గారడీకి ఆటంకం వస్తుంది. రాజు గారడీ వానిని ఇక ఆపు అంటాడు. సరే వాడు ఆపేసి, మీరు నాది మరో ఆట చూడాలంటాడు. సరే నంటాడు రాజు. తరువాత వెంటనే అంతః

పురంలో మంటలు లేస్తాయి. అందులో చిక్కిందనుకున్న సాగరికను రాజు మంటల్లో దూకి వెలికి తెస్తాడు. రాజుకూ సాగరికకూ సమాగమం జరుగుతుంది.

చివరికి రాజు విదూషకునితో అంటాడు ఇది స్వప్నమా? ఇంద్రజాలమా అవి, అప్పుడు విదూషకుడు ఇలా అంటాడు. గారడీవాడు పోతూ పోతూ అన్న మాటను జ్ఞాపకంచేసి ఇది వాడి పనే అంటాడు.

ఇలా గారడీ వాళ్ళు వీథుల్లో ఏవేవో చెప్పి, వివిధ ప్రక్రియల్ని చూపించటం మనం చూస్తూనే వున్నాం. వినోదిస్తున్నాం, అయితే కొన్ని శతాబ్దాల క్రిందే, శ్రీహర్షుడు ఇంద్రజాలాన్ని తన నాటకంలో ప్రవేశపెట్టాడు.



దీనినిబట్టి నేటి మన జానపద కళారూపాలకు ఎంతటి ప్రాచీన చరిత్ర వుందో, ఆనాటి ప్రజలు వాటిని ఎలా ఆదరించారో పై వుదాహరణలే తార్కాణం.



# పల్లె ప్రజల నలరించిన
# దేవదాసీ నృత్యాలు



ఆంధ్ర దేశంలో దేవదాసీలూ, భాగవతులూ నృత్యకళను పోషించి అభివృద్ధిలోకి తీసుకువచ్చారు. దేవదాసీల నృత్యకళ, భాగవతుల నృత్యకళ అని అది వేరు వేరుగా అభివృద్ధిపొందింది.

భాగవతులు యక్షగానాలూ, వీధి భాగవతాలూ, భామాకలాపాల ద్వారా నృత్య కళను ప్రచారం చేశారు.

దేవదాసీలు దేవాలయాల నృత్యమండపాలలో, దేవుని సన్నిధానంలో శైవ, వైష్ణవ సాంప్రదాయాల ననుసరించి ఆరాధన నృత్యాలూ, అష్టదిక్పాలక నృత్యాలూ, కేళికా ప్రదర్శనాలూ, కలాపాలూ మొదలైన నృత్యాలను ప్రదర్శించేవారు.

## రెండు పోకడలు :

పై వివరాల్నిబట్టి ఆంధ్రదేశంలో శాస్త్రీయమైన కళ రెండు విధాలుగా అభివృద్ధి జెందింది. ఒకటి నట్టువ మేళ సాంప్రదాయం; రెండవది నాట్యమేళ, భాగవత మేళ సంప్రదాయం. ఈ రెండూ శాస్త్రీయమైన పద్ధతికి సంబంధించినవై ప్పటికీ ప్రయోగ ప్రదర్శన విధానాలలో భేదం వుంది.

ఆలయాల్లో దేవతా సన్నిధిని దేవదాసీలు చేసే నృత్యం, ఆలయ ఆవరణలో ్యాణ మండపం వద్దనూ, స్వామి కొలువులోనూ వినోద ప్రదర్శనంగా ప్రద ్శింపబడే కేళికా, రాజదర్బారుల్లోనూ, ఇతర సభల్లోనూ కళావంతులు ప్రదర్శించే

కలాపాలు మొదలైనవీ నట్టువమేళానికి సంబంధించినవి. ఈ నట్టువ మేళాల్లో పురుషుల హంగుతో స్త్రీలు మాత్రమే నాట్యం చేస్తారు.

పురాణాలకు సంబంధించిన ఇతివృత్తాలను నృత్య నాటకాలుగా ప్రదర్శించే సంప్రదాయం నాట్యమేళ, లేక భాగవతమేళ సంప్రదాయంగా వర్ధిల్లింది. ఈ సంప్రదాయంలో స్త్రీలు పాల్గొనరు: స్త్రీ పాత్రల్ని కూడా పురుషులే ధరిస్తారు.

## ఎందుకు వచ్చినట్లు ఈ పేరు?

భగవంతునికి సంబంధించిన గాథలను ప్రచారం చేయడం వలన వీరిని భాగవతు లన్నారు. ఆలయాలలో దీపారాధన తరువాతనూ, ప్రత్యేక వుత్సవ సమయాల్లోనూ నృత్యాలు జరుగుతూ వుంటాయి. ఆలయాల్లో ప్రదర్శించే ఆరాధన నృత్యాలు దాదాపు 40 వరకూ వున్నవట.

స్వామి సన్నిధిలో బలిపీఠంపైన నృత్యం చేయడానికి అధికారముద్రల్ని పొందినవారే ఈ అర్హతను కలిగి వున్నారు. అటువంటివారే నిజమైన దేవదాసీలు. తమ జీవిత సర్వస్వాన్నీ దేవుని సేవకే అంకితంచేసి ఆ ఐక్యమునకై తహతహలాడేవారే దేవదాసీలు.

## పెంచి పోషించిన పెద్దలు :

ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ భాగవత మేళాలద్వారా నృత్య కళను పోషించినవారు పోతకమూరి భాగవతులూ, కూచిపూడి, కోటకొండ, మేలటూరు భాగవతులూ.

పూర్వం దేవాలయ నర్తకీమణుల్లో ఒకరిని మించినవారు మరొక రుండేవారు. వారు నృత్యకళను పట్టుదలగా ఆరాధించేవారు. పోటీపడి ఆ విద్య నభ్యసించేవారు.

రాజాస్థానాల్లో మాత్రం అనేకమంది బృందనాట్యాల్లో పాల్గొనే నాట్యకర్తెలు ఉన్నప్పటికీ, రాజనర్తకిగా మాత్రం ఒక్కతే నిర్వహించేది. ఆ విధంగా రాయల ఆస్థానంలో రంజకం కుప్పాయి, రఘునాథ రాయల ఆస్థానంలో ముద్దు చంద్రరేఖ — రూపవతి — శశిరేఖ — లోకనాయిక. ప్రతాపరుద్రుని ఆస్థానంలో

మాచల్దేవి. కుమారగిరిరెడ్డి ఆస్థానంలో లకుమాదేవి మొదలైనవారు రాజనర్తకి సంప్రదాయానికి చెందినవారు.

## నట్టువ మేళాలు

కచ్చేరీ నృత్యకళనుంచి వుద్భవించినవే నట్టువమేళాలు. కచ్చేరీ నృత్యకళ కేవలం రాజ్యాశ్రయమైనది. ఈ నట్టువ మేళాలు అఖిలాంధ్ర ప్రజానీకానికీ పరిచయమైనవి. ఇది వీధి కళారూపమని చెప్పవచ్చు. వివాహాది వూరేగింపుల్లోనూ, మేజువాణీలలోనూ, గొప్ప గొప్ప తిరునాళ్ళలోనూ, దేవుని కళ్యాణ వుత్సవాలలోనూ ఇవి ప్రదర్శింపబడేవి. పండితులనేకాక పామరుల్ని కూడా రంజింపజేయగల కళారూప మిది. మొరటు హాస్యపు పాటలతో కూడ ప్రేక్షకుల్ని రంజింపజేయడం కద్దు. కచ్చేరీ నృత్యకళకూ, నట్టువ మేళాలకూ అవినాభావ సంబంధముంది. ఈ రెండు కళలనూ ఆరాధించినవారు ఎక్కువమంది దేవదాసీలే.

కచ్చేరీ ఆట దేవాలయాల్లో జరిగేటప్పుడు వీరు మేళప్రాప్తితో ప్రారంభించి. పుష్పాంజలి, పేరణి, గీతం, శబ్దం. సలాం, జతి, వర్ణం, పదం, జావళి, తిల్లాన లేక దరువుతో ముగిస్తారు శబ్దం, సలాం, జతుల్లో ఆంగిక ప్రధానమైన ముద్రలు విశేషంగా ప్రదర్శించే నృత్యాన్ని ప్రదర్శిస్తారు. ఆ తరువాత వర్ణంలో నృత్త నృత్యాలు సమంగా పోషించి సాత్వికాభినయ ప్రాముఖ్యంతో, జావళీలలో ప్రదర్శించి తిల్లాన నృత్యంతో ప్రదర్శనం ముగిస్తారని నటరాజ రామకృష్ణగారు వివరించారు.

కళాకారులకు శిక్షణ :

నట్టువమేళాలతో నాట్యశాస్త్ర ప్రావీణ్యం తగ్గిపోతూం దనుకున్న కళాకారు లందరూ కట్టుదిట్టమైన శిక్షణ పొందాల్సి వచ్చింది. భాగవత మేళాల్లో వుండే కళాకారు లందరికీ సంస్కృతం, తెలుగు వచ్చివుండాలి. నాట్యశాస్త్రం, నందికేశ్వరుని అభినయ దర్పణం. భరతరసప్రకరణం, అలంకార శాస్త్రం క్షుణ్ణంగా అభ్యసించి, నృత్త, నాట్య, అభినయాలలో పూర్తి కళావికాసాన్ని పొందేవారు. ఇలాంటి శిక్షణతో నటులందరూ తయారయ్యేవారు. ఎవరిని కదిలించినా, అందరూ పండితుల హదిరే వల్లించేవారు. అందువల్లనే ఆనాటి వారి ప్రదర్శనాలు అంత కట్టుదిట్టంగానూ, కళా ప్రాశస్త్యంతోనూ ప్రదర్శించబడ్డాయి.

# కచ్చేరీ నృత్యకళ

ఒకే నర్తకి ఏకధాటిగా నృత్యం చేయడం కచ్చేరీ నృతకళయొక్క ప్రత్యేకత, రాజాస్థానాలలో అభివృద్ధిచెందిన ఈ కళ దేవదాసీలచే ఆరాధింపబడి ఆంధ్రదేశంలో కచ్చేరీ కళగా రూపొందింది. ఆంధ్రదేశంలో అభివృద్ధి పొందిన కూచిపూడి నాట్యానికీ, దీనికి ఏ విధమైన సంబంధమూ లేదు. ఈ కళను బొబ్బిలి, విజయనగరం, కార్వేటి నగరం, వెంకటగిరి, కాళహస్తి మొదలైన సంస్థానాధిపతులు పోషించారు.

ఆనాటి నాట్యశాస్త్రకారులు నృత్యాన్ని, నృత్తాన్ని, అభినయాలనూ మేళవించి ఒక నృత్యక్రమాన్ని ఏర్పాటుచేసి ఒక నృత్యకళగా కచ్చేరీ నృత్యకళను ప్రచారంలోకి తీసుకు వచ్చారు. దేవదాసీలు క్షేత్రయ్య పదసాహిత్యానికి నృత్యాభినయాలను రూపకల్పన చేసి ఈ కచ్చేరీ నృత్యకళను ప్రదర్శించేవారు. ఆస్థానాల పోషణ తగ్గిన అనంతరం, దేవదాసీలు కేవలం వుదరపోషణార్థం దీనిని ఉపయోగించారు. సాత్విక ప్రధానమైన ఈ నృత్యకళ ఈనాడు ఆంధ్రదేశంలో అక్కడక్కడ వృద్ధ దేవదాసీల సొత్తుగా వుందని నటరాజ రామకృష్ణగారు తెలియజేస్తున్నారు.

# మారంపల్లి గొల్లకలాపం

గొల్లకలాప ప్రదర్శనం ఆంధ్రదేశంలో నూరు సంవత్సరాల క్రితమే ప్రదర్శింపబడింది. ప్రథమంలో కూచిపూడి భాగవతులు గొల్లకలాపాన్నే ప్రదర్శించారు. వీరు ప్రదర్శించిన తరువాతే మారంపల్లి చిత్తజల్లువారు కాని, ఆంధ్రదేశంలోని ఇతర కళాకారులుగాని ప్రదర్శించారు. గొల్లకలాపం తరువాత భామాకలాపం ప్రచారంలోకి వచ్చింది. భామాకలాపాన్ని కూచిపూడి వారు ఆనాటి నుంచీ ఈనాటివరకూ ప్రదర్శిస్తూనే వున్నారు.



గొల్లకలాపం మాత్రం పశ్చిమ గోదావరి జిల్లాలో మూడు తరాలుగా సజీవంగా నిలిచి వుంది. గొల్లకలాపాన్ని పెంచి పెద్దచేసి పోషించినవారు నిడుదవోలుకు సమీపాన గల మారంపల్లి వాస్తవ్యులు. కళావంతుల కులానికి చెందిన కీ.శే. చిత్తజల్లు లక్ష్మీకాంతం, రావూరి

కామయ్య, కామయ్యగారి సోదరులు సూరయ్య, వెంకయ్య, సత్యం మొదలైన వారంతా మారంపల్లిలోనే వుండి గొల్లకలాప ప్రదర్శనాన్ని గోదావరి మండలం లోనూ, సర్కారు జిల్లాలలోనూ ప్రదర్శించి పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. ఆంధ్రదేశంలో కర్ణాటక కచ్చేరీ నాట్యాన్ని, భాగవత కళను రెంటినీ ఆరాధించిన దేవదాసీ కుటుంబాల్లో చిత్తజల్లువారు బహుప్రసిద్ధులు.



## చిత్తాలను జల్లుమనిపించిన చిత్తజల్లు లక్ష్మీకాంతం :

లక్ష్మీకాంతం మృదుమధురంగా సంగీతం పాడగలిగేది: చక్కగా నృత్యం చేయగలిగేది. సంస్కృత భాషాజ్ఞానాన్ని సంపాదించిన కళాకారిణి. లక్ష్మీకాంతం ప్రథమంలో కూచిపూడి భామాకలాపాలనే ప్రదర్శిస్తూ వుండేది. తరువాత కామయ్య గారి సహాయంతోనూ, వారి తమ్ముల అండతోనూ గొల్లకలాపం నేర్చుకుని బహుళ ప్రచారం గావించి, ఆంధ్రదేశంలో గొల్లకలాపాన్ని వ్యాప్తిలోకి తీసుకు వచ్చి కొంత కాలానికి స్వర్గస్థురాలైంది. ఆమె అనంతరం గొల్లకలాప ప్రదర్శనాన్ని చేయి విడవకుండా ఆమె కుమార్తెలు కృష్ణహరి, చిన వెంకటరత్నం కొన సాగించారు.

## వరుస తప్పని వారసత్వం :

లక్ష్మీకాంతం చెల్లెలు వైదేహి. ఈమె పెదవెంకటరత్నం అనే కుమార్తెను కని చిన్నతనంలోనే మరణించింది. లక్ష్మీకాంతం కుమార్తె అయిన కృష్ణహరి వైదేహి, ఇందువదన అనే ఇరువురు కుమార్తెలను కని, ఆమెకూడా దివంగతు రాలైంది.

అందువల్ల లక్ష్మీకాంతం తన కుమార్తె చిన వెంకటరత్నానికీ, చెల్లెలి మార్తె పెద వెంకటరత్నానికీ కామయ్యగారి సోదర బృందం ద్వారా విద్యాబుద్ధులు తప్పించి గొల్లకలాప ప్రదర్శనానికి సరియైన తీరికలు తీర్చిదిద్దారు.

## సంగీత సాహిత్యనిధి రాపూరి కామయ్య :

సంగీత, సాహిత్య, నాట్యకళానిధి రాపూరి కామయ్యగారు. వీరి స్వగ్రామం వెలదుఱ్ఱు. వీరు బ్రాహ్మణ కుటుంబానికి చెందినవారు. వీరు మారంపల్లివారి గొల్ల కలాప ఖండ నిర్మాణానికి మూలపురుషులు. వీరి మరణానంతరం శ్రీ వెంకయ్య, సూరయ్య, సత్యంగార్లు మారంపల్లెలో స్థిరపడిపోయి చిత్తజల్లు కళాకారిణులతో చాలాకాలం గొల్లకలాప ప్రదర్శనాలను ఇచ్చారు.

కామయ్యగారు హాస్యం చెప్పడంలో నిధి. ఎటువంటి అర్థంకాని విషయాన్నైనా తన హాస్య కళానిపుణత్వంతో తేటతెల్లం చేసేవారు. భామాకలాపం, గొల్ల కలాపం రెంటిలోనూ హాస్యానికి పెట్టింది పేరు. ఈయన అటు విశాఖజిల్లా నుండి ఇటు గుంటూరువరకూ పేరు ప్రతిష్ఠలను సంపాదించారు.

వీరి సోదరులు వెంకయ్యగారు సంగీతంలో ఆరితేరిన మేధావి. సత్యంగారు సంస్కృతాంధ్రభాషల్లో మంచి పండితుడు. వీ రిరువురూ తమకు కావలసిన అనేక కీర్తనలకు స్వరాలనూ, మట్లనూ, గమకాలనూ తామే తయారు చేసుకునేవారు. ఇక సూరయ్యగారు తమ సంచారంలో తటస్థించిన అనుభవాలనన్నిటినీ క్రోడీకరించి సమయానుకూలంగా ప్రేక్షకుల ననుసరించి, సమయా సమయాలు ఆలోచించి, గొల్లకలాప ప్రదర్శనంలో చేర్చి ప్రజారంజకంగా ప్రదర్శించేవారు.



ఈరీతిగా గొల్లకలాపాలను ఎక్కువ కాలం (దాదాపు 40 సంవత్సరాలు) వెంకటరత్నం సోదరీమణులు ఆంధ్రదేశమంతటా ప్రదర్శించి కళాసేవ చేశారు.

## వైదేహి, ఇందువదన :

వైదేహి ఇందువదన లిరువురూ మరణించేవరకూ గొల్లకలాప ప్రదర్శనాన్ని చెదురు మదురుగా ప్రదర్శిస్తూ వచ్చారు. వైదేహి గొల్లకలాప ప్రదర్శనంలో సిద్ధ హస్తురాలు. ఆమె సోదరి ఇందువదన ప్రయోక్తగా వుండి అక్కగారిచేత నాట్య మాడించేది. ఈ విధంగా వీరిద్దరూ అయిదు దశాబ్దాలు నాట్యకళారాధన చేశారు. వైదేహి పంచకావ్యాలూ, అమరమూ, వేదమూ పురాణ పండ వెంకటశాస్త్రిగారివద్ద పకడ్బందీగా చదువుకుంది. అభినయం, సంగీతం, వేదం, స్మృతులు, పురాణాలు, భరతశాస్త్రం, అలంకార శాస్త్రం, రసశాస్త్రమూ పండితులవద్ద ప్రత్యేకంగా అభ్య సించింది. ఇందువదన చదలవాడ కుమారస్వామిగారివద్ద సంగీతాన్ని, లయజ్ఞానాన్ని



చిత్తజల్లు వైదేహి

నేర్చుకుంది. వీరి నాట్యశిక్షణ తెల్లవారుఝామున ప్రారంభిస్తే రాత్రి పది గంటల వరకూ కొద్ది విరామాలతో అలా అలా నడుస్తూనే వుండేదట. ఈ విధంగా ఈ శిక్షణ పది సంవత్సరాలు జరిగిన తరువాతనే వీరు రంగస్థలంపై కాలికి గజ్జెకట్టి బహి రంగంగా ప్రదర్శనాలు ఇవ్వగలిగారట. వీరు భామాకలాపం, గొల్లకలాపాలనేగాక, భోగం మేళాలుగా వివాహ సమయాల్లోనూ, దేవాలయ కల్యాణ మహోత్సవాలలోనూ తమ కార్యక్రమాలు ప్రదర్శించేవారు. ఇందువదన హరికథా కాలక్షేపం కూడా చేసేదట.

## గొల్లకలాపాల ప్రదర్శన పద్ధతి :

గొల్లకలాప ఇతివృత్తాన్ని గురించి 'కూచిపూడి భాగవతాలు' అన్న శీర్షికలో వర్ణించాం. గొల్లకలాప ఇతివృత్తంలో అనేక రకాలైన కీర్తనలు, మట్లు, గమకాలూ వుంటాయి. మంచి సాహిత్యం, సాహిత్యానికి తగిన సంగీతం, సంగీతానికి తగిన ఫణతులు, వీటన్నిటికీ తగిన నాట్యంతో గొల్లకలాప ప్రదర్శనం ఒక కమ్మని కళాఖండంగా ప్రదర్శింపబడుతుంది.

గొల్లకలాప ప్రదర్శనంలో ఆనాడు ఏవిధమైన తెరలూ వుపయోగించలేదు. ప్రదర్శనం ప్రారంభించి, సాంతమయ్యేవరకూ నటీ నట బృందమంతా రంగస్థలం మీదే వుంటారు. ప్రధాన నాయికకు సహాయంగా మరో సహాయ నాయిక వుంటుంది. వీరిద్దరూ కాక కథా గమనాన్ని అత్యంత చమత్కారాలతో ప్రేక్షకులకు కథలా కళ్ళకు కట్టినట్లు ప్రతిభావంతంగా చిత్రించే విదూషక పాత్రధారి వేరే ఒకడు వుంటాడు. ఇతనిని హాస్యగాడు అని పిలిచేవారు. వీరు ముగ్గురే గొల్లకలాప ప్రదర్శనానికి నటీ నట వర్గమని చెప్పవచ్చు. వీరుగాక వీరికి హంగుదార్లుగా ప్రక్కవాయిద్యాలు, మృదంగం, ఫిడేలు, హార్మోనియం, తాళగాండ్రు వుంటారు. హాస్య పాత్రధారి, సహాయ కథానాయిక కూడ తాళం వేస్తూ వుంటారు. ఇతర కళా రూపాల్లో వలెనే ఇష్టదేవతా ప్రార్థన, విఘ్నేశ్వర స్తుతి, సరస్వతీ పూజ మొదలైన సంప్రదాయాలను కూడా అక్షరాలా పాటించేవారు.

## సంశయాలూ, సందేహాలూ తీర్చే
## భాష్యకారుడు హాస్యగాడు :

కథాగమనంలో, అందరికీ అర్థమయ్యే శైలిలో, మధ్య మధ్య అనేక పిట్ట కథల ద్వారా, ప్రేక్షకులకు వచ్చే సందేహాలను తానే కథా నాయికని ప్రశ్నించి ఇతగాడు కథలో వచ్చే చిక్కులన్నీ సుబోధకం అయ్యేలా చేస్తాడు.

గంభీరమైన అనేక విషయాలను కరబదరీ సమానంగా వివరించి, ప్రేక్షకులకు విసుగు జనించకుండా తన అద్భుత చమత్కృతితో పండితులనుండి పామరుల వరకూ అందర్నీ రంజింపజేసే వైజ్ఞానిక పాత్రధారి మన హాస్యగాడు.

ఈ ప్రదర్శనానికంతా ప్రధాన కథానాయిక ఎంత అవుసరమో, హాస్య పాత్ర ధారి కూడ అంత ముఖ్యం. గొల్ల కలాపంలో మన నాటకంలో మాదిరి, భాగవతంలో మాదిరి వచ్చి పోయే పాత్ర లేమీ వుండవు. ఒకసారి రంగస్థలం పైకి ప్రత్యక్షమైతే ఆ ముగ్గురూ ఆసాంతం వుంటూనే వుంటారు.

## హాస్యకాని బరువు బాధ్యతలు :

గొల్లకలాపంలో చెప్పబడే అనేకమైన వుదాత్త విషయాలను పై మూడు పాత్రలే వుదాహరించాలి. ఇలా వివరించడంలోనూ ప్రేక్షకులకు ఏ విధమైన విసుగూ లేకుండా ప్రదర్శించాలి. ఇది చాలా కష్టమైన విషయం. కాని మన హాస్య కాడు వినోదంతోనూ, పిట్టకథలతోనూ, ప్రజాజీవితంలో నిత్యం వాడబడే అనేక చాటువులతోనూ ప్రేక్షకుల నందరినీ సమాళించి చమత్కారంగా తన వశంలో వుంచు కుంటాడు.

## మూడు రోజుల నుంచి ఒకే రోజుకు ప్రదర్శనకాలం కుదింపు :

గొల్ల కలాపాన్ని ప్రదర్శించాలంటే ప్రతి రాత్రీ ఏడు గంటల చొప్పున ప్రదర్శిస్తే కనీసం మూడు రోజులకు గాని పూర్తి కాదు. చిత్తజల్లువారూ ప్రథమంలో ఈ కార్యక్రమాన్నంతా వరుసగా మూడు రోజులూ ప్రదర్శించేవారు. కాని, రాను రాను ప్రజలలో చూచే వుత్సాహం, వినే ఓపికా తగ్గటం, చాలమంది పండితులూ, రసికులైన ప్రేక్షకులూ కూడ తగ్గటంవల్ల ప్రదర్శనకాల పరిమాణం విధిగా తగ్గి పోయి, ప్రజలకు ఖచ్చితంగా కావలసిన ఖరారు ఘట్టాలనే ప్రదర్శిస్తూ కిందా మీదా బడి ఎలాగో ఓలాగు కుదించి ఒకే రోజున ప్రదర్శనాన్ని ముగిస్తూ వచ్చారు.

## గంధర్వకన్యల వనవిహారం :

గొల్లకలాప ప్రదర్శనాన్నే కాక వీరు 'వనవిహార' మనే మరో ప్రదర్శనాన్ని కూడ ప్రదర్శించేవారు. ఈ ప్రదర్శనం గురించి ప్రత్యేకించి చెప్పదగ్గవి కథా విధానం. ఇద్దరు గంధర్వకన్యల మధ్య జరిగే సంభాషణా విధానం.

ఈ సంభాషణంతా చాలావరకు సంస్కృత భాషలోనే నడుస్తూ వచ్చినా అక్కడక్కడ తెలుగు కీర్తనలు పాడుతూనూ దీనిని ప్రదర్శిస్తారు. ఇరువురు గంధర్వకన్యలు వనవిహారాని కొచ్చి పూలతోటలో పూలబంతు లాటలు ప్రారంభించి ఋతువుల్ని గురించీ, పూవులను గురించీ, చెట్లను గురించీ, రక రకాల వర్ణనలు సాగించడం రూపంగా ఇది నడుస్తుంది. ఈ ప్రదర్శనం ప్రేక్షకులకు గుమ్మెక్కించే టట్లు ప్రదర్శించాలంటే ఆ కన్య లిద్దరూ మిసమిస లాడే యౌవనవతులై వుండాలి. అప్పుడే ఆ యొక్క ప్రదర్శనానికి నిండుదనం వచ్చేది; ప్రదర్శనం రక్తికట్టేది.

గొల్లకలాపం కాని, వనవిహారం కాని ప్రదర్శించాలంటే ముఖ్యంగా సంస్కృతాంధ్ర భాషలు క్షుణ్ణంగా వచ్చితీరాలి. సరియైన విద్యా, విద్యకు తగిన విజ్ఞానమూ, దానికి తగిన సంస్కారమూ, కట్టుతప్పని పట్టుదలా కావాలి. శ్రుతితప్పని సంగీతమూ, తొట్రుపడని, మట్టుమీరని సరియైన ఉచ్చారణా కావాలి.

## మారంపల్లి వారిని మనవారు మరువరు మరువలేరు :

ఈ విద్యను చెక్కుచెదరకుండా మూడు తరాలుగా చిత్తజల్లువారి కుటుంబం కాపాడుకుంటూ వచ్చింది. ఆనాడు ఏభై ఏళ్ళ పండు వృద్ధురాలు చిత్తజల్లు పెద వెంకటరత్నమ్మ తప్ప ఆ కుటుంబంలోని వారందరూ మరణించారు. గొల్లకలావ కళాఖండం వారితోపాటే అంతరించింది. ఏమైనా నూరు సంవత్సరాలనుంచీ గొల్ల కలావ ప్రదర్శనాన్ని పెంచి పోషించి, ఆంధ్రదేశమంతటా ప్రదర్శించి ప్రఖ్యాతి వహించిన మారంపల్లి వాస్తవ్యులు చిత్తజల్లు సోదరీమణులూ, రావూరి కామయ్య సోదరులూ స్మరణీయులు. వర్తమానంతోపాటు భవిష్యత్ సహా ఆంధ్రదేశం వారిని, వారి కళాసేవను మరువజాలదు.



## చాటపర్తి సుందరి శకం :

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు వాస్తవ్యురాలైన చాటపర్తి సుందరిది ఒక శకం. ఆమె దేవదాసి. ఒక మేళానికి నాయకురాలుగా వ్యవహరిస్తూ వుండేది. ఆమె కచేరీ

నాట్యంలోనూ, దేవదాసీ నృత్యంలోనూ కూడా ఘటికురాలు. విద్యలో ఆమెను మించినవారు లేరనేటంతటి గర్విత. ఒకసారి నర్సాపురంలో ఒక వైశ్యుల ఇంట ఒక వివాహ సందర్భంలో ఈ సుందరి తన బృందంతో గజ్జె కట్టింది. మెడ నిండా మెడల్స్ ధరించి ఠీవిగా రంగస్థలంలో ప్రవేశించింది.

ఈ వివాహానికి శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారూ, వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారూ (ఈ సందర్భాన్ని పురస్కరించుకుని-ముఖ్యంగా ఆమె విద్యలు పరీక్షించడానికి) వచ్చారు. సుందరి పుష్పబాణవిలాసంలోని ఈ సంస్కృత శ్లోకాన్ని అభినయంతో ప్రారంభించింది:

కాంతో యాస్యతి దూరదేశమితి చింతా పరం జాయతే,
లోకానందకరోపి చంద్రవదనే, వైరాయతే చంద్రమాః.

అంటూ శ్లోకాన్ని పదవిభాగం చేసి అభినయానికి ఉపక్రమించింది. ఆ సందర్భంలో పంచబాణాలను అభినయరూపంలో ప్రదర్శించే పద్ధతి చూపెట్టడానికి శ్లోకాన్ని ఇలా ప్రారంభించింది.

అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా,
నీలోత్పలంచ పంచైతే పంచబాణస్యసాయకాః.

అరవిందము—అశోకము—చూతము—నవమల్లిక—నీలోత్పలమూ మొదలైనవి మన్మథుని పంచబాణాలు. ఈ అభినయంలో సుందరి పంచబాణాలనూ ప్రయోగించింది. అసలు రంగంమీద చతుర్బాణాలే అభినయరూపంలో ప్రదర్శించాలి. పంచమబాణం ఉపయోగించినట్లయితే నాయిక మృతి పొందుతుంది. ఆ తరువాత అభినయించేందుకు నాయిక వుండదు. కాని ఈ సుందరి ఆనాటి అభినయంలో పంచబాణాలనూ ఉపయోగించింది.

వెంటనే పండితు లిద్దరూ ఈ సభకు మైల వచ్చిందని కేకలు వేయడం ప్రారంభించారు. సభంతా గందరగోళమైంది. నాయిక బిత్తరపడిపోయింది. ఆ సభలో పండితు లిద్దరు వచ్చి కూర్చున్నారన్న సంగతి అంతవరకూ ఈ సుందరికి తెలియదు.

ఈ విషయం తెలుసుకున్న సుందరి వెంటనే సత్వరున వెళ్ళి పండితుల పాదాల మీద వాలింది. అప్పుడు శాస్త్రిగారు అభినయంలో కలిగిన లోపాలను చూపించారు.

"చతుర్బాణాలనే అభినయంలో ఉపయోగించాలి కాని, నీవు పంచబాణాలూ ఉపయోగించావు. అందువల్ల స్థలం మైలపడింది. అందుచేత కళామతల్లికి కలిగిన ఈ కళంకాన్ని భరించలేక ఈ రూపంలో నీకు తెలియజేయవలసి వచ్చింది'' అని అనడంతో సాష్టాంగ దండప్రణామాలు ఆచరించి, తన బసకు తీసుకుపోయి, పండితు లిద్దరినీ సత్కరించి, కానుక లిచ్చి గౌరవించి శాస్త్రిగారి శిష్యురాలుగా చేరిపోయింది.

## పాటకత్తెగానూ, ఆటకత్తెగాను ప్రశస్తి గాంచిన 'కళావర్ రింగ్' :

కచేరీ నృత్యానికీ కర్ణాటక నృత్యానికీ కొత్త మెరుగులు దిద్ది, విజయనగరం రాజనర్తకిగా, నాటకరంగ నటిగా, అమరగాయనిగా, చలనచిత్ర నటీమణిగా రసిక హృదయాల్ని రంజింపజేసిన కళాకారిణి కళావర్ రింగ్ అనే పేరుతో చెలామణి అయిన శ్రీమతి సరిదె లక్ష్మీనర్సయ్యమ్మ. ఈవిడ విజయనగరానికి 8 మైళ్ళ దూరంలో వున్న కోరుకొండ గ్రామంలో 1908 లో జన్మించింది. 8 వ ఏటనే నర్తకిగా పేరు తెచ్చుకుంది. 5 వ తరగతి వరకూ ప్రాథమిక విద్యాభ్యాసం చేసి శ్రీ మద్ది అచ్చన్నగారి వద్ద సరిగమలు ప్రారంభించి, శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడు శిష్యులైన శ్రీ మద్దిల సత్యమూర్తి, శ్రీ చాగంటి రంగబాబు, శ్రీ కోటిపల్లి గున్నయ్య మొదలైనవారివద్ద సమగ్ర సంగీతజ్ఞానం సంపాదించింది. నృత్యవిద్యలో శ్రీమతి మద్దిల అప్పడు, శ్రీమతి మద్దిలరాముడు వద్ద శిక్షణ పొందింది. మద్దిల హేమావతి, నరహరమ్మలవద్ద హిందుస్తానీ జావళీలు, క్షేత్రయ్య పదాభినయనం నేర్చుకుంది. 12 సంవత్సరాల వయస్సులోనే భోగంమేళం నాయకురాలుగా వ్యవహరించింది. ఆమె నృత్యానికి అచ్చెరువందిన ప్రేక్షకులు ఆమెను 'కళావర్ రింగ్' అని పిలిచేవారు.



ఆంధ్ర దేశంలోనూ, రాష్ట్రేతర ప్రాంతాల్లోనూ నానారాజ సందర్శనం చేసి సంగీత నృత్యవిద్యలో మహా పండితుల్ని మెప్పించి, నాట్యతరంగిణి, నవవసంత కోకిల, గానకళాకోవిద అనే బిరుదులతో సువర్ణ హస్తకంకణాల బహుమానాలతో సన్మానాలు అందుకున్నది. జయపూర్, ధారా

కోట. కళ్ళికోట, చీకటికోట, కలహండి, కరియల్, మధుపూర్, టికిరియా సంస్థానాల్లో ఆమెను ఘనంగా సన్మానించారు.

ఆమె తెలుగు చలనచిత్ర రంగంలోనూ ప్రవేశించి 'రాణీప్రమీల' చిత్రంలో ప్రధానపాత్ర ధరించి చక్కగా పాడి నటించింది. 1947 లో మద్రాసు రేడియో ప్రసారం చేసిన సీతారామకల్యాణం, సుందరకాండ, సక్కుబాయి, శ్రీరామ జననం, భక్త రామదాసు నాటకాల్లో పాల్గొని అత్యుత్తమంగా నటించింది.

1934 లో ఆమె అనేక గ్రామఫోన్ రికార్డుల నిచ్చింది. కోకిల 'కోయి' అని కూయగా, వ్యాకులమానసమాయెగా, చిటపట చినుకులు దుప్పటి తడిసెను, పచ్చబొట్టు ప్రాణనాథా .... సైపగజాల, రాత్రి నాటకం, ఏరా నాప్రియ మొదలైన పాటల రికార్డులు వెలువడ్డాయి. చింతామణి గ్రామఫోను రికార్డుల నాటకంలో చింతామణి పాత్ర ధరించింది.

1964 మార్చి 17 వ తేదీన ఆమెను ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ హైదరాబాదు రవీంద్ర భారతిలో సన్మానించింది.

నృత్యప్రదర్శనం ద్వారా కళావర్‌రింగ్ అపారంగా ధనం ఆర్జించింది. అనేక మంది బీద విద్యార్థులకు ఆర్థిక సహాయం చేసింది. అంతే కాదు. అవసరాల్లో వున్న వాళ్ళను ఆదుకుని అనాథులకు ఆశ్రయం ఇవ్వటం ఆమె సుగుణాలు. ఆమె, అంతిమ దశలో, అకాడమీ వారి వేతనంతో, హరికథా గానంతో జీవితం గడిపి 1964 లో స్వర్గస్థురాలైంది.

## కోనసీమకెల్లా మిన్నగా ఎన్నికైన అన్నాబత్తుల బుల్లి వెంకటరత్నం :

ఈమెను అన్నాబత్తుల చిట్టి అనే చాలామంది పిలుస్తూ వుంటారు. ఈమె రతరాలుగా అభినయ విద్యను ప్రదర్శించే విద్వత్కుటుంబంలో జన్మించింది. బుల్లి ంకటరత్నం ఆరు సంవత్సరాల పూపప్రాయంలోనే అమ్మమ్మవద్ద అరుదుగా భరత నాట్యాన్ని నేర్చుకుంది. కుటుంబంలో కడసారి బిడ్డ అవడంవలన కుటుంబంలోని వారందరూ ఆమెను ప్రేమతో పెంచి పెద్ద చేశారు. ఆమె అభినయం, సంగీతం, అధ్యాత్మ అష్టపదులు, తరంగాలు. అభినయమూ, నరస భూపాలీయము, నాయికా నాయక ప్రకరణము సాంప్రదాయికంగా నేర్చుకుంది.

ఆమె అభినయ విద్యను కోటిపల్లి వాస్తవ్యులు కడియాల రామమూర్తిగారి వద్దనూ, సంగీతాన్ని మహోద్రాడ పద్మనాభంగారి వద్దనూ, గొల్లకలాపాన్ని, భామా



అన్నాబత్తుల బుల్లి వేంకటరత్నం

కలాపాన్ని ఆత్కూరి సుబ్బారాయుడుగారి వద్దనూ, కలాపంలో వేదాంత విద్యను జయంతిస్వామి నాయనగారి వద్దనూ నేర్చుకుంది.

## కోనసీమలో గొప్ప పేరు:

ఆమె భామాకలాపం, గొల్లకలాపం, కచేరీ నాట్యం మొదలైన విద్యలలో కోనసీమలో మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించిన నట్టువరాలు. రాజమండ్రి భారత సంస్కృతి సభ, కాకినాడ సాహిత్య పరిషత్తు, మద్రాసు సంగీత నాటక అకాడమి మొదలైన అనేక సంస్థలు ఆమెను సన్మానించాయి.

## ఉభయ విద్యాప్రవీణ శ్రీమతి మద్దెల రాముడు:

విజయనగరం వాస్తవ్యురాలు మద్దెల రాముడు సంప్రదాయ కచేరీ నృత్యవిద్య లోనూ, కర్ణాటక విద్యలోనూ ఆరితేరిన విద్వాంసురాలు. ఆమె తన విద్యతో ఒక్క విశాఖమండలమే కాక ఆంధ్రదేశంలో పలుతావుల్లో ప్రదర్శనలిచ్చి మెప్పు పొందింది. ఈమె నాయకురాలుగా ఎన్నో సంవత్సరాలు ఆ బాధ్యతను నిర్వహించింది. ఎంతో


శ్రీమతి మద్దెల రాముడు

మందికి విద్యాదానం చేసి అనేకమంది కళాకారుల్ని తయారుచేసింది. సంగీత నాటక అకాడమీ వారి ఉపకార వేతనంతో జీవితం వెళ్ళబుచ్చింది.

## పందిరి వెంకటరత్నం:

పందిరి వెంకటరత్నం జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా మండపేట. భాగవత సంప్రదాయాన్ని భాగవతుల రూపేణ ప్రచారం చేయడంలో కృష్ణాజిల్లాలో


శ్రీమతి పందిరి వెంకటరత్నం

కూచిపూడి ఎంతటి ప్రఖ్యాతి వహించిందో గోదావరి మండలంలో మండపేట కచేరీ నాట్యంలోనూ, కర్ణాటక. భామా గొల్ల కలాపంలోనూ అంతటి సరస్వతీ పీఠంగానూ వర్ధిల్లింది. శ్రీమతి పందిరి వెంకటరత్నం, వానపల్లి వీరరాజు మొద



వానపల్లి వీరరాజు

లైనవారు భామాకలాప, గొల్లకలాప విద్యలను అనేక సంవత్సరాలుగా ఆంధ్ర దేశంలో ప్రదర్శిస్తూ వచ్చారు. 1949 సంవత్సరంలో విజయవాడలో జరిగిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి సన్మాన సందర్భంలో వెంకటరత్నం సమయానుకూలంగా సన్మానించబడింది. ఈవిడ రేడియోద్వారా ఎన్నో భామాకలాప ప్రదర్శనాలను ప్రసారం చేశారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈమెను ఘనంగా సన్మానించింది.

## దుగ్గిరాల మాణిక్యం :

మండపేట మాణిక్యం అని కూడ పిలువబడే దుగ్గిరాల మాణిక్యం జన్మస్థలం మండపేట. సంస్కృతాంధ్ర భాషలనూ, సంగీత నాట్యాలనూ అమోఘంగా ఆకళింపు చేసుకున్న విదుషీమణి ఈమె. భాగవత సంప్రదాయాలను ప్రచారం చేయడంలోనూ కచేరీ నృత్యంలోనూ ఆంధ్రదేశానికి పేరు తెచ్చిన కళాకారిణి. ఈమె నిజంగా నాట్య సరస్వతి.

భారత భాగవత విద్యల్లో భావ మెరిగి అభినయించే నాట్యవిశారద శ్రీమతి పందిరి వెంకటరత్నం ఈమె శిష్యురాలు. వెంకటరత్నం స్వర్గీయ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులగారిచే సన్మానింపబడిన విద్వాంసురాలు.

## భామాకలాపానికి ధీమా తెచ్చిన దూడల శంకరయ్య :

భామా కలాపం ప్రత్యేకమైన ఆంధ్రుల కళ. దానికి సిరితెచ్చింది శ్రీకాకుళం జిల్లా. అనాదినుండి ఆ జిల్లాలో సుమారు 40 కుటుంబాలవారు ఈ కళనే వృత్తిగా చేసుకుని జీవించేవారు. ఈనాడు అన్ని కుటుంబాలు లేవు. చెప్పుకోతగిన పండితులు కూడ అంత మంది లేరు. కాని సిగడాం వాస్తవ్యులైన దూడల శంకరయ్యగారు ఈ భామాకలాప విద్యలో సిద్ధహస్తులు. వీరు భామాకలాపం పాలిటి ధీమాతెచ్చిన భీమా. వీరి తరువాత ఈ భామాకలాపకళ అంతరించిపోయే అవకాశముంది. దీనిని సంస్కరించి ప్రదర్శిస్తే ఆంధ్రనృత్యకళలో ఒక మహోత్కృష్టకళగా రూపొంద గలదు.

భామాకలాపవిద్యలో సిద్ధహస్తులైన దూడల శంకరయ్యగారు లయబ్రహ్మ. వారిది లయబద్ధమైన అద్భుతకళ. అది ఆంధ్రుల పురాతన కళాఖండం. శంకరయ్యగారి భామా కలాపంలోని బాణీలు, పదాలు, పాటలు ఆయన కుమారుడు వాయించే మృదంగదరువులు అద్భుతమైనవి. ఆంధ్రదేశంలో కూచిపూడివారూ, దేవదాసీలూ ప్రదర్శించే భామాకలాపానికీ, శంకరయ్యగారి భామాకలాపానికీ ఎంతో వ్యత్యాసముంది. అందువల్ల ఈ కళను ప్రత్యేకంగా పోషించవలసిన అవసరముంది.



## బొంతల కోటిజగన్నాథం :

శ్రీకాకుళం జిల్లాకు చెందిన బొంతలకోటి జగన్నాథంగారు కూడా భామాకలాపం ప్రదర్శించడంలో సిద్ధహస్తులు. వీరి సాంప్రదాయమూ, దూడల శంకరయ్యగారి సంప్రదాయమూ ఒకటే.

ఇది కూచిపూడి భామాకలాపానికి భిన్నమైనది. ప్రాచీన యక్షగానదరువుల శైలీ, అభినయవిన్యాసమూ వీరి బాణీలో తొణికిసలాడుతూ వుంటాయి. సంగీత ప్రధానమైన భాగవతసంప్రదాయం వీరిది. భామాకలాప విద్యలో బొంతలకోటి జగన్నాథం గారు, శ్రీకాకుళంజిల్లాలో చాలా ప్రసిద్ధులు.

పైన వివరించినవారేగాక పెండ్యాల సత్యభామ, చింతా భద్రం, ఎండమూరి చిట్టి, పేరూరు పుష్పావతి, దుగ్గిరాల శ్రీ విరాజితం, దుగ్గిరాల జగదాంబ, అంబుల వెంకటరత్నం మొదలైన దేవదాసీలు, భామాకలాపంలోనూ, గొల్లకలాపంలోనూ. దేవదాసీ విద్యలోనూ బహు ప్రసిద్ధులు.

## బొబ్బిలి బెబ్బులి జీవరత్నమ్మ :

కీ॥ శే॥ శ్రీమతి జీవరత్నమ్మ బొబ్బిలి సంప్రదాయ భరతనాట్య కళావిదురాలు తరతరాలుగా జీవరత్మమ్మ కుటుంబంవారు ఈ కళను పోషిస్తూ బొబ్బిలి సంస్థాన కళాకారులుగా వర్ధిల్లారు.

జీవరత్నమ్మ ఒక్క భరతనాట్య సంప్రదాయంలోనే కాక, కర్ణాటక సంగీతంలోనూ, వీణవాద్యంలోనూ విశేష పాండిత్యంగల విదుషీమణి, పదవర్ణాలకు, స్వరజతులకు, శబ్దాలకు, క్షేత్రయ్య పదాలకు, జావళీలకు నృత్తనృత్యాలు కల్పించి అభినయించేది. ఆమె నర్తనరీతి మంచి పాండితీ ప్రతిభ గలిగినట్టిది. అంతేకాక సంస్కృత శ్లోకాలకు, ఒరియాలో పదావళికి, ఉర్దూ, హిందీ భాషల్లోని టుమ్రీ-గజల్ గీతాలకు కూడ అభినయాన్ని కల్పించి ప్రదర్శించేది. 60 సంవత్సరాల వృద్ధాప్యంలో కూడా నృత్యాభ్యాసం చేసేది.

ఆమె సంపాదించిన ధనమంతా దానధర్మాలకు ఖర్చు చేసింది. అంతిమ దశలో సంగీత నాటక అకాడమీవారి వృద్ధాప్య పింఛనుతో జీవించింది. కొన్ని సంవత్సరాల క్రితం హైదరాబాదులో నటరాజ రామకృష్ణగారి నృత్యనికేతనంలో బాలికలకు నృత్య శిక్షణ నిచ్చింది. 'నే నీ కళారాధనకు అంకితమయ్యాను. నా జీవితం కళారాధనలోనే గడిపి తరిస్తా'నని నృత్యనికేతనం చేరినట్లు నటరాజ రామకృష్ణగార 68 అక్టోబరు 'నాట్యకళ' సంచికలో వివరించారు. శ్రీమతి జీవరత్నమ్మ 68 ఆగస్టు 22 తారీఖున కీర్తిశేషురాలైంది.

## భామావేషంలో ధీమా చూపిన మరి కొందరు:

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా కుమారదేవ గ్రామంలో మంచిరాజు వెంకట్రామరాజుగారనే నియోగి బ్రాహ్మణుడు భామవేషం ధరించడంలో బహు ప్రసిద్ధుడు. వారి శిష్యులైన పల్లింపట్ల రామయ్యగారు పశ్చిమ గోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా బందపురంలోని పిచ్చుకుంట్ల వారికి భామాకలాపాన్ని, గొల్ల కలాపాన్ని నేర్పారు. బయ్యా పెదగంగాధరుడు, బండి చిట్టిలింగము, దేశిలక్ష్మీ నారాయణ మొదలైనవారు భామ వేషధారణలో సిద్ధహస్తులు. 16 సంవత్సరాల వయస్సులోనే లక్ష్మీనారాయణ భామవేషం అద్భుతంగా వుండేదట. బందపురంలో పిచ్చుకుంట్లవారికి ఈ విద్యను నేర్పించటంలో విశేష కృషిసల్పినవారు పి. యస్. ఆర్. అప్పారావుగారి పితృపాదులైన పోణంగి రామమూర్తిగారు.





# ఏకపాత్రాభినయ గానం, హరికథా గానం



ఆంధ్ర దేశంలో అన్ని జానపద కళారూపాలతోపాటు వర్ధిల్లి ప్రజాభిమానాన్ని చూరగొన్న కళారూపాలలో ముఖ్యమైన హరికథా గానం ఆంధ్రుల హరికథా చరిత్రలో హరికథ ఒక ప్రత్యేకతనూ, గౌరవాన్నీ సంపాదించింది. దానిని ఒక విశిష్ట కళారూపంగా తీర్చి దిద్దినవారు శ్రీమత్ అజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు.

హరికథా కళారూపంలో ఒకే ఒక పాత్రధారి మూడు గంటల కాలం కథా గానం కావిస్తాడు. ఒకే వ్యక్తి అన్ని పాత్రల్లోనూ జీవించి, రసవత్తరంగా నటిస్తాడు. నోటితో వాచికం చెపుతూ, మృదుమధురమైన గానం పాడుతూ, ముఖంలో సాత్వికమూ, కాలితో నృత్యమూ చేతులతో ఆంగికమూ గుప్పిస్తూ ఆకర్షణీయమైన ఆహార్యంతో ఏకకాలంలో అభినయిస్తాడు. హరికథలోవున్న ప్రత్యేకత ఇదే. మూడు గంటల కాలం కూర్చున్నా ప్రేక్షకులకు విసుగు జనించకుండా పిట్ట కథలతో, మధ్య మధ్య హాస్యరసాన్ని పోషిస్తూ సమాజంలోవున్న కుళ్ళును ఎత్తి చూపిస్తూ, వేదాంత బోధ చేస్తూ జనరంజకంగా హరికథను గానం చేస్తాడు.

## వేషాలు, భూషలు :

కథకుడు కేవలం అతని ప్రతిభవల్లనే ప్రేక్షకులను హరికథతో రంజింపజేయగలడు. హరికథకుని వేషధారణ కూడ సామాన్యమే. చేతిలో చిరతలు, కాలికి గజ్జెలు, పట్టు దోవతి పంచకట్టు, పట్టు కండువా నడుముకుకట్టి, మెడలో ఒక పూల హారం ధరించి చక్కగా తిలకం దిద్దుతాడు.

## కట్టుకథలు కావు అచ్చంగా హరికథలే:

హరికథకులు రామాయణం, భారతం, భాగవతం మొదలైన ఆధ్యాత్మిక సంబంధమైన కథలను విరివిగా చెపుతూ వుంటారు. సంపూర్ణ రామాయణం, సంపూర్ణ భారతం, భాగవతం మొదలైన కథలు వరుసగా పదిహేను రోజులూ, నెల రోజులవరకూ గూడ సాగుతాయి. పట్టణాలలోనూ, గ్రామాల్లోనూ పనుల తరుణం అయిపోయిన తరువాతా, పర్వదినాలలోనూ ఆంధ్రదేశపు హరిదాసులు ఈ కథలు చెపుతూ వుంటారు.

## హరికథల ప్రాచీనత:

హరికథల స్వరూపం వేదకాలంనాటిదనీ, సర్వజ్ఞులయిన మహర్షులు ఈ హరి కథా శిల్పాన్ని ప్రప్రథమంగా సృష్టించారనీ పండితులు నిర్ణయించారు. బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు భక్తిసూత్రాలను ఉపదేశిస్తూ హరికథాగానం చేస్తూవుంటాడని ప్రతీతి. వేదవిభజన చేసినా, అష్టాదశ పురాణాలను లిఖించినా మనశ్శాంతి పొంద నేరని శ్రీ వ్యాసునకు శ్రీమద్భాగవతం రచించి హరికథామృతాన్ని పంచిపెడుతూ మానవోద్ధరణ గావింపుమని నారదుడు ఆదేశించాడు. తరువాత శుకదేవుడు, శౌనకాది మహర్షులు, సూతుడూ హరికథా రూపకమైన భాగవతాన్ని భారతదేశం అంతటా ప్రచారం చేశారని పాతూరి ప్రసన్నంగారు 1965 ఫిబ్రవరి 'నాట్యకళ' సంచికలో వివరించారు.

## రంగస్థలము, రంగైన ప్రదర్శనం:

హరికథ ప్రదర్శనాలు రాత్రిపూటే జరుగుతూ వుంటాయి. ఇవి ముఖ్యంగా, గణపతి నవరాత్రులు, దసరా, కృష్ణజయంతి, ముక్కోటి ఏకాదశి, సంక్రాంతి పర్వ దినాలలో విరివిగా జరుగుతూ వుంటాయి. ఈ ప్రదర్శనానికి ఖర్చు చాలా తక్కువ. ఒకేనాటి ప్రదర్శనమైతే, గ్రామం మధ్య పెద్ద బజారులోగాని, విశాలమైన మైదానంలోగాని ఒక చిన్న పందిరివేసి, పందిరిలో ఎత్తైన దిబ్బనుగాని, చెక్కలతో చిన్న ప్లేజిని నిర్మించిగాని రెండు ప్రక్కలా కాంతివంతమైన పెట్రోమాక్సు లైట్లను అమరుస్తారు. ఆరుబైట ప్రేక్షకులు కూర్చుంటారు. అదే కథ ఒక నెల రోజులు చెప్పవలసివస్తే ఒక పెద్ద పందిరివేసి దానిని చక్కగా అలంకరిస్తారు.

## సన్మానాలూ, సత్కారాలూ:

ఒకే రోజు కథకైతే, ఏదో ఒక పారితోషికాన్ని హరిదాసుకు ముట్టజెపుతారు. అదే నెలరోజుల కథైతే నెలరోజులూ కథలు జరిగిన తరువాత హరిదాసు ఇంటింటికీ వెళ్ళి ప్రతివారినీ కలుసుకుంటాడు. నెలరోజులపాటు మదులకు నెమ్మదిగా హరి కథను విని ముగ్ధులైన ప్రజలు భక్తిప్రపత్తులతో దాసుగారిని గౌరవించి ఎవరికి తోచింది వారు సమర్పిస్తారు. ఇలా హరిదాసు మొత్తంమీద అందరివద్దాచేరి ఎక్కువ మొత్తాన్ని వసూలు చేసుకుని సంతృప్తిగా వెళ్ళిపోతాడు. ఈ విధంగా గ్రామ గ్రామాలు తిరిగి హరిదాసులు కార్యక్రమా లిస్తూవుంటారు. మరికొందరు ప్రతి సంవత్సరమూ వార్షికంగా ఆయా ప్రదేశాల్లో ఈ కథలు చెపుతూ ఉంటారు.

సినిమా, నాటకం అభివృద్ధికాక పూర్వం గ్రామాల్లో ఇతర జానపద కళా రూపాలతోపాటు ఎక్కువ ప్రజాదరణను పొందిన కళారూపాల్లో హరికథ చాలా ముఖ్యమైంది. ఏది ఏమైనా ఆనాటినుంచి ఈనాటివరకూ శిథిలం కాకుండా నానాటికీ క్రొత్తరూపును సంతరించుకున్న కళారూపం హరికథ.

ఈ హరికథను అత్యంత ఉత్తమ కళారూపంగా తీర్చిదిద్ది దానికొక గౌరవాన్నీ, విశిష్టతనూ చేకూర్చినవారు ఆదిభట్ల నారాయణదాసుగారు. ఆయన ఎన్నో హరికథలు రచించారు. ఎంతోమంది ఉద్దండులైన శిష్య ప్రశిష్యుల్ని తయారుచేశారు.

## ఇంటా బయటా ఇంచక్కని పేరు పొందిన ఆదిభట్ల నారాయణదాసు :

ఆదిభట్ల నారాయణదాసు 1864 వ సం.రం శ్రీకాకుళం జిల్లా బొబ్బిలి తాలూకాలో సువర్ణముఖీ తీరంలో ఉన్న అజ్జాడ గ్రామంలో జన్మించారు. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. తల్లి నరసమాంబ. తండ్రి వేంకటచయనులు. చిన్ననాడే తల్లి ద్వారా భాగవతాన్ని విని ఆధ్యాత్మికతత్వాన్ని జీర్ణించు కున్నారు. తండ్రిద్వారా పాండిత్యాన్నీ, కవిత్వాన్నీ నేర్చుకున్నారు. నారాయణదాసుగారు స్వయంకృషి వలన సకలవిద్యల్నీ అపారజ్ఞానాన్నీ సంపాదించారు.



ఆటపాటల మేటి
ఆదిభట్ల నారాయణదాసు

దాసుగారు బొబ్బిలి వాస్తవ్యుడైన వాసా సాంబయ్యవద్ద కొంతకాలం వీణ నేర్చుకున్నారు. తరువాత విజయనగరం మహారాజావారి కాలేజీలో యఫ్. ఏ. వరకూ చదివి తరువాత ఆంగ్ల విద్యకు స్వస్తి చెప్పారు.

దాసుగారు ప్రప్రథమంగా యక్షగానాలను. తరువాత హరికథా ప్రబంధాలను రచించారు. షేక్స్‌పియర్, కాళిదాసు గ్రంథాలను అనువాదం చేశారు. వీణా వాదన లోనూ, నృత్య సంగీతాల్లోనూ అసమానమైన ప్రజ్ఞను సంపాదించారు. లయలో ఈయన సామర్థ్యం సాటిలేనిది. చల్లపల్లి జమీందారుగారిచే గజయాన, గండపెండేర సత్కారాన్ని పొందారు.

## దర్బారుల్లో దర్జాగా సన్మానాలు :

పిఠాపురం, ఏలూరు, విజయవాడ, బళ్లారి, మద్రాసు నగరాల్లో హరికథ ప్రదర్శనాల నిస్తూ అనేక సంస్థానాల్లో సత్కారాల నందుకున్నారు. బెంగుళూరులో తన హరికతా కథన ప్రజ్ఞను ప్రదర్శించి మైసూరు మహారాజా దర్బారున కాహ్వానింప బడి గొప్ప సన్మానాన్ని పొందారు.

ఈ విధంగా అన్యప్రాంతాల్లో సన్మానాల నందుకున్న దాసుగారి కీర్తిని గుర్తించి ఆనంద గజపతి మహారాజు దాసుగారిని ఆహ్వానించి దర్బారు పండితుణ్ణిగా చేశారు. ఆనంద గజపతి మరణానంతరం దాసు మరల ఆంధ్రదేశ మంతటా హరికథ ప్రదర్శనా లిచ్చారు.

1919 వ సంవత్సరంలో ఆనాటి విజయనగర సంస్థానాధీశ్వరుడు శ్రీ విజయ రామ గణపతి సంగీత పాఠశాల నొకదానిని స్థాపించి దానికి ఈయనను అధ్యక్షులుగా నియమించారు. ఈ పదవిలో ఆయన 17 సంవత్సరాలు పని చేశారు. 1936 లో ఉద్యోగాన్ని వదలివేశారు. వృద్ధాప్యం వచ్చే కొద్దీ కథలను తగ్గించి అనేకమంది శిష్యుల్ని తయారుచేసి ఆంధ్రదేశ హరికథా పితామహు డనిపించుకున్నారు. 1945 సంవత్సరం జనవరి 2 వ తేదీన మరణించారు.

## శిష్యులూ, ప్రశిష్యులూ :

80 సంవత్సరాలు జీవించారు. వీరి శిష్యులైనవారు నారాయణదాసు సాంప్ర దాయాన్ని అపారంగా ప్రచారం చేశారు. వీరేగాక, పాణ్యం సీతారామ భాగవతార్,

పత్రాయని సీతారామశాస్త్రి, ప్రయాగ సంగయ్య, బాలాజీదాసు, కోసూరి భోగలింగ దాసు, తంపిళ్ళ సత్యనారాయణ, ఎరుకయ్య మొదలైన మహామహు లెందరో ఆంధ్ర దేశంలో హరికథా గానాన్ని ప్రచారం చేశారు.

## ప్రసిద్ధ హరిదాసులు :

పై వారే గాక, వర్ధమాని నరసింహదాసు, ఉమాకాంతదాసు, బాలబ్రహ్మానంద దాసు, బులుసుపాటి వెంకటప్పయ్య, బెజవాడ లింగమూర్తి, భమిడిపాటి వెంకట రమణ, చిట్టిమళ్ళ రంగయ్యదాసు, శనగవరపు లింగమూర్తి శర్మ, పెద్దింటి సూర్య నారాయణ దీక్షితదాసు, పాతూరి మధుసూదనరావు, చొప్పల్లి సూర్యనారాయణ భాగ వతార్, మహావాది వెంకటప్పయ్య, కోసూరి పున్నయ్య కొండపల్లి కల్యాణదాసు, మైనంపాటి నరసింగరావు, కడలి వీరదాసు, శ్రీమతి ఆర్. దుర్గాంబ, మహేంద్ర వాడ కామేశ్వరరావు, పిల్లలమఱ్ఱి రామదాసు, ములుకుట్ల సదాశివశాస్త్రి, రాజశేఖరుని లక్ష్మీపతిరావు, పొడుగు పాండురంగదాసు, తాతిన సీతారామయ్య, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి, శ్రీమతి యస్. రాజకుమారి చౌదరి, నవుడూరి విశ్వనాథశాస్త్రి, పొట్లూరి వెంకటరామయ్య, ముట్నూరి సూర్యనారాయణశాస్త్రి, బంకుపల్లి సింహాచల భాగవతార్, చిట్యాల ఆంజనేయ భాగవతార్, శ్రీమతి బేబిరాణి, బసవలింగం, అమ్ముల విశ్వనాథం, కోట సచ్చిదానందశాస్త్రి మొదలైన ప్రసిద్ధ హరికథకులు నారాయణదాసు లాంటి పెద్దల బాటల్లో నడిచి హరికథ కళను ప్రచారం చేశారు.

## మరపురాని మరి కొందరు హరిదాసులు :

ఈనాడు ఆంధ్రదేశంలో హరికథగానకళ విస్తృతంగా వ్యాపించి ప్రజల నెంతగానో ఆకర్షిస్తూంది. రాష్ట్ర వ్యాపితంగా ఈ కళను ఈ క్రింద ఉదహరించిన ఎంతోమంది కళారాధకులు ప్రచారం చేస్తున్నారు. మిక్కిలినేని పరంధామయ్య (కోలవెన్ను), ఘట్టి శేషాద్రి (రేలంగి), చదలవాడ వెంక ట్రాయుడు (భీమవరం), పీర్ల రామచంద్రయ్య (తణుకు), చిట్యాల పార్థసారథి (తాడేపల్లిగూడెం), అన్నమనీడి బాలకృష్ణ (రామచంద్రపురం), మట్టా వజ్రశేఖర్ (వుప్పాకపాడు), గూనపల్లి తాతారావు (రామచంద్ర



పురం), సుంకర నరసింహారావు (కొమరగిరిపట్నం), కొనకళ్ళ చినవెంకన్న (రావులపర్రు), బద్దిరెడ్డి సుబ్బారావు (సుందరపల్లి), అయినం అప్పలదాసు (తాడేపల్లిగూడెం), తాడేపల్లి వరలక్ష్మి (తెనాలి), ముట్నూరి కుటుంబరావు



(పెదకళ్ళేపల్లి), వాజపేయాజుల రామనాథశాస్త్రి (వుంగుటూరు), యాళ్ళబండి శారద (తాడేపల్లిగూడెం), ఆత్మకూరు గురుబ్రహ్మగుప్త (పిడుగురాళ్ళ), వంగ కోలా సుబ్బారావు (చెన్నయ్యపాలెం), తిరునగరి సత్యవాణి (తెనాలి), కోట సుబ్బా

రావు (కొండయ్యపాలెం), శీలం నారాయణదాసు (నర్సాపురం), గిడుతూరి మాణిక్యాంబ (పత్తేపురం), బృందావనం రంగాచార్యులు (తాడేపల్లి), రాయపూడి సాంబశివరావు (చావలి), నడింపల్లి నారాయణరాజు (ఉండి), వేపూరి పోతరాజు (కోనేటిపురం), గూడవల్లి సూర్యనారాయణ (రామచంద్రపురం), శీలం గంగరాజు (పెనుగొండ), తిరువాయిపాటి రామారావు (తెనాలి), పర్చూరి అప్పయ్య చౌదరి (గోలమూడి), మద్దుల కోటేశ్వరగుప్త (పాలకొల్లు), సిగిడి సూర్యారావు (ఉండి), వీరగంధం వెంకటసుబ్బారావు (తెనాలి), జి. వి. శివయ్యదాసు (పెడన), మెట్ట బలరామమూర్తి (ఉండి), అవుతు సోమారెడ్డి (చినపరిమి), అక్కిపెద్ది శ్రీరామశర్మ (విజయవాడ), వంకా వెంకట్రామయ్య (తణుకు), సజ్జల చిన ఓబులరెడ్డి (కావ్పోలు), తమ్మిరిసి హనుమంతరావు (త్యాజంపూడి), కంచర్ల బాలకృష్ణదాసు (తా॥ గూడెం), తాడాల వెంకటరత్నం (పొలమూరు), కాపవరపు పాపారావు (పెదమెరం), మెట్టా వెంకటేశ్వరరావు (కైకరం), కన్నేపల్లి నీలకంఠశాస్త్రి (ఉండి), నంద్యాలరాయుడు (తా॥గూడెం), నడింపల్లి విశ్వనాథశాస్త్రి (గరికిపర్రు) బాసంశెట్టి మల్లయ్య (మాముడూరు), బి. సింహాచలం (పెరమరం), ములుకుట్ల సీతారామశాస్త్రి (తా॥గూడెం) తాడాల నరసింహస్వామి, పొలమూరు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి (తణుకు), కాజన విశ్వరూపాచారి (శిరిపురం), ఆకురాతి నాగేంద్రం (పెడన), పృథివి బసవ శంకరయ్య (పెడన), జోశ్యుల సత్యనారాయణ (శినలి) ఖండవల్లి తారకరామం (ఎదురులంక, యానాం), ముదపాక మల్లేశ్వరరావు (భీమవరం), కల్లే బాలకృష్ణదాసు (విజయవాడ), అంబటిపూడి శివరామకృష్ణమూర్తి (విజయవాడ), శంభాన రామారావు (వేలపర్ల), డి. జ్యోతిర్మయాంబ (ఏలూరు), గోవర్ధనం వెంకటాచార్యులు (కేశవరం), పంచాగ్నుల విశ్వనాథశర్మ (సికిందరాబాదు), షణ్ముఖి లోకనాథరాజు (భీమవరం), పట్నాల వీరభద్రాచార్యులు (చాగల్లు), కోట లక్ష్మీకాంతం (వంగోలు), మల్లాది శ్రీరామమూర్తి (ఏలూరు), వడ్డి సత్యనారాయణ (కోరుకొల్లు), ఎ. పూర్ణిమ (ఏలూరు), నిడుమోలు శేషగిరిరావు (ఏలూరు), ఎ. సత్యనారాయణ (మండపేట), వి. రామమూర్తి, (ద్రోణాచలం),.... ఆదిలక్ష్మీశర్మ (ఏలూరు), బి. కాశీవిశ్వనాథ్ (గద్వాల), వేములవాడ జగన్నాథం పంతులు (తెనాలి), పెండెం ధర్మారావు (ముమ్మిడివరం), వెలదెన నరసింహమూర్తి (వరంగల్), జవ్వాజి నాగమణి (అనంతపురం), బాలసుందర భాగవతార్ (భీమవరం), బాదం బాలసుబ్రహ్మణ్య గుప్త (కాకినాడ), శేషభట్టరు భావనాచార్యులు నిడుమనూరు, (నల్లగొండ),

సలాది భాస్కరరావు (కాకినాడ), కొచ్చర్ల నల్లేశ్వరి, ముని ముని లక్ష్మి, కరకాంపల్లి, (చిత్తూరు జిల్లా). ఎ. రంగమాంబ భాగవతారిణి (తిరుపతి), నదితోక రూపకుమారి (పార్వతీపురం), తూములూరి లక్ష్మణశాస్త్రి (విజయవాడ), సి. హెచ్. లక్ష్మీనరసింహాచార్యులు ఉప్పల్, (హైదరాబాదు), తరకటూరి లక్ష్మీ రాజ్యం భాగవతారిణి (మచిలీపట్నం). మంగిపూడి వెంకటరమణమూర్తి (రాముడు వలస), ముప్పవరపు వెంకటసింహాచల భాగవతార్, (పాత గుంటూరు), వీరగంధం వేంకటసుబ్బారావు భాగవతార్ (తెనాలి), కలికివాయి విజయశ్రీ, భాగవతారిణి (తాడే పల్లిగూడెం). మహారెడ్డి శ్రీనివాసరావు (నరసన్నపేట), సంగమరాజు మణి భాగవ తార్ (సత్యవీడు), గరిమెళ్ళ సత్యవతి భాగవతారిణి (మదనపల్లి), నిడుముక్కల సాంబశివరావు, అరండల్‌పేట, (గుంటూరు), గునపల్లి సూర్యనారాయణ భాగవ తార్, నాంపల్లి, (హైదరాబాదు), పునుగు శేషయ్యశాస్త్రి, మెహిదిపట్నం. (హైదరా బాదు). వీరేకాక తూర్పుగోదావరి జిల్లాలో వాడరేవు రామారావు, పేదంభట్ల వెంకట రామయ్య, సూర్యారావు, మరువాడ రామమూర్తి, బాలాంత్రపు లలితకుమార్ మొద లైనవా రెందరో రాష్ట్రవ్యాపితంగా హరికథా గానం చేసి పేరెన్నిక గన్నారు. పైన ఉదహరించినవారిలో అనేకమంది కీర్తిశేషు లయ్యారు. మరెంతో మంది వృద్ధాప్యంతో బాధలు పడుతున్నారు.

పై నుదహరించిన హరికథా గాయకుల వివరాలను బెంగుళూరు మేలు కలయిక వ్యవస్థాపకుడు డి. ఆర్. శ్రీనివాసమూర్తిగారు నాకు అందజేసి ఎంతో సహకారం అందించారు. వారికి నా కృతజ్ఞతలు. ఇంకా మరెందరో హరికథా గాయకులు వుండవచ్చు. కావాలని ఎవరినీ విస్మరించలేదు. వారి సమాచారం నాకు అందక పోవటంవల్ల వారి పేర్లు ఉదహరించ లేక పోయినందుకు విచారిస్తున్నాను.





# అనంతపురం ఆణిముత్యం
# మెరవణి గద్య



మెరవణి అంటే వధూవరుల ఊరేగింపనీ, అనంతపురం, బళ్లారి, కర్నూలు జిల్లాల లోనూ మెరవణి అనే ఒక ప్రత్యేకమైన వేడుక వాడుకలో వుందనీ, పెళ్ళి వుత్సవానికి సంబంధించిన గద్య మెరవణి గద్య అనీ, తలంబ్రాల సంబరం తరువాత రాత్రిపూట మెరవణి బండిమీద నూతన దంపతులు ఊరేగేటప్పుడు తమకుగల చీరలూ, నగలూ పది మందికీ ప్రదర్శించటానికి ఇదొక మంచి అవకాశమనీ, ఊరేగింపులో వాద్యబృందం నాయకుడు గద్యను చదువుతాడనీ, దీనినే పొగడింపులు, పొగడింపుల గద్దె అంటారనీ, ఇలా చదివే అంగారకులకు 'ఓజు' అన్నది బిరుదు నామమనీ (తూమాటి దొణప్పగారు తమ జానపద కళాసంపదలో వివరించారు.)

## ఆడవారూ, ఆడంబరాలు :

ఉభయపక్షాల స్త్రీలకూ ఇదొక మంచి అవకాశం. బంగారు జరీపట్టు చీరలతో రెప రెపలాడుతూ, ఏడు వారాల నగల నిగనిగలతో ప్రతి ఒక అమ్మా కోవెలలోని అమ్మలాగా, మహాశిల్పి చెక్కిన జగదేకసుందరి బొమ్మలాగా ఊరేగింపులో కనిపించాలని ఉవ్విళ్ళూరుతుంటుంది. ఇంట లేకపోయినా, పొరుగింటినుంచో, పుట్టింటి నుంచో ఎరువు తెచ్చిన బరువు సొమ్ముల్ని ఒంటినిండా ధరిస్తారు.

ఊరేగింపులో రెండెడ్ల బండిని సాధారణంగా వాడతారు. కాని నేటి నాగరికత ననుసరించి టాపులేని మోటారుకారు వాడుకలోకి వచ్చింది. బండికి చేసే అలంకారాన్ని గూర్చి, ఎడ్లకు చేసే ముస్తాబును గూర్చి ఒక వ్యాసమే వ్రాయవచ్చంటారు దొణప్పగారు.

కొమ్ములకు కుప్పెలు, రంగు రంగుల ఊదా దారాల గుత్తులు, మోరకు కుచ్చుల పణకట్లు, పిచోరాలు, మెడలో రకరకాల గంటల పట్టెడలు, వీపున ఖరీదైన మొఖమల్ గౌనులు, ఇలా ఎన్నో రకాల అలంకరించిన ఎడ్లబండి మీద నట్ట

నడుమ ఎత్తైన కుర్చీలూ, కుర్చీలపైన బనారస్ తాపితాలు పరిచి వాటిపై వధూవరులు కూర్చుంటారు. పెళ్ళికొడుక్కి కుచ్చుల తలపాగా లేక రుమాలు, తలపాగాపైన కలికితురాయి బాసికం, చేతిలో పిడిబాకు, మెడలో చంద్రహారాలు, పూదండలు, ముంజేతికి కంకణాలు, సిల్కు దుస్తులు, పెళ్ళికూతురుకు పూలజడ, మేలిముసుగు, బాజుబందులు, మెడలో కాసుల పేరు, రవ్వల దుద్దులు, చెంపసరాలు, బుగ్గకాటుక బొట్టు, పాపటబిళ్ళలు, జడ కుచ్చులు, రవ్వల ఒడ్డాణం, నుదుట బాసికం, జిగేల్మని పించే బనారసు పట్టుచీరె, రవికె.



## ఊరేగింపు ఉత్సాహం :

వధూవరుల కుర్చీలకు ముందూ వెనకా బండినిండా పెళ్ళివారి పిల్లలు, బండి తోలే వాడి వేషం వేరు. బండికి ముందూ వెనుకా రెండు ప్రక్కలా పెట్రోమాక్సు లైట్లు ఎత్తిపట్టుకునే మనుషులు ఊరేగింపు ముందు భాగాన దివ్వెటీలూ, బాణాసంచా కాల్పులూ, బండికి నాలుగుప్రక్కలా ఉభయపక్షాలవారి ఆడా, మగా పెళ్ళివారి ఊరేగింపును చూడ డానికి వచ్చిన ఊరి జనం వీథుల నిండా, మేడ మిద్దెల నిండా తొడ తొక్కిడిగా ఉంటారు.

బండికి ముందు పురుషులూ, వెనుక స్త్రీలూ, నడవడం మామూలు. బండికి ముందు నడుస్తున్న పురుషుల గుంపునకు ముందు వాద్యకారుల బృందం ప్రత్యేక దుస్తులు ధరించివుంటారు. ముఖ్యమైన కూడలి స్థలాలలో బండిని ఆపినప్పుడు, మేళ నాయకుడు వధూవరుల కభిముఖంగా తిరిగి మెరవణి గద్దెను ఆశువుగా పఠిస్తాడు.

## ఆసాది, కొరిచె :

ఆసాది కొరిచె తెగలవారు వాయిద్యాలను వాయించే విద్యను నేర్చుకున్నట్లే మెరవణీ గద్యను కూడా నేర్చుకున్నారు. మెరవణి గద్య పొడిగింపు అతి సుంద

రంగా వుంటుంది. ఆ కోలాహలాన్ని చూచి ఆనందించి అనుభవించాల్సిందే గాని వర్ణించటం సాధ్యం కాదంటారు. గద్య చదివే సందర్భంలో బండిని ఆపివేస్తారు.

గద్య చదివే నాయకునికి వంతదారులు ఊతమిస్తూ, గద్యను అతి సుందరంగానూ, శ్రావ్యంగానూ పల్లిస్తూ, మధ్య మధ్య బుర్రకథలో మాదిరి భళి భళీ అనీ, బాపురే అనీ, అయ్యయ్యో సిగ్గు సిగ్గూ అనీ, గద్యకు వంత పలుకుతూ మేళనాయకునికి ఊతమిస్తారు. మేళ నాయకుడు మెడలోనూ, కుడిచేతి మణికట్టుకూ గుబాళించే మల్లెపూల దండలను ధరిస్తాడు. మంచి నిషాలో వుండి ఖుషీగా మెరవణి గద్యను పఠిస్తూ, జనాన్ని హుషారుపరిచే భంగిమల్లో ఊగిపోతుంటాడు. ఉభయపక్షాల బంధువులే కాక, ఊరి జనానికి కూడా ఇదొక ఆనందదాయకమైన వేడుక.

స్తోత్ర పాఠానికి ఉదాహరణ :

వొహెూ హెూయ్ హెూయ్
పగల రాతి గుండు పగల గొట్టగవచ్చు
కొండ లన్నిటి పిండి గొట్టవచ్చు
విశ్వదాభిరామ వినురవేమ.

అనే మాదిరి,

తూమటోళ్ళ నారణప్ప అంటే
చప్పన్నారు దేశాలలో సరదారు
ముప్పైఆరు పల్లెల్లో మంజూరు
యెక్కంగ గుఱ్ఱాలు - యేడూర్ల పెత్తనం
కుచ్చుల్ల తురాయి - పచ్చుల్ల పల్లకి
ఐదేళ్ళ కుంగరాలు - ఆస్తి కడియాలు
ఇదిగో అంటే - ఇరవైమంది
పని బడితే పాదాలకడ - పదివేల మంది
నారప్ప ముట్టింది ముత్యమై
పట్టింది బంగారమై
యెద్దు తొక్కిన భూమి
యెయిపుట్లు పండింది,

గాడి పెట్టిన తోన కనక సిరి పంట పండె
మారుగేరీ సబ్బండు జాతులు
డెబ్బైయేడు కులాలు, తగ్గినా మ్గిగినా
కంటికి రెప్పై, కాలికి చెప్పై కాపాడే
జోపానం చేసినాడు.
నారణప్ప రాకపోతే రచ్చకట్టకు రవిళి లేదు.
రాజు కచ్చేరికి రాణింపు లేదు.
నారణప్ప అంటే త్యాగదల్లి కర్ణ,
భోగదల్లి దేవేంద్ర,
సత్యదల్లి హరిశ్చంద్ర మేళగాళ్ళకు చదివిం
చిన జోడు కానుకలు దక్కెనా హొయ్ దక్కె.

నిందలూ, నిష్ఠూరాలూ :

మెరవణీ గద్యలో కేవలం స్తోత్ర పాఠాలే ఉంటాయనుకోనక్కర లేదు. నిందా పాఠాలూ వున్నాయి. అలాంటిదే మచ్చు కొకటి.

దొ హొహొయ్
చీచీచీ చీమలపుట్ట - రెక్కల్లేని కోడిపెట్ట
నీ నోట్లో పుండు బుట్ట - నిన్ను ముదిరిపెట్ట.
నీ కాళ్ళూడగొట్ట - వో హొ హొ
పెండ్లికొడుకు బావమర్ది - పేడిమూతి
పెద్దయ్యో వుండాడే - యలకను జూస్తే యదబడతాడు
పిల్లిని జూస్తే పారిపోతాడు.
పీతిరిగుంతల్లో పొర్లాడి
జలారి గుంతల్లో జలకాలాడి
చినుగుల చల్లాడం గట్టుకొని
గోనిపట్ట రుమాలు జుట్టుకొని
నల్ల గంబడి కోరి కప్పుకొని
పెండ్లి భోజనానికి వచ్చినాడు.
అదిగో ఇదిగో అని పోయినాడు.

అదే పోత; ముసురు తొట్టిలో మూల్గుతుంటాడో
దొంత కుండల్లో దొల్లుతుండాడో
బాన కడుపుతో పాకుతుండాడో
దోని కడుపుతో దోకుతుండాడో
యాడాడ వుండాడో, యెక్కడుండాడో
పెండ్లికొడుకు కింద
పెండ్లికొడుకు అన్నదమ్ముల కింద
డకోక్కలా హొూయి డకోక్కలు
బరాబరి వాహొూయి బరాబరి.

ఈ విధంగా మెరవణి గద్య సాగుతుంది. గద్దె పాఠకులు ఆ యా భావాల కనుగుణంగా హావభావాలతో పాడుతూ వుంటే ప్రేక్షకులు ముగ్ధులై వింటారట.







# గరగాచార్ల గరగనృత్యం

ప్రాచీన జానపద నృత్యాలలో ఒక ప్రత్యేక శైలిని సంతరించుకున్న నృత్యం గరగ నృత్యం. ఇది పురాతన నాట్యకళ అనవచ్చును. దీని ప్రాముఖ్యం ఆంధ్రదేశంలో తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో హెచ్చుగా కనిపిస్తుంది. దీనినే ఘట నృత్యమని పిలవటం కూడా వాడుకలో వుంది. నెత్తిపైన కుండ వుంచుకుని ప్రారంభమయ్యే ఈ నృత్యం, నాగరికత కనుగుణంగా మలచబడింది. ఈ గరగలనేవి లోహ నిర్మితమై, వాటిపై ఆదిశేషువు ఆదిగాగల చెక్కడపు బొమ్మలతో అలరారుతూ వుంటాయి. గరగ ఆకారం ఒక పూర్ణకుంభం మాదిరిగా వుంటుంది. ఈ గరగలను గ్రామదేవతలని వివిధ పేర్లతో పిలువబడే అమ్మవారి గుడులలో పదిలపర్చబడి అమ్మవారితోపాటు పూజార్హమై, జాతర సమయాలలో నెలకు ముందునుండే గర్భగుడి నుండి పైకి తీసుకువచ్చి ఆసాదులనబడేవారు ధూపసేవతో నెత్తిపై పెట్టుకుని డప్పుల వాయిద్యంతో లయబద్ధంగా నృత్యం చేస్తూ, ఆవేశపూరితంగా కాళ్ళ గజ్జెలు ఘల్లుఘల్లుమని మ్రోగుతుండగా అమ్మవారిని తన్మయత్వం చేస్తూ, చూపరులకు ఉత్సాహాన్ని కలిగిస్తూ, తెల్లవార్లూ ఈ నృత్య కార్యక్రమాన్ని అత్యంత నిష్ఠతో నిర్వ ంచటం ఒక విశేషం. ఆ తరువాత అమ్మవారి విగ్రహం దగ్గరకు గరగలను డా గర్భగుడికి చేర్చుతారు. మరికొన్ని చోట్ల ఈ గరగ నృత్యంచేసే ఆసాదులు రి నిష్టకు నిదర్శనమా అన్నట్లు కణకణమండే చింత నిప్పులపై నడుస్తూ నాట్య మాడటం కూడా గమనించవలసిన విశేషం. ఈ నిప్పుల గుండం త్రొక్కడమనే ఆచారం మహమ్మదీయుల పీర్లపండుగలో కూడా మనం చూస్తూ వుంటాం.

## అందాల అలంకారం:

అమ్మ విగ్రహాన్ని అలంకరించినట్లుగానే, చీరా, గాజులు, పసుపు కుంకుమ లతో ఈ గరగలను కూడా అలంకరించి, ఒక పూజ్య భావాన్ని గోచరింపచేస్తారు. కొన్ని కొన్ని గ్రామాలలో, తీర్థ మహోత్సవాలలో జాతర జరుపుతూ మరలా పంట జాతరగా సంవత్సరానికి రెండు జాతరలు జరుపుకుంటారు. వీరి ముఖ్యోద్దేశం గ్రామ ప్రజల సుఖ సంతోషాలకు అరిష్ట నివారణకు పిశాచ భయవిధ్వంసనానికి ముఖ్యంగా గ్రామ సంరక్షణకూ గ్రామదేవతలే మూలమని, గర్భగుడిలోని అమ్మవారి మూల విరా ట్టుకు ప్రతిరూపంగా ఈ గరగలను మాత్రమే బయటకు తెచ్చి తీర్థ జాతరలలో వినియోగించడం, ఈ గరగ దర్శనంతో అమ్మవారి దర్శనభాగ్యం కలిగినట్లు భావిం చడం ఒక నిత్య సత్యమైంది.

## శిరములపై గరగలు:

ఆయా సమయాలలో గర్భగుడినుండి బయటకు తీసుకువచ్చిన గరగలు, ఆసాదుల శిరముల నలంకరించి లయబద్ధమైన డప్పులవాయిద్యాల మధ్యతాళాని కనుగుణ్యమైన నృత్యంతో పురవీథులలో ఊరేగుతూ తమ తమ ప్రదేశాలకు రాగానే ఆసాదుల కాళ్ళకు బిందెడు నీళ్ళ అభి షేకంతో, ఫల పుష్పాలతో పాటు, చీరలూ గాజులూ, పసుపుకుంకుమలను సమర్పించు కుని అమ్మవారి సేవకు అంకితమౌతారు భక్తులు.



ఈ గరగ నృత్యాన్ని నృత్యకారు లెంత నేర్పుగా ప్రదర్శిస్తారో ఆ నేర్పుకు తగిన లయబద్ధ సహకారం డప్పులు వాయించేవారు అందిస్తూ వుంటారు. ఈ రెండు సమిష్టి కలయికలతోనూ ఈ గరగ నృత్యం ఎంతగానో శోభిల్లుతుంది. ఈ గరగలను సేవించడం ద్వారా అమ్మవారిని సేవించినట్లే భావింపబడుతుంది.

## అంకితమైన ఆసాదులు:

ప్రత్యేకించి ఈ గరగ నృత్యాన్ని వృత్తిగా స్వీకరించి, అందుకే అంకితమైనవారిని ఆసాదు లంటారు. పల్లెల ద్వారా ప్రచారం పొందిన నృత్యాలకు జానపద నృత్యాలని పిలవబడటం మూలాన ఈ గరగ నృత్యాలను కూడా జానపద కళలలో ఒక కళగా భావించవచ్చు. ఈ కళకు అంకితమైన ఈ ఆసాదు లనబడేవారు కూడా వృత్తి కళా. కారులకు చెందినవారై యున్నారు.

తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో వీరి సంఖ్య దాదాపు అయిదు వందలు. ఈ జిల్లాలలో గరగ నృత్యాల ప్రాముఖ్యతను సంతరించుకున్న కొన్ని గ్రామాల్లో వున్న గ్రామదేవతలు ''పెద్దాపురం మరిడమ్మ'', ''కాంద్రికోన నూకాలమ్మ'', ''రాజమండ్రి సోమాలమ్మ'', ''రాజానగరం ముత్యాలమ్మ'', ''తాణేలంక బలుసులమ్మ'', ''గోకవరం గుబ్బాలమ్మ'', ''మారేడు మల్లి గంగాలమ్మ'', ''జమ్మంగి పేరంటాలమ్మ'', ''మల్లిపాల శింగరమ్మ'', ''దేవీపట్నం గడిపోచమ్మ'', ''తుని తలుపులమ్మ'', ''కొత్తపల్లి నూకాలమ్మ'' ప్రసిద్ధం.

## కోనసీమ గరగలు:

అమలాపురం తాలూకా కోనసీమ ప్రాంతంలో ఈ మాదిరి దేవతలు గరగ నృత్యాల ప్రాముఖ్యంతో వున్న గ్రామాలు దాదాపు 35 వరకూ వున్నాయి. ఒరిస్సాకు చెందిన రాయగడ మజ్జి గవరమ్మ వుత్సవంలో కూడా ఈ గరగ నృత్య ప్రాముఖ్యత వుంది. అగ్ని గుండాలను తొక్కడం ద్వారా ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ఇంకా ఉభయ గోదావరి జిల్లాలలో, మరింకెన్నో గ్రామాలలో ఈ గరగ నృత్యాలు ప్రసిద్ధి చెందాయని పెంజర్ల వెంకటేశ్వర రావుగారు వివరిస్తున్నారు.

గ్రామదేవతలను నమ్ముకుని, అమ్మవారికి అంకితమై, గరగ నృత్యమే జీవనాధారంగా పేర్కొనబడిన ఆసాదులు వృత్తి కళాకారు లనడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

# గరిక ముంతలే గరగలు

ఆంధ్రదేశంలోనూ, రాయలసీమలోనూ, తెలంగాణాలోనూ, కర్నాటకలోనూ కరగ అనే పేరుతోనూ తమిళంలో కరగం అనే పేరుతోనూ, ఇతర ఆంధ్ర ప్రాంత గరికె, గరిక, గరిగ, గరిగె అనే పేర్లతోనూ ప్రచారంలో వుంది.

గరిక అంటే కుండ అని అర్థం. ద్రౌపది తన వివాహ సమయంలో ఆనందావేశంతో ప్రక్కనున్న కలశాన్ని నెత్తిన పెట్టుకుని చిందులు వేసిందనీ, ఆ విధంగా అది పవిత్రం పొందిందనీ, తెలుగు విశ్వవిద్యాలయం జానపద కళల విభాగపు లెక్చరర్ డా॥ బిట్టు వెంకటేశ్వర్లు గారు అంటున్నారు.

ఈ నాటికీ వివాహ సమయంలో అన్ని ప్రాంతాలలోనూ గరికె ముంత, గరిగె బుడ్డి (అలంకరించిన) ముంత, పెండ్లి సమయాలలో కుమ్మరి వారు అలివేణి కుండలతో పాటు ఈ గరికె ముంతను కూడ అందంగా రంగులతో చిత్రిస్తారు. దీనిని ఎంతో పవిత్రంగా చూస్తారు. గరికె ముంత లేకుండా వివాహం జరపరు. ఆ ముంతతో పూజా విధాన ముగింపుతో దానిని తాకించి, మంత్రాలు చదువుతారు.

ఈ గరిక ముంత (బుడ్డి) ను పెండ్లికి ముందురోజే కుమ్మరి ఇంటినుండి మేళతాళాలతో వెళ్ళి కుమ్మరివారికి కానుకలు చెల్లించి. ఇంటికి తెచ్చి ఒక గదిలో వుంచి, దీపారాధన చేసి పూజిస్తారు. ముందుగా ఈ గరిగెలను పూజింపటం గౌరి పూజగా భావిస్తారు. అంటే పెండ్లిండ్లలో గరిగె గౌరీమాతకు ప్రతీకగా పూజనందుకుంటుంది. వివాహ సమయంలో గరిగెను దంపతుల ముందుంచి మళ్ళ పూజచేసి. వివాహాన్ని పూర్తిచేస్తారు. వివాహం జరిగినంతసేపూ గరిగె ముంత ఎంతో ప్రాముఖ్యం వహిస్తుంది. వధువు అత్తగారింటికి వెళ్ళేముందు ఈ గరిగను వధువుతో పంపించి, పెండ్లి తరువాత కూడ దానిని పవిత్రంగా చూస్తారు. గరిగ ముంతే గరగగా మారిందంటారు.



బోనాలు :

ముఖ్యంగా క్షుద్రదేవతలైన ముత్యాలమ్మ, పోలేరమ్మ, అంకాళమ్మ, సత్తెమ్మ, మైసమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ మొదలైన దేవతలను, గరగల మాదిరే. తెలంగాణా గ్రామాలలో బోనాలు పెడతారు. ముఖ్యంగా కుమ్మరివారు. గొల్లవారు. ఈ బోనాల పూజకు గురువులుగా వుంటున్నారు. ఈ బోనాలనే రాయలసీమలో గరిగె బుడ్డి అనీ, సర్కారు ఆంధ్రదేశంలో గరగలనీ, ఘటం కుండ లనీ పిలుస్తారు.

పూజారులుగా వున్న కుమ్మరులూ, గొల్లలూ, కలిసి ఈ కుండలను తెచ్చి, అలంకారం చేసి దానికి పసుపుకొమ్ము కట్టి, కుండ మూతిచుట్టూ వేపమండలను కట్టి, తలపై పెట్టుకుని ఇంటింటికీ తిరిగి అమ్మవారికి చద్ది వసూలు చేస్తారు. పెరుగు, మజ్జిగ ఉల్లిపాయ ముక్కలతో కలిపిన చద్ది అన్నం అమ్మవారికి బోనంగా వసూలు చేస్తారు.

గ్రామంలో ప్రతి ఒక్కరూ ఈ కుండలో బోనం వేస్తారు. ఇలా చేసినందువల్ల గ్రామాలకు, కుటుంబాలకు వృద్ధి కలుగుతుందని వారి నమ్మకం. అమ్మవార్లూ, దేవతలూ అందరూ శాంతిస్తారని నమ్మకం. అమ్మవారి పూజ అయిన తరువాత ఆ కుండలలో వున్న పెరుగు అన్నాన్ని పూజారులుగా వున్నవారూ, అక్కడ పనిచేసే వారూ పంచుకుని భక్తితో ఆరగిస్తారు. ఇంటింటికీ బోనాలు తిరిగేటప్పుడు సాంబ్రాణితో ధూపం వేస్తారు. తప్పెట్లతో దరువులు వేస్తూ వుంటే బోనాలను ఎత్తుకున్న వారికి పూనకం వస్తుంది. వీర తాళ్ళతో కొట్టుకుంటారు. వెంట వున్నవారంతా ఈలలతో కేకలతో నృత్యం చేస్తూ ఆవేశంగా చిందులు త్రొక్కుతూ ఒకరిమీద మరొకరు గులాముల్నీ వసంతాలనూ చల్లుకుంటారు.

తప్పెట్ల దరువుకు అనుకూలంగా చేసే చిందుల నృత్యం ఆవేశాన్ని కలిగిస్తుంది. ఈ వుత్సవాన్ని 9 రోజులు నిర్వహిస్తారు. గ్రామదేవతలకు ప్రతీకగా గరగలు పూజ లందుకుంటాయి. ఇలా చేయటంవల్ల అమ్మవార్లు శాంతిస్తారని వారి నమ్మకం. వూరంతా తిరిగిన తర్వాత ఆ గరగలనే బోనాలను అమ్మవారికి ఎదురుగా వుంచుతారు.





# చిందులు తొక్కే
# చిందు భాగవతం



తెలుగుజాతికి గర్వ కారణమైన అన్య ప్రాంతీయులకు కూడా ఆదర్శప్రాయమైన, శాస్త్రీయ, సంప్రదాయ....జానపద నృత్య రీతులను రూపొందించి ప్రచారంలోకి తీసుకువచ్చారు ప్రాచీనాంధ్ర నృత్య శాస్త్రవేత్తలు.

పూర్వం తెలుగు నాడును .... యక్షభూమి అని పిలిచేవారు. యక్షులనే గంధర్వ జాతికి చెందినవారు. ఆడిపాడిన, భూమి కనుక వారి నృత్య శైలియే యక్షగానంగా వర్ధిల్లిందంటారు. యక్షగానం అతి ప్రాచీనమైనది. పల్లె ప్రజలకు అందుబాటులో వున్న రమణీయ కళారూపం. ఈ కళారూపాన్ని అనుసరించి నృత్య కేళిక చేయువారే చిందువారు.

ఈ నృత్యం సుమారు రెండువేల సంవత్సరాలనాటి దంటారు. నాటి నుంచి నేటిదాకా ఒక ప్రత్యేకతను సంతరించుకుని పండితుల్నీ, పామరుల్నీ తమ కళా నైపుణ్యంతో ఈ కళాకారులు మెప్పించి శభాష్ అనిపించుకున్నారు. కాని ఈ కళాకారులు ఆశించేది పట్టెడు అన్నం, పాత వస్త్రాలు మాత్రమే.

వృత్తుల ననుసరించి, జాతులు ఏర్పడినట్లే. ఆజాతులపై ఆధారపడి వారికి వినోదాన్ని చేకూరుస్తూ జీవించే మరి కొన్ని — తెగలు ఏర్పడ్డాయి.

చిందు మాదిగలు :

మన దేశంలో అతి బీదవారై, అందరికంటే ఆఖరిజాతివారిగా చూడబడే హరిజనులకు చెందిన .... మాదిగ .... వారిపై ఆధారపడి జీవించే కళాకారులు

గనుక, వీరిని చిందుమాదిగలు అని పిలుస్తూ వచ్చారు. సంఘంచే వీరు కడజాతి వారుగా చూడబడ్డారు. వీరు లక్ష్మీ ప్రసన్నులు కాకపోయినా, సరస్వతీ పుత్రులు.

తెలుగువారు ఒక విశిష్ట తెగగా ఏర్పడి తెలుగుభాష దేశభాషల్లో ప్రాముఖ్యత సంపాదించినప్పుడే వీరు కూడా ఆ జాతిలో ఒక భాగంగా జీవిస్తూ ఆటపాటల్లో దేశాన్ని అలరింప చేస్తున్నారు. ఇది వీరి కళలయొక్క ప్రాచీనత.

ఈ చిందు జోగితలు ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలోని నిజామాబాద్.... అదిలాబాద్....కరీంనగర్ మెదక్ జిల్లాల్లో నివశిస్తున్నారు. వీరు రామాయణ, భారత, భాగవత కథల్ని నృత్య నాటకాలుగా ఆడుతారు. మన ప్రాంతాల్లో పగటి వేషధారులు పగటిపూట ఎలా పగటి వేషాలను వీథుల్లో ప్రదర్శిస్తారో వీరు కూడా అదేమాదిరి. పగటిపూటే తమ ప్రదర్శనాల నిస్తారు. స్త్రీలూ పురుషులూ కూడా ప్రదర్శనాల్లో పాల్గొంటారు. బృందాలుగా ఏర్పడి ప్రదర్శనాల నిస్తారు. వీరు షుమారు ఏభై యక్షగానాల వరకూ ప్రదర్శిస్తారు. వీరి ప్రత్యేకత పాడుతూ ఆడతారు. వారికి కావలసిన అలంకరణకు సంబంధించిన, వస్తువుల్నీ, దుస్తుల్నీ వారే తయారు చేసుకుంటారు. అవి ఎంతో ప్రవీణతతో తయారుచేయబడతాయి.

జోగితలు :

చిందు జోగితలు ఇంచుమించుగా ఒకే తెగకు చెందినవారైనా, వీరిలో కొన్ని భేదాలున్నాయి. "జోగిత" అనే పదాన్ని ఒక బిరుదుగా వుపయోగించేవారు. అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి....అలంపురం జోగులాంబ పీఠం....ఆ దేవి సేవలో అంకితమై నృత్య మాడేవారు గనుక వారిని జోగులాంబలు అని పిలవటం ఆచార మైంది.

జోగులవారని పిలువబడేవారు, నృత్య నృత్తములను మాత్రమే ప్రదర్శిస్తారు. జోగు....చిందుల స్త్రీలు, నృత్తనృత్యాలతో కూడిన యక్షగానాలను ఆడతారు. జోగులవారు సుమారు ఇరవై దరువులతో ఆడతారు. ఒక్కొక్క దరువూ ఒక్కొక్క సందర్భంలో ప్రదర్శిస్తారు.

వారి ప్రదర్శనంలో, మృదంగం....తాళం....చిప్పలు....గజ్జెలు....హార్మోనియం శృతి మొదలైనవి ప్రధానంగా వాయించే వాయిద్యాలు నటులు. నేపథ్యంలో వుండి వంత పాడుతారు.

ప్రతి గ్రామంలోనూ వీరు ప్రదర్శనం ఇచ్చే సమయంలో....ఎల్లమ్మ ఆట ఆడటం వారి ప్రత్యేకత తమ జీవితాలు మోడువారి పోయినా గ్రామాలు సస్య



శ్యామలంగా వుండాలని కోరుతూ తన్మయత్వంతో ఆడతారు. ఆ ఆటవల్ల కరువు కాటకాలు రావని నమ్మే ప్రజలు ఈనాటికి నిజామాబాద్ జిల్లాల్లో అనేక గ్రామాల్లో వున్నారు.

## ప్రదర్శించే నాటకాలు :

సమాజంలోని అట్టడుగు వర్గానికి చెందిన ఈ కళాకారులు, ప్రదర్శించే నాటకాలలో ముఖ్యమైనవి, ''మోహినీ రుక్మాంగద'', ''సారంగధర'', ''చెంచు లక్ష్మి'', ''వీరాభిమన్య'', ''సుందరకాండ'', ''సతీ సావిత్రి'', ''మైరావణ'' మొదలైన నాటకాలను ప్రదర్శిస్తూ మధ్య మధ్య ప్రజల సమస్యలను సందర్భోచితంగా చొప్పిస్తూ పేద ప్రజానీకాన్ని ఆకట్టుకుంటారు.

చిందు నృత్యాన్ని ప్రదర్శించే సుమారు ఏభై దళాలు. నిజామాబాదు జిల్లాలో వున్నాయి. వంశ పారంపర్యంగా తమ పెద్దల వద్ద విద్య నభ్యసించి, ప్రజలకు వినోదాన్ని కూర్చే ఆచారాన్ని, ఆ తెగ పాటిస్తూ వుంది. ఎవరి పాటలు, పద్యాలు వారే పాడుతారు, తాళాలు వాయించడానికి మాత్రం స్త్రీలు వుంటారు. నృత్యంలో, ఆడవారికీ, మగవారికీ పెద్ద తేడా కనిపించదు.

సాధారణంగా ఈ చిందు కళాకారులు ఒకే ఒక కుటుంబానికి చెందినవారై వుంటారు. ఆ కళాకారుల బృందాన్ని మేళం అని పిలుస్తారు.



## ఆర్మూరు చిందు భాగవతులు :

ఆర్మూరు చిందు భాగవత బృందానికి సలహా సంఘ కార్యదర్శి ఎం. నారాయణరావు నాయకత్వం వహిస్తున్నారు. ఆర్మూరు నిజామాబాద్ జిల్లాలో వుంది. వీరు సారంగధర నృత్య నాటకాన్ని రసవత్తరంగా ప్రదర్శిస్తారు. అద్దాల బిళ్ళలు, బంగారు రంగు ముచ్చి రేకులు అంటించిన కిరీటాలు, అతి ప్రాచీనమైన, వివిధ రకాలైన ఆభరణాలు, ధరించే దుస్తులు కళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి. బృందంలో వున్న ప్రతి ఒక్కరూ కేవలం చిందునృత్యం తొక్కడమే కాక, అందుకు తగిన అభినయాన్ని హావభావ యుక్తంగా ప్రదర్శిస్తారు.

## చిందుల యల్లమ్మ :

ఈ బృందానికి చిందుల యల్లమ్మ ప్రత్యేక అలంకారం, ఆమె సారంగధరలో చిత్రాంగి పాత్రను ధరించి, నవరసాలనూ, నవరసభరితంగా ఒప్పిస్తూ ఆబాలగోపాలాన్ని రంజింపజేయగల ప్రసిద్ధ నటి.

ఆమె స్త్రీ పాత్రల్ని ఎంత సమర్థవంతంగా పోషిస్తుందో, పురుష పాత్రల్ని కూడా అంత సమర్థవంతంగా పోషిస్తుంది. ఈమె నటనా వైదుష్యాన్ని గుర్తించి

ఆంధ్రప్రదేశ్ నృత్య అకాడమీ అధ్యక్షులు, నటరాజ రామకృష్ణగారు అకాడమీ విశిష్ట సభ్యత్వం ఇచ్చి గౌరవించారు.

ఈ బృందంలో సారంగధర నాటకంలో రాజరాజ నరేంద్రుడుగా "చిందుల శ్యాం", సారంగధరుడుగా "చిందుల శ్రీనివాస్", చిత్రాంగిగా "చిందుల యల్లమ్మ" రత్నాంగిగా "చిందుల వెంకటరత్నం", చెలికత్తెగా "చిందుల రాజేశ్వర్."—

వీరుగాక "చిందుల గంగాధర్", "చిందుల బాబయ్య", "చిందుల నీలమ్మ, చిందుల సుశీల", "చిందుల చిన్నమ్మ" మొదలైనవారు ఉత్తమ కళాకారులు.

ఆర్మూరు భాగవతుల్లో "మృదంగాన్ని" చిందుల గోపాల్ "తాళం" చిందుల శ్రీమతి "శృతి" ఎస్. చంద్రయ్య మొదలైనవారు నిర్వహిస్తారు.

## రామకృష్ణ ఆదరణ :

అసలే తెలంగాణా వెనుకబడిన ప్రాంతం. అందులో సమాజంలో బాగా వెనుకబడి పోయినవారు వీరు, ఒక్క తెలంగాణాలో తప్ప సర్కారాంధ్రదేశంలో మరెక్కడా ఈ కళారూపం కనిపించదు. నాటకం, సినిమా, రేడియో, టీవీ, వీడియో మొదలైన అత్యాధునిక కళారూపాల తాకిడికి ఇలాంటి కళారూపాలన్నీ తట్టుకోలేక శిథిలమై పోతున్నాయి.

శిథిలమై పోయే ఈ కళారూపాన్ని బ్రతికించాలని, నటరాజ రామకృష్ణ చిందు కళాకారుల పరిస్థితిని పరిశీలించి, ఈ మహత్తర కళారూపం అంతరించిపోకుండా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గుర్తించేలా చేశారు.





# మహాత్మ్యాల తిరుపతమ్మ మల్లేలాట



అమ్మా సత్తెం చూడండీ మల్లేలా, మాయమ్మా సత్తేం చూడండీ మల్లేలా, మల్లేలా, దేవర సత్తె చూడండీ మల్లేలా, మల్లేలా అంటూ దేవర పెట్టెను నెత్తిన పెట్టుకుని నాలుగు బజార్లూ కలిసే చోట జనసమూహం మధ్య ప్రదర్శన లిచ్చేవారిని ఈ నాటికీ ఆంధ్రదేశపు పల్లెల్లో అక్కడక్కడా చూస్తూ వుంటాము.

భార్యా భర్తలైన స్త్రీ పురుషులు ఈ ప్రదర్శనాన్ని ఇస్తూ వుంటారు. స్త్రీ దేవర పెట్టెను నెత్తిన పెట్టుకుని నడుంకు కట్టుకున్న వీరణాన్ని వాయిస్తూ వుంటే, పురుషుడు కాళ్ళకు గజ్జెలు కట్టుకుని, మోకాళ్ళ క్రిందవరకూ రంగు రంగులు గల కుచ్చెళ్ళు పోసిన లంగా కట్టుకుని, జుట్టును విరబోసి, ముఖాన పెద్ద కుంకుమ బొట్టుపెట్టుకుని, చేతి దండలకు దండ కడియాలు ధరించి, చేతిలో జనపనారతో పేనబడిన పసుపు పూసిన పొడుగాటి కొరడాను చేతబట్టి, వీరణం వాయిద్యానికి అనుగుణంగా నృత్యం చేస్తూ, మధ్య మధ్యన కొరడాను ఛెళ్‌ఛెళ్ మని శబ్దం చేస్తూ చూపరులను భయ భ్రాంతుల్ని చేస్తూ, వలయాకారంగా తిరుగుతూ వికటాట్టహాసం చేస్తూ, కొరడాను తన శరీరానికి చుట్టించి, కొరడా చివరి భాగంతో దండ చేతికి గాయంచేస్తూ, రక్తాన్ని స్రవింపచేస్తూ, ఆ రక్తాన్ని పెట్టెలో నున్న దేవర ముందు తర్పణ చేస్తూ, చుట్టూ మూగిన ప్రజలను ఆశ్చర్య చకితుల్ని చేస్తూ, పెట్టెలో నున్న దేవర తనమీద ఆవహించినట్లు నటిస్తూ, ఒక అతీంద్రియ శక్తిగా భీతావహాన్ని సృష్టించి, కొద్దిసేపట్లో

తన చుట్టూ వందలాది మంది జనాన్ని మూగేలా నానాహంగామా చేస్తాడు. అందర్నీ ప్రసన్నుల్ని చేసుకుంటాడు. ఇక అప్పుడు ప్రదర్శనం ప్రారంభిస్తాడు. ఇది దేవర పెట్టెండి, పెట్టెలో అమ్మోరు సత్తెం చూడండి, అంటూ కొన్ని మాయలను చూపిస్తాడు. వేపమండలను దూసి తేళ్ళను సృష్టిస్తాడు. అమ్మవారిని అందరికీ తెరతీసి చూపిస్తాడు. బొమ్మైన అమ్మవారి చేతులు నిండా గాజు లుంటాయి. అందర్నీ చూడమంటాడు. తెరను దించేస్తాడు. భార్య వీరణాన్ని ఉధృతంగా వాయిస్తూ వుండగా తాను కొరడాతో ఛెళ్ ఛెళ్ మనిపిస్తూ పెట్టె చుట్టూ నృత్యం చేస్తూ, అమ్మోరి ముందున్న తెర ఎత్తుతాడు. అంతకు ముందు అందరూ చూసిన గాజులు మాయమైపోతాయి. ప్రేక్షకు లందరూ ఆశ్చర్యచకితులై అమ్మవారు సత్యం గలదనీ, భక్తి భావాన్ని పెంచుకుంటారు. ఇలా కొన్ని మాయలూ, మంత్రాలతో, కనికట్టు విద్యను ప్రదర్శించి, ప్రేక్షకుల నాకర్షించి, అందరివద్దా చందాలు దండుకుంటాడు. ఈ ప్రదర్శనం పగటి ప్రదర్శనం. ఈ ప్రదర్శనానికి ప్రజలు ముగ్ధులైపోతారు.





# మొక్కుబడుల గాలపు సిడి ఉత్సవాలు



గాలపు సిడి అతి ప్రాచీనమైనది. తరతరాలుగా భారతదేశంలో ఆయా రాష్ట్రాలలో ప్రసిద్ధి వహించి నటువంటిది. గాలపు సిడి వుత్సవం, జాతరలలోనూ, అమ్మవారి మొక్కుబడులలోనూ, తిరునాళ్ళలోనూ ప్రాముఖ్యం వహించినా, గాలపు సిడి వుత్సవంలో, పాడే పాటలూ, ఆడే ఆటలూ, నృత్యాలూ, సాము గరిడీలూ, వీరణ వాయిద్యాలూ, డప్పుల వాయిద్యాలూ, కొమ్ముబూరల కోలాహలం కళారూపాలను ప్రదర్శిస్తారు. ఎంతో ఆసక్తితో ప్రజలు వీటిని తిలకిస్తారు.

ఈ నాటికీ ఆంధ్రదేశంలో, సూళ్లూరుపేట మొదనైన చోట్లా, తమిళనాడులో కొన్ని చోట్లా ఈ ప్రదర్శనాలు మరో రూపంలో జరుగుతున్నాయి.

## గాలపు సిడి :

వారి వారి నమ్మకాల ప్రకారం, సిడి తిరుగుతామని మొక్కుకున్న వారికి సంబంధించింది ఈ గాలపు సిడి.

సిడి మానుకొయ్య అనేది. సిడుల జాతర కోసం, అమ్మవారో లేక వారు నమ్ముకున్న మరో దేవతో ఆ ఆలయాల ముందు నాటిన స్థంభం.

మొక్కుకున్న వారి వీపులో నుంచి ఇనుప గాలమును గుచ్చి, సిడి మాను కొయ్యకు కట్టి తిప్పేవారు. దీనిని గాలపు సిడి అనేవారు.

## గంప సిడి :

పై విధానాన్ని కొనసాగించలేనివారిని గంపలో కూర్చుండబెట్టి, అలాగే త్రిప్పే విధానాన్ని "గంప సిడి" అనేవి కూడా ఒకటి వుండేది. సిడి అంటే మొద్దు లాంటి ఈటి అని బ్రౌణ్య నిఘంటువులో ఉదాహరింపబడింది.

అంబోధరము క్రింద ననిమాడు
నైరావతియు బోలె సిడి ప్రేలెఁదెఱవయోర్తు

అని పాండురంగ మహాత్మ్యములో మూడవ అశ్వాసం, 77-వ పద్యంలో అమ్మవారి జాతరలో ఒక స్త్రీ సిడి తిరుగుటను గూర్చి వ్రాయబడి వున్నది.

బర్బోసా వివరణ :



క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో దక్షిణ హిందూదేశంలో పర్యటించిన పోర్చుగీసు చరిత్రకారుడైన బర్బోసా గ్రామ దేవతల కొలువులో జరిగే సిడిని చూపి ఇలా వర్ణించాడు.

ఈ దేశపు స్త్రీలు, దేవతల్ని కొలవడంలో అతి ఘోరమైన సాహసాలు చేస్తారని ఈ విధంగా వివరించాడు.

ఒక స్త్రీ ఏ పురుషుడినైనా ప్రేమించి అతణ్ణి పెళ్ళి చేసుకోతలచినట్లైతే, అతనిని తనకు భర్తగా ప్రసాదిస్తే తాను ముందుగా వచ్చి, ఒక గొప్ప మ్రొక్కుబడి చెల్లిస్తానని దేవతకు మ్రొక్కుకుంటుంది.

ఆమె వరించిన పురుషుడు ఆమెను వివాహమాడడానికి అంగీకరించినట్లైతే, తాను అతనిని వివాహమాడడానికి ముందుగా తన రక్తాన్ని ఫలానా దేవతకు ధార పోస్తానని తాను మ్రొక్కుకున్నాననీ ఆ మ్రొక్కు చెల్లించి రావాలనీ చెపుతుంది.

ఆ తరువాత ఆ అమ్మాయి మ్రొక్కు తీర్చడానికి ఒక సుముహూర్తాన్ని ఏర్పరుస్తారు. ఆ రోజు ఒక సిడి మ్రానును తయారుచేస్తారు.

ఒక పెద్ద మ్రానులాంటి స్తంభానికి ఏతము లాంటి ఒక వాసాన్ని కట్టి దాని చివర ఇనుప కొక్కెములాంటి రెండు గాలాలను తగిలిస్తారు.

## సిడి బండి :

ఒక పెద్ద ఏతం లాగా కనబడే ఈ విచిత్రపు యంత్రాన్ని ఒక రెండెడ్ల బండి మీదికి ఎక్కించి గుడి దగ్గరకు తోలుకొని వెళతారు. ఆ మ్రొక్కుకున్న అమ్మాయి తన బంధువులతోనూ, ఇరుగుపొరుగు వారితోనూ, బాజాభజంత్రీలతోనూ ఊరేగుతూ గుడి దగ్గరకు వస్తుంది. రకరకాల అంగళ్ళూ, ఆటగాళ్ళూ, వాయిద్యగాళ్ళూ, పాటగాళ్ళూ, నృత్యం చేసేవారూ, భజనలు చేసేవారూ, కోలాటాలు వేసేవారూ కోలాహలంగా మూగి వుంటారు.

గాలపుసిడిని ధరించే ఆ అమ్మాయి తలారా స్నానంచేసి, తల విరయబోసుకుని వుంటుంది. ఒంటిమీద కట్టుకున్న వస్త్రం తప్ప ఇతర అలంకారాలేమీ వుండవు. గుడి దగ్గర సిడిమ్రాను పెట్టి వున్న బండి దగ్గిరికి ఆవిడ రాగానే ఏతాము కొయ్యను క్రిందికి దింపుతారు. దాని చివరనున్న గాలపు కొక్కెమును ఆ అమ్మాయి వీపు చర్మానికి గ్రుచ్చి పైకి లేవనెత్తినపుడు, కండ వూడిరాకుండా, దిగివున్న గాల కొక్కెము పైభాగాన్ని ఆవిడ నడుముకు చీర చెంగును గట్టిగా బిగించి కడతారు. ఒకప్రక్క రక్తం కారుతూనే వుంటుంది .... ఆ అమ్మాయి ఎడమ చేతి కొక పొట్టి కత్తినిస్తారు. కుడిచేతిలో నిమ్మపళ్ళు వుంటాయి. ఆ తరువాత

ఆ సిడిమ్రాను కొయ్యను పైకి లేవనెత్తుతారు. దానితోపాటు ఆ అమ్మాయిని కూడా పైకి లేవనెత్తుతారు. ఈ దృశ్యాన్ని చూసిన జనసందోహమంతా జయ జయధ్వానాలు చేస్తూ అరుస్తారు. సిడిమ్రాను త్రిప్పుతూ వుంటే, ఆ అమ్మాయి గాలానికి తగులుకున్న చేపలాగా వ్రేలాడుతూ వుంటుంది. చూసేవారికి దృశ్యం చాలా భయంకరంగా వుంటుంది. ఆ అమ్మాయి మాత్రం ఎంత బాధవున్నా కిక్కురుమనదు. పైగా తన్మయత్వంతో తన చేతిలో వున్న కత్తిని అటూ ఇటూ ఝుళిపిస్తుంది. కాబోయే తన భర్తమీదికి తన చేతితోని నిమ్మకాయలను విసరుతుంది.

ఇలా కొంతసేపు ఆ సిడిమ్రాను కొయ్యను గిరగిరా త్రిప్పి, ఆ తరువాత ఆవిడను క్రిందికి దింపుతారు. ఆ రక్తపు గుడ్డలతోనే, ఆవిడ ఆ గుడిలోనికి వెళ్ళి దేవతాదర్శనం చేస్తుంది. తరువాత ఆమె గాయానికి కట్టు కడతారు. ఆ అమ్మాయి తాహతునుబట్టి, ఆ గ్రామదేవతకూ అక్కడచేరిన బ్రాహ్మణులకూ దానాలు యిస్తుంది. పేదవాళ్ళకు అన్నదానం చేస్తుంది. అక్కడికి వచ్చిన పెద్దలను సత్కరిస్తుంది. ఇలాంటి సిడుల వుత్సవాలు సాధారణంగా దుర్గ గుడిదగ్గర జరుగుతాయి. వుత్సవానంతరం మొక్కుబడి తీర్చిన ఆ అమ్మాయి ఎంతో సంతృప్తిని పొందుతుంది.

## వంగరాష్ట్రంలో :

వంగరాష్ట్రంలో (అంటే ఈనాటి బెంగాల్) దుర్గాదేవికి ప్రీతిపాత్రంగా చేసే చరత్కుపూజ యనే వుత్సవాలలో ఇలాగ సిడి తిరగటం అనాదిగా జరుగుతూ వుంది. 1823-26 మధ్య కలకత్తాలో ప్రధాన క్రైస్తవ మతాధికారిగా వున్న బిషప్‌హెబరుగారు దేశంలో తాను చూసిన విషయాలనన్నిటినీ తన దినచర్యా గ్రంథంలో ఇలా వర్ణించారు. 1824 వ సంవత్సరం ఏప్రిల్ 9 వ, తేదీన తాను చూసిన "చరత్కుపూజ" జాతరలో తాను చూసిన ఒక సిడిని వర్ణించాడు.



## ఏనుగుల వీరాస్వామయ్య :

దక్షిణ భారతదేశానికి చెందిన ఏనుగుల వీరాస్వామయ్యగారు కాలినడకను కాశీ

యాత్ర చేస్తూ ఆయన చూసిన విషయాలను గ్రంథస్థం చేశారు. ఆ గ్రంథంలో పైన హెబరుగారు ఉదహరించిన "చరత్కుపూజా భానుపౌడా" అనే ఉత్సవ సందర్భంలో సిడులాడడం తాను చూసినట్లు తమ కాశీయాత్రలో వుదహరించారు.

### ఈనాటికీ తమిళనాడులో :

ఈనాటికీ తమిళనాడులో ఆయా జిల్లాలలో ఇలాంటి గాలపు సిడి అక్కడక్కడ జరుగుతూనే వుంది. అయితే అధికారులు దీనిని నిషేధిస్తూ వుంటారు.

ఈనాడు గాలపుసిడి మార్పు చెందింది. చేతిలో కత్తి వున్న ఒక కొయ్య బొమ్మను తయారుచేసి రంగురంగుల హంగులతో అలంకరించి, అమ్మవారి తీర్థాల సమయంలో ఊరేగిస్తారు.

సిరిబొమ్మ తీర్థం పేరిట పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురంలో సంక్రాంతి పండుగ దినాలలో అమ్మవారి గుడి యెదుట అయిదు రోజులు ఆడిస్తారు. కొయ్య బొమ్మను త్రిప్పుతూవుంటే చూసే ప్రజలు బొమ్మమీదికి అరటిపళ్ళను విసురుతారు.

### సిడి బండి, సుడి బండి :

నా చిన్నతనంలో సిడి వుత్సవాన్ని సుడిబండి వుత్సవంగా కృష్ణా జిల్లా వుయ్యూరు వీరమ్మ తిరునాళ్ళలో చూశాను. సుడిబండి అంటే ఎడ్లు లేకుండా మనుషులే బండి వెనుకప్రక్కను అదిమిపట్టి ముందు పోలును పైకి ఎత్తేవారు. ఇలా ఎత్తడాన్ని సుడివేయడమనేవారు. పైకి ఎత్తబడిన ముందుప్రక్క పోలులుకు ఒక తట్టను కట్టి, ఆ తట్టలో మ్రొక్కుకున్నవారిని కూర్చోపెట్టి మనుషులే ఆ బండిని వూరంతా త్రిప్పి చివరికి గుడిచుట్టూ త్రిప్పేవారు. ఈ సమయంలో, పండ్లూ పూలూ ఆ బండిమీద విసిరేవారు. వాద్యకాండ్రు వీరంగంవేస్తే ప్రేక్షకులు అందుకు అనుగుణంగా నృత్యం చేసేవారు. ఈ దృశ్యాన్ని ప్రజలు విరగబడి చూసేవారు.





# రాయలసీమ కళారూపం జట్టి జాము

ధనుర్మాసపు నెల రోజుల్లో సంక్రాంతి పండుగల్లో ప్రతి ఇంటిముందూ రంగు రంగుల రంగవల్లులను అలంకరించి ఆ ముగ్గుల మధ్య పసుపూ కుంకుమా పూలతో అలంకరించి వాటిపై పేడముద్దలతో చేసిన గొబ్బెమ్మలు పెట్టి పండుగ సమయాల్లో పది మంది యువతులు చేరి, గొబ్బియ్యలో, గొబ్బియ్యలో అంటూ గుండ్రంగా తిరుగుతూ, పాట పాడుతూ చప్పట్లు చరుస్తూ ఒంగుతూ లేస్తూ నృత్యం చేస్తారు. ఇది సహజంగా సర్కారు ప్రాంతంలో వున్న పద్ధతి.

ఇలాంటిదే గుజరాత్‌లోనూ, మహారాష్ట్రలోనూ, గర్బా నృత్యం అనేది వుంది. అదే గొబ్బి నృత్యం కావచ్చనీ ''లాలీగర్బా అనే ప్రభేదమే'' జట్టి జామును పోలే నృత్యమనీ, జట్టి జాము గురించి, ఆచార్య తూమాటి దొణప్పగారు వారి జానపద కళాసంపద 190 పేజీలో ఉదహరించారు.

## జట్టి జాము అంటే? :

పై ఉదాహరణలకు సంబంధించే ఈ జట్టి జామంటే అది తాళ ప్రధాన కళ అనీ, గొబ్బిలోలాగా ఈ కళారూపంలో గుండ్రంగా చుట్టి రావటం వుండదనీ కోలాటంలో మాదిరి చేతిలో కోలలుగానీ, చెమ్మచెక్కలో మాదిరి గెంతడంగానీ వుండదనీ, కాలు కదపకుండానే వున్నవాళ్ళు వున్నచోటే వుండి జట్టి జాము చేయ వచ్చంటారు దొణప్పగారు.

జట్టి జాములో చేతులు చరచటం, అంటే చప్పట్లు లాంటివి వుంటాయి. నిటారుగా నిలబడి ఉభయ పార్శ్వాల్లో ఉద్దిక త్తెలతో ఒద్దికలు చెడకుండ ఒకసారి కుడిప్రక్కకూ, ఆ వెంటనే ఎడమప్రక్కకూ పార్శ్వముఖ భంగిమలో ఓరగా తిరిగి ఆయావేపుల వుండేవారి అరచేతుల్ని తన చేతులతో తట్టుతూ పాడుతూ ప్రదర్శించేది జట్టిజాము.

## స్త్రీల కళారూపం :

ఇది పూర్తిగా స్త్రీలకు సంబంధించిన ఆట. ప్రప్రథమంలో చేతికోలల్ని ఉపయోగించినట్లు ఊహించవచ్చు. సంస్కృతంలో చేతికోలలని అర్థమిచ్చే ''యష్టి'' ప్రాకృతంలో జామ అంటారనీ అందుకు ఉదాహరణగా, జట్టి జాము పాటల్లో ''వెన్నెలాయలో .... వెన్నిదాయలో'' వెన్నిటీ అనే పాదాలుంటాయనీ ఆర్వీయస్ సుందరంగారు జానపద విజ్ఞానంలో వివరించారు.

జట్టి జామును, చైత్ర వైశాఖ కార్తీక మార్గశిరాలు ఈ పాటలకు ఋతువులు జట్టి జాములో నలుగురుగాని, అంతకు ఎక్కువైతే సరిసంఖ్యలలోగాని పాల్గొంటారు. వీరు రెండు జట్లుగా వుంటారు. ఒక జట్టువారు పాటలో ఒక పాదాన్ని పాడితే, రెండవ జట్టువారు వంత పాడుతూ వుంటారు ''తుమ్మెదా'' ''నడియలో'' వెన్నిటీ, రామరామా, కోదండరామా వంటి పల్లవులు జట్టి జాములో కనిపిస్తాయి. జట్టి జామనే పేరు గల ఈ కళారూపం ఈ పేరున ఆంధ్రదేశంలో మరెక్కడా కనిపించదు.

## నలుగురూ చేరి నవ్వుకుంటారు :

రాయలసీమ పల్లెల్లో ఈ జట్టి జాము వేయాలని నిర్ణయించుకున్న రోజున అమ్మలక్కలు వెంట వెంటనే వంటలను ముగించుకుని, ఇంటిలో అందరికీ అన్నం పెట్టి, పిల్లల్ని నిద్రపుచ్చి నలుగురూ ఒకేచోట చేరతారు. అందరికీ అనుకూలంగా వుండే వారింటి ముందు ఇలా స్త్రీలందరు చేరితే అదొక అలంకారం. ఇంటి పనుల్లో సతమతమైపోయి, ఆ కాసేపూ వాటన్నిటినీ మరిచిపోయి, సంసారంలో వున్న చిక్కుల్నీ, చిరాకుల్నీ పారద్రోలి అందరూ హాయిగా గడుపుతారు.

చైత్ర వైశాఖ మాసాల్లోనూ, కార్తీక మార్గశిర మాసాల్లోనూ, ఈ పాటలు పాడుకోవటానికి అనువైన ఋతువులు, పొద్దుకూకిన తరువాత నాలుగైదు ఘడియల

వేళనుంచి, సరిపొద్దు మీరే దాకా జట్టి జాము లేస్తారు. చిన్నతనం నుంచీ అమ్మమ్మల ద్వారా, అమ్మల ద్వారా విన్న పాటలు అందరికీ కంఠోపాఠమై లయబద్ధంగా సాగి అహ్లాదాన్ని కలిగిస్తాయి. ఈ ఆటలో పాల్గొనేవారు నలుగురు గానీ అంతకు మించి సరిసంఖ్యలో గాని ఉంటారు. సరిసంఖ్యలో నున్న వారొక జట్టైతే, బేసిసంఖ్యలో ఉన్నవారందరూ ఒక జట్టు. ఇరు జట్టులవారూ కలిసి గుండ్రంగా నిలబడతారు. మిగిలిన వారంతా ప్రేక్షకులుగా నిలబడతారు. ఒక జట్టువారు ఒక పాదాన్ని పాడితే రెండవ జట్టువారు వంత పాడతారు. ప్రతి సారీ పూర్వపాదాన్ని తిప్పి తిప్పి పాడుతారు. అన్ని పాదాల్నీ అలాగే పాడి. పాదాంతంలో చివర "తుమ్మెదా, నడియలో, వెన్నిదాయలో, వెన్నిలాయలో, రామరామా కోదండరామా, రామాంజనా స్వామి, శ్రీరామ నారాయణా" అని కంఠాలు కలుపుతారు.

## ప్రేమ కలాపాలు :

ఈ పాటల్లో, కథలూ. గాథలూ, ప్రేయసీ ప్రియుల ప్రేమ కలాపాలూ మొదలైన సాంఘిక గాథలూ, పౌరాణిక చారిత్రిక గాథలూ వుంటాయి. అందుకు అనుకూలంగా దొణప్పగారు ఎన్నో గాథల్ని పాటలరూపంలో చెప్పారు. ఉదాహరణకు ఈ చిన్న సన్నివేశం వినండి.

ఎక్కడికో దూరదేశానికి పోయిన తన భర్త తలవని తలంపుగా తిరిగి వచ్చిన సంగతి తెలుసుకుని ఆ మధురానుభూతిలో ప్రొద్దు తెలియలేదు. ఆమె తోడి కోడలు ఆమె కంటే ముందే మేలుకుని, రాజనాలువంచుతూ వుంది. తల ఎత్తి చూసేసరికి తోడికోడలు వరుసకు చెల్లెలు కన్నులకు కాటుకా, కొప్పున పూలూ, చెక్కిళ్ళకు గంధమూ చూసిన అక్కకి ఆశ్చర్యమేసింది.



భర్త ఊరిలో లేని సమయంలో ఇల్లాలు అలంకారాలు ఏమీలేక, అర్ధ వస్త్రలతో వెళ్ళబుచ్చవలసిన సతికీ ఈ సింగారింపేమిటి? అన్నట్లు చూసిన పెద్ద కోడలికి మఱది వచ్చిన వార్త ఈ విధంగా తెలిపింది.

అద్దమ్మరాతిరేళ నిద్రాపొద్దమ్మా॥
పాపిష్టి సెందురుడు పట్టపగలయ్యె॥
॥శ్రీరామా రామ శరణయ్య॥

దురుదేవి సుక్కలు గక్కన్న మునిగె॥
దిగ్గా బగ్గన్న లేచి దియ్య ముట్టించె॥
అది దొంతి ఇది దొంతి నడి మీదె దొంతి
నడి దొంతి రాజనమే సేటాకు బోసే
సేటాతో రాజనాల్ రోటికి బోసే

చేడెలిద్దరు గూడి చెరిగి దంచంగ
పణతు లిద్దరు గూడి పాడి దంచంగ
కాంతారొ నీ కండ్ల కాటుకెక్కడిదీ
సెక్కులకు గంధమ్ము ఎక్కడిదె చేడి
కొమ్మరో కొప్పూన పూలెక్కడీవె
మాపటికి మీ మరది వచ్చిండె నక్కా
రాతిరికి మీ మరది వచ్చిండె నక్కా
సుళ్ళయితే నా మాట సూసిరావమ్మ
పట్టె మంచంమీద పండినాడమ్మ.

అవి వివరించింది. అలాగే మరో ఉదాహరణ: అనంతపురం జిల్లాలో పెన్నా నదీ తీరంలో వున్న జరుట్ల సుప్రసిద్ధ శైవక్షేత్రం. దీనికి దక్షిణ కాశీ అనే పేరు కూడా వుంది. జరుట్ల రామలింగేశ్వరుడు క్రింది పాటలో నాయకుడు నాయిక ఎవరో అజ్ఞాత యువతి.

మారుట్ల పొలమూలోన
జారుట్ల రాముడూ, జారుట్ల రాముడూ
పట్టే మంచం పానుపుమింద పూజలు గొన్నాడే
మిట్ట మధ్యాన్నవేళ
నట్టింట నాది కొంగు, నట్టింట నాది కొంగు
పట్టవద్దుర నాది కొంగూ పాదెం బట్టేనూ
పడమట నాది ఇల్లు

పక్కన్న నీళ్ళు బారు, పక్కన్న నీళ్ళు బారు
కంచుదే బోర తల్పులు కదల వోరన్నా
నీ యింటి నా యింటి నడుమా
నిమ్మ కొమ్మ నీడ నుండు
సరనమైన జాజీ తోటా సంపంగి వనమే
వచ్చేకి మనసుంటె
నిమ్మ కొమ్మ నీడ నుంటా
మాటు మణిగినంకరావొ
జారుట్ల రామా''



ఇలా సాగుతుంది జట్టి జాము పాట.

## మరో పిల్ల కథ :

ఈ పిల్ల యెవరో బట్ల బయకారి హంసవింశతి, శుక సప్తతి కథలలోని జగ త్తాగలకు జాణతనము నేర్పగలిగిన సీతాకోక చిలుక. తేలు కుట్టిందని ఊరూ వాడ పిలిచింది. సరసుని దగ్గరకు చేరుకోవటానికి అదొక సాకు. ఈ పాట నెక్కువగా యవ్వనంతో వున్న బాలికలు పాడే పాట.

| | | | |
|---|---|---|---|
| రెడ్డొళ్ళు కుచ్చెండ్లే | ॥తుమ్మెదా॥ | తేలైన కుట్టింది | ॥తు॥ |
| యా యేల్కి కుట్టింది | ॥తు॥ | నడిమేల్కి కుట్టింది | ॥తు॥ |
| మాయమ్కి చెప్పండి | ॥తు॥ | మందైన బంపమని | ॥తు॥ |
| మాయమ్మ దెచ్చింది | ॥తు॥ | మరి మంటలాయె | ॥తు॥ |
| మామ దెచ్చిన మందు | ॥తు॥ | మరి మంటలాయె | ॥తు॥ |
| మావాళ్కి జెప్పండి | ॥తు॥ | మందైన బంపమని | ॥తు॥ |
| మగడు దెచ్చినమందు | ॥తు॥ | మరి మంటలాయె | ॥తు॥ |
| ఎదురింటి చిన్నోణ్ణి | ॥తు॥ | ఇంటికి బిలవండి | ॥తు॥ |
| మందుమంత్రమేసె | ॥తు॥ | మది నల్లనాయె | ॥తు॥ |

ఈ విధంగా రాయలసీమలో అనేక రకాల జట్టి జాము పాట లున్నాయి. ముఖ్యంగా సంసార కుటుంబాల్లో స్త్రీలు పోషించే కళా రూప మిది.



# భజనలు,
# రామ భజనలు



ఒకనాడు పల్లె ప్రజలను భక్తితో ఆనంద పారవశ్యంలో ముంచిన భజనలు. ఆంధ్ర ప్రజాజీవితంలో స్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. భజించటం, కీర్తించటం, స్తుతించటం వేదకాలం నాటి నుంచి ఈనాటి వరకూ పరిపాటైపోయింది.

## ఎన్నో భజనలు, ఎందరో భక్తులు :

కష్టదశలో నున్న మానవులు భగవంతుని స్తోత్రం చేస్తారు. కొందరు వ్యక్తిగతంగా భజన చేస్తే, మరికొందరు సమిష్టిగా చేస్తారు. కొందరు భగవంతుని స్తుతిస్తూ పాడతారు. మరికొందరు ఆడుతారు. ఇంకా కొందరు కూటంగా చేరి భజనలు చేస్తారు. భజనలను భక్తి పారవశ్యంతో చేస్తారు, అందరూ సమిష్టిగా పాడుతారు. లయబద్ధంగా తాళాలను మ్రోగిస్తారు. మరికొందరు చెక్కభజనలు చేస్తారు. కొందరు ఒక బృందంగా చేరి కోలాటాలు వేస్తారు. మరికొందరు కూర్చునే హరిభజనలు చేస్తారు. ఇంకా కొందరు జయదేవుని అష్టపదులను పురంధరదాసు కీర్తనలను, తుంగదుర్తి కృష్ణదాసు కీర్తనలనూ, నారాయణ తీర్థుల తరంగాలనూ, అన్నమాచార్య గేయాలను చిరుతలతోనూ చెక్కలతోనూ, తాళాలతోనూ, తంబురాలు పుచ్చుకునీ కాళ్ళకు గజ్జెలు కట్టుకునీ పారవశ్యంతో భజనలు చేస్తారు.

ఉదాహరణకు

హరిలో రంగహరి, హరిలో రంగహరి
కృష్ణమ్మా, గోపాల బాలకృష్ణమ్మా

భజగోవిందా, గోపాల బాలకృష్ణమ్మా
కాళ్ళకు గజ్జెలు కట్టి, వేళ్ళకుంగ్రాలు పెట్టి
పిల్లంగోరు చేతికి ఇచ్చి ... పింఛము పట్టెద -
కృష్ణమ్మా గోపాల బాలకృష్ణమ్మా॥

అంటూ చిందులు వేసి తన్మయులౌతారు. ఇంతెందుకు

పది కొంపలులేని పల్లెనైనను రామ
భజన మందిర ముండు వరలు గాత
రామ నామము భవస్తామ భంజనదివ్య -
తారక నామమై దనరు గాత, -

అని పానుగంటి వారి రచన పాదుకలో దశరథుని నోటివెంట పలికించడాన్ని బట్టి ఆంధ్రదేశంలో రామ మందిరం లేని గ్రామం లేదు. అలాగే శివాలయాది విష్ణ్వాలయాలు.

భజనల కోలాహలం :

పల్లెప్రజలు వారి వారి వ్యవసాయపు పనులు చూసుకుంటూ, విరామ సమయాల్లో యువకులు, వృద్ధులు భజనలు చేస్తూ వుంటారు. శక్తివంతులైన యువకులు నృత్యంతో కూడిన శావమూళ్ళ భజనలు అంటే తాళాల భజనలు, చెక్క భజనలు చేస్తే, వృద్ధులు కూర్చుని చేతాళాలతోనూ, చిరుతలతోనూ హరిభజనలు, పండరి భజనలు చేస్తారు. మరికొందరు కోలాటపు చిరుతలతో కోలాట నృత్యాలు భక్తి భావంతో చేస్తారు. శ్రీరామ నవమికి, దసరా పండుగకు, భజన బృందంలో వున్న వారందరూ వివిధ పాత్రలను విభజించుకుని భజన పద్ధతిలోనే నాటకాలను ప్రదర్శిస్తారు. మధ్య మధ్య పద్యాలతో, పాటలతో, సామెతలతో సున్నితమైన హాస్యంతో తెల్లవార్లూ గ్రామస్థుల్ని ఆనందపరుస్తారు.

కొన్ని బృందాలలో అందరూ ఒకే విధమైన రంగుపంచలు కట్టి, అలాగే నడుంకు కట్టులు కట్టి వలయాకారంగా తిరుగుతూ, ఎగురుతూ, గెంతుతూ భజనలు చేస్తూ వుంటే చూపరులు తన్మయులౌతారు.

## సుందరమైన అందాల భజనలు :

అందరూ కలిసి చేసే భజనలు ఎంతో సుందరంగా వుంటాయి. భజన బృందాల నృత్యం ఎంతో కష్టమైనది. వ్యాయామ ప్రదర్శనం లాంటిది. ఆవేశపర మైనది. మూర్తీభవించిన భక్తి తన్మయత్వంతో కూడినది. ప్రతి బృందంలోనూ ఇరవై ముప్ఫై మంది వరకూ సమసంఖ్యలోనే వుంటారు. అందరూ లయ తప్ప కుండా ఒకే శృతిలో తన్మయులై పాట పాడుతూ గజ్జెలు కట్టిన కాళ్ళతో నృత్యం చేస్తూ వుంటే ప్రేక్షకులందరూ ఆనందపరవశులై పోతారు.



అలాగే భక్తిభావంతో కొంతమంది ఉపవాస విధానాలతో రాత్రి తెల్లవార్లూ జాగారం చేస్తూ తరంగ నృత్యాలు చేస్తారు. ముఖ్యంగా రామదాసు కీర్తనలూ, ఎడ్ల రామదాసు కీర్తనలూ, తూము నరసింహదాసు, అల్లూరి వెంకటాద్రి స్వామి, నిష్టల ప్రకాశరావు, ఆదిభట్ల నారాయణదాసు మొదలైన గేయకర్తల పాటల్ని భజనపరు లంతా ఆలపించేవారు. ఈ భజన బృందాలు ఒక్కొక్క గ్రామంలో పోటీలు పడి రెండు బృందాలుగా ఒకరిని మించి మరొకరు గ్రామ పెద్ద బజారులో ఉధృతంగా భజనలు చేస్తారు.

## భజనల్లో భక్తి :

భజన పాటల్లో, భగవంతుణ్ణి ప్రార్థించటం, వేడుకోవటం, కష్టాలు చెప్పు కోవడం, కృతజ్ఞతాభావం ప్రకటించడం, స్తుతించటం, శ్లాఘించటం, వర్ణించటం, భక్తి ఆవేశంలో రామదాసులా తిట్టటం — కోర్కెలు నెరవేరిన భక్తులు ఆయా భజన పాటల్ని, సులభమైన శైలిలో, అందరికీ అర్థమయ్యే భాషలో వినిపిస్తూ

వుండి; పండితులూ, పామరులూ, అందరూ ఆ భజనలకు హాజరై ఆనందించి. తద్వారా ముక్తి మార్గాన్ని వెతుక్కుంటారు.

కొంతమంది వార్ధక్య దశలో, జీవితంమీద విరక్తి భావంతో, భగవంతుని పాద సన్నిధిని చేరుకోవాలనే తాపత్రయంతో, వ్యక్తిగతంగా, తులసీదాసులా, త్యాగరాజులా, పురంధరదాసులా, భక్తతుకారాంలా, భక్తజయదేవుడుగా, నామ దేవుడుగా, మీరాబాయి, సక్కుబాయి, ఆండాళ్లు, రామకృష్ణపరమహంసలా ఒక రేమిటి .... అందరూ తన్మయత్వ గీతాలాలపించి పల్లె ప్రజలను తన్మయుల్ని చేసి, వారిలో అంతరాత్మ ప్రబోధం కలిగించారు.

ఉదాహరణకు ఒక పాట :

ముఖ్యంగా అన్ని భజన పాటల్లోనూ తెలుగునాట రామునికి సంబంధించిన పాటలే్న ఎక్కువగా పాడుతారు అందుకు కారణం శ్రీరాముడు తమ స్వంత దైవమనీ భావిస్తారు. శ్రీరాముని మీద ముఖ్యంగా భద్రాది రామదాసు వ్రాసినవీ, పాడినవీ ఎన్నో ఉన్నాయి.

అదిగో భద్రాద్రి :

తరాళ రాగం, ఆదితాళం

ఇదిగో భద్రాద్రి గౌతమి అదిగో చూడండి॥

ముదముతొ సీతారామ ముదిత లక్ష్మణులు
కలిసి కొలువగా రఘుపతి యుండెడి ॥ఇదిగో॥

చారువర్ణ ప్రాకార గోపుర ద్వారములతో
సుందరమై యుండెడి ॥ఇదిగో॥

అనుపమానమై అతి సుందరమై
దనరు చక్రముగ ధగధగ మెరిసెడి ॥ఇదిగో॥

కలియుగమందున నిల వైకుంఠము
నలరుచున్నది, నయముగ మ్రొక్కెడి ॥ఇదిగో॥

శ్రీ కరముగను రామదాసుని
ప్రాకటముగ బ్రోచే ప్రభువుని వాసము ॥ఇదిగో॥



# ప్రాచీనపు పాములాటలు



నేటి పాములాటలన్నీ చూస్తూనే వున్నాం అయితే ''ముద్రారాక్షసంలో'' ''ద్వితీయాంకం''లో ప్రవేశించే పాముల వారిని గురించి ఓగేటి అచ్యుత రామశాస్త్రి గారు ''నాట్యకళ'' ''జానపదకళల ప్రత్యేక సంచికలో'' సంస్కృత నాటక సాహిత్యంలో నుంచి దీనిని ఉదహరించారు.

శ్లోకం

జానంతి తంత్ర యుక్తం యథాస్థితిం
మండల మఖిలిఖంతి
యే మంత్ర రక్షణ పరాస్తే సర్వ
నరాధి పావు పచరంతి.

ఎవరి తంత్రాలు తెలుసో, ఎవరు ఎల్లప్పుడూ మంత్ర చింతన చేస్తారో, ఎవరు మంత్రాన్ని రక్షిస్తారో వారే యిటు పాముల్ని, రాజుల్ని సేవింపగలుగుతారు.

రాజ తంత్రానికీ, పాముల మంత్రానికీ అటు రాజులకూ, ఇటు పాముల వాళ్ళకూ సరిపడేటట్లు, పెడార్థాలు వున్న ఈ శ్లోకాన్ని చదువుతూ ప్రవేశిస్తాడన్న మాట. జనం మూగుతారు. వాళ్ళు అడిగేవాటన్నిటికీ సమాధానం చెపుతాడు.

నీ వెవరవంటున్నారా? జీర్ణవిఘుడనే పాములవాణ్ణి. ఈ పుట్టలో ఏమున్న దంటున్నారా? మాకు జీవనాధారమైన పాము లున్నాయి, చూడాలని వుందా? అయితే ఇది తగిన చోటు కాదుగదా? రాక్షస మంత్రి ఇంట్లోకి రమ్మంటున్నారా? మనలాంటి వాళ్ళకు ప్రవేశం వుండదంటున్నారా? అంటూ ఇది నా వృత్తి కాబట్టి తప్పకుండా ప్రవేశముంటుంది.

ఇలా సమాధానాలు సాగిన తరువాత పాములవాడు రాక్షసమంత్రి ఇంట్లోకి ప్రవేశిస్తాడు. ద్వారపాలకుడు అడ్డగిస్తాడు. నేను రాక్షస మంత్రి ఎదుట పాములాట

ఆడాలని ఉందంటాడు. అందుకు రాక్షసమంత్రి ఒప్పుకోక ఏదైనా బహుమతిని తీసుకుని పొమ్మంటాడు. అయితే ఆ వెంటనే గ్రహిస్తాడు రాక్షసుడు. వీడు మామూలు పాములవాడు కాదనీ చాణక్యపై గూఢచారి చర్యకోసం పాములవాని వేషంలో తాను పంపిన తన అనుచరుడు. విరాధగుప్తుడని న్నూ గ్రహించి ప్రవేశం కలిగిస్తాడు. ఇలా పాములవాని కథ కంచికి పోతుంది. ఈ విధంగా సంస్కృత నాటక సాహిత్యంలో జానపద పాత్రల చిత్రణతో పాటు జానపద కళల ప్రస్తావన కూడ కనపడుతూ వుంది.





# పాములాటలూ,
# వోడీలూ



నాటినుంచీ ఈ నాటికి పల్లెటూళ్ళల్లో, పట్టణాల్లో పామును బుట్టలో పెట్టుకుని నాగస్వరం వాయిస్తూ ప్రతి ఇంటికీ తిరిగి, పాములవాళ్లు యాచిస్తూ వుండటం తెలిసిందే.

పాముల్ని పట్టటం, వాటిని ఆడించటం ప్రజలను యాచించటం, అలా జీవనం గడపడం పాములవారి వృత్తి. ఇది ఒక తెగ, వీరు దేశంలో చాలాచోట్ల కనిపిస్తారు. వీరు లిపిలేని భాషను కూడా మాట్లాడుతారు.

ఎక్కడెక్కడో పుట్టల్లో వున్న త్రాచుపాముల్ని పసికట్టి, ఉపాయంగా పట్టి వాటి పళ్ళను పీకి విషాన్ని పిండి, మూతి కుట్టి దానికి గుడ్డూ పాలు పోసి, మచ్చిక చేసి బుట్టలో పెట్టి నాగస్వరాన్ని ఊదుతూ వివిధ స్థాయిల్లో దానితో విన్యాసం చేయిస్తూ నయనానందకరంగా ఆడిస్తూ, పిల్లల్నీ పెద్దల్నీ ఆశ్చర్యచకితుల్ని చేస్తూ తద్వారా జీవనోపాధిని సాగిస్తూ వుంటారు.

పాములవాడు బుట్టలో నున్న పాము విన్యాసం చేసినట్లే తానూ ఆ వాయిద్యానికి అనుగుణంగా మెలికలు తిరిగిపోతూ నృత్యం చేస్తూ అటు పామూ, ఇటు పాములవాడూ, ఇరువురి నృత్యంతో ప్రేక్షకులు ముగ్ధులైపోయి అక్కడికక్కడే ఎవరికి తోచింది వారు వారికి ముట్టచెపుతూ వుంటారు.

ఇది ఒకప్పుడు పల్లెల్లో జానపద కళలతో పాటు ఈ పాములాటకూడా వినోద ప్రదర్శనంగా వుండేది.

## రెండు త్రాచుల విన్యాసం:

ఒక్కొక్కసారి రెండు కోడె త్రాచుల్నీ ఎదురెదురుగా వుంచి, తాను వాయిద్యంతో ఆ రెంటినీ రెచ్చగొట్టి లబ్జుగా పాముల బూర ఊదుతూ తానూ నేత్రపర్వంగా

నృత్యం చేస్తాడు. పాము కరచినట్లూ, విషం తలకెక్కినట్లూ తూలుతూ, త్రుళ్ళుతూ సొక్కిపోతూ, తన మంత్ర విద్యను ప్రవేశపెట్టి, క్రమేపీ కోలుకుని బ్రతికానన్నంత సంతోషంతో ఆనంద నృత్యం చేసి ప్రజలను తృప్తిపర్చి దండుకుంటారు.

నిజంగా పాములవాని నృత్యం నేత్ర పర్వంగానే వుంటుంది. సహజంగా చాలామంది స్వయంగా త్రాచుపాముల్ని చూడలేరు. అటువంటి తెల్లత్రాచుల్నీ, కోడె త్రాచుల్నీ, గోధుమ వన్నె త్రాచుల్నీ కష్టపడి పట్టుకొచ్చి తమ జీవనోపాధికోసం వృత్తిని సాగిస్తారు. వీరు ఒక వూరినుంచి మరో వూరికి సంచారం చేస్తూ పాముల్ని పడుతూ, పాము కాటుకు గురైన వాళ్ళకు మందులనిస్తూ జీవిత యాత్ర సాగిస్తారు.

## పోట్లీల మోడీలు :

ఈ రోజుల్లో మోడీలంటే ఎవరికీ తెలియదు. కాని ఏభై సంవత్సరాల క్రితం ఈ మోడీలు అధికంగా పల్లెప్రాంతాల్లో జరిగేవి.

ఫలానా గ్రామంలో ఫలానా రోజున మోడీ అని తెలిస్తే సరి చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు తండోపతండాలుగా వచ్చి పడేవారు. అది ఒక పెద్ద వుత్సవం గానూ, ఇరుపక్షాల మధ్యా జయాపజయాల పోరాటంగానూ సాగేది.

ఒక్కొక్కసారి గ్రామ జాతర్ల సమయంలోనూ, సంతల సమయాల్లోనూ కూడా ఈ ప్రదర్శనాలు జనరంజకంగా జరిగేవి.

ఈ మోడీలు అరవై సంవత్సరాల క్రితం పాముల నాడించే పాముల వారి ముఠాల మధ్యనే జరిగేని. ఇవి చాలా పౌరుషవంతంగా జరిగేవి. చావు బ్రతుకుల పోరాటంగా పోరాడేవారు. అయితే ఈ మోడీలను ఇతర కులస్థులైన పెద్దేటి గొల్లలు మొదలైనవారు కూడా చేసేవారని ప్రతీతి.

ఈ మోడీలకు సంబంధించినవారు ఇంద్రజాలం, హస్తలాఘవ విద్యలలో మంత్ర తంత్రాలలో ఆరితేరిన వారై వుండేవారు. ఇవి వూరి మధ్యనో, లేక విశాలమైన మైదాన ప్రదేశంలోనో ప్రజల మధ్యన జరిగేవి.

## మంత్ర ప్రయోగాలు :

ఇరు పక్షాలవారూ, ఒకరి విద్యలను మరొకరిపై ప్రయోగిస్తూ, ఒకరిని మించి మరొకరు అస్త్రాలను ఎక్కుపెట్టినట్లు ఒకర్ని మించి మరొకరు మంత్ర ప్రయోగాలు

చేస్తారు. ప్రజలు వీరు చేసే హస్తలాఘవ తాంత్రిక విద్యలకు అచ్చెరువొందే వారు.

ముఖ్యంగా వీరు నూరు గజాల దూరంలో, అటూ ఇటూ రెండు పక్షాలుగా చేరుతారు. ఇరువురూ చిన్న గుడారాలను నిర్మిస్తారు. ఆ గుడారంలో ఒక గొయ్యి తీస్తారు. ఆ గోతిలో పసుపు కుంకుమలు కలిపిన రంగు నీళ్ళు వుంచుతారు. అందులో ఒక కొబ్బరికాయ వుంచుతారు. మోడీ ప్రారంభమైన వెంటనే పాము బుర్ర వూదుతూ వచ్చి గుడారానికి ముందున్న గీతను దాటి, గుడారపు గుంటలో నున్న కొబ్బరికాయను తీసుకు వెళ్ళాలి. ఇలా తీసుకు వెళ్ళటానికి ఆ ప్రక్క నుంచి ఈ ప్రక్కకు వచ్చే వ్యక్తిని గుడారానికి దగ్గరవరకూ రానీయకుండా మంత్రాలను వల్లిస్తూ మంత్రించిన కందులను అతని మీద చల్లుతాడు, అవి కందిరీగల్లాగ కుట్టినట్లు బాధపడుతూ, అడుగు ముందుకు వేయలేడు. అప్పుడు అవతలి వ్యక్తి మరో మంత్రం చదివి, ఆ కట్టును విప్పుతాడు.



ఇలా ఒకరికొకరు మంత్రప్రయోగాలు చేసి ఎవరి మంత్ర శక్తి ఎక్కువైతే వారు చివరికి ఎదుటివారి గుడారపు గుంటలో దిగి కొబ్బరికాయ తీసి జనసమూహం మధ్యలో పగులకొట్టి ఎదుటివారిని జయించినట్లు అట్టహాసం చేస్తాడు.

## ఉత్తేజాన్ని కలిగించే వాయిద్యాలు :

ఇలా మోడీ చేసే వ్యక్తికి వత్తాసుగా నాగస్వరాలూ, డప్పుల వాయిద్యాలతో, అతనిని ఉత్తేజపర్చి విజయానికి మార్గదర్శకులౌతారు.

చూసేవారి కిది భయంకర పోరాటంలా కనిపిస్తుంది. రెండు మతాలకు చెందిన వయసు ముదిరిన పెద్దలు గంభీరమైన వేషంతో తలపాగలు ధరించి, నల్లకోటు వేసుకుని, అంగవస్త్రం పైన వేసుకుని గుడారం ముందు ఏదో శక్తి ఆవహించిన వ్యక్తుల్లా కూర్చుంటారు.

వీరు ప్రారంభంలో రూపాయలను సృష్టించటం తెల్లకాగితాన్ని రూపాయి నోటుగా మార్చటం, వేపాకులు దూసి తేళ్ళను సృష్టించటం పొడి యిసుకను నీళ్ళలో కలిపి తిరిగి పొడి ఇసుకనే తీయటం తడి బట్టమీద ముడి జొన్నలు జల్లి వాటిని పేలాలు వేగినట్లు చేయటం, పొడి మట్టిని నీళ్ళలో చల్లి దానిని రంగుగా మార్చడం, మండే నిప్పును మ్రింగటం నాలుకను కోసినట్లు చూపించటం. ఇలా ఎన్నో కనికట్టు విద్యల్ని ఒకర్ని మించి మరొకరు భయంకరంగా చేసేవారు.

మోడీని వృత్తిగా స్వీకరించి బ్రతికేవారు వంశపారంపర్యంగా ఆ కళను బహుళ ప్రచారం చేశారు. ముఖ్యంగా గ్రామపెద్దలు, పెద్దరెడ్లు, మున్సిఫ్ కరణాలు, జమీందారులు, ఊరు పెద్దల ఆమోద ముద్రతో ఈ ప్రదర్శనాలు రసవత్తరంగా జరిగేవి.

## మహమ్మదీయుల మోళీ విద్య :

మోళీ విద్యను ఒక్క పాముల జాతివారే ప్రదర్శిస్తారనుకున్నాం. కానీ ఈ విద్యను మహమ్మదీయుల్లో ఒక వర్గంవారు కూడా ఆదరించారు.

మోళీల్లో కేవలం సాహెబులు ప్రదర్శించే మోళీలు పాములవారి మోళీకి భిన్నంగావుంటుంది. ఇది మంత్రతంత్రాలతో కూడిన మాయదారి విద్యగా కనిపిస్తుంది.

## మాయలు, మ్యాజిక్కులు :

వీరు పాముల బుట్టల్లో ప్రథమంగా పాముల్ని చూపించి తరువాత బుట్టల్ని తెరిచి పాముల్లేని ఖాళీ బుట్టల్ని చూపిస్తారు.

అలాగే ఆ ఖాళీ పాముల బుట్టలో ఒక కాగితపు ముక్క వేసి బుట్ట మూసి ఛూ మహంకాళీ అంటూ బుట్టను తెరిస్తే అందులో నుంచి పడగ విప్పిన పాము ప్రత్యక్షమౌతుంది.

అలాగే ఒక ఖాళీ డబ్బాను ఒక కుర్రవాడి కాళ్ళ మధ్యను పెట్టి, కుర్రవాడి పిర్రమీద ఒక దెబ్బ కొట్టి డబ్బాలోకి రూపాయలు కురిపిస్తాడు.

చేతుల్లో వున్న రూపాయల్ని మాయం చేయడం, ఒట్టి చేతులనుండి రూపాయల్ని ప్రత్యక్షం చేయడం చేతి నున్న వుంగరాన్ని మాయంచేసి, ఆ వుంగరాన్ని ప్రేక్షకుల్లో ఒకరి చేతినుండి లాక్కోవడం ఇలా ఎన్నెన్నో వింతలు కన్నుమూసి కన్ను తెరిచేలోగా, అద్భుతాలను ప్రదర్శించి, ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతారు.



వీరు ఉరుదు భాషను ఉచ్చరిస్తూనే తెలుగు మాట్లాడుతూ, మధ్య మధ్య హాస్య ఛలోక్తులను విసరుతూ, ప్రేక్షకులను మాయలో ముంచి, ఇదంతా వారి గురువు ప్రసాద్ మహిమంటూ, చివరగా గాలికీ, ధూళికీ, ప్రేతాలకూ, పిశాచాలకూ మందుగా తాయిత్తులను అమ్ముతారు. వాటిని జనం విరగబడి కొంటారు. వాటిలో ఏదో మహాత్మ్యముందని.



ఈ మోళీ విద్యలు ఈనాడు ఎక్కడా మచ్చుకు కూడా వున్నట్లు లేదు. కాని ఒక నాడిది అద్భుతమైన అతీంద్రియ శక్తులను ప్రదర్శించే కళగాను, ప్రజలను ఆనందింపచేసే ఆసక్తికరమైన కళారూపంగానూ రూపొందింది.

# బతకమ్మ, బతకమ్మ, ఉయ్యాలో



పూర్వం చోళదేశంలో ధర్మాంగదుడనే రాజుకు ఎన్నో నోముల అనంతరం తన అర్ధాంగికి శ్రీలక్ష్మి జన్మించగా ఆమెకు ఎన్నో గండాలు వచ్చినప్పటికి బ్రతికి వందువల్ల ''బతకమ్మ'' అని పేరు పెట్టటం జరిగిందని జన శృతి వుందని జన ప్రియగారు ఒక వ్యాసంలో తెలియచేశారు.

ఈ నాటికీ తెలంగాణా ప్రాంతాల్లో బతకమ్మ అని వారి వారి బిడ్డలకు పేర్లు పెట్టుకోవడం కనబడుతుంది. ఈ పండుగయొక్క ముఖ్య ఉద్దేశం ఏమంటే, లక్ష్మీ పార్వతుల పూజలు చేయడమే, కన్నెపడుచులు నోచుకోవడం వల్ల కోరుకున్న వరుడు లభిస్తాడని నమ్మకం. ఈ బతకమ్మ పండుగ కరీంనగర్, మహబూబునగర్, వరంగల్ జిల్లాలలో ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందింది.

## ఎక్కడా లేకపోయినా! :

ఆంధ్రదేశంలో ఎక్కడా ప్రచారంలో లేకపోయినా ఒక్క తెలంగాణాలో మాత్రమే విశేష ప్రచారాన్ని పొందిన బతకమ్మ పండుగ ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి మహర్నవమి వరకు తొమ్మిది రోజులు ఈ పండుగ జరుగుతుంది.

దీని లో భాగంగా మొదటి ఎనిమిది రోజులూ, పెళ్ళికాని ఆడపిల్లలు ఆడు కుంటారు. దీనిని బొడ్డెమ్మ అంటారు. తొమ్మిదవ రోజున మాత్రం చద్దుల బతకమ్మ అంటారు.

బతకమ్మ పండుగ ఆశ్వయుజ మాసంలో రావడం వల్ల వర్ష ఋతువుతో నిండిన చెరువులు, తొణికిసలాడుతూ వుంటాయి. పండి ఒరిగిన జొన్న చేలూ, పచ్చగా పెరిగే పైరు సంపద, విరబూసిన చెట్లతో ప్రకృతి సౌందర్యమయంగా వుంటుంది.

ఈ పండుగ రోజుల్లో పుట్ట మన్నుతో ఒక బొమ్మను చేసి, బహుళ పంచమి నాడు దానిని ప్రతిష్టించి దాని పైన, ఒక కలశాన్ని వుంచి, కలశంపైన పసుపు ముద్దతో గౌరమ్మను నిలిపి పూలతోనూ, పసుపుతోను అలంకరిస్తారు. ఈ విధంగా ప్రతి ఇంటిలోనూ చేయకపోయినా, గ్రామానికి ఒక గృహంలో చేసినా సరిపో తుందని వారి అభిప్రాయం.

బొడ్డెమ్మను నిలిపిన తరువాత ఆ వాడలో వున్న ఆడపిల్లలందరూ అక్కడ గుమికూడతారు. ఈ వినోదాన్ని చూడడానికి పెద్దలందరూ వస్తారు. ఇలా ఎనిమిది రోజులూ కన్నెపడుచులు ఆడుకుంటారు.

తరువాత నవమి రోజున, కోడి కూసే సమయాన స్త్రీలు లేచి, పరిసరాలన్నీ తిరిగి రకరకాల పూలు సేకరించి గోరువెచ్చని జీడిగింజల నూనెతో తలంటి పోసుకుని నూతన వస్త్రాలు ధరించి అలికి ముగ్గులువేసిన ఇంట్లో చాపలు వేసి బతకమ్మలను పేర్చి గుమ్మడిపూవు అండాశయాన్ని తుంచి పసిడి గౌరమ్మగా పెడతారు. పసుపుతో ముద్ద గౌరమ్మనుచేసి పెట్టి అగరవత్తులు వెలిగించి పసుపు కుంకాలతో అలంకరించి పగలంతా అలాగే వుంచుతారు.

సాయంత్రం పిన్నలు, పెద్దలు, నూతన వస్త్రాలు ధరించి స్త్రీలు, వివిధ అలంకారాలను అలంకరించుకుని బతకమ్మలను చేతబట్టుకుని చెరువు కట్టకో, కాలువ గట్టుకో దేవాలయానికో వెళ్ళి, బతకమ్మలను మధ్య వుంచి, బాలికలు, కన్నెపడుచులు, స్త్రీలు వాటిచుట్టూ తిరుగుతూ చప్పట్లు చరుస్తూ, గొంతెత్తి ఒకరు పాడగా వలయాకారంగా తిరుగుతున్నవారు ఆ పాటను అనుసరిస్తూ పాడుతారు.

ఆ దృశ్యాన్ని గ్రామస్తు లందరూ చూచి ఆనందిస్తూ వుంటారు. మగపిల్లలు కొయ్య గొట్టాలలో, కాగితపు అంచులను కన్నెపిల్లలపైనా స్త్రీలపైనా ప్రయో గిస్తారు.

బతకమ్మ పాటలు, ఒకో ప్రాంతంలో ఆయా మాండలిక పదాలతో ప్రతి రణాంతంలోనూ, ఉయ్యాలో అనీ, కోల్ కోల్ అనీ, చందమామా అనీ, ·రమ్మ అనీ పదాలు పాడతారు. పాటల్లో లక్ష్మి సరస్వతుల స్తోత్రాలేగాక, అనేక పౌరాణిక గాథలైన, శశిరేఖ, సతీ అనసూయ, కృష్ణలీల, సీతాదేవి వన వాసము మొదలైనవేగాక, సారంగధర, బాలనాగమ్మకు సంబంధించిన పాటలు కూడా పాడుతూ వుంటారు.

బతకమ్మ పండుగ వస్తూందంటే తెలంగాణా పల్లెల్లో నూతన వుత్సాహం వెల్లివిరుస్తుంది. అది ఒక పెద్ద సంబరంగా భావిస్తారు. ఇళ్ళు శుభ్రపరుస్తారు. చక్కగా అలంకరించుకుంటారు. ఆడపిల్లల్ని పుట్టింటికి తీసుకువస్తారు. క్రొత్తగా పెళ్లైన ఆడపిల్లలకు అత్తగారి ఇంటినుంచి కాగితపు పూలతో చేసిన బతకమ్మను వాయనంగా పంపుతారు. అత్తగారింట్లో వుండే ప్రతి ఆడపిల్లా ఎప్పుడు కన్న వారింటికి వెళ్ళాలా? కన్నవారి పిలుపు ఎప్పుడు వస్తూందా? తనను తీసుకువెళ్ళడానికి అన్న ఇంకా రాలేదే అన్న బాధను వ్యక్తపరుస్తారు.



ఉదాహరణకు పండుగ వస్తుందంటే, ప్రియుని రాకకై ఎదురుచూపే ప్రియురాండ్లు పాడుకునే పాట —

బతకమ్మ బతకమ్మ ॥ఉయ్యాలో॥
బంగారు బతుకమ్మ ,,
నా నోము పండింది ,,
నీ నోము పండిందా ,,
మావారు వచ్చిరి ,,
మీవారు వచ్చిరా ,,

బతకమ్మలను పిల్చుకుంటూ పాడే పాట.

ఒక్కొక్క పువ్వేసి ॥చందమామ॥
ఒక్క జాము ఆయే ,,

రెండేసి పువ్వు తీసి ,,
రెండు జాము లాయె ,,

ఈ విధంగా ఎన్నో పాటలు పాడుతారు. తొమ్మిదవనాడు బొడ్డెమ్మ చర్చించి కలశంలో, ఆవాడపిల్లలు ప్రతిదినం తెచ్చిపోసే బియ్యం పరమాన్నం వండి పంచి పెట్టి ఒక బావిదరి చేరి

బొడ్డెమ్మ బొడ్డెమ్మ ... బిడ్డలెందారే
బావిల పడ్డవారికి ... వారిద్దరమ్మా
చెర్లబడ్డవారికి ... చేరిద్దరమ్మా
కుంట్లబడ్డవారికి ... కోరిద్దరమ్మా
నిద్రపో బొడ్డెమ్మ ... నిద్రబోవమ్మా
నిద్రకు నూరేండ్లు ... నీకు వెయ్యేండ్లు
నిను గన్న తల్లికి ... నిండ నూరేళ్ళు.

అంటూ బొడ్డెమ్మను నీటిలో వదులుతారు. బొడ్డెమ్మ పండుగలో పాడబడే పాటలు ఇంకా కొన్ని వందలున్నట్లు బి. రామరాజుగారు తమ జానపదగేయ సాహిత్యంలో తెలియచేశారు.





# ప్రజలకు సూక్తులు చెప్పే ఫకీరు వేషాలు



ఫకీర్లు ముస్లిం కులంలో ఒక తెగ. వీరు ముస్లిములనే యాచిస్తారు. అల్లాను సంస్మరిస్తూ, అల్లాకె నాం జపిస్తూ, ఇంటింటికీ తిరుగుతూ ముస్లిములను ఆశీర్వదిస్తారు. కళారూపాలన్నీ ప్రథమంలో ఒకందుకు ఏర్పడినా తరువాత అవి వివిధ రీతులుగా ఎలా పరిణామం చెందాయో ఈ ఫకీరు వేషాలు కూడా అంతే.

వీరు ఒక పెద్ద కంజిరాను చేతిలో ధరించి తలకు పెద్ద తలపాగా చుట్టి, మెడలో ఫకీరు పూసలను ధరించి మొలకు లుంగీలను ధరిస్తారు. ఈ వేషాల్లో అయిదారుగురు వస్తారు. ఉరుదూ యాసలో తెలుగు మాట్లాడుతారు. జీవాత్మ పరమాత్మల గురించి చెపుతూ తన్వుకీ ప్రాణాన్కీ వున్న స్నేహం గొప్పది. ఒకదాన్కీ బాధ వస్తే, మరొకదాన్కీ బాధ కల్గుతుంది. అదీ దోస్తి — అలాగే దేహాన్ని గురించి చెపుతూ, ఒక అడవికి బోయి చిల్కా తెస్తాం, పంజరంలో పెట్టి పళ్లూ పప్పులూ పెడ్తాం. అది మనల్ని నమ్మిందీకదా, అని దాన్ని నమ్మి సంతోషపడ్దాం. కాని పంజరం తెరిచీ వున్నావేళా అది ఎవరికీ చెప్పకుండా జంగిలీకి ఎగిరి పోద్ది. ఈ దేహమనే పంజరం నుంచీ జీవమనే సిల్కా హట్టాగే ఎగిరిపోద్ది. ఇలాగ లోకంలోని సామాన్య ఉపమానాలతో ఎన్నో విషయాలు చక్కగా చెపుతారు.

ప్రతి జట్టుకూ ఇద్దరు ముగ్గురు పాట పాడుతూ వుంటే, మిగిలిన ఇద్దరూ అల్లాకే నాం అని వంత పలుకుతారు.

ఉదాహరణకు

పాడిపంటల్ సల్ గుండాలి ॥అల్లాకెనాం॥
తల్లీ పిల్లల్ సల్‌గుండాలి ॥అల్లాకెనాం॥

తండ్రీ కొడుకుల్ సల్‌గుండాలి ||అల్లా||

హిందూ ముస్లింలంతా ||అల్లా||

వారు హేకం కావాలండి ||అల్లా||



అంటూ పాడుతూ, మధ్య మధ్య రక్తి కోసం కర్రతో చేయబడ్డ ఒక విధమైన కిర్రు శబ్దం వచ్చే దానిని చేతిలో ధరిస్తారు. కాలేజీ హైస్కూలు విద్యార్థులు వారి వారి స్కూలు వుత్సవాల్లో ఈ కళారూపాన్ని ప్రదర్శిస్తూ వుంటారు.

ఈ కళారూపాన్ని ఆంధ్ర ప్రజా నాట్యమండలి హిందూ ముస్లిం మత సామరస్యం కొరకు వినియోగించి ఆంధ్ర ప్రజలలో విశేషంగా ప్రచారం చేశారు.







# గొరగపడుచుల గొండ్లి నృత్యం

వీరు మైలార దేవరవీర భటులు
గొండ్లి యాడించుచున్నారు
గొరగ పడుచు నాడుచున్నది
చూడు మూర్ధాభినయము
తాను నెట్టి క శీలంత గాని లేదు (క్రీడాభిరామం)

కాకతీయుల కాలంలో గొండ్లి అనే కుండలాకార నృత్యం ద్వారా బతకమ్మ, బొడ్డెమ్మల వుత్సవాల సమయాల్లో పిల్లనగ్రోవు లూదుతూ, ఆటలు, ఆడుతూ కుండ లాకార నృత్యాలు చేసినట్లు మనకు ఆధారాలు కనిపిస్తున్నాయి. దీనిని బట్టి గొండ్లి నృత్యాలు అనాదిగా మన సంస్కృతితో సంబంధమున్నట్లు తెలుసుకోవచ్చును.

భిన్నాభిప్రాయాలు :

గొండ్లి నృత్యాన్ని గూర్చి పండితుల్లో వివిధ అభిప్రాయాలున్నట్లు నటరాజ రామకృష్ణగారు జానపద కళల ప్రత్యేక సంచికలో వివరించారు.

గొండ్లి అనేది కుండలాకారంగా చేయబడే నృత్యమనీ, అది కుండలి నృత్య మనీ కొంచరు పండితులు అభిప్రాయాలను వెల్లడించారు.

అయితే నందికేశుడు తన భరతార్ణవంలో శుద్ధ, దేశి. పేరిణి, ప్రేంకణం, కుండలి, దండిక, కలశములనే సప్తదేశి తాండవ రీతుల్ని గూర్చి వివరించాడు.

అందులో 'కుండలి' నృత్యాన్ని గురించి పరిశోధించినట్లైతే అది శాస్త్రీయ కరణాంగహార చారీ భేదాలతో కూడిన నృత్యంగా తెలుస్తూంది. అంతేగాక అది

కుండలాకారం చేయబడే నర్తనం కాదు, బృంద నర్తనం అసలే కాదనీ, ఏకపాత్ర నృత్యకేళిక విధానం కుండలి అని అంటారు రామకృష్ణగారు.

కుండ నృత్యంలో, నారాయణ కరణము మత్తల్లి కాచారి — లక్ష్మీశతాళంతో ప్రదర్శిత మౌతుంది.

## గొండ్లి, గోండులు :

గొండ్లి అంటే అది గోండులచే చేయబడే నృత్యంగా పేర్కొన్నారు. గోండులు అతి ప్రాచీనమైన తెగకు సంబంధించినవారు. వీరిది ప్రాచీనమైన సంస్కృతీ వికాసంగల నాగరికత, వీరు అడవులలో నివసించే జాతి. వీరిలో రాజగోండులు ముప్పై ఆరు సంస్థానాలను స్థాపించుకుని 'ఛత్తీసురుడ్' పేరుమీద రాజ్యపరిపాలన చేశారు.

ఆ ప్రాంతమంతా ఈ నాటికీ మధ్యప్రదేశ్‌లో ఛత్తీస్‌రుడ్‌గా పిలువబడుతూ వుంది. ఆంధ్రదేశాన్ని ఆనుకుని వున్న ప్రాంతాలైన, చాందా, సిరువంచా, బస్తర్ మొదలైన సంస్థానాలను రాజగోండులు పాలించారు. ఆనాడు ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజులకూ, వారికీ సన్నిహిత సంబంధా లుండడం వల్ల గోండులలో వున్న నృత్త రీతులు ఆంధ్రదేశంలో కూడా ప్రచారమయ్యాయి. పల్లెల్లో నివసించే గోండులు ప్రదర్శించే నృత్యా లన్నిటిలోనూ, ఖర్మనృత్యం చాలా ప్రాముఖ్యం వహించిందట.

## ఖర్మ నృత్యం :

ఖర్మ నృత్యమంటే వర్షరుతువు ప్రారంభమయ్యే రోజుల్లో పంటలు బాగా పండాలని రైతులు చేసే ధర్త్రీమాత ఆరాధనా నృత్య మిది.

ఖర్మ నృత్యంలో బాగా చిగురించిన విప్పకొమ్మను తీసుకువచ్చి, ఒక కొత్త గుడ్డలో వుంచి వారి వారి ఇళ్ళలో వుంచుతారు, వారు అనుకున్న రోజున పెద్ద పండుగ చేస్తారు. అందరూ ఆనందంగా విందు భోజనాలు చేస్తారు. తరువాత, మంత్ర వాయిద్యాలు, మృదంగ శబ్దాలు మోగుతుండగా, స్త్రీలూ పురుషులూ కలిసి ఆ కొమ్మల చుట్టూ తిరుగుతూ, ప్రేమగీతాల్నీ, ప్రకృతి రామణీయక గీతాల్నీ పాడుతూ అద్భుతంగా నృత్యం చేస్తారట, దీనిని వారు ఖర్మనృత్య మంటారు. ఇది ఒక్క-

గోండులే గాక, ఇతర అడవిజాతులవారు కూడ ముఖ్యమైనదిగా ఎంచి నృత్యం చేస్తారు. ఈ విధంగా నృత్యగీతాలతో ''ఖర్మ వృక్షాన్ని ఆరాధించి భగవంతుని సంతోషపెడితే పంటలు దండిగా పండుతాయని వారి విశ్వాసం.



బృంద నృత్యం :

ఇది కేవలం బృందనృత్యం, స్త్రీలూ, పురుషులూ కలిసి చేసే నృత్య మిది. ఈ నృత్యం 'చతురశ్ర' 'తిశ్ర' ఏకతాళ గతిలో చేయబడుతుంది.

వీరి గీతాలు కొన్ని ఆధ్యాత్మిక పరంగానూ కొన్ని ప్రణయగీతాలుగానూ, మరి కొన్ని హాస్యరస ప్రాధాన్యత కలిగినవిగానూ వుంటాయి. వారి పాటలీ విధంగా వుంటాయి.

నీ శరీరమును చూచి పొంగకయ్యా
అది ఒకరోజు పైకి పోవాల్సిందేగా
నీ తల్లీ దండ్రీ చుట్టములు, బంధువులు
అందరిని విడిచిపోవాలి
నీ యింటిలో నున్న లక్షల ఆస్తిని గూడా
మరణ కాలంలో వదలి పోవాలి

ఇంకా ఈ విధంగా —

వాద్యములు పలుకుతున్నాయి
ఆ సంగీతాన్ననుసరించి పాదము భూమిపై
నృత్యమాడుతూంది
విడాకులిచ్చిన స్త్రీకి ఒక పైసా
ఉంపుడుగత్తెకు రెండూ, కానీ
అన్నె పున్నెము లెరుగని అబలకు
ఎన్నో వేల మంచి శబ్దములుగల బంగారు నాణెములు.

## గోండలీల, గొండ్లినృత్యము :

గోండలీ తెగకు చెందినవారు మహారాష్ట్రంలో చాలామంది వున్నారు. నృత్యం చేయడమే వీరి ముఖ్య వృత్తి.

గొండలీలు ఆంధ్రదేశంలో జంగంవారి వంటివారు. పెళ్ళి మొదలైన శుభ కార్యాలలో గొండ్లిని ప్రదర్శిస్తారు.

నృత్యం చేసేవారి వేషధారణ, పాదాల వరకూ పొడుగుగా వున్న ఒక కుచ్చుల అంగరకాను గవ్వలతో చేయబడిన ఒక మాలను ధరించి కాళ్ళకు గజ్జెలు కట్టి తలకు మార్వాడీ తలపాగ చుట్టి కథానాయకుడు తయారైతే మిగిలిన ముగ్గురూ అతనికి వంతగా నిలబడతారు. అందులో ఇద్దరు చెరో ప్రక్కన వుండి మృదంగాన్ని వాయిస్తే .... మూడవ వ్యక్తి వెలుగుకోసం దివిటీ పట్టుకొని నిలబడిన వ్యక్తి విదూషకుడుగానూ, అవసరమైతే వేషధారిగానూ సహకరిస్తాడట.

వీరు భవానీ స్తోత్రం ప్రారంభంతో నృత్యాన్ని ప్రారంభిస్తారు. ప్రారంభానికి ముందు ఒక బల్లపైన గోధుమలు పరచి, దానిపైన నీళ్ళతో నిండిన ఒక చెంబును కొబ్బరికాయ పెట్టి దానిని కలిశెంగా తయారుచేసి ఆ కలిశాన్ని భవానీదేవి రూపంగా ఎంచి నృత్యం పూర్తిచేస్తారు. నృత్యానంతరం కొబ్బరికాయ కొట్టి అందరికీ ఫలహారంగా ఇస్తారు.

## ప్రజారంజకమైన ప్రదర్శనం :

ముఖ్యంగా వీరిని పెళ్ళి మొదలైన శుభకార్యాలకు ఆహ్వానిస్తారు. ఒకోసారి వలం, వినోద కాలక్షేపంగా కూడా ప్రదర్శనం ఇస్తారు.

ఈ ప్రదర్శనంలో ప్రధాన కథకుడు ముందు వెనుకలకు నడుస్తూ నృత్యం చేస్తూ కథను సాగిస్తాడు. వాద్యకులు అతన్ని అనుసరిస్తూ, కథకుని కష్టంలో



రాజా గోండ్

పాలు పంచుకుంటూ, మధ్య మధ్య హాస్య ఛలోక్తులను విసరుతూ ప్రజలకు విసుగు లేకుండా వారిని అలరిస్తాడు. ఈ నృత్యం ఆధ్యాత్మిక సంప్రదాయానికి

చెందిన తాండవ నృత్యరీతి అంటారు. నటరాజ రామకృష్ణ, వీరి నర్తన తీరుకు ఒక ఉదాహరణ.

## గొండ్లి నృత్యం తీరు :

నృత్య కథా ఇతివృత్తం ఆధ్యాత్మిక ప్రబోధానికి సంబంధించింది.

నే నెవర్ని ఎక్కడ నుండి వచ్చాను. ఈ పరమ రహస్యం ఇంతవరకూ ఎవరూ తెలుపరైరి, అంటూ —

## నర్తన గీతం :

తల్లీ తండ్రీ - అక్కా తమ్ముడు - వీరంతా మాయ
వీరంతా నావారేనని తలచి స్వార్థంకోసం
జీవితం వృథా పుచ్చుచున్నాను
విషయ వాంఛ నరకానికి మొదటి మెట్టు
మానవుడు ఏ కారణంలేక దానిలో
చిక్కుకున్నాడు — ఓయి నరుడా!
నీ గురువును తలుచుకో (అంటే జ్ఞాన మిచ్చేవాడని అర్థం)

గొండ్లి, గోందలీ, నృత్యాలనబడేవి మధ్య ప్రదేశ్ మహారాష్ట్రాలలో ప్రదర్శింపబడుతున్నా, మూడు రాష్ట్రాల సరిహద్దులూ, అరణ్య ప్రాంతాలవటం. అడవిజాతుల గిరిజనుల ఇరుగు పొరుగు సంబంధాలూ, బాంధవ్యాలూ, రాకపోకలతో, తెలుగు దేశంలో కూడా సరిహద్దు ప్రాంతాలలో, గొండ్లి, గోందలీ నృత్యాలు జీవించి వున్నాయి. గొండ్లి నృత్య కథా ఇతివృత్తాలను బట్టి చూసినా ప్రదర్శించే ప్రదర్శన విధానాన్ని చూసినా తెలుగునాట ప్రదర్శింపబడే, బుర్ర కథా, వంది కథా, జముకుల కథా, ఒగ్గు కథా మొదలైనకథల బాణీలో వుంది .... ఇది కేవలం జానపద నృత్యం అంతేకాదు. గిరిజనుల నృత్యం కూడా, గొండ్లి నృత్యం....శైవ సంప్రదాయాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చింది. మహారాష్ట్రంలో కూడా, ఈ నృత్యాన్ని దేవీ స్తోత్రంగా చేస్తున్నారు.



ఇక గోండుల ఖర్మ నృత్యం గిరిజనుల్లో తప్పా, జానపద నర్తకుల, నర్తన రీతుల్లో మనకు ఎక్కడా కనిపించదు....జంగం

కథా, గొండ్లి ఒకే రకమైన కళారూపంగా వర్ధిల్లి వుండవచ్చని నటరాజ రామకృష్ణ గారు అభిప్రాయపడుతున్నారు.

## ఈ నాటికీ గోండుజాతి నృత్యాలు

ఈనాటి తెలంగాణాలో కేసలాపురం భీమదేవు దేవాలయం గోండు జాతికి సంబంధించినది. ఇక్కడ గోండుజాతివారు గొప్ప జాతర జరుపుతారు. జాతర పుష్య మాసం తరువాత ప్రారంభమౌతుంది. పదిహేనురోజులపాటు జరుగుతుంది.

వేలాది గోండుజాతి ప్రజలు గుమికూడతారు. ఈ వుత్సవంలో పాల్గొనడానికి గోండు కవులూ, వాయిద్యకారులూ, పాటకులూ, అందరూ హాజరై ప్రధాన వాయిద్యాలను వాయిస్తూ వుండే పాటగాండ్రు భక్తి గీతాలు పాడతారు.

ఈ వుత్సవాలలో వివాహమైన పెండ్లికూతుళ్ళు, ప్రధాన పాత్రలు వహిస్తారు. విగ్రహం ముందు నిలబడి రాత్రి తెల్లవార్లూ తన్మయీభావంతో వివిధ రకాలైన నృత్య ప్రదర్శనాలు జరుపుతారు. ఈ ప్రదర్శనలకు గోండు ప్రజలేకాక ఇతర కులాలకు చెందినవారు కూడా హాజరై ఆనందిస్తారు.









# గద్దరించే పెద్దపులి నృత్యం

పులి వేషం శతాబ్దాలుగా ఆంధ్రదేశంలో వర్ధిల్లుతూన్న జానపద కళారూపం. దీనినే వేట నృత్యమని కూడా పిలుస్తూ వుంటారు. హిందూ, ముస్లిం అనే మత వివక్షత లేకుండా, హిందువులు దసరా సంక్రాంతి ఉత్సవాలలోనూ ముస్లిములు పీర్ల పండుగ, మొహరం సందర్భాల్లోనూ ఏదైనా ఆపద వచ్చినప్పుడూ లేదా జబ్బు చేసినప్పుడూ, పులివేషం వేస్తామని పీర్లకు మొక్కుతూ వుంటారు మహమ్మదీయులు.

ఈనాడు పులి నృత్యాలు అంతగా ప్రచారంలో లేకపోయినా, ఒకప్పుడు ఆంధ్రదేశంలో ప్రతి పల్లెలోనూ ఈ పులి నృత్యాలను చూచి వుంటారు.

## జంతునృత్యాల అనుకరణ :

పులి వేషం జంతు నృత్యాలకు అనుకరణ. నెమలినృత్యం, గరుడనృత్యం, సింహనృత్యం, అశ్వనృత్యం మాదిరే ఈ పులి నృత్యం కూడా, పులి నృత్యాన్ని ఎక్కువగా ప్రచారంలోకి తెచ్చినవారు పల్లెప్రజలు.

దక్షిణ దేశంలో ఈ పులివేషాన్ని, పులి వాలకోలు అనడం కద్దు. ఆంధ్ర దేశంలో పులివేషమనీ, పెద్ద పులివేషమనీ, దసరా పులివేషమనీ పిలుస్తూ వుంటారు. పులి వేషాలవారు వారి వారి నైపుణ్యాన్ని వీథుల్లో ప్రదర్శించి ఆ తరువాత ఇంటింటికీ తిరిగి యాచిస్తూ వుంటారు. పిల్లలు, పెద్దలు భయపడేటంత సహజంగా పెద్ద పులి నృత్యంలో తమ నైపుణ్యాన్ని చూపిస్తారు. పులివేషం గ్రామంలో బయలుదేరిందంటే పిల్లలకీ, పెద్దలకీ ఆదొక పండగ.

## వేషధారణ :

పులి వేషధారణ చాలా కష్టమైంది. మామూలు వేషాల్లాగ, ఏదో ముఖానికి ఇంత రంగు పూసి తుడిచివేయడం లాంటిది కాదు. శరీరంలో అన్ని భాగాలనూ వార్నీషు రంగులతో ముంచివేస్తారు. వార్నీషుతో గానీ, కర్పూర తైలంతో గాని, పసుపురంగు పొడి కలిపి, శరీరమంతా చిత్రిస్తారు. రంగుతో చారలను చిత్రిస్తారు. ఈ నల్లటి చారలు వల్ల పెద్ద పులి ఆకారం వస్తుంది. తలకు, కరాళం, మాస్క్ ధరిస్తారు. వీటిలో రెండు రకా లున్నాయి. ఒకటి తోలుతో కుట్టబడిన పెద్దపులి తల ఆకారాన్ని కలిగి వుంటుంది. రెండవది, ముఖాన్ని కూడా కప్పబడే పులి తలమాదిరి కవచాన్ని ధరిస్తారు. అయితే సర్వసాధారణంగా తలకు మాత్రం పులి తల ఆకారాన్ని తగిలించి, కళ్ళకు నల్ల కళ్ళ అద్దాలను ధరిస్తారు. మొలకు లంగోటీని ధరిస్తారు. నడుముకు బెల్టువేసి ఆ బెల్టుకు వెదురు బద్దలతో ఎటుపడితే అటు వంగగల పులి తోకను తయారుచేసి, తోక చివర గుండ్రని ఆకారంలో రంగు కాగితాలతో అలంకరించబడిన బుట్టను తయారుచేస్తారు. ఆ తోకను మరొకరు పట్టుకుంటారు.

హంగులన్నీ సమకూర్చుకున్న తరువాత ఈ పులి వేషం బజారులోకి వస్తుంది. నిజంగా పెద్ద పులే వచ్చిందా అన్నంత భ్రమలో ముంచేది.

## డప్పుల హంగు :

పెద్దపులి ప్రవేశానికి హంగుగా రెండు డప్పులు గంభీర ధ్వనులు చేస్తూ వుంటే, ఆ ధ్వనులతో ఉత్తేజం పొందిన పులి వేషధారి, హుందా అయిన పులి నడకలతో గంభీరపు చూపులతో వాయిద్యానికి నగినట్లు నృత్యం చేస్తూ చికు చిక్కు చిక్కు చికు చిక్కు చిక్కు అంటూ ఎగిరి పల్టీలు కొడుతూ ఉధృత వాయిద్యానికి అనుగుణంగా నృత్యం చేస్తూ, పిల్ల జంతువులను వేటాడినట్లు ఆకలి గొన్న పులిలాగా వివిధ చేష్టలు చేస్తూ, పొంచివుండి అమాంతం ఏ మేకపిల్లనో నోటితో కరిచిపట్టినట్లు నటిస్తారు.

ఒక్కొక్కసారి ఇరువురు పులి వేషాలను ధరించి ఎదురు బొదురుగా నిలబడి రెండు పులులూ పోట్లాడుకుంటున్నట్లు వాయిద్యాల ధ్వనులతో భయంకరంగా పోట్లాడుతూ ఎగిరి గంతులువేస్తూ, తొడగొట్టి అరుపులతో, కేకలతో నానా హంగామా చేస్తారు.

ఈ నృత్యంలో పెద్దపులి వేటగాడు అనే రెండు పాత్రలు ప్రవేశిస్తాయి. వేటగాడు పులిని చంపాలనే, ఎత్తులతో పులి వేషాన్ని కవ్విస్తూ వివిధ వాయిద్య గతుల్లో అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతూ బరిశెతో పులిని చంపడానికి



పెద్దపులి నృత్యం విజయనగరం కళాకారుడు

ఎగిరి గంతేస్తాడు. తప్పించుకోవడానికి పులివేషధారి ఎగిరి పల్టీలు కొడతాడు. ఇలా రెండు పాత్రలూ ప్రజలకు ఉత్తేజం కలిగిస్తూ చివరికి పులిని వధించినట్లు కొందరు చూపుతారు. చనిపోబోయే ముందు పులి, వేటగాని మీదకు లంఘించి అతని గాయ పరిచినట్లు చూపుతారు.

## అడవిలో పులి :

మరికొందరు ఒక రెండెడ్ల బండిమీద కొమ్మలు, ఆకులు, వగైరాలతో అడవిలా అమరుస్తారు. ఆ బండిమీద అడవిమధ్య పులివేషం పచార్లు చేస్తూ బండి మీద కలియ తిరుగుతూ వుంటుంది. నేలమీద వేటగాడు పులిని కొట్టాలని, తప్పించుకోవాలని పులి, చివరకు దెబ్బతిన్న పులి వేటగాని మీదకు ఉరకబోయినట్లు విలయతాండవం చేసి చనిపోయినట్లు నటిస్తారు.

పులి నృత్యానికి హంగుగా వున్న డప్పు వాయిద్యకాండ్రు కాళ్ళకు గజ్జలుకట్టి, పులి నృత్యానికి అనుగుణంగా వెఱ్ఱి ఆవేశంతో నృత్యం చేస్తారు.

బహిరంగ ప్రదేశంలో జరిగే ఈ పులి నృత్య ప్రదర్శనానికి ఊరు ఊరంతా కదలి వస్తారు. ప్రేక్షకుల్ని చూచినకొద్దీ పులి వేషగాళ్ళు ఉత్తేజంగా అడుగులువేస్తూ వుంటే ప్రేక్షకుల్లో కొందరు, ఈలలతో చప్పట్లుతో, కేకలతో హుషారు చేస్తారు.

పులి వేషధారి అప్పుడప్పుడు చుట్టూ మూగివున్న పిల్లల్ని భయపెడుతూ వుంటాడు.

పులి వేషధారి నృత్యం చేసేటప్పుడు రెండు చేతుల్లోనూ రెండు నిమ్మకాయలను వుంచుకుంటాడు. బాగా కోపం వచ్చినప్పుడు నిమ్మకాయను కొరికి తన కోపాన్ని తీర్చుకుంటూ, నిమ్మరసం మింగి తన దాహాన్ని అదుపులో పెట్టుకుంటాడు.

పులి వేషధారి ఎండలో నృత్యం చేసేటప్పుడు తాను వంటికి పూసుకున్న వార్నీషు రంగులు బిర్రున బిగదీస్తాయి. చర్మం మంట పుడుతుంది. ఉపశమనంగా కడవలతో నీళ్ళు పోసుకుని తాపాన్ని పోగొట్టుకుంటాడు. వేషం ధరిస్తే వారం రోజులు అలాగే వుంచుకుంటాడు. ఈ పులివేషాన్ని మంచి చిత్రకారులు అతి సహజంగా చిత్రీకరిస్తారు.

చివరి రోజున ఇంటింటికీ తిరిగి పారితోషికాలను పొందుతారు. తరువాత కిరసనాయిలుతో, ఆ రంగునంతా వదిలించి స్నానం చేస్తారు. ఈ నృత్యాన్ని ఎవరు పడితే వారు చేయలేరు. బాగా వ్యాయామం చేసి కండలు తిరిగిన యువకులే, పులి వేషాన్ని ధరిస్తారు. ఈ నృత్యంలో అత్యంత ప్రావీణ్యాన్ని చూపించే పులి వేషధారులు విజయనగరంలో వుండేవారు. ప్రజలను అలరించి ఆనందపరిచే కళారూపాలలో పులి నృత్యం ముఖ్యమైనదిగా చెప్పుకోవచ్చు.





# కోటప్పకొండ ప్రభల విన్యాసం

గుంటూరు జిల్లా నర్సారావుపేటకు దగ్గరగా వున్న కోటప్పకొండ, శైవక్షేత్రమైన పుణ్యక్షేత్రం ప్రతి శివరాత్రికీ బ్రహ్మాండమైన వుత్సవం జరుగుతుంది. తిరుపతి కొండకు వెళ్ళి మ్రొక్కులు తీర్చుకున్నట్లే ఇక్కడకూడ వేలాదిమంది మ్రొక్కులు తీర్చుకుంటారు. ఎవరికి వారు మ్రొక్కులు తీర్చుకోవడానికి వస్తూ పెద్ద పెద్ద ప్రభలను కట్టి వాటిని ఎంతో అందంగా అలంకరించి ఒకరిని మించి ఒకరు పోటీలువడి ఈ ప్రభలను నిర్మిస్తారు.

## ముద్దుల ఎద్దుల అలంకారం :

ప్రభల బండ్లకు కావలసిన ఎడ్లను ఎంతో ముద్దుగా పెంచుతారు. అందుకోసం వాటికి మంచి తిండి పెట్టి తయారుచేస్తారు. బిడ్డలను సాకినట్లు సాకుతారు. వాటికి మెడలో మువ్వల పట్టెడ, గంటల పట్టెడ, మూతికి అందమైన శికమార్లు, నడుంకు తోలు బెల్టు, ముఖానికి వ్రేలాడే కుచ్చులు, కొమ్ములకు రంగులు, కాళ్ళకు గజ్జెలు, వీపుమీద రంగు రంగుల గుడ్డను అలంకరిస్తారు. ప్రభలు బయలుదేరి వస్తూ వుంటే ఈ ఎడ్ల సౌందర్యాన్ని చూడడానికి జనం మూగుతారు. — ప్రభలు వారి వారి శక్తి కొలది పెద్ద పెద్ద ప్రభలను తీసుకువస్తారు. ఆ ప్రభలను రంగు రంగుల గుడ్డలతో, రంగుల కాగితాలతో, ఫొటోలతో అలంకరిస్తారు. శక్తి కలవారు జనరేటర్ పెట్టి ప్రభలకు ఎలెక్ట్రిక్ బల్బులను అమరుస్తారు.

## ప్రభల విన్యాసం :

అలంకార శోభితమైన ఈ ప్రభలు వూరేగింపుగా బయలుదేరితే, మ్రొక్కుబడి వున్నవారు భక్తి శ్రద్ధలతో ప్రభ ముందు నడుస్తారు. ప్రభ ముందు తప్పెట వాయిద్యాన్ని గమకాలతో సాగిస్తూ వుంటే వాయిద్యానికి తగినట్లుగా బండికి కట్టిన ఎద్దులు ఠీవిగా నడుస్తూ వుంటే, అలంకరించిన మువ్వల, గజ్జల, గంటల మ్రోతలు తాళానికి అనుగుణంగా మ్రోగినట్లుంటుంది. ఉత్సాహంతో ఠీవిగా నడిచే ఎద్దులు అప్పుడప్పుడు రంకెలు వేస్తూ వుంటే, సంగీత శాస్త్రంలో ఎద్దు వేసే రంకెను, సప్తస్వరాలలో రెండవది అయిన (రిషభం) అని నిర్ణయించారని కీ॥ శే॥ డా. కే. యన్. కేసరి గారు వారి చిన్ననాటి ముచ్చట్ల గ్రంథంలో ఉదహరించారు. రిషభ స్వరంద్వారా వీర రసం, అద్భుత రసం, రౌద్ర రసం వెలువడతాయని వివరించారు.



కోడె గిత్తలతో నడుపబడే ఈ ప్రభలను నడిపేవారు యుక్తవయస్సులో వున్న యువకులు, చెర్నాకోలను చేతిలో ధరించి తలకు మంచి తలపాగాను అందంగా చుట్టి అహహై చోచో, అంటూ ఎద్లను అదలిస్తూ కోరమీసం దువ్వుతూ చలాకీగా ఎద్లను తోలుతూ వుంటే పౌరుషంతో కోడె గిత్తలు ముందుకు సాగిపోతాయి. ఇలా బయలుదేరిన ప్రభల బండ్లు ఆయా గ్రామాలగుండా ప్రయాణించే టప్పుడు గ్రామస్థులు ఎదురు వచ్చి స్త్రీలు కడవలతో వారపోయగా, పురుషులు కత్తి చేతబట్టి, దండకాలను చదువుతారు. ఇలా చదివేవారు జంగాలు, ఆరాధ్య బ్రాహ్మణులు.

శరభ శరభ :

శైవులు, వీరశైవులు పలు సందర్భాలలో దక్షయజ్ఞ దండకం చదివినట్లే

ఇక్కడా చదువుతారు. ఇలా చదివేటప్పుడు ఖడ్గదారులు ప్రభ ముందు నిలబడి వెనుకకూ ముందుకు నడుస్తూ ఎగిరెగిరి గంతులు వేస్తూ పరవళ్ళు త్రొక్కుతూ వుంటే పక్కనున్న వాళ్ళు ఋంజ వాయిద్యాన్ని. తప్పెట వాయిద్యాన్ని వాయిస్తూ, కొమ్ము బూరగాలనూ, కాహళాలనూ ఊది దండక చదువరిని వుత్తేజపరుస్తారు.





# దడదడ లాడించే డప్పుల నృత్యం

## భాసుని నాటకంలో డప్పు నృత్యం :

బాలచరితం భాసుని నాటకం. దీనిలోని ప్రధాన ఇతివృత్తం "శ్రీకృష్ణ బాలక్రీడలు" తృతీయాంకం మొదటి రంగం ప్రవేశంలో గ్రామీణుల డప్పుల నృత్యాన్ని ప్రవేశపెట్టాడు భాసుడు. ఇక్కడ కృష్ణుడు వృద్ధగోపాలుడుగా ప్రత్యక్షమవుతాడు. గొల్లపడుచులు "ఘోషసుందరి, వనమాలి, చంద్రలేఖ, మృగాక్షి" మొదలైనవారు నృత్యం చేయటానికి ఒక చోటకు చేరతారు.

అప్పుడు అక్కడకు వచ్చిన దామోదరుడు ఆడపడుచుల అందాలకు అచ్చెరు వంది వారితో చేరి నృత్యం చేదామంటాడు. వాళ్ళు సరేనంటారు.

వాళ్ళ సంభాషణ ఇలా సాగుతుంది. దామోదరు డంటాడు. ఘోషవాణీ పల్లె వాసులకు అనుకూలమైన 'హల్లీసక'మనే నృత్యం చేదాం అంటాడు.

అందుకు సంకర్షణుడు 'అయితే డప్పులు మోగిద్దాం' అంటాడు. అప్పుడు వృద్ధగోపాలుడు కృష్ణునితో మీరు నృత్యం చేస్తూ వుంటే నేనో? అంటాడు. నువ్వు చూస్తూ కూర్చో అంటాడు కృష్ణుడు. వాళ్ళు నృత్యం చేస్తూ వుంటారు. మంచి రక్తిలో వుండగా వృద్ధగోపాలుడు ఉత్సాహం పట్టలేక డప్పు మ్రోతతో నృత్యం అద్భుతంగా వుంది. నేనూ నృత్యం చేస్తా నంటూ వాళ్ళతో కొంతసేపు నృత్యం చేసి

అలసిపోతాడు. ఇంతలో కృష్ణునిపై కంసుడు ప్రయోగించిన అరిష్ట అర్భకుడు అనే రాక్షసుడు వస్తున్నాడని తెలుసుకుని నృత్యాన్ని ఆపేస్తారు.

ఈ నాటకంలో ఆటపాటతోపాటు నృత్యం కూడా వుంది. వీటికి తోడు డప్పుల నృత్యం కూడా చోటు చేసుకుంది. ఇది పక్కా పల్లెటూరి నృత్యమంటారు. ఇతర భాస నాటకాల్లో ఇలాంటి జానపదకళను ప్రవేశపెట్ట లేదంటారు. ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు నాట్యకళ జానపద కళల ప్రత్యేక సంచికలో ప్రాచీన జానపద కళల ప్రస్తావనలో అంటే డప్పునృత్యం ఈ నాటిదే కాదు, అనాటిదే అని చెప్పటానికి ఇది చక్కని ఉదాహరణ.

## డప్పుల కోలాటనృత్యం :

ఈ డప్పుల నృత్యాన్నే తప్పెట్లవాయిద్య మంటారు. దీనినే రాయలసీమ ప్రాంతాల్లో కనకతప్పెట్లంటారు. ఈ వాయిద్యాన్ని మాదిగ కులస్థులు ఎక్కువగా వాయిస్తూ వుంటారు.



ఈ నాటికీ ప్రతిపల్లెలోనూ ఒక కార్యక్రమాన్ని గాని, ఒక విశేషాన్ని గాని ప్రజలందరికీ తెలియజెప్పాలంటే ఒక్క డప్పుతో వూరంతా ఎటువంటి విషయాన్నైనా చాటిస్తారు. వివాహాలకు, అమ్మవారి జాతర్లకూ, వీరుళ్ళ పూజలకూ ఈ

వాయిద్యాన్ని ఎక్కువగా వుపయోగిస్తూ వుంటారు. వాయిద్యం చాలా ఉద్రేక పూరితంగా వుంటుంది. ఈ డప్పులను వేపచెక్కలతోను, చంద్రపు చెక్కలతోనూ చత్రంగా తయారుచేస్తారు. గేదె దూడ చర్మాన్ని ఒక ప్రక్క మూసి నిప్పు సెగ మీద కాసి వాయిస్తే కణకణమని శబ్దం వస్తుంది. ఈ డప్పులతో వలయాకారంగా నిలబడి

నీలాలారా, నిమ్మాలారా
నీళ్ళకు పోయే కన్యాలారా
రేపే పైనామాని చెప్పండోయ్
మేలన్నాలారా ॥నీలాలారా॥

కోటా దుమికే, పేటా దుమికే
కోటలో గజ - నిమ్మా దుమికే
నిమ్మా ముల్లూ - రొమ్మూ నాటేనూ
మేలన్నాలారా

శెలవాలిత్తే గడియాకొత్తూనూ,
సద్దీ తిన్నా జలదికాడా సాబానాలా బావికాడా.
జో డుంగరాలు - మరచీపోతినే - మామయ్యగారు
శెలవాలిత్తే గడియా కొత్తూనూ.

అంటూ డప్పులను వాయిస్తూ కోలాటం వేస్తారు. మామూలు కోలాటంలో అందరూ చిరుతలు ఉపయోగిస్తే, ఈ కోలాటంలో అందరూ డప్పులను చంకలో ధరిస్తారు. డప్పులు మ్రోగించే పుల్లలతో మధ్య ఒకరి కొకరు కోలాటం వేస్తూ ఎగిరి ఎగిరి గజ్జెల కాళ్ళతో నృత్యం చేస్తూ అద్భుతంగా కోలాటం వేస్తారు. ఈ కనక తప్పెట్ల వాయిద్యం చాలా ఉత్తేజాన్ని కలుగజేస్తుంది. ఈ వాయిద్యంలో కృష్ణాజిల్లా కనుమూరు వాస్తవ్యుడు అమృతయ్య, వుంగుటూరు వాస్తవ్యుడు ఏసుదాసు. వీరిద్దరూ డప్పుల మీద మృదంగవరుస లన్నింటినీ అద్భుతంగా వాయించి 40 సంవత్సరాలకు ముందే ప్రదర్శించారు. వీరిరువురూ ఆంధ్రప్రజానాట్యమండలి రాష్ట్రదళంలో బొంబాయి, అహమ్మదాబాదు, పూనా, షోలాపూర్, మద్రాసు, ఢిల్లీ మొదలైన ప్రాంతాలకు వెళ్ళి దేశభక్తి ప్రబోధాన్ని చేశారు. సామాన్యవరుసలతో ప్రారంభమైన జానపదుల ఈ డప్పుల వాయిద్యం ఈనాడు ఒక శాస్త్రీయ వాయిద్యంగా రూపొందింది.

## తాలేలిల్లియ్యలో :

తాలేలిల్లియ్యలో, శివతాలే లిల్లియ్యలో అనే పాట ఆంధ్రదేశంలో దప్పుల వాయిద్యం ద్వారా చాలా ప్రచారం పొందిన పాట. హరిశ్చంద్ర నాటకంలో వీర బాహుడు కల్లు త్రాగి నృత్యం చేస్తూ ఈ పాట ద్వారానే వేదాంతాన్ని బోధిస్తాడు.

తాలే లిల్లియ్యలో, శివతాలేలిల్లియ్యలో
కుల మేలాగున్నది, వినుమయ్యలో
మూలము గోచర్మ - మైదుకీళ్ళు గల
తోలుబొమ్మలట - ఈ జగము

అంతా, తాలేలిల్లియ్యలో, కులమేలా
ఐదైదుల ఇరవైఐదు తత్వముల
మనుషులు పుట్టిరీ
కులమేలా గున్నది ॥తాలే॥

దేవదాసి యను పూర్వసి గర్భము
నుద్భవించిన - వశిష్ట కులమూ
కులమేలా గున్నది ॥తాలే॥

దొరలు పెద్దింట్లోన్ని - తొలగిపోనిండయ్య దొరలు
కాసంత కల్లేసి - కాశీకి పోతాను. ॥తాలే॥

దప్పుల వాయిద్యాన్ని ముఖ్యంగా జాతర్ల సందర్భాలలోనూ, అమ్మవారి వుత్సవాలలోనూ, పెద్దపులి నృత్యంలోనూ, వీరభద్ర విన్యాసాలలోనూ ఎక్కువగా ఉపయోగిస్తారు. ఒకేసారి నాలుగు దప్పులు వాయిస్తూ వుంటే ఆ గంభీరనాదం ప్రళయంగా వుంటుంది. ఎంతో ఉత్తేజాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా ఈ వాయిద్యాన్ని మాదిగలనే ఆది ఆంధ్రులు ఎక్కువగా ఆరాధిస్తారు.

## దప్పు వాయిద్యంలో నిపుణత్వం :

ఆంధ్రదేశంలో దప్పు వాయిద్యంలో నిపుణత్వాన్ని ఆయా రీతుల్లో అనేక మంది చూపించినవారున్నారు. ఈ దప్పుల వాయిద్యాన్ని ఆ యా సమయాలను బట్టి

కూడ వాయిస్తూ వుంటారు. పెండ్లి పూరేగింపులో వాయించే వాయిద్యానికీ, దేవుళ్ళ ఉత్సవాల్లో వాయించే వాయిద్యానికి ఎంతో వ్యత్యాసముంటుంది. అలాగే మనుషులు చనిపోయినప్పుడు వాయించే వాయిద్యం మరో రకంగా వుంటుంది. ఆయా సంఘ టనలకు అనుగుణంగా ఈ వాయిద్యాన్ని మలుస్తారు.



నిజామాబాదు జిల్లాలో:

నిజామాబాదు జిల్లాలో దాదాపు అన్ని గ్రామాలలోనూ డప్పు వాయిద్యానికి అధిక ప్రాధాన్యం యిస్తారు. పెళ్ళిళ్ళ సందర్భంలో ఎన్ని ఎక్కువ డప్పులు ఉపయోగిస్తే ఆ పెళ్ళి పూరేగింపును గురించి అంత గొప్పగా చెప్పుకుంటారు. పెళ్ళి ఊరేగింపుల్లో, డప్పులవారు రకరకాల విన్యాసాలను చేస్తూ వుంటారు. నేలపైన ఒక డప్పును బోర్లించి, దానిపైన చిల్లర డబ్బులను వుంచుతారు. వాద్యకారుడు మరో డప్పుతో వాయిస్తే, ఆ శబ్ద కంపనానికి డప్పు మీదున్న చిల్లర డబ్బులన్నీ నేలమీద పడిపోతాయి. అలాగే నేలపై కరెన్సీ నోట్లను వేసి, లయ తప్పకుండా డప్పును వాయిస్తూనే నేలపై వుంచిన కరెన్సీ నోట్లను చేతితో ముట్టకుండా కంటి రెప్పలతో అందుకుంటారు.



# జనం మెచ్చిన
# జముకుల కథలు

జముకుల కథలను జక్కుల కథలని పిలవడం కూడా కద్దు. ఈ కథలు కాకతీయుల కాలంలో బహుళ ప్రచారంలో వున్నట్లు ఎన్నో ఉదాహరణ లున్నాయి.



ఎల్లమ్మ కథ :

ఓరుగల్లులో ఆనాడు ఓరుగంటి ఎల్లమ్మ అనే ప్రసిద్ధ దేవత వుండేది. ఈ ఎల్లమ్మనే రేణుక అని కూడా పిలిచేవారు .... కాకతీయుల కాలంలో బవనీలు అంటే మాదిగ స్త్రీలు ఎల్లమ్మ కథను వీరావేశంతో చెపుతూ వుండేవారనీ, వా రుపయోగించే జవనిక .... జుకజుం, జుకజుం జుమ్మంటూ వీనుల విందుగా నాదం సాగేదనీ, క్రీడాభిరామంలో ఈ విధంగా ఉదహరింపబడి వుంది.

వాద్యవైఖరి కడు నెరవాది యనగ
ఏకవీరాదేవి ఎదుట నిల్చి
పరశురాముని కథలెల్ల ప్రౌఢిపాడె
చారుతర కీర్తి బవనల చక్రవర్తి.

## నగ్న నృత్యాలు :

రేణుకాదేవి జమదగ్ని మహాముని భార్య, పరశురాముని తల్లి. తండ్రి ఆజ్ఞను అనుసరించి పరశురాముడు తన తల్లి తలను ఖండించగా తలకాయ మాదిగవాడలో పడిందట. శిరస్సు లేకుండా వున్న విగ్రహం ముందు నగ్న నృత్యంతో పూజిస్తూ వుండేవారట. నగ్నంగావున్న ఈ విగ్రహాలముందు స్త్రీలు కూడా నగ్నంగా పూజిస్తూ నాట్యంచేస్తూ వుండేవారట. ఈ నృత్యాలలో జవనికల వాయిద్యం ఉత్తేజాన్ని కలిగించేదట.

## నాడూ, నేడూ :

పరిత్రాత్మకమైన ఈ జముకుల కథలే, ఆనాటి జక్కుల కథలు, ఈ కథలు ఈనాటికీ పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోనూ, తెలంగాణాలోనూ, విశేష ప్రచారంలో వున్నాయి. ఈ కథలు శృంగార లాలిత్యంతోనూ కరుణరసాన్ని ప్రతిబింబించేవిగానూ వుంటాయి. ఈ కథల్లో అనేక రకాలైన సంగీత పట్టులున్నాయి. మట్టులకు తగినట్లు వాయిద్యాలు మలుపు తిరుగుతాయి. ఈ ప్రదర్శనం మూడు గంటల కాలం నడుస్తుంది.

## బుడికి పాట :

శ్రీకాకుళం జిల్లాలో నేటి జముకుల కథ పూర్వ నామం. బుడికి, లేక బుణికి పాట అనీ, బోనుల పాట అనీ, టమకటమా అనీ, బుడబుక్కల పాటనీ నామాంతరాలని (ప్రజాసాహితి ప్రజాకళారూపాల ప్రత్యేక సంచికలో) ఛాయారాజ్ గారు ఉదహరించారు.

బుడికి వాయిద్యాన్నే ''బోను'' అని కూడా అంటారట. అందుకే అది బోనులపాట అయింది. బుడికి చేసే శబ్దం .... బుడుక్కు, బుడుక్కు కాబట్టి బుడబుక్కలపాట అని కూడా అంటారు. మొత్తంమీద ఇది వాద్య ప్రధానమైన కళా రూపం.

## జముకుల, వన్నెచిన్నెలు :

జముకులంటే ఈ తరానికి చాలామందికి తెలియదు, దీనినే .... జమిలిక, జమిడిక, బుడికి అని కూడ పిలుస్తారు. ఈ వాయిద్యం కుంచం ఆకారంలో

వుంటుంది. కొన్ని ఇత్తడితోనూ, మరి కొన్ని కొయ్యవి కూడా వుంటాయి. దానిని ఒక ప్రక్క భాగం సన్నని పొరలాంటి గేదెల బక్క చర్మంతో మూస్తారు. మధ్య భాగంలో చిన్న రంధ్రంచేసి నరాన్ని కట్టి లోపలి భాగం నుంచి రెండవ ప్రక్క ఒక కర్రముక్కకు కట్టి చేతితో దానిని లాగిపట్టి లోపలి భాగంలో ఆ నరాన్ని మ్రోగించినట్లయితే శ్రావ్యమైన మ్రోతలు వస్తాయి.

## రంగస్థల వేషాలు, విశేషాలు :

జముకుల కథా ప్రదర్శనానికి ఏ విధమైన రంగస్థలమూ అవసరంలేదు. గ్రామం మధ్యలో చిన్న పందిరివేసి, రెండు లైట్లు కడితే సరిపోతుంది. ప్రదర్శన కారులు ముగ్గురు. అందులో మధ్య వ్యక్తి కథకుడు, వంతదారుల్లో ఒకరు హాస్యం, రెండవవారు వ్యాఖ్యానం, వేషధారణలో కథకుడు నల్ల కోటు. తెల్లకట్టు పంచ, తలగుడ్డ చుట్టి చక్కగా నృత్యంచేస్తూ కలియ దిరుగుతాడు. స్త్రీ పాత్రలు, కథా విధానంలో వచ్చినప్పుడు అక్షరాలా స్త్రీ అభినయాన్నే కథకుడు చేస్తూ వుంటాడు. వంతదారులు రెండు జముకలను శ్రావ్యంగా వాయిస్తూ వుంటారు.

## బుడికి కథా ప్రదర్శనం :

శ్రీకాకుళం జిల్లాలో ప్రచారంలో వున్న, జముకుల కథకు ప్రత్యామ్నాయ మైన బుడికి కథా రూపంలో పాల్గొనేవారు ముగ్గురుంటారు, రెండు బుడికెలు (అవే జముకులు) కాళ్ళకు గజ్జెలు తప్ప మరే ఇతర వాయిద్యాలూ వుండవు.

ఈ ముగ్గురులో మధ్యనుండే పాటగాడు స్త్రీ పాత్రలో, అంటే భామాకలా పంలో సత్యభామ వేషం మాదిరి వుంటుంది. వంతపాటదారులకు ప్రత్యేక వేష ధారణేమీ వుండదు. వీరిద్దరూ బుడికెలను చంకలకు తగిలించుకుని లయబద్ధంగా, పాటల ననుసరించి వరుసలు మారుస్తూ వాయిద్యాన్ని సాగిస్తారు.

## చేతిలో రుమాలు :

ఇక అన్నిటికంటే ముఖ్యమైనది కథకుని చేతిలో వుండే పట్టు రుమాలు. కథకు ప్రాణం కథకుడైతే, కథకుని ప్రాణం చేతిలోని పట్టు సెల్లాయే. అది ఎంత ముఖ్యమైనదో చాయారాజ్‌గారు ఈ క్రింది ఉదాహరణను ఉదహరించారు.

... ఒకసారి ప్రదర్శన జరుగుతూ వుండగా కథకుని చేతిలో రుమాలు తీసుకుని కథను సాగించమన్నారట. వాళ్ళు బొమ్మల్లా నిలుచుండి పోయారట. అడుగు కదలలేదట. రాగం రాలేదట, రుమాలు లేకుండా కథ చెప్పలేమన్నారట.

## రుమాలు తమాషా :

బుడి కథలో కథకునికి రుమాలు ఒక అవయవంలాంటిది. అది చేతిలో లేకపోతే చెయ్యి విరిగిపోయినట్లే. ఆయా సన్నివేశాల్లో అది ఒక పాత్రగానే వ్యవహరిస్తుంది. ఒకోసారి కర్పూరం వెలిగించిన పళ్ళెమౌతుందట, వాయినం అందించే పాత్రగా మారుతుందట, ఒకోసారి ఆకాశంలో చందమామగా, మరోసారి సిగ్గును దాచుకోడానికి మరోసారి గుఱ్ఱాలను అదలించే చర్నాకోలలా రూపొందుతుంది. ఇంకోసారి రాయబారాన్ని పంపే హంసగా, పావురంగా, చివరకు ఉత్తరంగా. దుఃఖరసంలో కళ్ళు అద్దుకోవడానికి శృంగారంలో వయ్యారంగా ఊగించడానికి, ఇలా ఎన్నో విధాల ఆయా రసాల, అభినయాల, సన్నివేశాల కనుగుణంగా చేతిలోని రుమాలు ప్రముఖ పాత్ర వహిస్తుంది.

## బుడికి రంగస్థలం :

ఈ కళారూపాన్ని గూడేలలోనూ, గ్రామాలలో కూడలివద్దా. నలుగురూ కూర్చుండే రచ్చబండల వద్దా ప్రదర్శిస్తారు. కథ ప్రారంభమై తెల్లవార్లూ నడుస్తుంది. ప్రదర్శనా రంగస్థలంలో ఒక దీపపు స్తంభాన్ని పాతుతారు. దీనిని గిరడ అని పిలుస్తారు. ఈ గిరడ చుట్టూ వలయాకారంగా తిరుగుతూ. పాడుతూ, కథకుడు నృత్యం చేస్తూ కథ చెపుతాడు.

ఇప్పుడిప్పుడు గిరడకు బదులు, పెట్రోమాక్సు లైట్లు స్టూలుమీదవుంచి దానినే గిరడగా భావించి చుట్టూతిరుగుతూ ప్రదర్శన ఇస్తున్నట్లు ఛాయారాజ్‌గారు చెపుతున్నారు.



## గిరడ ముందు ప్రార్థన :

ముందుగా కథకుడు గిరడకు ఎదురుగా నిలబడి ప్రార్థనచేసి నెమ్మదిగా నాట్యం ప్రారంభించి అప్పటి వరకూ కప్పుకున్న మేలి ముసుగును తొలగించి అనం

తరం సంభాషణ ద్వారా ఏయే కథలు తాము చెప్పగలరో సభా ముఖాన వివరించి ఏ కథ కావాలో ప్రేక్షకుల్నే ప్రశ్నించి వారు చెప్పమన్న కథను ప్రారంభిస్తారు.

కథలన్నీ పౌరాణికాలే. కథంతా పూర్తి అయిన తరువాత ప్రేక్షకులు కోరిన మీదట సుదీర్ఘమైన పాటలు పాడతారు. వీటిల్లో చెప్పుకోతగినవి మందులాడి పాట, కామమ్మ కథ మొదలైనవే కాక, ఆ ప్రాంతాల్లో జరిగిన సంఘర్షణలను కూడా పాటలు కట్టి పాడుతారు.

## ఇరవై బాణీలూ, ఇరవై రాగాలూ:

ప్రతి కథలోనూ, కథకుడు షుమారు ఇరవై బాణీల్లో పాటపాడుతాడు. పాటకూ, పాటకూ మధ్య కథనాన్ని రాగయుక్తమైన వచనంలో రాగరంజితంగా చదువుతాడు. ప్రతి పాటకూ బాణీ మారుతూ వుంటుంది. వాద్యనృత్యగాన సమ్మేళనంతో కథ హృద్యమంగా నడుస్తుంది. ఒక్కొక్క సందర్భంలో వంతదారులు కథలో వచ్చే పాత్రలుగా మారిపోతాడు. ఉదాహరణకు కథకుడు సుభద్రగా నటిస్తే వంతపాటగాళ్ళు ఒకడు అర్జునుడుగానూ మరొకడు మన్మథుడుగానూ మారిపోతాడు. జముకుల కథా ప్రదర్శనలో ఇలా ఒక విచిత్రమైన డ్రామా నడుస్తుంది.

## అంటరానివాళ్ళూ, అన్నం లేనివాళ్ళూ:

పైన వివరించిన బుడికి లేదా జముకుల పాటగాళ్ళు నిరుపేదలైన అంటరాని కులాలకు చెందినవాళ్ళు. అక్షరజ్ఞానం లేనివాళ్ళు. ఒకవేళ వున్నా అది అంతంత మాత్రమే. అదీ శ్రీకాకుళం మాండలిక యాసలో వుంటుంది. యాసతో కూడిన వారి భాష నవ్వు పుట్టిస్తూ వుంటుంది. ఎ ఏ అక్షరాలను వె వేలుగా పలుకుతారట, అలాగే ఎన్ని - వెన్ని - ఏనుగు - వేనుగు వచనం చెప్పేటప్పుడు వాక్యంలో ముఖ్యమైన పదాలు ఏవైతే వుంటాయో వాటిని ఈ విధంగా వత్తి పలుకుతారట.

ఖోట కెలపల ఉధ్యేనవనంలో హర్జనుడు తపస్సు
లున్నాడు, ఆతగాడి ధగ్గెరికి సుబద్ర భంగారు
తబుకలో నప్పులాం పట్టుగొనె లగెల్తుందందే.

ఇలా సాగుతుంది వారి భాష. ఇది యాసకాదు గంభీరంగా వాచికం చెప్పడంలో వచ్చే దుశ్శబ్దాలు.

## సంచార జీవితాలు :

ఈ కథలు చెప్పే కళాకారులు దాదాపు అందరూ సంచారజీవనులో ఒక



జముకుల కథ పిట్టంశెట్టి కథకుడు, డా॥ మిక్కిలినేని, మాచినేని

గ్రామంలో కథ చెప్పి మరో గ్రామం పోయి నెలల తరబడి గ్రామాలలో క
చెప్పి కొంత సొమ్ము కూడబెట్టుకుని స్వగ్రామం చేరుకుంటారు. పైన వివరిం

వివరాలన్నీ ఆ ప్రాంతంలో వున్న ఒక బృందం చెప్పిన వివరాలన్నిటినీ ఛాయారాజ్ గారు సేకరించారు. వారికి ధన్యవాదాలు.

పీసా లక్ష్మణరావు, కన్యక :

జముకుల కథ కళారూపాన్ని దేశప్రయోజనాలకు ప్రప్రథమంగా మార్చిన వ్యక్తి. విజయవాడ కమ్యూనిస్టు కార్యకర్త, ప్రజానాట్య మండలి సభ్యుడు కీ॥శే॥ పీసా లక్ష్మణరావు. మహారాజుల వ్యవస్థలో ప్రబలిన దారుణ హింసాకాండనూ, సాంఘిక దురాచారాలనూ ఉదహరిస్తూ గురజాడ వ్రాసిన 'కన్యక' గేయాన్ని ఇతి వృత్తంగా తీసుకుని, కన్యక జీవిత గాథను కథగా మార్చి దానిని జముకుల కథగా వ్రాసి మంచి మంచి బాణీలను ఏర్చికూర్చి రసవత్తరంగా కథా గానం చేసేవారు. ఆయన వంతదారుగా రాజకీయ వ్యాఖ్యాతగా వ్యవహరి స్తే నరసింహారావు కథకుడుగా, తొ త్తడి సింహాచలం హాస్యాన్ని అందించేవాడు. అది అద్భుతమైన కథగా నాటి సాంఘిక రాజకీయ పరిస్థితు లన్నిటికీ అద్దం పట్టింది.

కథాగానసరళి :

కన్యకానచరితం, కర్ణానందం
నిను స్మరియించెడు జనులకెల్ల నిత్యానందం.

అని ప్రార్థనతో ప్రారంభించి

కళింగదేశ మీ తెలుగు గడ్డపైన
విష్ణువర్ధను డనుచు వెలయుచుండెనుగా.

అని వివరిస్తూ

పండిన తన కేమి, మండిన తన కేమి
పన్నులె కావాలి ప్రభువువారలకు
పన్ను లివ్వాలేని పేదరైతుల నెల్ల
రచ్చ చావడి కీడ్చి రువ్వలతో బాధించు
వన్నెగల స్త్రీ ఒకతె కన్ను కగుపించిన
కామాంధుడై ఒళ్ళు కాన డా రాజు.

అలాంటి విష్ణువర్ధన మహారాజు కన్యకను కోరటం, కన్యక నిరాకరిస్తూ రాజును ఇలా సంబోధిస్తుంది.

రావయ్య రారాజ రాణి ఇచ టున్నాది.
నీ దుష్ట చర్యలను దునుమాడుకొరకు
కన్ను గోరిన కన్య గద్దెపై నున్నాది
పట్టుమోయ్ శక్తుంటె పటుతరము మీర.
నను బట్ట నీచుడా - నీచేత గాకుంటె
నిండు సభలో అగ్నిగుండాన చావు.

అవి కన్యక రాజును సవాల్‌చేసి, ప్రజలకు రాజు దారుణాలను వివరిస్తుంది. కాని రాజుకు భయపడిన ప్రజలలో స్పందన కనిపించదు. అంతట కన్యక

మండెడు గుండముకు - ముందు దండము పెట్టి.
గుప్పించి యా తల్లి గుండాన దూకింది.
అగ్నిలో అ తల్లి ఆహుతైపోయింది.

ప్రజలు క్రోధాగ్నితో లేచారు.

కాడెలూ, మేడేలూ,
కత్తులూ, సుత్తూలు,
బాకులా బల్లెములా,
పట్టియా రాజును
ప్రాణాలే తీశారా.

అంతటితో,

రాలిపోయేను రాజూ
కూలిపోయేను కోటలూ
రాణువల్లు, రాణియలు
రాలిపోయేరు నాడె

మిక్కిలినేని దళం:

ఇలా నవరసాలను ప్రతిబింబించే ఈ జముకుల కథను రస వత్తరమైన ఈ జముకుల కథను నాటి ప్రజానాట్య మండలిస్థాపకుల్లో ముఖ్యులైన మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, మాచనేని వెంకటేశ్వర రావు, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు మొదలైనవారు లక్ష్మణరావు



గారి వద్ద నేర్చుకుని దానిని ప్రజానాట్య మండలి ముఖ్య కళారూపంగా తీర్చిదిద్దారు. ఈ దళంలో కథకుడు మిక్కిలినేని రాజకీయం. ఉమామహేశ్వరరావు హాస్యం, మాచినేని తరువాత కర్నాటి లక్ష్మీనరసయ్య హాస్యం చెప్పారు.

రసవత్తరమైన ఈ కథ ఆంధ్రదేశంలో 1944 - 1950 మధ్య ఆంధ్ర ప్రజలను ఉర్రూత లూగించింది. మద్రాసు రేడియోలో మూడుసార్లు, విజయవాడ రేడియోలో రెండుసార్లు, ఢిల్లీ రేడియోలో ఒకసారీ ప్రసారం చేయబడింది.

ప్రజానాట్యమండలి రాష్ట్రదళంతోపాటు మద్రాసు, షోలాపూర్, పూనా, బొంబాయి, అహమ్మదాబాదు మొదలైన రాష్ట్రేతర ప్రాంతాల్లో చెప్పబడి అధిక ప్రశంసలను అందుకుంది.

## సుబ్బారావు పాణిగ్రాహి - జముకుల కథ :

ఈ జముకుల కథను శ్రీకాకుళం జిల్లాలోని ఏజన్సీ ప్రాంతంలో గిరిజనోత్సవం, భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా సాగిన రోజుల్లో కామ్రేడ్స్ వెంపటాపు సత్యం - అరికె సోములు, దుప్పల గోవిందరావులు ఆ వుద్యమాన్ని చిత్రిస్తూ తమకు చేతనైన పద్ధతుల్లో జముకుల కథగా చెప్పేవారు. దానిని వుత్తమంగా తీర్చిదిద్ది సుబ్బారావు పాణిగ్రాహి, నిమ్మల కృష్ణమూర్తి మొదలైనవారు శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటానికి మద్దత్తుగా కథలు చెప్పి ప్రజలను చైతన్యవంతుల్ని చేశారు. ఇది ఏనాటికీ వర్థిల్ల వలసిన వుత్తమ కళారూపం.

## నూలు సూర్యారావు దళం :

పీసా లక్ష్మణరావు వ్రాసిన కన్యక జముకుల కథను మిక్కిలినేని దళం రేడియోలోనూ ఆంధ్రదేశంలో అనేక ప్రదేశాల్లో చెప్పే కథలు విని ప్రభావితులైన సామర్లకోటకు చెందిన నూలు సూర్యారావు, దొంతంసెట్టి సూర్యనారాయణ, నూలు భానుమూర్తి మొదలైనవారు ఒక దళంగా ఏర్పడి 'సారంగధర' కథను ఆరువందల కథలదాకా చెప్పారు. రెండు వందల లవకుశ కథలనూ అలాగే కృష్ణలీలలు, బకాసుర వధ - సీతాకల్యాణం మొదలైన అనేక కథలను ఉత్తరాంధ్రదేశంలో విరివిగా పదర్శనాలను ఇస్తున్నారు. పద్దెనిమిది పర్యాయాలు రేడియోలో జముకుల కథా కార్యక్రమాల నిచ్చారు. దాదాపు 25 సంవత్సరాలుగా ఈ బృందంవారు జముకుల కథల ప్రదర్శనాల నిస్తున్నారు.

## జముకుల కథా రచనలు:

జముకుల కథల రచనా విధానం హరిహరీపదాలవలె జంపె వరుసల్లోనే వుంటాయని తంగిరాలవారు జానపద ప్రత్యేక సంచికలో (నాట్యకళ) వివరించారు. తెలుగు సంప్రదాయ వీరగాథల్లో ''ఎల్లమ్మ కథలు'' (పరశురాముని కథలు) హరిహరీ పదాలను కూడ జముకులతో పాడడం కూడా జరుగుతూ వుంది. వీటి ననుసరించే ఆధునిక జముకుల కథలు బయలుదేరాయి.



అనేక బుర్రకథలు వ్రాసిన జాతీయ కవిభూషణ బిరుదాంకితులు, శ్రీ వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు జముకుల కథలను విశేషంగా రచించారు. 1947 నాటికే అజాద్‌హింద్ ఫౌజ్ అనే జముకుల కథని రచించారు. కీ॥ శే॥ పుట్టా సుబ్బారావుగారు పశ్చిమ గోదావరి జిల్లా, కృష్ణాయపాలెంవారు ఈ కథను తమ దళంతో ప్రచారం చేశారు.

శాస్త్రిగారు రచించిన జముకుల కథలు ఇవి. నేతాజీ సుభాస్‌చంద్రబోస్ అంతర్థాన గాథనూ, (1947) 1950 లో రాణీసంయుక్తనూ, 1950 లో ఆజామీళోపాఖ్యానం, 1951 లో భక్తప్రహ్లాద గాంధీజీ నిర్యాణం మొదలైనవి రచించారు కాని ఇవి అన్నీ అముద్రితాలుగానే వుండిపోయాయి.

జముకుల కథలలో పీసాలక్ష్మణరావు కన్యక జముకుల కథ, ప్రజానాట్యమండలి దళమైన మిక్కిలినేని, మాచినేని, ఉమామహేశ్వరరావుగార్లు రేడియోలోనూ, ఆంధ్రదేశమంతటాను విశేషంగా ప్రదర్శించారు. (మరోచోట వివరంగా వ్రాయబడింది.) అలాగే శ్రీ ప్రయాగనరసింహశాస్త్రిగారు, నేతాజీ సుభాస్ చంద్రబోసు వీరగాథనూ, మహాత్ముని జీవితగాథనూ రచించారు. నేదునూరి గంగాధరంగారు ఆంధ్రరాష్ట్ర ప్రబోధాన్ని రచించారు.



పౌరాణిక గాథలను ప్రచారం చేసిన జముకుల కథలనూ, హరిహరీ పదాలను, జాతీయ ప్రబోధానికీ, సాంఘిక ప్రయోజనానికీ కూడ ప్రయోగించారు.



# గొంతాలమ్మ అశ్వనృత్యం

అశ్వనృత్యాలు ఎక్కువగా కృష్ణా గుంటూరు జిల్లాలలో వున్నాయి. అశ్వనృత్యా లను ముఖ్యంగా హరిజనులు దసరా సమయాలలో గొంతాలమ్మను పంట చేలో ప్రతిష్టించి తొమ్మిది రోజులు వుత్సవం జరిపి తరువాత గొంతాలమ్మను తృప్తిపరిచి వుత్సవంతో సాగనంపుతారు. ఈ సందర్భంలో వివిధ విచిత్ర వేషాలు ధరించి చుట్టు ప్రక్కల గ్రామాలన్నీ సంచారంచేసి డబ్బు, ధాన్యం, వస్త్రాలు సంపాదిస్తారు.

## అశ్వ నృత్యం :

వీరి ప్రదర్శనల్లో ప్రాముఖ్యం వహించేది అశ్వనృత్యం. మెడవరకు గల ఒక గుఱ్ఱపు తలను పేడతో చేయించి వివిధ వార్నీషు రంగులతో అలంకరించి, ఇతర శరీర భాగాన్నంతా, తేలిక వెదురు బద్దలతో గుఱ్ఱపు ఆకారాన్ని తయారుచేసి చుట్టూ ఎఱ్ఱ చంగు చీరను కట్టి, ఆ గుఱ్ఱాన్ని చంకలకు తగిలించుకుని వెనుకకూ, ముందుకూ నడుస్తూ, మధ్య మధ్య ఎగురుతూ, కేలమ్మ కేల్, కేల్ భాయి కేల్, అబ్బబ్బ రాయుడే ఆల్పాడి బుంగడే అంటూ అద్భుతంగా నృత్యం చేస్తారు. వీరి నృత్యానికి ఉత్తేజం కలిగించేది, డప్పుల వాయిద్యం. ఈ వాయిద్యపు వరుసల గమకాల ననుసరించి నృత్యగతిని మారుస్తూ ఉధృతంగా నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో డప్పు వాయి ద్యాన్ని విలిపి అందరూ సమిష్టిగా చేతుల్లో చిరుతలు ధరించి ఈ విధంగా పాట పాడుతూ నృత్యం చేస్తారు.

## పాడే పాట :

1. కంచెల చెరిగే చేడి కురులపై
   లలన కురులపై
2. తుమ్మెద లాడిన ఓ లలనా,
   ఘన తుమ్మెద లాడిన ఓ లలనా

3. చెమటకు తడిసిన చెదిరిన గంధం
ఘుమ ఘుమ లాడిందో లలనా ॥కం॥

4. చెరిగేటప్పుడు చేతుల గాజులు
గల గల లాడిన ఓ లలనా ॥కం॥

5. గొప్పది రోకలి గుప్పున వంచగ
జబ్బలు కదిలిన ఓ లలనా
ఘన జబ్బలు కదిలిన ఓ లలనా ॥కం॥

ఈ విధంగా ఒక ప్రక్క నృత్యం జరుగుతూ వుంటే, చుట్టు ప్రక్కల ఇళ్ళలో వుండే స్త్రీ, పురుషులతో పాటు, పిల్లలుకూడా వుత్సాహంగా మూగుతారు. ఈ సమయంలో సోడిగాడు వంకర దుడ్డుకట్టను చేతబట్టి వచ్చెరబాబు సోడిగాడు అంటూ వంకర దుడ్డుకట్టను పిల్లల కాళ్ళకు పట్టి లాగుతూ, భయపెట్టి నవ్విస్తూ వుంటాడు. సోడిగాడు వేషధారణ నవ్విస్తూ వుంటుంది. (మరోచోట సోడిగాడిని గురించి వేషధారణతో సహా ఉదహరించబడింది.)

ఓ చిన్నదాన :

ఈ నృత్యంలోనే

ఓ చిన్నదాన, ఓ చిన్నదాన
గుంటూరు చిన్నదాన
గురుగూ మెట్టాలమీద
గజ్జ లుంటె పోకే ॥ఓ చిన్నదానా?॥

నల్ల నల్లటిదాన
నడుము సన్ననిదాన
నడుమూ సన్నముమీద
నగ లుంటే పోకే ॥ఓ చిన్న॥

అంటూ శృంగార పదాలనుకూడా అద్భుతంగా పాడుతారు.

## గుఱ్ఱాల కదం :

ముఖ్యంగా గుంటూరు జిల్లాలో ఒకప్పుడు పెళ్ళి సందర్భాలలో, పెండ్లికొడుకులు, నిజమైన గుఱ్ఱమెక్కి పెళ్ళికూతురు వూరికి పెళ్ళి పెద్దలతో తరలి వెళ్ళేవారు, ఇలా వెళ్ళే సందర్భంలో దారిలో వున్న గ్రామాలలో డప్పుల వాయిద్యాలతో గుఱ్ఱాన్ని కదను త్రొక్కిస్తారు. డప్పు వాయిద్యానికి అనుగుణంగా కాళ్ళతో నృత్యం చేయిస్తారు. దీనిని కదం త్రొక్కించటం అనేవారు. అందుకోసం గుఱ్ఱాలను తయారు చేసి, వాటిని చక్కగా అలంకరించి, వాటికి నృత్యం నేర్పేవారు. ఈ గుఱ్ఱపు నృత్యాన్ని చూడటానికి గ్రామ ప్రజలు గుమికూడి ఆసక్తితో చూసేవారు. చెప్పినట్లుచేసే ఈ గుఱ్ఱపు నృత్యం కనుల పండువుగా వుంటుంది.



ఈ గుఱ్ఱాల నృత్యాలను పెండ్లిండ్ల సమయాలలోనూ, కోటప్పకొండ లాంటి తిరుణాళ్ళ సమయాలలోనూ సుందర గుఱ్ఱపు నృత్యాలు జరుగుతూ వుంటాయి.







# గంగవెఱ్ఱి నెత్తించే గంగమ్మ జాతర్లు

ఆంధ్రదేశంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా, గంగానమ్మ, పోలేరమ్మ, మాచమ్మ, మరిడమ్మ, మహాలక్ష్మమ్మ, మహంకాళమ్మ మొదలైన ఎన్నో పేర్లతో ఈ జాతర్లు జరుగుతూ వుంటాయి. ఇది తరతరాలుగా జరుగుతున్న జాతర్లు. ప్రజలు ఎంతో భక్తిశ్రద్ధలతో జరుపుకునే జాతర్లు. ఈ జాతర్ల ద్వారా పల్లె ప్రజలు ఎంతో మనశ్శాంతిని పొందుతూ వుంటారు.

అలా రాయలసీమలో కూడ ఏ మూల ప్రాంతానికి వెళ్ళినా కనిపించే దేవత గంగమ్మ అనీ, సాధారణంగా ప్రతి గ్రామానికీ ఒక గంగమ్మ వుంటుందనీ, కొన్ని వూళ్ళకు ఇద్దరేసి గంగమ్మ లుంటారనీ, ఒకరు బ్రాహ్మణాది జాతర్లకూ, మరొకరు హరిజనులకు వుంటారనీ, అలాంటిదికాక, ఒక్క కాళహస్తిలో మాత్రం ఏడుగురు గంగమ్మ లున్నారనీ ఉస్మానియా యూనివర్శిటీ తెలుగుశాఖ రీసెర్చి స్కాలర్ మాదిరెడ్డి అండమ్మగారు .... తెలుగు పత్రికలో వివరించారు.

## జాతర నిర్ణయం :

గంగమ్మ జాతర జరపాలంటే పెద్దలందరూ సమావేశమై ఒక తేదీని నిర్ణయించి ఆ విషయాన్ని చాటింపుద్వారా గ్రామ ప్రజలకు తెలియచేసి గంగమ్మలను స్థాపించే మూడు రోజులు ముందుగా అంటే డిసెంబరు నెల రెండవ ఆదివారం అర్ధరాత్రిని 12 గంటలకు చాటింపు వేస్తారు. ఇది జరిగిన తరువాత ఆ వూరి వారు ఎక్కడ వున్నా జాతర సమయానికి చేరుకుంటారు.

కుమ్మరి వచ్చి మట్టితో ఒక్కో వీధికి ఒక్కొక్క గంగమ్మ చొప్పున, ఏడు వీధులకూ ఏడు గంగమ్మలను తయారుచేసి, ముఖ్యంగా ఇది కాళహస్తి విషయం. ముత్యాలమ్మ గుడివీధిలోనూ, పూసల వీధిలోనూ, సన్నిధి వీధిలోనూ, గుడి వీధి, గాంధీ వీధి, కొత్తపేట వీధి ఇలా ఏడు గంగమ్మలతోపాటు ప్రతి గంగమ్మకూ ఇద్దరేసి ఉప గంగమ్మల చొప్పున 14 ఉపగంగమ్మలను కూడా అందంగా తయారుచేసి పసుపు కుంకాలతో పూలతో అలంకరించి, దాగెర అనే వెదురు గంపలో వేపాకు పెట్టి దానిపైన మూడు గంగల్ని పెడతారు.

## అర్ధరాత్రి గంగమ్మ :

అలంకారాలు ముగిసేటప్పటికి అర్ధరాత్రి అవుతుంది. గంగమిట్ట దగ్గరకు గంగలు చేరగానే పంబలవాడు గంగమ్మ కథను క్లుప్తంగా చెపుతాడు. ఆ తరువాత చిన్న కోడి మెడ విరిచి అగరం ఇస్తారు. ఏడుగురు గంగమ్మలకు, రజకులు (చాకలివారు) ఏడు కుంభాలు పెడతారు. ఈ కుంభాలకు కావలసిన సరంజామానంతా ఇస్తారు. కుంభంపైన, ములగ ఆకుకూర, వంకాయకూర, ఎండుచేపల పులుసు పెడతారు. ప్రతి కుంభంపైన పిండిదీపం వెలిగించి పొట్టేళ్ళను బలియిస్తారు.

ఈ తతంగమంతా పూర్తి అయిన తరువాత గ్రామంలో గంగమ్మలను దించుకోవడానికి ప్రతి వీధిలోనూ ఒక గుడిని నిర్మిస్తారు. ఆ గుడిని పందిరిగావేసి, వేపాకులు వ్రేలాడగట్టి గుడిని అలంకరిస్తారు.

ఏడుగురు రజకులూ గంగమ్మలను ఎత్తుకుంటారు. మేళతాళాలతో, ఆట పాటలతో ముందుగా ముత్యాలమ్మ గుడివద్దకు వస్తారు. పంబలవాడు కోడి మెడను విరిచి హారం ఇస్తాడు.



ఇలా గంగమ్మలు వచ్చేదారిలో ప్రతిచోటా రజకులు జంతు బలులతో రక్తతర్పణం చేస్తారు. ముత్యాలమ్మ గుడివద్ద ఆ వీధి గంగమ్మ దిగగానే, ఏ వీధి గంగమ్మ ఆ వీధికి వెళ్ళిపోతుంది. ప్రతి వీధి గంగమ్మ ఆ వీధిలోని వారు జంతువుల్ని బలి యిస్తారు.

ముత్యాలమ్మ గుడివద్ద దిగిన గంగమ్మను శక్తి వంతమైన దానినిగా భావిస్తారు. అందుకే ఆమెను ముందుగా ప్రతిష్ఠిస్తారు.

## నట్టింటి పోలేరమ్మ :

గ్రామంలో గంగమ్మలను స్థాపించిన తరువాత, చిన్నలూ, పెద్దలూ చుట్టాలతో ఇల్లు నిండిపోతుంది. అందరూ క్రొత్త బట్టల్ని ధరించి అమిత వుత్సాహంతో వుంటారు. ప్రతి ఇంటిలోనూ నట్టింట పోలేరమ్మను ఎవరికి వారు ఒక గోడకు పసుపురాసి కుంకుమబొట్లు పెట్టి .... మూడు విస్తళ్ళలో కుంభం కూడును పెట్టి పైన గంగమ్మల పెట్టిన మాదిరే కూరలను పెడతారు. పిండితో చేసిన ప్రమిదల్లో మూడు దీపాలు వెలిగించి మూడు విస్తళ్ళల్లో పెడతారు. గంగమ్మ కదిలే వరకూ ఈ దీపాలు ఆరిపోకుండా చూస్తారు. వారికున్న మ్రొక్కులన్నిటినీ తీర్చుకుంటారు. చీరెను పెట్టి కోరికలు కోరుకుంటారు.

అంతేకాక ఒక కుండలో అఖండలం వెలిగించి, నట్టింటి పోలేరమ్మ వద్ద పెడతారు. తరువాత ముత్తైదువలు దానిని ఎత్తుకువెళ్ళి గంగమ్మ వద్ద మూడు ప్రదక్షిణాలు చేసి కుండను ఎత్తి పగలకొడతారు. పగిలిన రెండు మూడు పెంకుల్ని ఇంటికి తెచ్చుకుంటారు. పగిలిన పెంకులు ఇంట్లో వుంటే ఏ ఆపదా రాదని అలా చేస్తారు.

గంగమ్మను కదిలించిన తరువాత ఇంటిలో గోడకు పెట్టిన పోలేరమ్మ బొట్టును తుడిచి వేస్తారు.

వెంకటగిరిలో ఈ పోలేరమ్మ జాతరను వైభవంగా జరుపుతారు. వెంకటగిరి పోలేరమ్మను గోడకు పెట్టే బొట్లుతో కాకుండా నట్టింటిలో పీటవేసి పీటపైన బోనం కుండనుగాని, దీపాన్నిగానీ పెట్టి దానిని దేవతగా పూజిస్తారు. అస్పృశ్యుడు, ప్రవేశార్హతలేని ఆసాది ఆరోజున నట్టింటిలోకి గంగమ్మ ప్రతీకగా భావించే త్రిశూలంతో ప్రవేశిస్తాడు. ఇంటివారిని అదిరించి బెదిరించి కట్నాలు కానుకలు వసూలు చేసుకుంటాడు.

## గణాచారులు :

గంగమ్మలు దిగినప్పటినుంచీ గంగమ్మలవద్ద జరిగే హడావిడి ఇంతా అంతా అని చెప్పలేం. ప్రతివారికీ గంగమ్మ ఆవహించినట్లు గణాచారులై పోతారు. అట్టహాసంతో ఆవేశంతో వూగిపోతారు. ఈలలు, కేకలు, గణాచారుల గంతులు, ఆసాదుల డప్పు వాయిద్యాలు ఎవరికి తోచినట్లు వారు నృత్యాలు, కొందరు గంగను స్తుతించటం, కొందరు తిట్టటం, కొందరు ఆవేశంతో ఏడుస్తారు. కొందరు భూమి

మీద సాష్టాంగ పడిపోతారు. పంబలవారిని ప్రశ్న లడుగుతారు. గంగమ్మ ముందు తల్లి పగలగొడతారు. ఊరంతా ఈ కోలాహలంలో మునిగిపోతారు. ఈ సందడిలో ఎందరో మత్తుగా త్రాగి చిందులూ, గంతులూ వేస్తూ అట్టహాసం చేస్తారు.

గంగమ్మను కదిలించగానే జ్యోతిని ఎత్తుకుని ముత్యాలమ్మ గుడిని చేరిన రజకులు నిద్రమత్తులో త్రాగిన మైకంలో, ఎర్రబడ్డ కళ్ళతో జ్యోతి ఎగదోస్తూ, అది ఆరిపోకుండా కాపాడుతూ వుంటారు.



ఆయా వీథులవారు ఒక్కొక్క గంగమ్మను రథంపై పెట్టుకుని బయలుదేరు 'రు. ఆ రథాలను విద్యుద్దీపాలతో అలంకరించి, బాజాబజంత్రీలతో తప్పెట్ల వాయిద్యాలతో ఆటలతో పాటలతో ముత్యాలమ్మ గుడివద్దకు చేరుకుంటారు. ఈ వుత్సవం ఒక పట్టాభిషేకమహోత్సవంలా వుంటుంది. రజకులు మాత్రం సాంప్రదాయపు కాగడాలతోనే వుంటారు.

## ఎరుపెక్కిన ముత్యాలమ్మ :

దేదీప్యమానంగా ప్రజ్వరిల్లుతున్న ఏడు జ్యోతుల వెలుతురు పసుపు కుంకాలతో ఎరుపెక్కిన ముత్యాలమ్మ ముఖం ఎఱ్ఱగా మారిపోతుంది. భయాన్నీ భక్తినీ కలుగజేస్తుంది. పూజారి ఆమెను ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తాడు.

కుంభం కూడుపెట్టిన తరువాత గంగమ్మలను రజకులు ఎత్తుకుంటారు. ఆసాదివారు అనుసరిస్తారు. వారు ముందుగా గంగ మిట్టవద్దకు వెళ్ళి, అక్కడనుంచే సువర్ణముఖినదీ తీరానికి వెళతారు. ఆసాది వాడు బూతుపదాలు పాడుతూ వెళతాడు. జనం కూడ అతనిని అనుసరిస్తారు. దీవెన పదాలు పాడిన తరువాత గంగలను స్వర్ణ ముఖిలో నిమజ్జనం చేస్తారు.

ఇలా పూర్వ సాంప్రదాయంతో తరతరాలుగా వస్తున్న ఈ గంగ జాతర్లను జరుపుతూ ఆ వుత్సాహంలో ఎన్నో జానపద గేయాలను, జానపద నృత్యాలను, జాన పద వాయిద్యాలను ప్రయోగించి వుత్సవాలను జరుపుకుంటున్నారు.



కాలంమారిన దృష్ట్యా నాగరికత అభివృద్ధిచెందిన ప్రాంతాల్లో ఈ గంగజాతర్లు కొంచెం తగ్గినా వెనుకబడ్డ గ్రామాలలోనూ, వెనుక బడ్డ జాతులలోనూ ఈ గంగజాతర్లను భక్తిభావంతో చేస్తూనే వున్నారు. మన జానపద విజ్ఞానానికి గుర్తులు గంగజాతర్లు.





# జిత్తులమారి

# కత్తుల గారడీ

బతుకు పోరాటం కోసం కత్తులతో చెలగాటం ఆడే కత్తుల గారడీవాళ్ళను ఈ నాటికీ ఆంధ్రదేశంలో అక్కడక్కడ చూస్తూ వుంటాం.



కూటికోసం కోటి విద్యలన్నట్లు పొట్టపోసుకోవటానికి అనేక విద్యల్ని ఆనాటి భిక్షుకులు ఆయా విధానాలను అవలంబించారు.

ఆయా విధానాల ద్వారా ప్రజలను ఆకర్షించీ, ఆనందపర్చీ, వారిని మెప్పించీ, వారి ద్వారా పారితోషికాలను పొందుతూ, వారి జీవితాలను, వాటితో వెళ్ళబుచ్చుకుంటూ కాలం గడిపేవారు ఎంతోమంది కనపడుతూ వుంటారు.

కొందరు కళారూపాలను ఎన్నుకుంటే మరికొందరు, గారడీలనూ, మంత్ర తంత్రాలనూ, మాయాజాలాలనూ అనుసరించారు. మరికొందరు ఆటపాటలను అనుసరించారు.

ఎవరు ఏది అనుసరించినా ప్రజలను ఎలా ఆకర్షించాలనేదే ముఖ్యవిషయం.

అలా ఆ రోజుల్లో ప్రజలను ఆకర్షించే అన్ని విధానాలూ, కళారూపాలుగానే వర్ధిల్లాయి. ఆ కోవకు చెందిందే ఈ కత్తుల గారడీ.

కత్తుల గారడీ వారు రెండు బుగ్గలకూ కత్తిని ఈ దరి నుంచి ఆ దరికి పొడుచుకునీ, కంఠాన్ని సగంవరకూ కోసుకున్నట్లు కత్తిని పొడుచుకునీ, శరీరం అంతా రక్తమయం చేసుకునీ, ముఖ్యంగా రొమ్ములమీద ధారలుగా కార్చుతూ, చూపే వారిని భయభ్రాంతుల్ని చేస్తూ, వారిలో జాలిని కలిగించి యాచిస్తూ వుంటారు. ఈ దృశ్యాన్ని పిల్లలూ, పెద్దలూ ఎంతో ఆసక్తితో తిలకిస్తారు. ఇలా కత్తులతో చెలగాటా లాడేవారిని కత్తుల వాళ్ళనీ, కత్తుల గారడీ వాళ్ళనీ, ఇచ్ఛాపురం మొదలైన ప్రాంతాల్లో కోతలరాయుళ్ళనీ పిలుస్తూ వుంటారు.

వీరి ప్రదర్శన డప్పుల వాయిద్యంతో అటహాసంగా ప్రారంభమౌతుంది.
కత్తుల్ని ఇతరులు గుర్తించలేని విధం
చేతి దండలకూ, దిగబడినట్లు
కత్తిని రెండు ప్రక్కలా స్ప్రి
బిగువుతో కత్తులు చర్మంలో
భాగం, ఈ ప్రక్క సగభాగం
కుండా చిక్కటి రక్తపు రంగ

మరి కొంతమంది క
ముక్కనూ, ఈ ప్రక్క ఒక
పెద్ద గన్నేరుకాయల రసాన్ని
కత్తులు నిలబడిపోతాయి. దా
తారినట్లే కనిపిస్తుంది.

ముఖ్యంగా ఈ కత్తు
వగా ఉపయోగిస్తారు. ఎందుక
కలగటానికి ఇలా వారు ఒకరోజు బజారునపడితే ఆ రోజు హా యిగా
జీవితం గడిచిపోతుంది. ఇలా ఒక ఊరినుంచి మరో వూరికి పోతూ
జీవితాన్ని సాగిస్తారు.



# శివమెత్తించే వీరశైవుల
# వీరభద్ర విన్యాసాలు

ఆంధ్రదేశంలో వీరశైవ సంప్రదాయం వారు ఎక్కువమంది ఈ వీరభద్ర విన్యాస నృత్యాలు చేస్తూ వుంటారు. ఈ విధానాన్ని వీరభద్ర పళ్ళెంపట్టటమంటారు. అంతేకాక శైవమత సంప్రదాయంగల పద్మసాలీల దేవుడైన భావనాఋషి వుత్స



వీరావేశంతో నారసాలు పొడుచుకోవడం

వాలలోనూ, విశ్వబ్రాహ్మణుల వీరభద్రస్వామి వుత్సవాలలోనూ, ఈ నృత్య విన్యాసం జరుగుతూ వుంటుంది.

## ఖడ్గ విన్యాసం :

పైన వివరించిన వుత్సవాలలోనేగాక పెద్ద పెద్ద జాతర్ల సందర్భాలలో కూడ ఈ వీరభద్ర నృత్య విన్యాసం జరుగుతూ వుంటుంది. ఈ నృత్యాన్ని ఖడ్గ నృత్యమని కూడా పిలుస్తారు. ఈ నృత్యం ప్రత్యేకంగా కొన్ని జాతులవారు మాత్రమే చేస్తారు. ఏ కులంవారైనా వీరశైవ మతాన్ని అవలంబించిన ప్రతివారూ ఈ నృత్యాన్ని తప్పక చేస్తారు.

## తంతు, తతంగం :

ఈ నృత్య సమయంలో పెద్ద పెద్ద ప్రభలు గట్టి ఆ ప్రభలను అనేక అలంకారాలతో ముంచిపేస్తారు. ప్రభకు ముందూ వెనుకా స్త్రీ పురుషులు నడుస్తూ వుంటారు. ప్రభముందు సన్నాయి వాయిద్యకాండ్రు రెండు మూడు దళాలువారుంటారు. ముఖ్యంగా ఈ నృత్యంలో వీరు వాయించే వాయిద్యం వీరంగం. ఇది ఒక ప్రత్యేకమైన వాయిద్యం. కణకణమని అతిదురితంగా డోళ్ళు మ్రోగుతాయి. సన్నాయి బూరలు తారాస్థాయిలో గుక్కపట్టి నృత్యకారుని చెవుల్లో వూదుతారు. సాంబ్రాణి ధూపం ముఖానికి ఉక్కిరి బిక్కిరి అయ్యేలాగా పట్టిస్తారు. దీనితో ఖడ్గధారి వీరావేశంతో ఒక్క గెంతు గెంతి దశ్శరభశరభ, అశ్శరభ శరభ అంటూ డోలు వాయిద్యగాళ్ళను కవ్విస్తూ .... అదదదద - అబబబబ - అగగగగ .... అని డోలు వాయిద్యగానిని కవ్వించి ముక్తాయింపులు ఇప్పించి దశ్శరభ, అశ్శరభ అని దక్షుని దండకం ఈ విధంగా ప్రారంభిస్తాడు.

## దక్షయజ్ఞ దండకం :

దక్షుండు యజ్ఞంబు ॥శరభ॥
తలపెట్టె నందులో దశ్శరభ ,,
బ్రహ్మదేవుని గుండె ॥శరభ॥
భగ్గుమనియె శరభ ,,
వింటిరా సురులార శరభ
విన్నపం బొక్కటి శరభ
కలగంటి ఈ రాత్రి శరభ
కల్లగాను కల్లగాను అగగగగ, శరభ అశ్శరభ

మహిమీద పార్వతి శరభ
మాయమై పోయెనని శరభ
పరమేశ్వరుని హెూమము శరభ
భగ్గుమనియె శరభ



చెమట బట్టగ తీసి శరభ
చట్రాతిపై వేసి శరభ
వరేశ్వరుడు బుట్టె శరభ
విశ్వమునకు శరభ
పట పటా బ్రహ్మాండ వలము లన్నియు ॥శరభ॥
కొట్టె గద దక్షుని ॥శరభ॥
తోలెగ దరివుల ॥శరభ॥

దండించ వైరుదు ॥శరభ॥
నీ మింద డనగ ॥శరభ॥
మొక్క జొచ్చితిమి గదా మోసపోయితిని ॥శరభ॥
వెన్ను గల అన్నకు శర ॥శరభ॥
ఏనుగు తల బుట్టెనని ॥శరభ॥
గుడిమీద తాతకు ॥శరభ॥
గొఱ్ఱె తల ఇంపాయె ॥శరభ॥
పరుల గుణవిహార ॥శరభ॥
కోసూరి వీరభద్ర ॥శరభ॥
అదదద, ఆగగగ, అదదద, అగగగ
శరభ, దశ్శరభ, అశ్శరభ, శరభ, శరభ.

అంటూ ఆర్భాటం చేస్తారు. వీరంగ ధ్వనులు మిన్నుముట్టుతాయి. ఇలా ఖడ్గం పట్టి దండకం చదువుతూ, వాయిద్యాల గమకాలననుసరించి, వీరావేశంతో ఆ ప్రక్కకూ, ఈ ప్రక్కకూ అడుగువేస్తూ కంకణంకట్టిన కత్తిని వేగంగా త్రిప్పుతూ ఆసాంతంలో ఏ గ్రామదేవతనుగాని ఏ దేవుణ్ణి పూజిస్తారో, ఆ గ్రామం పేరు తలచి జై మంగళగిరి వీరభద్ర అని ముగించి మరల వాయిద్యగాండ్రను ఆదరించి శరభ, శరభ అంటూ నానాహంగామా చేసి ఆ కత్తిని ఎవరైతే ఆ వుత్సవాన్ని నిర్వహిస్తున్నారో, అతని పళ్ళెంలో వుంచుతారు.

ఇలా వూరంతా ఊరేగుతూ ఒక్కొక్క మజలీవద్దా .... అంటే నాలుగు వీథులూ కలిసిన చోట్లల్లా ఒక్కొక్క వ్యక్తి పై విధంగా ఖడ్గ నృత్యం చేస్తాడు. ఇలా వుత్సవం ముందుకు సాగేకొద్దీ జనసమూహం ఎక్కువై ఎంతో ఉద్రేకాన్ని కలిగిస్తుంది. నృత్యధారి ధరించే ఖడ్గం చాలా భారీగా వుంటుంది. ఖడ్గం మిలమిల మెరుస్తూ వుంటుంది. ఖడ్గం మధ్యభాగంలో తమలపాకులతోగాని, మామిడాకులతో గాని కంకణం కడతారు.

ఖడ్గధారి కర్తవ్యాలు :

ఖడ్గం ధరించే వ్యక్తి విభూతిరేఖలు పట్టించి, విచిత్రవేషధారణలో వుంటాడు. ఖడ్గం ధరించే వ్యక్తి ఆ రోజున ఉపవాసముంటాడు. ప్రతివారూ ఈ నృత్యంచేయడం కష్టం. నృత్యంచేసే ప్రతి వ్యక్తీ దక్షుని దండకాన్ని తప్పనిసరిగా నేర్చుకోవాలి.

లేనట్లయితే అడుగుపడదు. ఖడ్గ నృత్యధారి ప్రళయతాండవంగా నృత్యం చేసిన తరువాత శివమెక్కి ఆవేశంతో నారసాలు పొడుచుకుంటాడు.

## నాలుకపై నారసాలు:

ఖడ్గనృత్యంలో ఈ నారసాల నృత్యం మహా వుత్తేజంగానూ, భయంకరంగానూ వుంటుంది. ఖడ్గనృత్యం అయిన వెంటనే ఆ వ్యక్తి నారసాలు పొడుచుకుంటాడు. నారసాలంటే రెండు మూడు రకాలుగా వుంటాయి - ఏకనారసం - కంటి



నారసం - గొంతు నారసం - శిరసు నారసం - శూల నారసం - మొదలైన పేర్లతో వుంటాయి. ఇవి శూలం మాదిరిగా వుండి, త్రిశూలం చివరి భాగంలో నూనె గుడ్డలు చుట్టి, వాటిని వెలిగించి, సన్నని మొన భాగాన్ని నాలికపై గ్రుచ్చుతారు. ఇలా గ్రుచ్చే సమయంలో జోరుగా వాయిద్య సమ్మేళనం జరుగుతుంది. రణగొణ ధ్వనులు చేస్తారు. వుద్రేకంలో వున్నవారికి కర్పూరం వెలిగించిన పళ్ళెం చేతికిస్తారు. నృత్యకారుడు చేతితో నారసాన్ని పట్టుకుని వాయిద్యానికి తగినట్లు వీరాధివీరుడిలా గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేస్తాడు. చేసేకొద్దీ వాయిద్యాల జోరు ఎక్కువ అవుతుంది. ఈ జోరులో వెలిగించిన వత్తులు, ఒక్కొక్కటిగా ఆరిపోవడంతో ఈ నృత్యం పూర్తి అవుతుంది.

## రాయలసీమలో:

ముఖ్యంగా రాయలసీమలో తమ తమ ఇలవేల్పుల మీద చదివే పద్యాలను ఖడ్గాలని అంటారు. వీరభద్ర ఖడ్గాలూ, చౌడమ్మ ఖడ్గాలూ మొదలైనవి.

ముఖ్యంగా వైశ్యులు కన్యకాపరమేశ్వరినీ. సాలెవారు చౌడేశ్వరినీ, విశ్వ బ్రాహ్మణులు కాళికా శక్తినీ, కురుబలు, కురుమలు వీరభద్రుని కొలుస్తారు.

వీరి ఖడ్గ ప్రదర్శనం వీరావేశంతో కూడుకుని వుంటుంది. స్త్రీలూ, పురుషులూ ఒక గుంపుగా వీధిలో ప్రవేశించి అక్కడక్కడ ఆగుతూ ఈ ఖడ్గాలు చదివి ముందుకు సాగుతారు. ఖడ్గధారి ఖడ్గం చదివేటప్పుడు గుంపులోనుంచి ముందుకు వస్తాడు. సాంబ్రాణి ధూపంతో అతనిని ముంచెత్తుతారు. సన్నాయి బూరలతో, డోళ్ళతో, శంఖాలతో, ఖడ్గధారిని ఆవేశపరుస్తారు. ఆ ఆవేశంలో ఖడ్గదారి ఖడ్గం చదువుతాడు.

చౌడమ్మ ఖడ్గం :

చౌడమ్మ ఖడ్గం రాయలసీమలో ప్రచారంలో వున్నదనీ, దీనిని పూరించిన వారు, బీరే బాలప్ప, తొగట వీరక్షత్రియ అనీ, చేనేత వృత్తి వారనీ, అనంతపురం జిల్లా, రాయదుర్గం తాలూకా, పెదకాకుంట్ల గ్రామస్థులనీ తూమాటి దోణప్పగారు నివేదిస్తున్నారు.

ఖడ్గం :

అహహా శాంభవే - అహహా శాంభవే
విభూతి ఒకచేత - వీరంగ మొకచేత
ఘన ఘనా గంటలే - ఘల్లుమనగా
చక్రంబు త్రిప్పితే భూచక్ర గొడుగులు
చుక్కలన్ని గూడి ప్రగ్గడిల్లా
అహహా నీ మాయలు నెలకొంటినే నైకతాంబా
సరస సద్గుణ నికురాంబ శ్రీ శారదాంబా.

అంటూ స్తోత్రాలను చేస్తారు. ఇంతకూ చెప్పొచ్చేదేమంటే, దీనిలో భక్తిభావమూ, శైవమత ప్రచారమూ ఇమిడి వున్నాయి

ఇలాంటి ఖడ్గనృత్యాలు దక్షిణ దేశంలో తిరువాన్కూరులో వున్నాయి. ఈ నృత్యాన్ని ''పాతాయం'' అని పిలుస్తారు.



# సుద్దులు చెప్పే గొల్లసుద్దులు

గొల్లసుద్దులను చెప్పేవారు గొల్లలను మాత్రమే యాచిస్తారు. యాదవ చరిత్రకు సంబంధించిన కృష్ణలీలలు కాటమరాజు కథ మొదలైన వాటిని సుద్దులవారు



ప్రచారం చేస్తూ వుంటారు. ఈ ప్రచారకులు ఆంధ్రదేశమంతటా వున్నారు. అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిలో గొల్లసుద్దులను ఈవిధంగా వర్ణించాడు.

పద్యం

కొమ్ములు దీరణాలు జిగుగుల్కొడు వ్రాతల కృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిడి కట్టురుమాలలున్నెటా
సొమ్ములు నావముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్.

## గుడ్డలమీద బొమ్మల కథలు :

గొల్లసుద్దులవారి కథా వివరాన్ని, పెద్ద పెద్ద వస్త్రాలపై చిత్రించి బొమ్మల సహాయంతో కథలను చెపుతారు. వీరి మాదిరే తెలంగాణాలో పాండవులనే తెగ

వారు భారత కథల్ని చీరలపై చిత్రించి పెద్ద పెద్ద బొమ్మల సహాయంతో ప్రజానీకానికి పాడి వినిపిస్తారని డా॥ బి. రామరాజుగారు వారి జానపదగేయ సాహిత్యంలో తెలియచేశారు.

పై పద్యంలో వివరించిన మాదిరి కొమ్ముల్నీ వీరణాలనూ వాయిస్తారు. వీరణం పెద్ద డోలు వంటిది. కొందరు శంఖాలను కూడా పూరిస్తారు. గొల్లలలో అనేక తెగలవారు వున్నప్పటికీ అధిక సంఖ్యలో వున్నవారు ఎఱ్ఱగొల్లలే. వీరి ప్రధానమైన వృత్తి ఆవుల మందలనూ, గొర్రెల మందలనూ పెంచుతారు. యాదవులకు ప్రధానదేవతయైన గంగమ్మకు జాతర్లు మొదలైన వుత్సవాలు చేస్తూ వుంటారు. అలాంటి వుత్సవాలు దొనకొండ, అలవలపాడు మొదలైన చోట్ల జరుగుతున్నాయి. దర్సన్ పండితుడు ఈ గంగ పూజల్ని వీరుల పూజలుగా పేర్కొన్నాడు.

గొల్లలు సాధారణంగా అందరు వైష్ణవులే. అయినా వీరిలో కొందరు శైవులు కూడా వున్నారు. సంఘంలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్యజాతుల తరువాత గొల్లలే అధికులని చెపుతారు. రెడ్లు, వెలమవారు, గొల్లల సరసన కూర్చుని తినడానికి వెనుకాడరు. యాదవులకు అంతటి స్థానముందని గుర్తించారు.

గొల్లలలో కొన్ని తెగలున్నాయి. వారిలో ఎఱ్ఱగొల్లలు అందరికంటే శ్రేష్ఠులు. గొల్లసుద్దులు చెప్పేవారు ఎఱ్ఱగొల్లలే. గొల్లలలో వైష్ణవమతం పుచ్చుకున్నవారికి బ్రాహ్మణులే పౌరోహిత్యం నిర్వహిస్తారు. ముఖ్యంగా గొల్లలవృత్తి మేకలను పెంచటం, గొల్లసుద్దులను భిక్షాటనగా ఉపయోగిస్తారు కూడా. వీరు కూడా గొల్లసుద్దుల్లో హరి హరి నారాయణా ఆ॥. అంటూ పల్లవిని కొంతమంది వాడుకోవటం కూడా కద్దు.

ఉదాహరణకు :

గొల్లల గోత్రాలు గొల్లల కెరుక
గొల్లల గోత్రాలు - గొల్లల కెరుక
వీరి వారి గోత్రాలు తోడేళ్ళ కెరుకో హరి, హరి.

అంటూ సంఘంలో వున్న చెడును తొలగించటానికి ఈ పద్ధతిలో కొందరు విడిగా సుద్దులు చెప్తుతారు.

ఈ సుద్దులకు ప్రత్యేకమైన ఛందస్సు వుందనీ, దానికి కూనపదమనీ, జానపద ఛందస్సులో పదం చాలా ప్రసిద్ధమైనదనీ తాళ్ళపాక అన్నమయ్య క్షేత్రయ్య పేనయమంత్రి మొదలైనవారు ఈ పదరచనలో ప్రసిద్ధులనీ, ఈ పదాలలో కూడా అనేక రకాలున్నాయనీ, అందులో ఒకటి కూనపదమనీ, కూనపదమంటే చిన్న పదమనీ శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు నాట్యకళ, జానపద సంచికలో వివరించారు.

గొల్ల సుద్దులన్న ఎక్కువగా కూనపదాలుగానే వుంటాయి. ఈ పదాన్ని ప్రధాన గాయకుడు ఆలపిస్తే ప్రక్కనున్న ఇద్దరు వంతలూ, ఆ పదాన్ని ఆఁ అంటూ సాగతీసి చెవికి చేయి కప్పి పాడతారు. ఈ పదాల్ని గొల్లలు గొఱ్ఱెలను కాస్తూ వాటిని రాత్రిళ్ళు తోడేళ్ళ బారినుండి కాపాడటానికి రాత్రి తెల్లవార్లూ పాడుతూనే వుంటారు.

హరిహరీ నారాయుడ
ఆదినారాయుడ
కరుణించి మమ్మేలు
కమలలోచనుడ.

అంటూ ప్రారంభించి కృష్ణగాథలు చెపుతారు. యాదవుడి గోవులను, మాధవుడు గాయుంగ మాధవుడు మచ్ఛావతారమైనాడు. అని దశావతార సంకీర్తన పాడుతారు.

గొల్లసుద్దుల ప్రారంభంలో కథకులు రంగస్థలం మీదికి సరాసరి రారు. ప్రేక్షకుల మధ్య నుంచే ఆ మూలనుంచి ఒకరు, ఈ మూలనుంచి ఒకరు టుర్‌కీ అంటూ గొఱ్ఱెలను అదలించినట్లూ. తప్పిపోయిన గొఱ్ఱెలకోసం వెతికినట్లు, తోడేళ్ళను కేకలతో అదరగొట్టినట్లు హడావిడి చేసి రంగంమీద కొస్తారు.

వచ్చిన తరువాత వారూ వీరూ వచ్చారా అని పరామర్శచేసి హాస్యపు ఛలోక్తులతో ప్రేక్షకులను ఆకట్టుకుని నృత్యంతో కథను ప్రారంభిస్తారు. వంతశృతినే కథకుడు శ్రుతిగా ఆధారం చేసుకుంటాడు. ఒకప్పుడు వీణలను ఉపయోగించేవారట వాయిద్యంగా. ఆ వీణ ఎటువంటిదో మనకు ఆధారం లేదు. ఆ తరువాత చేకోలను ఉపయోగించేవారు. వీరి కథల్లో పెద్ద డోలుకూడా వుంటుంది. ఇక వేషధారణలో కథకునికి పెద్ద తలపాగా, వెండి బిళ్ళల మొలత్రాడు, చెవులకు దిద్దులు, చేతులకు తెల్లని మురుగులు, భుజంమీద గొంగడి, చేతిలో



పెద్ద కట్టు వుంటుంది. సుద్దులు మనకు తేలికగా అగుపించినా అందులోనే మనకు వేమనగారి పద్యాల్లో వున్నంత అర్థస్ఫూర్తీ, తర్కమూ సిద్ధాంత సమన్వయంతో ద్వంద్వాత్మకంగా వుంటాయి.

## గొల్ల కలాపం :

సుద్దులకూ గొల్లకలాపానికీ సంబంధం లేకపోయినా, గొల్లకలాప ప్రాముఖ్యంతో యాదవుల గొప్పతనాన్ని తర్కంతో నిరూపిస్తారు. అయితే కూచిపూడివారూ, మారంపల్లి దేవదాసీలూ ప్రదర్శించే గొల్లకలాప ఇతివృత్తానికీ దీనికీ సంబంధంలేదు. గొల్లకలాపం కులవ్యవస్థమీద తిరుగుబాటు, ఆ తిరుగుబాటుకు పురాణాలనే ఆయుధంగా త్రిప్పుతారు.

కలాపాన్ని ఈ విధంగా ప్రారంభిస్తారు. యాదవుని గోవులు కాచిన మాధవుడు యాదవుడే కదా? ఆ మాధవుడు పాలకడలిలో యోగనిద్రలో వున్నప్పుడు అతని నాభికమలంలో పుట్టిన బ్రహ్మ ఎవడు? యాదవుడే కదా? ఆ బ్రహ్మ ముఖం నుంచి పుట్టి బ్రాహ్మణులు, బ్రాహ్మణులకు పుట్టిన క్షత్రియులు వగైరా ఎవరు? యాదవులే కదా? అందుకని ఈ మనుషులందరిదీ ఒకటే కులం, యాదవకులంలో అందరూ ఎట్టిగొల్లలే అని పురాణ తర్కంలో సిద్ధాంతీకరిస్తారు.

## యాదవుల కళారూపాలు :

తెలంగాణా యాదవుల్లో కథలు చెప్పేవారు రెండు మూడు రకాలుగావున్నారు. పురుషుడు ఆడవేషం వేసుకుని కాళ్ళకు గజ్జెలు కట్టి ఒగ్గు చేతబట్టి, పెద్ద డోలుతో, పెద్ద తాళాలతో, వంతల సహాయంతో నృత్యం చేస్తూ కథను ముగిస్తాడు. వీరు ముఖ్యంగా ''బల్‌గురి కొండయ్య'' కథ చెపుతారు. మరికొంతమంది వృద్ధులైన కథకులు ఎల్లమ్మ కథను చెపుతూ జీవిస్తారు.

ఇక యాదవుల్లో కుర్మోళ్ళు అనే మరో తెగవారు వీరన్న కథ చెపుతారు.

వీరుగాక గొల్ల భాగోతులు అనేవారు వేరేవా రున్నారు. వీరు డాంజ్షియా, చంద్రకాంత, మాంధాత, చిరుతొండ, విప్రనారాయణ లాంటి వీధి నాటకాలు ఆడతారు.

మరో తెగ 'మంది హెచ్చువాళ్ళు' వీరు చెక్కబొమ్మలు పెట్టి, ఆ బొమ్మల్ని అవసరాన్ని బట్టి చూపిస్తూ, కదలిస్తూ, రాగాలు తీస్తూ కథలు చెపుతారు. వారు చెప్పే కథలు పెద్దిరాజు కథ, కాటమరాజు కథ, గొల్లకరివెళ్ళరాజు యుద్ధం చెపుతారని లక్ష్మీకాంత మోహన్‌గారు వ్రాస్తున్నారు.

## సుద్దుల కథలు :

సంప్రదాయబద్ధంగా గొల్లలు చెప్పే సుద్దుల కథల్ని రాజకీయ ఉద్యమంలో ప్రచార సాధనంగా వుపయోగించారు. అలా ఉపయోగించిన వారిలో ప్రథములు ఆంధ్ర ప్రజా నాట్యమండలివారు.

తెలంగాణా విప్లవాన్ని గురించి, బుర్రకథను రచించిన తిరునగరి రామాంజనేయులుగారు 1952 లో 'రాష్ట్రవాంఛ' అనే సుద్దుల కథను, ఆంధ్ర రాష్ట్ర సిద్ధిని కోరుతూ వ్రాయబడిన కథ ఇది. కాటమరాజు కథల బాణీలో గొల్లసుద్దులను చక్కగా వర్ణిస్తూ వ్రాయబడింది.

ఈ కథకు మంచి ప్రచారం వచ్చింది. నవయుగ పబ్లిషింగ్ హౌసువారు దీనిని 1953లో అచ్చు వేశారు.

అలాగే రామాంజనేయులుగారు "మన్యం విప్లవం" అనే పేరుతో అల్లూరి సీతారామరాజు కథనుకూడ సుద్దుల కథగా రచించారు. ఇది అముద్రితంగా వుండిపోయినా బహుళ ప్రచారం పొందింది.



అలాగే వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు 1954 లో సతీ మునలమ్మ కథను గొల్లసుద్దుల బాణీలో వ్రాశారు. ఇది కూడ అముద్రితంగానే వుండిపోయింది.



# ఆసాదుల ఆరాధనా చిందులు



ఆంధ్ర రాయలసీమ, తెలంగాణా జిల్లాలలో మాల మాదిగ కులాలవారు విస్తారంగా వున్నారు. మాల కులంలో మాల దాసరులున్నట్లు, మాదిగ కులంలో ఆసాదులనే వారు ఒక తెగకు చెందినవారు. అయితే రాష్ట్రవ్యాపింతగా మాలదాసరులులేనట్లే ఈ ఆసాదులు కూడా రాష్ట్రవ్యాపితంగా లేరు. ఒకవేళ వున్నా వారి ప్రాముఖ్యం అంతగా కనిపించడం లేదు. ముఖ్యంగా నాగరికత చెందిన సర్కారు ప్రాంతాల్లో ఈ తెగ అంతగా కనిపించడంలేదు. వెనుకపడిన తెలంగాణా, రాయలసీమప్రాంతాల్లో మాత్రం ఆసాదులూ, వారి ఆచార వ్యవహారాలూ, కళాప్రదర్శనలూ జరుగుతూనే వున్నాయి.

## ఆసాదులూ, అమ్మవారి జాతర్లు :

ముఖ్యంగా రాయలసీమలో ''ఆసాదులనేవారు మాదిగ కులంలో ఒక తెగగా ప్రాచుర్యం పొందారు. ఆసాదులంటే మాల మాదిగ కులాలలో పూజారి వర్గానికి చెందినవారని'' ఆరుద్రగారు అంటున్నారు. ముఖ్యంగా గ్రామాలలో ఒకనాడు విరి విగా జరిగే అమ్మవారి జాతర్ల సందర్భంలో దున్నపోతుల్నీ, మేకపోతుల్నీ బలి ఇచ్చే ముందు అమ్మవారిని స్తోత్రం చేస్తూ మాల ఆసాదులు పాటలు పాడుతూ వుండగా, మాదిగ ఆసాదులు చేడిక వాయిస్తూ వుంటే, మాతంగ కన్యలలో ముఖ్యులైన వారికి పూనకం వస్తుంది. ఆ పూనకంలో అమ్మవారి కోరికలు చెల్లించలే దంటూ అర్థమైన తిట్లు తిడతారు. మరికొన్ని కోరికలు కోరతారు. కోపంతో భక్తుల్ని కొడతారు. భక్తులు పూనకంలో వున్న అమ్మవారిని శాంతింపచేస్తారు. పూనకం దిగిన తరువాత అమ్మవారి మీద పాటలు పాడుతూ ఆవేశంతో చిందునృత్యం చేస్తారు. మాదిగ ఆసాదులు ముఖ్యంగా ఎల్లమ్మ కథను గానం చేస్తారు.

సమాజంలో వీరిని హీనజాతిగా పరిగణించినా, అగ్రకులాల్లో లేని విలక్షణమైన ఆచారాలు వీరి కున్నాయంటారు. అవి చిందుల్లోనూ, మాటల్లోనూ, పాటల్లోనూ తెలుస్తుంది వీరి చరిత్ర. దీనిని ఆది ఆంధ్ర కర్ణాటక సంస్కృతిగా గుర్తించవచ్చు. దక్షిణ దేశంలో శాక్తేయమతం అనవచ్చు.

## గ్రామదేవత, పెద్దస్వామి :

గ్రామాలలో వర్షాలు కురవనప్పుడూ, కలరా, మశూచి మొదలైన అమ్మవారు సోకినప్పుడూ, పల్లెలలో ఆసాదుల చిందులు ఏర్పాటు చేస్తారు. ప్రతి సంవత్సరమూ ఉగాది మరుసటి రోజున గ్రామదేవత పెద్దస్వామికి మేలుకొలుపు పాటలతో చిందు నృత్యాలు ఆవేశంగా చేస్తారు. ఆవేశంగా గేయాలు పాడుతారు.



పౌర్ణమి రోజున పెద్దస్వామిని, కాపుల ఇళ్ళ దగ్గరకు తీసుకు వచ్చి బలి ఇవ్వబోయే పోతునూ, బోనకుండను, గంటదుత్తను ఆసాదుల చిందులతో గుడి దగ్గరకు వచ్చి తమ జవనికల్ని ఉధృతంగా వాయిస్తూ, కాపుల పూర్వీకులందరినీ పేరు పేరునా స్తుతిస్తారు. గుడి దగ్గరకు వచ్చిన కుమ్మరి పూజారి కాపుల వస్తువుల నన్నిటినీ అక్కడ పెట్టి గ్రామ ప్రజల ముందు చిందులు వేస్తాడు.

## ఆసాదుల బృందనృత్యం :

సామాన్యంగా ఆసాదుల బృందంలో ముగ్గురుంటారు. అందరివద్దా వాయిద్యాలు వుంటాయి. ప్రధాన నాయకుడు పాడితే మిగతా ఇద్దరూ చిందులు వేస్తూ

వంత పాడతారు. పాటపాడుతూ వలయాకారంగా తిరుగుతూ వెనుకకూ ముందుకూ అడుగులు వేస్తూ వంగుతూ లేస్తూ చేతులను ఆడిస్తూ గజ్జెల కాళ్ళతో చిందులను త్రొక్కుతారు. ఒక ప్రక్క వాయిద్యం మ్రోగుతూనే వుంటుంది. నాయకుడు చేతిని వూపుతూ చూపుడు వ్రేలును చెవిలో పెట్టుకుంటూ లయాన్వితంగా రాగం తీస్తారు. పాదాలు పైకెత్తి మునికాళ్ళమీద అరచేతితో కొడుతూ పెద్దమ్మ స్వామి దగ్గరకు పోయి నమస్కారం చేస్తాడు.

కథకుణ్ణి అనుసరిస్తూ వంతలు నేత్రానందంగా నృత్యం చేస్తారు. వారి ముగ్గురి నాట్యమూ త్రిమూర్తుల నృత్యంగా దర్శనమిస్తుంది. ఈ సమయంలో కొందరికి పూనకం వస్తుంది. పూనకం వచ్చినవారిచేత వేపాకులు తినిపించటం, కల్లుముంతలోని కల్లును వేపమండతో అందరిమీదా చిలకరించటం గ్రామాన్ని రక్షించమని గాయకుడు దేవతల్ని ప్రార్థిస్తూ వచ్చి చిందులువేస్తూ గేయాలనూ, కథా గేయాలనూ పాడుతారు. ముఖ్యంగా వారు గానంచేసే కథా గేయాలు, పెద్దమ్మ కథ - చల్లారమ్మ కథ - యల్లమ్మ కథ వీరు చక్కగా అలంకరించుకుని గ్రామ ప్రజల ముందు, ఆరు బయలులో అహ్లాదంగా నృత్యం చేస్తారు. గ్రామ ప్రజలు ఎంతగానో ఆనందిస్తారు. సంతోషంగా వారికి కానుకలు ముట్ట చెపుతారు.

కథను మూడు రోజులు మొదలు తొమ్మిది రోజుల వరకూ పొడిగించి చెప్పగలరు. కథ చెప్పే ప్రతిరోజూ, పెద్దమ్మ స్వామికి పూజలుచేస్తూ, ఆ మహాదేవిని కొలుస్తూ గ్రామస్థులచేత కొలిపిస్తూ గ్రామాన్ని కాపాడమని ఆసాదుల మధ్యవర్తులుగా గ్రామ ప్రజల ఆర్తనాదాన్ని దేవతకు అందచేసే మాతలుగా వుంటున్నారు.

## వేషధారణ :

ఆసాది కథకులు మోకాలిదాకా పంచ కట్టి, కథ చెప్పే వ్యక్తి కథకుడు మాత్రం నల్లకోటు ధరించి, ఎర్ర పాగా చుట్టి వెనుక కుచ్చు వదలి, నడుము కట్టుతో నుదుట బంగారు బొట్టు పెట్టి చేతిలో వేపమండల్ని పట్టుకుని ఝళిపిస్తూ కథలు చెపుతారు. కథా ప్రారంభంలో పెద్దస్వామికి నైవేద్యం పెట్టే సందర్భంలో వారూ కల్లు త్రాగుతారు.

ఒకవేళ గ్రామస్థులు, కథలు చెప్పించకపోతే ఉగాది మరుసటిరోజున తప్పకుండా చిందులు వేస్తారు. అందుకే వారిని ఆయగాళ్ళంటారు. దేవత సమక్షంలో జంతువుల బలి సమయంలో, ఈ విధంగా పాడుతారు.

పెద్దమ్మ తల్లికి :

పూజ చేత్తామురో యమ్మ - పెద్దమ్మ తల్లికి
పూజ చేత్తామురో - పున్నిమంతులు మీరు
మల్లిపూవులు దెచ్చి - మనసార వెల్లుదాము
బాగుగా బలిపిల్లలు గొట్టి - కర్మపోతులను
కడగా కొట్టి ఆసాదివాండ్లను - ఆటలాడమని
సన్నమేళముల సందడి చేయమని
సకియలారో, పెద్దమ్మ తల్లికి పూజ చేద్దాము
రోయక్క; కొండ చక్కెర, కర్జూరములు, మంచి తేనియో
మా పెద్దమ్మ స్వామికి పలము రుసుములు పూజసేత్తము.

అంటూ సుబ్బారావు పేటకు చెందిన మాదిగ నాగన్న పాడిన పాట. ఇది అనంతపురం జిల్లాలో ధర్మవరం తాలూకాలో వున్న ఆసాదుల కళారూప మిది.





# ఆదిమ వాసులకు అద్దం పట్టే గిరిజన కళారూపాలు



తెలుగు దేశంలో ముఖ్యంగా కొండ ప్రాంతాల్లో అడవి ప్రాంతాల్లో వున్న ఆదిమ జాతుల గిరిజన నృత్యాలు ఆంధ్ర ప్రజలకు ఏమీ తెలియవు. వారు ఆంధ్ర దేశంలో బ్రతుకుతున్నా అది వారి వారి ప్రాంతాలకే పరిమితమైపోయి వారికి తప్పా ఇతరులకు తెలియకుండా పోయాయి. అందుకు కారణం వారి బ్రతుకంతా అడవులకే పరిమితమై వుండటం ఇతరులతో ఏ విధమైన సంబంధాలు లేకపోవడమే.

## గిరిజనుల కళారూపాలు :

ఆంధ్రదేశంలో అటు రాయలసీమ నుండి ఇటు ఇచ్ఛాపురం వరకూ అన్ని ప్రదేశాల్లోనూ కలిపి మొత్తం ముప్పై ఎనిమిది గిరిజన జాతులున్నాయనీ, వీరి జనాభా పదమూడు లక్షలనీ, డి. ఆర్. ప్రతాప్ గారి వ్యాసానికి ఆధారంగా నాట్యకళ జానపద కళల ప్రత్యేక సంచికలో ఉదహరించారు.

అదిలాబాద్ జిల్లాలో గోండులు, కొలాములు, మధురాలు, ప్రధానులు, ఆంధ్రులు ముఖ్య జాతులు.

నాయిక పోడులు ప్రధానంగా కరీం నగర్ జిల్లాలో కనిపిస్తారు.

వరంగల్, ఖమ్మం, ఉభయ గోదావరి జిల్లాల ఏజన్సీ ప్రాంతాలలో కోయలు-కొండరెడ్లు ఎక్కువ.

విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాల కొండ ప్రాంతాలలో బగతలు, కొండ దొరలు, వాల్మీకులు, మూలదొరలు, సామంతులు, గదబలు, కమ్మరలు, కోటియాలు ఎక్కువ కనిపిస్తారు.

శ్రీకాకుళం జిల్లాలో జాతపు దొరలు, సవరలూ మాత్రమే కొండ ప్రాంతాల్లో వున్నారు. కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలోనూ, మహబూబ్ నగర్ జిల్లా లోని అమరాబాద్ పీఠభూమి ప్రాంతంలో చెంచులు నివసిస్తున్నారు.

రాష్ట్రంలో అనేక చోట్ల కనిపించే జాతి బంజారులు. వీరినే సుగాలీలనీ, లంబాడీలనీ, లబాసీలు అనికూడా పిలుస్తారు.

ఇక ఎరుకలు, ఏనాదులు మైదాన ప్రదేశాలలో నే నివాసాలు ఏర్పరుచుకున్న వారున్నారు.

గిరిజనులకు సంవత్సరం పొడుగునా వ్యవసాయమే జీవనాధారం. గోండులు, కోయలు, బగతలు, వాల్మీకులు స్థిరనివాసాలు ఏర్పాటు చేసుకుని భూములను సేద్యం చేసుకుంటారు.

కొండరెడ్లూ, కొండదొరలూ, సామంతులూ, సవరలూ నిలకడగా ఒకచోట కాక తమకు తోచిన ప్రదేశాలలో పోయి వ్యవసాయం చేసుకుంటారు.

ఇక కోయలు, బగతలు, వాల్మీకులు, కొలాములు, నాయకపోడులు, కోటియాలు, మూఖదొరలు మొదలైన గిరిజన జాతులు కూడా పోడు వ్యవసాయంద్వారా, అదనపు ఆదాయాల కోసం ప్రయత్నిస్తారని డి. ఆర్. ప్రతాప్‌గారు వ్రాశారు. అలా గిరిజనులు జీవిత విధానాలను సాగించుకుంటూ ఆనందం కోసం, సంగీతాన్నీ నృత్యాన్నీ వాయిద్యాన్నీ జోడించి ఎన్నో కళారూపాలను సృష్టించుకున్నారు.

## గోండుల గుసాడి నృత్యం :

అదిలాబాదు జిల్లా రాజగోండులకు దీపావళి పెద్ద పండుగ. చలికాలం ప్రారంభమయ్యేసరికి పంటలన్నీ చేతికి వచ్చి వుంటాయి. తాము చెమటోడ్చి చేసిన కష్టం, ధాన్యం లక్ష్మిగా నట్టింట చేరి వుంటుంది. గోండు లందరూ ఆటపాటలతో కాలక్షేపం చేసే రోజులు ప్రారంభమౌతాయి. రకరకాల వస్త్రాభరణాలు వేసుకుని యువజనులు సంగీతవాయిద్యాలతో అతిథులుగా పొరుగు గ్రామాలకు తరలి వెడతారు. గొమ్ములూదుతూ, తప్పెట్లు వాయిస్తూ యాత్రలు సాగిస్తారు. గోండుల పురాణ గాథలలోని ''దండారియారౌడ్, సిసిసెర్మారౌడ్'' అనే కథానాయకులను అనుసరిస్తూ ప్రతి సంవత్సరం నృత్యాలు చేస్తారు.

గోండు యువకులు 20 నుంచి 40 మంది దాకా చేరి చేసే దండారీ నృత్యంలో గుసాడి నృత్యం ఒక భాగం. గుసాడి నృత్యంలో ఎందరో పాల్గొనవచ్చు.

దీపావళి నెలలో సాంప్రదాయికమైన ఈ నృత్యం జరుగుతుంది. పౌర్ణమినాడు కార్యక్రమం ప్రారంభమౌతుంది. చతుర్దశి వరకూ జరుగుతుంది. గుసాడి నర్తకునికి



కావలసిన సామగ్రిలో ముఖ్యమైనది నెమలిపింఛంతో తయారుచేసిన తలపాగా. ఇందులో గొఱ్ఱిపోతు కొమ్ములను కూడా అమర్చుతారు. కృత్రిమ గడ్డాలు, మీసాలతో వేషం కడతారు. మేకతోలు కప్పుకుంటారు.

ఇక వాయిద్యాలు. డప్పు, తుడుము, పిప్రే, బాకా, కలికొాయ్ (తప్పెట) మొదలైనవి వాద్యబృందానికి హుషారు నిస్తాయి. సంగీత వాయిద్యాలను, గుసాడి నృత్య పరికరాలను గోండులు పరమపవిత్రంగా భావిస్తారు. నాట్యారంభానికి ముందు వాటికి పూజ చేస్తారు.

## దండారి కోలాట నృత్యం :

మరింత లయబద్ధమూ, క్రమబద్ధమూ అయిన దండారి నృత్యం గుసాడి నృత్యంలో భాగం. దండారి నృత్యం చేస్తున్న బృందంలోకి గుసాడి బృందం అకస్మాత్తుగా ప్రవేశిస్తారు. గోండు భాషలో గుసాడి అంటే అల్లరి అని అర్థం. దండారీ నృత్యం గుమేలా అనేది బుర్రకథ డక్కి శబ్దాలకు అనుగుణంగా లయబద్ధమై ఉంటుంది.

వలయాకారంగా చేరే దండారి బృందం. లోపలి వైపుకు తిరిగి నిలుచుంటారు. ఎడమవైపుకు నెమ్మదిగా అడుగులు వేస్తూ, అడుగులు వేసినప్పుడల్లా కుడి పాదాన్ని ఎడమకాలు మీదికి వూగిస్తుండడంతో నృత్యం ప్రారంభమౌతుంది. ప్రతి నర్తకునికి చేతిలో రెండు కోలాటం కర్రలు వుంటాయి. నర్తకులు తమ చేతుల్లోని రెండు కర్రలను ఒకదానితో మరొకదానిని తాకిస్తారు. తరువాత కుడి వైపున వున్న నర్తకుని కర్రను కొడతారు. ఇలా అడుగులువేస్తూ కోలాటమాడుతూ నర్తకులందరూ వంగి కర్రలను నేలకి తాకించి నాలుగు దిక్కులకూ అడుగులు వేస్తారు. దేవతలందరికీ ప్రణమిల్లడానికి ఇలా నాలుగు దిక్కులకూ అడుగులు వేస్తారు. దేవతలకు మ్రొక్కిన తరువాత వలయాన్ని సరిచేసుకుని కర్రలను పాదాల వద్ద వుంచి, పాటకు అనుగుణంగా చేతులతో చప్పట్లు కొడతారు. ఒక బృందం చరణాన్ని ముగించగానే రెండవ బృందం రెండవ చరణాన్ని అందుకుంటూ బృందగానం చేస్తారు.

## దండారీ నృత్యంలో, గుసాడీల ప్రవేశం :

పై విధంగా దండారీల నృత్యం కొనసాగుతుండగా నలుగురైదుగురు గుసాడీలు హఠాత్తుగా దండారీల వలయంలోకి చొచ్చుకొని వస్తారు. తలకు నెమలి పింఛాలను ధరించి, కృత్రిమ గడ్డాలూ, మీసాలూ, శరీరంపై మేక చర్మమూ

ధరించి వచ్చే గుసాడీల చేతుల్లో కఱ్ఱ లుంటాయి. మెడలో గవ్వల హారాలూ, తుంగకాయల హారాలూ వుంటాయి. నడుముకు మణికట్టుకూ - చిరు గజ్జెలు వుంటాయి. కంటి చుట్టూ తెల్లరంగు పూసుకుంటారు. మొలకు నారింజ రంగు



లంగోటీలు తప్పించితే శరీరంపై మరే యితర ఆచ్ఛాదన ఉండని గుసాడీల వేషం వింతగా వుంటుంది. శరీరంపైన నలుపు చారల చుక్కలతో వింత వింత అలంకరణాలు వుంటాయి. గుసాడీలు ప్రవేశించగానే దండారీలు చెల్లాచెదరౌతారు. ఇది ప్రేక్షకులకు ఎంతో వినోదాన్ని కలిగిస్తుంది.

## సామంతుల మయూర నృత్యం :

సామంతులు మాత్రమే ఈ మయూర నృత్యం చేస్తారు. సామంతులనే గోండులని కూడా అంటారు. సామంతులు ఎంతో వెనుకబడిన గిరిజనులు. విశాఖ పట్టణం, శ్రీకాకుళం జిల్లాలోని దుర్గమ్మకొండ ప్రాంతపు అడవుల్లో ఈ గిరిజనులు కనిపిస్తారు. సామంతులు తరతరాలుగా కాపాడుకొంటూ వస్తున్న సాంస్కృతిక సంపదలో మయూర నృత్యం ఒక భాగం. గోండుల వివాహ సందర్భాలలోనూ, ఏప్రిల్ నెలలో వచ్చే చైత్ర పర్వదిన సందర్భంలోనూ సాధారణంగా ఈ మయూరి నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో పిరోడి అనే మురళి కాళ్ళకు కట్టుకునే గజ్జెలు ముఖ్యమైనవి.

సామంతులు ఖరీదైన వస్త్రాలంకరణల జోలికి పోరు. తెల్లధోవతి కట్టుకుంటారు. నర్తకు లందరూ పాదాలకు గజ్జెలు కట్టుకుంటారు. వీటిని సామంతులు "ముయ్యంగ" అంటారు. తలకు తోయంగ అనే తలపాగా ధరిస్తారు. తుంగ గడ్డితో చేసిన పొగాకు రంగుల గుడ్డపేలికలను కుచ్చులుగా కడతారు. నడుము వంచి నప్పుడు పింఛము విప్పిన నెమలివలె కనిపించేటట్టు నెమలిపింఛముల గుత్తిని నడుము వెనుక బిగించుకుంటారు. మొదట నర్తకులందరూ రెండు వరుసలలో నిలుచుంటారు. నోటితో నెమలి అరుపును పోలిన శబ్దం చేస్తారు.వలయాకారంగా నిలిచి నాట్యం చేస్తున్న మయూరం పద్ధతిలో మోకాలిపై ముందుకు వంగుతారు. భూమాతకు సూర్యభగవానుడికి మ్రొక్కి నృత్యం ప్రారంభిస్తారు.

## జోడియా :

అనే ఈ గిరిజన నృత్యాన్ని కొంద్య మట్టియా, జోడియా అనే జాతులవాళ్ళు చేస్తారు. ఈ నృత్యాన్ని పులకమ్మ, గంగాదేవి, గౌరమ్మ మొదలైన పండుగల ందర్భంగా చేస్తారు. ఇది ఆడ మగ కలిసి చేసే బృందనృత్యం. పది అడుగుల ్రమీద ఇద్దరు నిల్చొగా మిగతా బృందం నాట్యం చేయడం దీని ప్రత్యేకత.

## పూల పండ్లు :

ఇది శ్రీకాకుళానికి చెందిన సవర జాతి చేసే గిరిజన నృత్యం. దీన్ని పెళ్ళిళ్ళ సందర్భంలో, దేవీ పూజల సందర్భంగా చేస్తారు. ఇది ఆడ మగ కలిసి చేసే

బృంద నృత్యం. కోలాటం కూడా శ్రీకాకుళానికి చెందిన సామంతుల జాతివారు చేసే నృత్యం. ఇది పెళ్ళిళ్ళ సందర్భంగా కేవలం పురుషులు చేసే నృత్యం.

చెంచు నృత్యం :

మహబూబ్ నగర్‌కు చెందిన చెంచుజాతి వాళ్ళు, పెళ్ళిళ్ళ సందర్భంగా చేసే నృత్యం. ఇది ఆడ మగ కలిసి చేసే నృత్యం.

లంబాడి :

లంబాడి హోలీ నృత్యం నల్లగొండకు చెందిన లంబాడీ జాతివారు హోలీ పండుగ సందర్భంలో చేస్తారు. దీన్ని హోలీ నృత్యం అనికూడా అంటారు. ఇది స్త్రీ పురుషులు కలిసి చేసే నృత్యం.

కోయ నృత్యం :

ఇది ఖమ్మం జిల్లాకు చెందిన కోయజాతివారు విత్తనాలు నాటే సందర్భంలో చేసే నృత్యం. ఇదికూడ ఆడా మగా కలిసి చేసే బృంద నృత్యం.

వరికోత నృత్యం తూర్పు పశ్చిమ గోదావరి ప్రాంతాలలో గిరిజనులు చేసే నృత్యం. వరి పంట చేతికి వచ్చిన సందర్భంలో చేసే నృత్యం, ఇదికూడా స్త్రీ పురుషులు కలిసి చేసే నృత్యమే.

లంబాడి నృత్యం :

దీనిని రంగారెడ్డి జిల్లాలోని మేడ్చల్ ప్రాంతపు లంబాడీలు చేస్తారు. ఇది



పండుగల సందర్భంగా ఆడవాళ్ళు చేసే బృంద నృత్యం. ఈ నృత్యాలను గిరిజనులు చేసేటప్పుడు తుటుంపర్ర, వెట్టి, డప్పు మొదలైన తోలు వాయిద్యాలను "బాంసొరి

కొమ్ము, సన్నాయి మొదలైన వాయిద్యాలూ, కిన్నెరమెట్ల, కిన్నెర, డోలు కామాథో ఇత్యాది తీగ వాయిద్యాలు ఎక్కువగా వాడుతారు. అలంకరణ దుస్తులు, సాంప్రదాయ పద్ధతుల్లో వుంటాయి.

## కొండరెడ్ల కళా సంస్కృతి :

ఆంధ్రదేశంలో ఆయా ప్రదేశాల్లో వున్న కళారూపాలు మాత్రమే వెలుగులో కొచ్చాయి. అలా వెలుగులోకి వచ్చి ప్రచారమై ప్రజల నాకర్షించినవి మాత్రమే మనకు తెలుసు. కాని ఆంధ్రదేశంలోనే ఎక్కడో మారుమూల గిరిజన ప్రాంతాల్లో వున్న కళారూపాలు మాత్రం ఆంధ్ర ప్రజల కెవ్వరికీ తెలియకుండా అజ్ఞాతంగానే వుండిపోయాయి.

అక్కడి ప్రజలకు బయటి ప్రపంచంతో సంబంధమే లేదు. ఈ నాగరిక ప్రపంచానికే దూరమైన అజ్ఞాత జీవితాలు వారివి. అమాయక ప్రజలు నిర్మలమైన మనస్సులు, నిష్కల్మష హృదయాలు. మాయామర్మాలు తెలియనివారు. వారూ వారి జీవితం. జీవితానందం కోసం వారి ఆచారాలూ, అధ్యాత్మిక చింతనలూ, ఆరాధనలూ, వినోద ప్రదర్శనాలూ, కొన్ని వందల సంవత్సరాలుగా ఆ ప్రాచీన సంస్కృతిని రక్షిస్తూ మారుమూల కొండల్లో, అడవుల్లో వుంటూ జంతువులతో పాటు వారూ పరిమిత కుటుంబాలుగా బ్రతుకుతున్నారు.

అలా బ్రతికేవారు నాగరికత ప్రపంచానికి అతి దగ్గరగా వున్నారు. అలా తూర్పు గోదావరి జిల్లాలో అటు రాజమండ్రికీ, ఇటు భద్రాచలానికీ దగ్గరగా వున్న మారేడిమిల్లి — అడ్డతీగల మొదలైన సమితుల్లో అధిక సంఖ్యాకులుగా వున్నారు. వీరి మాతృభాష తెలుగే. అయితే కొంచెం యాసగా వుంటుంది. ప్రధానంగా వీరు పోడు వ్యవసాయం చేస్తున్నప్పటికీ వేటాడటం, చెట్లు నరకటం, చేపలు పట్టటం వీరి జీవనాధారం. చెట్ల వేళ్లూ .... ఆకులూ, జీలుగ బెరడూ మామిడి జీడీ వీరి ఆహారపదార్థాలు.

కొండరెడ్లు పంటలు బాగా పండాలనీ, తమకు వ్యాధులు రాకుండా కాపాడమనీ రకరకాల దేవతలను కొలుస్తారు. వీరి పండుగలలో మామిడికోత పండుగ, భూదేవి పండుగ, గంగమ్మదేవత పండుగ ముఖ్యమైనవి. ముత్యాలమ్మ, గంగమ్మ, గంటమ్మ, సరెలమ్మ, పాండవులను వీరు అతి భక్తిశ్రద్ధలతో కొలుస్తారు.

## మామిడికోత నృత్యం :

కొండరెడ్లకు అత్యంత ప్రీతికరమైనవి మామిడిపండ్లు. మామిడిపండ్లు ఆ ప్రాంతంలో ఎక్కువగా లభిస్తాయి. మామిడిపండ్లు కోసేముందు కొండరెడ్లు ఆనందోత్సవం జరుపుకొంటారు. తప్పెట్ల వాయిద్యాల శబ్దానికి అనుగుణంగా లయ బద్ధమైన నృత్యం చేస్తారు.

రాత్రిపూట ఈ నృత్యం ప్రారంభమౌతుంది. మొదట వాయిద్యాలను నెమ్మదిగా మ్రోగిస్తారు. ముగ్గురు నలుగురు స్త్రీలు చెట్టాపట్టాలు వేసుకుని చేతుల్లో గల గల శబ్దంచేసే ఎండుకాయల గుత్తులను ధరించి నృత్యంలో పాల్గొంటారు.

## సామూహిక నృత్యం :

వారు చేసే నృత్యంలో స్త్రీలూ, పురుషులూ ఒకేసారి నృత్యంలో పాల్గొం టారుకాని జంటలుగా కలవరు. రంగస్థలం చుట్టూ ఎడమచేతి వాలుగా ప్రదక్షిణం చేస్తూ నృత్యం కొనసాగిస్తారు. నృత్యం పతాక సన్నివేశానికి వచ్చినప్పుడు సైతం స్త్రీలూ పురుషులూ వేరు వేరుగానే నృత్యం చేస్తారు. స్త్రీలు పాదాన్ని నేలకు తాకించు తూనే నాలుగు అడుగులు ముందుకువేస్తారు. ఇలా ముందుకు వెళ్ళడం ఒక ప్రత్యేక పద్ధతిలో జరుగుతుంది. కుడి పాదాన్ని ఐ మూలగా నాలుగడుగులు ముందుకు వేసి, ఒక అడుగు అదే పద్ధతిని వెనక్కువేస్తారు. వలయాకారంలో చేరి ఒకేసారి అందరూ కేంద్రస్థానానికి వచ్చి మళ్ళీ పోవడం, చేతులు ఊపుతూ అరచేతుల్లో ఉన్న గలగల లాడే వాయిద్య విశేషాలతో శబ్దం చేయడం ఈ నృత్యానికి హంగును చేకూర్చు తుంది. కాళ్ళను ఎడంగా ఉంచి కుడిపాదం మీద అదేలా దూకడం, అటు తర్వాత కుడి పాదం వెనక్కూ ఎడం పాదం ముందుకూ వచ్చేటట్టు మరో గెంతు గెంతడం కూడా ఒక విశిష్టమైన నర్తన విధానం.

## పురుషుల నృత్యం :



పురుషుడు అడుగులు వేసే పద్ధతి స్త్రీలకంటే భిన్నంగా వుంటుంది. నాట్యం చేస్తున్న బృందంతోపాటు వాద్యకారులు ప్రక్కగా వెంట వెంటనే ముందుకు అడు గులు వేస్తారు. ప్రారంభంలో మట్టుకు వాయిద్యాలను పట్టు

కున్న కళాకారులు రంగస్థలం మధ్య కనిపిస్తారు. అడుగు ముందుకు వేసేటప్పుడు మొదట కుడిపాదంవేసి ఆ తరువాత ఎడమపాదాన్ని కుడిపాదం పడమదాకా ముందుకు తీసుకువస్తారు. ఆ విధంగా మళ్ళీ కుడిపాదంతో అడుగు వేయడానికి వీలు కలుగుతుంది. ఈ నృత్యం వాయించే రెండురకాల చర్మవాద్యాలూ అడుగులు వేసేటప్పుడు లయబద్ధంగా చేయడానికి తోడ్పడుతాయి.

వాయిద్యాలను మరింత వేగంగా వాయించినకొలది నాట్యంలో ఉత్సాహం కూడా పెరిగి మరింత చురుకుగా సాగుతుంది. అర్ధరాత్రిలోగా విందులు ముగించి, స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ మళ్ళీ నృత్యం ప్రారంభిస్తారు.

ముత్యాలమ్మనూ. కొండదేవతలనూ ఆహ్వానిస్తూ సుదీర్ఘమైన పాటలు పాడతారు. కొండరెడ్లకు ఈ పాట ఎంతో ఉత్సాహాన్నీ ఉద్వేగాన్నీ కలిగిస్తుంది.

సన్నివేశం పతాకస్థాయిని అందుకునే సమయానికి పాట పూర్తి అవుతుంది. ఉదయం పది గంటల వరకూ, అలసట వచ్చేంతవరకూ నృత్యంచేసి ఎవరికి వారు వెళ్ళిపోతారు. గ్రామమంతా నిశ్శబ్దమైపోతుంది.

## మూఢ నమ్మకాలు :

వ్యాధులూ, మరణమూ, వృద్ధాప్యం మొదలైనవి. దైవానుగ్రహం, చేతబడి, మంత్ర తంత్రాలవల్ల వస్తాయని వీరికి గట్టి నమ్మకం. అందుకే జంతువులను విపరీతంగా దేవతలకు బలి ఇస్తారు. వీరిలో నిర్బంధంగా స్త్రీని ఎత్తుకు వచ్చి వివాహం చేసుకునే పద్ధతి ఇప్పటికీ వుంది. పెళ్ళిళ్ళకు స్త్రీ పురుషులు సాంప్రదాయ నృత్యగానాలు చేస్తారు. రాజుల పండుగా, గంగాలమ్మ పండుగా, గూపెమ్మ కొలువులలో వీరు దేవతలను ఆహ్వానిస్తూ నాట్యం చేస్తారు. రాజుల పండుగల్లో వారు పాండవులను ఆహ్వానిస్తారు.

రాజుల పండుగలో
లేలేలేల లేలెమ్మరో ఓ లేల
లేలేలేల లేలెమ్మరో ఓ లేల అన్న రీతిలోనూ

పెళ్ళిళ్ళలో

లచ్చు కోడలయ్యా కోడలా
లచ్చీర బాలకోడలా

అన్న పాటను వీరు పాడతారు. వీరి జీవితంలో మాటకంటే పాటే ప్రధానం. గంగా లమ్మ పండుగలో ఓ అత్త కోడలిని ఇలా అంటుంది.

గైరికీపిట్ట కన్నులదానా కోడలా, కోడలమ్మా
కారుపంది ముక్కుదానా కోడలా - కోడలమ్మా

అని పరిహసిస్తుంది.

## అరకులోయలో, ఆదిమవాసుల నృత్యాలు

మన ప్రాచీన సంగీత నృత్యాలు రూపు మాసిపోకుండా కాపాడిన ఖ్యాతి జానపదులకు దక్కుతుంది. భారతీయ సంస్కృతిలో జానపద నృత్యం అత్యంత ముఖ్యమైనది.

### రమణీయ ప్రకృతి :

అరకు లోయ రమణీయమైన ప్రకృతికి నిలయం. విశాఖపట్టణం జిల్లాలో సముద్ర మట్టానికి నాలుగువేల అడుగుల ఎత్తున వున్న ప్రాంత మిది. సంవత్సర కాలంలో ఎక్కువ కాలం వాతావరణం ఆహ్లాదకరంగా చల్లగా వుంటుంది. అనుకూల వాతావరణంవల్ల కాఫీ తోటలు, నారింజ తోటలు ఏపుగా పెరుగుతాయి. రకరకాల కూరగాయలు పండిస్తారు. అనేక గిరిజన జాతులు అరకు లోయ అంతటా కనిపిస్తారు. వీరందరూ ఆంధ్రదేశంలో వున్నా ఎక్కువమంది ఒరియా భాషను మాట్లాడుతారు. అయితే వీరు మాట్లాడే భాష స్వచ్ఛమైన ఒరియా భాషకాదు. వీరిలో వాల్మీకి, బగట, బోండ్, కొండదార, కోటియా ప్రధానమైన గిరిజన జాతులు.



### ఈటెల పండుగ :

అరకు లోయలో అత్యంత ప్రధానమైన ఆనందోత్సవం, చైత్ర మాసంలో జరుగుతుంది. చైత్ర పర్వం, లేక ఈటెల పండుగ సందర్భంగా ఈ ఆనందోత్సవం జరుగుతుంది. పండుగ రోజుల్లో పురుషులు ఈటెల తోనూ, విల్లంబులతోనూ జంతువులను వేటాడుతారు.

అందువల్ల దీనిని ఈటెల పండుగ అంటారని ఆంధ్రప్రభుత్వ గిరిజన సాంస్కృతిక సంస్థవారు (నాట్యకళ జానపద కళల సంచికలో ఉదహరించారు).

చైత్ర మాసంలో గిరిజనులు చైత్ర పర్వం చేసుకుంటారు. అన్ని తెగల వారూ మహోత్సాహంతో ఉత్సవంలో పాల్గొంటారు. అందరూ ఒక చోట చేరి విందులు చేసుకుంటారు. యువతీ యువకులు ఒళ్ళు తెలియని ఆనందోత్సాహాలతో తెల్లవార్లూ సంగీత నృత్యాలతో కాలక్షేపం చేస్తారు. అన్ని వయసులవారూ రోజుల తరబడి అడవులలో గడుపుతూ తృప్తిగా వేటాడతారు. వేటనుంచి రిక్తహస్తాలతో తిరిగి వచ్చేటప్పుడు, పురుషులను స్త్రీలు పరాభవిస్తారు. పర్వ దినాలలో ఒక గ్రామానికి చెందినవారు మరొక గ్రామానికి వెళ్ళి, దింసా నృత్యంలో పాల్గొంటారు. పర్వ దినాలలో ఒక గ్రామం వారు, మరో గ్రామం వారిని ఆహ్వానిస్తారు. అలా వచ్చే వారికి విందులు ఏర్పాటుచేస్తారు. ఇలా అందరూ కలిసి నృత్యవినోదాల్ని జరుపుకోవడాన్ని "సంకిడి కెల్చార్" లేక "కిందిరి కెల్చార్" అంటారు, చైత్ర పర్వం ఈ విధంగా వారి మధ్య సఖ్యతను పెంపొందిస్తుంది.

## దింసా నృత్యం :

అరకు లోయలో ప్రసిద్ధమైన నృత్యాలలో దింసా నృత్యం ఒకటి. వృద్ధులూ, యువకులూ, ధనికులూ, పేదలు అనే తేడా లేకుండా, అన్ని వర్గాల వారు దింసా నృత్య కార్యక్రమాలలో పాల్గొంటారు. కష్టజీవులైన గిరిజనులకు, ఈ కార్యక్రమాలు అంతులేని ఆనందాన్నిస్తాయి. దింసా నృత్యం అందరినీ అలరించడమేకాక, గ్రామీణ ప్రజల మధ్య సఖ్యతనూ, సుహృద్భావాన్ని పెంపొందిస్తుంది. దింసా నృత్యాన్ని చైత్ర పర్వంలోనూ, వివాహ సమయంలోనూ, పండుగ పర్వదినాలలోనూ ప్రదర్శిస్తారు.

దింసా నృత్యంలో విలక్షణమైన, సంగీత వాయిద్యా లున్నాయి. "తుండి" "మోరి" "కిరిడి" "తుడుము" డప్పు మొదలైన సాంప్రదాయ వాయిద్యాల సహకారంతో లయబద్ధంగా సాగుతుంది. ఈ నృత్యంలో కళాకారుల్ని ఉత్తేజపర్చటానికి మధ్య మధ్య .... జోడుకొమ్ము బూరలను ఊదుతారు. స్త్రీ పురుష లందరూ సాంప్రదాయకమైన ఆభరణాలు ధరించి, రంగు రంగుల దుస్తులను అలంకరించుకుని నృత్యానికి హాజరౌతారు. దింసా నృత్యంలో ఎనిమిది రకా లున్నాయి.

## బోడె దింసా :

బోడె అంటె ఘనమైనదని అర్థం, గ్రామదేవత అయిన "నిసాని దేవత" పూజ సమయంలో ఈ నృత్యం చేస్తారు. కనుక దీనిని బోడె దింసా అంటారు. అన్ని వాయిద్యాలూ వుధృతంగా వాయిస్తూ వుండగా ఈ నృత్యం ప్రారంభ మౌతుంది; కుడివైపున పురుషులూ, ఎడమవైపున స్త్రీలూ వరుసగా నిలుస్తారు. వీపుమీద ఒకరి చేతులు మరొకరు దృఢంగా పట్టుకుంటారు. వరుసలో కుడివైపున మొదట నిలిచే వ్యక్తి కథానాయకుడు, నెమలి ఈకల పింఛాన్ని పట్టుకుని లయ బద్ధంగా అడుగులు వేస్తూ, నృత్యాన్ని నిర్వహిస్తాడు. అలాగే ఎడమవైపు చివరి



దింసా నృత్యం

నుండే వ్యక్తి కూడా కథానాయకుడికి తోడుగా నృత్యాన్ని నిర్వహిస్తాడు. అందరూ వర్తులాకారంగా తిరుగుతూ .... మధ్య మధ్య, హుషారుగా, హేయ్, హేయ్, హోయ్, హోయ్ అంటూ, ఆనందంగా కేరింతలు కొడుతూ, చివరికి బారుగా నిలు చున్న స్థితికి చేరుకుంటారు.

## గుందేరి దింసా :

గుందేరి ఒక స్త్రీ పేరు. ఈ నృత్యంలో పాల్గొనే పురుషుడు తనతో కలసి అడుగు వేయవలసిందిగా ఒక పాట రూపంలో, మహిళా బృందాన్ని ఆహ్వా నిస్తాడు. అందువల్లనే ఈ నృత్యాన్ని "గుందేరి నృత్యం" అంటారు. ఈ నృత్యంలో వెనుకకూ ముందుకూ దృఢంగా అడుగులువేస్తూ కదం త్రొక్కుతూ

గుండ్రంగా తిరుగుతారు. ఉత్సాహ ఉద్వేగాలతో చేసే నృత్య మిది .... అలాగే ఒరియాలో గొడ్డిబేట నృత్యముంది. గొడ్డి అంటే చిన్న రాళ్లు. బేట అంటే ఏరుట అనే అర్థం. ఈ నృత్యంలో గిరిజన బృందాలు, రాళ్ళను ఏరుతున్నట్లుగా తలను దించుతూ, పై కెత్తుతూ నర్తిస్తారు. మంచి వూపుతో ముందుకు వంగుతూ లేస్తూ పాతిక అడుగులు ముందుకు సాగి, అదే పద్ధతిలో వెనక్కు వస్తారు. ఇలా నాలుగైదుసార్లు వెనుకకూ ముందుకూ సమన్వయంతో అడుగులు వేస్తారు.

పోతార్ తోలా :

పోతార్ అంటే అడుగులు, తోలా అంటే సేకరణ, ఈ నృత్యంలో సగం మంది ప్రక్క ప్రక్కన ఒక వరుసలో నుంచుంటారు. వారి వెనుకనే మరో బారులో మిగతా సగంమంది నిలుచుంటారు. వెనుక ఉన్నవారు, ముందున్నవారి భుజాలపై చేతులు వుంచుతారు; కుడివైపుకూ, ఎడమవైపుకూ, ఒక్కసారిగా తలలను త్రిప్పుతూ బృందం యావత్తూ ముందుకు వెడతారు. అడవిలో ఆకులు ఏరడాన్ని ఈ నృత్యం సూచిస్తుంది. అరకు లోయలో గిరిజనులు అడ్డ ఆకులను సేకరించడం ఒక చిన్న వృత్తి. సేకరించిన ఆకులను సంతలో అమ్ముతారు.

బాగ్ దింసా :

భగ్ అంటే ఒరియాలో ''బెబ్బులి'' అని అర్థం. అడవిలో భయంకరమైన జంతువులలో పెద్దపులి ఒకటి. పెద్దపులి కనిపిస్తే ఎలా పారిపోవాలో చిన్నా పెద్దా అందరూ తెలుసుకోవాల్సిన అవసరం వుంది. బాగ్ దింసా నృత్యం దీనిని తెలియ చేస్తుంది. బృందంలో సగం మంది ఒకరి చేతులు మరొకరు పట్టుకుని గుండ్రంగా మూగుతారు. తలను పైకెత్తుతూ మునివేళ్ళమీద నిలిచి వుంటారు. మిగతా సగం మంది చకచకా చుట్టూ తిరుగుతూ లోపల ప్రవేశించి, పాము చుట్ట ఆకారంలో అంతా )లుచుంటారు. ఇలా అనేకసార్లు చేస్తారు.

)విధ రకాలు :

నాటికారి, కుందా దింసా, బాయాదింసా అనే నృత్యాలు కూడా వున్నాయి. నాటికారి నృత్యం ఒక్కొక్కరే చేసే నృత్యం, ముఖ్యంగా వాల్మీకి జాతివారు. దీపావళి పండుగ రోజు నృత్యం చేస్తారు. మిగతా పండుగల సమయంలో ఇతర జాతులు కూడా ఈ నృత్యంలో పాల్గొంటారు.

అలాగే కుందా దింసా, కుందా అంటే ఒకరినొకరు భుజాలతో తోసుకోవడం అని భావం. ఈ నృత్యంలో లయబద్ధంగా ఊగుతూ, ఒకరినొకరు భుజాలతో తోసుకుంటారు.



పథోర్‌తోలా నృత్యం

బాయా దింసా నిసాని దేవత పూనినపుడు గణాచారి చేసే నృత్యమిది. బాయా అంటే పూనకం. గణాచారిని ఒరియాలో "గురుమాయి" అంటారు. ఎవరైనా పూనినపుడు గ్రామస్తులందరు ఆ వ్యక్తి చుట్టూ చేరి తలలు వంచి నిలుస్తారు.

అలాగే "గురుమాయి" భవిష్యత్తులో జరగనున్న సంఘటనలను చెపుతారు. గూడెంలో ఎవరెవరు ధర్మం తప్పి చరించినది బయటపెట్టడం కూడా జరుగుతుంది. ఇలా చెప్పే జోశ్యాలలో చాలావరకు నిజం కావడం విశేషం. జానపదులు పూనకం వచ్చిన వ్యక్తిని అనుకరిస్తారు. గనుక ఈ నృత్యాన్ని బాయాదింసా అని వ్యవహరిస్తున్నారు. పూనకం తొలగేవరకూ ఈ నృత్యం కొనసాగుతుంది. (ప్రభుత్వం గిరిజన సాంస్కృతిక సంస్థ సౌజన్యంతో).

మధురాలు :

మధురమైన పాటల్నీ, ఆటల్నీ, నృత్యాలను చేస్తూ కాలంగడిపే మధురాలు. ఆదిలాబాద్, నిజామా జిల్లాల్లో, అడవుల్లో, కొండల్లో ఈ మధురాలు ఎక్కువగా నివశిస్తున్నారని, విద్యారణ్యగారు ఆంధ్రపత్రికలో ఉదహరించారు.

వారి జీవన సరళీ, ఆచార వ్యవహారాలూ, వేషభాషలూ అన్నీ గిరిజన జీవితానికి దగ్గరగా వుంటాయి. వీరు అన్ని విధాలా, లంబాడీలను పోలి వున్నప్పటికీ వీరికీ వారికీ చాలా తేడా వుంది.

వీరు సంచార జాతులనీ, ఉత్తర ప్రదేశనుండి వచ్చారనీ అంటారు కాని, మేము ఇక్కడి వారమే నంటారు మధురాలు. అదిలాబాద్ జిల్లాలోని ఉట్నూరు, ''బోద్'' అడవుల్లో ఎక్కువగా కనిపించే మధురాల జీవన విధానం వేషభాషలు విచిత్రంగా కనిపిస్తాయి. అందంలోనూ, వస్త్రధారణలోనూ, ఏ ఇతర జాతి స్త్రీలకూ తీసిపోరు.

వీరు మొగల్ చక్రవర్తి ఔరంగజేబు కాలంలో సైన్యానికి ఆహారం అందించే వారని, ప్రసిద్ధ సామాజిక శాస్త్రవేత్త గిరిజనుల ఆరాధ్య దైవం ''హేమండార్ఫ్'' అంటారు.



మధురాలు

మధురాల సిరోజాల అలంకరణ ఎంతో రమణీయంగా వుంటుంది. స్త్రీ లందరూ మామూలుగా సిగలు చుడతారు కాని మధురాలు పొడుగాటి కొమ్ములాగా అలంకరిస్తారు. ఈ అలంకారం చూడ ముచ్చటగానే వుంటుంది.

జీవిత సరళిలో, వేషధారణలో దగ్గర సంబంధాలున్న లంబాడీలు, ఇంతకు పూర్వం, మధురాలతో సంబంధాలు లేకపోయినా, ఇటీవల కాలంలో వీరిరువురి మధ్యా వివాహ సంబంధాలు జరుగుతున్నాయి.

## ఇష్టమైన గోకులాష్టమి :

మధురాలకు గోకులాష్టమి ఎంతో ఇష్టమైన పండుగ. ఈ పండుగ పర్వదినాల్లో ''లెంగినాఖేల్'' అనే ఆటను తమ తమ గూడేలలో ఆడుతూ వుంటారు. మగవారు తప్పెటల్నీ, డోలక్‌లనూ. నగారాలనూ వాయిస్తూవుంటే, మహిళలు లయబద్ధంగా చప్పట్లు చరుస్తూ, అడుగులలో అడుగులు వేస్తూ, వలయాకారంగా, గుండ్రంగా తిరుగుతూ, కృష్ణ సంకీర్తనాన్ని ఆశువుగా ఆహ్లాదంగా వివరిస్తారు. అయితే స్త్రీలు ప్రదర్శించే నృత్యంలో పురుషులు పాల్గొనే అవకాశముండదు. అందుకు కారణం, పది సంవత్సరాల వయసున్న బాలుడు కృష్ణుని పాత్ర ధరిస్తే, స్త్రీలంతా గోపికలుగా నాట్య విన్యాసాన్ని చేస్తారు. ఆ కారణం వల్ల వారి వారి పురుషులకు ఈ నాట్యంలో తావు వుండదని మధురాలు చెపుతారు.

వీరు దసరా, దీపావళి, సంక్రాంతి పండుగలను వైభవంగా జరుపుకుంటారు. ఆటపాటలతో, ఆనందడోలికల్లో ఊగుతారు.

ముఖ్యంగా ''ఖచ్‌డమారన్'' అనే కన్యల పండుగను ప్రత్యేకంగా జరుపుకుంటారు. ఇది తెలంగాణాలో బహుళ ప్రచారంలోవున్న బతకమ్మ పండుగకు చాలా సన్నిహితంగా వుంటుందట. అయినా అది ఒక ప్రత్యేక కళారూపంగా వుంటుందట.

గోండ్లు మొదలైన గిరిజనుల మాదిరే చక్రాల బళ్ళను ఉపయోగిస్తూ, ఉన్న వనరులతో వ్యవసాయం చేసుకుంటూ జీవిస్తారు. వీరు స్నేహానికి ప్రాణమిస్తారు.

# గిరిజనుల, సంగీత వాయిద్యాలు

ఆంధ్రదేశంలో అనేక జానపద కళారూపాలతో పాటు, అడవుల్లో కొండల్లో నివశించే గిరిజన ప్రాంతాల్లో నివశించే గిరిజనులకు కూడ సంస్కృతీపరమైన అనేక నృత్యాలూ, గేయాలూ, అనేక వాయిద్య పరికరాలూ వున్నాయి.

వీటిని ప్రభుత్వ గిరిజన సంక్షేమ శాఖ విభాగమైన గిరిజన సాంస్కృతిక పరిశోధన, శిక్షణ, వ్యవహారాల సంస్థ పరిశోధనాత్మకమైన కృషి చేస్తున్నదనీ, గిరిజన

సంస్కృతికి ప్రాధాన్యత ఇవ్వడం ఈ సమగ్ర పరిశోధన విశేషమనీ. సంస్కృతీ చిహ్నాలైన వస్తువుల్ని సేకరించటం అవసరమనీ, అవి గిరిజన సంస్కృతిని తెలుసుకోవడం కోసం ఉపయోగపడతాయనీ, అందుకోసం కృషి జరుగుతూ వుందనీ. ఆ కృషిలో భాగంగా యం. ఎ. రవూఫ్‌గారు జానపద కళల ప్రత్యేక సంచికలో గిరిజనుల సంగీత వాయిద్యాలను గురించి వివరించారు.

# సంగీత వాయిద్యాలు

## గుమేళా :

గుమేళా అనే ఈ వాయిద్యాన్ని కుమ్మరి మట్టితో తయారుచేస్తారు. లోపలి భాగం అంతా డొల్లగా వుంటుంది. స్థూపక ఆకారంలో వుంటుంది. ప్రక్కన మేక చర్మంతో సాగదీసి బిగిస్తారు. దండారి నృత్యం జరిగే సమయంలో గోండు జాతి వారు ఈ వాయిద్యాన్ని అద్భుతంగా వాయిస్తారు.

## డగ్గుడు :

అలాగే డగ్గుడు అనే వాయిద్యాన్ని సవర జాతివారు ఉపయోగిస్తారు. ఈ వాయిద్యం యొక్క ఆకారం మద్దెలలా వుంటుంది. దీనిని శ్రీకాకుళం జిల్లాకు చెందిన సవరలు వారి జాతిలో ఎవరైనా మరణించినప్పుడు, సంతాప సమయంలో దీనిని వాయిస్తారు. అలాగే పితృదేవతలకు శ్రార్థ ఖర్మలు జరిపే ఆగుగామా సమయంలో ఉపయోగిస్తారు.

## కిరిడి :

ఈ వాయిద్యాల పేర్లే ఎంతో ఆసక్తి కలిగించేవిగా వున్నాయి. కిరిడి వాయిద్యం మట్టితో తయారుచేయబడే డమ్ము వాయిద్య మిది. పై భాగాన మేక చర్మాన్ని అమరుస్తారు. రెండు చిన్న కట్టుపుల్లలతో మోరీబాణికి అనుగుణంగా ఈ వాయిద్యాన్ని ఉపయోగిస్తారు.

## తప్పె :

రెండు అడుగుల వ్యాసం కలిగిన ఒక కొయ్య చట్రానికి, ఎండబెట్టిన మేక చర్మాన్ని గట్టిగా లాగి బిగిస్తారు. డప్పు, డంగ్ అనే రెండు చిన్న పుల్లలతో ఆదిలాబాద్ జిల్లాలో వున్న రాజగోండులు దీనిని వాయిస్తారు.



కోయ నర్తకుడు

## తుడుము:

అర్ధగోళాకారంలో వుండే మట్టితో తయారుచేయబడ్డ వాయిద్య మిది. పైన మేక చర్మాన్ని బిగించి కడతారు. అర్ధగోళం పై భాగం పైన తోలుపట్టీలు చర్మాన్ని బిగించి వుంచుతాయి. తాళ్ళ చుట్టుపైన ఈ వాయిద్యాన్ని వుంచి, తోలుపట్టాలతో

వాయిస్తారు. ముఖ్యంగా దింసా నృత్యాలలో దీనిని ఉపయోగిస్తారు. సామంత జాతివారూ, గోండులూ ఈ వాయిద్యాన్ని ఎక్కువగా వాడుతారు.

## వెట్టెలేక, తురుబులి :

అదిలాబాదు జిల్లా గోండులు ఉపయోగించే వాయిద్యమిది. దీనిని తురుబులి అనీ, వెట్టె అనీ అంటారు. కుండమట్టితోగాని ఇనుముతోగాని, కొయ్యతోగాని దీనిని పళ్లెం తయారుచేసి పైన చర్మాన్ని బిగిస్తారు. ఈ చర్మం వ్యాసం సాధారణంగా పది అంగుళాలకంటె ఎక్కువే వుంటుంది. సన్నని రెండు పుల్లలతో దీనిని వాయిస్తారు.

## డోలు :

దారువుతో డొల్లగా చేసిన ఈ వాయిద్యానికి రెండు వైపులా జింక చర్మాన్ని గాని, మేక చర్మాన్ని గాని ఉపయోగిస్తారు. వెదురు ముక్కలూ, తాళ్ళతో ఈ చర్మాన్ని బిగువుగా ఉంచుతారు.

## టాబోర్ :

ఈ వాయిద్యం రెండు ప్రక్కలా వాయించవలసిన వాయిద్య మిది. స్థూపాకారంలో వుండే ఈ వాయిద్యం మధ్యలో కొంచెం ఉబ్బెత్తుగా వుంటుంది. చట్రాన్ని మట్టితో చేసి కాలుస్తారు. రెండుప్రక్కలా అనువుగా మేక చర్మాన్ని అమర్చి బిగించుతారు. తోలుపట్టీలతో ఈ రెండువైపుల చర్మాన్ని బిగించటానికి వీలుంటుంది. ఈ వాయిద్యాన్ని కేవలం వ్రేళ్ళతో వాయిస్తారు. ముఖ్యంగా .... అరకు లోయలో దీనిని అన్ని జాతులవారూ వాయిస్తారు.

## రెండవ రకం డోలు :

ఇది కూడా పైన వివరించిన డోలులాంటిదే. మెడకు తగిలించుకుని, డోలును పొట్టకు ఆనించి, ఒక చేతితో వెదురు పుల్లతోనూ, మరో చేతివ్రేళ్ళతోనూ, అప్పుడప్పుడు అరచేతితోనూ వాయిద్యాన్ని సాగిస్తారు.

## గోగోడ్ - రాజన్ :

ఈ వాయిద్యాన్ని శ్రీకాకుళం జిల్లాలో వున్న సవరలు వుపయోగించే సంగీత వాయిద్య మిది. మామూలు కొబ్బరి చిప్పను ఈ వాయిద్యానికి స్వరపేటికగా

ఉపయోగిస్తారు. తొండ చర్మాన్ని స్వరపేటికపై బిగిస్తారు. 12 నుంచి 16 అంగుళాల వెదురును ఒక చివర కొబ్బరి చిప్పను మేకుతో బిగిస్తారు. వెదురుకు రెండవ చివరన రెండు మేకులు త్రిప్పడానికి వీలుగా ఉంటాయి. స్వరపేటికపైన సన్నని కొయ్యముక్కను ఉంచి, దానిపై నుండి రెండు తీగలను మేకులకు కట్టి



సామూహిక నృత్యం

ఉంచుతారు. మేకులను త్రిప్పడం ద్వారా తీగ బిగుతును ఎక్కువ చేయవచ్చు. విల్లువలె తయారుచేసిన కమానుతో ఈ వాయిద్యాన్ని వాయిస్తారు.

పారా :

ఇది మద్దెలవంటి పొడవుమాత్రం రెండు అడుగులు వుంటుంది. దీనికి కూడా రెండువైపులా మేకచర్మాన్నే బిగించి ఉంచుతారు. రెండువైపులా వ్రేళ్ళతోనే వాయించుతారు. అదిలాబాదుజిల్లా రాజాగోండులు ఈ వాయిద్యాన్ని ఉపయోగిస్తారు.

## వాయుజన్య శబ్ద వాయిద్యాలు

నాగస్వరం :

ఎరుకలలో ఒక కులమైన పాములవాళ్ళు వాయించే వాద్య మిది. పాములను ఆడించటానికి ఇది ఉపయోగపడుతుంది. త్రాచువంటి పాములను సైతం పాముల వాళ్ళు నాగస్వరంతో మచ్చిక చేస్తారు.

డగుల బరాయి :

ఇది వెదురుతో చేసిన వాయిద్యమేగాని పిల్లనగ్రోవికంటే పెద్దది. దీని పొడవు 16 అంగుళాల నుంచి 20 అడుగుల వరకు వుంటుంది. రెండు నుంచి మూడు అంగుళాల వ్యాసం వుంటుంది. దీనికి మధ్యలో పది పన్నెండు అంగుళాల చాలు ఉంటుంది. ఈ పెద్ద చాలుకు రెండువైపులా పొడుగుపాటి చిన్న రంధ్రాలు వుంటాయి. డంగు అనే ఒక కొయ్యముక్క సహాయంతో ధ్వనిని జనింపచేస్తారు. ఈ వాయిద్యాన్ని విడిగా కాకుండా అనేక యితర వాయిద్యాలతోపాటు ఉపయోగిస్తారు.

వెదురు పిల్లనగ్రోవి :

గోదావరి ప్రాంతంలో ఎక్కువ గ్రామాలలో ఇది బహుళ ప్రచారంలో ఉంది. ఇతర చోట్ల కూడా పల్లె ప్రజలు అభిమానించే వెదురు వాయిద్య మిది. వూదేచోట ఒక రంధ్రమూ, మధ్య నుంచి రెండవ చివరి వరకు ఐదు చిన్న రంధ్రాలు వుంటాయి. సాధారణంగా ఇది 21 సెంటిమీటర్ల పొడవు ఉంటుంది.

తేతిడి :

సవరలు ఉపయోగించే ఈ వాయిద్యం గేదె కొమ్ముతో తయారుచేసినది. దీని పొడవు 12 నుంచి 15 అంగుళాల వరకూ వుంటుంది. సన్నగా చివరన వుండే వెదురుతో చేసిన సన్నని గొట్టాన్ని పేకగా అమర్చుతారు. బాగా దమ్ముపట్టి వూది నప్పుడు పెద్దగా శబ్దం వస్తుంది.

పనార్ :

పన్నెండు అంగుళాల పొడవు ఒక అంగుళం వ్యాసం కలిగిన ఈ వాద్యాన్ని కూడా సవరలు ఉపయోగిస్తారు. దీనికి ఒకవైపు మూసి వుంటుంది. రెండవవైపు ఖాళీగా వుంటుంది. మూసినవైపు దీర్ఘచతురస్రాకారంగా ఒక ...న్న రంధ్రం ఉంటుంది. తాటాకు బద్దను మైనంతో రంధ్రం వద్ద అతికిస్తారు. ...టాకు బద్ద కదలిక ద్వారా రంధ్రం పరిమాణాన్ని మార్చుతుండవచ్చు. ఎడమచేతి ...టనవ్రేలు ఇతర వ్రేళ్ళ మధ్య పట్టుకుని పెదిమల దగ్గరగా ఉంచి ఈ వాద్యం నుంచి శబ్దాన్ని ధ్వనింప చేస్తారు.

## రెండవ రకం పనార్

తెలుగు దేశంలో ఇంకా అనేకచోట్ల ప్రచారంలోవున్న పిల్లనగ్రోవి. ఇది ఒక చివరన వున్న రంధ్రం నుండి ఊదుతూ కుడిచేతి వ్రేళ్ళతోనూ. ఎడమచేతి వ్రేళ్ళతోనూ శబ్దంలో మార్పులు తీసుకురావచ్చు. వివాహాది శుభకార్యాల సమయంలోనూ, విశ్రాంతిగా వుండే సమయంలోనూ ఈ వాయిద్యాన్ని వాయించటం పరిపాటి.



# తంత్రీ వాయిద్యాలు

## కిన్నెర :

ఇది అనేక తంత్రులు కలిగిన సంగీత వాయిద్యం. ఉత్తరాదిన కొన్ని గిరిజన జాతులలో వాడుకలో వున్న కిన్నెర వాయిద్యాన్ని పోలి వుంటుంది. ఇంచుమించు గిటారులాగా వుంటుంది. లోపల ఖాళీగా వున్న సుమారు 20 అంగుళాల వెదురుపై మైనంతో మధ్యగా నాగుమెట్లను అతికిస్తారు.

మెట్లపై నుండి రెండు తంత్రులను బిగిస్తారు. వెదురుకు ఒక చివర స్వర పేటిక వుంటుంది.

## కింగ్రి :

మూడు తంత్రులూ, చర్మం బిగించిన స్వరపేటిక ఈ వాయిద్యంలో ముఖ్య భాగాలు. స్వర పేటికను చదరంగా కొయ్యతో తయారుచేస్తారు ఫిడేలువలె వుండే ఈ వాయిద్యాన్ని అత్యంత విలువైనదిగా పరిగణిస్తారు. పర్ధానులలో అందరికంటె ప్రముఖుడైన వ్యక్తి ఈ వాయిద్యాన్ని వాయిస్తాడు. ఆ సమయంలో చిన్నవారు తప్పెట్లు వాయిస్తూ బాణాలు పూడుతారు.



# సిరిసిరి మువ్వల

# చిరుతల రామాయణం

చిరుతల రామాయణం తెలంగాణా ప్రాంతంలో చాలా వ్యాప్తిలో వుంది. ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో చిరుతల రామాయణం అతి ప్రాచీన కళారూపం. పల్లెల్లోని గ్రామిక యువకులు ముప్పై నలభై మంది కలిసి వేసవికాలంలో ఒక గురువును నియమించుకుని చిరుతల రామాయణాన్ని నేర్చుకుంటారు.



ఊరు బయట విశాలమైన స్థలంలో ఒక కర్ర పాతి, దానికి జండాలు కట్టి, చిరుతలు పట్టుకుని, కాళ్ళకు గజ్జెలు కట్టుకుని పాటపాడుతూ నృత్యం చేస్తారు. న్యాయానికి ఇది మన కోలాటం లాంటిదే అయితే వీరు ముఖ్యంగా కోలాటం పాటల కంటే చిరుతలతో నృత్యం చేస్తూ రామాయణ భారత కథలను తీసుకుని బృంద సభ్యులే పాత్రలుగా వ్యవహరించటం వల్ల దీనికి చిరుతల రామాయణమని పేరు వచ్చింది.

## పాత్రల ఎంపిక :

ప్రథమంలో బృంద సభ్యుల ఆకారాల ననుసరించి, పాత్రలను ఎంపిక చేస్తారు. తరువాత వేషధారణ లేకుండానే ప్రతి పాత్రకూ పాటను నేర్పుతాడు. ప్రతి పాత్రధారికీ క్షుణ్ణంగా పాట వచ్చి తీరాలి. ఈ విధంగా ఒక మాసం రోజులు గురువు బృంద సభ్యులతో రామాయణం శిక్షణ ఇస్తాడు. అభ్యాసం అయిన తరువాత రామ పట్టాభిషేకం వుంటుంది. ముఖ్యంగా సీతారామ పాత్రలు ధరించేవారు. ధనవంతుల ఇళ్ళలో చీరలు, పంచెలు, నగలు సంపాదించి వేషధారణను సమకూర్చుకుంటారు.

విశాలమైన స్థలంలో రామాయణానికి సంబంధించిన సన్నివేశాల ననుసరించి సినిమా సెట్బు మాదిరి, రావణాసురుని లంక, అయోధ్య, కిష్కింధ, ఇలా వేరు వేరు భాగాలను కట్టెలతో మంచెల్లాగా నిర్మిస్తారు.

ఒక్కొక్క పాత్ర ప్రవేశించి పరిచయం చేసుకునే సమయంలో ప్రేక్షకులు కరతాళ ధ్వనులతో వారిని ఉత్సాహపరుస్తారు. ఇలా రాత్రంతా రామాయణం గానం చేసి, ఉదయం శ్రీరాముని పట్టాభిషేక మహోత్సవం చేస్తారు.

ఈ వుత్సవానికి ఊరి జనమంతా కదిలి వస్తారు. ఎత్తైన ప్రదేశంలో సీతా రాములుగా పాత్రధారులను కూర్చోపెడతారు. కొంచెం క్రింద లక్ష్మణుని పాదాల ముందు హనుమంతుడు కూర్చుని వుంటాడు. ఉత్సవ సమయంలో సీతారాములకు చీరలు, పంచెలు, డబ్బులు సీత ఒడిలో పెట్టి, దేవతామూర్తులను భక్తి శ్రద్ధలతో కొలిచినట్లే కొలుస్తారు. ఈనాడు చిరుతల రామాయణం. సినిమాలు వచ్చిన తరువాత వీటిపట్ల కొంచెం ఆదరణ తగ్గుతూవున్నా, కొన్ని పల్లెల్లో ఇప్పటికీ వున్నారు. అలా అంబేద్కర్ యువజన సంఘం, తోటపల్లి, చెర్ల బూత్కూరు, చింతకుంట, వీణవంక గ్రామాల్లో చిరుతల రామాయణ బృందాలు ఈ నాటికీ పనిచేస్తున్నాయి.







# ఎరుకలు చెప్పే ఎరుకోయమ్మ, ఎరుక

ఒకనాడు కురవంజి రాజాస్థానాలలో రాణివాసపు స్త్రీలకు ఎరుక చెప్పేది. కురవజాతికి చెందిన వారవటం వల్ల వారిని కురవంజి అని పిలిచేవారు. వారే ఈనాడు ప్రతి పల్లెలోనూ సోదోయమ్మ సోది, సోదడగరమ్మ సోది అంటూ వీధి వీధీ తిరుగుతూ వుంటారు.

## భవిష్యత్తు కోసం :

ప్రతి మనిషికీ తన భవిష్యత్తును గురించి తెలుసుకోవాలనే ఆరాటం సామాన్యంగా వుంటుంది. ప్రస్తుతం విజ్ఞానశాస్త్ర విజయాలవల్లా, సామాజిక విశ్లేషణం వల్లా కాస్త తగ్గినా పూర్తిగా పోలేదు. బిడ్డపుట్టిన రోజే జాతకం వ్రాయించేవారు ఎంతో మంది వున్నారు. పూర్వ రాజులకూ, సంస్థానపతులకూ, జమీందార్లకూ, ఆస్థాన జ్యోతిష్కులు వుండేవారు. ఏ కార్యం ప్రారంభించాలన్నా జ్యోతిష్కుల అభిప్రాయం తీసుకోకుండా ఏ పనీ చేసేవారు కారు. జ్యోతిష్కులు రాజాస్థానాలకు పరిమితమైపోయారు.

## ఎరుకల జోశ్యమే పేదలకు :

జ్యోతిష్కులు రాజాస్థానాలకు పరిమితమైతే పేదలకంతా ఎరుకల స్త్రీలే సోదె ద్వారా వారి వారి భవిష్యత్తును చెపుతూ వుంటారు. సోదెలవారి మాదిరే కోయదొరలు కూడ పేదలకు జోస్యం చెపుతూ వుంటారు. ఎరుకోయమ్మ ఎరుకో అంటూ వీథుల్లో వెళుతూ పిలిచిన వారికంతా ఎరుక చెపుతూ వుంటారు. ఎరుకంటే వారికి తెలిసింది చెప్పటం, తెలిసింది చెప్పటమంటే, భవిష్యత్తును గురించి చెప్పగలవారు గనుక, వారిని ఎరుకవాళ్ళు అని అంటారు. అయితే ఇది రూపాంతరం చెంది,

ఎరుక ఎరుకలగా మారి, అది ఒక జాతి పేరుగా, ఎరుకల జాతియై, ఎరుకల వాళ్ళుగా ప్రఖ్యాతి వహించారు. ఎరుక చెప్పేవారి జీవిత భవిష్యత్తు ఏమిటో ఎరుకల వారికి తెలియకపోయినా, ఇతరులకు మాత్రం ఎరుక చెప్పి జీవిస్తున్నారు.

## వెంకన్న సోది వేషం :

సోదిమీద నమ్మకం, రాజులకూ, జమీందారులకు, సామాన్య ప్రజలకూ పరిమితం కాక, దేవుళ్ళను కూడా అది ఆకర్షించిందంటే, అది ఎంతటి బలవత్తరమైందో ఊహించవచ్చు, ఉదాహరణకు తిరుపతి వెంకటేశ్వర స్వామి, శ్రీనివాసుడు కూడా తన ప్రియురాలు పద్మావతి దగ్గరకు ఎరుక చెప్పే వేషంతో వెళ్ళి, ఆమెకు గద్దె చెప్పినట్లు నటిస్తూ పద్మావతికి శ్రీనివాసుని పట్ల అనురాగం కలిగించి చివరికి పద్మావతిని వెంకటేశ్వరుడు వివాహం చేసుకున్న ఘట్టం అందరికీ తెలిసిందే, దీనిని బట్టి సోదె ప్రక్రియ ఎంతటి బలవత్తరమైందో అర్థం చేసుకోవచ్చు.

## కష్టాలూ, సుఖాలూ :

ప్రతి మనిషీ సుఖాలు వచ్చినప్పుడు ఏ జాతకాలు చూపించుకోకపోయినా, కష్టాలు వచ్చినప్పుడు మాత్రం జాతకాలూ, జ్యోతిషమూ, సాముద్రికమూ సోదె చెప్పించుకోవడమూ, చిలక జోశ్యమూ, కోయవారి పలుకులు వినీ తృప్తిపడుతూ వుంటారు.

సహజంగా ప్రతివారూ పుట్టినప్పుడే పుట్టిన ప్రతివారికీ బ్రహ్మ ముఖాన వ్రాస్తాడంటారు. అయినా మనసు నిబ్బరం లేక, కష్టాలను తట్టుకోలేక ఎవరు ఏ మంచి వార్త చెపుతారో అని మగ వారెవరూ ఇంట లేనప్పుడు, స్త్రీలంతా కూర్చుని మంచి చెప్పేటప్పుడు సంతోషిస్తూ, చెడు చెప్పేటప్పుడు ముక్కులు చీదుతూ వుంటారు.

## సోదెమ్మ, సోదో :

సోదెమ్మ సోదో అంటూ, నెత్తిమీద ఒక బుట్ట పెట్టుకుంటారు. ఆ బుట్టలో, నాలుగు పలకలుగల గవ్వలతో కుట్టిన ఒక వస్తువుంటుంది. దానినే వాక్కు నిచ్చే దేవతగా ఆరాధిస్తారు. ఆ దేవతను, పసుపు కుంకాలతో అలంకరిస్తారు. ఒక చేతిలో తంబురా, చంకలో పిల్లవాడు, మరో చేతిలో వెండికట్టులుగల మంత్రశక్తి

కలిగిన పుల్లను పట్టుకుంటారు. ముఖాన పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుని వయ్యారంగా వీథిలో నడుస్తూ చూపరులకు ఏవో అతీత శక్తులు కలిగిన స్త్రీ దేవతామూర్తిగా కనిపిస్తుంది.

## ఎవరో అమ్మ పిలుస్తుంది :

ఇంతలో ఎవరో ఒక అమ్మ ఓ సోదమ్మీ అని పిలుస్తుంది .... దానితో అమ్మలక్కలందరూ చుట్టూ మూగుతారు. సోదెలమ్మి చాటలో బియ్యం పోయించుకుని, పసుపు కుంకాలను వారగా పెట్టించి, పావలా డబ్బులు ప్రక్కన పెట్టించి, వాక్కునిచ్చే ఇలవేల్పు, గవ్వల పలకను ముందుంచి, కూనరాగం తీస్తూ, వెండి



కట్టుల పుల్లను ఇలవేల్పుకు తాకించి. అమ్మా పలుకు, జగదంబా పలుకు, మాయమ్మా పలుకు. కంచి కామాక్షమ్మా పలుకు, మధుర మీనాక్షీ పలుకు, విశాలాక్షీ పలుకు, విజయవాడ కనకదుర్గమ్మా పలుకు, పెనుగంచి ప్రోలు తిరుపతమ్మా పలుకు. వుయ్యూరు వీరమ్మా పలుకు; పలకవే తల్లి అని దేవతలందర్నీ కళ్ళు మూసుకుని భక్తిభావంతో స్తుతించి, చేతిలో వున్న పుల్లను చెప్పించుకునే వారి చేతిలో పొడుస్తూ; ఇంటా, బొట్టా, తోడా, సీడా గడ్డమా అంటూ సోది చెప్పించుకునేవారి బంధువుల తాలూకు ఆత్మలను తనద్వారా పలికేటట్లుచేసి పోయిన వారి ఆశలు అడియాసలు చెపుతూ, సంతోషకరమైన విషయాలు చెప్పేటప్పుడు, సంతోషంగానూ, విచారకరమైన విషయాలు చెప్పేటప్పుడు దీనాతిదీనంగా హృదయాలను ద్రవింపచేసే విధంగానూ, కొన్ని ఆసక్తికరమైన విషయాలనూ, కొన్ని ఆశను రేకెత్తించేవిగానూ, మరికొన్ని అత్యాశను కలిగించేవిగాను మరికొన్ని వారి వారి మనసుల్లో ఏముందో అదే బావాన్ని

మార్పుల ననుసరించి, వారికి అభిరుచిగల విషయాలను చెపుతూ, వారితో ఆమో దింపచేస్తూ, భూత భవిష్యత్ వర్తమానాల గురించి జోశ్యం చెపుతూ పోయినవారి ఆత్మశాంతికి ముడుపులు కట్టించుకుంటూ, వారి వారి సందేహాల నివృత్తికొరకు ఓపికగా సమాధానాలు చెపుతూ, జరిగిందీ, జరగబోయేదీ చెపుతూ వినేవారి కళ్ళవెంట నీరు కార్పిస్తూ, తాను చెప్పిన విషయాలతో వారిని తన్మయుల్ని చేస్తూ, శ్రోతలయొక్క అనుభూతినీ, సానుభూతినీ అనుసరించి సోదెమ్మి, చేర్పులూ, కూర్పులూ కలిపి, రసవత్తరంగా సోదె ముగిస్తుంది .... చాటలో బియ్యం పావలా డబ్బులు కాక, వారి వారి సంతోషం కొద్దీ ఎక్కువ ముట్టచెపుతారు.



## పుట్టు పూర్వోత్తరాలు :

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం సామాజిక మానవ విజ్ఞానానికి చెందిన డా॥ జి. వి. సుబ్బారెడ్డిగారి కథనాన్ని బట్టి, దక్షిణ భారతదేశంలో, దక్షిణాగ్రం నుంచి .... ఉత్తరార్కాటు జిల్లాలు దాటి ఉత్తరంగా వీరు వ్యాపించి వుండేవారనీ, వీరిని కొరవలని పిలిచేవారనీ, మన రాష్ట్రంలో వీనిని ఎరుకల వాళ్ళనీ, కోర్వా వాళ్ళనీ పిలుస్తారనీ అంటారు.

ఎరుకల వారిలో ఏడు ఉపతెగ లున్నాయి. వెదురుబుట్టలల్లడం, పిట్టలు పట్టడం, ఉప్పు అమ్మకం; మంచాలకు నులకపేనడం, పాముల చర్మాలు తీయటం

మొదలైన పనులు పురుషులు చేస్తూ వుంటారు. స్వాతంత్ర్యానికి పూర్వం ఎరుకల వారు నేరస్థుల జాబితాలో వుండేవారు. స్వాతంత్ర్యానంతరం, షెడ్యూల్డ్ తెగలుగా గుర్తించటం జరిగింది.

## దేశ దిమ్మరులు :

వీరు దేశదిమ్మరులు, ఒక గ్రామం నుండి మరో గ్రామానికి సంసారాలతో సంచారం చేస్తూ వుంటారు. మరి కొంతమంది స్థిరనివాసాలు ఏర్పాటుచేసుకున్నారు. పైన వుదహరించిన ఏడు తెగలకు చెందిన ఎరుకలవారు, కడపకు మూడు కిలోమీటర్ల దూరంలో, దండు హరిజనవాడ ప్రక్కన కమలాపురం గూడెంలో ప్రభుత్వం నిర్మించిన ఇళ్ళలో నివశిస్తున్నారు. ఈ గూడెంలో నలభై కుటుంబాలవారున్నారు. అమాయక జీవులు. అల్పసంతోషులు. పూటకు అన్నం దొరికితే పరమానంద పడిపోతారు.







# దొమ్మరోళ్ళ
# దొమ్మరాటలు



దొమ్మరాటలు పూర్వకాలం నుంచీ వున్నట్లు 13-వ శతాబ్దానికి చెందిన పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో

అమరాంగనలు దివినాడెడు మాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు

పై రెండు పాదముల వర్ణన ప్రకారం, దొమ్మరసానులు వెదురు గడలపైన ఆకాశంలో అప్సరసలు ఆడుతున్నారంత భ్రమను కలిగించేవారట. అంటే వారుప యోగించే ఎదురు గడలు అంత పొడవైన వన్నమాట.

దొమ్మరసానులు పురుషులతో పాటు భూమిమీద వివిధ రకాల పిల్లిమొగ్గలు మొదలైన చిత్రవిచిత్ర ప్రదర్శనాలతో ప్రేక్షకుల్ని దిగ్భ్రమలో ముంచేవారు. చూచే వారికి వారి ఆటలు భయాన్ని కలిగించేవి. వారి ఆటలు పాతిన గడమీదనే కాక, గడను పురుషులు ఎదురు రొమ్ముమీద, నొసటిమీద నిలబెట్టి, ఆ గడలపై దొమ్మర సానులతో తమ తమ విద్యల్ని ప్రదర్శింప చేసేవారు.

దొమ్మరి సానుల ఆటను శ్రీహర్షుడు సంస్కృత నైషధంలో అలంకారికంగా వర్ణించినట్లు శ్రీనాథుడు శృంగార నైషధంలో ఈ విధంగా వర్ణించాడు.

## గడసాని గరడీలు :

ఈ సకలావనీ తలము వెక్కటిదాన పరిభ్రమించి య
భాస పరంపరా పరత నభ్రమునన్ విహరింపగోరియో
తాసిక కీర్తి విభ్రమ కలంగరి మన్నటియుంచుచుండు నీ
రానుతు వంశరత్నము దిరంబుగజెంది యమందలీలన్.

(శృంగార నైషధం, 5 ఆశ్వా, 118 పేజీ)

అలాగే

సంత నెన్నడో జవ్వన మమ్ము
కొన్న గడసాని ననుంగవ యందలంచితీ.

అని ఊర్వశి పేర్కొన్న గడసాని ఇటువంటిదే అని నాచన సోముని ఉత్తర హరి వంశం 1-74 పద్యంలో ఉదహరింపబడిందని. (పి. యస్. ఆర్. అప్పారావుగారు, సూత్రధారి పత్రికలో ఉదహరించారు.)

విజయనగర రాజుల కాలంలో మహర్నవమీ వుత్సవాలలో దొమ్మరాటలు మొదలైన చిత్ర విచిత్రాలను ప్రదర్శించడంతో పాటు ఏనుగులు, పులులు, సింహాలు మొదలైన క్రూరమృగాలతో సర్కసు పనులు చేయించేవారని విదేశీయాత్రికుడైన అబ్దుల్ రజాక్ వర్ణించినట్లు ఖావరాజు కృష్ణారావుగారు (విదేశీ యాత్రికులు - ప్రాచీనాంధ్రదేశం 191-192 పేజీలలో) ఉదహరించారు.

అంతే కాక బాపల విద్య లేపీ కూడ దొమ్మరి విద్యలతో సరిపోవని చంద్రశేఖరుడు తన శతకంలో ఈ విధంగా వర్ణించాడు.

మెడ్డుగ దొమ్మరెక్క, గన
మించిన యిద్దమ రేడలేదు, నా
తెడ్డొక బాప నిద్దెలని
తిట్టును మూర్ఖుడు చంద్రశేఖరా.

ఈ విధంగా దొమ్మరాటలు చరిత్రలో స్థానాన్ని ఏర్పరుచుకున్నాయి, ఈనాడు పెద్ద పెద్ద సర్కసులని చెప్పుకోబడే వాటికి ఆధారం ఆనాటి దొమ్మరాటలే —

## నేటి దొమ్మరాటలు :

ఆయా కాలాలలో చారిత్రకంగా ప్రచారం పొందిన దొమ్మరాటలు, ఈనాటికీ ఆంధ్రదేశంలో అక్కడక్కడా దేశ దిమ్మరులైన దొమ్మరుల ద్వారా చూస్తూ ంటాం. ఒకప్పుడు ప్రజ్ఞా విశేషాలను ప్రదర్శించే సమూహాలుగా వున్న ఈ మ్మరివారు కేవలం ఒకే కుటుంబంలో వున్న వ్యక్తులే. వారి జీవనాధారం కోసం న్న చిన్న ప్రదర్శనాల నిచ్చి వచ్చిన డబ్బుతో కడుపు నింపుకుంటూ, ఒక వూరి నుంచి మరో వూరికి పోతూ వుంటారు. ఒకప్పుడు రాజాస్థానాలలో ప్రభువుల సమక్షంలో ప్రతిభా విశేషాలను చూపించిన వీరు బిక్కుబిక్కుమంటూ దిక్కులేని యాచకుల్లాగా బ్రతుకుతున్నారు.

ఈనాడు - వీరి ఆలనా, పాలనా చూసేవారే లేరు. వీరిని గురించి ఆలోచించే వారే లేరు. పట్టించుకోవాల్సిన ప్రభుత్వం సంగతి చెప్పవలసిన అవసరమేమీ లేదు.

నిజానికి ప్రజ్ఞా, ప్రతిభా విశేషాలతో కూడుకున్న ఇలాంటి కళా రూపాలు చచ్చిపోకూడదు. వాటిని బ్రతికించుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఎందుకంటే, అవి జాతీయ క్రీడా విశేషాలకు సంబంధించిన కళారూపాలు గనుక.



సహజంగా ఈనాటి దొమ్మర్లు, పంటలు బాగా పండిన తరుణంలో, సంక్రాంతి మొదలైన పర్వదినాలలో దొమ్మరాటలవారు వస్తూ వుంటారు. వంశ పారంపర్యంగా కులవృత్తిగా స్వీకరించి కుటుంబంలో వున్నవారందరూ చిన్నతనం నుంచే వీటిని అభ్యసించడంవల్ల, కుటుంబ సభ్యులందరూ ఆరితేరినవారై వుంటారు. ముఖ్యంగా వీరి ఆటల్లో మంచి వయసులో వున్న స్త్రీలు ఇద్దరు ముగ్గు రుంటారు. ఈ ఆటలకు వీరే ముఖ్య ఆకర్షణ.

## వీధిలో ఎదురుగడ :

వీరు ఒక గ్రామంలో ప్రవేశించి పెద్దలందర్నీ కలుసుకుని ప్రదర్శనానికి అనుమతి తీసుకుని, వారిని ప్రదర్శనానికి ఆహ్వానించి, ఊరి మధ్య ఒక పెద్ద ఎదురుగడను పాతుతారు. దానిని నాలుగు ప్రక్కలా నాలుగు బలమైన త్రాళ్ళతో లాగి నిలబెడతారు. వారి దగ్గరున్న డోలును ఉధృతంగా వాయిస్తూ వుంటే, చిన్నపిల్లలు రకరకాల పిల్లిమొగ్గలు వేస్తూ వుంటారు. ఒక్క పదినిమిషాల్లో ఊరిలోని వారందరూ గుమికూడతారు. అప్పుడు ప్రదర్శనం ప్రారంభిస్తారు. ఇది చూడటానికి ఒక వ్యాయామ ప్రదర్శనంగా కనిపించినా, దీనిని ఒక కళారూపంగానే భావించి, ప్రజలు ఆనందం పొందుతారు.



యవ్వనంలో వున్న యువతుల పిల్లి మొగ్గలకూ, చేసే విన్యాసాలకూ, యువకులు తల్లక్రిందులై పోతారు. ఆట ప్రారంభానికి వంతగానున్న డప్పూ, డోలూ ఎంతో ఉత్సాహాన్నిస్తాయి. కేరింతలతో, కేకలతో, ఆడా, మగా, గోచీలు పెట్టి దండలూ, జబ్బలూ, చరుస్తూ అందరూ రకరకాల మొగ్గలువేస్తూ ప్రేక్షకులను ఆకర్షిస్తారు; గారడీ నాయకుడు కొట్టే డోలుకూ వేసే కేకలకూ అనుగుణంగా రకరకాల విన్యాసాలు చేస్తారు. ముఖ్యంగా స్త్రీలు, ఎత్తుగా వున్న తీగమీద ఎదురుగడ బ్యాలెన్సుతో ఆ ప్రక్క నుంచి ఈ ప్రక్కకు, ప్రథమంలో నెమ్మదిగా నడుస్తూ, తరువాత వేగంగా నడుస్తూ, తీగమీదనుండి క్రిందికి పడిపోతుందేమోనన్నంత భయాన్ని కలిగిస్తూ తమ తమ నైపుణ్యాన్ని చూపిస్తారు.

## గడమీద గిరికీలు :

ఆ తరువాత ఎత్తుగా వున్న స్త్రీ, పురుషుడూ కూడా గబగబా పైకి ఎగబ్రాకి, శిఖరాగ్రంమీద నిలబడీ, కూర్చుని, పడుకునీ రకరకాల ఆశ్చర్యకరమైన విన్యా

సాలను చేస్తూ చూపరుల్ని, సంభ్రమాశ్చర్యాలతో ముంచుతారు. అక్కడనుండీ పల్టీ కొట్టి ఎదురుగడకు కట్టిన త్రాటిమీద నుండి ఒక్క నిమిషంలో వేగంగా జారి క్రిందికి వస్తారు. ఆఖరిసారిగా గడమీదకు స్త్రీ ఎగబ్రాకి గిర్రున తిరుగుతూ, తన చాతుర్యాన్ని చూపిస్తుంది. చుట్టూ చేరిన ప్రేక్షకులందరూ, తలలు పైకెత్తి ఈలలతో చప్పట్లుతో, గడసానిని మరింత ఉత్సాహపరిచి ఆనందంలో ఓలలాడిపోతారు. ఇలా ముగ్ధులైపోయిన ప్రేక్షకులను గారడి బృందంలో వున్న పిల్లలూ, పెద్దలూ బాగా డబ్బు దండుకుంటారు. ఇలా ఒకనాడు దొమ్మరాటలు. ఆంధ్ర ప్రజాసామాన్యాన్ని ఉర్రూతలూగించాయి. ఈనాటికీ అక్కడక్కడా చిన్న చిన్న బృందాలను చూడగలం. ఒక రకంగా చెప్పాలంటే ఇది ఒక చిన్నతరహా సర్కసు, అయినా గడసాని గడ నెక్కడం ఊరికి మంచిదనే నమ్మకం పల్లెప్రజలలో వుంది.



# కనికట్టు చేసే కాటిపాపలవాళ్లు



**కాటిపాపలవారు** ఆంధ్ర ప్రాంతంలో కూడా వున్నారు. ఈ కాటిపాపలవారు, మెదక్ జిల్లా జహీరాబాద్ తాలూకాలో వున్నారు. కాని ఈనాడు ఆంధ్రదేశంలో కాటిపాపల వారిని గురించి ఎవరికీ తెలియదు.

వీరిని అందరూ కాటిపాపల వాళ్ళు అంటారు. ఇలా పేరు ఎందుకు వచ్చిందంటే ఎవరూ చెప్పలేరు. కాని వీరి అసలు పేరు కాటికాపర్లు. వీరి అసలు వృత్తి (కాటిని) శ్మశానాన్ని కాపలా కాయడమనీ అందువల్లే వారికా పేరు వచ్చిందనీ, లక్ష్మీకాంతమోహన్‌గారు తెలియజేస్తున్నారు. పూర్వం ఊరి కాపలావారి మాదిరి కాటికాపర్లు కూడా వుండేవారు. వీరికి ఊరు వుమ్మడిగా పారితోషికం ఇవ్వబడేది.

అయితే నా చిన్నతనంలో పిల్లల్ని భయపెట్టటానికి తల్లిదండ్రులు అదుగో కాటిపాపలవాళ్ళు వచ్చారంట అనేవారు. కాటిపాపలవాళ్ళు పిల్లల్నీ పాపల్నీ ఎత్తుకు

పోతారని ఆ రోజుల్లో ప్రతీతి. పాపల్ని ఎత్తుకుపోతారు కనుక, కాటిపాపలవాళ్ళు అనే పేరు వచ్చిందేమో తెలియదు.

వీరిది కూడా ఇంద్రజాల ప్రదర్శనమే. ప్రజలను భయకంపితులుగాచేసే కళారూప మిది. వీరి వేషధారణ అతి గంభీరమైనది. ఈ ప్రదర్శకుడు రంగురంగుల దుస్తులు ధరిస్తాడు. రెండు మూడు పెద్ద గంటలను ప్రేలాడదీస్తాడు... నడుస్తూ వుంటే ఈ గంటల చప్పుడు ఏదో ఒక ఏనుగు నడుస్తున్నట్లుగా భీతి పుడుతుంది. నొసటన పెద్ద బొట్టు. వడితిరిగిన బుర్రమీసాలు, ఈకల మాదిరిగా చిత్రించిన రేకుల కిరీటం.... చంకలో జోలె.... చేతిలో ఎముకలు పుచ్చుకుని భూతవైద్యుడిలా ప్రవేశిస్తాడు. వీరి నెత్తిమీద ఇత్తడిరేకుల కిరీటం మినహాయిస్తే, బుడబుక్కల వారి వేషధారణకూ, వీరికీ పెద్ద తేడా కనిపించదు.

వీరు కొన్ని మాయలూ, మంత్రాలు కూడా చేస్తారు. కాటికాపర్లు అవడంవల్ల కొన్ని అతీంద్రియ శక్తులు కలిగివుంటారనే నమ్మకం కూడా వుంది.

ఈనాడు కాటికాపరితనం ఎక్కడా లేదు. ఒకనాడు సత్యహరిశ్చంద్రుడు కాటికాపరితనం చేయడం అందరికీ తెలిసిందే.

వీరు ఇంటింకీ తిరుగుతారు. ఎవరికీ ఏ అపాయాన్నీ కలిగించరు. యాచిస్తూ పొట్టపోసుకుంటారు.

అయితే వీరు ప్రేక్షకులను సమీకరించటానికి ఇంద్రజాల విద్యల్ని ప్రదర్శిస్తారు. మ్యాజిక్‌చేసి ప్రేక్షకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తారు.

వీరి భుజానికీ ఒక జోలె వుంటుంది. అందులోనుంచి గవ్వలతో పసుపు కుంకాలతో అలంకరించిన ఒక బొమ్మను అమ్మవారి బొమ్మంటూ తీసి అందరి ఎదుటా పెడతారు.

చేతిలో ఒక ఎముక వుంటుంది. ఆ ఎముకతో ఆ బొమ్మను తాకిస్తూ, ఓం హాంకాళీ శాంభవీ అంటూ క్షణంలో మండ్రగబ్బల్నీ, తేళ్ళనీ, ఎలుకల్ని పుట్టిస్తాడు. పుట్టిన ఎలుకచేత కీచుకీచుమనిపిస్తాడు. నోటిలో నుంచి ఇనుప శీల్నీ, మేకుల్నీ తీస్తాడు. అలా యాచిస్తూ పొట్టపోసుకుంటూ యాచకులై. దేశ దిమ్మరులై తిరుగుతూ వుంటారు....ఆనాడు వీరి ఇంద్రజాల విద్యల్ని తిలకించటానికి ప్రజలు గుంపులు గుంపులుగా గబడి చూసేవారు. ఇదీ ఒక కళారూపంగా నే వర్ధిల్లింది.





# అందర్నీ ఆనందపర్చిన హరిహరీ పదాలు

ఆంధ్ర జానపదగేయ సాహిత్యంలో హరిహరీ పదాలు కూడా ప్రముఖ స్థానాన్ని అలంకరిస్తున్నాయి.

హరి హరీ నారాయణ ఆదినారాయణా
కరుణించి మమ్మేలు - కమలలోచనుడ ॥హరి॥

హరిహరీ పదాలన్నీ ఈ పల్లవితోనే నడుస్తాయి. ఒకో ప్రాంతంలో, ఒకో పాటా, ఒకో ఆటా, ఒకో కథా. బహుళ ప్రచారంలో వున్నట్లే ఈ హరిహారీ పదాలు కూడా విశాఖపట్టణం, శ్రీకాకుళం, తూర్పుగోదావరి జిల్లాల్లో విశేష ప్రచారాన్ని కలిగి వున్నాయి. ఈ పేరుతోనే అనేక కథలనూ, సుద్దుల రూపంలోనూ చెపుతూ వుంటారు.

వీటినే జంపెలని కూడా అంటారు. హరిహరీ పదాల్లాంటి పాటలే మన యక్షగానాల్లో కూడా చాలవరకు వ్రాయబడి వున్నాయి. పదాల నడక ప్రారంభం నుంచీ చివరి వరకూ ఒకే వరుసలో నడుస్తుంది. మధ్య మధ్య కథాగమనాన్ననుసరించి, వచనంలో తేటతెల్లంగా కథయొక్క అర్థాన్ని చెపుతారు. సన్నివేశాలను బట్టి ఇంకా కీర్తనలు కూడా పాడుతూ వుంటారు. కథకుడు పదం పాడితే, మధ్య, ప్రక్కనున్న వంతదారులు ఆఁ —— అంటూ శృతిలో దీర్ఘంగా సాగదీసి శృతిపక్వంగా ఒక గమకాన్ని జత కలుపుతారు.

హరిహరీ పదాలు కేవలం ఏవో జానపద గేయాల్లాగా కాకుండా మన కళారూపాల్లో అదీ ఒక కళారూపంగా వెలుగొందుతూ వుంది. వీటి కథల్లో చాలవరకు రామాయణ, భారత కథలే ఎక్కువగా వున్నాయి. భారతం నుంచి నలచరిత్ర, శశిరేఖా పరిణయం, విరాటపర్వం; ఉత్తరగోగ్రహణం మొదలైనవే కాక పాతాళ

హోమం శతకంఠ రామాయణం, కుశలాయకం మొదలైనవీ, శివగాథలూ, గంగా వివాహం, సారంగధర చరిత్రా రాణిస్తూ వుంటాయి.

## ప్రాంతీయ కళారూపం :

హరిహరీ పదాలు ఎక్కువగా విశాఖ జిల్లాలోనే ప్రచారం పొందాయి. ఇతర జిల్లాలకు ఏమాత్రం వ్యాపించలేదు. అందుకు కారణం కూడ లేకపోలేదు. విశాఖ మండల ప్రాంతీయ భాష మనలకు చాలా భిన్నంగా వుంటుంది. వారి మాట తీరు ప్రత్యేకంగా అదోలా వుంటుంది. మాండలికమైంది అందువల్ల. ఆ పదాలు ఇతరులు వ్రాయడం కూడా కష్టమే అందువల్ల ఆ మండలంవారే వారి ప్రజలకు అర్థమయ్యే భాషలో, అర్థమయ్యే శైలిలో వ్రాస్తారు. ఇప్పటికి వ్రాయబడిన పదాలన్నీ కూడా అటువంటివే. చీపురుపల్లి - రాజాం - పాలకొండ - వీరఘట్టాం, ఆముదాలవలస, శ్రీకూర్మం, విజయనగరం, శ్రీకాకుళం మొదలైన ప్రాంతాల్లో ఈ కథలను రకరకాలుగా చెపుతారు. అన్ని కళారూపాలకన్న ఈ హరిహరీ పదాలు - జముకుల కథలు ఎక్కువ ప్రచారంలో వున్నాయి.

ఈ హరిహరీ పదాల విషయంలో చేకుమళ్ళ కామేశ్వరరావుగారు ఎక్కువ కృషిచేసి వ్రాశారు. కిన్నెర పత్రికలో వారి అనుభవాల నుంచీ సేకరణలనుంచీ కొన్ని ఉదహరిస్తాను.

మనకు దొరికే పదాలన్నీ ఇటీవలవే కాబట్టి, ఇవన్నీ చాలావరకు ఆధునిక పదాలు. ఈ పదాల వరుస లక్షణం ఒకటే. ఈ రకం పదాలలో స్వకపోల కల్పితాలు ఇంచుమించుగా నున్న ఇవన్నీ ఇతర రచనలను చూచి రచించినవేననీ, దీనికి కారణం చదువుకున్న వారు పురాణాలను ప్రబంధాలను చదివి ఆనందించగలరనీ నిరక్షరాస్యులకది సాధ్యం కాదనీ, కాబట్టి వీరి అంతస్తుకి తగిన రచనలు అవసరమనీ, అందువల్ల జానపద కవులు ప్రాకృత జనులకోసం పెద్ద గ్రంథాలలోనికి కథలనూ, భావాలనూ అనుసరించి పదాలుగా రచించారనీ, తామూ అలాగే చేస్తున్నామనీ కొందరు కవులు తెలియచేశారనీ కామేశ్వరరావుగారు అంటూ కొందరు కవులను పేర్కొన్నారు. ఇందుకు వుదాహరణగా పూరి రామచంద్రరాజు కుశలాయక పదాన్ని వివరించారు.

కఠినంబు కాంచితే, కాపులకు తెలియదని
మరుగులుంచుట మాని మాటలుంచితిని

అని అన్నాడు.

## గంగా వివాహం :

గంగా వివాహ పదాన్ని పసగాడ సన్యాసిరాజు గారు 1856-వ సంవత్సరంలో రచించాడు. ఇది స్కాందపురాణంలోని కథ. కాని ఈ పదకవి, ఈ కథను తెలుగు దేశానికి అన్వయింపచేశాడు. ఏలూరులో శంభుదేవుడనే జాలరి వున్నాడనీ అతనికి గంగ జన్మించిందనీ శివుడు వచ్చి ఆమెను వలచి వివాహం చేసుకున్నాడనీ వ్రాశారు.

గంగ వివాహ కథ, పొంగి పారుతున్న గంగ తుంపరలు ఈశ్వరుని వెండి కొండమీద పడగా ఈశ్వరుడికి కోపం వచ్చి, గంగను భూమిమీద పుట్టమని శపిం



చాడు. భూలోకంలో శంభుదేవుడు, చక్రమ్మ అనే దంపతులకు గంగ జన్మించింది. కయ్యాలమారి నారదుడు ఎరుకత వేషంలో వచ్చి, గంగకి శివుణ్ణి గురించి చెప్పగా ఆమె శివుణ్ణి వలచింది. ఆ సంగతి తిరిగి వెళ్ళి శివునికి చెప్పాడు. శివుడు జంగం వేషం ధరించి వస్తాడు. ఆ విధంగా గంగకూ శివునికీ వివాహం జరుగుతుంది.

ఆమెను తలను ధరించి వెండికొండకు వెళ్ళాడు శివుడు. కాని పార్వతికీ విషయం తెలుస్తుందేమోనని భయం. రహస్యం బయటపడింది. పార్వతికి కోపం వచ్చింది. శివుడు బ్రతిమలాడాడు. అప్పుడు గంగకు కోపంవచ్చి పుట్టింటికి వెళ్ళింది.

ప్రపంచంలో ఎక్కడా నీటిచుక్క లేదు. పార్వతికి ఏ దారి దొరకక గంగను ప్రతిమ లాడింది. అందరూ వెండికొండకు చేరారు సుఖంగా వున్నారు.

సన్యాసి కవి గంగా వివాహంలో ఎన్నో వర్ణనలు వర్ణించాడు. ఈ కథలో సంభాషణలు అతి సహజంగానూ, సంవాదాలు చాలా చమత్కారంగానూ వున్నాయి. గంగా గౌరుల సంవాదంలో కవి తెలుగు మాటల్ని చాల చమత్కారంగా వర్ణించాడు.

ఉధాహరణకు

సంవాదం

గౌరి॥ ఉన్నచోటను నన్ను ఉండమన్నందుకు
తప్ప కను నీ జిహ్వ తరిగింతు గంగ

గంగ॥ నీవు తరిగిన కూర నేను తరిగిన కూర
వండి వడ్డింతుమే వనిత గౌరమ్మ

గౌరి॥ చెంపకాయలు గొట్టి చెవులూడదీతుగా
జగడపోతులమారి జాలారి గంగ

గంగ॥ నీవు గొట్టినకాయ నేను గొట్టినకాయ
గంప నింపింతుమే కాంత గౌరమ్మ

గౌరికి కోపం రాగా శివుడు అర్ధనారీత్వాన్ని చక్కగా తెలియచేశాడు. గంగకు మంగళసూత్రం కట్టాడు.

సన్యాసిరాజు రచనలో నిండుగా లోకోక్తులు, నానుడ్సు, జాతీయాలు వున్నాయి. శివుడు భార్యను గురించి చెప్పిన వాక్యాలు ఈ నాటి వారికికూడా ఆదర్శ ప్రాయంగా వున్నాయి.

## ఎందరో హరిహరీ పదాలను రచించారు :

ఈ విధంగా హరిహరీ పదాలను ఎందరెందరో రచించారు. వారిలో కలగర్ల వేంకటకామయ్య ''లక్ష్మణ మూర్ఛనూ'' 1850లో పసగాడ సన్యాసి రచించిన పదాలు ''సారంగధర చరిత్ర'' ''శతకంఠ యుద్ధం'' (శతకంఠ రామాయణం) గంగా విహహం మొదలైనవి రచించేడు.

1862 ప్రాంతంలో పూరి రామచంద్రరాజు కుశలాయక పదాన్ని రచించాడు.

అలాగే 1874 ప్రాంతంలో పూరి నారాయణరాజు ధర్మాంగద చరిత్రను రచించాడు. 1922 లో మంధా సుబ్బరాయశాస్త్రి 'పాతాళ హోమం' అనే పదాన్ని 1925 లో పొడుగు రామబ్రహ్మ కవి ''గయోపాఖ్యానం'' ''వైకుంఠ మహాత్మ్యం'' రచించాడు.

అయ్యగారి కూర్మనాథం 20 వ శతాబ్దంలో విరాటపర్వాన్ని పదంగా రచించాడు.

ఇలా పైడికొండ అప్పన్న ''సుభద్రా కళ్యాణం'' చంద్రగిరి తాతయ్య ''ఉత్తర గోగ్రహణం'', ముడుంబ లక్ష్మణాచార్యులు ''శ్రీరామకథను'' 1895 లో రచించారు. చిత్రాడ కామేశం సోంపురవాసి - త్రినాథుని చరిత్ర - నడిమింటి రామయోగి 1864 లో ''బాణాసుర యుద్ధం'' కటోజు వీరాచారి ''భల్లాణరాయపదం'' చెర్విరాల భాగయ్యగారి పదం ''కొమిరెల్లి మల్లకథ'' ఉన్నాయి. ఈ విధంగా అనేక హరిహరీ పదా లున్నాయి.

పైన ఉదహరించిన హరిహరీ పదాల రచనలన్నీ, మన జానపద కళారూపాలైన హరికథలలోనూ, యక్షగానాలలోనూ, వీథి నాటకాలలోనూ, బుర్రకథలలోనూ ఉదహరింపబడే వున్నాయి. అందువల్లనే మన జానపదులకు పూర్వ పురాణ గాథలన్నీ తేట తెల్లంగా తెలిసిపోయాయి.





## సీమవాసుల

# గొరవయ్యల నృత్యం

తలపైన ఎలుగుబంటి చర్మంతో తయారుచేసిన కిరీటం, ఒక చేతిలో ఢమరుకం, మరొక చేతిలో త్రిశూలం, మెడలో తెల్లని గవ్వల హారం. నడుము చుట్టూ జింక చర్మంతో అందంగా తయారుచేసిన సంచి.



అపురూపంగా కనిపించే ఈ వేషధారణం ఆంధ్రదేశంలో ఎక్కడా కనిపించకపోయినా, అనంతపురం జిల్లాలో వివిధ ప్రాంతాల్లో కనిపిస్తుంది. వీరి వేషధారణ చూచి పిల్లలు భయపడితే, పెద్దవారు ఆసక్తి చూపుతూ వుంటారు. ఇంతకీ వీరి పేరు ''గొరవయ్యలు'' అని పిలుస్తూ వుంటారు.

కన్నడంలో :

కన్నడ దేశంలో శివభక్తులైనవారు, శివునిపై పాటలు పాడుతూ, ప్రతి ఇంటిముందూ, నృత్యంచేసి భిక్షాటనతో జీవితం సాగిస్తున్న .... గొరవయ్యలు కొన్ని శతాబ్దాల నుంచీ భిక్షాటనే వృత్తిగా మలుచుకొన్నారు. ఒకప్పుడు శైవమత

ప్రచారానికి ఆలవాలమైన ఈ కళారూపం ఈనాడు భిక్షాటన కళారూపంగా మారి పోయింది.

గతంలో కులపెద్దలుగా వ్యవహరించిన వీరు పొట్టకూటి కోసం, వీథుల్లో పడ్డారు. రాయలసీమలోని అతి ప్రాచీన నృత్య కళల్లో .... గొరవయ్యల నృత్యం ఒక ఉత్తమ కళారూపం.

## రక్త తర్పణం :

కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం, ఆలూరు తాలూకా ''నెరణికి'' సమీపంలో వున్న మల్లేశ్వరస్వామి, కురవకులానికి చెందిన కొంతమందిని గొరవయ్యలుగా సృష్టించాడని వీరి అభిప్రాయం, ప్రతి సంవత్సరమూ దసరా పండుగలకు గొరవయ్యలంతా అక్కడకు చేరి విచిత్రమైన పద్ధతుల్లో పాటలు పాడుతూ, నృత్యం చేస్తారు. వారి శరీరం నుంచి కొంత రక్తం ధారపోసి దేవునికి నైవేద్యం పెడతారు. వీరు నాట్యంచేసే పద్ధతి చాలా విచిత్రంగా వుంటుంది. నృత్యాంతాన, కుక్కలమాదిరిగా అరుచుకుంటూ కొట్టుకుంటారు. వీరి సంతానంలో తప్పనిసరిగా ఒక పిల్లవాడికి నృత్యం నేర్పి, తమతోపాటు తిప్పుతారు.

## గట్టుమల్లయ్య కొండ :

గొరవయ్యలు కురవవంశస్థులు, వంశంలో వున్న పెద్ద కుమారుడు కాని, చిన్న కుమారుడు కాని తప్పనిసరిగా గొరవయ్య కావాలి. గొరవయ్యను తయారు చెయ్యాలంటే గురువు, లేదా గణాచారి అవసరం. గురువులు కర్నూలు జిల్లా, ఆలూరులో గట్టుమల్లయ్య కొండలో వున్నారు, గణాచారులు అనంతపురం జిల్లా కాల్వ కాలవలో వున్నారు.

గొరవయ్య కావాలంటే పిల్లవాణ్ణి గట్టుమల్లయ్య కొండ మల్లేశుని గుడికి తీసుకువెళతారు. అక్కడ కోనేటిలో స్నానం చేయించి, నల్లకంబళి పరచి; కూర్చో పెడతారు. పిల్లవాని మేనమామ పాలతో ప్రమాణం చేయిస్తాడు. అప్పుడు గురువు గవ్వల దండతో ముద్రాదానం చేస్తాడు. ముద్రాదానాన్ని పిల్లవాడి మెడలో కడతాడు. గురువు పాదాలకు నమస్కరించి, కానుక సమర్పించుకుంటాడు. పిల్లవాడికి గురువు ఈ విధంగా ప్రబోధం చేస్తాడని, డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు, తమ జానపద నృత్యకళ ....గ్రంథంలో ఉదహరించారు.

**గురువు చెప్పే మాటలు:**

మన కులవృత్తికి ద్రోహం చేయకూడదు.
ఇతరులను మోసం చెయ్యవద్దు.
అబద్ధం చెప్పొద్దు, అని పిల్లవాడి నోటినుంచి పలికిస్తారు.

## గొరవయ్య కర్తవ్యం :

ప్రమాణం చేసిన పిల్లవాడు ఆ వంశంలో కోటీశ్వరుడు అయినప్పటికీ, సంక్రాంతి పండుగనాడు మాత్రం, గొరవయ్యలా అలంకరించుకుని, అయిదు ఇళ్ళు అడుక్కుని రావాలి. ఇది వంశ పారంపర్యంగా వస్తూన్న ఆచారం.

గొరవయ్య వేషధారణ, మెడలో గవ్వల దండను ధరించి, నల్లకంబళిని శరీరమంతా కప్పుకుని, కుడిచేతితో ఢమరుకాన్ని పట్టుకుని ఎడమ చేతిలో పిల్లన గ్రోవి పట్టుకుని కాళ్ళకు గజ్జెలు కట్టి, తలకు కిరీటంలా ఎలుగుబంటి చర్మాన్ని ధరించి, నుదుట బండారు బొట్టు పెట్టి, నడుముకు జింక చర్మంతో చేసిన బండారు తిత్తిని కట్టుకుని. ప్రతి ఇంటి దగ్గరా అడుక్కుంటూ, ఇంటిలోని వారందరికీ బండారు బొట్టు పెడుతూ పిల్లనగ్రోవి ఊదుతూ ఇలా పాడుతారు.

శివామల్లేశ్వరా, బండారువయ్యా
కాపాడప్పా, పిల్లలను పెద్దలను దీవించు
గాలెద్దులు కలిగి గూటావులు కలిగి
కోటి సంపదలు కలిగి
కనకపాత్ర గలిగి
మల్లేశునట్లు మగబిడ్డ కలిగి
మల్లిఖార్జున నీ పాదపద్మాలకు
నమస్తే



అని ముగిస్తారు.

## ఢమరుక శబ్దాలు :

గొరవయ్యలు నృత్యం చేసేటప్పుడు పాటలు పాడరు. పాటపాడే సమయంలో ఢమరుకాన్ని, ఒక ప్రక్క మాత్రమే

నాలుగు వ్రేళ్ళతో వాయిస్తారు. డమరుకం నుంచి పుట్టే ధ్వనులు ఇలా వుంటా యంటారు కృష్ణారెడ్డిగారు.

డడబుడ్డ బుడ్ - ఇరడడ బుడ్డ
బుడబుడ్డ బుడ్ - బుడబుడ్డ బుడ్
బుడబుడ్డ బుడ్ - బుడబుడ్డ బుడ్

గొరవయ్యలు ఒకరు మొదలు ఎంతమందైనా నృత్యం చేస్తారు. డమరుకాన్ని వాయిస్తూ పిల్లనగ్రోవి ఊదుతూ సరిసంఖ్యలో గుండ్రంగా తిరుగుతూ, వయ్యా రంగా నడుమును త్రిప్పుతూ నృత్యం చేస్తారు.

## శ్రీశైల మల్లన్న :

ఒకరు పాటపాడుతుండగా మిగిలినవారంతా పాట వంతపాడుతారు. అలా అన్ని గొంతులు కలపటం ఒక్కొక్క కాలిని కొద్దిమంది నేలపై కొడుతుండగా గజ్జెలు ఘల్లుమని మ్రోగుతాయి.

ఆ పాట ఇలా ప్రారంభమౌతుంది.

శివుడు శీనయ్య శ్రీశైల మల్లయ్య
కానగ రావయ్యా శీనయ్య
సిక్కు జడలవాడు శివనీలకంఠుడు

అని పాడుతూ డమరుకాన్ని ఈ వరుసలో వాయిస్తారు.

తక తక తక్
తక తక తక్
తక తక్ తక్
తక్ తక్ తక్

అంటూ వాయిస్తారు.



## శివరాత్రి నాడు :

శివరాత్రి నాడు మల్లయ్య కొండకు పోతూ గ్రామాల వారికి కొండను గూర్చి, దేవాలయాన్ని గూర్చి, కష్టాలు కడతేర్చే దేవుణ్ణి గూర్చి, కోనేరు లోతుపాతుల్ని తెలియచేస్తూ ఇలా పాడుకుంటూ పోతారు.

శివరాత్రి

శివకొండకని పోదాము రారమ్మ
మల్లయ్యా కొండ స్వామినే చూతాము
శివాపురమికి పరమటంట
శిద్దులేలే మల్లయ్యాకొండ

కొండపైన దేవళంబు
కొండ దిగవన మందిరంబు
మందిరంబులో వెలిగేటి
మల్లికార్జును డున్నడంట
ఒంటిస్తంభము మాలలోన
ఒక్కడే మల్లయ్యా నిలిసె.

ఇలా మహాశివుని వర్ణిస్తూ, ప్రయాణ అలసటను మరిచిపోతూ భక్తిభావంతో పాడుకుంటూ చివరగా మంగళం పాడతారు గొరవయ్యలు. అందరికీ బండారు కుంకాన్ని అందచేస్తారు.

గొరవయ్యల నృత్యాన్ని చూస్తున్నప్పుడు పిల్లలు భయపడుతూ వుంటారు. కాని పెద్దలు వారిని ఎత్తుకుని ఒడిలో కూర్చోపెట్టుకుంటారు. పిల్లలు మాత్రం కళ్ళు మూసుకుని, అప్పుడప్పుడు చూస్తూ వుంటారు. డమరుకాల ధ్వని గుండెలు అదిరేలా వుంటాయి. పెద్ద గొరవయ్యలు, చిన్న గొరవయ్యలు కలిసి చేసే నృత్యం అబ్బురంగా వుండి అందరూ చప్పట్లు చరుస్తారు. ప్రతి ఇంటికి వెళ్ళి యాచించి వారిచ్చిన ధాన్యాన్ని తీసుకుని, బండారు బొట్టుపెట్టి పోతూ వుంటారు. ఇలా గొరవయ్యలు బ్రతుకుతూ, ఆ కళను బ్రతికిస్తున్నారు.

అలా బ్రతికించే కళాకారులు, గొరవ రామాంజనేయులు — గొరవ కాటమయ్యా — గొరవ చిన కాటమయ్యా మొదలైనవారు ప్రముఖంగా పనిచేస్తున్నారు.



# జంతర్ మంతర్
# జంతరు పెట్టె

ఆంధ్రదేశంలో పర్వదినాలలో, జాతర్లలో, తిరునాళ్ళలో ఈ జంతరు పెట్టె పైసా తమాషా చూపిస్తూ వుంటారు. పిన్నలు మొదలు పెద్దలు వరకూ, ఈ వింత తమాషాను చూస్తారు.



పెద్దల కంటే పిల్లల్నే ఎక్కువ ఆకర్షిస్తుందీ జంతరు పెట్టె. ఇది నాలుగు పలకలు గల ఒక పెద్ద పెట్టె. ఆ పెట్టెను చూపరులు ఆకర్షించేటట్లు రకరకాల అందాలను చేకూర్చి ఆకర్షవంతంగా తయారుచేస్తారు. ఆ పెట్టెకు మూడుకాళ్ళు గల స్టాండును, చూడటానికి అనువైనంత ఎత్తులో నిలబెడతారు. ఆ పెట్టెకు ఒక ప్రక్కన లోపల చూపించే బొమ్మలను చూడటానికి వీలుగా ఒక రంధ్రాన్ని ఏర్పాటు చేస్తారు. రెండవ ప్రక్కన బొమ్మలు చూపించేవాడు నిలబడి వరుసగా పేర్చిన బొమ్మలను నడుపుతూ వుంటాడు. మరొకడు తాళం కొడుతూ రాబోయే బొమ్మను గురించి కాశీపట్నం చూడర బాబూ అంటే బొమ్మతో కాశీ విశ్వనాథుని దేవాలయమూ గంగానదీ కనిపిస్తాయి. పాటనుబట్టి బొమ్మ తరువాత బొమ్మను చూపిస్తూ వుంటారు. ఒక్కరే బొమ్మను చూడటానికి అవకాశ ముంటుంది. ఇలా బొమ్మను చూసేవాణ్ణి,

తాళం కొట్టేవాడు కాశీపట్నం చూశావా అంటూ ప్రశ్నిస్తే, ఆ చూశానంటూ తలవూపుతాడు. అలా కొన్ని బొమ్మలను చూపిస్తాడు. ఈలోగా చాలా మంది పిల్లలూ పెద్ద వాళ్లూ గుమికూడతారు. ఎప్పుడెప్పుడు చూడాలా అని వాళ్ళూ ఉవ్విళ్ళూరుతారు. ఇలా ఒకరి తరువాత మరొకరు డబ్బులిచ్చి బొమ్మలను చూపిస్తారు. ఇలా రామాయణం, భారతానికి సంబంధించిన బొమ్మలనూ, పిల్లలకు వినోదం కలిగించే కోతుల్నీ, కొంగల్నీ, జంతువుల్నీ కూడా చూపిస్తూ వుంటారు. ఇలా అందర్నీ ఆకర్షించేటట్లుగా రకరకాల బొమ్మలను అమరుస్తారు. దీనిని పట్టపగలే ప్రదర్శిస్తారు. ఎక్కడ పడితే అక్కడికి, జనం వున్న చోటికల్లా మారుస్తూ వుంటారు. లోపల బొమ్మలు కదలక పోయినా, బొమ్మలు కదులుతున్నంత ఆంగికాభినయాన్ని హంగుదార్లు చేస్తూ వుంటారు. ఇలా వారు ఒక వూరినుంచి మరో వూరికి సంచారం చేస్తూ పొట్టపోసుకుంటూ వుంటారు.

జంతరులో వున్న ఒకే ఒక ఆకర్షణ పెట్టెలో ఏ బొమ్మ లున్నాయోనన్న ఆసక్తిని కలిగించటం వారు పాడే పాటలో వచ్చే కథనంతా బొమ్మలలో చూపిస్తారు. ప్రదర్శనాన్ని ఇలా ప్రారంభిస్తారు.

పైస తమాషా చూడరబాబు
ఏమి లాహిరిగ వున్నది చూడు
ఏమి తమాషా లున్నయి చూడు
జంతర్ మంతర్ చూడర బాబు
జిబిజిబికిరి జిబిజిబికిరి జా. ॥పైస॥

కాశీపట్నం చూడర బాబు
విశ్వనాథుని చూడర బాబు
కలకలలాడే గంగానదినీ
కన్నుల పండగ చూడర బాబూ. ॥పైస॥

హరిశ్చంద్రుడు సత్యం కోసం
ఆలిబిడ్డలను అమ్మిన చోటు
అడుగడుగడుగో విశ్వేశ్వరుడు
హర హర యనుచును భక్తులు చూడు
చూచి మోక్షం పొందర బాబు ॥పైస॥

హస్తినాపుర పట్నం చూడు
పాండవు లేలిన పట్నం చూడు
తాజమహలు చూడర బాబు
ఎఱ్ఱకోటను చూడర బాబు ॥పైస॥

ఇలా ఆయా ప్రాంతాల విశిష్టతను వివరిస్తూ, కళ్ళకు కట్టినట్లు వినిపిస్తూ చూపిస్తారు. ఇదే కళారూపాన్ని ఆంధ్ర ప్రజా నాట్యమండలి, 1943 ప్రాంతాల్లో వున్న దేశ పరిస్థితుల్ని వర్ణిస్తూ ప్రజాకవి కోగంటి గోపాలకృష్ణయ్యగారు ఇలా వ్రాశారు.

లాయరమ్మ లాయరో
లాయంపెట్టి చూడర బాబు
జంతరుపెట్టె చూడర బాబు ॥జిబిజిబికిరి జా॥

ఎంత లాయరు గున్నదొ చూడు
భారత దేశపు తీరును చూడు
భరతమాత కష్టాలను చూడు
భోరుభోరున ఏడ్చేను చూడు ॥జిబి...॥

నల్లధనంతో సంచుల నింపి
కొల్లగొట్టిన ఘనులను చూడు
ధరలను పెంచిన ధనికుల చూడు
తాతా బిర్లా తరముల నుండి
మోసపోయిన మనుజుల చూడు.

ఢిల్లీ పట్నం చూడర బాబు
ఎఱ్ఱకోటను చూడర బాబు
తెల్ల దొరలను చూడర బాబు
గాంధీతాతను చూడర బాబు
జిన్నా సాబును చూడర బాబు

అంటూ ఇలా దేశ పరిస్థితుల్ని వర్ణిస్తూ, తిండి దొంగల్నీ, లంచగొండుల్నీ, దుండగుల్నీ, దోపిడి దారుల్నీ బయటపెడుతూ దేశభక్తిని ప్రబోధిస్తూ, చివరికి దుర్మార్గుల్ని ఇలా దుయ్యబట్టేవారు.

ఆడందం ఆరిపోను
ఆడి సోకు మాడిపోను
ఆడి బ్రతుకు కాలిపోను
ఆడి జన్మ ఆరిపోను.

॥లాయరమ్మ లాయరో
లాయరమ్మ లాయరో॥



అంటూ ప్రజలను వినోదపరుస్తూ, మరో ప్రక్క విజ్ఞానపర్చేవారు. ఇది నాటి ప్రజానాట్య మండలి కానుక.



## చెంచులు చెప్పే శ్రీరంగ నీతులు

ఏ వూరు ఏ భామ ॥నందానా॥
ఎవ్వారి భామవేవై భామా ॥నందానా॥
వినరోరి నరసిమ్మ ॥నందాన॥
ఉందు గూడెం మాది ॥నందాన॥
చేతిడే ముద్దమ్మ ॥నందాన॥
చెయ్యెత్తి దానాలు ॥నందాన॥
వడ్డిచ్చే తల్లి వడ్డిచ్చె తల్లి.

అంటూ భద్రాచలం ప్రాంతాలనుండి ఆంధ్రదేశానికి అప్పుడప్పుడు వచ్చి యాచించి వెళ్ళిపోతూ వుంటారు చెంచులు. వెంటతెచ్చిన నెమలి ఈకలు, పులిగోరులు, మూలికలు అమ్ముకుని డబ్బు చేసుకుంటారు.

వీరు పాడేపాట బెంబీతపాట అంటారు. వీరు ముగ్గురు నలుగురు కలిసి జట్లు జట్లుగా వస్తారు. ఒకరు చరణం పాడితే మిగిలినవారు చరణాంతంలో బెంబీతా అనీ, నందానా అనీ శృతి కలుపుతారు. అందరూ చిన్న జేగంటలను చేతపట్టుకుని, ఒకపుల్లతో పాడేపాటకు తాళంగా ఉపయోగిస్తారు. వీరి వేషధారణ. కాళ్ళకు చాలీచాలని తొడిగిన లాగులు యాచనలో సంపాదించిన చొక్కాలూ, పూలదండలూ, తలపాగాలూ, పాగాలపై నెమిలి ఈకలూ, పులిగోరులూ, పందికోరలూ మొదలైనవాటిని ధరిస్తారు.

ఈ చెంచు పాటలద్వారా రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్టు మూకల క్రూరకృత్యాలను ప్రజానాట్యమండలి కళాకారులు, నాజరు దళంలోని, రామకోటి, పురుషోత్తం మొదలైనవారు ఎంతో వుత్తేజంగా పాడి ప్రజలకు ఫాసిస్టు ప్రమాదాన్ని గురించీ, యుద్ధ ప్రమాదాన్ని గురించీ వివరించారు.

ఇదే చెంచుపాటల్లో బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన అల్లూరు సీతా రామరాజు మన్యంలో జరిపిన పోరాట చరిత్రను మిక్కిలినేని, మాచినేని మొదలైన వారు ఉత్తేజంగా పాడి ప్రజలను వుత్తేజపర్చారు.

అదే చెంచుపాట బాణీలో విజయవాడ తాలూకా, నందిగామ వాస్తవ్యులు అయ్యపు వెంకట కృష్ణయ్యగారు భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో ప్రాణా లర్పిం చిన స్వాతంత్ర్య సమరవీరుల త్యాగాలను గురించి ఈ విధంగా వివరించారు. చెంచుల పాట బాణీలో

మనది భారతదేశమమ్మా ॥నందానా॥
మనది భారతజాతి తల్లీ ,,
భారతీయులము మనమమ్మా ,,
బానిసలమైనాము తల్లీ
భోగాల పుట్టినిల్లమ్మా
భూలోక స్వర్గమే తల్లీ
మన బాలచంద్రుడూ
మన ఖడ్గతిక్కనా
మన్యంపు వీరులూ
మన రెడ్డిరాజులూ
రాణా ప్రతాపుడూ
రసపుత్ర వీరులూ
తమ శౌర్యమయ రక్త
ధారా స్రవంతిలో
తడిపి మెదిపిన వీర
ధాత్రీ ఇది మా తల్లి ॥మనది॥

ఇలా దేశంకోసం ప్రాణాలర్పించిన వీరులందరినీ, స్మరిస్తూ చెంచుపాటలతో ఉద్రూత లూగించేవారు ప్రజానాట్యమండలి కళాకారులు.

## చెంచు నాటకాలు :

ఆ కాలంలో చెంచు నాటకాలను గొల్లవారే ప్రదర్శిస్తూ వుండేవారు. వీరి నాటకాలు ఆనాటి పల్లెటూళ్ళలో చాలా పేరు పొందాయి. ప్రతి గ్రామంలోనూ వీరు నాటకాలను ప్రదర్శిస్తూ వుండేవారు. ఆ వీధిలో వారు నాటకం ఆడించారని వీరూ, వీరు ఆడించారని వారూ, ఇలా ప్రతి వీధిలోనూ ప్రదర్శించటంతో, ఎక్కువ రోజులు ఒకే గ్రామంలో వుండి, తగిన పారితోషికాలను సంపాదించుకుని మరో గ్రామానికి తరలివెళుతూ వుండేవారు.



చెంచు నాటకాలలో ముఖ్యమైన ఇతివృత్తం. అహోబల నరసింహస్వామి చెంచీతను. అంటే చెంచువారి కన్యను మోహించి వివాహం ఆడటం.

ఈ అహోబల క్షేత్రం కర్నూలు జిల్లాలో చెంచువారు నివశించే అడవి మధ్య క కొండ వుంది. ఆ కొండమీద నరసింహస్వామి దేవాలయం వుంది. స్వామి ౹త్సవ సమయంలో చెంచు పడుచులు విల్లంబులు చేతపట్టుకుని చురుకుగా యాత్రి కుల మధ్య స్వేచ్ఛగా చకచకా తిరుగుతూ స్వైరవిహారం చేస్తూ వుంటారు. ఆ చెంచీత కథనే గరుడాచల మహత్మ్యం అని పూర్వ కవి యక్షగానంగా వ్రాశాడు. దాని ననుసరించి అనేకమంది ఆ యక్షగానాన్ని ప్రదర్శించారు.





# దేవతల కొలువుల సంబరాలు

ఈనాడు దేవతల కొలువులు అన్ని గ్రామాల్లోనూ అంతగా జరగకపోయినా అక్కడక్కడ వెనుకబడిన ప్రాంతాల్లో దేవతల మొక్కుబడులు, జాతర్లు సంబరాలు జరుగుతూ వుంటాయి. వీటిని ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగ దినాల్లో జరుపుతారు. గ్రామదేవతలకు నైవేద్యాలు అర్పిస్తారు. గరగలు ఘటాలు నెత్తిన పెట్టుకుని ఊరేగింపుగా ఇంటింటికీ త్రిప్పుతారు. డప్పులమీద సప్తతాళ వాయిద్యాన్ని మాదిగలు వాయిస్తూ వుంటే, గరగలను ఎత్తుకున్న చాకళ్ళు (రజకులు) లయబద్ధమైన చిందులతో, తన్మయత్వంతో నృత్యం చేస్తారు. ఆ సందర్భంలో వాయించే డప్పు వాయిద్యం ఈ విధంగా సాగుతుంది.

**తాళం వరుసలు :**

త ఝుణక, ఝుణక, ఝుణకా
తద్దివిత - ధివిత, తకతా
కిటతక - కిటతక - కిటతక
తాం - ధోం - తక్కిట కిటతక
ఝుంతరి కిటతక - ధుంతరికిటతక - ధుంతరికిటతక

అని డప్పులమీద పలికిస్తూ, మధురభావాలు ఒలికిస్తూ, భక్తి తన్మయత్వంతో ప్రజలను ముగ్ధులనుచేస్తూ, వారి హృదయాలను రాగరంజితం చేస్తూ వుంటారని ఒక సందర్భంలో కీ॥ శే॥ నేదునూరి గంగాధరంగా రన్నారు.

## నమ్మకాల మొక్కుబడులు :

గ్రామాల్లో విపరీతంగా వచ్చే కలరా మశూచికం, గొడ్ల జబ్బులకు, పంటల నాశనానికి కారణం, అమ్మవార్లనీ, అమ్మవార్లకు మొక్కు తీర్చకపోతే అశాంతి అనీ. మొక్కుబడి తీరిస్తే పాడిపంటలు గ్రామం సుభిక్షంగా వుంటుందనీ, గ్రామస్తులు నమ్మకం కొద్దీ మొక్కుతూ వుంటారు. ఆ మొక్కుబడులు తీర్చడానికే, అమ్మవారైన గ్రామ దేవతను తృప్తిపరచడానికే, ఈ జాతర్లూ, కొలుపులూ, మొక్కుబడులూ కోలాహలంగా చేస్తూవుంటారు. ఇలా మొక్కుబడులు తీరిస్తే గ్రామ పొలిమేరల్లో అమ్మవారు గ్రామరక్షణకోసం కాపలాకాస్తుందని గ్రామస్థుల గాఢనమ్మకం. ఆ నమ్మకంతో అమ్మవారి విగ్రహాలను నెలకొల్పి, నిత్యమూ పూజిస్తూ వుంటారు. కాని ఊరి ప్రజలందరూ ఆపద వచ్చినప్పుడు మాత్రమే పొలిమేరల్లో వున్న అమ్మవారికి జాతర చేస్తారు. అమ్మవారి పూజారి అనూచానంగా వస్తున్న ఆచారం ప్రకారం, ఆ రోజంతా ఉపవాసంచేసి, పొలిమేర గంగాణమ్మను తెచ్చి ప్రతిష్ట చేస్తాడు. ఆ సందర్భంలో అమ్మవార్ల కథలను ప్రచారంచేసే పంబలవారు ఈ విధంగా పాటలు పాడుతారు.

## పంబలవారి పాటలు :

గుమ్మాడి పూవొప్పునే గౌరమ్మ
గుమ్మాడి కాయొప్పునే గౌరమ్మ
గుమ్మాడి పూవుమీద
వాలిన చిలకలు! వైకోగబ్బలు
ఘంట చిరిమువ్వల గైరమ్మా - నీ సుతుడేడే
వాడిన పువ్వులు ఒడిలో బోసుక
వాడలు వెతికితే లేడమ్మా
సరి, మేడలు వెతికిన రాడమ్మా॥

ఏంటూ, ముత్తైదువులు పసుపు, కుంకుమలను పళ్ళెములలో నుంచి సంప్రదాయ ఏద్ధంగా వస్తున్న చేతులను ఊపుకుంటూ చిరు నృత్యం చేస్తూ వస్తారు.

అమ్మవారిని పూజించి, ఊరిలో ఊరేగించి, తిరిగి పొలిమేరకు పంపే రోజున పెద్ద జాతర చేస్తారు. ఈ జాతర సమయంలో ఒక పందిని భూమిలో

పూడుస్తారు; దానిమీదగా గ్రామంలో వున్న పశువుల నన్నిటినీ తోలుతారు. వంశా చారంగా వస్తున్న మాదిగవాడు, బొద్దు మీసంతో, విరబోసిన తలతో. వికటాట్ట హాసం చేస్తూ కళ్ళెఱ్ఱచేసి, వంటికంతా పసుపు పూసుకుని పదునైన పెద్ద ఖడ్గాన్ని



చేతబట్టి ఎనుబోతు మెడక్రింద పంగల కఱ్ఱను పోటీగా పెట్టి, ఈ విధంగా ప్రారం భిస్తాడు.

పాటప్రారంభం :

ఓరి, ఆదిమూలము బ్రహ్మ
విష్ణు విగ్రహము మీద,
ఆనందమాడు వాడెవ్వాడురా ॥ఓరి॥

అఖిల దేవతలకు అభయమిచ్చిన వాడు
అలనాడు గోపంగి నేనేనురా, లింగతాలిల్లె తాలిల్లె ॥ఓరి॥

మింటి దిక్కున జూచి, మీసంబు వడిసి
ఒంటిదున్నా తల నరికేనురా
కొంకాక చిందూలు - గోవింద గంతూలు
శంకలేకా బలి చల్లీతిరా - లింగతాలిల్లే తాలిల్లే ॥ఓరి॥

అండాండమను బిరుదు దాసాది నాపేరు
పిండాండమను బిరుదు కాసెపోసి
అండపిండ బ్రహ్మాండముల కెల్లను
మెండుండు దైబాల - మెండాడురాలింగ
తాలిల్లె తాలిల్లె ॥ఓరి॥



అని భీకరంగా పాడుతూ, చిందులువేస్తూ ఒక్క వ్రేటుతోనే ఆ దున్నపోతు మెడను నరికివేస్తాడు. ఆ రక్తంతో అన్నాన్ని తడిపి, కుంభరాసిపోస్తారు. రక్తవర్ణమైన ఆ కుంభాన్ని ఒక తట్టలోకి ఎత్తి. దానిపై నరికిన దున్నపోతుతలను పెట్టి, తట్టను వెట్టివాడి తలమీద పెట్టి ఘటాలవాడు డప్పుల వాయిద్యాన్ననుసరించి గణాచారిలా ఆవేశంతో గంతులువేస్తూ భీకరంగా కేకలువేస్తూ గ్రామ పొలిమేరల్లో నాలుగుదిక్కులు పొలిగంగను విడిచి రక్తపు అన్నాన్ని వెదజల్లుతారు. గ్రామదేవతలను పొలిమేరలో పెడతారు.



# గడగడ లాడించే కాటమరాజు కొమ్ము కథలు



కాటమరాజు కథలను ఎక్కువగా కొమ్ములవారు పాడుతూ వుంటారనీ, వీరు మాదిగలలో ఒక తెగ అనీ, కథాస్థానమైన కనిగిరి సీమలో కొమ్ములవారే కాక, గొల్లలలో పూజగొల్లలు కూడ ఈ కథలను పాడుతున్నారనీ, అంతేగాక కందుకూరు తాలూకాలో, పికిలివారనేవారు పాడుతున్నారనీ వీరు కూడ గొల్లలే ననీ.

అలాగే విశాఖపట్టణ ప్రాంతాలలో పొడపోతుల వారనేవారు, కాటమరాజు కథలను గానం చేస్తున్నారనీ వీరి కుల మేదో తెలియదనీ.

అలాగే రాయలసీమ ప్రాంతంలో భట్టువారు (మాదిగలు) ఎఱ్ఱగొల్లలూ, తెలంగాణాలో ఎఱ్ఱగొల్లలూ, మందుచ్చువారూ, బీరన్నలవారూ, యాదవ కథలను చెపుతూ వుంటారనీ, కనిగిరిసీమలో కాటమరాజు కథలను పాడే పూజగొల్లలను యాచకులు అని పిలుస్తూ వుంటారనీ, వీరినే తెలంగాణాలో తెరచీర భక్తులని పిలుస్తారనీ, పంపాద్రి కథను రచించిన మల్లయ్య కవి. కృత్యవతరణికలో తెరచీర భక్తులను స్మరించాడనీ కాటమరాజు కథల గ్రంథంలో 28వ సూచికలో డా॥ తంగిరాల సుబ్బారావు, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావు గార్లు ఉదహరించారు.

## కాటమరాజు కథాప్రసక్తి :

కాటమరాజు కథలు, కథాప్రసక్తి, శాసన ప్రమాణంగా వుంది. కాటమరాజుకు నల్ల సిద్ధికీ జరిగిన యుద్ధాన్ని గూర్చి మెకన్‌జి స్థానిక చరిత్రలు పద్దెనిమిదవ సంపుటంలో విపులంగా వుంది.

కాటమరాజుకు పెద్ద గోవులమంద వుంది. ఆ మందను మేపటానికి పాల కొండ, నల్లమల అడవుల్లో మేతకు తోలుకుపోయేవారు. వర్షాలు లేకపోవటంవల్ల మేతలేక నెల్లూరు మండలానికి వచ్చి నల్లసిద్ధి చోళ మహారాజునకు పుల్లరిగా తమ మందలోని కోడెదూడల్ని ఇచ్చేటట్లు స్థానిక చరిత్రలో వుంది.

వీరిద్దరికీ యుద్ధం జరగటానికి మూడు కారణాలను వివరించారు.

1. నెల్లూరు సీమలో కూడా మేతకరువు రావటంవల్ల నెల్లూరు రాజ్యంలో పంట పొలాన్ని కూడా మేపసాగాడు. ఇది నల్లసిద్ధికి కోపకారణమైంది.
2. అడవుల్లో వున్న క్రూరమృగాల్ని యాదవులు వేటాడటం వల్లను మందల్ని విస్తారంగా అడవుల్లో ప్రవేశపెట్టటం వల్ల మృగసంతతి నశించింది. అది కూడా ద్వేషానికి కారణమైంది.
3. ఇదికాక మనుమసిద్ధి రాజు ఉంపుడుకత్తె పెంపుడు చిలుకను కాటమరాజు తండ్రి పోలురాజు బాణంతో కొట్టి చంపటంవల్ల సిద్ధి తన మనుషులతో కాటమరాజు ఆవులమందల్ని చంపించాడు. దానితో కాటమరాజు పుల్లరివ్వటం మానివేశాడు. అందువల్ల ఇరువురి మధ్య యుద్ధం జరిగింది.

## కొమ్ముమ్మవారు:

కొమ్ములవారనే వారు గంగ దర్శనానికి సంబంధించిన మాదిగలు. వీరు తాము జాంబవంతుని తెగకు సంబంధించిన వారమని చెప్పుకుంటూ వుంటారు. వీరినే చిత్తూరుజిల్లాలో బట్టు వారని పిలుస్తారు.

కొమ్ములవారు యాదవుల్ని యాచిస్తారు. వారి గోత్రాలను చెపుతూ కాటమ రాజు కథల్నీ, విష్ణుభాగవతమనే నామాంతరంగల కంసుడు కథను వీరు చెపుతారు. వీరి ప్రదర్శనలో "వీరణాన్నీ" "తిత్తినీ" "తాళాల్నీ" "కొమ్ముల్నీ" ఉపయో స్తారు. కాటమరాజుకు సంబంధించిన కథలన్నీ వీరి దగ్గర తాళపత్ర గ్రంథరూపం లోనూ కంఠస్థంగానూ వున్నాయి.

యాదవులకు గంగ ఆరాధ్యదైవం. గంగ జాతర్లలో కొమ్ములను గావుపట్టి ఊదుతారు. తానకముల్ని పాడటం, కాటమరాజు కథలను చెపుతూ వుంటారు.

కాటమరాజు సైన్యంలో ప్రత్యేకంగా గోసంగిదళం వున్నట్లు వీర గాథలలో చెప్పబడింది. దాని నాయకుడు బీరినీడు. ఈతను మాతంగివీరుడు. ఈతని సంతతి

వారే ఆ నాటినుండి ఈనాటివరకూ ఈ గాథలను గానం చేస్తున్నారనీ తంగిరాల వారి ఊహ; వారినే ఈనాడు కొమ్ములవారని పిలుస్తున్నారు.

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట తరువాత ''భక్తిరన్న'' బీరిసీడు సంతతివారైన మాదిగలను పిలిచి యాదవ కథల్ని లోకంలో వ్యాప్తి చేయటానికి అనుమతి యిచ్చాడనీ చెపుతారు.



## కొమ్ములవారి ప్రదర్శన:

కొమ్ములవారు ఏ యాదవుని ఇంటిముందు కథ చెపుతారో, ఆ యాదవుడు వీరిని సన్మానించి తీరాలి. ఒకవేళ వారు అలా చేయకపోతే అతని ఇంటిముందు ఒక గుడారాన్ని వేస్తారట. అలా చేయటం భక్తిరన్న శాసనమేనట. గుడారాన్ని వేసినా, కొమ్ముల వారిని సన్మానించకపోతే, ఆ గుడారాన్ని భక్తిరన్న కూల్చివేయమన్నాడు. అలా గుడారాన్ని కూల్చటంవల్ల ఆ యింట్లోవున్న యాదవులందరూ నశించిపోతారని భక్తిరన్న శాపమట. అందువల్ల యాదవులు కొమ్ములవారిని అమిత భక్తితో ఆదరిస్తారట.

కాటమరాజు కథలు పాడేవారికి ఆచార ప్రకారం ముఖ్యమైన ఆరు వస్తువులుండాలి. అవి గుడారు, కొమ్ము, ''పీరణం'', ''బొల్లావు'', ''వీరభద్రుడు'', ''బసవదేవుడు'' మొదలైనవి.

గుడారు:

ఏ ప్రదేశంలో కథను చెప్పాలనుకున్నారో ఆ ప్రదేశంలో పెద్ద గుడారం వేస్తారు. ఆ గుడారం లోపల గోడలకు యాదవుల కైవశమైన గంగ, కాటమ రాజు కథలలోని ప్రధాన ఘట్టాలను రంగుల్లో చిత్రింపబడిన పెద్ద పెద్ద గుడ్డలను అతికిస్తారు. ఈ గుడ్డలకు తెరచీరలని పేరు. ఈ తెరచీరలను బట్టే ఈ గాథాకారులకు తెరచీర భక్తులని పేరు.

కొమ్ము:

కొమ్ము అంటే ఇత్తడితో చేయబడిన కొమ్ములాగా వంకరగా తిరిగి వుండే గొట్టాన్ని కొమ్ము అని పిలుస్తారు. కథను ప్రారంభించే ముందూ, గోత్రాలను చెప్పే



ముందూ, తానకములు పాడుతూ వున్నప్పుడూ ఈ కొమ్ముల్ని వుత్తేజంతో ఊదుతారు. ఈ కొమ్ముల ధ్వని శంఖారావం మాదిరిగా ఉద్రేకాన్ని కలిగిస్తుంది కొమ్ముల శబ్దం వూరందరికీ వినపడుతుంది, ఈ నాదాన్ని విన్నవెంటనే ఎక్కడివారూ అక్కడికి చేరుకుంటారు. కొమ్ము ధ్వని పిలుపులాంటిది. కొమ్ములను ఊదేవారవటంవల్ల వీరిని కొమ్ములవారని పిలవటం అలవాటైపోయింది.

వీరణాలు:

అంకమ్మ కథల్లోనూ, పల్నాటివీర కథలలోనూ ఉపయోగించే పంబ జోడు వంటివే ఈ వీరణాలు. ఇవి రెండుగా వుంటాయి. ఒకటి వేపచెక్కతో గాని, రేల

చెక్కతో గాని చేయబడతాయి, రెండవది ఇత్తడితో తయారుచేస్తారు. రెంటియొక్క శబ్దంలోనూ వైవిధ్యముంటుంది. కొయ్యతో చేయబడిన వీరణ శబ్దానికీ, ఇత్తడితో చేయబడిన శబ్దానికి వ్యత్యాసముండి, రెండు శబ్దాల కలయిక, కథకు సరిజోడుగా వుంటుంది.

## బొల్లావు:

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో పాల్గొన్న ఒంటికొమ్ము బొల్లావు యొక్క బొమ్మ యిది. దీనిని చెక్కతోగానీ, ఇత్తడితోగాని తయారుచేస్తారు. తానకపులు పాడు నప్పుడు దీనిని నెత్తిపై పెట్టుకుని శివమెత్తినట్లు గంతులు వేస్తారు.

## వీరద్రాడు:

వీరద్రాడు అంటే వీరత్రాడు. తిరుపతమ్మ దేవరపెట్టె ముందు దేవర పాత్ర ధారి తాడును ఝళిపించటం మనకు తెలుసు. ఈ వీరద్రాడు పల్నాటి యుద్ధంలో బ్రహ్మనాయుడు జరిపిన శివనందుల కోట యుద్ధంలో యాదవు లతనికి తోడ్పడ్డారట. అందువల్ల యాదవులకు శివనందుల కోటలో లభించిన గుదారు, వీరత్రాళ్ళు, గంగ, పోతురాజుల విగ్రహాలు బహూకరించారట. తానకాలు పాడేటప్పుడు, శివమెత్తి గంతులు వేసేవారు. వీర త్రాళ్ళతో కాళ్ళమీదా, చేతులమీదా కొట్టుకుంటారు. ఈ వీరత్రాళ్ళు మూడు పుళ్ళతో వుండే బారిడేసి పగ్గాలు.

## బసవ దేవుడు:

ఎఱ్ఱగడ్డపాటి పోరులో యాదవులు ఒరిగారనే వార్తను దొన కొండకు తెచ్చిన వాడు బసవదేవుడు. ఈ బసవదేవుని విగ్రహాన్ని కూడా గాధాకారులు దగ్గరుంచుకుని పూజిస్తారు.

## కథకుల వేషధారణ:

కాటమరాజు కథలను గానంచేసేటప్పుడు వీరణాలనే కాక, వారి శ్రుతి కొరకు తోలుతిత్తిని, లయకు తాళాలను ఉపయోగిస్తారు. ఇందులో ప్రధాన కథకుడు నిలువు టంగీ పన్నెండు మూరలతలపాగా, కాళ్ళకు గజ్జెలు, నడుముకు నడికట్టు, చేతిలో పిడి గుడ్డ మాత్రం వుంటాయి.

గంగతర్కం పాడేటప్పుడు, ఒకరు గంగవేషాన్నీ, మరిఒకరు కాటమరాజు వేషాన్నీ ధరించి ఎదురెదురుగా నిలబడి, చేతిలో కత్తి పట్టుకుని, ఆ కత్తి చివర ఒక నిమ్మపండును గుచ్చికాళ్ళకు గజ్జెలు కట్టుకుని, గంతులు వేస్తూ, కత్తిని త్రిప్పుతూ, రెండు పాత్రలూ వాదించుకుంటూ నటిస్తారు.

ప్రధాన కథకుడుతో పాటు వంతలు ముగ్గు రుంటారు. వీరిలో ఒకడు కత్తిని పడతాడు. రెండవవాడు వీరణాలను వాయిస్తాడు. మూడవవాడు తాళం వేస్తాడు. ఈ ముగ్గురిలోనూ ఇద్దరు కథకు వంతగా ఆకొాడతారు. కాటమరాజు కథకులు పాడే పాట ఈ క్రింది విధంగా వుంటుంది.

గంగపాట

గంగను కొలిచేరూ, ఏరువ
గంగను కొలిచేరూ
ఆకసాన సళ్ళాడు తురగా
గంగను కొలిచేరు, పాతేటి
గంగను కొలిచేరూ.

అలాగే బొల్లావు పాట

కనకరాళ్ళ బోటిమీద
కనక వర్షమూ అవుకు
కనక వర్షమూ.
ఉద్దాగేరి ముద్దాపసుపు
అవుకొచ్చెనూ
బొల్లావు కొచ్చెను.

అలాగే పాపనూక సువ్వి పాట

సువ్వి సువ్వన్నలార, సువ్వన్నలార
సువ్వన్న పాపమ్మ వేయన్నపాడు
మచ్చావతారుడే మా అవులన్న
హెచ్చుగా దక్షిణాది అవుల మేపు
పచ్చొడ్లు నేదంచి పాలెసరబెట్టి

పాయకానే జూతు పాలేటి త్రోవ
కట్టమీదంగళ్ళు గంగరేగుల్లు
ఘనమైన గుడివాడు గంగ పుట్టిల్లు.

ఇలా సాగుతుంది పాట. మనుమసిద్ధి రాజుకో, నల్లసిద్ధి రాజుకో, వారి రాజ్యంలో కాటమరాజు ఆవుల మందల్ని మేపుకున్నందుకు పుల్లరి ఇవ్వకపోవటంవల్ల చెలరేగిన వివాదం యుద్ధంగా మారింది. ఆ యుద్ధంలో అటు రాజులూ, ఇటు యాదవ సామంత రాజులూ పాల్గొని ఎందరో



వీరమరణం చెందారు. వారియొక్క కథలు 32 వెలువడ్డాయి. వాటి సారాంశమే ఈ చరిత్ర అయితే కాటమరాజుకీ, నెల్లూరు మనుమసిద్ధికీ యుద్ధం జరిగినట్లు ముప్పై రెండు కథలలోనూ ఏ ఒక్క కథలోనూ మనుమసిద్ధి ప్రసక్తి లేదు.

అయితే కాటమరాజుతో పోరిన రాజు నల్లసిద్ధి రాజు అతని తమ్ములు, పాపసిద్ధి, ఎఱ్ఱసిద్ధి, కొండికసిద్ధి, కొమరసిద్ధి మొదలైన రాజులని వీరగాథలలో వుంది. కాటమరాజుతో పోరాడింది మనుమసిద్ధితోనో నల్లసిద్ధితోనో అనే విషయం చారిత్రికులు నిర్ణయించాలి.

పొడపోతుల వారు :

విశాఖపట్టణ ప్రాంతంలో యాదవులకు గురువులుగా చెప్పబడే ఒక ప్రత్యేకమైన తెగ వుంది. వీరిని పొడపోతులవారు అని పిలుస్తారు. వీరు కొమ్ములవారి వంటి వారేమో తెలియదు. కాని యాదవ కులానికి చెందినవారు మాత్రం కారు. యాజకులుగాను, గురువులుగాను వున్న వీరిని యాదవులు ఎక్కువగా గౌరవిస్తారు. ఈ పొడపోతులవారు, యాదవులకు గోత్రాలు చెప్పి, కాటమరాజు కథల్ని పాడతారు. ఈ పొడపోతుల వారు తూర్పు గోదావరి మండలంలో ఉన్నారు.





# వీరశైవపు వీరముష్టి వారు

ఈనాటికీ భిక్షుకులై తిరిగే వీరముష్టివారు ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలలోనూ వున్నారు. ఏనాడు వీరశైవం ఏయే ప్రాంతాల్లో విజృంభించిందో ఆనాటినుంచీ ఈ వీరముష్టులు ప్రచారంలో వున్నారు.

వీరముష్టి, వీరభట, భద్రపాద మొదలైన పేర్లన్నీ వీరముష్టులకు చెందుతాయి. ముష్టి అంటే పిడికిలి అనీ, వీరులైన యోధులనీ, వీరభిక్షుకులనీ, వీరశైవ భిక్షుకులనీ, వీరముష్టివారికి అర్థం చెప్పవచ్చునని డా॥ బి. రామరాజుగారు వారి జానపద గేయ సాహిత్యంలో ఉదహరించారు.

వీరు వీరశైన వాఙ్మయానికి సంబంధించిన గేయాలనూ, శైవభక్తుల గాథలనూ, కన్యకా పరమేశ్వరీ కథలనూ చెపుతూ వుంటారు. వీరు ముఖ్యంగా శైవ భక్తులైన జంగాలనూ, వైశ్యులనూ ఎక్కువగా యాచిస్తారు. కాని ఈనాడు వారు అక్కడక్కడా వున్న కొద్దిమంది అందర్నీ యాచిస్తున్నారు.

ఒకప్పుడు వీరు ఎవరినైతే యాచించేవారో వారే వీరిని మక్కువగా ఆదరించేవారు.

ముఖ్యంగా వీరు వైశ్యులనే ఎందుకు యాచిస్తారో రామరాజుగారొక ఇతిహాసాన్ని ఈ విధంగా తెలియచేస్తున్నారు.

వీరముష్టులు వైశ్యులకు ఇలవేల్పైన కన్యకను, రాజరాజు బలాత్కరించి పట్టుకోవడానికి వచ్చినప్పుడు ఆయన సైన్యంలో నున్న వీరముష్టులూ, ఆయన పల్లకీని మోసే బోయలుగా వున్న వీరముష్టులు కావాలని కొంత ఆలస్యం చేయటంవల్ల,

కన్యకా, ఆమె వంశీయులూ అగ్నిగుండంలో ఆహూతి అవటానికి అవకాశం చిక్కిందనీ, అలా ఆలస్యమే చేయకపోయినట్లైతే, కన్యకను రాజరాజు చెరబట్టి వుండేవాడనీ, ఈ విధాన వీరముష్టులు వైశ్య జాతికి మహోపకారం చేశారనీ. ఈ కారణాన వైశ్యులు వీరముష్టులను గౌరవించి వారికి పారితోషికములు ఇస్తారనీ ఐతిహ్యం.

వీరముష్టులు గానంచేసే పాటలన్నీ కన్యకా ఇతివృత్తానికే సంబంధించినవని "అయ్యలరాజు నారాయణామాత్యుడు" వీరముష్టులను గురించి ఆయన రచనలో ఉదహరించాడు.



వీరముష్టులయొక్క జన్మవృత్తాంతం గురించి ఒక వింత కథ ప్రచారంలో వున్నట్లు కూడ రామరాజుగారు వివరిస్తున్నారు. ఎప్పుడో వీరభద్రుడు దక్షాధ్వర, ధ్వంసము చేసే సమయంలో, వీరభద్రుని శరీరం నుంచి స్రవించిన చెమట నుండి ఈ జాతివారు జన్మించారట. వీరభద్ర, భిక్షుకు, విభూతిపిండాలవంటి గోత్రనామాలు వీరశైవాన్ని చెపుతూ వున్నాయి. వీరిలో కొంతమంది జంగాలుగా మారారు. వీరముష్టులకు గురువులు ఆరాధ్య బ్రాహ్మణులని చెపుతారు. వీరముష్టులు మారెమ్మ, ముత్యాలమ్మ, పోచమ్మ మొదలైన గ్రామదేవతలను కూడా పూజిస్తారు.

ముఖ్యంగా వీరు గంభీరధ్వని నిచ్చే జేగంట శంఖం, తప్పెటా వాయిస్తూ భిక్షమెత్తుతారు వీరముష్టుల్లో ఆవేశపరులైన కొందరు. బుగ్గలకు నారసాలను పొడుచుకోవడం, నాలుకల్ని తెగకోసుకోవడం మొదలైన భయంకరమైన ఆవేశాన్ని ప్రదర్శి

స్తారు. లింగధారులు తప్ప మిగిలిన వారందరూ మద్యమాంసాలను ఆరగిస్తారు. వీరు గడ్డాలనూ, మీసాలనూ పెంచుతారు, క్షురకర్మ చేయరు. వీరముష్టులైన వీరు యాచిస్తే. వీరి స్త్రీలు, చాపలు అల్లడం పచ్చబొట్లు పొడవడం మొదలైన పనులు చేస్తారు. బ్రాహ్మణులు, వైశ్యులు, జంగాలు, బలిజలు మొదలైనవారి ఇళ్ళలో తప్ప వీరు మరెక్కడా భోజనం చేయరు.

ఆవేశపరులైన వీరముష్టులు వీరావేశంతో కర్రసాములు కూడా చేస్తూ వుంటారు. తాషామర్పా వాయిద్యానికి అనుకూలంగా అడుగులువేస్తూ, కర్రసాములో ఆరితేరిన ఇరువురు ఇరుప్రక్కల నుంచి కర్రలను చేతబూని గిరగిరా త్రిప్పుతూ అమిత పౌరుషంతో ఒకరిమీదికి మరొకరు కర్రను విసురుతూ ఆ కర్ర విసురుకు రెండవ వ్యక్తి తప్పుకుని ఎదురుదెబ్బ తీస్తూ, వాయిద్యానికి అనుగుణంగా, వాయిద్య వేగంతోపాటు కర్రత్రిప్పుతూ, తమ తమ ప్రజ్ఞలను చూపిస్తూ, చూపరులను వుత్తేజపర్చి, వారిలో ఉద్రేకాన్ని కలిగిస్తారు. పల్లెలలో సహజంగా జరిగే ఉత్సవాలలో ఈ వీరముష్టులను ప్రదర్శనాలలో ప్రవేశపెడతారు. వీరు కర్రసాములో, ఎంతటి అసాధ్యులో, కత్తిసాములోనూ అంత అసాధ్యులే.





## బడిపిల్లల దసరా వేషాలు

పూర్వకాలంలో విద్యను నేర్చుకునేందుకు వెళ్ళిన శిష్యులు, గురువుగారికి సకల పరిచర్యలుచేస్తూ విద్యాభ్యాసం చేసేవారు. ఈనాటి మాదిరి ప్రభుత్వం ఇచ్చే నెల జీతాలు మాదిరి జీతాలు వుండేవి కావున అందువల్ల శిష్యులిచ్చే గురుదక్షిణ మీదే గురువుల జీవనాధారం జరుగుతూ వుండేది. ఇది తరువాత కాలంలో రూపాంతరం చెంది ప్రభుత్వం వద్ద పుచ్చుకునే జీతాలతోపాటు ఈ దసరా మామూళ్ళను కూడా దండుకునేవారు.

ఒకప్పుడు గురువుగారిని భక్తితో పూజిస్తూ. ఆరాధిస్తూ, గురువుగారి వద్ద పంచి విద్యాభ్యాసం, ఆశీర్వాదం పొంది, విజయోత్సాహంతో, నిజజీవితంతో ఎటు

వంటి ఒడుదుడుకులు లేకుండా జీవనం గడిపేందుకు విద్యాస్వార్థం కోరుకుంటూ, శిష్యులు తమకు తోచిన రీతిలో ఫలపుష్ప, ధనవస్తు, వాహన రూపాలలోగాని గురువు గారి అభీష్ట ప్రకారం, విద్యాభివృద్ధికి తోడ్పడగలననే, హామీరూపంలో గానీ, తమకు చేతనైన రూపాలలోగాని ఇచ్చే గురుదక్షిణకు విజయదశమిని ఎంచుకునేవారని చారిత్రిక గ్రంథాలు తెలుపుతున్నాయి.

ఇంటింటా విజయీభవ :

నా చిన్నతనంలో దసరాపండుగకు ఆడపిల్లలందరూ బొమ్మలు కొలువులు నిర్వహిస్తే ఉపాధ్యాయులు పిల్లల్ని తీసుకుని ప్రతి ఇంటికీ వెళ్ళి గురుదక్షిణను పుచ్చుకునేవారు. పిల్లలందరూ కొత్త బట్టలు కట్టుకుని కొంతమంది రంగుకాగితాల జండాలను పట్టుకుంటే కొంతమంది విల్లంబులను, మరి కొంతమంది ఆడించే హనుమంతుడి బొమ్మల్ని పట్టుకుని ఒక దండుగా బయలుదేరి — జయీభవా, దిగ్విజయీభవా అంటూ పాటలు పాడుకుంటూ, ఇంటింటికీ తిరుగుతారు.

విల్లంబులు ధరించినవారు; అంబుకు బదులు. అంబు చివర గులాముతో నింపటానికి వీలైన ఒక నాలుగు పలకల పెట్టెను అమర్చి, అందులో గులాము నింపి, ఇంటి యజమానులమీద సంధించేవారు. మరికొందరు హనుమంతుని చెక్క బొమ్మల్ని ఒక పుల్లకు అమర్చి, బొమ్మ కొకతాడును కట్టి లాగుతూ వుంటే హనుమంతుడి బొమ్మ గుప్పిగంతులు వేసినట్లు అందర్నీ నవ్వించేవి. ఇలా ప్రతి ఇంటిముందూ పిల్లలందరూ విన్యాసంచేస్తే ఇంటి యజమాని అయ్యవార్లకు పారితోషికం ఇచ్చేందుకు వెళ్ళబోతూండగా పిల్లలందరూ ఎక్కువ మొత్తాన్ని రాబట్టేందుకు ఇలా మొదలెట్టేవారు.

పావలా బేడైతె, పట్టేది లేదు  
అర్ధరూపాయిస్తే అంటేది లేదు.  
మూడు వరహా లిస్తే ముట్టేది లేదు.  
అయ్యవార్లకు చాలు అయిదు వరహాలు.  
పిల్లలకును చాలు పప్పు బెల్లాలు.  
జయాభి జయీభవ,  
దిగ్వి దిగ్విజయీభవ.

అంటూ అయ్యవార్లకు ఎక్కువ మొత్తాన్ని రాబట్టేవారు. ఇలా ఊరిలో పిల్లలందరి ఇళ్ళకూ వెళ్ళి, ఎక్కువ మొత్తంలో వసూలు చేసేవారు.

పిల్లల తలిదండ్రులు, వారి పిల్లలు కూడా తోటిపిల్లలతో రావటంవల్ల ఘనంగానే దక్షిణ లిచ్చేవారు. ఒకప్రక్క పిల్లలు ఎంతో ఉత్సాహంతో ముచ్చట పడుతూ వుంటే, గురుదక్షిణలు అందుకున్న ఉపాధ్యాయులు, పారితోషికాలతో ఎంతో సంతోషపడిపోయేవారు.

ఇలా ప్రారంభమైన దసరా మామూళ్ళు. రాను రాను గురు శిష్య సాంప్రదాయాన్ని వదిలి ప్రభుత్వశాఖలలో వున్నవారు సాంఘిక అరాచక శక్తులు ఈనాడు మామూళ్ళు వసూలు చేస్తున్నారు. గురువుల స్థానంలో దుష్టశక్తులు విజృంభించాయి ఈనాడు.



# విజ్ఞులు చెప్పిన వీధిపురాణం

పూర్వం పల్లెల్లో మహాభారతం, భాగవతం, రామాయణం, గరుడపురాణం, బసవపురాణం, దేవీభాగవతం మొదలైన పురాణగాథలను చదవటం తేటతెలుగులో



గ్రామ ప్రజలకు అర్థమయ్యే శైలిలో చెప్పడం ఆనాడు ఆచారంగా వుండేది. ఆనాటి ముఖ్యమైన వినోదాలలో వీధి పురాణం చెప్పడం కూడా ఒకటి. గ్రామంలోని ధనికులు, గ్రామ రెడ్లు, పండితులు, బ్రాహ్మణులు మొదలైనవారు నిర్వహించేవారు.

పురాణ పఠనం వీథి మంటపంలోగాని, గ్రామ చావడిలో గాని చెప్పేవారు. పురాణపఠనానికి ఏ విధమైన ఖర్చు లేదు. భక్తి, ముక్తి రెండూ కలుగుతాయనే విశ్వాసంతో ఎంతోమంది ఈ పురాణ పఠనానికి హాజరయ్యేవారు. ప్రేక్షకులు వచ్చే వారు వస్తూ వుంటే వెళ్ళిపోయేవారు వెళ్ళిపోతూ వుండేవారు. ఏ మాత్రం కొంచెం తీరిక వున్నా కాస్త పురాణ కాలక్షేపం వినిపోయేవారు. అంతేగాక, ఈ పఠనం సాయంత్రం పూట తీరుబడి వేళ జరిగేది. ఒకరు పురాణం చదివితే, మరొకరు విడ మర్చి అర్థం చెప్పేవారు. గ్రామంలో వుండే పురుషులు ఏమాత్రం అవకాశమున్నా వీథుల్లోనే వుండేవారు. ఆనాటి వినోద కార్యక్రమాలన్నీ వీథుల్లోనే జరిగేది.

వీథి పురాణం యొక్క ప్రాముఖ్యాన్ని గూర్చి చంద్రశేఖరుడు ఆనాటి జానపద కళారూపాలను తన శతకంలో వర్ణిస్తూ, వీథి పురాణం యొక్క ప్రాముఖ్యాన్ని గూర్చి ఈ క్రింది విధంగా ఉదహరించాడు.

పద్యం

పండిన చేను నాది, పడమోసుకుపో నెలనాడు నీవు
పుర్రాండము సెప్పినావు గద బలె రమ్మెముగా బగుమా
న మిస, మా ముండ ఇనాలటంట, పడి మొత్తుకుసచ్చెను.
నీవు మల్లి రామాండము సెప్పలంచు
నను మందుడు మూర్ఖుడు చందశేఖరా॥



అని వర్ణించాడు. అంటే ఆనాడు వీథి పురాణంకూడ ఎంతటి బల వత్తరమైన కళారూపమో అర్థం చేసుకోవచ్చు.



# బగ్గు గొల్లల

# ఒగ్గు కథలు

రాగభావయుక్తంగా ఒక కథను అల్లడం, చెప్పడం కథాగానం అని వ్యవహరించవచ్చు. ఈ కథాగాన కళా ప్రదర్శనంలో ఒకరు ప్రధాన కథకులు. అయితే ఇద్దరూ ముగ్గురూ లేక అంతకు ఎక్కువ మంది సహ కళాకారు లుంటారు ఒగ్గు కథలో.



'నకళారూపాలు :

ఇటువంటి గానకళారూపాలు మన రాష్ట్రంలోనే అనేకం వున్నాయి. జముకుల కథ, గొల్లసుద్దులు, వీరముష్టి కథ, పిచ్చుకుంటుల కథ, పంబకథ మొదలైనవి. ఆంధ్రదేశంలో వివిధ ప్రదేశాలలో ప్రచారంలో వున్నాయి. కథ చెప్పే తీరులోనూ, సహకార వాద్యాలలోనూ, స్వీకరించే కథలలోనూ ఈ కళారూపాలు భిన్నంగా వుంటాయి. కాని సంగీతం అభినయాలను ఆశ్రయించడం ఏదో ఒక కథను ఆలంబనంగా చేసుకోవడం, ఈ కళారూపాల యొక్క సామాన్య లక్షణం. అందుకే ఈ కళారూపాల నన్నిటినీ కలిపి కథా గాన కళ అని నామకరణం చేయవచ్చు. అన్నిటిలోనూ ఛందోబద్ధమైన రచనలతో పాటు అనేక రకాలైన పాటలు చోటు చేసుకున్నాయని కొత్త దేశిపతిరావు గారు నాట్యకళ పత్రికలో ఉదహరించారు.

## కథనుబట్టి కళారూపం పేరు :

ఈ కథా గాన కళారూపాల పేర్లు ఆ కథలను చెప్పేవారి కులాలను బట్టీ, కథ చెప్పే సమయంలో ఉపయోగించే సహకార వాద్యాలను బట్టీ, కథావస్తువును బట్టీ వచ్చాయి.

సహకార వాయిద్యం ఆధారంగా పేరును సంతరించుకున్న కళారూపాలు పంబ కథ, జముకుల కథ, బుర్ర కథ, ఒగ్గు కథ, ఇక తెగలనుబట్టి పేర్లు వచ్చిన కళారూపాలు జంగం కథ, పిచ్చుకుంటుల కథ, గొల్లసుద్దులు మొదలైనవి. కథా వస్తువును బట్టి వ్యవాహృతమౌతున్న కళారూపాలు హరికథ, పాండవుల కథ, రేణుకా కథ మొదలైనది.

భిన్న విభిన్నమైన కథాగాన కళారూపాలలో ఒగ్గుకథ ఒక్క తెలంగాణా ప్రాంతంలో తప్పా మరో ప్రాంతంలో లేదు. అందులోనూ వరంగల్, నల్లగొండ, హైదరాబాదు జిల్లాలలో బహుళ ప్రచారంలో వుంది. ఈ మూడు జిల్లాలలోనూ సుమారు ఏభై ఒగ్గు కథా బృందాలు కథలు చెపుతూ వున్నాయి.

## ఒగ్గు కథ :

శైవ సంప్రదాయంలో ఒక వర్గంవారు శివుని డమరుకాన్ని ఒగ్గు అంటారని దీనికే జెగ్గు, జగ్గు అనే పేర్లున్నాయని ఈ ఒగ్గును కథకు వాయిద్యంగా వాడుతూ కథ చెబుతారు కాబట్టి ఈ కథలకు ఒగ్గు కథ అనే పేరు వచ్చిందనీ, ఈ కథలు శైవమతానికి సంబంధించినవనీ మల్లన్న, బీరప్ప కథలు ప్రారంభంలో చెపుతూ వుండేవారనీ, అదీకాక కురుమ కులంవారే ఈ కథలు చెప్పేవారనీ, బీరప్ప, మల్లన్నలు వీరి కుల దేవతలనీ, డా॥ బిట్టు వెంకటేశ్వర్లుగారు కరీంనగర్ రాష్ట్రీయ జానపద కళోత్సవాల సంచికలో వివరించారు.

## తొలి చెమట, మలి చెమట :

శివుని తొలి చెమట బీరప్పగానూ, మలి చెమట మల్లన్నగానూ పుట్టినట్లు కురుమల కథలు చెపుతున్నాయి. బీరప్పను కురుమల కులగురువుగా భావిస్తారు. మల్లన్న సాక్షాత్తు జన్మనిచ్చిన వాడు. కురుమలకు మరొక కథనం ప్రకారం, ఆదిరెడ్డి శీలమ్మల సప్తమ సంతానం, అతను పద్మాక్షి, రత్నాంగి అనే ఇద్దరిని పెండ్లాడతాడు.

పద్మాక్షికి వివాహంలో వత్తి కంకణం కడతాడు. ఆమెకు భూములను, పశువులను ఇస్తాడు. రత్నాంగికి ఉన్ని కంకణం కడతాడు. ఆమెకు గొర్రెలను ఇస్తాడు. పద్మాక్షి సంతానం కురుమలలోని వత్తి కంకణం గోత్రం వారుగానూ, రత్నాంగి సంతానం. ఉన్ని కంకణం గోత్రంవారు గానూ ఒప్పుకుంటున్నారు.

## కురుమల కథ :

మల్లన్న బీరప్ప కథలను ఈ కురుమలు చెప్పుకుంటారు. అవే ఒగ్గు కథలు. ఈ కురుమలనే బగ్గువాళ్ళు, ఒగ్గోళ్ళు అనే పేర్లు. ప్రస్తుతం వీరు ఈ రెండు కథలనే కాక ఇతర కథలను కూడా చెపుతున్నారు. ముఖ్యంగా మల్లన్న కథను కురుమల వివాహ సందర్భాల్లో చెపుతూ వుంటారు. ఈ కథలను చెప్పే కురుమలే ఆ కులంలో పురోహితులు. మల్లన్న కథను చెప్పిన తరువాతే కురుమ వధూవరులకు వివాహం జరిపిస్తారు. వీరికి కూడా గ్రామాలు, తాలూకాలు హద్దులుండేవట. ఒకరి హద్దులోకి మరొకరు వచ్చి వివాహాలు చేయకూడదట. పురోహితుడు కూడా ఇతర సమయాల్లో కథలు చెప్పకూడదట. దీన్ని అతిక్రమిస్తే కుల బహిష్కారం వుంటుందట. అలాగే ఈ కథలు పురోహిత వంశాలకు చెందనివారు నేర్చుకుని చెపితే కుల బహిష్కార శిక్షను విధిస్తారట. చుక్కా సత్తెయ్య అనే నేటి ప్రసిద్ధ ఒగ్గు కథకుడు ఒకప్పుడు బహిష్కార శిక్షకు గురయ్యాడని చెపుతారు. అతను ఈ కథను కళారూపంగా ప్రచారంలోకి తెచ్చి ధనాన్నీ, పేరు ప్రఖ్యాతుల్నీ సంపాదించిన తరువాత కురుమ కులగురువులు అతనినే ఆశ్రయించి, అతని మార్గంలోనే కుల హద్దుల్ని పాటించ కుండా ఈ కథలను చెపుతున్నారనీ, అలా ఈ ఒగ్గు కథ ఒక కళారూపంగా రూపు దిద్దుకున్నదనీ బిట్టు వెంకటేశ్వర్లు గారు అంటున్నారు.

## చుక్కా సత్తెయ్య :

ఈనాడు ఒగ్గు కథను ప్రతిభావంతంగా చెపుతూ, దానికొక మన్ననసూ, గుర్తింపునూ కలగజేసి అది ఒక వుత్తమ జానపద కళారూపమని నిరూపించినవారు వరంగల్ జిల్లా జనగామ వాస్తవ్యులు చుక్కా సత్తెయ్యగారు. ఆయన ఒగ్గు కథను గురించి ఈ విధంగా వివరిస్తున్నారు.

మా వృత్తి కథ వీరభద్రునిగూర్చి, ఆ తరువాత మల్లికార్జున, రేణుకా ఎల్లమ్మ, అట్కారన్ కథ, హరిశ్చంద్ర, మహందాత మొదలైనవే గాక చారిత్రక గాథలకు సంబంధించిన ఇరవై ముప్పై కథల వరకూ చెప్పగలమంటా రాయన.

## బీరప్ప కథ, చుక్కయ్య కథనం :

ముఖ్యంగా మేము చెప్పే కథలు వీరభద్రుని గూర్చి. దీనినే వీరప్ప కథ అని పిలుస్తాం అంటా డాయన. వారి కులదైవం ఆయనే గనక అతని పేరు మీద వచ్చే పండుగలకు బీరప్ప ఒగ్గు కథలను చెపుతారు. అలాగే మల్లన్న కథలనుకూడా చెపుతారు. తెలంగాణా ప్రాంతంలో ''వీరప్ప దేవుడు. మల్లన్నదేవుడు'' గుళ్లు వుంటాయి. ముఖ్యంగా ఒగ్గు కథలు చెప్పే (కూర్మ) గొల్లవారు. అంటే యాదవులు మల్లన్న బీరప్ప కథల్ని పండుగల సందర్భంలో గొల్లవారితోనే చేయించుకుంటాదు. ఇది పారంపర్యంగా వస్తున్న సంప్రదాయం.



బీరప్ప పండుగ రోజున బీరప్ప యొక్క జీవిత చరిత్రను గురించి ఒగ్గుకథా రూపంలో చెపుతారు. ఒక్క యాదవులే కాక ఇతర కులాలకు చెందినవారు కూడా ఈ కథను ఎంతో ఆప్యాయతతో చెప్పించుకుంటారు. అంటే ఆ కథయొక్క విశిష్టత అంతటిది. ఆ కళారూపం యొక్క గొప్పతన మది.

## ఒగ్గుకథకు ఈ పేరెలా వచ్చింది?

వీరభద్రుడూ, మల్లిఖార్జునుడు వీరి చేతుల్లో ఉండే వాయిద్యం ఢమరుకం (అంటే జగ్గు) ధరించేవారు. చుక్క సత్తయ్యగారి పెద్దలు. రెండు వందల సంవత్స

రాల క్రితం మల్లిఖార్జునుడు ఇచ్చినటువంటి గొఱ్ఱెలను కాచుకుంటూ ఈ జగ్గుపైనే, అడవులలో చెట్ల క్రింద ఒగ్గు కథలు చెప్పేవారట. రాను రాను ఈ జగ్గుతో చెప్పే జగ్గుకథ ఒగ్గుకథగా రూపాంతరం చెందింది.

## తాతలు చెప్పిన కథలు:

ఈ ఒగ్గు కథలు ఈనాటి కళాకారులు వ్రాసిన కథలు కావు. వీరి తండ్రులు చెప్పిన కథలు వీరు చెపుతున్నారు. వీరి తండ్రులకు తాతలకు వీరి తాతలు చెప్పిన కథ లివి.

ముఖ్యంగా ఒగ్గు కథలు చెప్పేవారి వృత్తి గొఱ్ఱెలను కాయడం. నిపుణులైన వారు ఒగ్గు కథలు చెప్పడం, ముఖ్యంగా వీరు కథను ప్రారంభించే ముందు డోలును వాయిస్తూ, వీరణంతో శబ్దం చేస్తూ డమరుకంతో దడదడలాడిస్తూ గంగాదేవిని ప్రప్రథమంగా ప్రార్థిస్తారు.

## కథా బృందం:

ఈ ఒగ్గు కథలు చెప్పేవారు అయిదు నుంచి పదిమంది వరకూ వుంటారు. అయితే ఇంతమంది వుండాలనే నిబంధన లేదు. వారి వారి సౌలభ్యాన్ని బట్టి బృందాలను ఏర్పాటు చేసుకోవచ్చు. ముఖ్యంగా కథకు కనీసం అయిదుగురు సభ్యులైనా వుండాలి. ఈ అయిదుగురిలో ఒకరు ప్రధాన కథకుడు. మరొకరు సహాయకుడు. వీరిద్దరూ ముందు భాగంలో వుంటారు. వారి వెనుక భాగంలో ముగ్గురు నిలబడతారు. వారిలో ఒకరు డోలు, మరొకరు తాళం, ఇంకొకరు కంజిరా ధరిస్తారు. వీరందరూ ఒక వంక వాయిద్యాన్ని సాగిస్తూ వంతగానాన్ని కూడా అందుకుంటారు. ప్రధాన కథకుడు సందర్భాన్నిబట్టి ఆ యా పాత్రలు ధరిస్తూ కథాగానం చేస్తూ వుంటాడు. వంతదారుడు కూడా పాత్రధారణలో సందర్భాన్ని బట్టి సహకరిస్తూ వుంటాడు. వీరిరువురూ పాత్రానుగుణ్యంగా కొంత కొంత ఆహార్యాన్ని మారుస్తూ వుంటారు. అయితే ఈ ఆహారం మార్పుల్లో కథ ఏమాత్రం కుంటుపడదు.

## స్త్రీ వేషం:

ప్రధాన కథకుడే చీరకట్టి, కొప్పుపెట్టి, ముత్తైదువుగా స్త్రీ పాత్రను ధరిస్తాడు. ఇప్పటివరకూ ఈ కథ తెలంగాణా హద్దులు దాటి లేదు. కథనంలో ముఖ్య కథకుడు,

ముఖ్యవంత లిద్దరూ ఒకేరకమైన నటనను అభినయిస్తారు. ఎడమచేతిని చెవికి అడ్డంగా గానీ నడుంపైనగానీ పెట్టి, కుడి చేతిని పైకి ఎత్తి కథను వివరిస్తూ కథానుగుణంగా చేతితో అభినయిస్తారు. ప్రధాన కథకుని రాగాన్ని అందరూ అందుకుంటారు. పాత్రకు తగినట్లు స్త్రీ పాత్రల సందర్భంలో కంఠాన్ని స్త్రీలా అనుకరిస్తారు. చేతులు తిప్పడంలోనూ, మూతి తిప్పడంలోనూ, శోకాలు పెట్టడంలోనూ, సిగ్గును అభినయించడంలోనూ, స్త్రీ పాత్రాభినయాన్ని చక్కగా అభినయిస్తారు. ఈ కథలో ముఖ్య వాయిద్యం ఒగ్గు అయినా, దానిని సందర్భాన్నిబట్టే ఉపయోగిస్తారు. తాళాలు డోలు మాత్రం ప్రారంభం నుండి చివరిదాకా ఉపయోగిస్తారు.

## ఒగ్గుడోలు నృత్యం :

ఒగ్గు కథలో ఎక్కువ ప్రాముఖ్యం వహించేది ఒగ్గుడోలు. ఇది ఒక మీటరు పొడవుండి గుండ్రంగా వుంటుంది. ఢమ్మ ఆకారంలో వుండే ఇత్తడి వాయిద్యం. ఈ వాయిద్యాన్ని పూర్వం చెక్కతో తయారు చేసేవారట. రెండు వైపులా మేక చర్మాన్ని అమర్చి తాళ్ళతో బిగిస్తారు. ఇది గంభీరమైన ధ్వని నిస్తుంది. కురుమలూ, గొల్లలూ వివాహ సమయాలలో వీటిని మంగళవాయిద్యాలుగా భావిస్తారు.

అంతేకాక అమ్మవారి గుడి సంబరాలలోనూ, జాతర్లలోనూ, పూజా సమయాల్లో శివాలయాల్లోనూ ఏడెనిమిది డోళ్ళను వాయిస్తారు. ఈ వాయిద్యాన్ని వీరప్ప డొల్లు అని కూడ పిలుస్తారు. ఈ డొల్లులు రాయలసీమలోని, కర్నూలు, అనంతపురం జిల్లాలలో కూడా కనిపిస్తాయి. తెలంగాణాలో మాత్రం ఒగ్గుడోలనే పిలుస్తూ వుంటారు.



## ప్రారంభంలో డోలు వాయిద్యం :

కథ ప్రారంభంలో ప్రారంభసూచనగా ఈ వాయిద్యాన్ని వాయిస్తారు. ఈ ధ్వనితో ఊరిలోని వారందరూ కథకు హాజరౌతారు. డోలు వాయిద్యానికి జిల్లేడు, లేదా సీతాఫలం కర్రముక్కలను వాయిస్తారు. ఈ డోలును ఒక్క కథ చెప్పడంతోనే కాక మల్లన్న పండుగ సమయాల్లోనూ, ఊరేగింపు సమయాల్లోనూ....జలధికి పోవడం,

మైలపోలు, తెల్లపాలు తీసినపుడు నాగవల్లి, వీరబోనం సమయాల్లోనూ డోలు వాయిద్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు. ఈ సన్నివేశాల్లో ఎన్నో డోళ్ళ తోళ్ళ నుపయోగిస్తారు. ఉధృత వాయిద్యపు పరుసలతోపాటు రకరకాల అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేస్తూ వాయించడమేకాక డోలుకు కటిన తాళ్ళను పళ్ళతో కరిచిపట్టి నృత్యం చేస్తూ వాయిస్తారు. కూర్చుని డోలును వీపునకు ఆనించి చేతులు వెనుకకు త్రిప్పి, డోలును వాయిస్తూ విన్యాసాలు చేస్తారు. ఈ డోళ్లు "ధిళ్ళెం, భళ్ళెం....ధిళ్ళెం, భళ్ళెం....ధిళ్ళెం, భళ్ళెం" అనే ధ్వని నిస్తాయి. ఈ విన్యాసాలకు తోడు కళాకారుల నైపుణ్యానికి తగినట్లు మరి కొన్నింటిని జోడించి డోలు నృత్యంగా తయారుచేశారు. ఇలాంటి ఒగ్గుడోలు నృత్య బృందాలు, బండి పెద్దాపురం, జట్టు, మల్లెల బీరప్ప జట్టు, సుక్కా సత్తెయ్య జట్టు మొదలైనవి ప్రఖ్యాతి వహించాయి. ఇలా ఒగ్గు కథాబృందాలు దినదిన ప్రవర్ధమానం అవుతున్నాయి.

## కథా ప్రారంభం :

ఒగ్గుకథ ఉజ్జయిని మహంకాళి స్తుతితో ప్రారంభిస్తారు. అనంతరం గణపతి ప్రార్థన, శారద ప్రార్థన చేసి, కథకుడు వ్రేలి అందెలు పట్టుకుంటాడు. వంతగాడు గొంగడి మీద వేసుకుని కర్ర చేతబట్టుకుని గొర్రెల కాపరిలా వుంటాడు. తాళంవేసే వ్యక్తి అవసరమైనప్పుడు కంజరి వాయిస్తూ వుంటాడు.

ఇటీవల కొంతమంది ఒగ్గు కథలుగా "హరిశ్చంద్ర, పార్వతి పరీక్ష, శివ తాండవ మహారాజు, నలపతి మహారాజు, దుర్గపతి మహారాజు, సారంగధర, రత్న మాణిక్యం, సూర్యచంద్రుల కథ, నాగరాజు కథ" మొదలైన జానపద, పౌరాణిక, కాల్పనిక కథలు కూడా చెపుతున్నారు.

## నేటి ఒగ్గుకథకులు :

ఈనాడు తెలంగాణాలో ఒగ్గుకథ చెప్పే బృందాలు వరంగల్లు, నల్లగొండ, హైదరాబాదు జిల్లాలలో వున్న ఏభై బృందాలలో నాలుగు దళాలు మాత్రమే బహుళ ప్రచారంలో వున్నాయి.

వాటిలో ప్రధాన కథకులు నేర రామస్వామి డెబ్భై సంవత్సరాలు, చీమల కొండూరు, భువనగిరి తాలూకా, నల్లగొండ జిల్లా.

వరంగల్ జిల్లా జనగాం తాలూకా నెల్లుట్ల గ్రామవాసి బండి ఈనయ్య. నల్లగొండ జిల్లా రామన్న పేట తాలూకా, ఆత్మకూరు గ్రామవాసి, చర్ల కొండయ్య. వరంగల్లు జిల్లా జనగాం తాలూకా మాణిక్యాపురం గ్రామస్థుడు, చౌదరిపల్లి చుక్క సత్తయ్య.

వీరిలో చుక్క సత్తయ్య దళం ఇటీవల కాలంలో చాలా ప్రఖ్యాతిలోకి వచ్చింది. సత్తెయ్య కళా నైపుణ్యం అంతటిది. కథను గానం చేయడంలోనూ, అందుకు అనుగుణంగా అభినయించడంలోనూ సత్తయ్య, తన బాణీని నిలుపుకున్నాడు. గంభీరమైన కంఠంతో గానం చేస్తూ కథా సందర్భానికి అనుగుణంగా ఆయా పాత్రలలో ప్రవేశించి, అభినయించి ప్రేక్షకుల మన్ననలను అందుకుంటున్నాడు. ఒక్క తెలంగాణాలో నూరుకు పైగా బృందా లున్నాయని, ఈ బృందాలలో దాదాపు అయిదుపందల మంది బృంద సభ్యు లున్నారనీ సత్తయ్యగారు తెలియచేస్తున్నారు.



# కత్తిసాములూ, కఱ్ఱసాములూ!

నా చిన్నతనంలో ఏ గ్రామంలో చూసినా వ్యాయామశాలలకు సంబంధించిన తాలింఖానాలు వుండేవి.

ముఖ్యంగా వ్యవసాయ తరుణం అయిపోయిన తరువాత తీరుబడిగా వున్న సమయంలో గ్రామంలో వుండే యువకులందరూ పైన సూచించిన తాలింఖానాలలో చేరి కఱ్ఱసాము, కత్తిసాము, గరిడీలను చేసేవారు. వారు ముఖ్యంగా ఆత్మరక్షణ కోసం ఈ విద్యను నేర్చుకునేవారు.

ఒకప్పుడు రాజాధిరాజులు తమ దేశరక్షణకోసమూ, ఆత్మరక్షణ కోసమూ సైనికులకు శిక్షణ ఇచ్చేవారు. పాలకులు కూడ ఈ విద్యలో ఆరితేరినవారై యుండేవారు.

## మారిన పరిస్థితులు :

రాజులూ, సామంతరాజులూ పోయిన తరువాత ఆంగ్లేయులు భారతదేశాన్ని హస్తగతం చేసుకున్న తరువాత అత్యాధునిక మారణాయుధాలు వచ్చిన తరువాత



కత్తిసాము, కర్రసాము ప్రాముఖ్యం తగ్గిపోయిన తరువాత వీటి మీద ప్రజలకు ఆసక్తి తగ్గిపోయిందని డా॥ బిట్టు వెంకటేశ్వర్లుగారు కరీంనగర్ రాష్ట్రస్థాయి జానపద కళోత్సవాల సంచికలో ఉదహరించారు.

ఆనాడు ఈ విద్యకు అధిక ప్రాముఖ్య మిచ్చేవారు. ఈ విన్యాసాలలో పోటీలు ఏర్పరచేవారు. ప్రజలు ఎంతో ఆసక్తితో ఈ ప్రదర్శనాలను ప్రదర్శించేవారు.

ఆంగ్లేయుల కాలంలో కూడా సంస్థానాలలోనూ, జమీందారీలలోనూ ఈ విద్యను పోషించేవారు.

విజయనగర సామ్రాజ్యంలోని సంస్థాన సామంతరాజులు కత్తిసాము కర్ర సాములను ఔత్సాహిక ప్రదర్శనలుగా నిర్వహించేవారట.

ఎంతో సాహసవంతంగా ప్రాముఖ్యం వహించిన ఈ కర్రసాము, కత్తిసాము విద్యలు వినోదాత్మక ప్రదర్శనలుగా విరాజిల్లాయి.

ఈనాడు వీటికి ఏవిధమైన ఆదరణ లేకపోయినప్పటికీ ఈ ప్రదర్శనాలు ఒక ప్రక్రియగా, ఒక కళగా ప్రదర్శిస్తున్నారు.

ఈ ప్రదర్శనాలు వెనుకటి రోజుల్లో కత్తిసాములో రక్షణ కొరకు కృపాణా లనూ, కవచాలనూ ధరించి సైనికుల్లాగానే పోరాటం జరిపేవారు. అయితే ఈనాడు మామూలు వస్త్రధారణతోనే ఈ విద్యను ప్రదర్శిస్తున్నారు.

ముఖ్యంగా కర్రసాములో ఒక కఱ్ఱతోనూ రెండు చేతులతో రెండు కర్రల తోనూ ఒకరి కొకరు పోటీపడి, ఒకరు కొట్టిన దెబ్బను మరొకరు కాచుకుంటూ ప్రేక్షకులకు భయం కలిగే విధంగా ఉధృతంగా కఱ్ఱసాము చేసేవారు. అదేవిధంగా కత్తి, డాలును ధరించి కూడా అలాగే పోరాటం జరిపేవారు. ఈ పోరాటంలో ఎత్తుకు పైఎత్తులు, దెబ్బ కొట్టడం, దెబ్బ కాచుకోవడం ఒకరి నొకరు దెబ్బ తీయ డానికి పొంచి పొంచి వలయాకారంగా తిరుగుతూ, హఠాత్తుగా ఒకరి నొకరు తలపడి ఉధృతంగా పోరాటం జరిపేవారు. ఈ పోరాటంలో కొందరు డప్పు వాయిద్యంతో పోరాటకారుల్ని ఉద్రేకపర్చేవారు. ప్రేక్షకులు, ఈలలతో, కేకలతో ఇరు పక్షాలుగా విడిపోయి ఇరువుర్నీ ఉత్సాహపర్చేవారు.

### టాసా వాయిద్యం :

కర్రసాము, కత్తిసాము జరిపేవారు. అడుగులనూ, భంగిమలనూ చాలా అర్థ హీనంగా చూపించేవారు. అడుగులకు అనుగుణంగా "టాసా" అనే వాయిద్యాన్ని

వాయించేవారు. మరికొందరు నగారానూ, నౌబత్‌ఖానా వాయిద్యాన్నీ, కొమ్ము నాదాలనూ చేసి ఉత్సాహపర్చేవారు. వాయిద్య ధ్వనులను విన్నకొలదీ బరిలో వున్న పోరాటయోధులు రెచ్చిపోయి విద్యను ప్రదర్శించేవారు.

ఈ ప్రదర్శనాన్ని మూడు రకాలుగా ప్రదర్శిస్తారంటారు డా॥ బిట్టు వెంకటేశ్వర్లుగారు. ఒకటి కర్రసాము, రెండు కత్తిసాము, మూడు ఏటాసాము. కర్రసాములో బాణాకర్రల్లో ఒంటిబాణా, జోడిబాణా అని రకరకాలుగా వరుసలు త్రిప్పుతారు. ఎదుటివాడు నెత్తిమీద కొడితే ఆ దెబ్బను తట్టుకోవడం, అలాగే గూడదెబ్బ కొడితే దానిని తట్టుకోవడం ఇలా తట్టుకుంటూనే ఎదుటివాడిని దెబ్బ తీయటం. ఇలా పోరాడతారు.

విన్యాసాలు :

ఈ కర్ర, కత్తిసాములో అందంగా, సుందరంగా ప్రేక్షకులను ఆనందపర్చే విధంగా రక రకాల విన్యాసం చేస్తారు. బాణాకఱ్ఱకు రెండు ప్రక్కలా కిరసనాయిలు ముంచిన గుడ్డలు చుట్టి వాటిని అగ్గిపుల్లతో ముట్టించి కుడి ఎడమ చేతుల్లో మార్చుకుంటూ తిప్పటం బాణా వరుసలో తిప్పటం.

అలాగే కత్తీ డాలూ ధరించి, రక రకాలుగా త్రిప్పి విన్యాసాలు చేస్తారు. ఒక మనిషిని క్రింద పడుకోబెట్టి అతని పొట్టమీద సొరకాయను పెట్టి పొట్టకు గాయం కాకుండా దానిని రెండు ముక్కలు చేయడం. అలాగే అరటికాయను పెట్టి అలాగే చేయడం. ఇలా నరకడంలో ఎంతో చాకచక్యాన్ని చూపిస్తూ, అలాగే అరటికాయను కంఠం మీదా నాలుక మీదా పెట్టి నరుకుతారు. అలాగే పొట్టపై కొబ్బరికాయ నుంచి బలంగా కొట్టి రెండు ముక్కలు చేస్తారు. అంతేకాక పొట్టమీ ఒక తమలపాకును పెట్టి దానిపై ఒక పలుచని గుడ్డవేసి గుడ్డ తెగకుండా క్రింద నున్న తమలపాకును రెండు ముక్కలుగా చేస్తారు. ఇది ఎంత సున్నితంగా చేస్తారో వివరించడం కష్టం. దేనిని నరకటానికి ఎంత బలం ఉపయోగించాలో అలా కత్తిని ఉప యోగిస్తారు.

ఈ కర్ర, కత్తిసాము విద్యనూ, విన్యాసాలనూ విచిత్రాలను విజయనగరానికి చెందిన కరుమజ్జి సత్యం బృందం అత్యద్భుతంగా ఈ ప్రదర్శనాల నిస్తూ వుంది.



# కోకొల్లలుగా

# కోలాట నృత్యాలు

ఆంధ్ర ప్రజాజీవితంలో అన్ని జానపద కళారూపాలతో పాటు ఈ కోలాట నృత్యం కూడ. తెలుగు జానపదుల జీవితాలతో పెనవేసుకుపోయింది. పెద్దల్నీ, పిల్లల్నీ అందర్నీ అలరించిన కళారూపం కోలాటం.



కోలాట నృత్యాలు ప్రతి పల్లెలోనూ విరామ సమయాల్లో రాత్రిపూట పొద్దుపోయేవరకూ చేస్తూ వుంటారు. భక్తిభావంతో దేవుని స్తంభాన్ని పట్టుకుని ఇంటింటికీ తిరిగి, ప్రతి ఇంటి ముందూ కోలాటాన్ని ప్రదర్శిస్తారు. ఈ కోలాట నృత్యాలను పెద్ద పెద్ద తిరుణాళ్ళ సమయంలోనూ, దేవుళ్ళ ఉత్సవాలలోనూ బహిరంగంగా వీథుల్లోనూ ప్రదర్శిస్తారు.

## కోలాట ప్రస్తావన :

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో అనేక జానపద కళారూపాలను వర్ణిస్తూ కోలాటాన్ని కోలాట గొడియ అని వర్ణించాడు. ఇతర నృత్య విశేషాలను వర్ణించినంతగా కోలాట గొడియను గురించి అంతగా వివరించనందువల్ల సోమనాథుని కాలానికి కోలాటం అంతగా అభివృద్ధి పొందలేదని వూహించవచ్చు.

కాని విజయనగర సామ్రాజ్య కాలంలో ఈ కోలాటాలు ప్రసిద్ధంగా ప్రదర్శించినట్లు విదేశీ యాత్రికుడైన అబ్దుల్ రజాక్ వర్ణించిన విషయం తెలిసిందే.

ఈ నాటికీ విజయనగర శిథిల శిల్పాల గోడలమీదా, శ్రీశైలం దేవాలయ ప్రాకారపు గోడలపైనా కోలాటంవేసే నర్తకీమణుల కోలాటపు శిల్పాలు చిత్రించబడి వున్నాయి.

## కోలాట నిర్వచనం :

కోలాట అనే శబ్దం కోల + ఆట అనే రెండు దేశ్యాలయిన విశేషాల శబ్దాల కలయిక వల్ల ఏర్పడిందనీ. కోల అంటే కర్రపుల్ల అని అర్థమనీ - కట్టియ. పుడక, కట్టె అనేవి పర్యాయపదాలనీ, ఆటశబ్దానికి తాండవం, నటనం, నృత్యం, నాట్యం, లాస్యం, నర్తనం. నృత్యం, క్రీడ. విహారం అనేవి పర్యాయపదాలనీ.

కోలాటం అంటే పుల్లలతో నటనం, లేక నర్తనం, లేక తాండవం అని చెప్పవచ్చుననీ, అంటే రెండు చేతులతోనూ కర్రముక్కలు పట్టుకుని పదాలుపాడుతూ గుండ్రంగా తిరుగుతూ లయానుగుణంగా అడుగులు వేస్తూ ఒకరి చేతికర్ర ముక్కను వేరొకరి చేతికర్ర ముక్కలతో తాకించే ఒక ఆటనీ డాక్టరు బిట్టు వెంకటేశ్వర్లుగారు వారి జానపద విజ్ఞానగ్రంథం 76 వ పేజీలో వివరించారు.

డా॥ వెంకటేశ్వర్లుగారు కోలాట ప్రక్రియను చక్కగా పరిశోధించిన వారు. వారి అభిప్రాయాలనే ఇక్కడ వుదహరిస్తున్నాను. వారి కృషికి నా ధన్యవాదాలు.

## రూపాంతరాలూ - పర్యాయ పదాలూ :

ఈనాడు మనం కోలాటంగా చెప్పుకునే కళారూపానికి పర్యాయ పదాలూ, రూపాంతరాలూ అనేకం వున్నాయి. కోలాట పదానికి హల్లీసకమనీ, ఉద్దితమనీ, కొట్టము. దండలాసకం, దండనర్తనం అనే పర్యాయ పదాలున్నాయి.

అలాగే కోలాట పదానికి, కోలాటలు, కోలు, కోలన్నలు, కొట్టమాట, కోలన్న అనేవి రూపాంతరాలు.

## ఆడటం, పాడటం :

ఆటలో ఆసక్తి కలిగిన కొంతమంది ఆటగాళ్ళు బృంద నాయకుని ఆధీనంలో బృందంగా ఏర్పడి, కోలాట నృత్యాన్ని నిర్వహిస్తారు. ముందు అందరూ వలయా

కారంగా నిలబడతారు. ముందుగా ఇష్టదేవతా ప్రార్థన చేస్తారు. వారు ప్రదర్శన ఇచ్చే స్థలాన్ని గరిడీ అని పిలుస్తారు. వలయంగా నిలుచున్న కళాకారులు ఇద్దరు చొప్పున ఒకరి కొకరు ఎదురుగా నిలబడతారు. వారు పట్టుకున్న చిరుతలను లయ బద్ధంగా కొడతారు. వేగాన్ని పెంచడానికి జట్టు నాయకుడు ఇత్తయ్యకుడు దద్ధిమిత్తా అనడంతో లయా తాళం మారిపోయి వలయంలో వున్నవారు కొందరు లోపల వలయంగానూ, మిగిలినవారు వెలుపలి వలయంగానూ మారుతారు.

## ఆట మొదలు :

అప్పటితో ఆట ప్రారంభం అవుతుంది. ఇద్దరు ఇద్దరు కలిసి పట్టుకున్న పుల్లలను విడి విడిగా చేతుల్లోకి తీసుకుని కొట్టడంతో ఆట ప్రారంభమౌతుంది. అప్పుడు జట్టు నాయకుడు లయను సరిజేస్తాడు. కొన్ని ప్రాంతాలలో తాకా, తాకా, తాకా, తాకా, తాకా, తాకా. తయ్యకు తద్ధిమి అని లయను సరిదిద్దుతాడు. మరికొన్ని ప్రాంతాల్లో తకిటధిమిధిమిం, ధిమితధిమిధిం అంటూ ఎంత మంచి గురుడు దొరికేనే అనీ మరికొన్ని ప్రాంతాలలో లాలి, లాలి, లాలి, లాలి — లిలాయలో, లలిలాలి, లిలోయ్‌లో లలీ, లాలి, ఎలాయ్‌లో అని మరికొన్ని ప్రాంతాలలో కోలు - కోలు - కోలే, కోలన్న, కోలు, కోలోయ్. కోలు, కోలు, కోలే కోలన్న కోలు, కోలోయ్ అని లయను సరిదిద్దుతారని వెంకటేశ్వర్లుగారు తమ జానపద విజ్ఞానంలో వివరించారు.

ఇలా లయను సరిదిద్దిన తరువాత ఒక పాటను ప్రారంభిస్తారు. ఆ పాటతో పాటే ఒక కోపును మొదలు పెడతారు. పాట పూర్తి అయిన తరువాత ఆ కోపులోనే సంవాద రూపంలో వున్న మరొక పాటతో ఉసెత్తుకుంటారు. ఉసెత్తు కోలాటం మారిన తరువాత ఆటను, పాటను ఇత్తయ్యకు తద్ధిమిత్త అని జట్టు నాయకు డిచ్చిన ముక్తాయింపుతో నిలుపుచేసి తరువాత ఇంకో పాటను. ఇంకో కోపును ప్రారంభిస్తారు. ఇలా బాగా అలిసిపోయేవరకూ కోపులు ఆడి, ఆ రోజుకు కోలాట ప్రక్రియను ముగిస్తారు. ఇదీ కోలాట మూలరూపం.

## కోలాటానికి కొన్ని కావాలి :

కోలాట ప్రక్రియకు, జట్టు. జట్టు నాయకుడు, ఆటగాడు, గరిడి - ఉద్ది — కోపు, ఎత్తుగడ - ఉసెత్తు - ముక్తాయింపు - ఇంతేగాక కోలాట కర్రలు, గజ్జెలు - అందెలు - కొరడా - వాయిద్యాలు, వెలుగు సాధనాలు కోలాటానికి పనికి వచ్చే వస్తువులు.

జట్టు, జట్టునాయకుడు :

కోలాటం ఆడే ఆటగాళ్ళందరినీ కలిపి జట్టు అంటారు. జట్టు అంటే గుంపు లేక సమూహమూ అని అర్థం చెపుతారు. ఈ జట్టులోని ఆటగాళ్ళు జట్టు నాయకుడు ఉంటారు. జట్టులో సభ్యులు సరి సంఖ్యలోనే వుంటారు. బృంద సభ్యులందరూ గురువు చెప్పే మాటకు కట్టుబడి క్రమశిక్షణతో మెలగుతారు.

జట్టు నాయకుణ్ణి కోలన్న పంతులనీ, పెన్నుద్ది అనీ, ముందు పాటగాడనీ, అయ్యవారనీ, మేళగాడనీ వివిధ పేర్లతో పిలుస్తారు. గరిడీ ఏర్పాటు చేయడానికీ,



ఆట ముగించటానికీ, జట్టు నాయకుడిచ్చే సంజ్ఞలమీదే ఆధారపడి వుంటుంది. గరిడీకి స్థలాన్ని నిర్ణయించడంలోనూ, ప్రారంభించటానికి సమయం నిర్ణయించ టానికీ ఆయనకే అధికారం.

జట్టునాయకుడు....లయ, తాళం, పాటలు, ఆట బాగా తెలిసినవాడై యుండాలి. వికలాంగులు జట్టు నాయకుడుగా పనికిరాడు. ఆరోగ్యవంతుడైనవానినే జట్టు నాయ కునిగా ఎన్నుకుంటారు. కోలాట జయప్రదానికి జట్టునాయకుడే ముఖ్యుడు.

ఆటగాళ్ళు ఇరవై మంది నుంచి, నలభై మందివరకూ వుంటారు. వీరు సరి సంఖ్యలోనే వుంటారు. ప్రతి ఆటగాడూ రంగు రంగుల కోల కర్రలతో, కాళ్ళకు గజ్జెలతో, రంగు రంగుల చొక్కాలతో, పంచెలతో చూడముచ్చటగా వుంటారు. సామాన్యంగా వెలుపలగాని, గ్రామ మధ్యలో వున్న ఖాళీస్థలాల్లోగాని గరిడిని ఏర్పాటు చేస్తారు.

## ఉద్ది :

ఉద్ది అంటే జత. సమానులుగా వుండే సముదాయం, జట్టు, సాంగత్యం, చెలిమి అనే అర్థాలు. జత, జంట అనేవి రూపాంతరాలు....ఎదిరి, పోటీవాడు. సమానము - సాటి - అనే అర్థాలున్నాయి. అంటే ఇద్దరు ఆటగాళ్ళను కలిపి ఉద్ది అంటారు. కోలాటంలో ఇలాంటి కొన్ని వుద్దులుంటాయి. ఉద్దిలోనివారిని ఉద్దికాడు అని అంటారు. ఏకవచనంలో ఉద్దివాడు, ఉద్దికాడు అంటారు, అంటే జతకాడు; చెలికాడు, మిత్రుడు అనే అర్థాలు కూడా వున్నాయి. ఉద్దికాళ్ళందరిపైన ఉండేవాణ్ణి పెన్నుద్ది లేక జట్టునాయకుడు అంటారు. కానీ కోలాటంలో జట్టు అంతకీ ఒక పెన్నుద్ది వుంటాడు. అందుకే అతనిని జట్టు నాయకుడూ అంటారు. జట్టు నాయకుని ఆజ్ఞమేరకు కోలాటంలో ఈ ఉద్దీు ఏర్పడటం. విడిపోవటం జరుగుతుంది. ఉద్దీ ఉగా ఏర్పడిన తరువాతనే ఆటలో కర్రలు కలపటం మొదలు పెడతారు.

## కోపులు :

కోపు అంటే నాట్యం, నాటకం, తీర్పు. నాట్యగతి విభేదం, ఆట, నాట్యగతి విశేషం అనే అర్థాలున్నాయి. కోలాటంలో అనేకమైన గతి భేదాలనే కోపులంటారు. ఈ కోపులకు పాటలోని మొదటి చరణాన్ని బట్టీ, గతికి తగ్గ భావంతోనూ, పురాణ పురుషులైన కృష్ణ, రామ మొదలైనవారి పేర్లతో పేర్లు పెడతారు.

ప్రాంతాలను బట్టి కోపుల పేర్లు మారుతూ వుంటాయి. పలనాటి సీమలో ప్రార్థన కోపు - ఉద్ది తిరుగుడు కోపు - వరగత్తెర కోపు - కృష్ణకోపు - చెలియ కోపు - కంస కోపు - జడకోపు - భారత కోపు - భామకోపు - లాలికోపు - లంకె కోపు - కలువరాయ కోపు మొదలైనవి వున్నాయి.

కోలాటంలో పాటనూ, పాటతోపాటు ఆటనూ మొదలుపెట్టటం ఎత్తుగడ అంటారు. అందరూ వలయంగా ఏర్పడి దేవతలకూ, దేవుళ్ళకూ, రాజకీయనాయకులకూ జై కొట్టి, వారివారి కిష్టమైన ప్రార్థనలుచేసి-ఇట తయ్యకు తాధిమిత, అనడంతో ఆట ప్రారంభమౌతుంది—ఎత్తుగడ నుంచి పాట ఆటవేగాన్ని పుంజుకుంటుంది.

## ఉసెత్తుకోవడం :

కోలాటంలో రెండవ కాలం నుంచి మూడో కాలానికి వెళ్ళడాన్ని ఉసెత్తుకోవటం అంటారు. అప్పటివరకూ నెమ్మదిగా చిరుతలు కొడుతున్న ఆటగాళ్ళు ఒక్క-

సారిగా హుషారుగా, ఎగురుతూ, పాడుతూ, పాటకనుకూలంగా అడుగులువేస్తూనే కోలాటం వేయటాన్ని ఉసెత్తుకోవటం అంటారు. దీనినే త్వరితం ఉసి - దుడుకు అని కూడా అంటారు. ఇలా ఆటలో ఉసెత్తుకోవడం ప్రేక్షకులను ఎంతో ఆనంద పరుస్తుంది.

## ముక్తాయింపు :

ముక్తాయింపు అంటే పాట, ఆట. ఒక దశకు చేరిన తరువాత ఆటను తెగగొట్టడం అంటారు. సామాన్యంగా ఇటతయ్యకు తాధిమిత, అనే చరణాన్ని గాని, — కిటకిటతయ్యకు తద్ధిమిత అనే చరణాన్ని గాని వాడుతారు. ఈ చరణాన్ని



ముక్తాయింపు చరణం అంటారు. తరువాత మరొక ఎత్తుగడలో మరొక పాట, మరలా ఉసి, తరువాత ముక్తాయింపు. ఇలా కోపు కోపుకు ఎత్తుగడ, ఉసెత్తు ముక్తాయింపులు వుంటాయి.

## కోలాట సామగ్రి :

కోలాట కర్రలు మొదట సన్నగాను, మధ్యలో ఉబ్బెత్తుగానూ, చివర సన్నగానూ వుంటాయి. పట్టుకోవడానికి వీలుగా పిడివుంటుంది. ఈ కర్రలను చేవగలిగిన బిల్లుడు - చంద్ర, ఏపె - రేల - టేకు - ఏగెస మొదలైన జాతుల చెట్లనుంచి కర్రలను ఎంచుకుంటారు.

ఈ కోలాటపు చిరుతలను చక్కగా చిత్రికపడతారు. పిడివద్ద అందెలనూ, కోలచివర గజ్జెలనూ ఏర్పాటుచేస్తారు. కోలాటం వేసేటప్పుడు వీటి ధ్వని మధురంగా వుంటుంది.

ఆటగాళ్ళందరూ కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. కొన్ని ప్రాంతాల్లో జట్టు నాయకుడు కొరడాను భుజాన వేసుకుని ప్రదర్శనలో క్రమశిక్షణను పాటించని వారికీ, తప్పుచేసిన వారికీ ఈ కొరడా పక్కలో బల్లెంగా వుంటుంది. ఒక్కొక్కసారి అందరినీ హెచ్చరించడానికి మధ్యమధ్యన చెళ్ళుమనిపిస్తాడు.

అలాగే కోలాట బృందం మధ్యలో వాయిద్యగాళ్ళుంటారు. వారు మద్దెలనూ, హార్మోనియం, తప్పెట, తాలు మొదలైనవాటిని హంగుగా ఉపయోగిస్తారు. అలాగే కోలాట బృందం ఉత్సాహంగా నృత్యంచేసే సమయంలో, బృంద నర్తకుల్ని ఉత్సాహపర్చట కోసం రంగుల గులామునూ, పూలనూ, గంధాన్నీ, పన్నీరునూ చల్లుతారు.

## రాత్రి ప్రదర్శనం :

రాత్రీ, పగలూ కోలాట ప్రదర్శనాలు జరుగుతూ వుంటాయి. ముఖ్యంగా రాత్రి ప్రదర్శనంలో గరిడి మధ్యలో ఒక పొడవైన కర్రను పాతి, పెట్రోమాక్సు లైటును పెడతారు. ఆ కాంతిలో బృందమంతా కనబడుతుంది. పూర్వం వెలుతురు కోసం కాగడాలనూ, ఆముదపు దీపాలనూ, కిరసనాయిలు పెద్ద బుడ్లనూ వాడేవారు. ఇప్పటికీ మారుమూల పల్లెల్లో ఈనాటికీ ఈ విధానాన్ని అనుసరిస్తున్నారు.

## ఆటగాళ్ళ అలంకరణ :

ముఖ్యంగా వుత్సవ సమయాల్లో ప్రదర్శనాలు జరిగేటప్పుడు ఆటగాళ్ళందరు ఎంతో అందంగా అలంకరించుకుంటారు. పూర్వపు రోజుల్లో ఈ అలంకరణ విశిష్టంగా వుండేది. అందరూ జుట్లు పెంచి ముడివేసి ముడిపైన పూలు పెట్టేవారు. మరికొంతమంది ఒకేరకంగా గిరజాలజుట్లు పెంచేవారు. మెడలో కంటెలూ, చెవులకు పోగులూ, చేతులకు వెండి మురుగులూ, కాళ్ళకు గజ్జెలూ, మోకాళ్ళ క్రింది వరకూ ఎగకట్టిన రంగుల పంచెలూ, నుదుట కుంకుమబొట్టు నడుముకు కట్టునూ కట్టేవారు. కానీ ఈనాటి కోలాట బృందాలు సగంమంది ఒక రంగు దుస్తులు ధరిస్తే సగం మంది మరో రంగు దుస్తులు ధరిస్తున్నారు.

## జడకోపు కోలాటం :

సమ సంఖ్యలో అందరూ, అన్ని త్రాళ్ళు పట్టుకుని గుండ్రంగా నిలుస్తారు. వీరు రెండు పక్షాలుగా చీలుతారు. రెండు పక్షాలకూ ఇద్దరు నాయకు లుంటారు.

వారు లయ ప్రకారం రెండు భాగాలుగా నిలబడిన కేంద్రం నుంచి మరో కేంద్రానికి ఒకరి తరువాత మరొకరు వరుస క్రమంలో తిరగడంతో ఈ త్రాళ్ళన్నీ అల్లబడిన జడలాగా ఎంతో సుందరంగా కనబడుతుంది.

ఇలా జడను అల్లడం ప్రారంభించి, జడ పూర్తి అయ్యేవరకూ పాట పాడుతూ అల్లుతూనే వుంటారు. ఈ అల్లికలో ఏ ఒక్కరు తప్పుగా నడిచినా, జడ చిక్కుపోతుంది. అందువల్ల ప్రతిఒక్కరూ వరుస తప్పకుండా నిపుణతతో జడను అల్లుతారు.

ప్రారంభంలో ఈ జడను అల్లడం నిదానంగా సాగుతుంది. తరువాత అతి వేగంగా అల్లబడుతుంది. ఈ వేగంలో కోలాట నృత్యం ప్రేక్షకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇలా జడకోపు పూర్తి అయిన తరువాత అందరూ ఒక పుష్పాకారంలో దగ్గరకు చేరుకుంటారు. ఆ తరువాత జడను ఎలా అల్లుతారో అలాగా మరలా ఎదురు తిరగి జడను విడదీస్తారు.



జడను అల్లినంతకష్టం వూడదీయటంలో వుండదు. విడదీయటం అతివేగంగా జరుగుతుంది. ఈ విధానం ఎంతో కనుల పండువుగా వుంటుంది.

## జడకోపులో బాలికలు :

ముఖ్యంగా జడకోపు కోలాటం బాలికలు వేయడం ఎంతో ఆనందంగా వుంటుంది. బాలికల్లో ఒకే ఎత్తు కలిగినవారిని కోలాటానికి ఎంచుకుంటారు. అందరూ వాలుజడలువేసి రంగురంగుల పూలు ధరిస్తారు. ఒకే రంగుగల లంగాలు, చొక్కాలు తొడుగుతారు. రంగు రంగుల కోలాటపు చిరుతలు ధరించి వలయాకారంగా తిరుగుతూ వుంటే ఇంద్రలోకంలో దేవతలు నృత్యం చేస్తున్నారా అనిపిస్తుంది.

గొంతులు కలిసిన ఇద్దరు బాలికలు పాట ప్రారంభిస్తే దళంలోని బాలికలందరూ ఒక్కసారిగా, గుమ్మగా అందుకుంటారు. ఇలా పాడే బృందగానం, చెవుల కెంతో ఇంపుగా వుంటుంది. వీరి జడకోపు ప్రదర్శనం శాస్త్రయుక్తమైన భరతనాట్యంలో ఒక భాగంగా కనిపిస్తుంది. ఈ కోలాట నృత్యాన్ని ఒక వ్యాయామ క్రీడగా, ప్రతి సాయంత్రమూ డ్రిల్లు క్లాసులో వేయిస్తూ వుండేవారు. బాలికల కోలాటంలో ఆ రోజుల్లో ఇలా పాట పాడుతూ వుండేవారు.

పాట

అటవి స్థళముల కరుగుదు మా
వటపత్రంబులు కోయుదు మా
చందన గంధము తీయుదు మా
సఖియజాకి మెడ పూయుదు మా
కోలాటంబులు వేయుదు మా
కోరిక తీరంగా మనము.

ఈ విధంగా బాలికలు పాటలు పాడుతూ నృత్యం చేస్తూ ప్రేక్షకులందర్నీ ముగ్ధుల్ని చేస్తారు.

అలాగే మరి ఒక పాట గరుడాచల యక్షగానాన్ని చెంచులక్ష్మి - నరసింహ స్వామి సంతానాన్ని పోలిన పాట తెలంగాణా కోలాటంలో భార్యా భర్తల మధ్య జరిగే సంఘర్షణను సంవాద రూపంలో చిత్రిస్తారు.

భార్యా భర్తల సంవాదం - కోలాట కీర్తన

భర్త: గట్టూకు బోయి నేను - కట్టె దెమ్మంటె
కొప్పూకున్నా పూలు - ఎక్కడవె భామ - నీ
కొప్పునున్న పూలు - ఎక్కడివె భామ
ఆత్తేరి పూలు ఎక్కడివె భామ
ధూత్తేరి పూలు ఎక్కడివె భామ

భార్య: గాలి ధూళి వచ్చి - గంపంత మబ్బొచ్చి
కొమ్మ వూగి కొప్పు - నిండింది మొగడా
నాతోడు రంకాడలేదు - అమ్మతోడు రంకాడలేదు.

భర్త: అన్నీ సరేకాని - ఇన్ని సరేకాని
చెంపనున్న కాట్లొ ఎక్కడివె భామ?
ఆత్తేరి కాట్లు ఎక్కడివె భామ
ధూత్తేరి కాట్లు ఎక్కడివె భామ.

భార్య: కోమటోరింటికి - కొబ్బెరికి బోతేను
తక్కెట్లో గుండొచ్చి - తగిలింది మొగడా

తక్కెట్లో గుండొచ్చి - తగిలింది మొగడా,
నాతోడు రంకాడలేదు - అమ్మతోడు రంకాడలేదు.

ఇలా ఎన్నో కోలాటపు పాటలు కోకొల్లలుగా వున్నాయి.

చుట్టుకోపు :

గోపిక, కృష్ణుల సంవాదం

గోపిక: గొల్లవారి వాడలాకు కృష్ణమూర్తీ
నీవేమి పనులకొచ్చినావు కృష్ణమూర్తీ ॥గొల్ల॥

కృష్ణుడు: పాలు కొనవచ్చినానె గొల్లభామ
మంచి పాలు పోసి పంపించు గొల్లభామా ॥గొల్ల॥

గోపిక: కొత్త కోడలనయ్యా నేను కృష్ణమూర్తీ
మా అత్తగారి నడుగుమయ్యా కృష్ణమూర్తీ ॥గొల్ల॥

కృష్ణుడు: కొత్త కోడలైతే నేమి గొల్లభామ
రొక్కమిస్త పుచ్చుకోవె గొల్లభామా

ఇలా సంవాదాలతో చుట్టుకోపు కోలాటం జరుగుతుంది.

ఇలా సాగిన ఆలాటి కోలాటాలు 1942 తరువాత కొత్త మలుపును సంతరించు కున్నాయి.

ఖండ ఖండాంతరాల భరతమాతా ॥నీవు॥
ఖ్యాతిగన్న తల్లివమ్మ భరతమాతా ॥నీవు॥

అంటూ దేశభక్తిని ప్రబోధించారు. కోలాటం ఒక సమిష్టి నృత్యం. అది ఒక సమిష్టి బృందగానం. అది ఒక వ్యాయామ క్రీడ. ఈ కోలాట నృత్యాలను ఈనాడు తిరిగి పునరుద్ధరించాల్సిన ఆవశ్యకత ఎంతో వుంది.



# ఉరుమును మించిన
# ఉరుముల నృత్యం

చితికి జీర్ణమైపోయిన అనేక జానపదకళా రూపాలు ఈనాడు మనకు కనబడకుండా కనుమరుగై పోయాయి. అలా కనుమరుగైన కళారూపాలలో ఉరుముల నృత్యం ముఖ్యమైంది. తలలకు అందంగా రుమాళ్ళు చుట్టుకుని మెడల్లో కాసుల దండలు



ధరించి ఎఱ్ఱనివీ, పచ్చనివీ శాలువలు కప్పుకుని, నిలువు అంగీలు ధరించి, పల్లవేరు చెట్టు కర్రతో తయారుచేసిన ఉరుములకు చర్మపు మూతలు మూసి, కదర పుల్లలతో వాయించుకుంటూ దేవాలయ ప్రాంగణాల్లో, ఉరుముల నృత్యం చేస్తూ వుంటారు. ఉరుము అనే పేరునుబట్టి వాయిద్య ధ్వని ఉరుమును పోలి వుండవచ్చును. అందువల్ల వాటికి ఉరుములు అనే నామకరణం చేసి వుండవచ్చును.

రాయల కాలంలో :

విజయనగర సామ్రాజ్య కాలంలో వీరికి మాన్యాలు ఇచ్చినా కాలక్రమేణా అంతరించిపోయి, ప్రస్తుతం కులవృత్తిని నమ్ముకుంటూ పొట్టగడవని స్థితిలో డెబ్బై కుటుంబాల దాకా ఉరుములవారు అనంతపురం జిల్లాలో వున్నారు. వీరిని ఉరుము లోళ్ళు అని కూడా పిలుస్తారు. వీరు మాలతెగలో ఎక్కువగా వున్నారు.

ఉరుము అనబడే చర్మ వాయిద్యం అతి ప్రాచీనమైంది. ఆదిమజాతుల నర్తన రూపంలో వలయాకార విన్యాసాలు చేస్తూ ఉరుములతో భయంకరమైన శబ్దాలు సృష్టిస్తూ, వీరుచేసే నాట్యం అతిగంభీరంగా వుంటుంది.

ఉరుముల వాయిద్యం ఒకేసారి ఏకథాటిగా వాయిస్తే కారుమొయిళ్ళు ఉరుములతో పయనిస్తున్నట్లు భ్రమ వ్యక్తమౌతుంది. అందుకే ఆ వాయిద్యానికి ఉరుము అని పేరుపెట్టారేమో ననిపిస్తుంది.

ఒకచేత వీరణం యొక్క చర్మాన్ని ప్రేముపుల్లతో రాస్తూ ఈ శబ్దాలు సృష్టిస్తారు. మరో చేతితో పుల్లతో లయ విన్యాసాలు తాళయుక్తంగా సాగుతాయి.

వీరి ఆరాధ్యదైవం శ్రీశైల మల్లన్న. ఆయన మహాత్మ్య గాథలు ఉరుముపై దరువులు వేస్తూ గానం చేస్తారు. చరణానికీ చరణానికీ మధ్య ముక్తాయింపులతో గంభీరమైన శబ్దాలు సృష్టించి వలయాకార విన్యాసాలు చేస్తారు.

### వాయిద్యపు తీరు :

వాయిద్యాన్ని ఈ విధంగా ప్రారంభిస్తారు.

బూర్ బూర్ బూర్ బూర్
డబు డబు డబు డబు
యిరడడ్డ బూర్ బరడ్డ్
డబు డబు డబు డబు

అని వాయిస్తూ పుల్లలతోనే చేతులెత్తి ప్రేక్షకులకు నమస్కారం చేసి పరాకు పరాకు అనే వచనాన్ని పల్లిస్తారు. తరువాత డప్ డప్ డప్; డప్ డప్ డప్; డప్ డప్ డప్ అంటూ వాయిస్తూ అందరూ వలయాకారంగా వుంటూ రెండుకాళ్ళను పెనవేసుకుంటూ శరీరాన్నంతా వూపుతూ ఎగురుతూ నృత్యం చేస్తారు. ఒక్కొక్క ధ్వనికి ఒక్కొక్క ఎగురు ఎగురుతూ మధ్య మధ్య, ఆహా, ఓహో అంటూ ఉరుములను ఉధృతంగా వాయిస్తారు.

### కుంకాలాట :

ఉరుములు వాయిస్తూనే కుంచెల నృత్యం చేస్తారు. దీనిని కుంకాలాట అంటారు. నెమలి ఈకలతో కుంచెల్ని తయారు చేసుకుంటారు. ఈ కుంచెల్ని రెండు చేతులతో తలమీద వుంచుకుని వరుసగా నిలబడతారు. వీరు బావిలో మునిగి స్నానం చేసి వస్తారు. ఉరుము వాయిద్యం సాగుతుండగా కళ్ళు మూసుకుని

వుంటారు. ఉరుములోళ్ళు వారికి పూనకం తెప్పించటానికి ఉరుముల వాయిద్యాన్ని దద్దరిలచేస్తూ ఇలా మేలుకొలుపు పాట పాడుతారు.

మేలూకొనవే వో మేలుకొనవే
అమ్మ నీవు పుట్టక ముందేనాడూ
యిగమూ లేడూ జగము లేడు. ॥మే॥

అమ్మ మచ్చు మాయల వో గంగి నీవూ
పీనిగెలు తినే పిశాచివో
సామి గంగలేని వో తానమేలేదు. ॥మే॥

గంగలేని వో జలకమ్మేలేదు
సామీ నీవు పుట్టకముందేనాడూ
నరుడులేడు నారాయనుడే లేడు. ॥మే॥

పాట అవగానే కుంచెలు పట్టుకున్నవారంతా వూగటం ఒక్కొక్క అడుగు వెనక్కి ముందుకు వేయటం చేస్తుండగా చుట్టూ చేరిన జనం బండారు కుంకాన్ని చల్లుతారు. పూనకంలో వున్నవారు వాయిద్యానికి తగినట్లు అడుగులు వేస్తారు. అలా అడుగులు వేసివేసి అలసిపోయిన వారి నోటిలో ఒక నిమ్మపండు నోట్లో పెడతారు. కుంచెలు పట్టుకున్న వారిమీద బండారు కుంకాన్ని చల్లుతారు. గుడ్డలన్నీ రక్తసిక్తమై, వారంతా యుద్ధవీరుల్లాగా కనిపిస్తారు. ఈ భంగిమల్లో కొన్ని అద్భుతంగా, రౌద్రంగా అనిపిస్తాయి. కంటి గ్రుడ్లను పెద్దవిచేస్తూ, భ్రమ అభినయిస్తారు. ఉరుములోళ్లు గట్టిగా, ఏయ్, జోహో ఓహో అంటూ లయాత్మకంగా అరుస్తారు. అదొక వీర నృత్యమనీ ఆ నృత్యానికీ, పేరణికీ చాలా పోలికలున్నాయని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు వారి జానపద నృత్యకళలో ఉదహరించారు.

ఇలా వారు గంగ కథను ఎక్కువ చెపుతారు:

పరాకు పరాకు యచ్చరిక పరాకు
మనవాలకించు మందన పుడితివమ్మ
మాయారి గంగ
దొడ్డన పుడితివమ్మ - దొనకొండ గంగ
గంగలేని తానంబు లేదు
గంగలేని జలకమ్ము లేదు

గంగలేని వుతకమ్ము లేదు
గంగలేని నంది లేదు
నీవులేని తలము లేదమ్మ
పన్నెండు అత్తాలు గలవు
బాగిరతి నలవీర గంగవో హహెూ

ఇలా పాడుతూ చివరికి

పెద్దల కిచ్చిన వరము చిన్నలకి తప్పనంటివి
చిన్నల కిచ్చిన మాట శిశుబాలలకు తప్పనంటివి
శిశుబాల కిచ్చిన మాట కసికందులకు తప్పనంటివి
మనవాలకించు మాయదండ మెప్పో.



పై పాట పాడుతున్న సమయంలో అప్పుడప్పుడు అడుగులు ముందుకు వేయటం, వెనక్కి వేయటం చేస్తూ వారి ఆంగిక చలనానికి అనుగుణంగా ఉరుమును మలుచుకుని వాయిస్తూ వుంటారు. మరో పాటలో,

నేనే వస్తారా బీరన్నా, నేనే వస్తారా, కన్నతండ్రి
నల్లగొర్ల నేను మందాయిలోన నమ్మకాలు నేనే చెబుతాను
నేనే వస్తారా బీరన్నా నీకు నేనే వస్తారా. ॥నేనే॥

ఇలా కథను నడుపుతూ దరువులు వేస్తూ నృత్యం చేస్తూ కథను సాగిస్తారు.

పతాక సన్నివేశం :

ఉరుములు వాయిద్యం భీకరంగా సాగే సమయంలో చుట్టూ మూగిన ప్రేక్షకులు తెల్లపోయి చూస్తూ వుంటారు. ఉరుముల వాయిద్యాల హోరును తట్టుకోలేని వారు దూరంగా నుంచుంటారు.

పూనకం వచ్చి వూగిపోయే వారిని చూసి ప్రేక్షకులు అరుపులతో, కేకలతో అట్టహాసం చేస్తారు. నిజంగా దేవతే పూనిందన్నంత భ్రమలో మునిగిపోతారు ప్రేక్షకులు. ఈ సమయంలో వురుములోళ్ళు చేసే హావభావాలు చూడవలసిందే కాని వ్రాయ నలవికాదు.

చివరగా వురుములోళ్ళు కథను పూర్తిచేసి మంగళం పాటలో ఒక్కొక్క దేవత పేరు చెపుతూ, రెండు చేతులెత్తి మ్రొక్కుతారు. మంగళం పాటపాడి గంగమ్మ తల్లికి భక్తితో నమస్కారం చేసి నృత్యాన్ని పూర్తి చేస్తారు.

ప్రతిసారీ మంగళం పాడుతూనే తమ నృత్యం ఆపుతారు. గేయంలో అనేక మంది దేవతల్ని వేడుకొంటారు. చరణాలన్నీ పాడే సమయంలో, పల్లవి ఎత్తుకునే సమయంలో ఒక రకమైన లయలో పాడటం వుంటుంది. ఈ పల్లవిని ఎత్తుకునే సమయానికి ముందుగా ఒక్కొక్క దేవత పేరు చెప్పటం, రెండు చేతులెత్తి మ్రొక్కటం చేస్తూ వుంటారు. కథా కార్యక్రమం అంతా పూర్తి కాగానే బండారు బొట్టును నుదుట పెట్టుకుని దండం పెట్టుకుని వెళ్ళిపోతారు.

కళాకారులు :

ఈనాడు అనంతపురం జిల్లాలో వురుముల కథల్లో పాల్గొనే కళాకారులు ఉరుముల నారాయణ — ఉరుముల నారాయణస్వామి — వురుముల నాగన్న — ఉరుముల చంద్రప్ప — ఉరుముల ఆంజనేయులు మొదలైనవారు కళను ప్రచారం చేస్తూ, దేవతల కొలుపులు చేయిస్తూ జీవితాలను సాగిస్తున్నారు. ఇలా ఉరుములోళ్ళు ధర్మవరం, సుబ్బరావుపేట, ముస్టూరు, గూగూరు, మేడాపురం, రేగాటిపల్లె మొదలైన చోట్ల వున్నారు. ఈ మాదిరి ఉరుముల బృందాలు ఆంధ్రదేశంలో మరెక్కడా లేవు.



# హరిదాసుల సంక్రాంతి విన్యాసాలు



తెలుగు ప్రజలకు అన్ని పండుగలకంటే మకర సంక్రాంతి చాలా పెద్ద పండుగ. అది నెలరోజుల పండుగ, సంవత్సరమంతా కష్టించుకున్న పంట లక్ష్మిని ఇంటికి తెచ్చుకున్న కష్టజీవులైన రైతులందరూ ఆనందోత్సాహాలతో జరుపుకునే పెద్ద పండుగ.

## సంక్రాంతి శోభలు :

ధనుర్మాసం నెలరోజులూ గ్రామాలన్నీ శోభాయమానంగా వుంటాయి. ప్రతి ఇంటిని అలికి సున్నాలుకొట్టి సుందరంగా అలంకరిస్తారు. నెలరోజులూ ఇళ్ళ ముందు రంగురంగుల రంగవల్లులను తీర్చి దిద్దుతారు. యువకులందరూ కోడిపందాల సరదాతో కోడిపుంజులను తయారుచేస్తారు.

జానపద కళాకారులు రైతులను ఆశ్రయించి, వారి నానందపర్చి పారితోషికాలు పొందుతూ వుంటారు. ముఖ్యంగా హరిభక్తులు హరిభజనలతో బయలుదేరి వూరంతా చుట్టి వస్తారు.

## సంక్రాంతి సంకేతం, హరిదాసులు :

ముఖ్యంగా సంవత్సర కాలంలో ఎప్పుడూ కనిపించని సంక్రాంతి హరిదాసులు కనిపిస్తారు. వీరు ధనుర్మాసం నెలరోజులూ వారి భక్తి పాటలతో ప్రతి ఇంటినీ పావనం చేస్తారు. తెల్లవారి ఆరుగంటలకే స్నానంచేసి కాషాయ వస్త్రాలను

ధరించి ముఖానికి నామాలు దిద్దుకుని మెడలో పూలదండలను రుద్రాక్షమాలలను ధరించి నెత్తిమీద నామాలతో పూలతో అలంకరించిన అక్షయ పాత్రను నెత్తిమీద పెట్టుకుని, భుజంమీద తంబురాను మీటుకుంటూ ఒకచేతితో చిరుతలతో తాళంవేస్తూ, శ్రావ్యంగా పాటలు పాడుతూ గజ్జెలు కట్టిన కాళ్ళతో, పాటకు తగిన నృత్యంచేస్తూ హరిలోరంగహరి అంటూ బయలుదేరి ప్రతి ఇంటిముందూ పాట పాడుతూ నృత్యం చేస్తూ వుంటే, ఇంటి ఇల్లాలుగాని, పిల్లలుగాని, ఫలపుష్పాదులతో దోసెడు బియ్యాన్ని తీసుకువస్తే, హరిదాసు వినమ్రతతో మోకాటిమీద కూర్చుని అక్షయ పాత్రలో వేయించుకుంటూ వారిని పుత్ర పౌత్రాభివృద్ధిగా దీవించి మరో ఇంటికి సాగిపోయి, ఇలా వూరంతా పూర్తిచేస్తాడు.



తన్మయత్వంతో పాడే పాటలు :

ఇలా ఇంటింటికీ తిరుగుతూ తన్మయత్వంతో పాడే పాటల్లో ఎక్కువగా రామదాసు పాటలనే ఇలా పాడేవారు.

అదిగో భద్రాద్రీ, గౌతమి అదిగో చూడండీ
ముదముతొ సీతా రామముదిత లక్ష్మణుల
కలిసి కొలువగా రఘుపతి యుండెడి ॥అదిగో॥

**అలాగే**

ఏ తీరుగ నను దయచూచెదవో
యినవంశోత్తమ రామా, నాతరమా
భవసాగర మీదను నళినదళేక్షణ రామా ॥ఏ॥

**అలాగే**

ఏమిరా రామా, నావల్ల నేరమేమిరా రామా
ఏమిరా రామ యిలాగు కష్టము
నీ మహిమో నా ప్రారబ్ధమో
కుండలిశయన వేదండ రక్ష
శాఖండ తేజ నాయకుండవే ॥ఏమిరా॥



**అలాగే**

పలుకే బంగారామాయెనా
కోదండపాణి పలుకే బంగారామాయెనా
పలుకే బంగారమాయె పిలిచిన పలుకవేమి
కలలో నీ నామస్మరణ, మరువ చక్కని తండ్రి ॥పలుకే॥

**ఇలా భక్తితన్మయత్వంతో పాటలు పాడుతూ గ్రామ పౌరులను పరవశుల్ని చేస్తారు.**

ఎందరో హరిదాసులు :

ఇలా ఒక్కరు కాదు. ఇద్దరు ముగ్గురు హరిదాసులు కూడా కోలాహలంగా వూరంతా వారి గానంతో ముంచెత్తుతారు. ఇలా వచ్చిన ప్రతి హరిదాసుకూ, భిక్షను అందచేస్తారు....ఇలా నెలరోజులూ తిరిగి సంవత్సరానికి సరిపడ గ్రాసాన్ని సంపాదించుకుంటారు. వీరంతా బయట వూరినుంచే వస్తారు. వార్షికంగా ప్రతి వూరికీ ఎవరెవరు వస్తారో వారు తప్పా ఇతరులు రారు. ముఖ్యంగా ఇలా వచ్చే వారిలో; విష్ణుభక్తులైన సాతానులు....దాసరులు, రాజులు మొదలైనవారు ఇలా జీవిస్తూ వుంటారు.

గ్రామవీథుల్లో హరిదాసు లిలా హరిభజనచేయడం కోలాహలంగా వుంటుంది. హరిదాసుని అక్షయపాత్రలో బియ్యం వేయటానికి....బాలబాలికలు పోటీలుపడతారు. హరిదాసు లిలా ప్రతి ఇంటిముందూ కూర్చుని లేవటం చాలా కష్టమైన పని, అయినా భక్తిభావంలో అదంతా మరిచిపోతారు.

హరిదాసులతోపాటు, సంక్రాంతి పర్వదినాలలో, గంగిరెద్దులవారు, బుడబుక్కలవారు, పగటి వేషధారులు, గారడీవాళ్ళు, ఎందరెందరో జానపద కళాకారులతో, కళాకాంతులతో కన్నులపండువుగా సంక్రాంతి పర్వదినాలు ముగుస్తాయి. పంటను ఇంటికి తెచ్చుకుని కళకళలాడే రైతు కుటుంబాలు సంక్రాంతి సంతోషంలో అందర్నీ ఆదరిస్తారు.



# కోనసీమ కోలసంబరం

తెలుగు కళారూపాల్లో ఒక ప్రాంతంలో ప్రచారంలో వున్న కళారూపం మరో ప్రాంతంలో లేదు. ఒకో కళారూపం ఒక జిల్లాకే పరిమితమైన కళారూపాలు కూడా వున్నాయి. అలా చూసుకున్నప్పుడు తూర్పు గోదావరి జిల్లాలో ఈ కోల సంబరం ప్రచారంలో వుంది.

తిరుపతి తీర్థయాత్రలకు వెళ్ళివచ్చినవారు సంతోషంగా దీపారాధన జరిపి కొందరు వెంకటేశ్వర ప్రసాదాన్నిచ్చి విందు భోజనాలు ఏర్పాటు చేస్తారు. మరి కొందరు ఈ కోల సంబరం కథను ఏర్పాటు చేస్తారు.

తిరుపతి వెళ్ళివచ్చినవారు దీపారాధన రోజున రాత్రిపూట ఈ కథను ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనానికి కొబ్బరాకుల పందిరిని ఏర్పాటుచేస్తారు. కథకులు ఇద్దరుంటారు. నుదురుమీదా, భుజాలమీదా, రొమ్ముమీదా, చేతులమీదా, పెద్ద పెద్ద నామాలను ధరించి, నూనెగుడ్డలు చుట్టబడిన రెండు కోలలను వెలిగించి, రెండు కోలలనూ త్రిప్పుతూ, ఓరోరి వెంకన్న. ఓరి వెంకన్న అని పాడుతూ వుంటే; వీరికి వంతలుగా పెద్ద ధ్వనినిచ్చే పెద్ద తాళాలను వాయిస్తూ వంత పాట పాడుతూ వుంటే, ఒక వ్యక్తి వీరి మధ్యలో ఒకరు ఒక చేతిలో పేము బెత్తాన్నీ, రెండవ చేతిలో నెమలి ఈకల కట్ట పట్టుకుని. రంగస్థలంలో, వెనక్కూ ముందుకూ నడుస్తూ, అంగ విన్యాసంచేస్తూ....జనరంజకంగా కథను సాగిస్తారు. రంగస్థలంలో మామూలు లైట్లు వున్నా, వెలిగించిన కోలల కాంతి కూడా మంచి వెలుతురునిస్తుంది. చెప్పే కథ తిరుపతి వెంకన్నకు సంబంధించిన కథ. ఇది మామూలుగా పురాణాల్లో వున్న వెంకటేశ్వరుని కథ కాదు. అలిమేలుమంగమ్మ, బీబీనాంచారమ్మ, వెంకన్న బాబుల ప్రణయానికి సంబంధించింది. విరహంతో కూడిన భిన్నమైన జానపద కథ అని పడాల రామకృష్ణారెడ్డిగారు ఉదహరించారు. తెలుగు ప్రజలు ఇదే నిజమైన కథ అని నమ్మి ఎంతో ఆసక్తితో విని ముగ్ధులౌతారు. ఈ కథను కేవలం కథగానే చెప్పటంకాక, మధ్య మధ్యలో సునిశితమైన హాస్యాన్ని ప్రవేశపెడతారు. కోలను త్రిప్పే అతను మధ్య మధ్య కథను ఆపి విచిత్రమైన ప్రశ్నలు వేసి వాటికి తగిన సమాధానాలను రెండవ వానితో చెప్పిస్తాడు. ఈ ప్రశ్నలు సమాజ జీవితానికి సంబంధించి వుంటాయి. ఇవి ఒకప్రక్క నవ్వులతో ప్రేక్షకులను రంజింప చేయడంతోపాటు విజ్ఞానపరుస్తూ సామాజిక బాధ్యతలను తెలియచేస్తాయి. దానితోపాటు భక్తితత్వాన్ని ప్రబోధిస్తూ వుంటాయి. ఈ కోలసంబరం కథలు ఉభయ గోదావరి జిల్లాలలో ఎక్కువగా ప్రదర్శిస్తారు.

## మానాటి గొల్లల కథ :



కోలసంబరం అనే జానపద కథారూపం ప్రాచీనమైనది. ఇది మానాటి గొల్లలచే ప్రారంభించబడింది. ఆ కులంలో జన్మించిన గొల్ల అచ్చమ్మ అనే స్త్రీ ఈ కథను గానం చేసేది. తూర్పు గోదావరి జిల్లా పెనికేరు దగ్గరలో వున్న కీలకచర్ల ఈమె స్వగ్రామం.

నేటికి షుమారు రెండువందలఏభై సంవత్సరాల క్రిందట ఈవిడ ఈ కథను గానంచేసేది. అచ్చెమ్మగారు చనిపోయిన తరువాత....ఆమె దగ్గర కథ నేర్చుకున్న వెల్లగ్రామ నివాసి అయిన చిక్కాల కోటయ్యకాపు నేర్చుకుని వెల్లగ్రామానికి తీసుకు వచ్చాడు. కోటయ్యద్వారా ఆయన కుమారులు పట్టాభిరామన్న, జానకిరామయ్యలు నేర్చుకున్నారు. వీరిద్వారా మిగిలినవారు ఈ కథాగానాన్ని నేర్చుకున్నారు.

## కథకురాలు, అచ్చమ్మ :

పూర్వం గొల్ల అచ్చమ్మగారు, తిరుపతి క్షేత్రం నడచివెళ్ళేటప్పుడు ఈ కథను స్వంతంగా అల్లుకుని పాడుకుంటూ వెళ్ళేది. ఒకసారి ఆమెతో కూడా చిక్కాల కోటయ్య కూడా వెళ్ళడం జరిగింది. కోటయ్యతోపాటు, పెద్దాపురం వాస్తవ్యులైన పెనుమాళ్ళ గోవిందు, బోడిసెట్టి నరసన్న మొదలైనవారు కలిసి వెళుతూ కథను ఆకళింపు చేసుకున్నారు.

తిరిగివచ్చిన కొంతకాలం తరువాత గొల్ల అచ్చెమ్మగారి అవసానదశలో చిక్కాల కోటయ్యను పిలిచి....సంబరానికి సంబంధించిన....కోలలు....నెమలికుచ్చు బెత్తము....తాళాలు మొదలైన సామానులిచ్చి, ఈ కథను ప్రచారం చేయవలసిందిగా కోరింది.

నాటినుంచి ఈనాటివరకూ ఈ కథను గానం చేస్తున్నారు. వీరిద్వారా వెల్లి గ్రామంలో చాలామంది ఈ కథను నేర్చుకుని కథాగానాన్ని చేస్తూ జీవనాన్ని సాగిస్తున్నారు.

## కోలసంబరం పేరెందుకొచ్చింది :

కోలసంబరం అనే వెంకటేశ్వరస్వామి కథ చాలా వ్యాప్తి చెందింది. కోలలు వెలిగించి చెప్పేటటువంటి కథ కాబట్టి, దీనికి కోలసంబరం అని పేరు వచ్చింది. ఈ కోలసంబరం అనే ఈ కథాబృందంలో అయిదుగురుంటారు. పైగా ఒక మనిషి కూడా వుంటాడు. ముందుభాగంలో ఇద్దరు కోలలు పట్టుకుంటారు. వెనుక నిలబడిన ఇద్దరూ, కథకుడు పాడిన పాటకు వంతపాడుతూ వుంటారు. వెనుక వంతదారులు తాళాలు వాయిస్తూ వుంటారు. ముందు కోలలు పట్టుకున్నవారికీ, వెనుక వంత పాడేవారికి మధ్య కథకుడు కథను చెపుతూ వుంటాడు. ఈ కథకుని గురువు అని పిలుస్తారు. ముందుభాగంలో నిలబడిన ఇరువురూ, హాస్యం చెపుతూ వుంటారు.

## ఏడుగురు అన్నదమ్ములు :

వెంకటేశ్వరుని అన్నదమ్ములు ఏడుగురు. వెంకటేశ్వరుడు చిన్నవాడు. శ్రీనివాసులు అని కూడా పిలుస్తూ వుండేవారట. శ్రీ ని వా సు లు తిమ్మరాజు పేరిందేవిల ఏడవ మగబిడ్డ. శ్రీనివాసునియొక్క సోదరుల పేర్లు 1. గోవిందరాజులు, 2. పెన్నాడ వెంకన్న (శ్రీకాకుళం జిల్లా), 3. ఉప్పాల వెంకన్న (పిఠాపురం తాలూకా), 4. బెండపూడి వెంకన్న, 5. యానాం వెంకన్న, 6. వాడపల్లి వెంకన్న, 7. ఆఖరివాడుగా శ్రీనివాసుడు జన్మించాడట. కాని ఈ ఏడుగురు అన్నదమ్ముల కంటె ముందు విజయవాడలో వేంచేసియున్న కనకదుర్గ, తిమ్మరాజు, పేరిందేవిల మొదటి సంతానమనీ ఈ కథనుచెప్పే కొంతమంది గురువులు చెపుతూ వుంటారు.

## తిరుపతి వెంకన్న :

అందరిలోకి చిన్నవాడైన వెంకటేశ్వరుడు, తల్లిదండ్రులను విడిచిపెట్టి తిరుపతి కొండకుచేరి ఆ కొండమీదే దేవాలయాలు కట్టించుకున్నాడనీ, పద్మావతినీ, బీబీనాంచారిని వివాహం చేసుకుని, తిరుపతి కొండమీదే నివాసం ఏర్పరుచుకుని శిలా విగ్రహాలుగా మారిపోయారని కథను పూర్తి చేస్తారు.

కోలసంబర ప్రదర్శనంలో అందరూ మగవారే పాల్గొంటారు. రాత్రి ఎనిమిది లేక తొమ్మిది గంటలకు కథను ప్రారంభించి ఉదయం ఆరు గంటల వరకు ఈ సంబరం చేస్తారు. ఈ కథను చెప్పేవారిలో ఒకనికి పూనకం వస్తుంది. పూర్వం ఈ సంబరంలోకి ఆబోతును తీసుకువచ్చి సంబరం అయిన తరువాత ఆబోతును ఊరి మీదికి వదలిపెట్టేవారు. కానీ ఈనాటి ప్రదర్శనాలలో ఆబోతును తీసుకురావడంలేదు.

## బృందాల సంబరాలు :

చిక్కాల కోటయ్య సంబరాలు చేసేరోజుల్లో ఆబోతుని సంబరంలోనికి తీసుకువచ్చేవారు. కోటయ్య చనిపోయి ఇప్పటికి షుమారు నూరు సంవత్సరాలైంది.

ఈనాడు కథలుచెప్పే బృందాలు నెలకు ఆరు కథలకు తక్కువ కాకుండా చెపుతారు. ఒక్కొక్క గురువుకూ నెలకు సరాసరి ఆరు వందల రూపాయలు ఆదాయం వస్తుంది. వెల్లగ్రామంలో షుమారు ఏభై బృందాలవరకూ వున్నాయి. వెల్లగ్రామం తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాలో వుంది.





## ఆసువిద్యకు ఆలవాలం

# వాలకం

ఈ నాటికీ పల్లెటూళ్ళలో, వారి వాలకం చూడు, వారి వాలకం ఏమీ బాగాలేదు, వాళ్ళ వాలకం ఏమిటో తెలియడం లేదు. అయ్యో వాలకం చూడు, వాడి వాలకం తగల బడ్డట్టుంది. అనడం సర్వసాధారణంగా అందరికీ తెలిసిందే. వాడి వాలకం చూడు అనే సంబోధనలో, వాడి వైఖరి చూడు అన్న అర్థం మనకు స్ఫురిస్తుంది.

అయితే ఈ వాలకం అనేది ఒక కళారూపంగా వర్ధిల్లినట్లూ, అది బహుళ వ్యాప్తిలో ఒకనాడున్నట్లూ అవి అన్నిచోట్లా ప్రచారంలో లేకపోయినా, ఈ నాటికీ విశాఖపట్టణం జిల్లాలో వాలకం....కళారూపం ప్రచారంలో వున్నట్లు రాంభట్ల కృష్ణ మూర్తి గారు నాట్యకళలో ఉదహరించారు.

### వాలక మంటే:

వాలకం ఒక రకంగా ఆశువిద్య. నలుగురు నటులు రంగంమీదికి ప్రవేశించి, అప్పటికప్పుడు ఏదో ఒక విషయాన్ని ఊహించుకునో, కల్పించుకునో, ఆశువుగా సంభాషణల్ని కూర్చుకుని అభినయిస్తారు. ఈ పద్ధతి పాశ్చాత్య దేశాలలోనూ, మన దేశంలోనూ పలుచోట్ల దీనిని ఎక్స్ టెంపోర్ నాటకంగా ప్రదర్శిస్తున్నారు. ఒక రకంగా ఆలోచిస్తే ఇది విశిష్ట కళారూపమే. ఆశువుగా ఒక విషయాన్ని కళాత్మకంగా చిత్రించి దానిని పరిష్కరించడం ప్రతిభావంతమైన విషయం. న్యాయానికి ఇది ఒక అవధాన ప్రక్రియలాంటిది.

### వీధి ప్రదర్శనం:

ఇది వీధి ప్రదర్శనమే. దీనికి పెద్ద రంగస్థల హంగులూ అవీకూడా అవసరం లేదు. ఎత్తుగా వున్న దిబ్బ రంగస్థలంగా ఉపయోగపడుతుంది.

వాలకం యొక్క ఇతివృత్తం సమకాలీన సమస్యలకు సంబంధించి వుంటుంది. జటిల హీన సాంఘిక సమస్యలకు పరిష్కారాలను కూడా చూపిస్తుంది. సంభాషణలు అతి చాతుర్యంగానూ, హాస్య ప్రధానంగానూ, చతురోక్తులతో కూడినవిగా కూడా వుంటాయి. ముఖ్యంగా యక్షగానం, వీథి నాటకాలలో మాదిరి విదూషకుడు ఎక్కువ ప్రాధాన్యం వహిస్తాడు. ఈ కళారూపంలో వాలకం విజ్ఞానదాయకమైన, వినోదాత్మకమైన విశిష్ట కళారూపం. సంఘంలో వున్న కుళ్ళును అద్దం పట్టినట్లు చూపించి, ప్రేక్షకులకు కనువిప్పు కలిగిస్తుంది. పై అధికారుల నుండి పల్లెటూరి అధికారుల పెత్తందారుల వరకూ అందరి అవకతవక బ్రతుకుల్ని ఎండ కడుతుంది. అయితే ఈ ప్రదర్శనాన్ని ఎవరుబడితే వారు ప్రదర్శించడం కష్టమే. ఎందుకంటే ప్రదర్శించే వారికి సమయస్ఫూర్తీ, చాకచక్యం చాలా అవసరం. అదీగాక వ్రాతపూర్వకమైన ఇతివృత్తాలు లేకపోవడంవల్ల ఈ కళారూపం విస్తృతమైన వ్యాప్తిలోకి రాకపోయి వుండవచ్చును. ఏది ఏమైనా ఈ కళారూపం యొక్క సంప్రదాయాన్ని రక్షించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

రాంభట్లవారి వివరణ :

శరదృతువు రాగానే పల్లెల్లో గవిరమ్మ సంబరాలు జరుగుతాయి. గవిరమ్మ సంబరాల్లో ఊరి మధ్య ఘటాలు నిలుపుతారు. ఘటాల కెదురుగా ఆరు బయలులో జనమంతా వలయాకారంగా గుమికూడతారు. వాలకాలు మొదలయ్యే ముందు మూర్ఖుడైన కోడెగా డొకడు మండుతున్న తాటాకు మొలకు కట్టుకుని లంకా దహనం చేసే హనుమంతునిలా అల్లెలోకి ఉరుకుతాడు. అల్లెంటే వలయాకారంగా గుమికూడియున్న జనం మధ్యలోకి అనుకోవచ్చును.

కమ్మ వాలకం ప్రారంభం :

అల్లెలో దూకిన మూర్ఖుడు గవిరెమ్మ అమ్మవారి ఘనతనీ, సంబరాల ప్రాముఖ్యాన్నీ పాడిపంటల సంపదలనూ, సమృద్ధినీ గ్రామంలోని పెద్ద భక్తులు, పెద్ద నాయుళ్ళు, పెద్ద సెట్ల ప్రతిభను చదువుతూ అల్లెలో గిర్రున తిరుగుతూ గుంపుచేత గుండ్రంగా పెండె కట్టిస్తాడు. యవ్వనంలో వున్న పడుచు యువతుల్నీ వయసులో వున్న కోడెగాళ్ళను హెచ్చరిస్తూ పరాచికాలు ఆడుతూ, మొలకు కట్టుకున్న మండే తాటాకులతో జనంలోని వారిని ఒక్కొక్క చురక అంటిస్తాడు. తాటాకు చురక

అంటించటానికి వీలులేని గ్రామ పెత్తందార్లను మాటలతోనే చురకవేస్తాడు. దీనికి కమ్మ వాలకమని పేరు.



తాటాకులు కట్టటం :

ఈ నాటికీ తెలుగుదేశంలో ఎవరినైనా ఎద్దేవా చేయాలన్నా, ఫలానావాడిని వీథి లోకి లాగాలన్నా, నలుగురిలోనూ వాణ్ణి నవ్వులపాలు చేయాలన్నా, ఎదుటివాణ్ణి మూర్ఖుణ్ణి చేసినప్పుడు వాడికి తాటాకులు కట్టారనీ, కమ్మ కట్టారనీ, ఫలానావాడు తాటాకులు కట్టించుకున్నాడనీ గేలిచేయడం రివాజైపోవడం మనకు తెలిసిందే. ఆ

రివాజు ఈ వాలకం నుంచే పుట్టిందంటారు రాంభట్ల కృష్ణమూర్తిగారు. (నాట్యకళ, జానపదకళోత్సవ ప్రత్యేక సంచికలో)

అసలే మూర్ఖుడు, అందులో తాటాకులు కట్టించుకున్నాడు. ఇతగాడి రంగ ప్రవేశంతో ఇతర వాలకాలుకట్టే కోడెగాళ్ళకు జంకూ గొంకూ పోతుందట. తాటాకు మండినంతవరకే ఈ వాలకం జరుగుతుందట. మంట ఆరిపోగానే కొరివిని ఎవరికైనా కొట్టేసి గుంపును చీల్చుకుని జర్రున చీకటిలో కలిసిపోతాడట వాలకంగాడు.

## నిష్క్రమణ, ప్రవేశం :

కమ్మ వాలకం నిష్క్రమించగానే, మరో వాలకం వెంటనే రంగ ప్రవేశం చేస్తుంది, ఈ వాలకాలలో అనేక రకాలున్నాయి కొన్ని ప్రయోజనం కలవీ, మరి కొన్ని కేవలం వినోదాత్మకాలు. ప్రధానంగా ఈ రెండే ప్రాముఖ్యం వహిస్తాయి.

విదూషకులు, పగటి భాగవతులు ప్రదర్శించే అరవై నాలుగు జాతీయాల లాగే ఈ వాలకాలు కూడా అరవై నాలుగు జాతీయా లంటారు రాంభట్లవారు. అయితే విదూషకుల వృత్తి పెద్ద దొరలకు వినోదం కలిగించడం, వారి మెప్పు పొందటం, వారి పారితోషికాలు అందుకోవడం, అందువల్ల అవి పెద్ద ప్రయోజనం కలవి కావు. ఈ వాలకాలు సామాన్య ప్రజలు కట్టేవి.

## అల్లెలోకి కోడెగాడి ప్రవేశం :

ఒక కోడెగాడు అల్లెలోకి వస్తాడు. ఆహార్యం అలంకరణా ప్రత్యేకంగా లేక పోయినా, ఆ నడకా, ఆ వాలకం, అదీ చూసి అతగాడు కరణం అని అంతా ఇట్టే పోల్చుకుంటారు.

ఏంవోయ్ అప్పలస్వామి! బొత్తిగా ఔపించడం లేదేంవిటి? అన్న ప్రశ్నతో ఆ మాట తీరూ, ఆ నొసటి విరుపూ అచ్చం కరణంగారే అని ముసి ముసి నవ్వుల మధ్య వాక్యాలు వెలువడతాయి.

## వాలకాల ఇతివృత్తం :

కరణంగారు పన్నుల పంతులు. పన్నులు వేసేవారు సంపన్నులు. పన్నులు కట్టేవారు ఆ పన్నులు. గాలివీస్తే పన్ను, ధూళివీస్తే పన్ను అని పన్నుల పన్నాలు చదువుతాడు కరణం, కరణంగారి దస్తు ముందు, సర్కారు వారికి శిస్తు తర్వాత ఇదీ

కరణంగారి లెక్క, సెట్టిగారి మాయకొలతలు, నాయుడుగారి రంకెలు, భుక్తగారి బూకరింపులు, ఇల్లుపట్టిన భగతమ్మ మణి ఆచారపు హడావుడి అన్నీ వాలకాలకు ఇతివృత్తాలే.



ప్రతి ఏడూ గ్రామకరణం రాపిడికీ, భుక్తగారి దోపిడికీ అణగారిపోయిన ప్రజలు ఆనాడు ఆ ఆటలో అద్భుతమైన చురక లంటిస్తారు. ఇలా ప్రతి సంవత్సరం గవిరమ్మ సంబరాలూ, రసాత్మకమైన వాస్తవిక జీవితాలను ప్రతిబింబించే వాలకాలూ ప్రదర్శింపబడతాయి.

## నిజం చెప్పే నిజాయితీపరులు :

తాటాకులు కట్టుకుని మరొకరికి తాటాకులు కడుతూ, నా పేరు మూర్ఖుడని తనకు తానే ఎద్దేవా చేసుకుంటూ హేళన చేస్తారు. నిజానికి ఇలా ఎద్దేవా చేయడం, ధైర్యంతో కూడుకున్న విషయం, అయితే అమ్మవారి ముందు చెప్పటంవల్ల వాటిని గురించి ఎవరూ అంతగా పట్టించుకోలేరు.

మనకు తెలిసిన తొలి నాటకం వాలకమే నంటారు రాంభట్లగారు. త్రిపుర దహనం అయిన తరువాత గెలిచినవారు ఓడినవారిని ఎద్దేవా చేస్తూ త్రిపురదహన వాలకం కట్టారని చెప్పవచ్చు నంటారు.

ఉదాహరణగా కూచిపూడి భాగవతులు వీర నరసింహరాయల కొలువులో సిద్ధ వటం సామంతుడు సంబెట గురవరాజు దురంతాలను కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించి ఆ ప్రజాకంటకుని తొలగించిన ప్రదర్శనం వాలకంలాంటిదే.

సమాజానికి సంబంధించిన సాంఘిక కట్టుబాట్లనూ, గ్రామ జీవితాన్ని ఖాతరు చేయని ప్రజా కంటకుల్ని అమ్మవారి ముందూ, ప్రజల ముందూ వారి గుట్టుమట్టుల్ని చీల్చి చెండాడుతారు వాలకం ప్రదర్శనంలో.

తాటాకులు కట్టటం లాంటి మాటలను బట్టి ఒకనాడు వాలకం, తెలుగునాట నాలుగు చెరగులా ప్రదర్శింపబడి వుండవచ్చు. ఈనాడు ఈ వాలకం ఒక్క విశాఖ జిల్లాలో అందునా, ఎక్కడో మారుమూల గ్రామాల్లో నామమాత్రావశిష్టంగా వుండి వుండవచ్చు.

అయితే ఈనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ, అస్తవ్యస్థ పరిస్థితుల్లో జానపద కళారూపమైన ఈ వాలకాన్ని పునరుద్ధరించడం ఎంతైనా అవసరం. ఉత్సాహవంతులైన యువకులకు ముఖ్యంగా కళాశాల విద్యార్థులకు ఎంతో అను కూలంగా వుంటుంది. అందుకు వుదాహరణ, బాదల్ సర్కారు వ్రాసిన నాటకం, విశాఖపట్టణం కళాజ్యోత్స్న వారు ప్రదర్శించే ఊరేగింపు నాటిక వాలకం లాంటిదే.

ఆశువుగా ప్రదర్శించే ఈ కళారూపం అవధానాలు ఎంతటి ప్రజారంజకంగా వుంటాయో, ఈ వాలకాలు కూడా అంతటి ప్రజా రంజకాలుగా వుంటాయి.



# గంభీర నినాదం రుంజ వాయిద్యం

ఆంధ్ర దేశంలో అన్ని జానపద కళారూపాలతో పాటు, ఈ రుంజ వాయిద్య కళా రూపం కూడ విశిష్టమైంది. అయితే ఈ కళారూపం ఆంధ్ర దేశంలో అన్ని ప్రాంతాలలోనూ వున్నదని చెప్పలేం. కాని విశ్వబ్రాహ్మణులు ఏ మూలనున్నా ఈ కళారూపం వారి దగ్గరకు చేరేది.

విశ్వబ్రాహ్మణులను ఆశ్రయిస్తూ వారిని ఆరాధిస్తూ వారిపై ఆధారపడినవారు రుంజ వారు. రుంజ అనే వాయిద్య పరికరానికి రౌంజ అనే నామాంతరం కూడా వుంది. దీనికి సంబంధించిన ఒక కథ ఈ విధంగా ప్రచారంలో వుంది.



రౌంజకాసురుడు :

ఈ రుంజ కథ త్రేతాయుగానికి చెందినదని చెపుతారు. ఆ కాలంలో పార్వతీ పరమేశ్వరుల కళ్యాణం జరిగిందనీ, అప్పుడు వాయిద్య విశేషాలు ఏమీ లేవనీ, అందువల్ల పార్వతీదేవి కళ్యాణానికి, వాయిద్యాలు కావాలని విశ్వకర్మను కోరెననీ, అప్పుడు విశ్వకర్మ రౌంజకాసురుడనే రాక్షసుని సంహరించి, వాని చర్మాన్ని రుంజగా చేసి, సప్తతాళాలనూ, ముప్పైరెండు వాయిద్యాలనూ ఈ రుంజపై పలికించాడనీ,

ఈ రుంజ వాయిద్యంతోనే పార్వతీదేవి కళ్యాణం రంగరంగ వైభోగంగా దేవత లందరూ కలిసి చేశారనీ విశ్వకర్మ పురాణంలో వివరించబడింది.

## రుంజ :

రౌంజకుడనే రాక్షసుని చర్మాన్ని రుంజ వాయిద్యానికి వినియోగించడంవల్ల, రౌంజ అనే పేరు ఏర్పడి, కాలక్రమేణ అది రుంజగా రూపాంతరం చెందింది. రుంజను ఇత్తడితో తయారుచేస్తారు, ఈ వాయిద్యాన్ని బలమైన కఱ్ఱపుల్లలతో వాయిస్తారు. ఏటవాలుగా ముందుకు వంచి, కదలకుండా మోకాలితో అదిమిపట్టి, చేతులతో త్రాడులను లాగి, శ్రుతిచేసి, తాళం ప్రకారం వరుసలతో ఉధృతంగా వాయిస్తారు. రుంజ వాయిద్యకులను రుంజవారని పిలవటం కూడా వాడుకలో వుంది.

రుంజ వాద్యకులు ఒకవేళ వ్యవసాయాన్ని కలిగి వున్నా, ప్రధానంగా రుంజ వాయిద్యాన్నే వృత్తిగా స్వీకరిస్తారు. బాల్యం నుంచీ, విద్యాభ్యాసముతో పాటు ఈ విద్యనుకూడా కట్టుదిట్టంగా నేర్చుకుంటారు. ప్రతివారూ ఈ విద్యలో ఉత్తీర్ణులై, గ్రామాలకు యాత్రలు సాగిస్తారు. సంసారాలతో పాటు ఎడ్లబండ్లలో బయలుదేరుతారు. నిత్యజీవితానికి కావలసిన వంట పాత్రలు మొదలైన వాటిని కూడా వారితోనే వుంచుకుంటారు.

ఏ గ్రామానికి చేరుకున్నా వారు విశ్వ బ్రాహ్మణులను మాత్రమే యాచిస్తారు. విశ్వబ్రాహ్మణులు వీరిని ఎంతగానో ఆదరించి వారికి ధన ధాన్యాలను దానం చేస్తారు. రుంజ వాద్యకులు, వారి వాయిద్యాలతో, గానంతో, కథలతో వారిని రంజింపచేస్తారు. సంగీత శాస్త్రానికి సంబంధించిన సప్తతాళాల్నీ, ముప్ఫైరెండు రాగాలనూ వారి ప్రదర్శనాల్లో ప్రదర్శిస్తారు.

రుంజ వాయిద్యకులు ఒక గ్రామానికి వచ్చారంటే, ముందుగా భేరీ మోతలతో రుంజ వాయిద్యాన్ని ఉధృతంగా గమకాలనిస్తూ వాయించడంతో రుంజ వారు గ్రామంలోకి వచ్చారనేది అందరికీ అర్థమైపోతుంది.

## పల్లెలో ప్రదర్శన :

గ్రామంలో ప్రవేశించిన రుంజవారు ఒక రాత్రి విశ్వబ్రాహ్మణులకు కథను వివరిస్తారు. పంచ బ్రహ్మలను గురించీ, వారియొక్క వంశోత్పత్తిని గురించీ

చెపుతూ, పాంచ భౌతికమైన ఈ శరీరం యొక్క అస్థిత్వాన్ని గూర్చి, పంచభూతముల యొక్క విధులనూ వివరంగా వివరిస్తారు.

పంచబ్రహ్మలంటే మనువు, మయ, త్వష్ట, శిల్ప, విశ్వజ్ఞ మొదలైనవారి విధులను గురించి ఈ విధంగా వివరిస్తారు.

మనువుకు ఇనుప పనీ, వద్దు కర్రపనీ, త్వష్టకు ఇత్తడి పనీ, శిల్పికి రాతి పనీ, విశ్వజ్ఞునికి బంగారుపనీ ఈ విధంగా వేరు వేరు విధులను వివరిస్తారు. తరువాత ఓంకార స్వరూపాన్ని స్తుతిస్తారు.



వారు చెప్పే కథలు పార్వతీ కళ్యాణము, దక్షయజ్ఞము, విశ్వగుణా దర్శనము, వీరభద్ర విజయం, విశ్వకర్మ, బ్రాహ్మణ వంశాగమనము, దేవబ్రాహ్మణ మాహాత్మ్యము, మూల స్తంభము, సనారి విశ్వేశ్వర సంవాదము, విశ్వప్రకాశ మండలము మొదలైన వాటిని కథలుగా చెపుతారు. వీటన్నిటికీ పద్దెనిమిది ఆశ్వాసాలు గలిగి సంస్కృత శ్లోకాల మయమైన, తాళపత్ర గ్రంథం, మూల స్తంభం ఆధారమని చెపుతారు.

ఉదాహరణకు వారి అంబాస్తుతి ఈ విధంగా వుంటుంది.

అంబాస్తుతి (కాంభోజి రాగం)

కంబుకాంధారీరాయాం
కాశీం హరీం రాం
బీంబోధారీం రాం
అంబుజాక్షీవేలా ॥అంబా॥

ముజ్జగము లేలేటి
మోక్షదాయీ మహమ్మాయీ
సజ్జన రక్షాగాల్
గజ్జలు ఘల్మనంగ ॥అంబా నీవిందు రావే॥

అని మోక్షదాయకమైన ముజ్జగము లేలు మాతను స్మరించి తరువాత చేతులతో ఒక తాళాన్ని వాయిస్తారు. ఆ తరువాత పంచముఖోద్భవ బ్రహ్మలనూ, వారివారి విధులనూ, శ్రోతలకు వివరిస్తారు. ఈ ప్రపంచాన్ని విశ్వకర్మ రక్షిస్తున్నాడంటూ సకల విశ్వం యొక్క కర్తవ్యాన్ని సంక్షిప్తంగా వివరిస్తారు. అలాగే

ఇండ్లు కట్టేదెట్లో - పెండ్లి చేయుట యెట్లో
కృషి యెట్లో శకటాద్రి క్రీడ లెట్లో
కూప ఖననం బెట్లో - ఘోర సార్జన మెట్లో
పాకంబులెట్లో - జలపాత్ర లెట్లో
దేవతార్చన లెట్లో - దేవాలయము లెట్లో
భార్యకు నగలెట్లో - పండమంచము లెట్లో
మంగళసూత్రము - మద్దెలెట్లో
నిజము మాచేతి - పనులనన్నిటిని లెన్స
వివరముగ లెక్కపెట్టగ యెవరి తరము
తెలివిగలిగి కృతజ్ఞులై తెలియవలయు
శాశ్వత పదాభిలేశ - విశ్వప్రకాశ

అంటూ, ఈ పదంలో పంచముఖ బ్రహ్మలొనర్చే అనేకమైన పనులను వివరిస్తూ వీరు లేకపోతే జగత్తు జరగదనీ వివరిస్తూ వుంది.

పద్యాలనూ, శ్లోకాలనూ, తాళవాద్య గతుల్నీ, చిన్నతనం నుంచే వారి వారి పిల్లలకు నేర్పుతారు. అంతేగాక వారికి జీవనాధారం అదే గనుక ఈ విద్యను ఎంతో భక్తిభావంతో వారు నేర్చుకుంటారు.

వారి తాళగతి ఏ విధంగా వుంటుందో ఈ క్రింది ఉదాహరణ చూస్తే మనకు అర్థమౌతుంది.

1. తక్కు ధిక్కు - ధిక్కు తకధిక్కు తకయని
అంబుజాసనుడు తాళంబువేయ

అంటూ వేగంగా ప్రథమ, ద్వితీయ, తృతీయ, కాలాలలో తాళం వేస్తారు.

2. కిటతక ధిమ్మి కిటతక ధిమ్మి
కిటతక ధింధిమ్మి యనుచు
కనకాంబరుడు మృదంగమును గొల్పి
కిటతక ధిమ్మి యని చేతులతో ఘాతవేసి
తాళము చూపును మృదంగ ధ్వన్యనుకరణ చేయును.



3. సరిగస్స సరిగమ - పదనిస యని
వాణీ మహాదేవి వీణమీట

అని తాళము చూపును.

4. కకుందకు ధరికిట తుతుందక యని
వాణీ మహాదేవి శబ్దములు బాధ
తాండవము చేయుచుండె గురుతులు నెలదాల్చు

అవి చదివి వివిధ ధ్వనులతో చక్కగా మృదంగ వాయిద్యంలాగా వాయిస్తారని శేషం రామానుజాచార్యులుగారు నాట్యకళ పత్రికలో ఉదహరించారు.

ధ్వన్యనుకరణ పదాల్ని మౌఖికంగా చదివి ప్రయోగాత్మకంగా రుంజపై వాయిస్తారు. బ్రహ్మ, విష్ణు, సరస్వతీ దేవులు స్వరాలను తాళాలను మృదంగాలను వీణలపై చూపగా, మహేశ్వరుడు తాండవ నృత్యం చేశాడని తెలియచేస్తాడు.

శివతాండవం సందర్భంలో డమరుక ధ్వనిని వినిపించి మనోహరంగా హృదయతాండవం చేయిస్తారు. ఈ వాయిద్యపు శబ్దాలు మృదుమధురంగా వుంటాయి. మృదంగ ధ్వనిని అనుకరిస్తారు.

రుంజ వారిలో నిష్ణాతులైన కళాకారులు. ఇదే వాయిద్యాలపైన వివిధ ధ్వనుల్ని అనుకరించి వాయిస్తారు.

అంతే కాక మిలిటరీ సైనికుల బూట్ల చప్పుడు మాదిరిగాను, గుఱ్ఱం కాలి డెక్కల ధ్వని మాదిరిగాను, మార్చింగ్ బ్యాండు వాయిద్యంగాను, వీరంగం సమయంలో వాయించే డప్పు ధ్వనులను అత్యద్భుతంగా ఈ రుంజ వాయిద్యంలో వినిపిస్తారు.

తమ రుంజ వాయిద్య సందర్భంలో నాదబ్రహ్మను ప్రశంసించే ఈ క్రింది శ్లోకాన్ని కూడా వల్లిస్తారు.

శ్లోకం

చైతన్యం సర్వభూతానాం
నిర్వృతిర్జ గదాత్మనామ్
నాదబ్రహ్మ స్తదానందం
అద్వితీయ ముపాస్మహే.

ఈ విధంగా సంగీతం యొక్క ప్రాధాన్యాన్ని ఈ శ్లోకంలో వర్ణిస్తారు. తరువాత రుంజపై చేతితో అత్యద్భుతంగా ధ్వనులను పలికించి ప్రేక్షకులకు ఆనందాన్ని కలుగచేస్తారు.

అంతే కాక నాదబ్రహ్మను, ప్రణవస్వరూపాన్ని, అంబికా స్తవాన్ని సమిష్టిగా రాగ తాళ యుక్తంగా పాడుతూ, అపూర్వ సమ్మేళనాన్ని వివరిస్తారు.

## చెప్పే కథలు :

ఇలా ఒక గంట కాలం అనేక రకాలైన శ్లోకాలతో, పాటలతో, వచనాలతో, వివిధ రకాలైన ధ్వనులను వినిపించి, కథను పూర్తిచేస్తారు. వీరు చెప్పే కథల్లో

ముఖ్యమైనవి. మూల స్తంభం, పంచముఖ బ్రహ్మావిర్భావము, పార్వతీ కల్యాణము మొదలైన కథలను చెప్పటమే కాక, మధ్య మధ్య శ్రావ్యమైన కీర్తనల్ని పాడుతూ, వాయిద్య నైపుణ్యాన్ని రుంజపై పలికిస్తారు. మామూలుగా మన భాగవత కాలక్షేపాలలో, కథాంతంలో, మంగళ సూచికంగా, పవమానా సుతునిబట్టి పాదారవిందములకు అనే పారంపర్యంగా వచ్చే మంగళ హారతినే వీరూ అనుకరిస్తారు.

ఓం హ్రీం రాట్టుకూ మంగళం
ఓం హ్రీం రాట్టుకూ మంగళం
లోకమీసా లోకమనియా
లాకులేక కోక కరుణతో
వాక్కు తెలిసియు వాక్కు చేరవు
రాక లేకను రాకరాకృతి ॥ఓం॥

పంచతత్వ ప్రపంచములను
నది యెంత శిక్షించునో ఘనభువి
పంచదాయ లనేటి పంచ
బ్రహ్మల చాటించి పల్కె ॥ఓం॥

ఖ్యాతి కెక్కిన పోతులూరీ
దాతలింగా ప్రణమ బహ్మ
జ్యోతి బింబము కన్న మిక్కిలి
ప్రీతి లేదని నిలిచి కొలిచిన ॥ఓం॥

అని మంగళాశాసనం పాడి కథను ముగిస్తారు.

రుంజ వాయిద్యకులు త్రేతా యుగానికి చెందిన వారనీ, విశ్వకర్మ సృష్టించిన రుద్రమహేశ్వరుల సంతతివారనీ ఇతిహాసం తెలియచేస్తూ వుంది.

రుంజ కథకులు అక్కడక్కడ మచ్చుకు మాత్రమే కనిపిస్తారు. సర్కారాంధ్ర దేశంలో తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామంలో శ్రీ పాశంపాలలోచనుడు, జీడి కంటి సత్యనారాయణ అనేవారు ఈ నాటికీ రుంజ వాయిద్య కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. నానాటికి శిథిలమై పోతున్న రుంజ వాయిద్య కళారూపం విశిష్టమైనది. దీనిని పరిరక్షించాల్సిన అవసరం ఎంతో వుంది.



# ముద్దుల యెద్దుల
# గంగిరెద్దాటలు

గంగిరెద్దుల వాడు కావర మణచి
ముకుతాడు పొడిచి పోటెద్దులట్లు

అవి పలనాటి వీర చరిత్రలో శ్రీనాథుడు ఉదహరించడాన్ని బట్టి అతిప్రాచీన కాలం నుంచీ ఈ గంగిరెద్దాటలు ప్రచారంలో ఉన్నాయని తెలుసుకోవచ్చు.



డూడూ బసవన్నా ఇటురారా బసవన్నా
వురుకుతు రారన్నా రారన్నా బసవన్నా
అమ్మవారికీ దండంబెట్టు అయ్యగారికీ దండంబెట్టు
మునసబుగారికి దండంబెట్టూ
కరణంగారికి దండంబెట్టూ
రారా బసవన్నా, రారా బసవన్నా. అంటూ

ఈ ఇంటికి మేలు జరుగుతాదని చెప్పు, మంచి జరుగుతాదని చెప్పు అంటూ గంగిరెద్దులతో తలలను ఊపిస్తారు.

## ఒక నాటి కళారూపం :

ఒకనాడు దేదీప్యమానంగా వెలిగిన గంగిరెద్దాటలు వ్యాచకవృత్తిని అవలంబించినా అవి విద్వత్తును ప్రదర్శించే గంగిరెద్దుల మేళంగానూ, ప్రజలను వినోదపర్చి ఆనందింపచేసే కళారూపంగానూ ఖ్యాతివహించింది.

గంగిరెద్దుల మేళాలవారు, రెండు మూడు కుటుంబాలు కలిసి అయిదారు అందమైన బలిసిన గంగిరెద్దులతో దండుగా బయలుదేరి ఆంధ్రదేశంలో ఆ మూల నుంచి ఈ మూలవరకూ మకాంలు వేస్తూ జీవయాత్రలు చేసేవారు.

ఒకప్పుడు రాజులూ జమీందారులూ వారి వారి ప్రాంగణాలలో గంగిరెద్దుల ప్రవర్తనాన్ని ఏర్పాటుచేసుకుని వినోదించేవారు.

గంగిరెద్దులవారు ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలోకూడా వున్నారు. అయితే వారిలో ఎక్కువమంది తెలుగు భాషనే మాట్లాడుతారు.

వీరికి ఒక వూరనేదిలేదు. పర్వదినాలలోనూ, ముఖ్యంగా రైతులకు పంటలన్నీ చేతికివచ్చే పనిపాటలులేని సమయాల్లోనూ, సంక్రాంతి పండుగ దినాలలోనూ వీథుల వెంట బయలుదేరుతారు.

## ఆటను నేర్పటం :

వయసులో వున్న కోడెగిత్తల్ని తీసుకువచ్చి, వాటి ముక్కులకు ముకుతాడు పొడిచి వాటి పొగరుబోతుతనాన్ని అణగగొట్టి. వాటిని లొంగతీసుకుని, చెప్పినట్లు చేసేలా తయారుచేసేవారు. ఉదాహరణకు సర్కస్ జంతువులకు తరిఫీదు ఇచ్చినట్లు.

ఇలా వాటిని కొన్ని మాసాలపాటు మచ్చికచేసుకునేవారు. వాయిద్యానికి అనుకూలంగా అడుగులు వేయించటం, పరుగెత్తించటం, పడుకోబెట్టటం, అటూ ఇటూ దొర్లటం, మూడుకాళ్ళమీద నుంచో పెట్టటం, చిట్టి అడుగులతో నృత్యం చేయించటం, డూడూ బసవన్నా, రారా బసవన్నా అంటూ వాటిని పరుగులు పెట్టించటం, కొన్ని ప్రశ్నలువేసి వాటికి సమాధానంగా తల వూపించటం, సలాం చేయమంటే కాలు పైకెత్తి సలాం చేయటం, ఇలా ఎన్నో విద్యల్ని కొన్ని మాసాలపాటు నేర్పి వీథిలోకి తీసుకువస్తారు.

## గంగిరెద్దుల అలంకారం :

గంగిరెద్దుల్ని స్వంతబిడ్డల్లా చూస్తారు. వాటిని ఎన్నో రకాలుగా అలంక రిస్తారు. మూపురం వద్ద నుండి తోకవరకూ ఎంతో అందంగా రంగు రంగులతో కుట్టిన బొంతను కప్పుతారు. రంగులతో కొమ్ములను అలంకరిస్తారు. కొమ్ము చివర ధగధగ మెరిసే ఇత్తడి గొట్టాలను తొడుగుతారు. మూతికి తోలుతో కుట్టబడిన శికమారును కడతారు. నొసటి భాగాన అందమైన తోలు కుచ్చులను కడతారు. మూపురాన్ని రంగు పంచెతో అలంకరించి ఒక దండను దిగవేస్తారు. పొట్టచుట్టూ తగరపు పువ్వులతో కుట్టిన తోలు బెల్టును కడతారు. కాళ్ళకు గజ్జెలు కడతారు. అప్పుడు చూడాలి ఆ బసవన్నల అందం. సాక్షాత్తూ నందికేశ్వరుని పోలివుంటుంది.

## ఆడించేవారి హంగులు :

గంగిరెద్దులవారి హంగులు, శృతి సన్నాయి బూర, డోలు, చేతిలో కంచుతో చేయబడిన చిన్న చేగంట. వేషధారణలో నెత్తికి రంగుల తలగుడ్డ, మూతిమీద కోరమీసాలు, చెవులకు కమ్మల జోడు. వారూ వీరూ ఇచ్చిన పాత కోటు. భుజంమీద కండువా, చేతికి వెండి మురుగులు. నుదురున పంగనామంతో పైకిల్‌పంచ కట్టుకట్టి ఆకర్షణీయంగా తయారౌతారు.

## సుందర ప్రదర్శనం :

గంగిరెద్దుల వారికి ప్రతి వూరిలోనూ మధ్యనున్న పెద్ద బజారే వారికి రంగ స్థలం. ముందుగా గ్రామంలో ప్రవేశించి, గ్రామ పెద్దల నాశ్రయించి వారి అను మతితో ప్రదర్శనం ఏర్పాటు చేసుకుంటారు. ప్రదర్శనానికి ముందు వారి వాయిద్యా లతో రణగొణ ధ్వనులు చేసి ప్రజలను రప్పిస్తారు. ఆ రోజుల్లో గంగిరెద్దుల ఆటలంటే మహదానందంతో హాజ రయ్యేవారు.



ప్రేక్షకులందరూ మూగిన తరువాత గంగిరెద్దులను మేళతాళాలతో బరినంతా తిప్పుతూ స్వాగతం పలికిస్తారు. ఎద్దు నోటిలో మెడను ఇరికించి అదృశ్యాన్ని అందరికీ చూపిస్తారు. వాయిద్యానికి అనుకూలంగా గజ్జెల కాళ్ళతో నృత్యం చేసేది. పడుకోమంటే పడుకునేది, లేవమంటే

లేచేది, అయ్యగారికి దండం పెట్టమంటే నమ్రతతో తలవంచేది. అయ్యగారికి శుభం కలుగుతుందా? అనుకున్న పనులు జరుగుతాయా అంటే అవునన్నట్లు తల వూపుతుంది. వాడు అడిగిన ప్రతిదానికీ తలవూపడాన్ని బట్టే ఒక సామెత పుట్టిందనుకుంటా.

మనవాళ్ళు అంటూ వుంటారు. ఏమిటిరా అడిగిన ప్రతిదానికీ గంగిరెద్దులా తల వూపుతావు. నోటితో సమాధానం చెప్పరా అని. అది ఏనాడో పుట్టిన సామెత.

రామ లక్ష్మణులు :

ఈ ఎద్దులను రామ లక్ష్మణులుగా ఎంచి పేర్లుపెట్టి పిలుస్తారు. వాటిని బసవేశ్వరుడుగా పిలుస్తారు. రాముడుగా సీతగా ఎంచి కళ్యాణం జరుపుతారు. ప్రేక్షకులుకూడ వాటిని రామలక్ష్మణులుగా ఎంచి భక్తి భావంతో వాటికి ధాన్యాన్ని తినిపించడం, అరటిపళ్ళు పెట్టటం చేస్తారు. ఇలా గంటన్నర కాలం కనువిందుగా ప్రదర్శనం జరుగుతుంది.

గంగిరెద్దుల విన్యాసంలో మధ్య మధ్య పాటలు పాడతారు. వాయిద్యాలకు తగినట్లు వాళ్ళ పిల్లలతో మొగ్గలు వేయిస్తారు. మధ్య మధ్య ప్రేక్షకులను చూచి, సమయానుకూలంగా ఛలోక్తులను విసరుతారు.

అలాగే ప్రదర్శనం చూచి ముగ్ధులైన ప్రేక్షకుల నుంచి విరాళాలను దండుకుంటారు. బసవన్నా ఈ బాబు నీకు పది రూపాయ లిస్తున్నారంటే అక్కడికి పరుగెత్తుకొస్తుంది. రామన్నా ఈ బాబు నీ వీపుమీద కండువా కప్పుతా నంటున్నాడు. ఇలా పేరు పేరునా పిలిచి ప్రేక్షకులను మోమోట పెట్టి విరాళాలు గుంజుతారు.

తరువాత ఇంటింటికీ తిరిగి ధాన్యమూ బట్టలూ, డబ్బులూ ఎద్దులకు మేతా సంపాదించుకుంటారు. ఇలా ఎద్దులను బ్రతికిస్తూ, ఎద్దులద్వారా కళను బ్రతికిస్తూ తద్వారా వారు బ్రతుకుతూ దేశ సంచారం చేసేవారు. ఎద్దుల్లో ఏదైనా ఎద్దు చనిపోతే వారి బిడ్డల్లో ఒక బిడ్డ పోయినట్లుగా భావించి దానికి పూజలన్నీ జరిపించి భక్తిభావంతో ఖననం చేస్తారు.

అయితే ఈనాడు వీరి గంగిరెద్దుల విద్య క్షీణించిపోయి సామూహిక ప్రదర్శనాలు నశించి కేవలం పొట్టపోసుకోవడానికి ఒక ఎద్దుతో వూరూరా, ఇల్లిల్లూ తిరుగుతున్నారు. ఇలా కాలప్రవాహంలో సామూహిక గంగిరెద్దాటలు నశించి పోయాయి.

## గజాసురుడు, గంగిరెద్దుల వారు :

అసలీ గంగిరెద్దులవారి కథకు మూలమేమిటయ్యా అని ప్రశ్నిస్తే వారు చెప్పిన కథాంశాన్ని కె. వి. హనుమంతరావుగారు ఆంధ్రప్రభలో ఈ విధంగా వివరించారు.

పూర్వం గజాసురుడనే రాక్షసుడు శివుని కటాక్షం కోసం ఘోరమైన తపస్సు చేశాడట. శివుడు ప్రత్యక్షమై ఏమి కావాలని వర మడిగాడట। అందుకు గజాసురుడు మీరు నా గర్భంలో ప్రవేశించి, పూజలందుకోమంటాడట. అందుకు శివుడు అంగీకరించి అతని గర్భంలో ప్రవేశిస్తాడట. అంతర్ధానమైన పతిదేవుని జాడ తెలియక పార్వతీదేవి దుఃఖించి గజాసురుని గర్భంలో వున్నట్లు తెలుసుకుని పతిని విముక్తిని చేయమని విష్ణుమూర్తిని వేడుకుంటుందట. అప్పుడు విష్ణువు గంగిరెద్దుల మేళాన్ని రూపకల్పన చేశాడట. నందికేశ్వరుణ్ణి గంగిరెద్దుగా అలంకరించి బ్రహ్మాదిదేవతలతో వివిధ వాయిద్యాలను ధరింపచేసి, తాను మేళానికి నాయకత్వం వహించి - గజాసుర పురానికి చేరి గంగిరెద్దుల ఆటను నిర్వహిస్తాడట.

ఈ విషయం గజాసురుని చెవులబడి తన సమక్షంలో ఆ ఆటను ప్రదర్శించమని కోరతాడట. అందుకోసమే ఎదురుచూచిన విష్ణుమూర్తి అద్భుతంగా ఆటను నిర్వహిస్తాడట. గజాసురుడు ఆనందభరితుడై ఏం కావాలో కోరుకోమంటాడట.

తన పాచిక పారిందనుకున్న హరి....ఇది శివుని వాహనమైన నంది. తన స్వామికి దూరమై విలపిస్తూ వుంది. ఆ స్వామిని నంది కడకు చేరనియ్యి అని కోరతాడట.

ఆలోచనలోపడ్డ గజాసురుడు, ఇతను అసుర సంహారియైన చక్రధారి అనీ, ఇక తనకు మృత్యువు తప్పదనీ తెలుసుకున్న గజాసురుడు శివుని ప్రార్థించి, నందీశ్వరునికి ఎదురుగా నిలుస్తాడట.

అంతలో విష్ణుమూర్తి నందిని ప్రేరేపించగా, కొమ్ములతో గజాసురుణ్ణి కుమ్మగా గజాసురుని గర్భం నుండి శివుడు బయట పడతాడట.

ఆడినమాట తప్పని గజాసురుని శిరస్సు అన్ని లోకాల్లో పూజ లందుకుంటుందనీ, అతని చర్మాన్ని తాను మేన ధరిస్తాననీ చెప్పి శివుడు గజాసురునికి శివైక్యాన్ని ప్రసాదిస్తాడట. ఇదీ గంగిరెద్దులవారి కథ.



# విలక్షణ వీధి భాగవతం
# తూర్పు భాగవతం



ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిన వీధి భాగవతాలలో కూచిపూడి వీధి భాగవతాలు గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాయి. వీరేకాక గొల్ల భాగవతులూ, యానాది భాగవతులూ, మాలభాగవతులూ, చిందు భాగవతులూ మొదలైనవారు భాగవతాలను ప్రదర్శించారు.

## ఆనందగజపతీ, ఆదిభట్లవారూ:

పైవారే కాక ఉత్తరాంధ్రదేశంలో విశాఖపట్టణం, శ్రీకాకుళం, గంజాం, కోరాపుట్టి మొదలైన ప్రాంతాల్లో తూర్పు భాగవతమనే భాగవతం ప్రచారంలో వుంది. ఇది సామాన్య ప్రజానీకాన్నే కాక, పండితుల్ని, విద్వాంసుల్నీ, కవుల్నీ, గాయకుల్నీ ఆకర్షించడమే కాక అది ఒక విశిష్ట నర్తన రీతిగానూ, సంగీత సంప్రదాయంగానూ, మృదంగ బాణీగానూ ఈ నాటకం పోషింపబడుతూ వుందని శ్రీ గరిమెళ్ళ రామమూర్తి, శ్రీ డి. వై. సంపత్‌కుమార్‌గారలు తెలియచేస్తున్నారు.

ఇది పైన సూచించిన ఆ యా ప్రాంతాలలో తిరునాళ్ళలోనూ, అమ్మవారి జాతర్లలోనూ, ఈ భాగవతాలు ప్రదర్శింపబడి ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి. పండితులైన హరికథా పితామహుడు అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు, ఆనంద గజపతి మహారాజులాంటి కళాపోషకుల ఆదరాభిమానాల్ని చూరగొనడమే కాక ఎందరో ఉత్తమభాగవత కళాకారులకు సింహతలాటాలను ఘంటా కంకణాలనూ కలియుగ సత్యభామ—పండిత సత్యభామ—. అభినయ సత్యభామ—గానకోకిల — వసంతగాన కోకిల మొదలైన బిరుదులను గూడా ప్రసాదించారు.

## భాగవత కథే భాగవతం:

భాగవతమంటే కృష్ణ సంబంధమైన కథలను కేళిక చేయడమే. ఇందులో కృష్ణా సత్యభామల ప్రణయకలహం ముఖ్యమైనది. దీనినే కృష్ణపారిజాతమనీ, భామా కలాపమనీ వ్యవహరిస్తారు. ప్రారంభంలో సిద్ధేంద్రయోగి భాగవత సంబంధమైన ఈ భామాకలాప రచన చేసి ప్రచారం చేశారు.

అయితే భామాకలాపాన్ని సిద్ధేంద్రయోగి రచనను కూచిపూడి వీథి భాగవతులు అధిక ప్రచారంలోకి తీసుకువచ్చిన విషయం అందరికీ తెలిసిందే. అయితే సిద్ధేంద్రులవారి పారిజాతాపహరణానికీ తూర్పువారు ప్రదర్శించే భాగవతానికీ వ్యత్యాసం వుంది. కూచిపూడివారి భామాకలాపంలో కనిపించే దరువులు మొదలైనవి వీరి భాగవతాలలో తక్కువ కనిపిస్తాయి.

## బలరామ భుక్త భాగవతం:

తూర్పువారు ప్రదర్శించే పారిజాతాపహరణం ఆ ప్రాంతానికి చెందిన బలరామభుక్తగారు వ్రాసింది. కథ ఒకటే అయినా పాటలకు సంబంధించిన బాణీ, దరువులూ, నడిపే విధానం, మృదంగ వాయిద్య రీతుల్లోనూ, కూచిపూడివారి బాణీకీ, తూర్పు వీథి భాగవతబాణీకీ చాలా తేడా వుంది.

బలరామభుక్తగారి తరువాత ఈ జిల్లాకు చెందిన "నరసింగబల్లివారు, కేశవపురివారు, బొబ్బిలివారు, దువ్వవారు, నెల్లిమర్లవారు ఇత్యాదులు ఎందరో ప్రసిద్ధ నాట్య శాస్త్రవేత్తలు, ఈ తూర్పు వీథిభాగవత బాణీకి కావలసిన కలాప రచనలను చేశారు.

అయితే ఈ నాటికీ వంకాయల బలరామభుక్త వ్రాసిన గ్రంథమే ప్రస్తుతం ప్రచారంలో వుందని చెపుతారు. ఈ సాంప్రదాయం కూచిపూడివారి బాణీకి భామాకలాపానికి దగ్గరలో వున్నా పాట పాడే బాణీ, దరువు నడిపే విధానం, మృదంగం వాయించే రీతీ ప్రత్యేకంగా కనిపిస్తుంది. ఆహార్యాది వేషధారణలో, అలంకారంలో కూడా ప్రత్యేకత కనిపిస్తుంది.

## ముచ్చటైన కథావస్తువు:

తూర్పు వీథిభాగవత కలాపంలో కథావస్తువు ఒక ముచ్చటైన సంఘటన మాత్రమే....తన మందిరం నుంచి అలిగి వెళ్ళిపోయిన శ్రీకృష్ణుని, సత్యభామ రాయ

భారం పంపించి — మళ్ళీ తన ఇంటికి రప్పించుకున్న సంఘటనే ఈ కథా వృత్తాంతం. కథ చిన్నదే అయినా ఇందులో అష్టవిధ నాయికల వర్ణనలూ, అవస్థలూ విప్రలంభ శృంగారంతో నిండి ఇది ఒక పెద్ద ప్రబంధమైపోయి, వరుసగా ఈ భాగవతాన్ని తొమ్మిది రోజులు ప్రదర్శించేవారట. ప్రారంభంలో, అటువంటిది. కాలానుగుణ్యంగా మూడు రాత్రులకు కుదించారు. అయితే ఈనాడు ఈ కథను ఒక్క రాత్రే పూర్తిచేస్తున్నారు. శాస్త్రయుక్తంగా ప్రదర్శించే భామాకలాపం తరువాత, గొల్లకలాప ప్రదర్శనాన్ని కూడా జనరంజకంగా ప్రదర్శించేవారు. అయితే ఈ గొల్ల కలాపం, దేశి సాంప్రదాయానికి సంబంధించిన కళా రూపంగా ప్రదర్శించేవారు.



తూర్పుబాణీ ప్రత్యేకత:

ఈ భాగవత ప్రదర్శనంలో దరువులూ, ద్విపదలూ, కందపద్యాలూ, వృత్తాలూ, అర్ధచంద్రికలూ, ఏల పదాలూ, చూర్ణికలూ మొదలైన దేశి సంగీత రచనలు వాడుతూ వుంటారు. ముఖ్యంగా ఈ దరువులు ఈ ఆటల్లో ప్రాముఖ్యం వహిస్తూ వుంటాయి.

భరతుడు నాట్యశాస్త్రంలో ఉదహరించిన ప్రాచీన ధ్రువాగానం ఈ నాటికీ తూర్పు వీధిభాగవతులు ప్రదర్శిస్తున్నారు.

రాగాలూ, తాళాలూ, నేటి కర్ణాటక సాంప్రదాయానికి చెందినవైనా. రాగ సంచారం, తాళ ప్రసారం మొదలైన విధానాలు ప్రాచీన సంప్రదాయ పద్ధతిని అనుస రించే వున్నాయి. ముఖ్యంగా తెలుగుదేశపు కళారూపాలలో ఏ కళారూపంలోనూ అత్యంత ప్రాముఖ్యం వహించని మృదంగం ఈ తూర్పు వీథిభాగవతంలో అత్యా ధిక ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. ముఖ్యంగా తూర్పు వీథిభాగవతానికి ఆయువు పట్టు మృదంగ విన్యాసమే.

## మృదంగ ఘోషల్లో, ముత్యాల సరాలు:

తూర్పు వీథిభాగవత బాణీలో మృదంగం అధిక ప్రాముఖ్యాన్ని వహిస్తుంది. వారి వాయిద్యం ఉధృత తాండవంగా వుంటుంది. ప్రేక్షకులను ఉత్తేజపరుస్తుంది. ఉద్వేగపరుస్తుంది. మార్దంగికులు తమ వాయిద్యంలో సముద్రం ఘోషించినట్లూ, పిడుగులు పడినట్లూ, ఉరుములు ఉరిమినట్లూ, మేఘాలు గర్జించినట్లూ, భేరీలూ-నగా రాలూ మ్రోగినట్లూ ప్రళయంగా వుంటుంది. ఆ దరువులనుబట్టే నృత్యం కూడా అంత ఉద్వేగంగా వుంటుంది. వారి మృదంగ వాయిద్యంలో ఎంతటి గంభీర నాదా లుంటాయో, అంతటి సున్నితమైన, మృదుమధురమైన కోయిల స్వరాలూ, చిలుక పలుకులూ మొదలైన వాటిని మృదంగంమీద పలికిస్తూ ప్రేక్షకులను ఆనందడోలి కల్లో ముంచేస్తారు.

ఈ విశిష్ట వాయిద్యంలో నిష్ణాతులు బాజ్జాతి ఆస్థాన విద్వాంసులైన "బుగత రామయ్యగారూ, ఆయన కుమారుడు గొప్పన్నగారు.

ఆ తరం తరువాత, కింతాడ అప్పన్న, ముట్నూరి సంగమేశ్వరశాస్త్రి, ధూపం సూర్యలింగం, ఆగూరు కంచరాం, గ్రామ వ్యాస్తవ్యులు. ప్రముఖ భాగవత శిఖామణియైన దూడల శంకరయ్యగారి కుమారుడు. శ్రీ గోవిందరావు లాంటివారు ప్రముఖులు.

ఈ బాణీలో సుప్రసిద్ధ మార్దంగికులు. అనేక బిరుదులు పొంది, అనేకమంది భాగవత మార్దంగికులను తయారుచేసిన ప్రఖ్యాతి. అభినవ నందికేశ్వరునిగా పేరు తెచ్చుకున్న కీ॥ శే॥ కోరుకొండ సత్యంగారికే దక్కింది.

## ముందు వెనుకల మృదంగ వాయిద్యం :

ఈ భాగవత కళలో మృదంగ వాయిద్యం ఒక ప్రత్యేక బాణీలో ప్రాముఖ్యం వహించింది మృదంగం. ఈ బాణీకి జీవమని ముందే తెలుసుకున్నాం. ఇతర కళా రూపాలలో. కూర్చుని మృదంగం వాయిస్తూవుంటే ఈ ప్రదర్శనంలో రెండు మృదంగాల్ని ముందు వెనుక నడుముకు కట్టుకుని గంటల తరబడి ప్రదర్శనం జరిగి నంత కాలం, తెల్లవార్లూ పాత్రల అభినయంతో పాటు నిలబడి వాయించటం చెప్పుకోతగిన విషయం. ఇది ఎంతో అబ్బురంగా వుంటుంది.



ఇది సంపూర్ణ ద్రుపదరీతి, బొబ్బిలి ఆస్థానంలో "నంది భరతం" అనే మృదంగజతుల గ్రంథం సృష్టించబడింది. ఒకే తాళంలో, సప్త తాళాలు ఇమిడి వుండే రీతిలో, శబ్దాలనుకూర్చి ఆడించటం ఈ కళాకారుల ప్రతిభను వెల్లడిస్తోంది.

## అమ్మవారి, జాతర అయ్యగార్ల ప్రదర్శన:

విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో ఎక్కడ అమ్మవారి జాతర జరుగుతుందో అక్కడ ఈ తూర్పు వీథిభాగవతం విధిగా ప్రదర్శించటం ఇప్పటికీ ఆచారంగా వస్తూంది. ముఖ్యంగా జాతర్లలో గ్రామ ప్రజలు ఎంతో ఆప్యాయతతో తెల్లవార్లూ ఈ కళారూపాన్ని చూచి ఆనందిస్తారు.

ఈ కళాకారులు ఒకే రాగంలో దరువు ప్రారంభించి గంటల తరబడి గంతులు వేస్తూ, హెచ్చు శృతిలో దీర్ఘకాలం దమ్ముపట్టి ఆలాపన చేయటంవలన, ఈ భాగవతాన్ని నక్కల భాగవతం అని జానపదులలో వాడుకై పోయింది.

## అందరూ ఆదరించిన కళ:

ముఖ్యంగా ఈ భాగవతాలను ప్రదర్శించేవారు. కూచిపూడి బ్రాహ్మణుల మాదిరి ఒక తెగకు చెందినవారు కారు. అన్ని కులాలకూ, వర్గాలకూ చెందినవారున్నారు. బ్రాహ్మణులు, విశ్వబ్రాహ్మణులు, కొప్పువెలమలు, దాసర్లు, పంచములలో కూడా ఈ కళాకారు లున్నారు.

శ్రీకాకుళం జిల్లా ఎచ్చెర్లకు చెందిన అప్పలస్వామి, అనే భాగవత కళాకారుడు పంచమకులానికి చెందినవాడు, ఈ భాగవతాలలో పాత్రలు ధరించేవారందరూ పురుషులే.

అయినా ఏభై సంవత్సరాల క్రితం, ఒకే ఒక స్త్రీ, భామ వేషం ధరించి, ఆనాటి ప్రజానీకాన్ని ఆశ్చర్యపర్చిందట. ఆమె ''తెర్లాం'' గ్రామానికి చెందిన కాలిగుంటి వెంకటస్వామి అనే భాగవత కళాకారుని కుమార్తె. గ్రామాలలో సహజంగా వుండే సెంటిమెంట్సును బట్టి ఆమె పేరు ''పొయ్యిబుగ్గి'' ఎనభై సంవత్సరాల వయస్సులో తినటానికి తిండిలేని దీనావస్థలో కాలం గడిపింది.

## ఎందరో కళాకారులు, ఎన్నో ప్రదర్శనాలు:

ఈనాడు విశాఖ జిల్లా శృంగవరపు కోట తాలూకా, ఖాసాపేట గ్రామానికి చెందిన విశ్వబ్రాహ్మణుడు ''కొచ్చెర్ల బ్రహ్మం భాగవత కళాకారుడు తన కుమార్తె ''అంజలికి'' ఈ విద్యను నేర్పి, అనేక ప్రదర్శనలను ఇప్పిస్తున్నారు.

అలాగే బొంతలకోటి జగన్నాథం. దూడల శంకరయ్య....బొంతలకోటి రామమూర్తి, దూర్వాసుల మాణిక్యం....కురుమోజ రామమూర్తి ఆచారి....హిమంది బోడిదాసు. భడితోక సత్యనారాయణ ఆచారి....చందక వెంకటప్పారావు....దూడల లింగమూర్తి — తంపెట్ల సత్యం — కాలిగుంటం అప్పలస్వామి — కొచ్చర్ల బ్రహ్మం — చామర్తి సత్యం, కోనేటి అప్పారావు....యర్రా సూర్యనారాయణ, అలకంపెట్టి నరసింగారావు — యర్రా సింహాచలం, వానపల్లి పరదేశి....మీసాల

అప్పలనాయుడు. మీసాల ఎరుకునాయుడు....సుక్క_పోలి నాయుడు. గొర్లిపేట రాముడు....వైష్ణవ అప్పలస్వామి దొమ్మ్క, అప్పలస్వామి — రంగుముద్ర అప్పల స్వామి, మునిడి అవతారం....బురడ గవరయ్య... ధర్మవరపు గురువులు....వరదా లక్ష్మణరావు, పిన్నింటి రామునాయుడు, ఆర్. సింహాచలశర్మ, గిరిజాల సత్య నారాయణ, కల్లూరి సూర్యనారాయణ, శంబన సత్యనారాయణ, గురువిల్లి స్వామి నాయుడు, ఎమ్. సిమ్మప్పడు, పులఖండం నారాయణమూర్తి శర్మ, కుందుం సాంబమూర్తి, పేరూరు వరహాలు మొదలైన ఎందరో సుప్రసిద్ధ కళాకారులు - ఈనాటికీ, ఈ తూర్పు భాగవత కళను ఆరాధిస్తున్నారు. గమనించవలసిన విషయ మేమంటే, ఈ కళాకారు లందరూ అరవై సంవత్సరాలకు పైబడినవారే, అంటే



ఈ తరం అంతరిస్తే, తరువాత తరంవారు ఈ కళను ఆరాధించగలరా అన్నది సందేహం.

## ఈ నాటికీ అరవై మేళాలు :

ఈనాటికి ఆ ప్రాంతంలో అరవై భాగవత మేళాల వరకూ వున్నాయి. ప్రతి మేళానికీ పదిమంది సభ్యులకు తక్కువ వుండరు. ఆ విధంగా ఆరు వందలకు పైగా సంగీత నృత్య కళాకారులు, సుమారు నూరుమంది, మృదంగ వాద్యకులూ వున్నారు. ఒక బాణీకి చెందిన ఇన్ని మేళాలు, ఇంతమంది కళా కారులు భారతదేశంలో ఏ ఒక్క కళారూపంలోనూ లేరంటారు సంపత్‌కుమార్ గారు.

## ఇటీవల మార్పు :

మామూలుగా ఈ తూర్పు బాణీలో వున్న ప్రత్యేకత ఏమంటే ఒకే రాగంలో దరువు ప్రారంభించి, గతులనూ, సంగతులనూ మారుస్తూ గంటలతరబడి గానం చేస్తారు.

ఇంతకుముందు ఆటా పాటా సమపాళ్ళలో నడిపించినా, ఇటీవల కాలంలో, భామపాత్రాభినయానికి ప్రాముఖ్యం పెరగటంవల్ల, ఆటకు సంబంధించిన నృత్యాభినయం తగ్గిపోయి పాటకు ప్రాముఖ్యం పెరిగిందంటారు. భామ పాత్రధారి ఎంత గొప్పగా గానంచేస్తే, అంత గొప్పగా ప్రజలు ఆదరిస్తారట. ఆయనను గొప్ప కళాకారుడుగా గుర్తిస్తారట. అందువల్ల భాగవతాల్లో కళాకారుడు దీర్ఘగానాలు ప్రవేశపెట్టి ప్రేక్షకులను ఆనందపరుస్తారట.

## ఆదరణ లేక అంతరిస్తున్న కళ :

తూర్పు భాగవతంగా శతాబ్దాల తరబడి ప్రసిద్ధిచెంది, ప్రజలను అలరించిన, ఈ బాణీ, ఈనాడు అన్ని జానపద కళారూపాలు, ఎలా శిథిలావస్థలో వున్నాయో ఇదీ అలాగే క్షీణదశలో వుంది. నాటి ఆదరణ ఈనాడు లేదు.

ఒకప్పుడు విజయనగరం, బొబ్బిలి, మాడుగుల, కళింకోట, మందసా, చోడవరం, చీకటికోట, ధారాకోట, సాలూరు, పార్వతీపురం మొదలైన సంస్థానాలు, జమీందారులూ, ధనవంతులూ, పండితులూ, మహావిద్వాంసులూ, ఈ కళను ఆదరించి పోషించారు. ప్రజలు ఆదరించారు, హర్షించారు, పోషించారు.

## నాటి ఆదరణ ఈనాడు లేదు :

ఈ కళారూపానికి, నాటి పోషణ ఈనాడు లేదు. మహా విద్వాంసులైన భామ వేషధారులూ, మహా విద్యావంతులైన మార్ధంగికులు. కొద్దిమంది మాత్రమే కొన వూపిరితో వున్నారు. ఇలాగే కొంతకాలం జాగుచేస్తే ఈ కళారూపం నామమాత్రం కూడా లేకుండా పోతుంది. అక్కడక్కడ మిగిలివున్న ఆయా విద్వాంసుల బాణీని రికార్డు చేయాలి, డాక్యుమెంటరీలు తీయాలి. వేషభూషణ అలంకారాలను భద్రపరచాలి. అక్కడక్కడ మిగిలివున్న వృద్ధ కళాకారుల ద్వారా ఈ నాటి యువతరానికి గురుకుల పద్ధతిలో ఈ బాణీని అభ్యసింప చేయాలి.

## ఆసక్తి లేక అంతరిస్తున్న కళ:

అయితే ఈనాటి యువతరం ఈ కళను నేర్చుకోవాలనే ఆసక్తిని చూపడం లేదు. అందుకు ముఖ్య కారణం ఈ విద్యను నేర్చుకోవడం అతి కష్టమైనది కావడమే. అంతేకాక ఈ కళద్వారా జీవించగలమనే నమ్మకం లేకపోవడంవల్ల



తరతరాలుగా వస్తున్న ఈ పారంపర్య కళను వదలి, నేటి యువతరం ఇతర జీవన విధానాలనూ, వివిధ వృత్తులనూ అవలంబిస్తున్నారు. అందువల్ల ఈ కళను ప్రభుత్వం తప్ప మరెవరూ పోషించే అవకాశంలేదు.

మన కళలు జాతికి జీవనాడులు లాంటివి. పరిపూర్ణ కళాస్వరూపమై జానపదులకు అత్యంత సన్నిహితమై రసానుభూతినీ, ఆత్మానందాన్నీ కలిగిస్తున్న ఈ తూర్పు భాగవత బాణీని క్షీణించకుండా చూడవలసిన బాధ్యత. మన ప్రభుత్వంపైన ఎంతైనా వుందంటారు డి. వై. సంపత్‌కుమార్‌గారు.





# వినోదాల కాముని పౌర్ణమి



తెలంగాణా గ్రామీణ ప్రజలకు కాముని పౌర్ణమి ఆనందదాయకమైన పండుగ. వెన్నెల రాత్రులలో గుంపులు గుంపులుగా పౌర్ణమి ఇంకా మూడు రోజులుందనగానే ఈ వినోద కార్యక్రమాలు ప్రారంభ మౌతాయి. కాముని పున్నమి ఒక్క తెలంగాణాలోనే కాక భారత దేశమంతటా, ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలో హోళీపండుగ రూపంలో జరుగుతుంది. వరుసా వావీ లేకుండా ఒకరిమీద మరొకరు వసంతాలను విరజిమ్ముకుంటూ, ఒడలుమరచి తన్మయత్వంలో ఈ వినోదాలను జరుపుకుంటారు. కులభేదాలూ, వైషమ్యాలూ, ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ అనే భేద భావం లేకుండా ఈ వినోదాలు ఎంతో అన్యోన్యంగా సాగుతాయి. ఆంధ్రదేశంలో ఈ వసంతాలు ముఖ్యంగా వివాహానంతరం కంకణాలు విప్పే రోజున ఎంతో ఉల్లాసంగా జరుగుతాయి.

## ఊరంతా వసంత వేడుకలు:

అంతేకాక పెద్ద పెద్ద దేవాలయ క్షేత్రాలలోనూ, పల్లెల్లో దేవాలయ కళ్యాణ వుత్సవాలలో ముఖ్యంగా సీతాకళ్యాణ సమయంలో బండ్లమీద పెద్ద పెద్ద గంగాళాలలో రంగు రంగుల నీళ్ళతో నింపి, మేళతాళాలతో ఉత్సవంగా బయలుదేరి వీథుల్లో కనిపించినవారందరి మీదా వసంతాలు జల్లేవారు. అంతేకాదు తలుపులు మూసుకుని ఇళ్ళలో వున్న వారిని కూడా ఇళ్ళలో జొరబడి స్త్రీ పురుష భేదం లేకుండా అందర్నీ వసంతంతో ముంచివేసేవారు. ఈ సందర్భంలో కొంతమంది మీద గులామునూ, పిడకలనూ, కప్పలనూ, మామిడి టెంకలనూ దండలుగా కట్టి మెడలో వేసేవారు.

ఇలా వూరంతా మేళతాళాలతో వినోదాలతో పిన్నలు పెద్దలు కలిసి ఆటలతో పాటలతో సంతోషంగా ఈ వసంతోత్సవ కార్యక్రమాన్ని కన్నుల పండువుగా నిర్వహించేవారు.

వూరివారందరినీ ఇలా రంగుల వసంతంతో ముంచినప్పుడు స్త్రీలుగాని, పురుషులుగాని ఎవరూ కోపగించుకునేవారు కారు. అదొక పవిత్ర కార్యంగా భావించేవారు. దానిని ఒక పవిత్ర వుత్సవంగా సంతోషంగా ఆమోదించేవారు. ఈ వసంతోత్సవాలు కులమతాలకు అతీతంగా ధనిక పేద ఐక్యతకు చిహ్నంగా అరమరికలు లేకుండా బ్రతికే గ్రామప్రజలకు దర్పణంగా జరిగేవి.

## కోలాటాల కోలాహం :

కాముని పున్నమి సందర్భంలో తెలంగాణా అంతటా జరగకపోయినా ముఖ్యంగా హైదరాబాదు, సికిందరాబాదు, వరంగల్లు మొదలైన నగరాలలో వసంతాలు జరుగుతూ వుంటాయి. పల్లె ప్రాంతాలలో రకరకాల వినోదాలతో ఆట పాటలతో ఈ వుత్సవాలు జరుగుతాయి.

కాముని పున్నమి సందర్భంలో వెన్నెల పాటలు. అల్లో నేరేళ్లు. కోలాటపు పాటల్నీ, జాజరపాటల్నీ స్త్రీలు పాడుతూ వుంటే పురుషులు కోలాటాల్ని ప్రదర్శించేవారు. ఈ కోలాటాన్ని స్త్రీలూ, పురుషులూ ప్రదర్శించినా పురుషుల కోలాటం వుధృతంగా వుంటే, స్త్రీల కోలాటం లాలిత్యంగా వుంటుంది.



కోలాటపు చిరుతల్ని కోల లంటారు. ఒక్కొక్కరూ రెండేసి చిరుతల్ని రెండు చేతులా ధరించి ఒకరి కొకరు లయ ప్రకారం అడుగుల ననుసరించి ఆ యా పాటల గమకాల మేరకు ఒకడు ప్రధానుడై పాటపాడితే మిగతా బృందం వారందరూ అతనిని అనుసరిస్తారు.

ఆంధ్రదేశంతో కోలాటాల ప్రభావం ఎంత ఎక్కువగా వుందో తెలంగాణా అంతటా కూడా అంత ప్రచారంలో వున్నాయి. కోలాటపు పాటలు ఎక్కువగా సంవాదంరూపంలోనూ, శృంగార రసప్రధానాలుగానూ వుంటాయి. మరికొన్ని పచ్చి శృంగారంతో నిండి వుంటాయి. స్త్రీల కోలాటపు పాటల్లో గోపికలు, చిలిపి కృష్ణుని దుందుడుకు చేష్టలకు సంబంధించి వుంటాయి. కోలాటాన్ని గూర్చి కోలాటం శీర్షికలో వివరంగా చర్చించబడింది.





# ఆరెవారి గొంధళే వీధి భాగోతాలు

ఆంధ్రదేశంలో ఆంధ్రులకే తెలియని ఆరె జాతివారనే ఒక ప్రత్యేకమైన తెగకు సంబంధించినవారు, అనేకమంది తెలంగాణా జిల్లాలలో వున్నారనే విషయం చాలామందికి తెలియదనటం అతిశయోక్తికాదు. వీరు ముఖ్యంగా కరీంనగర్, వరంగల్ నల్లగొండ జిల్లాలలో ఎక్కువమంది నివశిస్తున్నారు.

గొంధళీలు తెలుగుదేశానికి ఎప్పుడు ఎలా వచ్చి స్థిరపడ్డారో చెప్పడానికి సరియైన చారిత్రక ఆధారాలు లేవు. కాని ఆరెవాళ్ళు వలసవచ్చిన తరువాతనో, లేక వారిని అనుసరిస్తూనో వినోద ప్రదర్శనాలు ఇవ్వడంకోసం వచ్చి, తెలంగాణాలో స్థిరపడి వుంటారని ఊహించవచ్చంటారు.

ఏది ఏమైనా ఈ గొంధళీలు కూడా మధ్య తెలంగాణాలోని ఆరెవాళ్ళ మాదిరిగానే. రాయలసీమలోని సురభివాళ్ళకన్నా, ఆరె మరాఠీలకన్నా అతి ప్రాచీనులని చెప్పవచ్చునని, డా॥ పేర్వారం జగన్నాథంగారు, వారు పరిశోధించిన ఆరె జానపద సాహిత్యం తెలుగు ప్రభావం అన్న గంథం షష్ఠమ తరంగంలో వివరించారు.

## కుండలాకార నృత్యం :

కుండలాకార నృత్య విశేషంగా చెప్పబడుతున్న గొండిలి, గొండ్లి, తోలుబొమ్మలాటల్లోని గాంధోళిగాడు గొంధళి, అనే పదాలన్నీ ఒకే కుదురునుంచి పుట్టి వుండవచ్చునంటారు జగన్నాథంగారు. బుర్రకథ, తోలుబొమ్మలాటల వంటి కళారూపాలుకూడా మహారాష్ట్రనుండి తెలుగుదేశానికి వచ్చాయన్న ప్రతీతి కూడా వుంది.

ఆరెవాళ్ళు మహారాష్ట్రనుండి తెలుగుదేశానికి వలసవచ్చి కొన్ని శతాబ్దాల క్రితమే స్థిరపడిపోయారు. తెలుగు ప్రజల జీవితాలతోవారు పెనవేసుకుపోయినా ఇప్పటికీ వారి భాషాసంస్కృతుల్నీ ఆచారవ్యవహారాల్నీ నిలుపుకొంటూ వస్తున్నారు.

వీరిని ఆరెవాళ్ళని, ఆరుకాపులనీ, ఆరెమరాఠీలనీ ఆర్యక్షత్రియులనీ, వివిధ పేర్లతో పిలుస్తున్నారు. వీరు ప్రాచీనకాలంనుంచీ ఆయుధోపజీవులుగా వున్నట్లు కనిపిస్తున్నారనీ, శాంతి సమయంలో నాగలిపట్టి నేల దున్నటం, యుద్ధసమయంలో కత్తిబట్టి కదనరంగంలో క్షాత్రతేజస్సును ప్రదర్శించడం వీళ్ళకు అనువంశిక-సంప్రదాయమైనట్లు కనిపిస్తున్నదనీ వివరిస్తున్నారు.



## గొంధళే వీధి భాగోతాలు :

ఆరెవాళ్ళు గ్రామాలలో ఆరె భాషలో .... వీధి భాగోతాలను ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనాలను ఆరెవారితోపాటు, తెలుగువారు కూడ ఆదరిస్తున్నారు.

ఆరెవారిలో అంబీర — ఇంగ్లై — గుండెకారి — గుగై — దూదాటి షేక్‌నారా — సింధే — అనే ఇంటి పేర్లుగల గొంధళీ కుటుంబాలు సుమారు రెండువందలదాకా తెలంగాణా జిల్లాలలో వున్నట్లు జగన్నాథంగారు తెలియజేస్తున్నారు.

ముఖ్యంగా వీరంతా మహాలింగంపల్లె — వరికోలు — వేములపల్లి — గోయలాయ — వెంకటాపురం — అలాగే కరీంనగర్ జిల్లాలలోని గోపాలపురం జోజునూరుపల్లి మొదలైన గ్రామాలలో వున్నారు. రంగస్థల కళాకారులైనవారు ఎక్కువగా మహాలింగంపల్లెలో వుంటున్నారు. ఈ గ్రామానికి సోమదేవరపల్లె అని కూడా మరో పేరు వుంది.

## గొంధళీ బుర్ర కథలు :

ఇంతకు పూర్వం తెలంగాణాలో గొంధళీలు ఒక ప్రత్యేకమైన పద్ధతిలో వీరరసాత్మకాలైన కథలనూ, కరుణరసభరితాలైన కథలనూ బుర్ర కథలుగా చెప్పేవారట. ఈ కథలు చెప్పే బృందాల్లో కథకుడు పొడుగాటి బొందెల జుబ్బాను ధరించి, ధోవతి కట్టి, నెత్తికి రంగుతోకూడిన రుమాలు చుట్టి, గవ్వల హారాన్ని జందెంమాదిరిగా ధరించేవాడట. ఒకడు మద్దెల వాయిస్తూ వుండగా, మరొకడు కిన్నెర వాయించేవాడట. ఇంకొకడు తాళంవేస్తూ వుండగా కథకుడు ఆరె భాషలో కథ చెపుతూవుండేవాడట, అయితే ఆవిధంగా కథలు చెప్పేవారు ఈనాడు లేరట.

## వీధి భాగోతాలు :

అయితే ఈ గొంధళీలు, మధ్యతెలంగాణా ప్రాంతంలో ఆరెవారు ఎక్కువగా వుండే గ్రామాలకు వెళ్ళి, ఈనాటికీ వీధిభాగోతాలు ప్రదర్శిస్తున్నారు. ఈ ప్రదర్శనాలు చాలావరకు మన వీధినాటకాల పోలికలోనే వుంటాయట. వీరి భాగోతాలకు హంగుదార్లుగా హార్మోనియాన్ని, మద్దెలనూ ప్రక్కవాయిద్యాలుగా ఉపయోగిస్తారట. వీరు ప్రదర్శించే కథా ఇతివృత్తాలు, భారత గాథలకూ, జానపద గాథలకూ సంబంధించి వుంటాయి. మన వీధి నాటకాలలో మాదిరి విదూషకుడులా వీరి భాగోతాలలో హాస్య పాత్ర ప్రవేశించి ప్రేక్షకుల్ని హాస్యంద్వారా కడుపుబ్బ నవ్విస్తుంది. అంతేగాదు మధ్య మధ్యలో ఆరె భాషను తెలుగులోకి అనువదిస్తూ వుంటాడు. ఒక్కమాటలో చెప్పాలంటే వీరి హాస్య పాత్ర సంస్కృత నాటకాల్లోని విదూషకుని పాత్రను పోలి వుంటుంది. రాజు పాత్రలకు అతిసన్నిహితంగా వుంటాడు. వీరి భాగోతాల్లో స్త్రీ పాత్రల్ని పురుషులే ధరిస్తారు. ఇక కథలో వచ్చే పాత్రల పేర్లన్నీ మహారాష్ట్ర సంస్కృతికి సంబంధించే వుంటాయి. అయితే మరికొన్ని పాత్రల పేర్లు తెలుగు పేర్లుగానే వుంటాయి. ప్రదర్శించే రంగస్థలంలో ఒక పొడుగాటి గవ్వల హారాన్ని వ్రేలాడదీస్తారు. ఈ దండను వారు అంబాభవానికి చిహ్నంగా ఆరాధిస్తారు. గొంధళీ కళాకారులు ఆరెవారి పారితోషికాలతోనే జీవిస్తున్నారు. తెలుగు ప్రజలు కూడా వారిని ఆదుకుంటున్నారు.

అయితే గొంధళీల భాగోత ప్రదర్శనలకిప్పుడు ప్రజాదరణ తగ్గిపోతూవుంది. అందువల్ల గొంధళీలలో చాలామంది వ్యవసాయాన్ని వృత్తిగా స్వీకరిస్తున్నారు. మరి కొంతమంది, వేరే వృత్తితో జీవిస్తున్నారు. క్రమక్రమంగా ఈ కళ క్షీణించిపోయే

దశకు చేరుకుంది. ఇటీవల ఔత్సాహికులైన గొంధళీ కళాకారులు. ఈ కళను కాపాడు కోవడంకోసం మహాలింగంపల్లి కేంద్రంగా గొంధళీ నాటక మండలిని స్థాపించు కున్నారు.

బాలావంతి కథా ప్రదర్శనం :

వారు ప్రదర్శించే ప్రదర్శనాలలో బాలావంతి కథ ఒకటి బాలావంతి కథలో రాజుకు సంతానం కలుగదు. సంతాన ప్రాప్తికోసం తపస్సుచేసి ఈశ్వరునివల్ల



వరంపొంది రావలసిందిగా రాణి రాజును ప్రోత్సహిస్తుంది. మొదట రాజు అంగీక రించడు. ఐనా రాణి బలవంతం చేస్తుంచి. రాజు తన రాజ్య భారాన్ని లింబోటీ ప్రధానికి అప్పగించి తపస్సుకోసం అరణ్యానికి వెళ్ళడానికి సిద్ధపడతాడు. ఆ సందర్భంలో వారిరువురి మధ్యా ఇలా సంవాదం జరుగుతుంది.

బాలావంతి:— వారి ఆరె భాషలో ఇలా వుంటుంది.

ఐకుమి రాజా మీగోటి సంగిత కానిదారు ఐకుమి రాజా
అంచనామయూ అంచనామగాదు సంగిత మీ అంచనామయూ
వరదనుదదాలా తేపరచదనుదదాల బోలుధడావొ వరదనుదదాలా
వింబోజిదదాలా తేవింబోజిదదాల బోలుధడావొ వింబోజిదదాలా

ఈ విధంగా సాగేవారి సంవాదం తెలుగులో ఇలా వుంటుంది.

బాలావంతి:—

ఓ రాజా! నేనోమాట చెబుతాను చెవున బెట్టవలసింది
మన పేరూ మన వూరుపేరూ చెబుతాను
మన కీ రాజరికం వుండి లాభమేమి
మన కీ ధనద్రవ్యాలు కూడా వుండి ఏమీ లాభంలేదు.
వేములవాడ దేవుడుండీ కూడ లాభం లేకుండా వున్నది
వినవయ్యా ఓ రాజా! నేనో మాట చెబుతాను
ఇటు చెవిబెట్టి విను.

అవర్‌సింగ్:—

ఓ నారీ? అదేమి సంగతో చెప్పు వింటాను.

బాలావంతి:—

మనకు కొడుకులూ కూతుళ్ళూ లేరు
నిన్ను నాన్నా అని పిలిచే కొడుకులు లేరు
నన్ను అమ్మా అని పిలిచే కూతుర్లు లేరు
తండ్రి చెప్పులు తొడిగే కుమారుడు లేడు
తల్లి రవికెలు తొడిగే కూతురు లేదు
ఓ రాజా! నీవిప్పుడు ధౌలగిరి (ధవళగిరి)కి వెళ్ళాలి
నీవు కొడుకూ కూతుర్ల దానం పొందాలి.

అవర్‌సింగ్:—

ఓ నా రాణీ! నేను కూడ ఓ మాట చెబుతాను
ఓ నారీ దేవు డివ్వందే కూతుర్లెట్టా కలుగుతారు
ఓ నారీ దేవు డివ్వందే కొడుకులెట్టా కలుగుతారు
సంతానం కోసం నే నెక్కడికీ వెళ్ళను
నాతో నీవున్నూ ఇట్లా చావవలసిందే తప్ప
నేను సంతానం కోసం ఎటూ వెళ్ళను సుమా!

బాలావంతి:—

వినవయ్యా ఓ రాజా! నే నో మాట చెబుతాను
కొడుకు కూతుర్ల వరం పొందడం కోసం నీవు తప్పక వెళ్ళాలి

ఇట్లా బాలావంతి చెప్పడం ప్రారంభించింది.

అవర్‌పింగ్:—

మంకవతిని వెంటనే రప్పించాలి
సోదరుడు లింబోజీని కూడ పిలిపించాలి
ఆ లింబోజి అన్నకు ఈ రాజ్యం అప్పగించాలి
పెద్ద చిన్న లంతా కూర్చున్నా రీ సభలో



కోమట్లూ బామండ్లూ కూడ కూర్చున్నా రిక్కడ
ఓ నా రాణీ? నే నీ రాజ్యాన్ని ఎవరి కిచ్చేది?
అక్కడ రెండు పైసల్ని ముడి వేయాలి
ఒక్క పైసను మాత్రం నేను ఒడిలో కట్టుకుంటాను.

ఇలా వారి సంవాదం జరుగుతుంది. ఈ ప్రదర్శనాలను ఈనాటికీ వారు ఆంధ్రదేశంలో ప్రదర్శిస్తున్నారు. మన జానపద కళారూపాలు ఎలా శిథిలమై పోతున్నాయో గొంధళే వీధి భాగోతాలు కూడ నశిస్తున్నాయి. అవీ మన కళారూపాలతోపాటు పెరిగాయి కాబట్టి వాటిని కూడ సంరక్షించాల్సిన బాధ్యత వుంది. ఈ గొంధళే వీధి భాగోతాలను పరిశోధించిన పేర్వారం జగన్నాథంగారికి కృతజ్ఞతలు.

# బవనీలే
# బైండ్లవారు



ముఖ్యంగా తెలంగాణా జానపద కళారూపాలలో శైవమతాన్ని ప్రబోధించేవీ, శక్తి స్వరూపాన్ని ఆరాధించేవీ, గ్రామదేవతల్ని పూజించేవీ ఎన్నో వున్నాయి.

తెలంగాణాలో రేణుకా ఎల్లమ్మ, మూహుంరమ్మ, పోశమ్మ, బతకమ్మ, మహంకాళి, అంకమ్మ మొదలైన ఎందరో దేవతలు ఇంటింటా వాడవాడలా వున్నారు. ఆ దేవతల్ని ఎంతగానో పూజిస్తారు.

ఆ దేవతలకు సంబంధించిన కథల్నీ, గాథల్నీ గ్రామ గ్రామానా ఒగ్గు కథలు చెప్పేవారూ, బైండ్లవారూ, గొల్లసుద్దులు చెప్పేవారూ. ఎందరో కనిపిస్తూ వుంటారు. ఈ నాటికీ ఆ కథలూ, కళారూపాలూ నిలిచి వున్నాయంటే చారిత్రకంగా వాటి ప్రాముఖ్యం ఎటువంటిదో ఊహించుకోవచ్చును.

ఇలా కథలు చెప్పేవారిలో బవనీలనీ, బైసీడివారనీ, బైండ్లవారనీ రకరకాల పేర్లతో పిలుస్తూ వుంటారు. ఈ బైండ్లవారు హరిజనులైన పూజారులు.

అయితే బవనీలు కాకతీయ చక్రవర్తుల కాలం నాటికే ప్రాముఖ్యం వహించినట్లు క్రీడాభిరామంలో వున్న ఈ క్రింది ఉదాహరణను బట్టి తెలుసుకోవచ్చును. ఈ వుదాహరణను కాకతీయుల కళావిన్యాసం శీర్షికలో చర్చించిన మాచల్దేవి క్రీడాభిరామం శీర్షికలో ఉదహరించబడిందే, అది ఇది.

## బవనీల ప్రసక్తి :

వాద్యవైఖరి కడు నెరవాది యనగ
ఏకవీరామహాదేవి ఎదుట నిల్చి
పరశురాముని కథ లెల్ల ప్రౌఢి పాడె
చారుతర కీర్తి బవనీల చక్రవర్తి

అని అనడాన్ని బట్టి బవనీలు ఈ రకమైన కథలు చెప్పడంలో ఎంతటి ప్రఖ్యాతి వహించారో తెలుసుకోవచ్చును.

వీరశైవ మతస్థులకు వినోదాన్ని కల్పించే వీరిని బైండ్లవారంటారు. కులాల వారీగా, మతాలవారీగా ఆచార్యులూ, కళాకారులూ వున్నట్లు వీరుకూడా కేవలం శైవ మతస్థులకే వినోద ప్రదర్శన లిస్తారు.

వీరు శైవమతస్థుల ఇళ్ళలో పెండ్లి మొదలైన శుభకార్యాలలోనూ, చావు మొదలైన దుర్దినాలలోనూ కథలను చెపుతారు. అయితే పెండ్లికీ, చావుకీ వేరు వేరుగా వాయిద్యాలు వాయిస్తారు.



సంప్రదాయ కథలు చెప్పే బైండ్లవారు

## జమిడికయే, జముకు :

బైండ్లవా రుపయోగించే వాయిద్యం జమిడిక. దీనినే కాలక్రమాన జిమిలిక, జముకుగా పిలుస్తున్నారు. నేటి జముకును చూచినవా రందరికీ జమిడిక ఎలా వుంటుందో ఊహించవచ్చును. కథకుడు మధ్యలో వుండి కథాగానం చేస్తూవుంటే ప్రక్కనున్న వంతలు జమిడికల్ని వాయిస్తూ వుంటారు. ఈ జమిడికలు కొన్ని కొత్తడితోనూ, మరికొన్ని కర్రతోనూ తయారుచేసుకుంటారు. జమిడిక వాయిద్యం నేటి జముకుల నాదం లాంటిదే, జుకజుం జుకజుం అని నినాదాన్నిస్తాయి. పాట వరుస ననుసరించి, ఈ వాయిద్యం మారుతూ వుంటుంది. సన్నివేశాన్ని బట్టి ఉధృతంగా వాయిస్తారు. అయితే బైండ్లవారి కథల బాణీలకూ, జముకుల కథల బాణీకీ చాలా వ్యత్యాస ముంటుంది. బైండ్లవారు తెలంగాణాలో ప్రాముఖ్యం వహిస్తే, జముకుల

వారు తూర్పు గోదావరి, విజయనగరం, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో ప్రాముఖ్యం వహిస్తున్నారు. జముకుల కథల వివరాలను ఆ శీర్షికలో వివరంగా విశదరించబడింది.

## ప్రారంభం 13 వ శతాబ్దంలో :

ఎల్లమ్మ కథా గాన ప్రచారం 13 వ శతాబ్దంలోనే ప్రారంభమైంది. నాటి నుంచి ఈ నాటి వరకూ తెలంగాణా జిల్లాలలో రేణుకా, ఎల్లమ్మ కథలు విరివిగా సాగుతూనే వున్నాయి. ఇక ఎల్లమ్మ గుడులు తెలంగాణాలో ఎక్కడ చూచినా కోకొల్లలు. ఎల్లమ్మను ఇంత శ్రద్ధగా వారు కొలుస్తున్నారంటే, ఆ కథలపట్ల ప్రజలలో వున్న భక్తి శ్రద్ధలను అర్థం చేసుకోవచ్చు.

ఆ యా రాజుల పరిపాలనా కాలంలో మారిన చారిత్రిక పరిస్థితుల దృష్ట్యా, రేణుకా ఎల్లమ్మ కథా గానం, ఆంధ్ర, తమిళ, కర్ణాటక రాష్ట్రాలలో కూడా ప్రవేశించి, తెలంగాణా సరిహద్దుల దాటి మహారాష్ట్రకు వెళ్ళిన గొండ్లివారు, ఎల్లమ్మ కథలను గానం చేస్తూ కర్నాటకకు కూడా వ్యాపింపచేశారు.

ఈ నాటికీ కర్నాటకలో రేణుకా దేవాలయా లున్నాయి. ప్రతి సంవత్సరం అక్కడ జరిగే ఉత్సవాలలో స్త్రీలు వివస్త్రలై నగ్నంగా ఆవేశంతో ఆలయం చుట్టూ పరుగెత్తుతూ రేణుకాదేవిని పూజిస్తారు.

ముఖ్యంగా పల్లెల్లో వచ్చే కలరా, మశూచికం, పొంగు, ఆటలమ్మ మొదలైన వ్యాధులకు ఈ దేవతలే కారణంగా పూజిస్తారు. ఒకో ప్రాంతంలో ఒకో రకమైన దేవతల్ని ఇలాగే పూజిస్తారు.

కోస్తా ఆంధ్ర ప్రాంతంలో గంగాణమ్మ, పోలేరమ్మ, మారెమ్మ, ఎర్ర మారెమ్మ, మహలక్ష్మమ్మ, మహంకాళమ్మ మొదలైన దేవతలను పైన వుదహరించిన వ్యాధులు సంక్రమించినప్పుడు ఆ దేవతల్ని నీచ దేవతలుగా ఎంచి, వాటిని సంతృప్తి పర్చటానికి, కొలుపులను కొలుస్తారు.

ఆ దేవతల పుట్టుపూర్వోత్తరాలను ఆ వుత్సవాల సందర్భంలో కథా గానం చేసేవారు. ఆ కథా గానం చేసేవారే పూజారులుగా వుండేవారు. ఆ పూజారులు హరిజనులు ఆసాదులు, కుమ్మరివారు, రజకులు, బైండ్లవారూ మొదలైన వారుండేవారు. బైండ్లవారనే వారు హరిజనులే —

## రేణుకా మహాత్మ్యం :

జమదగ్ని మహాముని ఆజ్ఞ ననుసరించి కుమారుడైన పరశురాముడు తల్లియైన రేణుకను వధించిన తీరునూ, ఆ కథయొక్క పూర్వాపరాలనూ, వధానంతరం రేణుక యొక్క మహాత్మ్య గాథలనూ ఉత్తేజంగా బైండ్ల వారు చెపుతారు. రేణుక చేసిన త్యాగానికి ముగ్ధులై రేణుకను ఎంతో భక్తి శ్రద్ధలతో కొలుస్తారు.

ఎల్లమ్మను ఆరాధించే భక్తులు, వారి ఆడపిల్లలను ఎల్లమ్మ పేరు మీద జోగిత లుగా అర్పిస్తారు. ఆమెను బసివిగా పిలుస్తారు. ఆ అమ్మాయి ఊరందరి సొత్తు. ప్రతిఫలాపేక్ష లేకుండా అందరి కామవాంఛలూ తీరుస్తుంది. ఆ సాంప్రదాయం ఈ నాటికీ తెలంగాణాలో కొనసాగుతూనే వుంది.



## ఎల్లమ్మ :

ఎల్లమ్మ పుట్టు పూర్వోత్తరాలను గురించి డా॥ యెద్దెంద రఘుమారెడ్డి "పల్లె పదాలలో ప్రజాజీవనం" అనే గ్రంథంలో (352 వ, పేజీలో) ఉదహరించిన జానపద గేయాన్నిబట్టి ఎల్లమ్మ జన్మ వృత్తాంతం తెలుస్తున్నదని కె. వి. హనుమంత రావుగారు ఆంధ్ర ప్రభలో ఉదహరించారు.

**శివుని బిడ్డవమ్మా ఎల్లమ్మా :**

శివుని చిన్నబిత్తవమ్మా ఎల్లమ్మా.
నీవు శివువెల్లి మాతవమ్మా ఎల్లమ్మా.

పుట్టలో పుట్టినావు ఎల్లమ్మా.
నీవు పుడమిపై బడ్డావమ్మా ఎల్లమ్మా.

నాగవన్నె చీరలమ్మా ఎల్లమ్మా నీకు.
నీకు నెమలికండ్ల రవికెలమ్మా ఎల్లమ్మా.

ఎదుము గల్వాలు తల్లీ ఎల్లమ్మా నీకు
ఎనుక నీకు దరిసెనమ్మా ఎల్లమ్మా.

గవ్వలాది కంకణమ్ము ఎల్లమ్మా నీకు.
ఘంటలాది రాగమమ్మా ఎల్లమ్మా.

నాగుబాముల బట్టినావూ ఎల్లమ్మా నీవు.
నడికట్టు వేసినావూ ఎల్లమ్మా.

జెఱ్ఱిపోతుల బట్టినావూ ఎల్లమ్మా నీవు.

జడికొప్పులు వేసినావు ఎల్లమ్మా.

కాలిగజ్జెలు గల్లు మనిపిస్తే ఎల్లమ్మా నీవు.
ఓరుగల్లు తల్లడిల్లే ఎల్లమ్మా.

ఓరుగంటి రాజులకు ఎల్లమ్మా నీవు
ఓంకారమడిగితివి ఎల్లమ్మా.

ఎల్లు ఎల్లు ఎల్లమ్మా ఎల్లమ్మా నీవు.
ఎల్లు నీవు ఎదురైనచో ఎల్లమ్మా.



తల్లీ ఎవరమ్మా. ఎల్లమ్మా!



# ధర్మరాజు గుళ్ళూ మహాభారత వీధి నాటకాలూ

భారత భాగవత కథలంటే చెవి కోసుకునేవాళ్ళు భారతదేశంలో కోకొల్లలుగా వున్నారు. కానీ, మహాభారతాన్ని ఒక ''ఇనిస్టిట్యూషన్''లాగా రూపొందించడం మాత్రం ఆంధ్రదేశంలో ఒక్క చిత్తూరు జిల్లాలోనే జరిగిందనీ, బహుశా దేశం మొత్తంలో ఇంకెక్కడా కూడా మహాభారతం ఇంతగా ప్రజల సాంస్కృతిక జీవనం లోకి చొచ్చుకు పోలేదేమో నంటూ పసుపులేటి పూర్ణచంద్రరావుగారు, ఆంధ్రజ్యోతి పత్రికలో వివరించారు.

## ధర్మరాజు గుళ్ళు:

ధర్మరాజు గుళ్ళు పేరుతో చిత్తూరు జిల్లాలో నూరుకు పైగా ధర్మరాజు గుళ్ళున్నాయి. వీటిని గుళ్ళు అనటం కన్నా. సాంస్కృతిక ప్రదర్శనా కేంద్రాలుగా పిలువవచ్చు. ప్రతి సంవత్సరం 12 నుంచి 18 రోజుల వరకూ మహాభారతంలోని పర్వా లన్నిటినీ 'వీధి నాటకరూపంలో' ధర్మరాజు గుళ్ళ ముందు ప్రదర్శిస్తారు. ఇలా చిత్తూరు జిల్లా అంతటా ఈ ప్రదర్శనాలు జరుగుతాయి. ఈ ప్రదర్శనాలను ఆసరాగా చేసుకుని చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలందరూ తరలివస్తారు. ఇలా తరలి వచ్చే ప్రజలకు సదుపాయంగా వివిధరకాలైన అంగళ్ళూ, గ్రామీణ ఆటపాటలూ, వినోదాలూ చోటు చేసుకుంటాయి. ఇలా ప్రతి గుడి ముందూ ఒక జాతరలాగా తయారౌతుంది. ముఖ్యంగా పనిపాటలన్నీ అయిపోయిన తరువాత వేసవిలోనే ఈ కార్యక్రమాలు జరుగుతాయి. జాతరలూ, వీధి నాటకాలూ, ఆంధ్రదేశంలో ఇతర చోట్ల ప్రదర్శింపబడినా, నూరు ప్రదర్శనాలకు పైగా ప్రదర్శింపబడటం చిత్తూరు జిల్లా విశేషం.

## ఎన్నో వీధి నాటక బృందాలు:

మహాభారత కథకు చిత్తూరు జిల్లాలో ఎంత ఆదరణ వుందో, ఈ నాటికీ చిత్తూరు జిల్లాలో ఇంకా బ్రతికివున్న వీధి నాటక బృందాల్ని చూస్తే తెలుస్తుంది.

హరిజనులు, యానాదులు, జంగాలు, బలిజలు, గొల్లలు, రెడ్లు మొదలైన అనేక కులాలవారు రోజుల తరబడి ఈ ప్రదర్శనాలను ప్రదర్శిస్తూ వుంటారు. అంతే కాదు అన్యమతస్థులైన క్రిష్టియన్లూ, ముస్లిములూ మహాభారత నాటకాల్లో నటించటమే కాక అనేక వీథి భాగవతదళాలకు శిక్షణ ఇచ్చే గురువులుగా కూడా వున్నారంటే, ఇంతకంటే మత సామరస్యానికి దాఖలా ఏం కావాలి. సాంస్కృతిక ప్రదర్శనాలు, జాతీయ సమైకత్యతను ఎలా పెంపొందిస్తున్నాయో తెలుసుకోవచ్చు.

## ఇవి యక్షగాన వీథినాటకాలు:

చిత్తూరు జిల్లాలో ప్రదర్శించే వీథినాటకాల శిల్పం యక్షగానరీతికి చెందింది. ఇందులో కుప్పం ప్రాంతంలోని 'కంగుంది సంస్థానం'లో వెల్లివిరిసిన 'కంగుంది బాణీ' అనేది. చిత్తూరు యక్షగాన నాటకాల ప్రత్యేకత. అయితే చిత్తూరు జిల్లా తూర్పు ప్రాంతంలో 'సంతవేలూరు బాణీ'కి ఎక్కువ ప్రత్యేకత వుంది. ముఖ్యంగా వీరు రామ నాటకాలను ఎక్కువ ఆడతారు. అందులో కుశలవుల నాటకం ఎంతో ప్రాముఖ్యం వహించింది.

చిత్తూరు జిల్లాలోని ఈ భారత నాటక ప్రదర్శనం కేవలం స్టేజికి మాత్రమే పరిమితం కాకుండా, రంగస్థల స్థాయినీ, నటుల స్థాయినీ దాటి ఊరందరూ పాల్గొనే సమిష్టి రంగస్థలంగా మారిపోతుంది. ఉదాహరణకు ''బకాసుర వధ'' ఘట్టంలో భీముడి పాత్రధారి. రంగాన్ని వదిలేసి, నిజంగా ఓ బండిమీద ఊళ్లోకి బయలుదేరి గడప గడపకూ బోణాల్ని స్వీకరించి, రాక్షసవధానంతరం 'సమిష్టిబంతి' జరపడం విశేషం.

మరో సందర్భంలో ''కిరాతార్జునీయం'' ఘట్టంలో నాటకరంగాన్ని వదలి ప్రజల్లోకి ప్రవేశించి, మరింత పై స్థాయికి చెందిన రిచ్యువల్‌గా రూపాంతరం చెందుతుంది. సామాన్యంగా వీథినాటక ప్రదర్శనాలన్నీ రాత్రిపూటే జరిగినా, ఇలాంటి ఘట్టాలు మాత్రం పట్టపగలే జరుగుతాయి.

## తపస్మాన్:

ఈ సందర్భంలో.... అర్జునుడు దివ్యాస్త్రాల కోసం చేసే తపస్సుకు ప్రతీకగా నిలబెట్టిన ఒక స్థంభాన్ని ఎక్కుతాడు. అర్జున పాత్రధారి మెట్టు మెట్టుకూ ఎక్కుత నాటకీయంగా పద్యం పాడుతూ అధిగమిస్తాడు. తపస్సుకు వీలుగా మాను

వెడల్పుగా ఒక మంచెను ఏర్పాటు చేస్తారు. ఇలా ఏర్పాటు చేసిన మానును "తప స్మాన్"గా పిలుస్తారు.

అర్జునుడు తపస్మాన్ ఎక్కే రోజు అనగానే చుట్టుప్రక్కల గ్రామాల నుంచి ప్రజలు వేలసంఖ్యలో తెల్లవారుజామునే వచ్చి చేరుకుంటారు. అర్జునుడు తపస్మాన్ ఎక్కిన తరువాత, ఓ విల్లు ఆకారం కలిగిన వెడల్పాటి చట్రంలో కూర్చుని, నిమ్మ కాయలు, విభూది, పళ్ళు, పూలు నేలమీదికి వెదజల్లుతాడు. అర్జునుని తపస్మాన్నీ, ఎక్కడాన్నీ స్వర్గారోహణంగా ప్రజలు భావించి, పై నుంచి క్రిందబడే పళ్ళూ, పూలూ, ఎంతో పవిత్రమైనవిగా ఎంచి వాటిని అందుకోవడానికి జనం త్రొక్కిన లాడుతారు.



## పిల్లలు లేని తల్లులు:

అంతేకాదు పిల్లలు లేని తల్లులు ఈ వుత్సవానికి హాజరవుతారు. తపస్మాన్ పై నుంచి పడే పళ్ళూ పూలకోసం తలారా స్నానం చేసి తడిబట్టలతో తపస్మాన్ కింద వేచివుంటారు. అర్జునుడు మెట్టు మెట్టుకూ పాట పాడుకుంటూ, తిరిగ్గా తప స్మాన్ ఎక్కేటంతసేపూ ఈ స్త్రీలు పడుకుని సాష్టాంగ దండప్రమాణం చేస్తూ, తల ఎత్తకుండా అలాగే పడివుంటారు. అర్జునుడు ప్రసాదాల్ని నేలమీదికి పడవేసే సమయంలో ఎంతో భక్తిశ్రద్ధలతో వారి వారి కొంగుల్ని సరిచేసుకొని, మోరలెత్తి ఎదురుచూస్తారు. ఆ పళ్లూ, పూలుపడిన ముఖాలు ఎంతో వికసిస్తాయి. పడని ముఖాలు నిరుత్సాహపడిపోతాయి, అంటే దీనినిబట్టి వీథి నాటక తపస్మాన్ ఎంత బలవత్తరమైనదో తెలుసుకోవచ్చును.



ఈ విధంగా మహాభారతం వీథినాటక స్థాయి నుంచి జీవితం లోకి ఎలా ప్రవేశించిందో అర్థం చేసుకోవచ్చును.

## కూచిపూడి వారసులే
## కోటకొండ భాగవతులు



భరతనాట్య సంప్రదాయ ప్రవర్తకులలో కూచిపూడి కన్న ప్రథములు పోతకమూరి భాగవతులు. వీరు అహోబలస్వామి సన్నిధిని నాట్యాచార్యులై నిత్య నాట్యసేవ చేసేవారు.

శ్రీ వెలయపాల వారధి పవ్వళించి జోజో, అన్న జోలపాట ఈ భాగవతులు రచించిందే. వీరిని తాళ్ళపాక అన్నమాచార్యులే పేర్కొన్నారన్న, గీత నాట్యాలలో వీరికి గల ప్రతిభ వ్యక్తం కాగలదనీ వీరు 1280 ప్రాంతపువారనీ తెలుస్తూంది. దీనినిబట్టి భాగవతకళ రాయలసీమలో తర తరాలుగా ప్రచారంలో వున్నట్లు తెలుస్తూ వుంది.

### భాగవత కళ, నవాబుల ఆదరణ :

భాగవత కళను రాయలసీమలో విరివిగా ప్రచారం చేయవలెనన్న తలంపుతో క్రీ॥ శ॥ 1700-1750 ప్రాంతాలలో బనగానిపల్లె నవాబుగారు కూచిపూడి నుండి కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి కోటకొండ, కపట్రాల గ్రామాలలో వారికి భూములు ఇచ్చి, వారిచేత కర్నూలు జిల్లాలో భాగవతకళ ప్రచారాన్ని ప్రోత్స హించారు. అప్పటిలో కూచిపూడి నుండి తరలివెళ్ళిన కుటుంబాలలో ప్రథముడు చల్లా భాగవతం దాసంభొట్లు. సిద్ధేంద్రయోగి నేర్పించిన పారిజాతాపహరణాన్ని పారం పర్యంగా ప్రదర్శించినవారిలో చల్లావారు ముఖ్యులు. తొమ్మిదవ తరానికి భరత శాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రి సుప్రసిద్ధ నాట్యకళా విశారదుడు. భామాకలాపాన్నీ, గొల్ల కలాపాన్నీ, క్షేత్రయ్య పదాలనూ, తరంగాలనూ అభినయించడంలో దిట్ట. సంగీతనృత్య విద్యల్లోనే కాక, సంస్కృతాంధ్ర భాషల్లో చక్కని పాండితీ ప్రతిభ గడించినవారు.

## ఆదరించిన కర్నూలు నవాబు :

కూచిపూడి వీధి భాగవతులకు గోలుకొండ నవాబు తానీషా ఎలా అగ్రహారాన్ని దానం చేశాడో అదే విధంగా కోటకొండ భాగవతులకు కర్నూలు నవాబు 200 ఎకరాల భూమి శ్రోత్రియంగా ఇచ్చారట. ఆ హక్కు ఈ నాటికి వారి అనుభవంలో వుంది.

వీరి ఇలవేల్పు కొలటల్ల చెన్నకేశవుడు. వీరి కుటుంబంలోని ప్రతి మగపిల్లవానికి ఐదవ ఏట ఆ దేవాలయంలో ముక్కు కుట్టిస్తారట. ఆ దేవుని ఎదుట గజ్జె కట్టించి, ప్రథమ పాఠాలు ప్రారంభిస్తారట. విద్య పూర్తికాగానే చెన్నకేశవుని సన్నిధానంలో ప్రథమ ప్రదర్శనం ఇచ్చిన అనంతరం గాని రాజులవద్ద ప్రదర్శించేవారు కారట. వీరికి ఎక్కువ మక్కువతో అభ్యాసమైన విద్యలు, తరంగాలు, అష్టపదులు క్షేత్రయ్య పదాలు.



భరతశాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రి కోటకొండ భాగవతులు

## కపట్రాల భాగవతులు :

రెండువందల సంవత్సరాలకు పూర్వం బనగానిపల్లి నవాబులు కర్నూలు సమీపంలో తుంగభద్రా నదికి అవతల ప్రక్కన అలంపురానికి దగ్గరగా నున్న చారిత్రక సుందర నగరం కపట్రాల. వీరికి ఈనాముగా యిచ్చారు. ఆనాడే కూచిపూడి నుండి కొంతమంది చల్లావారు కుటుంబాలతో అక్కడకు వెళ్ళారు. కూచిపూడి సంప్ర

దాయాన్నే వారు నైజాం సంస్థానంలో ప్రచారం చేశారు. కాని రాను రాను వారి కళాసంప్రదాయం నిర్జీవమైపోయింది.

వీరు కూడ ఆ గ్రామంలో వున్న కాళత్తయ్య దేవాలయంలో బిడ్డ లందరికి చిన్నతనంలోనే ముక్కులూ, చెవులూ కుట్టించి, గజ్జె కట్టించి నాట్యాభ్యాసానికి ప్రారంభోత్సవం చేసేవారట. అక్కడ వున్న కళాకారులు చల్లా మోహనకృష్ణ, చల్లా కాళత్తయ్య, చల్లా ముద్దుకృష్ణ మొదలైనవారు వీధి భాగవతాలను ప్రచారం చేశారు.

చల్లావారు :

సిద్ధేంద్రయోగి పేరు నిలబెట్టినవారు చల్లావారు. ఈ మధ్య కీర్తిశేషులైన భరతశాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రి. వారిలో తొమ్మిదవ తరానికి చెందినవారు. శాస్త్రి గారు ఆ కళాకారుల కుటుంబానికి చెందిన సుప్రసిద్ధ నాట్య కళావిశారదులు. భామా కలాపాన్నీ, గొల్ల కలాపాన్నీ క్షేత్రయ్య పదాలనూ, తరంగాలగానూ అభినయించ డంలో దిట్ట. నృత్యవిద్యల్లోనే గాక, సంస్కృతాంధ్ర భాషలలో చక్కని పాండితీ ప్రతిభ గడించారు. నృత్యరీతిలో వీరి బాణీకీ, కూచిపూడివారి బాణీకీ అడుగుల క్రమంలోనూ, జాతి విన్యాసాల్లోనూ తేడా వున్నట్లు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారిచేత జరుపబడిన కూచిపూడి నాట్య సదస్సులో వివరించారు. వీరి కలాపంలో కొన్ని భాగాలను ఆనాడు అఖిలభారతసంగీత నాటక అకాడమీవారు రికార్డు చేశారు. వారి సంప్రదాయం ఎటువంటిదో మనకు తెలియకుండా పోయింది.

కోటకొండలో ఈ నాటికీ ఉన్న లక్ష్మీనారాయణశాస్త్రిగారి అన్న కుమారుడైన రంగయ్యగారికి భరతనాట్య శాస్త్రంలో అభి నివేశం అట్లాగే వున్నదట. మరికొందరున్నా జీవనోపాధి కష్టమై ఇతర వృత్తులలోనూ, వ్యవసాయంలోనూ ఆసక్తిని పెంచు కున్నారు.







# కాశీ కథలు చెప్పే కాశీకావడి

కాషాయ వస్త్రాలను ధరించిన వ్యక్తి కాశీకావడి అంటూ ఒక కావడిని భుజాన వేసుకుని రెండు ప్రక్కలా పసుపురంగు బట్టతో మూతగట్టిన బిందెలుగానీ రెండు బుట్టలుగానీ కావడి బద్దకు కట్టి, కావడిలో కాశీ విశ్వనాథుని విగ్రహాలను వుంచి, పసుపు కుంకాలతోనూ, పుష్పాలతోనూ అలంకరించుతారు.

## బొమ్మల చిత్ర పటం :

ఆ కావడి కొమ్ముకు మూడుగజాల చిత్రపటాన్ని, ఒకప్రక్క కావడి కొమ్ముకు తగిలించి, కాశీ విశ్వనాథుని సందర్శనాన్ని గురించి వారు ప్రయాణించే దీర్ఘప్రయాణంలో దర్శించే క్షేత్రాలను గురించీ, పూర్వకాలంలో కాశీయాత్ర చేయాలంటే ఎంత కష్టమో ఈ కథ ద్వారా వినిపిస్తారు.

యాత్రికులు బయలుదేరిన దగ్గర నుంచీ, కాశీకి పోయే దారిలో, అడవుల్ని గురించి, ప్రకృతి వర్ణన గురించీ, క్రూరమృగాల ఆర్భాటాలూ, నదీ ప్రవాహాలూ, వత్రాలూ, దొంగల దోపిళ్ళూ, మజిలీలూ, ఇతర యాత్రా స్థలాలూ, పర్వతాలలో ప్రయాణం, చివరికి కాశీ విశ్వనాథుని సందర్శనం. ఈ మధ్యలో వచ్చే బాధల్ని గురించీ, క్రూరమృగాల బారి నుండి తప్పుకోవడం గురించీ, వరుసక్రమంలో కథను నడుపుతూ ఆ కథా సంవిధానంలో అన్ని రసాలనూ చిత్రిస్తూ, చివరికి అన్ని కష్టాలనూ అధిగమించి, కాశీ విశ్వేశ్వరాలయానికి చేరి ముక్తి పొందడంగా దీనిని జీవితానికి అన్వయించి, మనం స్వర్గానికి చేరుకోవడం ఎంత కష్టమో, ఈ కష్టాలను ఉదాహరణగా చెపుతారు. కథకుడు ద్విపద నడకలో కథను బహుళబ్బుగా నడుపుతాడు.

## ప్రజల మధ్యలో పగటి వినోదం :

ముఖ్యంగా ఈ కాశీ కావడి చిత్ర కథా విధానం, పగటిపూట ప్రజల మధ్యనే జరుగుతుంది. ఎక్కువగా ఉదయపు సమయాల్లోనే జరుగుతుంది. కథా కాలం కనీసం అరగంటసేపు వుంటుంది. కాశీ కావడి, కాశీ కావడి అంటూ గంటలు మ్రోగించుకుంటూ నడిబజారులో కావడి దించి, కథకుడు కథను ప్రారంభిస్తాడు. పిల్లా జల్లా ముందుగా వస్తారు. తరువాత పెద్దవాళ్ళు ఆ తరువాత స్త్రీలూ అందరూ కావడి చుట్టూ మూగుతారు.

ఆ రోజుల్లో కాశీక్షేత్రాన్ని సందర్శించడమంటే విదేశాలకు వెళ్ళి తిరిగివచ్చి నట్లే. ధనవంతులు తప్ప ఆ క్షేత్రాన్ని ఇతరులు దర్శించలేకపోయేవారు. ఈ చిత్ర కథావధానం ద్వారా, వారు కాశీక్షేత్రాన్ని చూసినట్లే అనుభూతి చెందేవారు.

కథాంతానికి అందరూ రససిద్ధిని పొందేవారు. ఆధ్యాత్మిక చింతనతో, తృప్తి పొంది ఎవరికి తోచిన పారితోషికాలను వారు ముట్టచెప్పేవారు.

ఈ విధంగా కథకుని ఒడి నిండి మరో వీధికి బయలుదేరేవాడు. వీరి బొమ్మ లన్నీ చీరలమీద వరుసగా చిత్రించబడి అతి సుందరంగా వుంటాయి. అవి బందరు కలంకారీ బొమ్మల రంగుల్లో వుంటాయి.

బొమ్మలద్వారా కథ చెప్పడంవల్ల చదువురాని వయోజను లందరికీ ఈ కథా విధానం సుబోధకంగా వుండేది. వీరు కేవలం కాశీమహత్తునే కాక, ఆ యా జాతుల, మతాలవారి దేవతలను గురించీ, దేవుళ్ళను గురించీ కూడా కథలు చెపుతారు. ఆనాడు ఈ చిత్రకథా విధానాన్ని కాశీకావడి ద్వారా చెప్పేవారు. ఎంతో భక్తిశ్రద్ధలతో చెప్పే వారు. వినేవారు కూడా అలాగే వినేవారు. అయితే రాను రాను ఈ కళారూపం భక్తినీ, ముక్తినీ ప్రబోధించేకంటే భుక్తికే ప్రాధాన్య మిచ్చి యాచక వృత్తిలో దించేశారు.

## కాశీకి పోయాను రామాహరి :

కాశీకావడి కళారూపం ఈనాడు అంతగా ప్రచారంలో లేకపోయినా, అక్క డక్కడా ఈ కావడి ప్రదర్శనంతో బ్రతుకుతున్నవారు కూడా కనిపిస్తారు.

బ్రాహ్మణ వేషాలతో కావడిని మోసుకుంటూ బజారున పడి కాశీకి పోయి వచ్చామనీ, గంగతీర్థం తెచ్చామనీ, కాశీవిశ్వేశ్వరుని పటాలు చూపిస్తూ

వుంటారు. ఇలాంటి వారిని గురించి, వెలువడిన జానపద గేయం ఈ విధంగా వుంది.

కాశీకి పోయాను రామాహరీ
కాశి తీర్థమే తెచ్చాను రామాహరీ
కాశీకి పోలేదు రామాహరీ
వూరి కాల్వలో నీరండి రామాహరీ
కాశీకి పోయాను రామాహరీ
కాశీ విభూతి తెచ్చాను రామాహరీ
కాశీకి పోలేదు రామాహరీ
వీడి, కాష్టంలో బూడిదండీ రామాహరీ
పంచేంద్రియాలూ రామాహరీ
నేను బంధించి యున్నాను రామాహరీ
కొంచెము నమ్మినా రామాహరీ
కొంప ముంచివేస్తాడండి రామాహరీ
ఆలుబిడ్డలు లేరు రామాహరీ
ఆత్మయోగే నండి రామాహరీ
అలుబిడ్డ లెల్ల రామాహరీ
వీనికా యూరనున్నారు రామాహరీ

అంటూ కాశీయాత్రను వ్యంగ్యంగా చిత్రించి చుట్టూ మూగిన వూరి జనాన్ని నవ్వించి, ఆ విధంగా పారితోషికాలను పొంది బ్రతుకును వెళ్ళబుచ్చుకునే వారు.

పూర్వకాలంలో చాలామంది మోక్షం కోసం, పుణ్యం కోసం కాశీయాత్రలు చేసేవారు. ఈ నాడు కాశీయాత్ర అంత కష్టమైన పనికాదు. ఈ కాలంలో బ్రతకడం కోసమే, కాశీ కావడి ప్రదర్శనాల నిస్తున్నారని లక్ష్మీకాంత మోహన్‌గారు అంటున్నారు.



# సంతోషాల వసంతోత్సవాలు



వసంతోత్సవం ఋతు సంబంధమైన పండుగలలో ఒకటి. వసంత కాలంలో మన్మథుని గురించి ఈ వుత్సవం జరుగుతుంది. ఈ వసంతోత్సవం గురించి వాత్స్యాయనుని కామ సూత్రాల్లోనూ, శ్రీ హర్షుని రత్నావళి నాటకంలోనూ , కాళి దాసుని మాళవికాగ్ని మిత్ర నాటకంలోనూ ప్రస్తావించబడింది. ముఖ్యంగా రత్నావళి నాటకం ఈ వసంతోత్సవంతోనే ప్రారంభమౌతుంది.

ఆంధ్రదేశంలో ఈ మదన మహోత్సవానికి, వసంత మహోత్సవమనీ, కాముని పండుగనీ ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు కాముని పూర్ణిమ అనీ పేరు. 14 వ శతాబ్దానికి పూర్వం ఈ వసంతోత్సవాలు ఏ విధంగా జరిగేవో తగిన ఆధారాలు లేవు. కాని కొండవీటి రెడ్డిరాజుల కాలంలోనూ ఆ తరువాత కాలంలోనూ ఈ వసంతోత్సవాలు ఎలా జరుపబడుతూ వుండేవో తెలుసుకోవడానికి, శ్రీ నాథుని భీమేశ్వర పురాణంలోనూ, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోనూ వసంతోత్సవాలను గురించి విపులంగా వర్ణింపబడింది.

## వసంత శోభలు :

ఆ కాలంలో వసంతోత్సవాలకు రాజనగరునూ నగరుకు వెలుపలనున్న వుద్యానవనాన్నీ మనోహరంగా అలంకరించి, వుద్యానవనంలో ఒక పూజా మండపాన్ని వివిధ దేవతలకు పూజా వేదికలను నిర్మించి, తోరణాలతోనూ; పుష్పాలతోనూ, సుగంధ ద్రవ్యాలతోనూ వైభవంగా పూజామండపాన్ని అలంకరించి; రతీ మన్మథులను, లక్ష్మి, విష్ణువులను, శివ పార్వతులను, దేవేంద్రుడు, శచీదేవి, వసంతుడు, విఘ్నేశ్వరుడు మొదలైన విగ్రహాలను వేదికలమీద వుంచి, మహారాజు అశ్వారూఢుడై మంత్రులు, సామంతులు, దండనాయకులు, పురోహితులు, విదూషకులు, పురజనులు వెంటరాగా బ్రహ్మాండమైన మంగళ వాయిద్యాలతో ఉద్యాన వనానికి బయలుదేరేవాడు.

## కప్పాలూ, కానుకలు :

ఈ విధంగా ప్రారంభమైన వసంతోత్సవంతో వారి వారి విద్యల్ని ప్రద ర్శించి పారితోషికాలు పొందటానికి నటీనటులు, శిల్పులు, చిత్రకారులు, సంగీత విద్వాంసులు మొదలైన అనేకమంది కళాకారులు హాజరయ్యేవారు. రాజ్యం నలు మూలల నుంచీ ఈ వసంతోత్సవాలను తిలకించడానికి ఆబాలగోపాలం కదలి వచ్చేది. ఆ నాటి వసంతోత్సవాలు రాజుకు, ప్రజలకు పండుగగా మారింది.

వుత్సవం ఈ విధంగా సాగుతూ వుండగా రాజుకు, సామంతరాజులూ, మండలేశ్వరులూ మొదలైనవారు కానుకలనూ, కప్పాలనూ ఈ సందర్భంలో



చెల్లించేవారు. విదూషకులు వినోద గోష్టి జరిపేవారు. రాజు వెంట వచ్చిన సుందరీ మణులు వనంలో వుయ్యాలలూగుతూ, ఏలపాటలతోనూ, జాజరపాటలతోనూ కాల క్షేపం చేసేవారు. రాజు రాజులతో కలిపి; మన్మథునీ, తదితర దేవతలనూ పూజించి, బ్రాహ్మణ దంపతులకు కర్పూర తాంబూలాలను సమర్పించేవారు.

## ఽగులల వసంతం :

తరువాత రాజు చందనాది సుగంధ ద్రవ్యాలనూ, కర్పూరపీరాజనాలనూ వినోద ప్రారంభానికి చిహ్నంగా జన సమూహంపై చల్లేవాడు. ఆ తరువాత జన

సమూహం ఒకరిపై మరొకరు పరిమళ ద్రవ్యాలను రంగులతో కలిపిన వసంతాన్ని చల్లుకొని వావివరుసలు లేకుండా తటాకంలో దిగి జలక్రీడలతో విహరించేవారు.

కళాకారులకు ఘన సత్కారం :

ఆ తరువాత మహారాజు.... నిండు కొలువులో గాయకులకు, శిల్పులకు, నట్టువరాండ్రకు, నటీ నటులకు బహుమానాలను సమర్పించి, పండితులను వేద పఠనాల మధ్య సన్మానించి, ఆ నాటి రాత్రంతా.... జాగారం చేసేవాడు. నాటక ప్రదర్శనాలతోనూ సంగీత నృత్యాలతోనూ తెల్లారేది.

రెడ్డిరాజుల్లో అనవేమారెడ్డి, ప్రప్రథమంగా ఈ వసంతోత్సవాలను ప్రవేశ పెట్టాడు. ఆనాటి నుండి రెడ్డి సామ్రాజ్యంలో వసంతోత్సవాలు వైభవోపేతంగా జరుగుతూ వుండేవి. ఆ మహోత్సవ సమయాలలో కర్పూరాది పరిమళ ద్రవ్యాలను వెదజల్లడం వలన అనవేమారెడ్డి కుమారగిరి రెడ్డి రాజులకు, వసంత రాయ, కర్పూర వసంతరాయ బిరుదులు కలిగాయి; రెడ్డిరాజుల కాలంలో వసంతోత్సవాలు, జాతీయ వుత్సవాలుగా జరిగేవి. విజయ నగర రాజుల కాలంలో కూడా ఈ వసంతోత్సవాలు, ముమ్మరంగా జరుగుతూ వుండేవి.



# ఘటనృత్యం

ఆంధ్రదేశపు జానపద నృత్యాలలో ఈ ఘటనృత్యం ఒకటి. ఇతర నృత్యాలవలె ఎప్పుడుపడితే అప్పుడు ప్రదర్శించే నృత్యంకాదిది. ఏ పర్వదినాల్లోనూ ఈ నృత్యాలు జరగవు. ఒక్క జాతర్ల సందర్భాలలో తప్పా మరెప్పుడూ ఈ ఘటనృత్యాలు జరగవు.

గరగల సంప్రదాయానికీ, ఘటానికీ దగ్గర సంబంధమున్నా రెంటికీ కొంత వరకు వ్యత్యాసం వుంది. కృష్ణా గుంటూరు జిల్లాలలో ఒకప్పుడు విరివిగా వాడుకలో వుండేవి. జాతర్లూ, జంతుబలులూ తగ్గిన తరువాత ఈ ఘటవృత్యాలు కూడా తగ్గి పోయాయి. ఆంధ్రదేశంలో అనాదినుంచీ ప్రదర్శింపబడే ఈ నృత్యం జాతర్ల సంద ర్భంలో ప్రదర్శిస్తారు. పల్లెల్లో పశువులకు జాడ్యాలు వచ్చినప్పుడు కలరా, మశూచికం వ్యాపించినప్పుడు దేవతలకు ముడుపులు కట్టి మ్రొక్కుతారు. ఇలా మ్రొక్కిన కొన్ని దినాలకు గ్రామంలో ఇంటింటికీ చందాలు వసూలుచేసి గ్రామ మధ్యలో దేవతల విగ్రహాలను ప్రతిష్ఠించి ఒక నెల రోజులు పంబల కథలతో సాధులతో

రాత్రిళ్ళు ప్రదర్శనలిస్తూ సన్నాయి వాయిద్యగాళ్ళ వీరంగ వాయిద్యంతోనూ, కనక తప్పెట్లతోనూ మహోధృతంగా జాతర చేస్తారు. ఇలా జరిగే జాతరకు ముందు నెల రోజులుపైన వివరించిన ఘటం కుండ. ఊరంతా ఇంటింటికీ తిరిగి, అన్నం, మజ్జిగలను కుండతో సేకరిస్తారు. ఇలా ప్రతి ఇంటివద్దనూ సేకరించిన, అన్నం మజ్జిగను వాయిద్యకారులూ రజకులూ పంచుకుంటారు.



## రజకుల ప్రాతినిధ్యం:

ఇలా ఘటాన్ని నెత్తిన పెట్టుకుని వూరేగేవారు. చాకళ్ళు (రజకులు) ఘటం ఎత్తుకున్న వ్యక్తి ఎంతో ఉద్రేకంగా నృత్యం చేస్తాడు. ఇలాచేసే నృత్యానికి ఏ విధమైన శాస్త్రీయతా వుందని చెప్పలేము. కాని ఇది ఆవేశనృత్యం, ఘటనృత్యం చూసేటందుకు చాలా వుత్తేజంగా వుంటుంది. ఘటం ఇంటింటికీ తిరిగి అన్నం మజ్జిగ సేకరించడంలో వుద్దేశం కేవలం దేవతల సంతృప్తి కోసం అందుకు ప్రతి ఇంటివారూ ప్రసాదం వేస్తారు.

ఘటం కుండను, పసుపుతోనూ, కుంకంతోనూ అలంకరిస్తారు. ఘటం యొక్క అంచుకు చుట్టూ వేపాకుతోరణం కడతారు. ఘటాన్ని చూస్తూనే అది ఒక దేవతామూర్తిగా కనబడుతుంది. ఇక ఘటం ఎత్తుకున్న వ్యక్తి పూజ్యభావంతో ఎవరితోనూ మాట్లాడక, తప్పెట్ల వాయిద్యానికి అనుగుణంగా వీరనృత్యం చేస్తాడు. అలా చేసే నృత్యం ఎంతో భక్తిభావంతోనూ, నిండు నమ్మకంతోనూ జరుగుతుంది.

ఇలా జరిగే ఘట నృత్యానికి ఏవిధమైన సాహిత్యంగాని వుండదు. కేవలం మూగతాండవం ఎంతో ఆవేశపూరితంగా జరుగుతుంది....ఇలా ఆవేశంగా జరిగే నృత్య సమయాల్లో కొంతమందికి పూనకం వస్తుంది.........ఇలా గణం పూనిన వ్యక్తులు చిందులు, శివాలు త్రొక్కుతారు. ఇలా త్రొక్కడం ప్రళయ తాండవ నృత్యంలా వుంటుంది. ఈ నృత్యాలు ఏ గ్రామంలో జాతర జరిగితే ఆ గ్రామంలో మాత్రమే ఈ ఘటనృత్యాలు జరుగుతూ వుంటాయి. కానీ ఈనాడు జాతర్ల ప్రభావం తగ్గుతున్న కొద్దీ, ఈ నృత్య ప్రభావం కూడా తగ్గిపోతూ వుంది.



# అందర్నీ ఆకట్టుకున్న బుట్టబొమ్మలు



ఈ తరం వారికి బుట్ట బొమ్మలను గురించి అంతగా తెలియకపోయినా ఆ నాటి తెలుగు ప్రజల్లో బుట్ట బొమ్మలను గురించి తెలియని వారెవరూ వుండరని చెప్పుకోవడం అతిశయోక్తి కాదు.

బుట్ట బొమ్మలు, పెళ్ళి వూరేగింపులలోనూ దేవుని కళ్యాణ వుత్సవ సమయాల్లోనూ, పెద్ద పెద్ద తిరునాళ్ళలోనూ, జాతర్లలోనూ ప్రదర్శింపబడుతూ వుండేవి.

బుట్ట బొమ్మలు ప్రజా సమూహాల మధ్య ఎత్తుగా వుండి అందరికీ కనిపించే తీరులో అందర్నీ ఆకర్షిస్తూ వుంటాయి.

ఇతర కళారూప ప్రదర్శనాలకు ప్రజలు ఎలా ఆకర్షితులౌతారో, ఈ బుట్ట బొమ్మల ప్రదర్శనాన్ని కూడా వింతగా చూస్తారు.

ఈ బొమ్మలు ఎవరితోనూ మాట్లాడవు. ప్రజలమధ్య తిరుగుతూ వినోద పరుస్తాయి.

## బొమ్మల శృంగారం :

ఈ బొమ్మల్ని పురుషులే ఆడిస్తారు. ఈ బొమ్మల్లో భార్యాభర్తలు. వారి ప్రేమ కలాపాలు, వారి ప్రేమను భగ్నంచేసే దుష్టపాత్ర, స్త్రీ బొమ్మతో కామకేళీ విలాసాలు. ఇది చూచిన భర్త బొమ్మ వెంటబడి దుష్టపాత్రధారిని తరమడం తరువాత భార్యవెంట పడటం, స్త్రీ పాత్ర క్షమించమని వేడుకోవటం, ఇలా బొమ్మల ప్రదర్శనం జరుగుతుంది. ఈ ప్రదర్శనానికి కూడా డప్పుల వాయిద్యముంటుంది. బొమ్మను ధరించిన పాత్రధారి కాళ్ళకు గజ్జెలు కట్టుకునే అడుగులు వేస్తాడు.

అలాగే ఈ బుట్ట బొమ్మల్లో పాములవాడి బొమ్మ ఉంటుంది. నాగస్వరం ఊదుతూ, నృత్యంచేస్తూ వుంటుంది. ఒక్కొక్కసారి ఈ బొమ్మలు నాలుగైదు కూడా వుంటాయి......వీటిలో శింగి, సింగడులాంటి హాస్య పాత్రలు కూడా వుంటాయి.

ఈ బొమ్మలు అతి సహజంగా జీవకళ వుట్టిపడేలా రంగు రంగులలో చిత్రించబడి వుంటాయి.

ఈ బొమ్మలు పైభాగమంతా బొమ్మ ఆకారంగా వుండి లోపలి భాగం డొల్లగా వుండి బొమ్మయొక్క కళ్ళ భాగంలోనూ, నోటిదగ్గరా రంధ్రా లుంటాయి. ఆటగాడు ఈ లోపలి భాగంలోకి దూరి, తలను దూర్చి నృత్యంచేస్తే కేవలం బొమ్మే అభినయించినట్లుంటుంది.

కట్టా సూర్యనాయయణ :

ఈ బొమ్మలను తయారుచేయడంలో పశ్చిమ గోదావరి జిల్లా, తణుకుకు చెందిన కట్టా సూర్యనారాయణ, బుట్ట బొమ్మల తయారీలో నేర్పరి. ఆయన



బొమ్మల తయారీని తన తండ్రి యల్లయ్య వద్ద నేర్చుకున్నాడు. యల్లయ్య 1930 లో దసరా వుత్సవాలకు మైసూరు వెళ్ళి, బుట్ట బొమ్మలు చూసి తయారీ నేర్చుకుని వచ్చాడు.

ఈ బొమ్మల తయారీకి చింతగింజలు, వెదురు... రంగులు అవసరమౌతాయి. ఒక బొమ్మ తయారీకి నాలుగు కేజీల చింతగింజలు, రెండు వెదురుగడలు

అవసరం. బొమ్మ పూర్తిగా తయారవడానికి నెల రోజుల సమయం పడుతుంది. చింతగింజలను నానబెట్టి, ఉడికించి, గుజ్జు తయారుచేస్తారు. వెదురుతో తయారు చేసిన ఆకారానికి గుజ్జు పులిమి అది ఆరాక రంగులు తీర్చిదిద్దుతారు. ఒక బొమ్మ తయారీకి వెయ్యి రూపాయల పెట్టుబడి అవసరం. ప్రదర్శనలు లేని సమయంలో, బొమ్మల పరిరక్షణకు ఎంతో శ్రద్ధ వహించాల్సి వుంటుంది. కలరా వుండలు (నెప్తలిన్ బాల్సు) ఎలుకల మందులువేసి గుడ్డలు చుట్టి భద్రపరుస్తారు,

## ప్రదర్శన రక్తి :



బుట్టబొమ్మల ప్రదర్శనాన్ని రక్తి కట్టించాలంటే కనీసం పది మంది కళాకారులైనా వుండాలంటారు సూర్యనారాయణగారు. వీరిలో బొమ్మలను తయారుచేసేవారు కొందరైతే, వాయిద్యాలు వాయించేవారు కొందరు. దేవతా మూర్తుల బొమ్మలతో జరిగే ప్రదర్శన అత్యద్భుతంగా వుంటుంది.

ముఖ్యంగా ఈ బొమ్మలు పెద్దవాళ్ళతో పాటు పిల్లల్ని కూడ ఎంతగానో ఆకర్షిస్తాయి. జనం మధ్యలో అవి ఎంతో ఆకర్షవంతంగా చూడ ముచ్చటగా వుంటాయి. ప్రణయవిలాసాలూ, ప్రణయ కలహాలూ చివరికి సుఖాంతాలూ, యవ్వనంలో వున్న యువతీ యువకుల్ని ఎక్కువగా అకట్టుకుంటాయి. మధ్య మధ్య వచ్చే సింగీ సింగడు లాంటి హాస్యబొమ్మలు లాంటివి పిల్లల్ని ఎక్కువగా ఆకర్షిస్తాయి. బుట్టబొమ్మలను మనుషులే ఆడించినా, బొమ్మలే మనుషుల్లాగా ఆడుతున్నాయనే భ్రమను కలిగిస్తాయి. ఉత్సవ సమయాల్లోనూ, పెళ్ళిళ్ళ సమయాల్లోనూ వివిధ రకాలైన వినోదాలకు ఎటువంటి అవకాశా న్నిస్తారో ఈ బుట్టబొమ్మలకు కూడ అంతటి ప్రాముఖ్యమిస్తారు. రాష్ట్రవ్యాప్తంగా ఈ బొమ్మలను ఆడించే కళాకారులు ఇరవై అయిదు మంది వరకూ వున్నారు. సూర్యనారాయణగారు రాష్ట్రంలోనే కాక ఢిల్లీలో కూడ ప్రదర్శన లిచ్చారు. ప్రభుత్వం జరిపిన అప్నా ఉత్సవంలోనూ, రిపబ్లిక్ ఉత్సవంలోనూ కూడా మన బుట్టబొమ్మలు ప్రదర్శించబడ్డాయి. బుట్టబొమ్మలు ఈ నాటికీ ఆడించ తగినవే.



# సూళ్ళూరు పేట
# సుళ్లు ఉత్సవం



ఈ ఉత్సవం అన్ని ప్రాంతాల్లోనూ లేకపోయినా, కొన్ని ప్రాంతాల్లో జరుగుతూ వుంటుంది. మరికొన్ని చోట్ల సిడిబండి ఉత్సవాలు, గాలపుసిడి ఉత్సవాలు జరుగుతూ వుంటాయి. నా చిన్నతనంలో సిడిబండి ఉత్సవాన్ని కృష్ణా జిల్లా ఉయ్యూరు వీరమ్మ తిరుణాళ్ళలో చూశాను.

సుళ్ళు ఉత్సవం ఈ నాటికీ నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేటలో చెంగాళమ్మ తిరునాళ్ళలో జరుగుతూ వుంటుంది. అనాదిగా ఈ ఉత్సవం జరగటంవల్లనే ఆ ఊరికి సూళ్ళూరుపేట అనే పేరు సార్థకమైన దంటారు.

సూళ్ళూరుపేటలో చెంగాళమ్మ దేవస్థానంలో ప్రతి ఏటా బ్రహ్మోత్సవాలు జరుగుతూ వుంటాయి.

ఈ ఉత్సవంలో సుళ్ళు ఉత్సవానికి ఎంతో ప్రాముఖ్యాన్నిస్తారు. రాష్ట్రం మొత్తంమీద ఇక్కడ జరిగినంత బ్రహ్మాండంగా ఈ ఉత్సవం మరెక్కడా జరగ దంటారు. సాయంత్రంపూట ఆలయ ప్రాంగణంలో దాదాపు ముప్పై ఆడుగుల ఎత్తులో ఒక స్తంభం నాటి పైభాగాన ఓ రాట్నం అమరుస్తారు. ఆ రాట్నానికి నలభై అడుగుల పొడవున్న మరో కొయ్యను అమర్చి దానికి ఒకవైపు పాలవెల్లి చక్రం కడతారు. ఆ చక్రానికి జీవంతో వున్న మేకనూ, మనిషి బొమ్మనూ, రోలు. ఒడిబాల ఏర్పాటుచేసి పూలమాలలతో వాటిని అలంకరించి ఒక్కోసారి తొమ్మిది చుట్లు తిప్పుతారు.

ఇలా సిడిమాను తిరిగే సమయంలో దానికి కట్టి వున్న మేక భయంకరంగా అరుస్తుంది. క్రింద యువకులు మేళతాళాలతో ఆవేశంతో నృత్యం చేస్తూ వుంటారు. తప్పెట్ల మోతలతో దద్దరిలచేస్తారు. ఈ దృశ్యాన్ని ఉత్సవానికి వచ్చిన ప్రజలు విరగబడి చూస్తారు. ఇంత ప్రాముఖ్యంగా సుళ్ళు ఉత్సవం జరగడంవల్ల దీనికి కొంతకాలం సుళ్ళూరు అని పిలిచేవారు. అది క్రమానుగతంగా సూళ్ళూరుపేటగా మారిపోయింది.

చెంగాళమ్మ తిరునాళ్ళలో అన్నిటికన్నా ఆసక్తికరమైన కళా రూపం ఈ సుళ్ళు తిరగటమే. ఈ ఉత్సవంలో మహిషాసురమర్దన తెప్పోత్సవాలు వైభవంగా

జరుగుతాయి. ఈ ఉత్సవాలకు ఒక్క నెల్లూరు జిల్లా నుంచే కాక, చిత్తూరు, తమిళ నాడు ప్రాంతాల నుంచి కూడా ప్రజలు తండోపతండాలుగా వస్తారు. చెంగాళమ్మ దేవాలయం, మద్రాసు — కలకత్తా ట్రంకురోడ్ ప్రక్కనే వుంది. వచ్చే పోయే వాహనాలవారు అక్కడ ఆగి పూజలు జరిపి వెళుతూ వుంటారు. చెంగాళమ్మ మహత్తు కలిగిన దేవతగా కొలుస్తారు.

బ్రహ్మోత్సవ కార్యక్రమాలు జరిగినన్ని రోజులూ, సంగీత, నృత్య, నాటక, సాంస్కృతికోత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతాయి. విద్యుద్దీపాలతో ఆ ప్రాంతాన్నంతా రంగురంగుల బలుబులతో అలంకరిస్తారు. ఈ ఉత్సవంలో ఎక్కడా కనిపించని సుళ్ళు తిరిగే సిడిబండి ప్రత్యేక ఆకర్షణ.



# పండరి భజనలు



ఈ కళారూపం మహారాష్ట్రానిది. పండరిపురంలోని పాండురంగని వేడుకుంటూ చేసే నృత్యం. పండరి భక్తులద్వారా దేశమంతటా వ్యాపించింది. ఇది నృత్య ప్రధానమైన భజన. చేతిలో చిరుతలు, నోటితో పాట. పాటకు తగిన అభినయం. ప్రాముఖ్యం వహించే వాయిద్యాలు. డోలక్-మద్దెల, కంజిరా, తంబూరా, తాళాలూ, హార్మోనియం మొదలైన వాయిద్యాలతో కూడిన పండరి భజన ఎంతో ఇంపుగానూ సొంపుగానూ వుంటుంది.

## అందరి భజన :

పండరి భజనల్లో అన్ని తెగలవారూ పాల్గొంటారు. వీరికి గురువు వుంటాడు. ఇతడు పల్లెలు తిరుగుతూ పండరి భజనలు నేర్పుతూ పొట్ట పోసుకుంటాడు. ఈ భజనలు ఒక ప్రాంతమని కాక ఆంధ్రదేశంలో చాలాచోట్ల చేస్తారు. ఈ భజనలు రాయలసీమ ప్రాంతంలో ఎక్కువగా జరుగుతాయి

ఈ నృత్యంలో చిన్నపిల్లలే ఎక్కువగా పాల్గొంటారు. పిల్లలకు కాషాయగుడ్డను నడుముకు కట్టించి, పసుపుపచ్చని జెండాను మూరెడు పొడవు కట్టెకు కట్టించి కుడి చేతిలో పట్టిస్తారు. కాళ్ళకు గజ్జెలు కట్టి బాలబాలికలు సుమారు ఇరవైమంది దాకా పాల్గొంటారు. గురువు మధ్యలో వుంటూ ఒక్కొక్క భంగిమను చూపిస్తూవుండగా, చుట్టూ పిల్లలు వృత్తాకారంలో నిలబడి అదే భంగిమను అభినయిస్తారు.

ప్రప్రథమంగా గురువు తాళాన్ని ఇలా ప్రారంభిస్తాడు. తక-తక-త-తక-తక తక-తకిట-తా-కిట-తకిట తకిట-తకిట. తరువాత పిల్లలు గురువుకు నమస్కరిస్తారు.

నృత్యం ప్రారంభించే ముందు గ్రామంలోని అన్ని దేవతల పేరులను చెపుతాడు. అప్పుడు పిల్లలంతా ఇలా జై జై అంటారు. పాండురంగస్వామికి జై -కదిరి నరసిమ్మస్వామికి, జై గుంతకల్లు కసాపురం ఆంజనేయస్వామికి జై అంటూ పేరు పేరునా జై కొట్టిస్తాడు.

## జై, జై విట్టల్:

తరువాత ఈ విధంగా ప్రారంభిస్తారు.

విట్టల్ విట్టల్ - జై జై విట్టల్
పాండురంగ విట్టల్ - పండరినాథ విట్టల్
గోవిందమ్ భజగోవిందమ్
ఆనందం బ్రహ్మానందం.

అంటూ కీర్తన పాడుతూ, అన్ని గతులలో తాళం వేస్తూ, అడుగులు వేస్తూ, నృత్యం చేస్తూ, మధ్య మధ్య ఆహా అంటూ ఛలో అంటూ—

పురమును చూడండి పండరిక్షేత్రము చూడండి ॥పుర॥
సత్యమైన సక్కూబాయిదేవిని చూడండి
మీరు ధరణిలో ధర్మవరము గ్రామము చూడండి
అందమైన బాలభక్తుల భజన చూడండి

ఒక్కొక్కసారి నృత్యంలో పిల్లలంతా గొలుసు ఆకారంలో ఒక్కసారి మెడ మీద చేతులు వేసుకుని గుండ్రాకారంగా నిలబడి ఒక్కొక్క కాలిని నేలమీద కొడతారు. వెనక్కీ ముందుకూ వాలుతూ లేస్తూ విన్యాసం చేస్తారు. తాళానికి అనువుగా అడుగుల వేగాన్ని పెంచుతారు.

## గోపికాకృష్ణుల నృత్యం :



గోపికలంతా చేతులను వూపుతూ వయ్యారంగా అడుగులు వేసుకుంటూ, శ్రీకృష్ణుని దగ్గర కెళ్ళి రెండు చేతులెత్తి మ్రొక్కుతూ పాట కనుగుణంగా అభినయిస్తారు. శ్రీకృష్ణుడు వారి మాటలు పట్టించుకోకుండ తిరుగుతూ వుంటాడు.

గొల్లవారి నల్లసామిగా గోపాల కిట్న
యిల్లు యిల్లు తిరగవాకుమా
వారు పోతే దారి కడ్డము పోకుమా
గోపాల కిట్న యిల్లు యిల్లు తిరగమాకుమా.

ఇలా పండరి భజనలో, కృష్ణలీలలు చాల ముఖ్యం. శ్రీకృష్ణుడు చీరలు దొంగిలించటం, గోపికలు భంగపోవటం. ఇద్దరి మధ్యా సంవాదం నడుస్తుంది.

ఇలా ఎన్నోపాటలు కృష్ణునికి సంబంధించిన భక్తిపాటలతో భజనలు చేస్తారు.

ముగింపులో మంగళం పాడుతూ నృత్యాన్ని నిలిపివేస్తారు.

ఈ నృత్యంలో హిందీతో కూడిన గేయాన్ని కొందరు పాండురంగ భక్తులు రచన చేశారు. అంతేగాక క్షేత్రాన్ని చూపి తరించి భక్తి ఆవేశాలతో ఆ పండరి పాండురంగనిపై అనేక గేయాలు రచన చేశారు.

ఈ పందరి భజనల్ని బాలబాలికలు చేస్తున్నప్పుడు, వారి వేషాలనూ, నృత్యాన్నీ, పాటలనూ వింటున్న ప్రేక్షకులు సంతోషంతో చూస్తూ వుంటారు. కొందరు పూలమాలల్ని వారి మెడల్లో అలంకరిస్తారు. కొందరు రూపాయ లిస్తారు. మరికొందరు ఈలలతో, కేకలతో కేరింతలు కొడతారు. కొంతమంది నేర్పిన గురువు మెడలో పూలమాలలు వేసి కొత్తబట్టలతో సత్కరిస్తారు. ఈ భజనను అనంతపురం జిల్లాలో వ్యాపింపచేసిన వారిలో ధర్మవరానికి చెందిన, ధర్మవరం వెంకటరాముడు ప్రముఖుడు. ఈయన ఆ ప్రాంతపు పల్లెల్లో భజనలు నేర్పుతూ ఆడుతూ, పాడుతూ ఆ దేవ దేవుణ్ణి తలుస్తూ జీవితాన్ని సాగిస్తున్నాడని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి వారి జానపద నృత్యకళలో వివరించారు.



# చెమ్మ చెక్క చారిడేసి మొగ్గ

చెమ్మచెక్క
చారిడేసి మొగ్గ
అట్లు బోయంగ
ఆరగించంగ

అంటూ ఆడపిల్లలు అన్ని పండుగల్లోనూ, ఎప్పుడుపడితే అప్పుడు, ఎక్కడపడితే అక్కడ నలుగురు ఆడపిల్లలు కలిస్తే చాలు, ఈ చెమ్మచెక్క ఆటను ఎదురు బొదురుగా నిలబడి, చేతులు చాచి, ఒకరి చేతులు మరొకరికి తాటిస్తూ, ఎగురుతూ, గెంతుతూ, వెనుకకూ ముందుకూ ఊగుతూ, అడుగుల లయకు చేతులు తట్టుతూ, పాటలు పాడుతారు. రంగు రంగుల దుస్తులతో వలయాకారంగా, వరుస తప్పకుండా నృత్యం చేస్తూ వుంటే, రంగ రంగ వైభోగంగా వుంటుంది. మధ్య మధ్య, ఒకరి కొకరు ప్రశ్నకు సమాధానంగా ఇలా ప్రారంభిస్తారు.

ధిమిత - ధిమిత
ఏమి ధిమిత? పసుపు ధిమిత
ఏమి పసుపు? తోట పసుపు
ఏమి తోట? ఆకుతోట?
ఏమి ఆకు? తమలపాకు
ఏమి తమ్మ? పుట్టతమ్మ

ఏమి పుట్ట? పాము పుట్ట
ఏమి పాము? త్రాచుపాము

బాలిక లందరూ ఇలా పాడుతూ వుంటే బాలురు మరో గమ్మత్తు పాట పాడుతారు. చూడండి

ఏమి త్రాచు? నల్లత్రాచు.
భూమికి తాళం వేస్తే - రంగా
భోగందానికి - సవరం దొరికె
సవరం బట్టుకెళ్ళి సాని కిస్తే
సాని నాకు జాబులు ఇస్తే
జాబులు పట్టుకెళ్ళి మామ కిస్తే
మామ నాకు పిల్లనిచ్చె
పిల్ల పేరు మల్లిమొగ్గ
నా పేరు జమీందార్.

ఇలాంటిదే మరొకటి.

కాకీ కాకీ కలవల కాకీ
కాకిని పట్టుకెళ్ళి గంగలో ముంచితే
గంగ నాకు గంధం ఇచ్చె
గంధం పట్టుకెళ్ళి - ఆవుకు రాస్తే
ఆవు నాకు పాలు ఇచ్చె
పాలు పట్టుకుని అమ్మకు ఇస్తే
అమ్మ నాకు జున్ను ఇచ్చె
జున్ను పట్టుకెళ్ళి - పంతులు కిస్తే
పంతులు నాకు పజ్జెం చెప్పె
పజ్జెం పట్టుకెళ్ళి మామకు ఇస్తే
మామ నాకు పిల్ల నిచ్చె.
పిల్లా పేరు మల్లిమొగ్గ
నా పేరు జమీందార్.



అంటూ పిల్లలిలా కేరింతాలు కొడుతూ, తద్దె పండుగలలో బృందాలు బృందాలుగా చేరి ఆటల పాటలతో అందరినీ అలరిస్తారు.



# గొబ్బియళ్లో గొబ్బియళ్లా

కొలనిదోపరికి గొబ్బిళ్ళో యదు
కులము స్వామికిని గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవులు గాచిన
కొండక శిశువుకు గొబ్బిళ్ళో

అంటూ అన్నమయ్య తన మృదు మధురమైన పదజాలంతో శ్రీ కృష్ణుడు గోవర్ధనగిరిని గొడుగుగా పట్టి గోవుల్ని సంరక్షించడం, శిశుపాలుడు, కంసుణ్ణి వధించటం వంటి సాహసాలను వివరించడంద్వారా శ్రీ కృష్ణుడే వెంకటేశ్వరునిగా జన్మించాడని అందరికీ అర్థమయ్యే రీతిలో వివరించాడు.

ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ సంక్రాంతి సమయంలో ప్రతి ఇంటి ముందూ ఆడపిల్లలు రకరకాలుగా రంగవల్లులను తీర్చిదిద్ది వాటిమీద ఈ గొబ్బెమ్మలను వుంచుతారు. వాటిని పసుపు కుంకాలతో పూలతో అలంకరిస్తారు. వీటిని గొబ్బెమ్మలని, గుదుగులను గొబ్బియ్యలని ఆయా ప్రాంతాలలో రకరకాల పేర్లుతో పిలుస్తారు.

సంక్రాంతి సమయంలో బజారులన్నీ గొబ్బెమ్మలతో కళకళలాడుతూ వుంటాయి. సంక్రాంతి పండుగ వస్తూందంటే ఆడపిల్లలకి ఎక్కడలేని ఆనందం. పంటపొలాలనుండి పంటలు ఇంటికి వచ్చి ధాన్యరాసులతో కళకళలాడుతూ వుంటాయి. పంట లక్ష్మిని ఇంటికి తెచ్చుకున్న రైతుబిడ్డలు ఆనందోత్సవాలతో ఈ పండుగను జరుపుకుంటారు. ముద్దులొలికే ముగ్గులతో ఇళ్ళనన్నిటినీ ముగ్గులతో శోభాయమానంగా తీర్చిదిద్దుతారు.

ఆడపిల్లలు ఆవుపేడను తీసుకువచ్చి వాటిని గుండ్రంగాచేసి గొబ్బెమ్మను తయారుచేస్తారు. పైభాగాన గురుగుచేసి అందులో పువ్వులను గుచ్చుతారు. వాటిని తీసుకువెళ్ళి ముగ్గులమధ్య వరుసక్రమంలో సుందరంగా అమరుస్తారు. వాటికి నైవేద్యంగా పండ్లను వుంచుతారు. తరువాత రంగురంగుల దుస్తులు ధరించిన

ఆడపిల్లలు, ఆనందంతో అందరూ వలయాకారంగా నిలిచి, చప్పట్లు చరుస్తూ పాట పాడుతూ, పాటకు తగినట్లు అడుగులువేస్తూ, పాట గమనాన్నిబట్టి వేగాన్ని పెంచుతూ గొబ్బిపాటలను వీనులవిందుగా పాడుతూ, తమ భక్తిశ్రద్ధలను వెల్లడిస్తారు. ఇలా ప్రతి ఇంటిముందూ గొబ్బి పాటలు పాడుతూవుంటే, బజారంతా శోభాయమానంగా వుంటుంది. అన్నమయ్యలాంటి వాగ్గేయకారులందరూ గొబ్బి పదాలను రచించారంటే వాటి ప్రాముఖ్యాన్ని మనం గమనించవచ్చును. రాయలసీమ ప్రాంతంలో పాడుకునే ఒక గొప్ప పదాన్ని గూర్చి ఐ. ఎల్. ఎన్. చంద్రశేఖర్‌గారు ఇలా వివరిస్తున్నారు.

## కంచికి పోయే గాజుల సెట్టి :

రాయలసీమ ప్రాంతంలో పాడుకునే పాటలో కంచికి పోయివస్తున్న గాజుల శెట్టిని ఓ భక్తురాలు కంచిలో నెలకొన్న దేవతను గురించి అడిగి తెలుసుకునే పాట ఈ విధంగా వుంటుంది.

గొబ్బియాలో కంచికి పోయే గాజులశెట్టీ
గొబ్బియాలో కంచిలో మాచమ్మ ఎవరాడబిడ్డ
గొబ్బియాలో సింతాకు రాసేటి శివుని బారియ
గొబ్బియాలో మరుభూములే లేటిమంగ మరదాలు
గొబ్బియాలో గాకాకు రాసేటి రాజుకోడలు.

గొబ్బి అనే పదం గర్బా అనే పదం నుంచి ఉద్భవించిందని డాక్టరు బి. రామరాజుగారు. టి. దొణప్పగారు వారి అభిప్రాయాలను వెల్లడించారు. గర్బా అనేది ఒక నృత్య విశేషానికి సంకేతంగా వుంది. గర్బానృత్యాలు కొన్ని ప్రాంతాలలో ప్రచారంలో వున్నట్లు వినికిడి.

ఏదిఏమైనా గొబ్బిపాటలు మన గేయ సాహిత్యంలో స్థానం సంపాదించుకోవటంతోపాటు ప్రముఖ వాగ్గేయకారుల్ని కూడా ఆకర్షించాయి.

కొన్ని గొబ్బి పాటల్లో కథా గేయాలు కూడా వున్నాయి. అలాంటి వాటిలో కామన్న కథను చంద్రశేఖర్‌గారు ఇలా వుదహరించారు.

## కామన్న కథ :

కామన్న కథ సారాంశం, కామన్న తన అక్క కుమార్తె ఇంటికి వెళతాడు. తన అక్కకూతురుపట్ల ఆకర్షితుడై కామన్న ఆమెను పట్టుకుంటాడు. ఆమె వాళ్ళన్న భీమన్నకు చెపుతుంది. అతడు చెల్లెలి వేషం ధరించి, కామన్న దగ్గరికి

వెళ్ళాడు. అతను మారువేషంలో వున్న భీమన్నను పట్టుకుని కదిలిస్తూ మాట్లాడతాడు. కోపం వచ్చిన భీమన్న కామన్నను వధిస్తాడు. ఆ కథను ఈ విధంగా పాటలో—

అమ్మో రావమ్మో మము గన్నతల్లో గొబ్బిళ్ళో
నీ ముద్దు తమ్మునకు పాడె గట్టమో గొబ్బిళ్ళో
అంద రిండ్ల ముందర బాలాలాడనీ గొబ్బిళ్ళో
భీమన్న ఇంటి ముందర కాకులాడానీ గొబ్బిళ్ళో
భీమన్న ఇంటి ముంద నెత్తురు కాలవలె గొబ్బిళ్ళో.



ఇలా ఆ పాట సాగుతుంది. గొబ్బి పాటల్లో పౌరాణిక గాథలకు సంబంధించిన పాటలు ఎక్కువ. కొన్ని ప్రాంతాల్లో గొబ్బి గౌరి వ్రతంచేస్తారు. వివిధ కోర్కెలు తీర్చమని, పాటలు పాడతారు.

సుబ్బీ గొబ్బెమ్మా సుఖము లియ్యావే
చామంతి పువ్వంటి చెల్లెల్నియ్యావే
మొగలిపువ్వంటి మొగుణ్ణియ్యావే.

మొగలిపువ్వంటి మొగుణ్ణియ్యవే. అంటూ తమకు ఉన్నతమైన జీవితాన్ని ప్రసాదించమని కోరుకుంటారు.

అలాగే ఇంటిముందు కళకళలాడే ముగ్గులను వర్ణిస్తూ వాటికి దైవత్వాన్ని ఆపాదిస్తూ.

గొబ్బియళ్ళో, గొబ్బి యని పాడారమ్మ
కంచి వరదరాజునే గొబ్బియళ్ళో
గొబ్బియ్యాళ్ళో అంచు లంచుల అరుగులమీద
పంచవన్నె ముగ్గులే గొబ్బియాళ్ళో.

అంటూ సాగే పాటల్లో శ్రీకృష్ణలీలలకు సంబంధించిన పాటలు అనేకం వున్నాయి. ఈ పాటలకూ గొబ్బెమ్మలకూ ఈనా డంత ప్రాముఖ్యం లేకపోయినా, ఆ నాడు అవి ప్రజలను అలరించాయి. ఆ నాటి గొబ్బి ఆటపాటల్లో నృత్యాలలో ఆడపిల్లలు ఓలలాడారు. నాగరికత బలిసిన పట్టణాల్లో ఈ కళారూపం కనిపించకుండా పోయినా పల్లెప్రజల హృదయాల్లో పదిలంగానే వున్నాయి గొబ్బిపాటలు.



# ముకెబర్ల జంగాల
# బిట్రో నిట్రో పదాలు



హైరోసైరో - బిట్రో నిట్రో
జగితగ - బిట్రో నిట్రో.

అనే మకుటంగా గల బిట్రో నిట్రో పదం కంచు జాగంటపై హృదయాహ్లాదంగా వినిపింపబడుతుంది. ఈ పదాలను పాడేవారు ముకెబర్ల జంగాలు. ఈ ముకెబర్ల జంగా లనే తెగవారు. కాకతీయ రాజ్యపరిపాలన కాలంలో వారి ఆస్థానంలో వందిమాగదులుగా వున్న శైవులు. ఈ జంగాలు తెలంగాణాలోనూ అటు శ్రీకాకుళం జిల్లాలోనూ చెదురు మదురుగా వున్నారని వినికిడి. ముకెబర్ల జంగాలు బిట్రేశ్వరుడు నిట్టేశ్వరీదేవి అనే దేవుళ్ళను ఈ నాటికీ పూజించుకుంటూ వుంటారట. పైన వుదహరించిన దేవుళ్ళ గుళ్ళు. ఆంధ్రదేశంలో తాను తిరిగినంతవరకూ ఎక్కడా కనబడ లేదని, పరిశోధకులైన మల్లేల నారాయణగారు ఆంధ్రప్రభలో తెలియచేశారు.

## బిట్రేశ్వరుడు, నిట్రేశ్వరి :

బిట్రేశ్వరు డంటే ఈశ్వరుడని, నిట్రేశ్వరి అంటే పార్వతి అని చెపుతారు. ముకెబర్ల జంగాలు. కాని శివపార్వతులకు శైవపురాణాల్లోగాని, ఇతర ఇతిహాస గ్రంథాల్లోగాని ఎక్కడా బిట్రేశ్వర, నిట్టేశ్వరి పేర్లు వున్న ఉదాహరణలు లేవు. వారు శైవు లవడంవల్లా వారి ఇలవేల్పు శివపార్వతులను స్తుతిస్తూ ఎంతో పసందైన పాటలను పాడుతారు. వారు పాట ప్రారంభించబోయే ముందు నాందీ ప్రస్తావనగా ఇష్టదేవతల్ని ఈ విధంగా ప్రార్థన చేస్తారు.

## ప్రార్థన, పదం :

ఓ! హరహరా! బిట్రో నిట్రో
అమ్మ బిట్రో - నిట్రోల్లూ బిరబిర వత్తారు
తోడుండు నంటమ్మ నే సెప్పి చాల్లూ.

అని ప్రారంభించి ముకిరెంక దరువు శేస్తూ కంజేగంటలమీద పొడుగైన లావుపాటి పుల్లితో ప్రయోగించుతారు. ఇలా ప్రయోగించే పుల్ల పేరు—నికోరు పుల్లంటారు. ఇష్టదేవతల ప్రార్థనను ఈ విధంగా ప్రారంభిస్తారు.

కాకర్లలచ్చిదేవి - బజే బజే
కూకర్ల ముచ్చుదేవి - శివో శివో
మోకర్ల బిచ్చాదేవి - హరోం హరోం
లాకుర్ల లెచ్చుదేవి - పాంద్రో పాంద్రో
బాకా మూల్గు నేలలోకి - మాకు జగావత్తారు
మమ్ము ముంచిపోతారు.



ఆడపిల్లలు అత్తవారింటికి త్వరగా వెళ్ళనట్లయితే, పక్క ఇంటి అమ్మ లక్కలు ఆ అమ్మాయి దరిజేరి ఈ విధంగా పాడుతారు.

తొలి జంగమేలకే పో, పోవమ్మా
మలి జంగమేలకే రారా ॥బిట్రో-నిట్రో॥

నెలచెరువు రాకే రారావమ్మా
కోలాకుర్లు రాకే పోపో ॥బిట్రో-నిట్రో॥

మాలాగ నగుచూ రా రావమ్మా
తో తొందరగానే పోపోపో ॥బిట్రో-నిట్రో॥

ఈ పాటనే రాయలసీమలోని పశువులకాపరులు ఈ విధంగా పాడుతారు.

పశువుల కాపరుల పాటలు :

ఓ, ఓలేటి జంగామయ్యా-బిట్రాయుడు-నిట్రేశ్వరి
కాల్లు గాలు ఎండలోన కాపలాగా గాయుచుండె
వులవ దంటు ఉదరపైన ఊగుతూ
వుండినావో ఏమో మొండిగానే జెప్పా?

ఓ, ఒడ్డికాసు వెంకట్రమణ, బిట్రాయుడు-నిట్రేశ్వరి
దొడ్డి దోలిదొల్లుకుంటు నీవు ఎడ్డినాలు జేస్తుంటే
పడ్డా రామి తెర్వుగానె గడగగా నే జెప్పా?
ఓ! అహోబిల నరసింహ - బిట్రాయుడు-నిట్రేశ్వరి

గుహలలోనికి గుల్లదోలీ - గుండ్లుపైన నిలచేసి
ఆహిల యహిల మని యంటూ - దరువుతో మూదరేయు
గిహిలికాడ నుంచి వేమో - కేరూతు నే జప్పా?
ఓ కోట్లకొండయ మామ - బిట్రాయుడు-నిట్రేశ్వరి

కొలిమికుంట్ల కులికన్నకూ పుట్టారో ॥బిట్రో-నిట్రో॥
మతిపోని దుత్తాయితో మా ముగ్గురు

సాల్ సాల్ మనేదాకా :

సాల్ సాల్ మనేదాకా మనిగాంఢ్రు ॥బిట్రో-నిట్రో॥
సంకలోని పిల్లతోటి-సాల్ సాల్ మనేదాకా ॥బిట్రో॥
కొల్లు బారెడైనదాక - కందిరీగ లాంటివాల్లు ॥బిట్రో॥
ఎదిగి దాని ఎత్తేలోగ ఏటేటా ఇరు జతలు ॥బిట్రో॥
పెమ్మికుంట నాగరాజుకూ పుట్టారో ॥బిట్రో॥
తుమ్ము తుమ్మవలను లేని దూడలాంటి మోటువాల్లు
సాలుకూరి కంబరాయికి పుట్టారో ॥బిట్రో॥

ఎవరైనా అమ్మలక్కలు పోట్లాడుకుంటూ, ఆ తగాదా ఏ విధంగానూ పరిష్కారం కానట్లైతే ఈ దేవుళ్ళను మధ్యవర్తులుగా నిర్ణయించుకుని ఇరుకక్షలవారూ రాజీపడేవారట. ఆ సందర్భంలో పాడే పాట ఇది.

బిత్రో నిత్రో అన్న దేవతలమీద కథ మనకు వివరంగా తెలియకపోయినా సంక్షిప్తంగా ఈ క్రింద వుదహరిస్తాను.

కథ :

బిత్రేశ్వరుడు, నిత్రేశ్వరిదేవిని వెంటబెట్టుకుని శైవమతంలోని శివభక్తుల్ని పరీక్షించడానికి భూలోకానికి వెళ్ళారట. అప్పుడు ఒక శైవుడు, తన భార్యను చీకటి తప్పు గావించిందన్న నెపంతో బాగా కొట్టి ఇంటి నుంచి వెళ్ళగొట్టాడట.

ఆమె వెంటనే తను చేసిన తప్పేమిటో తగిన నిదర్శనాలతో భర్త ఎదుట నిరూపించాలని, తద్వారా భర్తయొక్క మెప్పు పొందాలని దీర్ఘమైన పట్టుదలతో తల గొరిగించుకుని విభూతిరేఖలు, రుద్రాక్షమాలికలు మెడనిండా ధరించి తెల్లని చీరగట్టి రామేశ్వరమునకు పరుగెత్తిపోయిందట. అక్కడుండే ఆళ్వారులు, లింగాయతులు, ముప్పాళ్ళ జోగుళ్ళు ఆమెను చూచి అసహ్యించుకుని ఎగతాళి చేశారట. వెంటనే ఆమె రామేశ్వర దేవాలయంలో వున్న నంది వాహనంకు ఎదుట నిలబడి తన రెండు పాదాలపైన ఒక మట్టి కుండలో బియ్యంపోసి ఈశ్వరునికి నైవేద్యం వండటం ఆరంభించిందట. వెనువెంటనే అక్కడ ఆమె భర్తయైన శ్రీకంఠునికి తల తిరిగే రోగం ప్రారంభమవగా తన భార్యయైన ముక్తాక్షిని వెదుక్కుంటూ రామేశ్వరానికి ప్రయాణం చేశాడట.



ఈలోగా ముక్తాక్షికి బిత్రేశ్వరుడు, నిత్రేశ్వరి కన్నులెదుట సాక్షాత్కరించి 'తిరిగి 'యథావిధిగా నీ భర్తను త్రోవలోకి తీసుకుని పసుపుకుంకుమలతో ముత్తైదువుగా వుండి చిరకాలం బ్రతికిపోదువుగాక' అని వరమిచ్చి పంపించారట. అప్పు డామె నిజ గ్రామమైన చోళపల్లికి వస్తుండగా మార్గమధ్యలో భర్తను కలుసుకోగా, ఆయనకు తల తిప్పే రోగం మటుమాయమైనదట. అంతట శ్రీకంఠుడు బుద్ధితెచ్చుకుని ఇంటికి వెళ్ళి సుఖంగా కాపురం సాగించారట. తెలుగుదేశంలో ఓరుగంటి కాకతీయుల కాలంలో వీరశైవమతం జోరుగా విజృంభిస్తున్న రోజుల్లో ఇలాంటి కట్టు కథలు ఎన్నో ఉద్భవించాయి. అలాంటి కోవకు చెందినదై యుండ వచ్చు ఈ కథ. ఎవరికైనా బిడ్డలు లేకపోతే ఈ దేవతలను కొలిచే టట్లైతే సంతానం కలిగేదట.





# శారదకాండ్రు

శారదకాండ్రు అనేవారు ఒక్క తెలంగాణాలో తప్ప కోస్తా ఆంధ్రదేశంలోనూ, రాయలసీమలోనూ ఎక్కడా కనిపించరు. అయితే తెలంగాణాలో కూడా ఒక్క వరంగల్ తాలూకాలోనే వీరు ఎక్కువమంది వున్నారు.

నిజానికి బుర్రకథ వాయిద్యాలకూ, శారద కథకుల వాయిద్యానికీ పెద్ద వ్యత్యాసం ఏమీ కనిపించదు. బుర్రకథలో మాదిరే వీరూ డక్కీలు ఉపయోగిస్తారు. వీరు ఉపయోగించే తంబురానే శారద అంటారు. అందువల్ల వీరికి శారదకాండ్రు అనే పేరు వచ్చింది.

## అసలు వీరెవరు? :

మున్నూరు, ముతరాసి మొదలైన తెలుగు కులాల నుంచి పుట్టిన ఒక జాతి ఈ శారదకాండ్రనీ భిక్షక జాతుల్లో వీరే ఎక్కువమంది వున్నారనీ పూర్వం ఈ జాతివారికి ఎటువంటి పేరుండేదో తెలియచెప్పే చారిత్రకాధారాలు ఏమీ లేవనీ, వీరికీ పేరు ఇటీవలే వచ్చి వుండవచ్చుననీ, ముఖ్యంగా జానపద గేయాల్లో శారద పాటలు పాడేవారు. ఈ జాతివారే పాడుతున్నారనీ, ఇతర జానపద గేయాలలో కంటే, ఈ శారద పాటల్లోనే సాహిత్య ప్రతిభ అధికంగా వుంటుందనీ.

ఓ భారతీ కరుణామతి
భళి శారద కరుణానిధి

అనే వంతపాటలు పాడటంవల్ల, వీరికీ పేరు వచ్చిందేమో తెలియదనీ, డా॥ రామరాజుగారు, తమ గేయ సాహిత్యంలో ఉదహరించారు.

## శారదంటే :

శారదను భుజంమీద ధరించిన కథకుడు — ఎడమచేతి బొటనవ్రేలుకు అందెలు ధరించి, భుజంపైనున్న తంబురాను కుడిచేతితో మీటుతాడు. దీనినే వారు

శారద అని పిలుస్తారు. శారద అంటే సరస్వతి అనే పేరు సర్వసాధారణంగా అందరికీ తెలిసిన విషయమే. అదే పేరును ఈ భిక్షకులు తంబురాకు శారద అనే పేరు పెట్టుకున్నారు. అందువల్లనే వారు కథా ప్రారంభంలో శారదాదేవినే స్తోత్రం చేస్తారు. పురుషుడు కథ చెపితే అతని భార్య వంత పాడుతూ డక్కి కొడుతుంది. ఒకోసారి ఇద్దరే కథ చెపుతారు, అయితే వీరిలో బహుభార్యాత్వం వుండడంవల్ల, ఇద్దరు భార్యలూ, వంతలుగానే వుంటారు. అందువల్లే వీరు ఇద్దరు భార్యలను చేసుకోవడం కూడా కద్దు. వీరి కథల్లో స్త్రీవంతల్లాగా, జంగం కథల్లో గానీ. బుర్ర కథల్లో కానీ స్త్రీలు వంతలుగా కనిపించరు. శారద కథకులు బహుభార్యాత్వంవల్ల, ఎవరి కుటుంబానికి వారే దళంగా ఏర్పడి జీవిస్తున్నారు.



ఈనాటి సంప్రదాయక శారదకాండ్రు

వివిధ వరుసల్లో జంగం కథలు, బుర్ర కథలు సాగినట్లు, శారద కథలు వుండవు. ఒకే వరుసలో ఆయా ఘట్టాలననుసరించి, సన్నివేశాలను పంచిస్తూ ఒకే వరుసలో కథను సాగిస్తారు. వీరు శారద వరుసల్లో వున్న పాటల్నే కాక ఎన్నో రకాల కథలు చెపుతారు.

## వారు చెప్పే కథలు:

బాలనాగమ్మ....రాములమ్మ....ఎరుకల నాంచారి....చిన్నమ్మ మొదలైన కరుణరసప్రపూరితమైన కథలతోపాటు 18 వ శతాబ్దంలో తెలంగాణా ప్రాంతాన్ని దద్దరిల్లచేసిన సర్వాయి పాపడు కథనూ, అలాగే రెడ్డివీరులకూ, వెలమవీరులకూ

చెరువుసీళ్ళ తగాదాలో వైరుధ్యాలు పెరిగి....కొండ్రాయుని తండ్రిని చంపిన వారిమీద పగ తీర్చుకోవడానికి యుద్ధానికి సిద్ధమైన పౌరుషవంతుడైన కొండ్రాయుని సాహసోపేతుడైన వీరుని కథనూ, ఈ కోవకే చెందిన సదాసివరెడ్డి, రాజా రామేశ్వరరావు....గద్వాల సోమనాద్రి కథనూ, చారిత్రక కథలైన, బొబ్బిలి, పల్నాటి యుద్ధానికి సంబంధించిన, వీరరస గాథల్నీ చెపుతారు.

వీరు వరంగల్లు తాలూకాలో వున్న వెంకటరావులపల్లి చుట్టుప్రక్కల గ్రామాలలో ఎక్కువమంది వున్నారు. శారద కాండ్రందరూ శైవమతానికి సంబంధించినవారే, వీరు మాంసాహారులైన జంగమ జాతికి చెందిన వారనే ప్రతీతి కూడా వుంది .. ఎల్లమ్మ....పోచమ్మ — మొదలైన ప్రసిద్ధ దేవతల్ని దైవాలుగా పూజిస్తారు. వీరికి గురువులు జంగాలే. వీరు శైవమతానికి సంబంధించిన వారైనా లింగాలను ధరించరు.

## శారద రామాయణం :

ఎన్నో చారిత్రిక గాథల్నీ, వీరరస గాథల్నీ, కరుణరస గాథల్నీ అద్భుతంగా వాల్మీకి రామాయణాన్ననుసరించి ఒక కవి, పుత్రకామేష్టినుండి, పాదుకాపట్టాభిషేకం వరకూ, శారద వరుసలకు అనుగుణంగా వ్రాసిన శారద రామాయణాన్ని ఎంతో భక్తిశ్రద్ధలతో చెపుతారు....ఇదే కథను, ఆంధ్రదేశంలో పగటివేషాలు ధరించేవారు. రోజు కొక వేషం చొప్పున రోజుల తరబడి వేషాలు ధరించే పగటి వేషధారులు, శుభసూచకంగా భక్తిభావంతో, శారద రామాయణాన్ని ఆలాపించి గ్రామస్థుల వద్ద డబ్బునూ, వస్త్రాలనూ, ధాన్యాన్నీ దానాలుగా సంపాదిస్తారు. అయితే వీరు శారద కాండ్ర వరుసలో ఈ రామాయణాన్ని చెప్పరు. మూల కథను తీసుకుని క్లుప్తంగా వివరిస్తారు. శారదకాండ్రు ఈ కళారూపాన్ని, జీవనోపాధి కోసమే ఉపయోగించుకున్నారు. అయినా ఇదొక చక్కని జానపద బాణీ, రోజు రోజుకీ ఈ కథలకు ఆదరణ తగ్గి పోతూ వుంది.







# వీరనాట్యమే వీరుల కొలుపు

ఆంధ్ర దేశంలో వీర శైవమతం విరివిగా ప్రచారంలో వున్న రోజుల్లో ఆలయాల్లో శైవమతానికి చెందిన దాసీల నృత్యారాధన చేయటమే కాక, శివభక్తులు తాండవ పద్ధతికి చెందిన వీరావేశాన్ని కలిగించే నాట్యంకూడా చేసేవారని నటరాజ రామకృష్ణ గారు జానపద కళల ప్రత్యేక సంచికలో వివరించారు.

వీర రస ప్రధానాలైన రచనలైన ఖడ్గాలను చదువుతూ ఒక చేత ఖడ్గాన్ని, మరొక చేతిలో డాలును ధరించి నాట్యం చేసేవారు. ఈ నాట్యం వీరనాట్యంగా పిలువ బడింది.

వీరు చేసే నర్తనాలన్నిటిలో ఊర్ధ్వ తాండవం అతి ముఖ్యమైంది. ఈ నర్తనాన్ని శివరాత్రి నాడు, రాత్రి పన్నెండు గంటల సమయంలో లింగోద్భవ సమయంలో ప్రదర్శించేవారట. శైవ సంప్రదాయానికి సంబంధించిన అన్ని నృత్యాలలోకి ఈ నృత్యం అతి ముఖ్యమైన దంటారు.

పల్నాటి యుద్ధంలో ప్రాణాలు వదిలిన వీర యోధుల సంస్మరణార్థం వీరుల గొలుపులు ప్రారంభమయ్యే ఆరాధన నృత్యాలుకూడ తాండవ పద్ధతికి చెందినట్టివే, కారెంపూడి, గురజాల, మాచెర్ల మొదలైన పలనాటి ప్రాంతంలో ఈ నర్తనాలు ప్రదర్శింపబడుతూ వున్నాయి.

## వీరంగం :

వీర నాట్యంలో, వీరణమనే వాయిద్యం వాయించబడుతూ వుంటుంది. అందు వల్లనే ఈ నాట్యాన్ని వీరంగం అంటారు. ఇందులో ముఖ్యంగా అయిదు అక్షరాల ఖండ ఏకతాళ గతి ఎక్కువగా ప్రదర్శింపబడుతుంది.

తత్తడిక - తడిక
తజ్జనుత - తడిక

వీరుల కొలుపులో ముఖ్యంగా వాడబడే వాయిద్యం "పంబజోడు" ఇందులో ముఖ్యంగా "చతురశ్ర గతి" ప్రయోగించబడుతూ వుంది.



జం జం జం జం
జం త రుం త రుం
జం జం జం జం
తరుం త రుం త రుం.

కాకతీయులు ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కాలంలో, వీరశైవమూ అందులోనూ పశుపతి సంప్రదాయం విరివిగా ప్రచారంలో వుంది.

## ఇంటి కొక వీరపుత్రుడు:

ఆ కాలంలో ప్రతి తల్లీ తండ్రీ తమ యింట పుట్టిన పుత్రుల్లో ఒకణ్ణి వీరునిగా దేశానికి అర్పించే వాడుక వుండేదట. వారినే పశుపతులని కూడా పిలిచేవారు. ఈ వీరులు అవివాహితులై దేశరక్షణ కోసం ప్రాణాలు అర్పించేవారట. వీరు ప్రతి రోజూ ఆరు పర్యాయాలు శివార్చన చేసేవారట. ఆ పూజల్లో భక్తి భావంతో కూడు



సన్న నృత్యం ఒక భాగంగా వుండేదట. ఆ నృత్యాలే వీరనాట్యాలుగా ప్రచారం లోకి వచ్చాయంటారు రామకృష్ణగారు.

ఈ నృత్యాలలో ఏ రసభావం లేని హస్తపాద విన్యాసాలు మాత్రం ప్రదర్శితమౌతాయి. శివునిచే ప్రదర్శింపబడిన 108 కరణములు అందుకు తగిన చారీ భేదాలు కొన్ని ఈ నర్తనంలో ప్రదర్శింపబడుతూవున్నాయి.

అలాగే ఆయా ప్రాంతాల్లో వీర శైవమతానికి చెందినవారు. వీరశైవులు వీర భద్ర విన్యాసాలు చేయడం, వీరావేశంతో ఖడ్గాలు చదవడం, ఆవేశంతో నారసాలు పొడుచుకోవడం, వీరావేశంతో తాండవ పద్ధతిలో నృత్యాలు చేయటం పరిపాటి. ఒకో ప్రాంతంలో, ఒకో పేరుతో అవి జరుగుతూ వుంటాయి. అలా కోనసీమలో అమలా ప్రాంతంలో వీరనాట్యం చేయడంలో నిపుణు లున్నారు.

తూర్పు గోదావరి జిల్లా కోనసీమలో వీరనాట్యం చేసే కళాకారు లున్నారు. వీరనాట్యానికి ఒక ప్రత్యేకత, జనాకర్షణా వుంది. వీరనాట్యం దేశవ్యాప్తంగా ప్రసిద్ధి చెందింది.

## దక్ష ప్రజాపతి :

దక్ష ప్రజాపతి తలపెట్టిన యజ్ఞానికి కన్న కూతురుకీ, అల్లునికీ ఆహ్వానం అందలేదు. పిలవని పేరంటానికి వెళ్ళకూడదని, పరమశివుడు వారిస్తున్నా పార్వతి ఆ యజ్ఞానికి వెళ్ళి అవమానం పాలై ఆత్మాహుతి చేసుకుంది. ఆ ఘటనకు ఉగ్రుడైన ముక్కంటి జటాజూటాన్ని నేలకు కొట్టి, అటనుంచి వీర కుమారులతో ప్రయాణ మయ్యాడు. శూలధారుడై ఆగ్రహ జ్వాలలు గ్రక్కుతూ యజ్ఞవాటికను చిందరవందర చేసిన వీరకుమారుల పదఘట్టనలే నాట్యమైంది. అదే వీరనాట్యం.

## వీరముష్టుల, వీరనాట్యం :

ఆంధ్ర దేశంలో వీరముష్టులు చేసే వీరనాట్యం శైవ సాంప్రదాయానికి అద్దం పడుతుంది. శివాలయాల్లో జరిగే ధూపసేవ సందర్భంగా ఆలయం ముందు నడివీథిలో వీరనాట్య కార్యక్రమాలు జరుగుతూ వుంటాయి. అలాంటి వీరనాట్యాలు అమలాపురం తాలూకా అయిన వల్లి మండలం. వెలవలపల్లికి చెందిన చింతా వెంకటేశ్వర్లు వీర నాట్యంమీద మోజుపెంచుకుని దానిని కట్టుదిట్టంగా నేర్చుకుని, దానినొక కళారూపంగ తీర్చిదిద్ది, వీథుల్లో ప్రజల సమక్షంలో ప్రదర్శించి ప్రశంస లందుకున్న ఈ వీరనాట్య కళారూపాన్ని జాతీయస్థాయిలో ప్రచారం కల్పించటానికి విశేషమైన కృషి చేశాడు.

అయిదవ తరగతి వరకు మాత్రమే చదువుకున్న వెంకటేశ్వర్లు ఒక బృందాన్ని తయారుచేసి 1962 నుంచి పలు దేవాలయ ఉత్సవాల్లో ప్రదర్శించాడు. వీరనాట్యం చేసేవారిని వీరకుమారు లంటారు. వీరు మొలకు ఎరుపురంగు గుడ్డలను ధరిస్తారు. కాళ్ళకు గజ్జెలు కట్టి, మెడలోనూ, జబ్బలకు, రుద్రాక్ష మాలలను అలంక

రిస్తారు. నుదుట గంభీరంగా విభూతి రేఖలను దిద్దుకుంటారు. చిన్న శూలాలూ, నిలువెత్తుగల పెద్ద శూలాలూ నోటిలో, బుగ్గలకూ, కంఠానికీ ధరిస్తారు. శూలాల చివర నూనెవత్తులు వెలిగిస్తారు. ఆ వెలుగుతో వారు మరింత ఆవేశపరులౌతారు.

## వీరకుమారుల విజృంభణ :

ఆ విధంగా పదిమంది వీర కుమారులు రౌద్ర రసాన్ని పోషిస్తూ....ఖండ సంకీర్ణంలో మిశ్రజతులపై నాట్యం సాగిస్తారు....వీర కుమారుల నాట్యానికి అనుగుణంగా....సన్నాయి డోలు, తంబురా, తాషామర్పాల ధ్వనులు వుత్తేజాన్ని కలిగిస్తాయి. దక్ష వాటికలో వీరభద్రుని ఆధ్వర్యంలో నాటి వీర కుమారుల విధ్వంసం ఇతివృత్తంగా సాగే వీరనాట్యం ప్రేక్షకులకు గగుర్పాటును కలిగిస్తుంది. ప్రజలు కూడ వీరావేశంలో మునిగిపోతారు.



వీర నాట్యం ప్రారంభం. చతురస్ర జాతి నడకలో... తకధిమి....తకధిమి, తక ఝుణు, తకఝుణు, స్వరాలతో ప్రారంభమై దక్షయాగం బెరచి....దక్షుని తలద్రుంచి దక్ష సంహారమై తరలినావు. అనే పదాలతో, శరభా, అశ్శరభా, దశ్శరభా, శరభ, శరభా అనే నినాదాలతో, శూలాలను నాలుకకూ, కంఠాలకూ గుచ్చుకుని భక్తి తన్మయత్వంతో చేసే వీరనాట్యం ప్రజలను పరవశుల్ని చేస్తుంది. అందరూ ఆవేశంతో ఊగిపోతారు.

చింతా వెంకటేశ్వర్లు 1981 లో రాజమండ్రిలో ప్రదర్శనం ఇచ్చి, ప్రముఖుల ప్రశంసలందుకున్నాడు. నాట్యంలో ప్రసిద్ధుడైన నటరాజ రామకృష్ణ, వెంకటేశ్వర్లు వీర నాట్యానికి హైదరాబాదులో రెండు మాసాలు మంచి శిక్షణఇచ్చి దానినొక విశిష్ట కళారూపంగా తయారుచేశారు. ఆ తరువాత రాష్ట్రవ్యాప్తంగా, అన్ని జిల్లాలలోనూ, ఆకాశవాణిలోనూ, అప్నా వుత్సవంలోనూ, ఇతర రాష్ట్రాలలోనూ వెయ్యి ప్రదర్శనాలకు పైగా ప్రదర్శనల నిచ్చారు. వెంకటేశ్వర్లుకు చదువు లేకపోయినా, పట్టుదలతో వీర నాట్యాన్ని అభివృద్ధిపర్చి, దానికొక మన్నన తీసుకొచ్చారు.



# చకితుల్ని చేసే చెక్క భజనలు

ఆంధ్రదేశపు పల్లెలలో అనాదిగా వస్తున్న కళారూపాలలో చెక్క భజన ముఖ్య మైంది. దేవుని స్తంభాలను పట్టుకుని ఇంటింటికీ తిరుగుతూ భక్తి భావంతో భజనలు చేస్తారు. పల్లెలో వుత్సాహం వున్న యువకులందరూ పనిపాటలు లేని తీరిక సమయాలలో ఇరవై మంది దళ సభ్యులుగా చేరి, ఒక గురువును ఏర్పాటు చేసుకుని రాత్రి సమయంలో కట్టుదిట్టంగా ఈ విద్యను నేర్చుకుంటారు. ఇది ఆషామాషీగా చేసే భజన కాదు. ఎవరికి తోచిన రీతిలో వారు గంతులువేస్తూ చేసే భజనకాదు. ఇది శాస్త్రీయమైన జానపద నృత్యకళ. ఇది ఎంతో క్రమశిక్షణతో నేర్చుకుని చేయ వలసిన కళ.



ఇది చాలా శ్రమతో కూడుకున్న కళారూపం. అందరూ సమానంగా అడుగులు వేయాలి. అందరూ ఒకే రకంగా వలయాకారంగా తిరగాలి. ఒకే రకంగా చేతుల్లో ఘల్లు ఘల్లుమనే చెక్కలను పట్టుకోవాలి. అందరూ కలిపి కట్టుగా తాళం వేయాలి. తాళానికి తగినట్లు పాట పాడాలి, పాటకు తగిన భావాన్ని ముఖంలో చూపించాలి. కాళ్ళకు గజ్జెలు కట్టాలి. ఒకే రకంగా నృత్యం చేయాలి. ఒకే రకంగా ఆగి చలనాలను చూపించాలి. ఒకేసారి ఎగరటం, కూర్చోవటం, గుండ్రంగ తిరగటం. ఎగురుతూ గుండ్రంగా తిరుగుతూ భజనచేయటం చెక్కభజన విశిష్టత ప్రతి పాటకూ నృత్యం మారుతుంది. పాట మారుతుంది. భావం మారుతుంది. వరుసలు మారుతాయి. తాళం మారుతుంది. తెలుగువారి భక్తిరస కళారూపాలలో చెక్కభజన ఒక సుందర కళారూపం.

## పామర కళారూపమా? :

ఇలాంటి శాస్త్రీయ జానపద కళారూపాన్ని శాస్త్రీయ నృత్యకారులు పల్లెటూరి కళారూపంగా పామర కళారూపంగా ఏదో పనిలేక తీరిక సమయాల్లో ఉబుసుపోక కుఱ్ఱవాళ్ళందరూ కలిసి చేసుకునే ఏదో చెక్కభజనగా తేలిక భావంతో చూసి ఇలాంటి కళారూపాలన్నిటినీ అణగద్రొక్కివేశారు.

చెక్క భజనలో తాళం లేదా? లయ లేదా, గమకం లేదా, పాట లేదా? ఆంగికాభినయ విన్యాసంతో కూడిన నృత్యం లేదా? అభినయంతో కూడిన ముఖభావాలు లేవా? భక్తిపాటల తన్మయత్వంలో ముఖంలో చూపించే సాత్వికభావాలు లేవా? అందరికీ అర్థమయ్యే భాష లేదా? ముఖంలో సాత్వికభావం లేదా? చిరుగజ్జెల సవ్వడితోచేసే నృత్యం లేదా? ఆహార్యం లేదా? అందరూ ఒకే రకంగా తిరుగుతూ, కూర్చుంటూ, లేస్తూ గిరకాలు కొడుతూ క్రమశిక్షణతో కూడిన శాస్త్రీయమైన తాళగతులు లేవా? స్వరగతులు లేవా? బృందాన్నంతా ఏక త్రాటిమీద నడిపే గురువు లేడా? ప్రేక్షకులందర్నీ ముగ్ధులను చేస్తూ పాటలుపాడే శ్రావ్యమైన కంఠాలు లేవా? అన్నీ వున్నాయి. అల్లుడు నోట్లో శని అన్నట్లు ఆదరణ తగ్గిపోయింది. అయినా పల్లె ప్రజలు ఈ నాటికీ ఈ కళారూపాన్ని బ్రతికించుకుంటున్నారు. ఈనాటికీ అన్ని ప్రదేశాల్లోనూ ఈ కళారూపం బ్రతికే వుంది.

కేవల ఉత్సాహంకొద్దీ చేసే భజన కాదిది. భక్తితన్మయత్వంతో భగవంతుణ్ణి వేడుకుంటారు. అలా వేడుకుంటూ భక్తిపారవశ్యంలో అమితోత్సాహంలో చేసే నృత్యం చెక్కభజన. భజనచేసేవారే భక్తిభావంలో మునిగిపోవటంకాక, ప్రేక్షకుల్ని కూడా తన్మయత్వంలో ముంచేస్తారు. చెక్కభజన ప్రేక్షకుల్ని ఉత్తేజితుల్ని చేస్తుంది. ముఖ్యంగా పల్లెల్లో తీరిక సమయాలలోనూ, వర్షాలు లేని రోజుల్లోనూ, పండుగసమయాలలోను దేవుళ్ళ కళ్యాణ సమయాలలోనూ తిరునాళ్ళ సమయాలలోనూ, రథోత్సవాలలోనూ, జాతర్లలోనూ ఈ చెక్కభజనల్ని చేస్తారు.

## భక్తి, ముక్తి :

భక్తికోసం ముక్తికోసం ఈ భజనలు చేస్తారు. భజన బృందం కట్టుదిట్టంగా భజనచేయటం ప్రారంభించిన తరువాత ఉన్న ఊళ్లోనేకాక చుట్టుప్రక్కల గ్రామాలకూ యాత్రాస్థలాలకూ బయలుదేరి వెళ్ళి తమ తమ ప్రావీణ్యాన్నంతా చూపిస్తారు. కేవలం పాటలతోనేగాక, రామాయణ భారతగాథల్ని ఘట్టాలు ఘట్టాలుగా ఆడుతూ,

పాడుతూ, వచనంతో కథను నడుపుతూ ఆయా రసాలకు తగిన విధంగా భజనచేస్తూ పౌరాణిక ఘట్టాలను ప్రదర్శిస్తారు.

## గురు పూజ :

చెక్కభజన నేర్చుకోవాలనుకున్న యువకులందరూ చేరి ఒక గురువును ఎన్నుకుంటారు. గురు పూజతో నృత్యాన్ని ప్రారంభిస్తారు. ప్రతి గురువూ ఒకే రకంగా ఈ చెక్క భజన విద్యను ప్రదర్శింపడు. ఎవరి విధానం వారిది. ఈ చెక్క భజన రాయలసీమలో కడప జిల్లాలో పుట్టి, ఆంధ్రదేశమంతటా వ్యాపించిందని, అందుకు నిదర్శనం గురువులు చెప్పిన మూలాలు మాత్రమేకాక, జిల్లాలో ప్రతి గ్రామంలోనూ చెక్క భజన బృందాలుండటం కూడ అందుకు నిదర్శన మనీ, అలాగే చెక్కభజనకు సంబంధించిన గేయాలు ఎన్ని వున్నాయో చెప్పటం కష్టమనీ, నేను పులి వెందుల తాలూకాలోని భజన గురువుల దగ్గర సేక రించిన గేయాలు, భంగిమలు ఆధారంగా కొన్నిటిని మాత్రమే వివరించగలుగుతున్నాననీ, ఈ చెక్క భజన నృత్యాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించా లంటే ఈ జన్మ చాలదనీ, ప్రతి గురువు భంగిమ ల్లోనూ వైవిధ్యం వుందనీ, తెలుగు విశ్వవిద్యా లయ జానపద కళలశాఖ లెక్చరర్ డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు జానపద కళారూపం చెక్కభజన అనే గ్రంథంలో సోదాహరణంగా వివరించారు.



## చెక్క భజన స్వరూపం :

ముఖ్యంగా చెక్కభజనల ఇతివృత్తాలు ఈ విధంగా వుంటాయి. భక్తి పాటలు, భారత, భాగవత, రామాయణాలకు చెందిన పురాణ పాటలు, నీతిని ప్రబో ధించే పాటలు, వీర గాథలు, ఇతరాలు, జడకోపు విద్యల్నీ ప్రదర్శిస్తారు.

భజనల్లో, హరిభజనలు, పండరి భజనలు, శావమూళ్ళ తాళం భజనలు, దప్పుల కోలాట భజనలు, కోలాట భజనలు రకరకాలుగా వున్నాయి. దేని ప్రత్యేకత దానిదే, దేని పరికరాలు దానివే.

అడుగు పొడుగైన చెక్కల్ని తయారుచేసుకుని. రెండు ప్రక్కలా ధ్వని రావడానికి గుండ్రటి ఇనుప బిళ్ళలను గాని, ఇత్తడి బిళ్ళలను గానీ రెండేసి చొప్పున అమర్చుతారు. తాళం ప్రకారం చెక్కలను కొట్టేటప్పుడు ఈ బిళ్ళలు శ్రావ్యమైన ధ్వనినిస్తాయి అన్ని చెక్కలూ ప్రయోగించినప్పుడు. ఈ ధ్వని గంభీరంగా ఒకే శృతిలో వినిపించి భజనపరుల్ని ఉత్సాహపరుస్తాయి. ఈ చెక్కలపై నగిషీలు చెక్కి సుందరంగా వుంటాయి. ఈ బృందాలలో కథావృత్తాన్ని బట్టి కొందరు పురుషులు గానూ, మరికొందరు పురుషులే స్త్రీ పాత్రధారులుగానూ ప్రవర్తిస్తారు. ఉదాహరణకు గోపికా క్రీడల్లో పురుషులు కృష్ణులుగాను, స్త్రీలు గోపికలుగానూ నర్తిస్తారు.

## రంగురంగుల వేషధారణ :

అందరూ ఒకే రంగుగల తలగుడ్డలను అందంగా చుడతారు. ఒక ప్రక్క రిబ్బను కుచ్చులాగా అందంగా వ్రేలాడుతుంది. పంచెల్ని నృత్యానికి అడ్డు తగలకుండా ఎగరటానికి వీలుగా వుండేలాగా సైకిల్ కట్టులాగా మడిచి కడతారు. పురుషులు ఒకే రంగుగల బనియన్‌లను ధరిస్తారు. స్త్రీ పాత్రలకు లంగా, రవికె, పవిటకు ఓణీలాగా గుడ్డను ఉపయోగిస్తారు.



ఈ బృందాలలో ఇరవై మొదలు ముప్పైవరకూ సమసంఖ్యలో బృంద సభ్యు లుంటారు. పన్నెండు సంవత్సరాల నుంచి పాతిక సంవత్సరాల వయస్సుకల యువకు లందరు పాల్గొంటారు. చెక్కభజన వ్యాయామంతో కూడుకున్న కళారూపం. ఇందుకు తట్టుకోగల యువకులే పాల్గొంటారు. ఒక్కొక్క బృందం తయారవ్వా లంటే మూడుమాసాల కాలం పడుతుంది. అప్పటికిగానీ, చెక్కభజన బృందానికి పరిపక్వత రాదు.

## ఓర్పు, నేర్పు :

చెక్కభజన ప్రారంభ సమయంలో గురువు చాలా శ్రమపడాల్సి వుంటుంది. ప్రతివారూ ఎలా నిలబడాలి? ఒక్కొక్కరికీ ప్రతిభంగిమనూ వివరిస్తూ వలయాకారంగా ప్రతి ఒక్కరిచేతా చేయిస్తాడు. ఇదే ప్రాథమిక దశ. ఈ దశను దాటినతరువాత.

ఆది అడుగు - రెండవ అడుగు - మూడవ అడుగు నాల్గవ అడుగు. ఇలా పది అడుగుల వరకూ వేయిస్తాడు.

రెండు పోట్లు - వర్ణశాల - కుప్పడుగు - మూడవ ఉద్ది వెనుక మార్పు — జోకు అడుగు - రెండు మెలికె - మెలిక కచ్చుపోటు - ఒంటి మెలికె - పోకడుగు - రెండు కుప్ప - పోంచ్ అడుగు - బైస్కిల్ అడుగు - గుబ్బడుగు - వల అడుగు - చిన్న సౌకం - ఒంటి బేరి - రెండవ బేరి - మూడవ బేరి - నాలుగువైపుల ఒంటి మెలిక, చుక్కల పందిరి ఉద్దిపోటు - పదిహేను పోట్ల అడుగు - పద్మవ్యూహం - నాలుగు వైపుల కుప్ప - డబుల్ వర్ణశాల. బజారు అడుగు - కట్టె అడుగు - కప్ప అడుగు - వాలము అడుగు - మూడు మెలిక - ఒంటి మెలికె - నాలుగు కులుకుడు - ఇంట్లోకి బయటికి - లోపల మెలికి బయట మెలికి పద్మవ్యూహం - బేరి మూడు - పందపు టడుగు - యనకల రెండు పోట్లు - జముడు అడుగు - పెన అడుగు - గుబ్బపు టడుగు - ఒంటి మెలికలో రెండు పోట్లు మొదలైన అడుగులలో కొన్నిం టిని వివరించటం జరుగుతుంది. అడుగు లన్నిటినీ అక్షర రూపంలో చెప్పటం కష్టమనీ, ప్రత్యక్షంగా చూస్తే బాగా తెలుసుకోవచ్చుననీ లేదా వీడియో కేసెట్ ద్వారా అడుగుల్ని భద్రపరిస్తే నేర్చుకోవటానికి అనువుగా వుంటుందనీ డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు తమ చెక్కభజన గ్రంథంలో విపులీకరించారు. వారికి ధన్యవాదాలు.

## చెక్కభజన ఇలా ప్రారంభిస్తారు :

భజన ప్రారంభించే ముందు దేవుని పటాలకు పూజచేస్తారు. టెంకాయ కొట్టి చిరుతలు పట్టుకుని సాష్టాంగ నమస్కారం చేస్తారు. అందరూ వలయాకారంగా నిల బడి అందరూ లయతో చెక్కలను మ్రోగిస్తారు. గురువు పాడగా వంతపాడతారు. తరువాత ఒక్కొక్క అడుగు వేయిస్తాడు. అలా కుడికాలుతోనూ, ఎడమకాలితోనూ, చాకచక్యంగానూ ఆగిస్తూ వుంటారు. అందరూ ఒకే విధంగా వాయిస్తున్న సమ యంలో గురువు అకస్మాత్తుగా ఆగుతాడు. అందరూ అలాగే ఆపేస్తారు. అంతా నిశ్శబ్దం. ఆ సన్నివేశం అద్భుతంగా వుంటుంది. ఇలాంటి వాటిని నిలుపులు అంటారు. నృత్యం ఉధృతస్థాయిలో వున్నప్పుడు కూడ ఈ విధంగా నిలుపుదల చేస్తాడు. ఈ నిశ్శబ్దాలు, మళ్ళీ ప్రారంభాలు. బృంద సభ్యుల యొక్క కలయికనూ అభ్యాసన్నీ, క్రమశిక్షణనూ, గురుభక్తినీ చాటుతాయి.

## ఎన్నో పాటలు, ఎన్నో అడుగులు :

పైన వివరించిన విధంగా ఎన్నో అడుగులు, భంగిమాలు. వివిధ దశలలో, ఈ విధంగా నడుస్తాయి, ఆది అడుగు - రెండుపోట్లు - మూడు మెలిక - కులుకుడు - కుప్పిడుగు - పద్మవ్యూహము - పర్ణశాల మొదలైన వివిధ రకాల అడుగులతో శోభాయమానంగా బృందాన్ని తయారుచేస్తాడు గురువు.



పైన వివరించిన అడుగులేకాక, గురువు నేర్పిన వివిధరాకాలైన భంగిమల్ని కూడ కళాకారులచే చేయిస్తాడు. వ్రాతలోకంటే ప్రతి భంగిమనూ ప్రత్యక్షంగా చూస్తేతప్పా. ఆ ప్రత్యేకతను అర్థం చేసుకోలేము. అందుకే ఈ కళారూపాన్ని గురుకుల పద్ధతిలో తీర్చిదిద్దాలి. చెక్కభజన గూర్చి తెలిసిన పరిశోధకులు ఎడ్ల బాలకృష్ణారెడ్డిగారు ఒకరు. జానపద పారమార్థిక గేయ సాహిత్యంలో చెక్కభజన కులుకు భజన, అని పేరు పెట్టారు. చెక్కభజన ప్రాచీనరూపం కులుకు భజన మొత్తం భజనల్లో ఏడు రకాలున్నాయని తెలిపారు. హరిభజన - ఊరి భజన - కులుకు భజన - పండరి భజన - కోలాట భజన - సప్తతాళ భజన — వేదాంత భజన.

భజన అందరికీ సంబంధించిన జానపద కళారూపం. భజనంటే సేవ, భగవంతుని అనంత నామాలకు రూపగుణ మహిమల్ని రాగతాళ యుక్తంగా తన్మయత్వంలో సమిష్టిగా కీర్తించటం భజన అంటారు.

## ముక్తికోసం భక్తి పాటలు :

చెక్కభజన ప్రారంభించే ముందు ప్రప్రథమంగా విఘ్నేశ్వరుని ప్రార్థించి, తరువాత వరుసగా భక్తిపాటలు పాడుతారు. అలాంటి పాటల్లో.

అమ్మా రావమ్మా ఆదిశక్తివి నీ వమ్మా
మమ్మూ దయ చూడవమ్మా
వేడెద మనసున వేడెదమమ్మా
వేగమె కదలి రామ్మా.

అలాగే తెలుగుజాతిని భక్తితో ప్రభావితం చేసిన గ్రంథాలు మూడు. అవి రామాయణ, భారత, భాగవతాలు. ఈ పురాణ గ్రంథాలనుండి ఆయా ఘట్టాలకు సంబంధించిన గేయాలను చెక్క భజనకు ఎన్నుకున్నారు. అలాంటి వాటిలో శ్రీకృష్ణ గొల్లభామల సంవాదం చూడండి.

## గొల్ల కృష్ణుడూ, గొల్లభామలూ :

గొల్లభామలు:— రామ రామ అనంతకాలం రాజ్యమేలుతువుండర కిష్టా చీరలిచ్చి చెట్టు దిగిరా ఓ గోపాలకిష్టా, చీరలిచ్చి చెట్టు దిగిరా.

కృష్ణుడు:—ఏయ్.

రామ రామ అనంత కాలం రాజ్యమేలుతూ వుండనే భామా —
చీరలివ్వనే చెట్లు దిగనే ఓ భామలారా చీరలివ్వనే చెట్లు దిగనే.

గొల్లభామలు:— వందనాలు నీకు పెడ్తాం చీరలిచ్చి చెట్లు దీగరా గోపాలకిట్నా చీరలిచ్చి చెట్లు దీగరా.

కృష్ణుడు:— వందనాలు నాకు వద్దు దండాలు నాకు వద్దు. చీరాలివ్వను చెట్లుదిగానే ఓ బామలారా చీరలివ్వను చెట్లు దీగానే,

అంటూ గోపికలు బ్రతిమలాడటం, కృష్ణుడు బెట్టుచేయడం ఆసక్తికరంగా సాగుతుంది. అలాగే ఉద్ది అడుగులో శ్రీకృష్ణలీలల్నీ గేయాలలో, గేయరూపకంగా రామాయణ ఘట్టాల్ని గంటలకొద్దీ చెక్కభజన రూపంలో వివరిస్తారు. రామాయణంలో వచ్చే ఆయా పాత్రలను దళ సభ్యులు బృందం మధ్యలో కొచ్చి ఆ పాత్రను నిర్వహించి మళ్ళీ బృందంలో కలిసిపోతారు.

## నీతి పాటలు :

పై విధంగానే నీతిపాటల్ని కూడ పాడతారు. వాటిలో ఆవు పులి కథ అందరికీ తెలిసిందే, అలాంటి గేయంలో తల్లి బిడ్డకు చెప్పే నీతులు, ఆకలి అని అడిగేవారిని అబద్ధం చెప్పకూడదు అనే నీతిని జానపదులు ఎలా కవితలల్లారో ఈ పాటల్లో తెలుస్తుంది.

పాట :

అన్నా ఓ రైతన్నా ఈ లోకమంతా గమ్మత్తురా
లోకమంతా గమ్మత్తురా, కనిపించేదంతా బూటకంరా
పెద్దకొడుకని ప్రేమతో పెంచితి, పెత్తనమంతా చేతికి ఇస్తే,
ముండల మరిగి రొండయిపాయెనే వుండను వూరే
లేదురా, వాడు వూరే విడిచి పాయెరా ॥అన్నన్నా॥

చేని గట్టున జానెడు నరికి, హద్దురాతిని అవతల పాతి,
పరాయి చేలో పశువులు మేపి సాయంకాలము యింటికి వచ్చి,
రామా కిట్నా అంటే శ్రీరాము డెట్లా నమ్మునయా ॥అన్నన్నా॥

ఇలా ఎన్నో నీతిపాటల్ని భజనల్లో పాడుతారు.

బుడ్డా వెంగళరెడ్డి :

బుడ్డా వెంగళరెడ్డి అనే ధర్మప్రభువుని గూర్చిన గేయాన్ని జానపదులు చెక్క భజనలో చక్కగా ప్రదర్శిస్తారు. వెంగళరెడ్డి ధర్మదాతేకాక, వీరాధి వీరునిగా కూడా కీర్తిస్తారు.

ఉత్తరాది వుయ్యాల వాడలో వున్నది ధర్మం సూడండయ్యా
నేటికి బుడ్డా యంగలరెడ్డి దానాప్రభువని తలచిరయా
గోవిందా యని వన్నవారికి గోవుల దానము చేసెనయా
అరినారాయణ అన్నవారికి అన్నవస్త్రము లిచ్చునయా!

గేయం :

ఇలా ఎన్నో పాటలు పాడటమేగాక సంఘంలో వున్న రౌడీల గురించీ, త్రాగుబోతుల గురించీ, సంఘ విద్రోహుల గురించీ, మట్కా - జూదాన్ని గూర్చి ఎన్నో నీతిపాట లున్నాయి. అనేకమైన శృంగారపు పాటలున్నాయి.

కదిరీ సిన్నదానా కందిరీగా నడుముదానా
నిన్నెట్ల మరతునే నెల్లూరి నెరజాణ ॥కదిరి॥

నీ సిలుకు చీరకు రేనుగుంట్ల రైకాకు
యంత సోకాయనే రంగోల్ల రవనమ్మా ॥కదిరి॥

అలాగే కులాన్ని గూర్చి.

కులము కులము అంటారు యక్కడుంది కులము
మళ్లీ మళ్లీ యీమాట రాకూడదన్నా
నిన్ను కోస్తే రత్తమా నన్ను కోస్తే నీరా
ఏమిటన్నా న్యాయం యక్కడుంది న్యాయం
మనమంతా కలిసి మెలిసి వకటైపోవాలిపుడూ
కలకాలం యీలాగే కలసి మెలిసి వుండాలి ॥కులము॥

## జడ కోపులు :

చెక్కభజన ప్రారంభించి కొంత కార్యక్రమం జరిగిన తరువాత చివరిగా చేసేది జడకోపులు. ఈ కోపులు ప్రేక్షకుల్ని ఎంత గానో ముగ్ధుల్ని చేస్తాయి. అందరూ గుండ్రంగా నిలబడతారు. రంధ్రాలతో కూడిన గుండ్రని చంద్రాకార గల బిళ్ళను తయారుచేస్తారు. రంధ్రాలలో రంగురంగుల త్రాళ్ళను వ్రేలాడదీస్తారు. ఆ చెక్కను ఎత్తుగా వున్న ఒక దూలానికి లాగి కడతారు. లేదా గ్రామ మధ్యలోవున్న చెట్టుకు వ్రేలాడదీస్తారు. దీనిని జడకోపు బిళ్ళ అంటారు. బృంద సభ్యులు ఒక్కొక్కరూ ఒక్కొక్క తాడును ఎడమచేత్తో పట్టుకుని కుడిచేత్తో చెక్కల్ని పట్టుకుని తాళ్ళ సహాయంతో అడుగులు వేస్తూ లోపలికి బయటికి గుండ్రాకారంగా తిరుగుతారు. మధ్య గురువు పాటలు పాడుతుండగా కళాకారు లందరూ పాట పాడుతూ జడను అల్లుతారు. దీనిని జడకోపు అంటారు.



## రక రకాల కోపులు :

ఈ కోపుల్లో రకరకాల కోపు లున్నాయి. అవి.... సాదా జడకోపు — నాగాయ జడకోపు — డబుల్ నాగాయ జడకోపు — కరక్కాయ జడ — గర్భ జడ — పట్టెడ జడ — పచ్చల జడ — నాలుగు పచ్చలజడ.

వల జడ — బొంగు జడ — పుట్లజడ. ఈ విధంగా రకరకాల జడలను అల్లుతారు. ఇవి ఎంతో నైపుణ్యంతో అల్లబడతాయి. చూపరులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. బృందంలో ఏ ఒక్కరు తప్పుచేసినా జడ చిక్కుపడిపోతుంది. చిక్కుపడిన జడను విడదీయటం చాలా కష్టం, ఈ జడలను అల్లటం ఎంతో సాధన చేస్తారు. ఒక జడకూ మరో జడకూ ఏమాత్రం సంబంధం వుండదు. పాటపాడుతూ, అడుగువేస్తూనే ఈ కోపులను వేస్తారు. ఈ కోపుల్లో ఒక పాట.

పాట :

పురు॥ రేనాటి సిన్నదాన లలనా రేగిపండు సాయదానా
నీరేనిపండు సాయమీద వాలింది మనసు వాసిముద్దుల గుమ్మ

స్త్రీ॥ నువ్వాడ నేనాడరో సిన్నవాడ
నీకు నాకు జతకాదురా

పురు॥ కొట్టమ్మడిపోయేదాన లలనా
కలువపండు చీరదాన
నీ కలువపండు చాయమీద
వాలిందె మనసు, రాని ముద్దులగుమ్మా

స్త్రీ॥ నీవేడ నానేడరో సిన్నవాడ

అలాగే కృష్ణుడు కొంటె చేష్టలను గొల్లపడుచు లందరూ యశోదకు విన్న వించే విధం.

పాట :

వో యశోద ఏమి చేయుదము నీ కొడుకు దుడుకులకు
నిన్న సందివేలమ్మ సిన్నది జలకంబులాడ
మెల్లిగ సీరలెత్తుకుని వెళ్లె గదమ్మా ॥వో యశోద॥

మెల్లమెల్లగాను రేపల్లె వాడలోకి వచ్చి
యన్నముద్ద కుండలన్ని పడవేసెనమ్మ ॥వో యశోద॥

అద్దరాతిరి వేలమ్మ మిద్దెలోకి వచ్చినాడు
దద్దరి మా ఆలి మొగుడు యిద్దరాము లేచిరాగా
అద్దకోడ కత్తిరించి పారిపోయెనె
వద్దికామీకేలనాని గుద్ది గుద్ది సంపెనమ్మా ॥వో యశోద॥

భజనలో దంపుళ్ళ పాట:

కూచోని సెరిగే చేడెకురులపై, భామ కురులపై
తుమ్మెద వాలెనె భామా గండుతుమ్మెద వాలెను భామా
గండుతుమ్మెద వాలెనే దరనిలో ॥కూచో॥

గొప్పది రోకలి గుప్పున దంచగ జబ్బలు కదులునె భామా
గండుతుమ్మెద వాలెనె భామా ॥కూచో॥

చెమటకు తడిసి చెదరిన గంధము
గుమగుమలాడెను భామా
గండుతుమ్మెద వాలెను భామా ॥కూచో॥

ఇలా ఎన్నో కొల్లలు కొల్లలుగా చెక్క భజనలో వాడుకునే జానపద గేయాలున్నాయి. వీటిలో చాలావరకు ఆయా ప్రాంతీయ భాషామండలికాలలో ఎన్నో పాట లున్నాయి. ఏది ఏమైనా చెక్కభజన సకల కళా సమన్వితమైన జానపద నృత్య కళారూపం. దీనిని నేడు తెలుగు విశ్వవిద్యాలయం చేపట్టి శిక్షణా శిఖరాల ద్వారా పునరుద్ధరిస్తున్నది. దీనిని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు సక్రమంగా నిర్వహిస్తున్నారు.







# అందరికీ ఆశలు రేపే బుడబుక్కల జోస్యం

తెలుగువారి జానపద కళారూపాలలో అనాది నుంచీ పగటివేషాలు ఆంధ్ర ప్రజానీకానికి వినోదంతో పాటు విజ్ఞానాన్ని ప్రసాదించాయి. ముఖ్యంగా ఈ కళారూపాల ఆశయం. ఆనాటి సమాజంలోని సంఘ దురాచారాలనూ, అవినీతినీ సునిసితమైన హాస్యంతో దుయ్యబట్టి, తద్వారా ప్రజలకు కనువిప్పు కలిగించి సమాజానికి ఒక నూతన మార్గం సూచించేవి. అలాంటి కళారూపాలలో ముఖ్యమైనది బుడబుక్కల వేషం. సాంప్రదాయంగా వచ్చే ఈ కళారూపాన్ని పగటి వేషధారులు సమాజ శ్రేయస్సును జోడించి ప్రదర్శిస్తున్నారు.

## సంప్రదాయ బుడబుక్కలవారు:

బుడబుక్కల జాతివారు ఒక ప్రత్యేకతను సంతరించుకున్నారు. ఇతర కులాలవారు పగలు భిక్షాటన చేస్తే, వీరు రాత్రి సమయంలో యాచన సాగిస్తారు. ఇలా సాగించేవారిలో ముఖ్యులు—బొందిలీలు, భరత సాయిబులు, గంట సాయిబులు, రేయి తురక సాయిబులు, నిదకలోళ్ళని ఇలా ఒకో ప్రాంతంలో ఒకో పేరుతో వ్యవహరించబడుతున్న వీరు రాత్రి పన్నెండు గంటలు దాటిన తరువాత నుంచి తెల్లవారుజాము నాలుగు గంటల వరకు భిక్షాటన చేస్తారు. ఆ సమయంలో ఒక చేతిలో లాంతరు పట్టుకుని, మరో చేతిలో ఢమరుకం బుడుబుక్కను లబ్బుగా వాయిస్తూ రెండు కాళ్ళ నడుమ ఒక గంటను కట్టుకుని....ఒకదాని మీద ఒకటి నాలుగు జతల బట్టలను తొడిగి, పెద్దతలగుడ్డ ధరించి, ముఖానికి పెద్దకుంకుమబొట్టు పెట్టి, గుబురుగా పెంచిన మీసాలతో, భుజంమీద ఒక పెద్ద జంపకానా ధరించి, వీథిలో గంభీరంగా నడుస్తూ

భక్తి ప్రచారం చేస్తూ, అనేక పురాణ గ్రంథాల నుంచి ఉదాహరణ లిస్తూ, సామెత లతో ప్రజలను మెప్పిస్తూ నైతికబోధ చేస్తూ—

అంబ పల్కు జగదాంబా పల్కు
మా ఇష్టదేవతా పల్కు

అని పొలిమేర దేవతను కట్టి, గ్రామదేవతను కట్టి, కీడు పల్కే పక్షుల్ని, మేలు పల్కే పక్షుల్ని వేరు వేరుగా తెలిపి, కీడు స్వరూపాన్ని మేలు గల విశేషాల్ని తెలిపి ఎదుటివారి మనసులో కలిగిన ఉద్దేశాలను వివరిస్తూ, జనరంజకమైన రామజోగి పలుకులు వినండంటూ—

మహరాజ రాజ మార్తాండతేజ
రవికల్పభూజ రాజసూత్రమా
శుభోజయం కలగవలె
మీ పని నయం వుండాలి
మా పని జయం ఉండాలి
రాను మా భారం
రక్షించుట మీ భారం.

అంటూ లబ్జుగా ప్రజలను ఆకట్టుకుంటాడు.

## బుడబుక్కల కుటుంబాలు:

బుడబుక్కలవారు ఆంధ్రదేశంలో సుమారు మూడువేల కుటుంబాలవారు జీవనం సాగిస్తున్నారు. విజయనగరం జిల్లా శృంగవరపుకోట మండలంలోని, డాంపురం దగ్గర ఒకప్పుడు మూడువందల కుటుంబాలు వుండేవట. క్రమేపీ ఉపాధి కోసం నాలుగు ప్రక్కలకు చెదిరిపోయారు. ప్రస్తుతం పది కుటుంబాల కంటే ఎక్కువ లేవని సూరిసెట్టి రాములు ఈనాడు విలేఖరికి వివరించాడు.

ఈ వృత్తివారికి పరిధిలు లేవు. ఏ గ్రామంలోనైనా యాచన చేయవచ్చు. అయితే ఒకరు వెళ్ళిన గ్రామానికి మరొకరు యాచనకు వెళ్ళరు. వారి ఆచార వ్యవహారాలు వేరుగా వుంటూ వారిళ్ళల్లో జరిగే పెళ్ళిళ్ళు అయిదు రోజులు జరుగుతాయి. ఆ సమయంలో అందరూ మద్యాన్ని సేవిస్తారు. అలాగే వారి కులాచారం ప్రకారం ఎవరైనా తప్పు చేస్తే కులపెద్దలు విచారించి వారికి జరిమానా విధిస్తారు. ఆ వచ్చిన

డబ్బుతో అందరూ విందు ఏర్పాటు చేసుకుంటారు. పురుషులు ఇలా యాచిస్తే స్త్రీలు చాపలు అల్లుతారు.

## అర్ధరాత్రి జోస్యం:

గ్రామంలో అర్ధరాత్రి యాచకానికి బయలుదేరిన బుడబుక్కలవారు ఆ సమయంలో యాచించరు. అలా గ్రామమంతా పది రోజులు అలానే తిరిగి ప్రతి ఉదయమూ ప్రతి ఇంటికీ వెళ్ళి డబ్బులు, బియ్యం వసూలు చేస్తారు.

అర్ధరాత్రి బుడబుక్కలవాని ఆగమనం కొంచెం భయంకరంగా వుంటుంది. ఎవ్వరూ అతనిని చూడరు. అతను చెప్పే మాటల కోసం ఆసక్తితో ఎదురుచూస్తారు ఎవరికివారు, వారికి సంబంధించిన జోస్యం చెపుతారేమో నని ఎదురుచూస్తారు. 'ఆం శాంభవీ, అంబ పల్కు జగదాంబా పల్కవే' అంటూ వారి వారి మనోభీష్టాలకు తగినట్లు చెప్పి యాచించే బొందిలీ క్షత్రియులు ఈ నాటికీ పల్లెలలోనూ, పట్టణాలలోనూ కనిపిస్తూ వుంటారు.



## బుడబుక్కల పగటి వేషం:

ఈ బుడబుక్కల వేషాన్ని పగటి వేషధారులు అత్యంత శోభాయమానంగా, అతి సహజంగా ప్రదర్శిస్తారు. వారు ఏ గ్రామంలో పగటివేషాలు ప్రదర్శించదలచు కున్నారో అక్కడ ప్రప్రథమంగా బుడబుక్కల వేషంతోనే ప్రారంభించేవారు. ఇద్దరు ముగ్గురు బుడబుక్కల వేషాలు ధరించి 'డమరుకాలు' అతి చాకచక్యంగా మ్రోగిస్తూ ప్రతి ఇంటికీ వచ్చి వారి వారి జాతకాల జోస్యాలను చెపుతూ గ్రామప్రజలను ముగ్ధులను చేసేవారు. ఆసక్తిదాయకమైన బుడబుక్కల వేషం ఈ విధంగా ప్రారంభమౌతుంది.

ఓం అంబ పల్కు-జగదాంబ పల్కే-జగదాంబా దుర్గి పల్కు. దుర్గాంబా పల్కే. దుర్గాంబా. ఓంకారి పల్కు, వారాహి పల్కే-శారదాంబా, జయము జయమౌతది రాజా జయమౌతది రాజా. మేలు మేలు మేలౌతది రాజా మేలౌతది రాజా। అయ్యగారి కార్యం జయమౌతది-అమ్మగారి కార్యం జయమౌతది.

అమావాస్యనాడే ఆదివారమున లచ్చివారమే ప్రొద్దున లచ్చి. లచ్చి ఇచ్చ ఏకామంటాది. మేలౌతది రాజా. శుక్రవారపు సంధ్యన లచ్చి. ముక్క బెట్టుకొవి

కూసుండాది. బొట్టి గలుగుతది-బొజ్జెదుగుతది. గాజు లొ స్తవీ, ఘలు ఘలు మంటవి. మేలు మేలౌతది రాజా మేలౌతది. జనసీ.

## మనసులో వున్న మాటలు చెప్పడం:

జగర్ఝాంతాళీ-మళయాళ భగవతీ! ధాతాపతీ! యక్షిణీ! పరంజ్యోతి పల్కు-అంబా పల్కు-దేవీ పల్కు. జగదాంబా పల్కు. శాంకరీ పల్కు-ఓంకారీ పల్కు-మహంకాళీ పల్కు. నాలుక యందు సరస్వతీ పల్కు. భేతాళా పల్కు. పల్కు. నా యిష్టదేవతా పల్కు.

అద్గది గద్గదిగో దేవరో అయ్యగారు మీసం మెలేస్తండు. రోసంబు చేస్తండు-సురసురా చూస్తడు. అయ్యగారు మనసులో ఒక చక్కటి కార్యం తల పెట్టిండు అది అగునా కాదా? అని తన మనసున తానే బహు తొక్కిసలాడ్తుండడు.

హద్గదే అయ్యగారి మనసులోని కార్యం సెప్పుటకు బ్రాహ్మడైతే ప్రశ్న సెపుతడు. జ్యోతిష్య మతమునుబట్టి సెపుతడు. అది ఔటా? కాకపోవుటా? జంగము దేవర ప్రశ్న చెపుతడు. బసవశంకరుని వేడి సెపుతడు. అదీ అవుటా? కాకపోవుటా? ఎరుకలవాడు ప్రశ్న చెబుతడు. కొల్లాపుర దేవతను వేడి సెపుతడు. అది ఔటా కాకపోవుటా, సోదెమ్మ సోది చెబుతది అది ఔటా? కాకపోవుటా?

అంటూ దొరో ఈ బుడబుక్కల రామజోగి ప్రశ్న చెపుతడు. బుడబుక్కల రామజోగి ప్రశ్న చెపితే ఘనంగా ఉండాలి దేవరో! మహద్దేవర మతంగా వుండాలి. మహద్దేవర మతమంటే? ఇను దేవరో!

## గడబిడ జరగబోతది:

ఈ గ్రామంలో కొద్దిలోపల గొప్ప గడబిడ పుట్టబోతుండది. అది ఎటువంటి గడబిడ అని అడగబోతరు. ఊరికి ఉత్తరంగ పెద్ద వూదలమట్టి వుండాది. దానిమీద కూర్చున్న జోడు పచ్చులు ఏమని పల్కుతున్నవంటే, ఒకతాటి కమ్మల గుడిసెలో తొంభై తొమ్మిదేళ్ళ కన్నెపడుచు గడా గడా వణికి తెల్లారేసరికి తొలి సమర్తాదేవం తుండది దేవరో, అందుమీద ఈ గ్రామంలో ఇకల్పములు పుడతై. రాచ విద్దూర ములు పుడతై. అన్యోన్య కలహములు పుడతై. కీడును యెల్లగొట్టి, మేలును తెచ్చే ఈ రామజోగి పేరు సెబితే? అంతలోనే అణగిపోతై దేవరో!

అంటూ ఇలా తన పాండిత్యాన్నంతా చెప్పి, అయ్యగారిలో ఆలోచనలు రేకెత్తించి నమ్మకం కలిగిస్తాడు.

దొర కుడి భుజాన వెంకటేశ్వరుడు సాయమైతడు. దొర పట్టిందల్లా బంగారమైతది. చెయ్యదలచినపని చేకూర్తది. అయ్యగారి కుడికంట్లో పుట్టుమచ్చున్నది. దాని ఇసేసమేమంటే? అయ్య కొద్దిలోపల. నాల్గుకాళ్ళ తెల్పు, నడినెత్తిన సుక్క గల పంచకల్యాణి గుర్రాన్ని ఎక్కి పోతుండండి. అయ్యకు నొసట లక్ష్మీ రేఖుండది. ఈపున ఇంజామర, అరికాలున తామరపద్మం వుండె. అయ్యగారు తెల్లి ఏనుగు ఎక్కి భూ పరిపాలన చేసేవంతుండది.

దొరా, ఓ దొరా। మాదొరా, మా దొడ్డదొరా। త్యాగాలదొరా, భోగాల దొరా। అంటూ అయ్యగారిని ఈ విధంగా ఊదరగొడతాడు.

అద్గదిగో దొరా, మీమీద కీడు తలపెట్టినవారిని వెనువెంట పసిగట్టి వాడి పళ్ళన్ని పీకించి ఒళ్ళంత మండించి, మరి తగలబెట్టేసి, భస్మంబు చేసేసి అయ్యగారి కిచ్చే భారం ఈ రామజోగిదే దొరా....తమ కీర్తి ఇంద్రునికన్న గొప్పది. చంద్రుని కన్న గొప్పది. మీకు మీరే సాటి అంటూ—

రామజోగి దీవెనలు :

ముత్యాల మూటలే - మీ యింట మూల్గాలె
రతనాల రాసులే - మీ చెంత జేరాలె
వరహాల బేరాలె - మీ రెపుడు సేయాలె
మా వూరి పేరయ్య కూచిపూడిర అయ్య
వినరయ్య కనరయ్య రామజోగిర అయ్య
బుడబుక్కల రామజోగిరా ఓరయ్య
మా పగటి వేషాలె మీరెపుడు సూడాలె
మీ మంచి శాలువలు మా మెడకు కప్పాలె
మీ చేతికంకణమె, మా చేత మెరవాలె
మహారాజ రాజా మార్తాండతేజా
శుభోజ్జయం శుభోజ్జయం
మీకు జయం మాకు ధనం.

అంటూ డబ్బులు దండుకుంటారు. ఈనాటికీ పగటి వేషధారులు బుడబుక్కల వేషాలను అక్కడక్కడ ధరిస్తూనే వున్నారు. అయితే వాటికి అంతగా ఆదరణ లేదు.

## కవులు వర్ణించారు :

బుడబుక్కలవారు ప్రాచీనం నుంచీ వున్నవారే. వీరి గురించి అనేకమంది కవులు వారి గ్రంథాలలో వర్ణించారు. కర్నూలు జిల్లాలో 18-వ శతాబ్దానికి చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిలో వారి వేషధారణ గురించి వివరించాడు.

అలాగే పైడిమర్రి వెంకటకవి చిత్రాంగద చరిత్రలో ఇలా వివరించాడు:

డాకదలిర్చు మబ్బు డుబుడుక్క
మెఱుంగు మెఱుంగు పట్టనన్
జోక బలాకికా సమితి
చుక్కల నామపురేక, నమ్మబల్
కేక సరోజ భేకకముల
కీడును మేలును దెల్పు కూకగా
జోక ఘనాగమంబు రహిజొచ్చె మహిన్
డుబుడక్కవాడనన్.

అలాగే ఆధునిక కవులలో కాటూరి, పింగళి తుమ్మల సీతారామమూర్తి మొదలైనవారు బుడబుక్కలవారిని గురించి ప్రస్తావించారు.

ఉత్తర భారతంలో బుడబుడక్కలవారు వున్నారో లేదో తెలియదు; గాని, మన పొరుగు రాష్ట్రాలైన తమిళ, కన్నడ రాష్ట్రాలలో వున్నారు. వీరంతా ఒకనాడు ఒక రాష్ట్రంలో కలిసి వున్నవారే. కర్ణాటకలో వీరిని బుడుబుడికె యివరు అని పిలుస్తారు.

## ప్రజానాట్య మండలి :

ఆధునిక కాలంలో ప్రజా నాట్యమండలి కళాకారు 1943 నుంచి 1950 వరకూ సాగిన ప్రజా నాట్యమండలి సాంస్కృతిక మహోద్యమంలో ఆ నాటి రెండవ ప్రపంచయుద్ధ బీభత్సాన్ని గురించీ, నాటి కరువుకాటకాలను గురించీ, హిందూ ముస్లిం కలహాల గురించీ, బ్లాకు మార్కెట్, లంచగొండు వుద్యోగుల గురించీ, సంఘ విద్రోహుల గురించీ సవివరంగా ప్రజలకు వివరించారు. ఈనాడు రాజమండ్రి విభూతి భవాని లింగంగారు వారి ఇతర పగటి వేషాలతోపాటు బుడబుక్కల వేషాన్ని ప్రతి కిస్తున్నారు.



# తాదాత్మ్యం చెందించే తప్పెటగుళ్ళు

ఆంధ్ర దేశంలో ముఖ్యంగా విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలో తప్పెటగుళ్ళు కళారూపం ప్రచారంలో వుంది. ఇది సంప్రదాయ నృత్యం. గొల్ల కులానికి చెందిన వారు ఎక్కువగా చేస్తూ వుంటారు. వారికి పశువులూ, గొర్రెలూ,



మేకల మందలూ ఎక్కువ. వర్షాలు పడక పశుగ్రాసానికి కూడ కష్టమైనప్పుడు భగవంతుని కటాక్షంకోసం చేసే దేవతారాధనలో ఈ తప్పెటగుళ్ళు ప్రముఖస్థానం వహిస్తాయంటారు బిట్టు వెంకటేశ్వర్లుగారు.

ముఖ్యంగా యాదవులు జరిపే గంగజాతర దశావతారాలు ముఖ్యమైనవి. కాటమరాజు భార్య గంగమ్మ, పార్వతీదేవి శివుని ఆజ్ఞ మేరకు కాటమరాజు భార్యగా జన్మించిందనీ, ఆ గంగమ్మ యాదవకులానికి ఆరాధ్య దేవత అనీ, యాదవుల నమ్మకం. శివుని దర్శించిన భక్తులందరికీ అన్ని వాయిద్యాలనూ ఇచ్చివేయగా మిగిలిపోయిన తప్పెటగుళ్ళను మాత్రం మిగిలిన యాదవుల కిచ్చారని వారి కథనం. తప్పెటగుళ్ళు రొమ్ముకు వ్రేలాడేటట్లు కట్టుకుంటారు. రొమ్ము మీదే ఆ వాయిద్యం.

## తప్పెటగుళ్ళు :

నాడు అశేష ఆంధ్ర ప్రజాసామాన్యాన్ని ఉర్రూతలూగించి వారి నుత్సాహ ఉద్వేగాలతో, ఉద్రేకపరిచి ఆనంద డోలికలలో ఊగులాడించి రాజాధిరాజులతో పాటు సామాన్య ప్రజలను మెప్పించి, వారి మన్ననలు పొంది, రంగ రంగ వైభోగంగా వారి జీవితాలలో జీవించి, వారి వారి జీవితాలను తీర్చి దిద్దిన నాటి జానపద కళారూపాలతో పాటు "తప్పెటగుళ్ళు" అనే విశిష్ట సంగీత నృత్యకళారూపం ఈ నాడు అక్కడక్కడా కనిపిస్తూ కొనవూపిరితో కొట్టుకుంటూ దిక్కూ తెన్నూ లేక ఆదరణకోసం ఎదురుచూస్తూ వుంది.

## కళింగ కళారూప మది :

తప్పెట గుళ్ళు అనే ఒక కళారూపం వుందని, ఈ నాటి తెలుగువారికి తొంబై మందికి తెలియదంటే ఎవరూ ఆశ్చర్యపోవాల్సిన పని లేదు. అది ఒక విశిష్ట కళారూపం, అది ఆ నాటి కళింగాంధ్ర దేశంలో ఉత్తమ కళారూపంగా వెలుగొందిన జానపద కళారూపం, అది ఈనాడు కనుమరుగై పోతూ వుంది. ఈనాడు ఉత్తరాంధ్ర దేశంలో పల్లెటూళ్ళలో పల్లె ప్రజల పోషణతో సంరక్షింపబడుతూ వుంది. ప్రతి ఏటా జరిగే దేవతల కొలువుల్లోనూ, జాతర్లలోనూ పండుగ దినాల్లోనూ ఉత్సాహంగా ప్రదర్శింపబడుతూ వుంది.

తప్పెటగుళ్ళు జానపద సంగీత నాట్య దృశ్య రూపకం, రేకుతో గుండ్రంగా తయారుచేసిన తప్పెటలాంటి ఒక వాయిద్య పరికరాన్ని రొమ్ములపై కట్టుకుని రెండు చేతులతోనూ వివిధ గతులలో ఉధృతంగా వాయిస్తూ, కాళ్ళకు గజ్జెలు కట్టి ఒకే విధమైన రంగుల నిక్కర్లను తొడిగి, కేకలతో అరుపులతో కేరింతాలు కొడుతూ, ఆనందంతో వలయాకారంగా తిరుగుతూ కట్టుదిట్టమైన శాస్త్రీయమైన అడుగులతో అందరూ వంగుతూ, లేస్తూ, గెంతుతూ, సుదీర్ఘ రాగాలతో ఆలాపనచేస్తూ మృదు మధురమైన సంగీతంతో మధురంగా పాటలు పాడుతూ ప్రేక్షకులను రంజింపచేస్తారు.

## జట్టు నాయకుడే గురువు :

తప్పెటగుళ్ళు బృందానికి ఒక నాయకుడు వుంటాడు. అతనే ఆ బృందానికి గురువు. నాయకుని చెప్పుచేతల్లో ప్రదర్శనం సాగుతుంది. కేవలం తప్పెట గుళ్ళతో నృత్యం చెయ్యటం మాత్రమే కాక నాయకుడు, రామాయణం, భారతం, బొబ్బిలి

యుద్ధం మొదలైన కథలను చెపుతూ మధ్యమధ్య రంధరంధరా మాస్వామి జన్నయ్య వంటి కొన్ని కీర్తనలు పాడుతూ ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తుతారు.

లయబద్ధంగా నృత్యం చేసే ఈ బృందాలలో ఇరవైమంది వరకూ వుంటారు. ఎంతమందైనా వుండవచ్చు. కాని వారు సమర్థులై వుండాలి. తాళం, లయ, తప్పకుండా నృత్యం చెయ్యగలిగి వుండాలి. క్రమం తప్పకుండా వలయాకారంగా తిరుగుతూ వీరు చేసే నృత్యం కన్నుల పండువుగా వుంటుంది.



## యాదవుల కళా రూపం :

ముఖ్యంగా ఈ కళను గొల్లసుద్దులను ఆదరించిన యాదవులే ఈ కళనూ ఆరాధిస్తారు. ప్రదర్శన స్థాయి పెరిగేకొద్దీ ప్రదర్శకులు ప్రదర్శన మధ్యలో వారి వారి ప్రతిభా విశేషాలను ప్రదర్శిస్తారు. ఒకరికంటె మరొకరు మిన్నగా రెండు భాగాలుగా చీలిపోయి పోటీలు పడతారు. ఒకరికంటె మరొకరు తప్పెట్లమీద వాద్య వరుసలనూ గమకాలనూ వినిపిస్తారు. ప్రదర్శనం పతాక స్థాయి చేరే సరికి సర్కసులో మాదిరి ఫీట్సుచేసే ప్రేక్షకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తారు. నిజానికి తప్పెటగుళ్ళ ప్రదర్శనానికి ఈ సర్కస్ ఫీట్సుకూ సమన్వయం వుండదు. ఉండకపోయినా ప్రేక్షకులు ఉత్కంఠతో ఈ సాహస ప్రదర్శనాన్ని చూస్తారు.

నృత్యం చేస్తూనే వలయాకారంగా తిరుగుతూనే రయము తప్పకుండానే, చిందులు త్రొక్కుతూనే ఒకప్రక్క తప్పెటలు వాయిస్తూనే, నెమ్మదిగా ఒకరిపైన మరొకరు ఎక్కుతూ అంచెలంచెలుగా గోపుర ఆకారంగా నిలిచినప్పుడు ఆ దృశ్యం ఎంతో అద్భుతంగా వుంటుంది. పైవారి బరువునంతా క్రిందివారు భరిస్తూ వుంటే ప్రక్కనున్న కొద్దిమంది లయ తప్పకుండా పాటలు పాడుతూనే వుంటారు.

## ఏకాగ్రతా నృత్యం :

కూచిపూడి నృత్యంలో నెత్తిన చెంబూ కాళ్ళక్రింద పళ్ళెము మాదిరి. వీరు కూడా నీరు నింపిన మట్టికుండ అంచులపై ఒకరు నిలబడితే, అతనిపై మరొ

వాద్యకారుడు తప్పెటను వాయిస్తూనే నీరు నిండిన కుండను నెత్తిన పెట్టుకుని నీరు తొణకకుండా, ఒక్కపక్క తప్పెట వాయిస్తూ నీరు తొణికిపోతాయేమో అనే దృష్టి లేకుండా నృత్యం చేస్తూవుంటే చుట్టూచేరిన జనసందోహం చప్పట్లు చరుస్తారు.

## గంగమ్మ కథ :

యాదవులైన తప్పెటగుళ్ళ కళాకారులు ముఖ్యంగా చెప్పే కథ.... గంగమ్మ కథ....గంగమ్మను వారు ఆరాధ్య కులదేవతగా ఆరాధిస్తారు. కాటమరాజు భార్య గంగమ్మ అనీ, శివుని ఆజ్ఞ ననుసరించి, పార్వతీదేవే గంగమ్మగా అవతరించిందని యాదవుల నమ్మకం. అంతేకాదు అందరికీ అన్ని వాయిద్యాలనూ దానంచేసిన శంకరుడు తనవద్ద మిగిలివున్న తప్పెటగుళ్ళను యాదవులకిచ్చినట్లు ఇతిహాసం. గంగమ్మపట్ల వీరు ఎటువంటి భక్తిశ్రద్ధలను కలిగి వుంటారో, గంగమ్మ తిరునాళ్ళలో పాడుకునే ఈ పాటను తిలకిస్తే బోధపడుతుంది.

శోభనమో యమ్మ - శోభనమే తల్లి
శోభనమో గంగ - శోభనమో తల్లి
మూడు మూళ్ళ నరులమే - మురికి జన్మం మాది
ఎంగిలి కంఠాన మేమెంచి - పిలువంగ లేము
పాచి నోరుతోను - పాలింపలేమో యమ్మ
నీకు వందనమమ్మ లోకమాతవు నీవు
దబ్బవనములోన - దాగుండినావు తల్లీ
నిమ్మవనములోన - నిలిచివున్నావు తల్లీ
నీకు వందన మమ్మ - లోకమాతవు నీవు.

అంటూ గంగమ్మదేవుని ప్రార్థిస్తూ కథను సాగిస్తారు.

ముఖాలు పైకెత్తి. నివ్వెరపడి అలాగే ఆశ్చర్యంతో చూస్తూ వుంటారు. అది ఎంతటి అద్భుత ప్రదర్శనమో మనం ఊహించుకోవచ్చును.

ఈ ప్రదర్శనం ఎంతో కట్టుబాటుతో క్రమశిక్షణతో నడుస్తుంది. ఒక ధ్యేయంతో, లక్ష్యంతో నడుస్తుంది. ఎంతో భక్తిభావంతో ఒళ్ళు దగ్గరపెట్టుకుని ప్రదర్శనాన్ని సాగిస్తారు. వారి ప్రదర్శన పరుసక్రమంలో ఏమాత్రం పొరపాటు జరిగినా అవమానంగా భావిస్తారు. అందువల్లే వారి ప్రదర్శనం ప్రారంభంనుండీ ఆసాంతం వరకూ, ఎంతో ఆసక్తికరంగా నడుస్తుంది.

## వివిధ విన్యాసాలు :

లయానుగుణ్యమైన పాటలు పాడుతారు. ఎన్నో భక్తిగేయాలతో పాటు దశావతారాలు, కృష్ణలీలలు, సారంగధర చరిత్ర, చెంచీత, అమ్మవారి చరిత్రలాంటి కథాగేయాలను కూడా పాడుతూ సన్నివేశాల కనుగుణమైన అభినయాలను ప్రదర్శిస్తూ వారి వారి ప్రతిభను కనపర్చే విన్యాసాలు చేస్తారు.

వివిధ భంగిమల్లో తప్పెట్లు వాయించటమేకాక, ఒకరిమీద మరొకరు ఎక్కి ఒకని సహాయంతో రెండువైపులా ఇద్దరు వ్రేలాడుతూ తప్పెటలు వాయించటం రెండు జట్లుగా విడిపోయి తప్పెటగుళ్ళు వాయిస్తూ వారి ప్రతిభను ప్రదర్శించటం.



అలాగే ఒక కుండపైన ఒకరు నిలబడి ఆతనిపైన మరొకరు నిలబడి గుళ్ళు వాయిస్తారు. విన్యాసాలలో ఎగిరి అమాంతంగా క్రిందపడటం, మోకాళ్ళ మీద కూర్చుని విన్యాసంగా గుళ్ళు వాయించటం.

ఇలా ఈ ప్రదర్శన ప్రేక్షకుల్ని ఆశ్చర్యపర్చే విధంగా నాలుగైదు గంటలు సాగుతుంది. పగటిపూట తమ వృత్తిని చూసుకుంటూ రాత్రిపూట ప్రదర్శనాలను ఇస్తారు. అలాగే రాత్రిపూటే శిక్షణ కూడా పొందుతారు. వారి వారి బిడ్డలకు చిన్న తనం నుంచే ఈ విద్యలో శిక్షణ యిస్తారు. ముఖ్యంగా తప్పెటగుళ్ళులో పురుషులే

పాల్గొంటారు; ఒక ప్రాంతానికే ప్రాముఖ్యం ఇచ్చే ఈ కళారూపం. జాతీయ వుత్సవాలలోనూ, విదేశాలలోనూ కూడా ప్రదర్శింపబడుతూ వుంది.

## అభినయ విన్యాసం :

ముఖ్యంగా ఈ ప్రదర్శనాలు జాతర్లలోనే జరుగుతాయి. ఈ ప్రదర్శనం రాత్రిపూటే ప్రదర్శింపబడుతుంది. ప్రదర్శనమంతా అభినయ విన్యాసంతో తొణికిస లాడుతుంది. పాటకు తగిన తాళం, తాళంకు తగిన లయ, లయకు తగిన నృత్యం నోటితో పాట, ముఖంలో వుత్సాహ వుద్రేకాలతో కూడిన సాత్విక చలనం కొట్ట వచ్చినట్లు కనబడతాయి.

తప్పెటగుళ్ళు ప్రదర్శనం ఏ గ్రామంలో ఇవ్వదలచుకుంటారో ఆ గ్రామ పెద్దల వద్ద పావలా డబ్బులతోపాటు కొంచెం బెల్లం బజానాగా స్వీకరించి ఏ తేదీన ప్రదర్శనం ప్రదర్శించాలో నిర్ణయించుకుంటారు.

## ఎక్కడ వుందీ కళారూపం?

ఎంతో ఉత్తమమైన ఈ కళారూపం ముఖ్యంగా శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలలో అధిక ప్రచారంలో వుంది.

విజయనగరం జిల్లాలో గజపతి నగరం తాలూకా, పల్లపేట....మురిపెల్లి గ్రామాలలో ఈ కళారూపం సజీవంగా వుంది. పెల్లాచిన నారాయణ, దుర్ల చిన అప్పలస్వామి నాయకత్వాన గజపతి నగరం వృత్తి కళాకారుల సమాఖ్య సహ కారంతో నడుస్తూ వుంది.

ఈ కళకు గుర్తింపు కావాలని డా॥ బి. యస్. ఆర్. మూర్తి దంపతులు ఎంతో కృషి చేస్తున్నారు. ఈనాడు గజపతి నగరం చుట్టుప్రక్కల నలభై గ్రామాలలో శిక్షణ పొందిన తప్పెటగుళ్ళు దళాలు వున్నాయి.

శ్రీకాకుళం పట్టణానికి దగ్గరలో వున్న షేరు మహమ్మదు పురంలో, శిక్షణతో కూడిన .... కోన చిన్నవాడు....అధ్వర్యంలో ఉత్తమంగా ప్రదర్శనాలిస్తూ వచ్చింది. చిన్నవాడు వయసులో పెద్ద వాడైనందువల్ల ఆ కార్యభారాన్ని .... కోరాడపోతప్పుడు వహి స్తున్నాడు.



# పలనాటి వీర విద్యావంతులు

ఆంధ్ర దేశంలో పలనాడును గురించీ, పలనాటి వీరులను గురించీ వారి వీర చరిత్రను గురించీ వారి పౌరుషాలను గురించీ తెలియనివారెవరూ లేరు. అది అన్నదమ్ముల మధ్య చెలరేగిన పోరాట గాథ. విశిష్టమైన రెండు మతాల మధ్య చెలరేగిన స్పర్థ. అదే శైవ, వైష్ణవాల మధ్య వచ్చిన సంఘర్షణ. సామాజిక సాంఘిక న్యాయాల మధ్య



జరిగిన విప్లవాత్మక పోరాటం. పౌరుషాలకు నిలయం పలనాటి భారతం. ఆ వీరగాథల్ని ప్రచారం చేసేవారే వీర విద్యావంతులు.

ఈ నాటికీ వీరగాథల్ని చెప్పే వీర విద్యావంతులు గుంటూరు జిల్లాలో చెపుతూనే వున్నారు. వీరుగాక వీరశైవమతానికి చెందిన పిచ్చుకుంటులవారూ, కాటమరాజు ఖడ్గతిక్కన కథలు చెప్పే కొమ్ముువారు కూడా ఈ వీరకథల్ని గానం చేస్తున్నారు.

## శ్రీనాథుని వీరచరిత్ర:

ఎవరు కథలు చెప్పినా అందరూ శ్రీనాథుడు వ్రాసిన పల్నాటి వీరచరిత్రనే ఇరవైఅయిదు భాగాలుగా రోజుల తరబడి చెపుతూ వుంటారు.

అయితే ఆ వీరుల పౌరుషాలను వల్లిస్తూ చిలువలు పలువలు కల్పించి మరి కొన్ని గాథల్ని కూడా ప్రచారం చేశారు. అలా శ్రీనాథుని చరిత్రను ఆధారం చేసు కుని కొండయ్య కవి మరికొన్ని గాథలను కూడా రచించి ప్రచారంలోకి తెచ్చినట్లు చెపుతారు.

అయితే కొన్ని కథలు ఈనాటికీ కొన్ని కంఠస్థంగా వున్నవీ, తాళపత్ర గ్రంథాలలో వున్నవీ కూడా వున్నాయి. అయితే వీటినన్నిటినీ ఒక చోటుకు చేర్చే ప్రయత్నం జరగకపోయినా, అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రథమంలో బాలచంద్రుని కథను ప్రచారంలోకి తీసుకువచ్చారు. ఆ తరువాత పింగళి లక్ష్మి కాంతంగారు మరికొన్ని గాథల్ని వెలుగులోకి తెచ్చారు. అలాగే కాటమరాజు కథల్ని పరిశోధించిన డా. తంగిరాల సుబ్బారావుగారు కూడా ఇరవైఅయిదు కథల్ని వెలుగు లోకి తెచ్చారు. అలాగే ముదిగొండ వీరభద్ర కవిగారు వీరభారత గ్రంథంలో అనేక గాథల్ని వర్ణించారు. ఇక మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో పల్నాటి వీర చరిత్రకు సంబంధించిన వివరాలు కొల్లలుగా దొరుకుతాయి.

## కన్నమదాసు వారసులే కథకులు:

సంప్రదాయంగా ఈ వీరగాథల్ని ప్రచారం చేసేవారు, వీర విద్యావంతులైన మాల కన్నమదాసు కులానికి చెందినవారు చెపుతారు. ఇది వారి పారంపర్య హక్కుగా భావిస్తారుట; బ్రహ్మనాయుడు మాల కన్నమదాసుని చేరదీసి కులమత భేదాలు లేవని చాపకూటి సిద్ధాంతాన్ని అమలుపర్చాడు; అందువల్ల పల్నాటి వీరగాథల్ని ప్రచారం చేయడానికి బ్రహ్మనాయుడు, మాలలనే ఆదేశించాడనే కథ ప్రచారంలో వుంది. ప్రచారానికి నిదర్శనం ఈనాటి వీరవిద్యావంతులే.

గతించిన చరిత్రలో కాకతీయుల కాలంలో ఓరుగల్లు వీధుల్లో పల్నాటి వీర గాథల్ని చెప్పినట్లూ, వా రుపయోగించిన వాయిద్యాలను గురించీ, వాటి ఉద్ధృత ధ్వను లను గూర్చి క్రీడాభిరామంలో ఉదహరించబడింది.

## వీర పూజతో వీరుల దినోత్సవం:

పలనాడులో ప్రతి సంవత్సరం కారెంపూడిలో నాగులేటి ఒడ్డున, బాల చంద్రుని గుడివద్ద వీరుల దినోత్సవం జరుగుతుంది. ఈ వుత్సావానికి పలనాటిలో వున్న ప్రజలందరూ తిరునాళ్ళలా తరలివస్తారు. ఈ వుత్సవం దాదాపు ఇరవై రోజులు జరుగుతుంది. ఈ నాటికీ పలనాటి వంశీకులమని చెప్పుకునే వీరవిద్యావంతులు ఆ వీరుల్నీ, ఆ వీరగాథల్నీ తలుసుకుని పులకించిపోతారు. వీరపూజ చేస్తారు. సాంబ్రాణి ధూపంతో వివిధ వాయిద్యాల ధ్వనుల హోరులో పూనకం తెప్పించుకుని గణా చారులై ఉగ్రులై పోతారు. పౌరుషంతో వూగిపోతారు. వారి వారసులుగా దుఃఖిస్తారు. చివరి రోజున పలనాటి యుద్ధానికి కారకురాలైన నాగమ్మ పాత్రను వేషంగా ధరింప చేసి కారెంపూడి వీథుల్లో వెంటబడి తరుముతారు. అలా ఊరి బయటివరకూ తరిమి నాగమ్మ శిగను కత్తిరించి నానా తిట్లూ తిట్టి పరాభవిస్తారు. అలా వారికున్న కష నంతా తీర్చుకుంటారు.

ఈ వీరుల దినోత్సవం జరిగినంత కాలం ఎక్కడెక్కడి వీరవిద్యావంతులు కారెమపూడికి తరలివచ్చి, కారెమపూడిలో కథలు చెపుతారు. నాగావళిలో స్నానం చేసి బాలచంద్రుని గుడి ముందు 'బాలుడో, చెన్నుడో' అంటూ అరుస్తూ వారి వారి మ్రొక్కుబడులు తీర్చుకుంటారు.

వారి వీరావేశాన్నంతా వివిధ వాయిద్యాల ధ్వనులలో వెల్లడిస్తారు. ఆ సమ యంలో ప్రతివాడూ ఒక వీరుడై పోతాడు. ఉత్సవానికి వచ్చిన ప్రజలందరూ తన్మయులై పోతారు. ఇలా వీరవిద్యావంతులు ఈ నాటికీ పలనాటిలో కొనసాగిస్తూ వస్తున్నారు.

## వీరవిద్యావంతుల వేషధారణ:

పల్నాటికి చెందిన వీరవిద్యావంతులు చెన్నుని దర్శనానికి చెందిన హరిజను లని, పల్నాటి వీరకథాచక్రాన్ని పాడుతారనీ ఈ పాడటంలో వీరజోడు (పంబ జోడు) దానిమీద రెండు గంటలు. తిత్తి, తాళం, కత్తి, డాలు ఉపయోగిస్తారని ప్రధాన కథకునితో పాటు ముగ్గురు వంతలు ఉంటారని, ప్రధాన కథకుడు పల్నాటి వీరుడులాగా వేషం వేసుకుంటాడనీ, ఇతడు పన్నెండు బిరుదులు ధరించాలనే నియమం వుందనీ, డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు రాష్ట్రస్థాయి జానపద కళోత్సవాల సంచికలో వివరించారు.

అంతేకాక కాశి కోక, తలగుడ్డ, కలికి తురాయి, వెండి రేకుతో చేయబడిన ఉమ్మాహో పిట్ట, చంద్రవంక, అందె, కత్తి, డాలు, వీరజోడు, తిత్తి, తాళం, బొడ్డు గంట, బంజా గుడ్డ, డాలుకు బదులుగా కొందరు పిడికత్తిని పుచ్చుకుంటారు. దీనిని అమజాల అంటారు.

## విలక్షణమైన ఎన్నో హంగులు :

పెద్ద కత్తిని అడ్డకత్తి అంటారు. కుడిచేతిలో అడ్డకత్తి, ఎడమచేతిలో అమజాల, కుడికాలికి బిరుదు అందె. పన్నెండు మూరల తలగుడ్డ, తలగుడ్డలో కలికి తురాయి, కాలికి కుడిప్రక్క చంద్రవంక, ఉమ్మాహూ పిట్ట. మెడ క్రింద కుడివైపున రొమ్ముకి తిరుమణి (తెలుపు మధ్య ఎరుపు) ఎడమవైపు రొమ్మున జంజెం గుడ్డ (తెలుపు ఎరుపు రెండు రంగులతో ఏడు మూర లుంటుంది, షరాయి, జంజెము, బొడ్డుగంట, త్రికోణాకారంలో వుండే గుడ్డ, దీని చుట్టూ పూసల మధ్య గంట కట్టబడి వుంటాయి. ఇదీ కథకుని వేషం.



ఇలా పన్నెండు బిరుదులు ధరించి కత్తితిప్పుతూ వీరావేశంతో కథను పాడుతూ వుంటే, నాటి పల్నాటి బాలచంద్రుడు దివి నుండి భువికి దిగివచ్చినట్టుగా వుంటుందట.

వంతల్లో ఒకడు వీర జోడు వాయిస్తాడు. రెండవవాడు తిత్తి పడతాడు. మూడవవాడు తాళం కొడుతూ అంకొడతాడు. ఈ వీర కథాగానంలో కొంత అభినయం, నాట్యం మిశ్రితమై నడుస్తాయి. కథకుడూ, వంతలూ, అందరూ నిలబడే పాడుతారు. పల్నాటి వీరకథల్ని రాత్రివేళ వెన్నెల్లో పాడతారే గాని, దీపకాంతిని ఉపయోగించరట. ఈ ఆచారం ఎందుకు వచ్చిందో తెలియదంటారు డా॥ తంగిరాలవారు.

ఉత్తేజకర ప్రదర్శనం :

వీరగాథల్ని వీర విద్యావంతులు అనర్గళంగా చెపుతారు. కథాప్రారంభంలో కులదైవమైన మాచర్ల చెన్నకేశవుని ప్రార్థిస్తారు. ఆ తరువాత కథలో వచ్చే వీరు లందర్నీ పేరు పేరునా స్మరిస్తారు. ముఖ్యంగా అంకాళమ్మను ప్రార్థిస్తారు.

వీర గాథలన్నీ వీర రస ప్రధానమైనవి. కథకులు వీరావేశులై ప్రేక్షకుల్ని ఉద్రూతలూగిస్తారు. యుద్ధ రంగ ఘట్టాలలో భయానక బీభత్సరసాలు ఎంతో ప్రాముఖ్యాన్ని వహిస్తాయి. కథకుడు కథా సన్నివేశాలలో పలనాటి వీరుల పౌరుషాన్ని మన కళ్ళ ముందు ప్రత్యక్షం చేస్తాడు. ముఖ్యంగా సాత్విక ఆంగికాభినయాలతో సన్నివేశాన్ని బట్టి నృత్యాన్ని కూడా అభినయిస్తారు. రంగస్థలాన్నంతా దద్దరిల చేస్తారు.

వీరవిద్యావంతులు రాష్ట్రంలో మరొక చోట ఎక్కడా కనిపించరు. స్థానిక గాథలకే పరిమితమైన కళారూపమిది. ఈనాడు వారి వారి ఆర్థిక పరిస్థితుల ననుసరించి సాంప్రదాయకమైన వేషధారణతో కథలు చెప్పలేకపోతున్నారు. నానాటికీ ఈ వీరవిద్యావంతుల కళ హీనస్థితిలో పడిపోతూ వుంది. దానిని పునరుద్ధరించాల్సిన ఆవశ్యకత ఎంతో వుంది.



# రాయలసీమ జానపద కళారూపాలు

రాయలసీమలో యక్షగానాల తరువాత ''వీథి నాటకాలు, బుర్రకథలు, విచిత్ర వేషాలు, తోలుబొమ్మలాటలు, హరికథలు'' మొదలైనవని విరివిగా ప్రదర్శిస్తూ వుండేవారు. వీటినే బయలాటలనీ, బయలు నాటకాలనీ అనేవారు. వీటిని మాలపల్లెలో వున్న ''దాసరులు'' అనేవారు ప్రదర్శిస్తూ వుండేవారు. వీరిని దాసుళ్ళనీ, దాసరులనీ,

కొమ్మాయి దాసుళ్ళనీ, మాలదాసరులనీ పిలవబడుతూ వుండేవారు. హరిజనుల్లో ఒక తెగగాను వారిలో అతీతులుగాను వుండేవారు. శూద్రజాతులు బ్రాహ్మణులను కూడా గూడెపు ప్రజలు గౌరవిస్తారు. ఒకనాడు వీటిని దాసరులే ప్రదర్శించినా, ఈనాడు అనేకమంది వాటిని ప్రదర్శిస్తూ జీవయాత్ర చేస్తున్నారు.

## కంఠస్థంగా వున్న కళారూపాలు :

వీరు ప్రదర్శించే నాటకాలు అన్నీ వ్రాతప్రతులుగానో, లేక తాటియాకుల గ్రంథాల్లోనో లేక ప్రత్యేక వ్యక్తుల కంఠస్థంగానో నిలిచి వున్నాయి. ఒక్కొక్క దేశంలో వున్న ముఖ్య నాయకునికి అనేక నాటకాలు కంఠస్థం అయివుంటాయి. అతను మరణిస్తే, అతనితోపాటే ఆ నాటకాలు కూడా అంతరిస్తాయి. ఈ విధంగా మన ప్రాచీన యక్షగాన సాహిత్యం, బయలు నాటకాల సాహిత్యం అంతా శిథిలమైంది. అయినా యిప్పటికీ రాయలసీమ పల్లెల్లో అనేక బయలు నాటకాలు ప్రచారంలో వున్నాయి అవి కూడ కొన్ని అచ్చులో లేవనే చెప్పవచ్చు. వాటిలో కొన్ని మచ్చుకు ఈ క్రింద ఉదహరిస్తాను.

## నాటి మేటి నాటకాలు :

దొడ్డకవి వ్రాసిన "సుగ్రీవ విజయం" కుమ్మరి బాలయ్య వ్రాసిన "సారంగధర" రుద్రకవి వ్రాసిన "శశిరేఖా పరిణయం" బెడుదూరు రంగాచార్యులు రామాచార్యులు వ్రాసిన "హరిశ్చంద్ర", వేములపల్లి కృష్ణమాచార్యుల "విరాట పర్వం", నరసింహారెడ్డి వ్రాసిన "చుక్కలూరు రామనాటకం" యాదవదాసు రచించిన "గరుడాచల యక్షగానం" మొదలైన పైన వివరించిన నాటకాలన్నీ నేటి రాయలసీమలో ప్రచారంలో వున్నాయి. ఇవి అన్నీ కూడ పురాణకథా వస్తువులతో కూడినవే. అయినా పల్లెప్రజలకు అర్థమయ్యే శైలిలో వ్రాయబడ్డాయి. అంతేగాక ప్రదర్శనాక్రమంలో ప్రతిమాటా అర్థమయ్యేటట్లు విడమర్చి చెప్పేవారు. అందువల్ల చదువురాని ప్రేక్షకునికి కూడ అర్థమయ్యేది. ఇందుకు ఉదాహరణ యాదవదాసు రచించిన గరుడాచల యక్షగానంలో—

బాణమెయ్యగలవా మృగముల
బట్టి త్రుంచగలవా

నాణెముతోడున్నత జారుడు బండల
మీది కెక్కగలవా
మృగముల బట్టెదనే నేన్
నగముల తిరిగెదనే

## నలుగురు కూడే
## నడిబజారులో నాటక ప్రదర్శనం :

పై విధంగా పాత్రల మధ్య సంవాదం జరుగుతుంది. ప్రదర్శనాల పద్ధతి. ఊరు మధ్య పెద్ద బజారులో నలుగురూ సమకూడే ప్రదేశంలో పెద్ద గడలతో పందిరివేసి చుట్టూ మామిడితోరణాలు గట్టి పందిరిలో ఎత్తుగా దిబ్బపోసి ప్రదర్శనానికి ముందు మద్దెల తాళాలతో కొంచెం సందడి చేసేవాళ్ళు. అంతకు ముందు ప్రదర్శన కారులు ఇంటింటికీ వెళ్ళి రాత్రి ప్రదర్శనానికి రమ్మనమని ఆహ్వానించేవారు. ప్రదర్శనానికి లైట్లు వుండేవి కావు. తెరలు వుండేవి కావు. తెరలకు బదులు దుప్పట్లు ఉపయోగించేవారు. లైట్లకు బదులు దివిటీలు వెలిగించేవారు. కొన్నాళ్ళు కిరసనాయిలు ఇలాయి కట్టలు వెలిగించారు. గ్యాసులైట్లు వచ్చిన తరువాత పై విధానాలు పోయాయి.



## హంగామాతో రంగస్థల హంగులు

ఈ యక్షగానాల్లో స్త్రీ పాత్రలు పురుషులే ధరించేవారు. భుజకీర్తులు ధరించేవారు. కిరీటాలు పక్షుల రెక్కలతో సొంపుగా తయారుచేసేవారు. వేషధారణలో ఆయా రసాలకు తగిన ఎరుపు, పసుపు, పచ్చరంగులను ఉపయోగించేవారు. ప్రతి పాత్ర ప్రవేశానికి ఒక హంగామా చేసేవారు. ఈ విధంగా ప్రేక్షకుల్లో కొత్త ఉత్సాహాన్ని రేకెత్తించేవారు. ముఖ్యంగా ప్రధాన పాత్రలు యముడు, కంసుడు, రావణుడు మొదలైన పాత్ర ప్రవేశాల్లో నిప్పులు గ్రక్కుతూ పాత్రలు వచ్చేవి. రంగస్థలం పైకి పాత్ర రాగానే తెరపట్టి, తెర వెనుక పాత్రధారుల నుంచి తెర ముందు విదూషకుడు ఆ వచ్చిన పాత్రధారిని ప్రేక్షకులకు ఎరుకపర్చడానికి ఆహా, ఈ సభా

రంగమునకు విచ్చేసిన అమాత్యు లెవరండీ అని ప్రశ్నిస్తే వెంటనే లోపల వున్న పాత్రధారి ఏ వుద్దేశ్యంతో ప్రవేశించనున్నాడో అంతా పూసగ్రుచ్చినట్లుగా పాత్ర పరిచయం చేసేవారు. ఆ తరువాత నాటక ప్రారంభం. నటుడు వల్లించిన ప్రతి పాటకూ హంగుదార్లు వంత పాడుతూ నానాహంగామా చేస్తారు. ఈ విధంగా నాటకాన్ని రక్తికి తీసుకు వస్తారు. ఈ విధమైన బయలు నాటకాలు రాయలసీమలో అన్ని పల్లెప్రాంతాల్లోనూ ప్రదర్శింపబడుతూ వుండేవి.

## వెదురుచాపల వీథినాటక రంగస్థలం :

ఆనాడు రాయలసీమలో నాటకాలు ప్రదర్శించటానికి తగిన ప్రదర్శన శాలలు లేవు. వెదురు చాపలూ, తడికెలూ, గోనె సంచుల కప్పులతో నాటకశాలలు నిర్మించేవారు. ప్రతి నాటక సమాజమూ మంచి క్రమశిక్షణతో రంగస్థలాన్ని పవిత్రంగా ఎంచేవారు. నాటకాలలో వాయిద్యాలుగా హార్మోనియం, తబలా, మృదంగం, ఫిడేలు ఉపయోగించేవారు. వేషధారణలో సఫేదు, అర్దళం ఉపయోగించేవారు. ఉత్తమ పాత్ర లన్నిటికీ విలువైన చెమ్కీ కోటులను, మంచి తలపాగాలను తురాయిలనూ ఉపయోగించేవారు. విగ్గులకు బదులుగా వారి వారి శిరోజాలనే విగ్గులుగా పెంచుకునేవారు.

## బళ్ళారికి పేరు తెచ్చిన బయలాటలు :

పూర్వం నుంచీ బళ్ళారి ప్రాంతంలో బయలాట అనే జానపద కళారూపం బహుళ ప్రచారంలో వుండేది. ఆంధ్రప్రదేశపు వీథినాటక ప్రదర్శనానికి, ఈ బయలాట ప్రదర్శనానికి ఎంతో సన్నిహిత సంబంధ ముంది. ఈనాటికీ ఈ కళారూపం బళ్లారి చుట్టు ప్రక్కల గ్రామాల్లో ప్రదర్శింపబడుతూ వుంది.

ఒకప్పుడు బళ్ళారిలో "జనల్‌ఘాట్" "మేఘాట్" అనే రెండు పెద్ద బయలాట కంపెనీలను 'గరుడచేడు హనుమంతప్ప' సామసాగరం వెంకణ్ణ' కురుగోడు దొడ్డకవి మొదలైనవారు నడుపుతూ వుండేవారు. వీరు కన్నడిగులు.







# ఇంటింటా గోత్రాలు చెప్పే పిచ్చుకుంటులవారు

ఆంధ్రదేశంలో చిరకాలం నుండీ ప్రచారంలో వున్న కళారూపం పిచ్చుకుంటుల కథ, ఈ కథను పిచ్చుకుంటులవాళ్ళనే జాతివారు చెపుతూ వుంటారు. ఈనాటికీ వారు వెనుకబడ్డ ప్రాంతాలలో కనిపిస్తూ వుంటారు. మన వంశాల గోత్ర నామాలను వర్ణిస్తూ గోత్రాలను చెపుతారు.

వీరు చెప్పే కథల్లో ప్రాముఖ్యమైనదీ, చరిత్రాత్మకమైనదీ, వీరోచితమైనదీ శ్రీనాథ మహాకవి రచించిన ''పల్నాటి వీరచరిత్ర''. ఈ కథను ప్రారంభిస్తే దాదాపు పదిహేను రాత్రులు చెపుతారు.

పిచ్చుకుంటుల కథలో శృంగార, వీర, కరుణ రసాలకు ఎక్కువ అవకాశ ముంది. ఒకప్పుడు వీరు కేవలం ప్రజలను యాచించేవారని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పర్వత ప్రకరణంలో ఈ విధంగా వర్ణించాడు.

పండితారాధ్య చరిత్రలో:

వీవంగ చేతులు లేవయ్యా - నడచి
పోవంగ కాళ్ళును లేవయ్యా - అంధ
కులమయ్యా పిచ్చుకుంటులమయ్యా
దాన మొసగరే ధర్మాత్ములార

అని వర్ణించాడు. పై వివరణను బట్టి వారు అంగవైకల్యం కల కుంటివారనీ, అంధులని తెలియటమే కాక 'దాన మొసగే ధర్మాత్ములార' అనడాన్నిబట్టి వారు యాచకులని అర్థమౌతూ వుంది. ఆ నాడు శ్రీశైల క్షేత్రానికి వెళ్ళే యాత్రికుల్ని యాచిస్తూ వుండేవారని తెలుస్తూ వుంది.

వీరిని సర్కారాంధ్రదేశంలో పిచ్చిగుంటలాళ్ళని పిలుస్తూ వుంటారు. మరి కొన్నిచోట్ల పిచ్చుకకుంటలవాళ్ళనీ - పిచ్చుకుంటలాళ్ళనీ, రక రకాలుగా పిలుస్తూ వుంటారు వీరు భిక్షమెత్తేవారు కనుక. భిక్షుక శబ్దం పిచ్చుకుంటులుగా మారిపోయి వుండవచ్చు.

పిచ్చుకుంటుల వారందరూ భిక్షమెత్తేవారుగా గానీ, అంగవైకల్యం కలవారుగా గానీ వుండివుండకపోవచ్చు. ఆ నాడు సోమనాథుని శ్రీశైల యాత్రలో ఆపై నుద హరించిన అంగవైకల్యం కలవారు కనిపించి వుండవచ్చును.

## మూర్తీభవించిన శైవం:

పిచ్చుకుంటులవారందరూ మూర్తీభవించిన వీరశైవ మతాన్ని ఆరాధించారు. విస్తృతంగా ప్రచారం చేశారు. ముఖ్యంగా వీరు శక్తి ఉపాసనా పరులు. రేణుకా మహాత్మ్యాన్నీ, పోచమ్మ, ఎల్లమ్మ, మరిడమ్మ, మూహూరమ్మ కథలను ప్రచారం చేయడమేకాక వారు నమ్మిన దేవతల్లా కొలుపులు కొలుస్తారు. వీరికి మూలదైవం శ్రీశైల మల్లిఖార్జునుడే.

## పిచ్చుకుంటుల పేరెందు కొచ్చింది:

అక్కడక్కడా ఈవాడు మనకు కనిపించే పిచ్చుకుంటులవారిని గురించి అసలు మీ పుట్టుపూర్వోత్తరా లేమిటో అని ప్రశ్నిస్తే, వారీ విధంగా ఒక గాథను వివరిస్తారు. త్రిమూర్తుల వివాహ సందర్భంలో వారి వారి గోత్రాలు వల్లించటానికి మూడు మట్టిబొమ్మల్ని చేసి వాటికి ప్రాణం పోశారనీ, అలా బొమ్మల నిర్మాణంలో ఒక బొమ్మ కాలు కుంటిగా వుండటంవల్ల అతని సంతాన మంతా భిక్షమెత్తే కుంటి వాళ్ళయ్యారనీ చెపుతూ, మరో కథను కూడా చెపుతారు. ఏడుగురు యాదవకాంతలు సంతానం కోసం భక్తిశ్రద్ధలతో శివుని గూర్చి తపస్సు చేశారనీ వారి భక్తికి మెచ్చిన శివుడు ఒక కుంటి బాలుని పెంచమని వర మిచ్చాడనీ, ఆ తరువాత వారంతా గర్భ ధారులై ఏడుగురు ఆడపిల్లల్ని కన్నారనీ. ఆ ఏడుగురు పిల్లల్నీ పెద్దచేసి ఒక కుంటివాడి కిచ్చి శివుడు పెళ్ళి చేయమన్నాడనీ, ఆ ప్రకారం వారు చేశారనీ, ఆ తరువాత శివుడు అతనికి ఒక శంఖాన్నీ, గంటనూ, ఒక శూలాన్నీ, ఒక ఎద్దునూ ఇచ్చి భిక్షాటన చేసి జీవించమన్నాడనీ అతని సంతానమే భిక్షకకుంటులనీ, పిచ్చుకుంటులవారు చెపుతారు,

## చంద్రశేఖరుని వర్ణన:

పిచ్చుకుంటులవారిని గురించి చంద్రశేఖరుడు తన శతకంలో ఈ విధంగా వర్ణించాడు.

పద్యం: గుడగుడ రోజు నడకుండకు బాపడు పిచ్చుగుంట్ల, యో
కడు సెప్పినన్ని గోతరలు, గట్టిగ జెప్పినామే సమంగుగా
పడిగొని సంపసాచి దలపట్టుకసిందు పదాలు పాడు
గుడగుడ వట్టి లొట్టయని కూయును మూర్ఖుడు ॥చంద్రశేఖరా॥

అని వర్ణించాడు. పిచ్చుకుంటులవారు ప్రథమంలో కాపుల గోత్రాలనూ, యాదవుల గోత్రాలనూ చెపుతూ వుండేవారు. కాలక్రమాన కమ్మవారి గోత్రాలతో పాటు ఇతర కులాలవారి గోత్రాలను కూడా చెపుతూ వుండేవారు. అలా వారి వారి గోత్రాలనుచెపుతూ వారినే యాచించే వారు. వీరికి పౌరోహితులు జంగాలు.



పిచ్చుకుంటులవారు తెలంగాణా జిల్లాలలో ఎక్కువగా వున్నారు. వీరిలో గంట - తురక - మంద - తిత్తి - తొగరు మొదలైన ఉపజాతు లున్నాయనీ, పన్నెండు తెగలవారు తెలంగాణాలో వున్నారనీ, ఒక తెగవారు సర్కారాంధ్ర దేశంలో వున్నారనీ, ఈనాడు తెలంగాణాలో రెడ్లుగావున్నవారు ఒకప్పుడు కాపులకు సంబంధించిన కోటి గోత్రాలనూ, కోస్తా జిల్లాలలోవున్న కమ్మవారికి కోటి గోత్రాలనూ చెప్పి యాచించేవారనీ డా॥ బి. రామరాజుగారు వారి జానపద సాహిత్య గ్రంథంలో ఉదహరించారు.

వారు చెప్పే కథలు :

తెలంగాణాలోని పిచ్చుకుంటులవారు రాములమ్మ, బాలనాగమ్మ, కామమ్మ, సదాశివరెడ్డి, పర్వతాల మల్లారెడ్డి, సూర్యచంద్ర రాజులు, హరిశ్చంద్రుడు మొదలైన కథలను చెపుతున్నారు.

ఇక రాయలసీమలో నున్న పిచ్చుకుంటులవారు కుంటి మల్లారెడ్డి కథను గానం చేస్తారు. నెల్లూరు గుంటూరు ప్రాంతాల్లో పలనాటి వీరగాథల్ని, కాటమరాజు కథల్ని గానం చేస్తూ వుంటారు.

మన ఇరుగు పొరుగున వున్న కన్నడ రాష్ట్రంలో కూడా పిచ్చుకుంటులవారున్నారు. వారంతా కూడా శ్రీశైల మల్లిఖార్జున భక్తులే. వీరిలో దావనకుంట్లు, ఎద్దుకుంట్లు, గంటకుంట్లు మొదలైన తెగలవారున్నారు. పిచ్చుకుంటులవారి వేషధారణ కథకునికి హుందాయైన తలపాగా, ఒక చేతిలో కత్తి, మరొకచేతిలో డాలూ, కాళ్ళకు గజ్జెలూ వుంటాయి. ఈయన చరణాన్ని పాడుతూ వుంటే, మిగిలిన వారిద్దరూ దీర్ఘం తీస్తూ కథకుని గొంతుతో గొంతు కలుపుతారు. ఇక మూడవ వ్యక్తి ఒక తోలు తిత్తిని చంకకు తగిలించుకుని గుక్క విడువని శృతి పోస్తూ వుంటాడు. ఈ శృతి చెవులకు ఎంతో యింపుగా వుంటుంది. ఈ శృతిని ఆధారం చేసుకుని పిచ్చుకుంటుల కథా విధానాన్ని నడుపుతూ వుంటారు.

కథలో వచ్చే ఆయా పాత్రల మనస్తత్వాల ననుసరించి కథకుడూ, వంతదారుడూ, ఆ పాత్రల్లోకి మారిపోతారు. పిచ్చుకుంటుల కథా విధానం ఎలా వుంటుందో పల్నాటి యుద్ధంలో బాలచంద్రుడు యుద్ధంలో దూకిన ఘట్టాన్ని వింటే బోధ పడుతుంది.

రగడ

కుప్పించి ఎగసిన - కుండలంబుల కాంతి
గగనభాగంబెల్ల - గప్పికొనంగ
కంపించి జగమంత - కదలి వణకంగ
మొగమందు చిరునవ్వు - మొసులెత్తంగ
కొండలంతా రాళ్ళు - పిండి పిండిగను
పత్రమంతా రాళ్ళు - పాడి పాడిగాను
శనగలంతా రాళ్ళు - చిచ్చువ్వగాను.

ఒక్క దూకు దూకాడయ్యా. శీలం వారి బాలుడు, శ్రీ మలమల దేవచెన్నుడో. ఓ.ఓ.ఓ. అంటూ దీర్ఘంతీస్తూ పాడతారు.

ఈ విధంగా పిచ్చుకుంటులవారు ఎంతో ఉత్తేజంగా ఖడ్గతిక్కన, కాటమరాజు, పలనాటి వీరచరిత్ర మొదలైన కథలను చెప్పేవారు.

## రాయలసీమలో:

రాయలసీమలో వున్న పిచ్చుకుంట్లు వీరశైవులు, రాయలసీమలో వీరు ఎలనాగి రెడ్డి కథ ఎనిమిది రాత్రులు పాడుతారు. వీరి గురువులు జంగాలు, పురోహితులు కూడా. వీరు మొదట గంటతిత్తి మాత్రమే ఉపయోగించేవారు. తరువాత జంగాల ప్రభావం వల్ల చేత తంబుర, గుమ్మెటలు వుపయోగించేవారు.

తెలంగాణాలో జంగాలు ఉపయోగించే బుడిగెలు ఇటువంటివే, వీరి వేషం జంగాల వేషంలాగే నిలువు టంగీ షరాయి, నడికట్టు తలపాగా వుంటుందని డా॥ తంగిరాల సుబ్బారావుగారు జానపద కళోత్సవాల సంచికలో ఉదహరించారు.

## పాత కథలూ, కొత్త కథలూ :

ఇదే పిచ్చుకుంటుల కథా విధానాన్ని 1943 లో వచ్చిన కంట్రోలు, రేషనింగు విధానాలద్వారా కరువుతో ప్రజలు పడిన బాధలను వివరిస్తూ వారి సమస్యలు తీసుకుని కోసూరి పున్నయ్య, ఆకలి మంటలు అనే పిచ్చుకుంటుల కథను వ్రాసి ప్రజా నాట్య మండలి ద్వారా ప్రచారం చేశారు. తక్కువ సంపాదనతో ఎక్కువ రోజులు వస్తు లుండే పేదవారి బ్రతుకుల్ని గురించి ఇలా వివరించారు.

ద్విపద

తిండికీ బట్టకీ - తిప్పలొచ్చేను
కొండలై పెరిగేను - కొనుగోలు ధరలు
కష్టపడి పనిజేయు - కడుపు నిండదుగ
కష్టాలు హెచ్చేను - కరువొచ్చినాదో
॥శ్రీమదంబా భారతాంబా జగదాంబా॥

అంటూ

ద్విపద

పూరి గుడిసెల్లోన - పువ్వుటెండల్లు
నోరు లేని పేద - తేరు కొనుటెట్టు
తాటాకు గుడిసెల్లొ - బొట బొటా వాన
కట్ట బట్టాలేక - గంజితో బ్రతికె

వాళ్ళ దేహాలెల్ల - ఒట్టి బొమికల గూళ్ళు
పిల్లలూ కట్టుకొన - పీలికల గుడ్డలూ
ఆలసోమపురిలోన - ఆ బీద ప్రజలు
మల్లల్లో కూడ్లేక - మ్రగ్గుతుంటారో ॥శ్రీ॥

ఇలా ఆనాటి పరిస్థితులనూ, సమస్యలనూ ప్రజలకు ఎరుకపర్చటానికి ప్రాచీన కళా రూపమైన పిచ్చికుంటుల కళారూపాన్ని ప్రజా నాట్యమండలి వుపయోగించింది. పిచ్చుకుంటులవారు ఈ నాటికీ గుంటూరు జిల్లా రెంటచింతల గ్రామంలో 70 కుటుంబాలు, చెరుకుపాలెం గ్రామంలో 70, మునిపల్లెలో 6, గామారి పాలెంలో 6 ప్రకాశం జిల్లా టంగుటూరులో 70, వరంగల్ జిల్లా మొగిలిచర్లలో కొన్ని కుటుంబాల వారు నివశిస్తున్నారు. అయితే నానాటికీ వీరి కథలకు ఆదరణ తగ్గటంవల్ల వేరు వేరు వృత్తుల్ని చూసుకుంటున్నారని కె. వి. హనుమంతరావుగారు ఆంధ్రప్రభ దిన పత్రికలో వివరించారు.



## వారిలో వచ్చిన మార్పు :

ఆంధ్రదేశంలో కోస్తా జిల్లాల్లో వున్న పిచ్చుకుంటులవారు భామాకలాపం, గొల్లకలాపం నేర్చుకున్నట్లు కూడా ఉదాహరణ లున్నాయి. పశ్చిమగోదావరి జిల్లా కుమారదేవం గ్రామ వాస్తవ్యులు వల్లంపట్ల రామయ్యగారు, కోవూరు తాలూకా బంద పురంలో నున్న పిచ్చుకుంట్లకు భామా గొల్లకలాపాలను నేర్పారు.

బయ్యా పెద గంగాధరుడు, బండి చిట్టిలింగం, దేశి లక్ష్మీనారాయణ మొదలైనవారు భామ వేషధారణలో సిద్ధహస్తులు. 16 సంవత్సరాల వయస్సులో లక్ష్మీనారాయణగారి భామ వేషం అద్భుతంగా వుండేదట.



పై ఉదాహరణలను బట్టి పిచ్చుకుంటలవారి చరిత్ర అనేక మార్పులు చెందినట్లు తెలుస్తూ వుంది.



# కొమ్మాయి దాసుడే, కొమ్మ దాసరి

మనం మన సంస్కృతిలో ఇప్పటికే ఎన్నో విలువైన కళలనూ, సంప్రదాయాలనూ పోగొట్టుకున్నాం. అలా మన ప్రాచీన సంస్కృతిని పోగొట్టుకుంటూ వచ్చాం. కాలక్రమంలో వాటిని పోషించే దిక్కులేక అంతరించిపోయాయి. అలాంటి వాటిలో-

కడియాల కామమ్మకో - ముక్కు పుడకల చుక్కమ్మకో
కాసులపేరుల కనకమ్మకో - గజ్జెల వీరమ్మకో
చేమంతిపూల సీతమ్మకో - చింతపూల రవికె చిలకమ్మకో
ముక్కుపుడకల చిలకమ్మకో - కొప్పుగొలుసుల కోటమ్మకో
బాజీబందుల బంగారమ్మో - దండకడియాల కొండమ్మో
ముంతకొప్పుల కాంతమ్మో - ముత్యాలనత్తున్న ముత్యాలమ్మకో



అంటూ చెట్టుకొమ్మమీద కూర్చుని, కొమ్మాయిదాసుడు పాడే, కొమ్మ దాసరి కళారూపం. ఈ తరం వారికి ఎవ్వరికీ తెలియదు. అంతరించి పోయిన జానపద కళారూపాలలో ఇదొకటి.

అయితే కొమ్మాయిదాసుడు అనే పేరు మాత్రం ఈనాటికీ ప్రచారంలో వుంది. సమాజంలో మామూలుగావుండే వేషధారణకాక, విలక్షణ వేషధారణలో కనిపించే వ్యక్తిని ఏరా కొమ్మాయి దాసుడులా తయారయ్యావే అనే నానుడి ప్రచారంలో వుంది. కొమ్మ దాసరి పేరే కొమ్మాయిదాసుడుగా మారిపోయి వుండవచ్చు. కొమ్మ దాసరి అనడాన్ని బట్టి. ఇతను దాసరి కులానికి చెందినవాడై వుండవచ్చు.

కొమ్మ దాసరంటే కొమ్మమీద కూర్చుని ప్రసంగాలు చేసేవాడు. కొమ్మంటే కొమ్మేకాదనీ, ఎత్తైన చెట్టుగాని. గుడిగాని, ఎత్తైన గోడగాని, చివరికి బజారులో వుండే బండిగాని ఎక్కి కూర్చుని వినోదం చేకూరుస్తూ దానాన్ని పరిగ్రహించేవాడని, కె. వి. హనుమంతరావుగారు ఆంధ్రప్రభలో వివరించారు. ఒకరకంగా కొమ్మదాసరి కళారూపాన్ని వెలుగులోకి తీసుకువచ్చారు. వారికి కృతజ్ఞతలు.

కొమ్మదాసరులు చెట్టుకొమ్మమీదే కూర్చుని యాచిస్తారు. వారు అందరిమాదిరి ఇంటింటికీ తిరిగి యాచించరు. చెట్టు దిగిన తరువాత ఎవరు ఏమిచ్చినా పుచ్చుకోరట, అది వారి కుల కట్టుబాటు. ఆ కట్టుబాటును విస్మరిస్తే కులంలో వెలివేస్తారట అంటే యాచనలో కూడా ఎంత దర్జాగా యాచిస్తారో దీనినిబట్టి ఆలోచించవచ్చు.

ఒకరకంగా కొమ్మదాసరులు ఎంత నీతిగా జీవించారో ఈ క్రింది ఉదాహరణనుగూర్చి తెలుసుకోవచ్చును. కొమ్మదాసరులు ఒక వూరిలో ఒకేసారి యాచిస్తారు. వ్యాచించిన వూరికి మళ్ళీ తిరిగిరారు .... ఒకవేళ వచ్చినా ఎంతో కాలానికి గాని తిరిగిరారు. వీరి తెగ చాలా చిన్నదవటంవల్ల రాను రాను వారి జాతీ, జాతితో పాటు వారి కళారూపమూ క్షీణించిపోయింది.

కొమ్మదాసరి చెట్టెక్కే ముందే చెట్టుక్రింద ఒక గుడ్డ పరుస్తాడు. ఆ తరువాత చెట్టెక్కి బిగ్గరగా గణగణమంటూ గంటను వాయిస్తాడు. ఈ గంట వాయిద్యంతో వూరిలో వున్న చిన్నా పెద్దా అందరూ ఆ చెట్టు క్రిందికి చేరుతారు. అప్పుడు కొమ్మ దాసరి పాటలు ప్రారంభిస్తాడు. ప్రగల్భాలు సాగిస్తాడు. విమర్శిస్తాడు. దూకి చస్తానని బెదిరిస్తాడు. ఎత్తుమీద కూర్చుని చుట్టుప్రక్కల ఇళ్ళల్లో పనిచేసుకునే స్త్రీలనూ, వారు ధరించిన నగలనూ, కట్టుకున్న చీరలనూ, పనులనూ రకరకాలుగా వర్ణిస్తూ వాళ్ళను మెచ్చగొడతాడు. ఉదాహరణకు రకరకాల రంగుల చీరలు కట్టుకున్న స్త్రీలను వర్ణిస్తూ ఈ విధంగా సంబోధిస్తాడు.

నాగులచీర గట్టిన నాగమ్మకో
తెల్లచీర గట్టిన పల్లాలమ్మో
చెంగావిచీర గట్టిన చుక్కమ్మకో
వంకాయరంగు కోక కట్టిన వరదమ్మకో
నీలిచీర గట్టిన నీలమ్మకో
దొండపండు చీర గట్టిన బంగారమ్మో

అంటూ పేర్లు వారివి కాకపోయినా, ఆ రంగుల చీర్లను కట్టుకున్న వాళ్ళను వయనంగా వర్ణిస్తాడు.

అలాగే చుట్టుప్రక్కల ఇళ్ళల్లో పనులు చేసుకునే స్త్రీలను ఈ విధంగా వర్ణిస్తాడు.

అంట్లు తోమే గంటాలమ్మో
చెంబులు తోమే చెల్లమ్మో
పిడకలు గొట్టే పిచ్చమ్మో
కూరలు తరిగే గౌరమ్మో
బట్టలు వుతికే చిట్టెమ్మో
గారెలు వండే గౌరమ్మో
ధాన్యం దంచే ధనమ్మో
కోడలుమీదా చిందులు తొక్కే చంద్రమ్మో

ఇలా పనిపాటల్లో మునిగి వున్న స్త్రీలను సంబోధిస్తూ పాటలు పాడుతూ వారిని రెచ్చగొడతాడు. ఈ మొండివాడి పోరు పడలేక రుసరుసమంటూనే దానం చేస్తారు.

చివరికి అక్కయ్యో వప్పుదాకలో పడిపోతున్నా. పొయ్యిలో దూకేస్తున్నా. అక్కో ఉరికేస్తున్నా. దూకేస్తున్నా. ముక్కు చితికింది. మూతి పగిలింది. అక్కో కాలు బెణికింది. చెయ్యి విరిగింది. నడుం వంగింది. నాలుక ఎండింది. గొంతుక పూడింది. కళ్ళు తిరిగిపోతున్నాయి. అక్కో దిగేస్తున్నానంటాడు.

అక్కల్లారా? అమ్మల్లారా? బిడ్డలు గల తల్లుల్లారా? బియ్యం పట్టుకురండి. నాకు గుడ్డలేయండి. చెట్టు దిగితే మీరేమిచ్చినా పుచ్చుకోను. అక్కో దిగేస్తున్నా, దిగేస్తున్నా, దిగేస్తున్నా అంటూ నానాహంగామా చేస్తాడు.

ఈ వినోదం వింతమాటలు చూపరులకు ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ కలిగిస్తాయి. అందరూ వాడి ఆకారాన్ని చూసీ, పాటలు విసీ, నవ్వుకుంటూ దాసరికి డబ్బులేస్తారు. అంతటితో ఆ వూరిలో ప్రదర్శనం ముగుస్తుంది. అదే వూరిలో మరోచోట మరో చెట్టు ఎక్కడు, ఆనాటికి ఎంత దొరికితే అంత. పూట కూటికి కోటివిద్యలన్నట్లు అడుక్కోవడంలో కూడా భేషజంగా అడుక్కునే కొమ్మదాసరులు ఈనాడు ఎక్కడా కనిపించడం లేదు. అయితే ఈ కళారూపం ఎలాంటిదో భావితరాలకు తెలియజేయడానికి సేకరించాల్సిన అవసరం ఎంతో వుంది. అది మన సంస్కృతికి చిహ్నం.



# పీర్ల పండుగలో మొహరం గీతాలు



మహమ్మదీయుల ప్రధాన పర్వదినాలలో మొహరం ముఖ్యమైనది. హసన్ హుస్సేన్ అనే ముస్లిం వీరుల స్మారకార్థం శోకతప్త హృదయాలతో జరుపుకునే కార్యక్రమమే పీర్ల పండుగ మొహరం.

ముస్లిం పంచాంగరీత్యా అరేబియాలో సంవత్సరం యొక్క మొదటి తేదీ మొహరం. మొహరం పండుగనే పీర్ల పండుగ అని కూడా అంటారు. ''పీర్'' అంటే మహాత్ములు, ధర్మనిర్దేశికులు అని అర్థం.

ధర్మయుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వీరులకు ప్రతీకగా హస్తాకృతి గలిగిన రూపాలను తయారు చేసి వాటిని అలంకరించి, ఊరేగించి, పూజించేవాటిని 'పీర్లు' అని పిలుస్తారు.

## మహమ్మదీయులు, మతకలహాలు

మహమ్మదు ప్రవక్త నిర్యాణం చెందిన తరువాత ఖలీఫాలయిన నలుగురులో మత కలహాల దృష్ట్యా హత్య గావింపబడినందున ఆయన పెద్దకుమారుడు 'హసన్' ఖలీఫా కాగా విషప్రయోగం వలన అతి త్వరిత కాలంలోనే పదవీ త్యాగం చేయవలసి వచ్చింది. ఆ తరువాత రెండవ కుమారుడైన హుసేన్ ఖలీఫా కావలసి వుండగా ''ము అని యా'' అనే పీఠాధిపతి కుమారుడైన యజీద్ తాను ఖలీఫానని ప్రకటించుకున్నాడు.

కూఫా నగరవాసులు ''యజీద్ దౌష్ట్యం నుంచి కాపాడమని హుసేన్‌ను అందరం బలపరచగలమని కోరుతున్నట్లు బూటకపు వర్తమానం పంపటం జరిగింది.

హుటాహుటిని హుసేన్ కూఫాకు రాగా ఆయనకు సహకరించేవారు ఎవ్వరూ కనిపించ లేదు. జరిగిన మోసం గమనించిన హుసేన్ యూఫిటీస్ నదీతీరాన "కర్బలా" మైదానంలో విడిది చేసి వుండగా "యజీద్ సైన్యం ఆయనపై పడింది. శత్రు బలం నాలుగు వేలకు పైగా వుండగా ఆయన బలం కేవలం ఇద్దరు అశ్వికులు, నలభై మంది కాల్బలం కావడంవల్ల నిరాశ చెందిన హుసేన్ తన అనుచరులను వెళ్ళి పోయి ప్రాణాలు కాపాడుకోమని తన కొరకు బలి కావద్దని కోరారు. కాని వారు ఆ సంకట స్థితిలో హుసేన్‌ను వదలి వెళ్ళడానికి సమ్మతించలేదు.

## అమరవీరుడు హుస్సేన్ :

ఆ ధర్మయుద్ధంలో హుసేన్ అనుచరులు అంతమొందగా, ఆయన, ఆయన కుమారుడు నిరాశ్రులై రణరంగంలో నిలిచారు. చివరకు కుమారుడు కూడా ఒకడు దురాగతుని బాణఘాతానికి ఆహుతి కావడం జరిగింది. కుమారుని శవాన్ని నేలపైనుంచి, ఆ విషాదం భరించే నిగ్రహశక్తిని తనకు ప్రసాదించమని హుసేన్ భగవంతుని వేడుకుని, దప్పికగొని నీరు త్రాగడానికి ముందుకు వంగగా బాణం వచ్చి ఆయన నోట గుచ్చుకుని ప్రాణాలను బలిగొన్నది. ఆ యుద్ధంలో హుసేన్ దారుణ మరణాన్ని స్మృతికి తెచ్చుకుని సంతాపాన్ని ప్రకటించేందుకు నిర్దేశితమైన ముస్లిం పర్వదినంగా మొహరం నిలిచి పోయిందని జి. రంజనిగారు ఆంధ్రజ్యోతిలో వివరించారు.



## ఖురాన్ నిర్వచనం:

మొహరం నెలలో 10 వ రోజు "సహాదత్"ను సంతాప దినంగా పాటించ వలసిందిగా "ఖురాన్" నిర్వచించింది. ఆ రోజున "పీర్లు" అనే హస్తాకృతులను ఊరేగించి, ఊరియందుగల బావి దగ్గరో, నదుల దగ్గరో వాటిని శుభ్రపరిచి నిర్ణీత

పేటికలో వుంచి మరుసటి ''మొహరం నెల వరకు'' ముజావర్‌వద్ద భద్రపరచటం జరుగుతూ వుంటుంది.

ఆంధ్రదేశంలో వున్న ముస్లిములు అన్ని ప్రాంతాలలోనూ ఈ పండుగను ఎంతో భక్తిగా జరుపుకుంటారు. ఎంతో ఉద్వేగంతో అమర వీరుల్ని స్మరిస్తారు. ఈ సందర్భంలోనే మొహరం గీతాలను ఆలాపిస్తారు.

మహమ్మదీయులకు విగ్రహారాధన లేదు. కాని ముస్లింలలో ఒక తెగవారు మాత్రం ఈ పేర్లను ప్రతిష్టించి ధూపదీప నైవేద్యాలతో పూజిస్తారు.

## హిందూ ముస్లిం ఐక్యత :

కొన్ని ప్రాంతాలలో ఇతర మతాల వారికి ముఖ్యంగా హిందువులకు కూడ పీర్ల పండుగను పెద్ద పండుగగా భావిస్తారు. హిందూ మహమ్మదీయుల సామరస్యమే ఇందుకు కారణం. అంటే జాతీయ సమైక్యతకు ఆనాడే ఎంతటి ప్రాముఖ్య మిచ్చారో మనం అర్థం చేసుకోవచ్చు.

పీర్ అంటే మహాత్ముడు, ధర్మదేశికుడని, డా॥ టి. దొణప్పగారు కూడా తమ జానపద కళా సంపద గ్రంథంలో ఉదహరించారు.

ముస్లిములలో ముఖ్యంగా దూదేకుల వారు ఆటలమ్మ, మారెమ్మ మొదలైన హిందువుల దేవతలను కొలవటం తమ పిల్లలకు ఎత్తెప్ప, ఎల్లమ్మ, తిమ్మప్ప, నరసింహులు, బాలన్న అనే పేర్లు పెట్టుకోవటమూ, అలాగే హిందువులలో కుల్లాయమ్మ, దస్తగిరిరెడ్డి, నబీగౌడు, పక్కీరప్ప, మస్తాన్‌రావు, లాలెమ్మ, సేకణ్ణ, సైదల్లీ, హుసేన్‌దాసు అనే ముస్లిం పేర్లను పెట్టుకోవటం అలాగే ముస్లింలకు సంబంధించిన ఉరుసులలోనూ, పరసలలోనూ పాల్గొనటం. దరగాలకూ, మసీదులకూ వెళ్ళటం, పీర్లను కొలవటం సర్వసామాన్యంగా జరిగే విషయాలు.

## పీర్ల పంజా :

మొహరం నెలలో చంద్రుదు స్పష్టంగా కనిపించిన అయిదవ రోజు రాత్రి పంజాకపిటార అనే విగ్రహాల నుంచిన పెట్టెను, ముజావిరు అనే అర్చకుని ఇంటి నుండి పీర్ల మసీదుకు ఊరేగింపుగా తెస్తారు. ఆ విగ్రహాలకు పది రోజులు పూజలు జరుగుతాయి. పీరులంటే వీరులయొక్క హస్తాకృతిలో, విగ్రహాల రూపంలో కొలు

స్తారు. హస్తం పంజా రూపంలో వుంటుంది గనుక వీటిని వుంచే స్థలాన్ని పీర్ల పంజా అంటారు. ఈ పీర్లకు కొన్నిటికి అయిదు వ్రేళ్ళు, కొన్నిటికి నాలుగు వ్రేళ్ళు. అలా మూడు, రెండు, ఒకటిగా విగ్రహాలుంటాయి. ఈ హస్తాలను పొడుగాటి కర్ర చివర భాగంలో అమర్చుతాడు. వాటిని రంగు రంగుల గుడ్డలతో అలంకరించి రక రకాల రంగుల కాగితాల పూలదండలను నిలువెల్లా అలంకరిస్తారు.

ప్రతి రోజూ ఆ పీర్ల పంజాలను సాంబ్రాణి ధూపంతో పూజిస్తారు. పీర్లను దర్శించటానికి పిల్లలు పెద్దలు వచ్చిపోతూ వుంటారు. ఆనాడు హిందూ ముస్లింల మధ్య ఏమాత్రం భేదాలకు తావు లేకుండా సామరస్య పూర్వకంగా పూజిస్తారు.

## పులి వేషాలు :

పీర్లను పంజాలో నెలకొల్పిన తరువాత ఆవేశపరులైన ముస్లింసోదరులు పులి వేషాలను ధరించి డప్పుల వాయిద్యానికి అనుగుణంగా నృత్యం చేస్తూ, పెద్ద పులి నృత్యం చేస్తూ, పులి చేష్టలను అనుకరిస్తూ, హూంకరిస్తూ పిల్లలను భయపెడుతూ హంగామాగా వీథులన్నీ తిరుగుతూ పెద్దపులి ఠీవిలో హుందాగా నడక నడుస్తూ పల్టీలు కొడుతూ ప్రతి ఇంటికీ వెళ్ళి వ్యాచిస్తారు. ఈ ప్రదర్శనాన్ని అందరూ ఎంతో ఆసక్తితో తిలకిస్తారు. పారితోషికాల నిస్తారు. ఇలా సంపాదించిన డబ్బును ఆఖరు రోజున ఆనందం కోసం ఖర్చుపెడతారు.



## నిప్పుల గుండం :

పీర్లను మసీదు నుండి బయటికి తీసి విచార వదనాలతో, సన్నాయిమేళంతో శోక గానం చేస్తూ ఊరంతా ఊరేగింపుకు బయలుదేరుతారు. తారతమ్యాలు లేకుండా అందరూ తరలివస్తారు. ప్రతివారు సాంబ్రాణి ధూపంతో హారతి నిచ్చి, పారితోషికా న్నిచ్చి ఆ విధంగా హసన్, హుస్సేన్‌లకు జోహారు లర్పిస్తారు.

ఊరేగింపు అయిన తరువాత రాత్రికి ఊరు మధ్యలో నున్న నిప్పుల గుండం దగ్గరకు వస్తారు. ఆఖరు రోజున బహిరంగ ప్రదేశంలో ఒక గుంట తీసి అందులో పెద్ద పెద్ద కట్టెలు పేర్చి నిప్పు ముట్టిస్తారు. అది బాగా మండి కణకణ మండే బొగ్గులుగా తయారౌతాయి. ఈ సమయానికి ఊరేగింపు ముగుస్తుంది.

హసన్, హుస్సేన్ పేరులతో పాటు, వారితో పాటు ప్రాణా లర్పించిన వీరుల పీర్లను కూడా పట్టుకుని హసన్, హుస్సేన్—హైసాయ్, జూలోయ్ అంటూ ఆవేశపు కేకలతో పీర్లను చేతబట్టి వుధృతంగా మారుమ్రోగే సన్నాయి, డప్పు వాయిద్యాల మధ్య పరుగు పరుగున ఆవేశంతో పరుగెత్తుతూ నిప్పుల గుండం మధ్య నుంచి నడిచిపోతారు. ఈ దృశ్యం ప్రేక్షకుల్ని చకితుల్ని చేస్తుంది. నిప్పుల



గుండంలో దూకేవారికి ప్రజలు కూడ కేకలతో మద్దతు నిస్తారు. ఆ విధంగా మృత వీరులైన హసన్. హుస్సేనులకూ, తదితర అమర వీరులకూ జోహార్లు అర్పిస్తారు. ఇలా నిప్పుల గుండంలో నడిచివెళ్ళడం పీర్ల మహాత్మ్యంగా కీర్తిస్తారు. ఇలా పీర్ల పండుగ ముగుస్తుంది.

ఆ రోజున అందరూ కొత్త బట్టలు ధరిస్తారు. పలావు మొదలైన మాంసాహారాన్ని భుజిస్తారు. అలా ఆ ఆనందంలో పాలు పంచుకోవడానికి ఆత్మీయులైన హిందువులను కూడా విందుకు ఆహ్వానిస్తారు. అలా హిందూ ముస్లిం సామరస్యానికి

దోహదం చేస్తారు. ఇలా ముగుస్తుంది పీర్ల పండుగ. ఈ పండుగలో అనేకమంది మొహరం గీతాలు పాడతారు. ఉదాహరణకు—

కలుపు పాటలో :

ఆసేని వూసేని అన్నదమ్ములు, అన్నదమ్మల్లు
వూసేని సెరుగూన వూది బుక్కిటు స్వామి వుసేనీ
ఆసేని సెరుగూన అయిదు లాకీలు స్వామి వూసేనీ ॥వూ॥

వూసేని మాసీదు వెలుగు మాసీదు స్వామి వుసేనీ ॥వూ॥

ఆసేని మాసీదు పాల మాసీదూ పాల మాసీదూ
దక్షిణ జెడగాలి పట్టిమంచమ్మో పట్టిమంచమ్మో
పట్టిమంచానికి బుట్ట చాందీని బుట్టచాందీని
పట్టిమంచంమీద లేవు దిండూలే స్వామి వుసేనీ ॥పట్టి॥

ఇలా సాగుతుంది. కాసీము పీరు విగ్రహమును సాధారణంగా వెండితో చేయించటం సంప్రదాయం. అందువల్ల ఈ పీరును వెండిదేవు డంటారు.

కాసీము నిలిచేది వెండి మాసీదో బంగారి మాసీదో
అతియ సక్కనివాడె మన కాసిములయ్యో
మల్ల సక్కనివాడే మన పీరులయ్యో
కాసీము వెలిగేటి వెండి గుండామె బంగారి గుండామె
అతియ సక్కనివాడె మన కాసిములయ్యా
మల్ల సక్కనివాడె మన పీరులయ్యా

అంటూ ఎంతో భక్తితో పాడుతారు.

అలాగే మొహరం పండుగలో హసన్, హుసేన్ లిరువురి స్మృతిగా ఈ విధంగా పాడతారు.

నీకి దండమో నీకి దండమో
నీకి దండమో స్వామి నీకి దండమో
నీకి దండమో దేవ నీకి దండమో



ఆ కాసిపట్నాన అందాల కోటా
అందాల కోటలో అద్దాల మాలు ॥నీకి॥

అద్దాల మాలులో గెద్దె పీటల్లు
సురటీల సొగసుల్ల సుంవాసనాలూ ॥నీకి॥

గెద్దె పీటలమీద ఇద్ద రెవ్వారు
అసేని వూసేని అన్నదమ్ముల్లు ॥నీకి॥

రచ్చనా రాజుల్లు తగుతునా దొరలు
యేడేడు దీవుల్ని యేలు పొచ్చాలు.

ఇలా ఎన్నో పాటలు సాగిపోతాయి. హసన్, హుస్సేన్ వీరులను కీర్తిస్తూ అనేకమైన మొహరం గీతాలు ఆంధ్రదేశమంతటా ప్రచారంలో వున్నా రాయల సీమలో ఎక్కువగా వున్నాయి. వ్రాసినవారందరూ ఇతర కులాలవారే. ఇద్దరు అన్న దమ్ముల త్యాగాలనూ ముస్లిములు ఎలా కీర్తిస్తారో ఇతర కులాలు వారు కూడా అలాగే పూజిస్తారు.

ఈ తెలుగు మొహరం గీతాలు జానపదులు ఎంతో భక్తితో పాడుకుంటారు. పనిపాటల్లో కష్టాన్ని మర్చిపోతూ పాడుకుంటారు. ఈ మొహరం గీతాలను ఆచార్య తూమాటి దొణప్పగారు తమ జానపద కళాసంపదలో వ్రాశారు. వారికీ, ఆ పాటలు వ్రాసినవారికీ ధన్యవాదాలు.

ఈనాడు ఎక్కడో చెదురుమదురుగా తప్ప పీర్ల పండుగలు పూర్వంలా జరగటం లేదు. ఈ తరం వారికి ఈ పీర్ల పండుగను గురించీ, మొహరం గీతాలను గురించీ అంతగా తెలియదు.







# క్రైస్తవుల జానపద కళాప్రదర్శనాలు

అనాది నుంచీ మన దేశంలో వున్న ప్రజలు వారి మత విశ్వాసాలనూ, ఆచారాలనూ, సంప్రదాయాలనూ ప్రచారం కోసం జానపద కళారూపాలను బహుముఖాల ఉపయోగించుకున్నారు. అలా ఆ యా మతాలు, కులాలు, జాతులు జానపద కళారూపాలకు ఒక వున్నత స్థానాన్ని కల్పించారు. అలా ఆరాధించినవారిలో క్రైస్తవులు కూడా వున్నారు.

క్రీస్తుశకం 52 లో సెయింట్ థామస్ రాకతో మన దేశానికి క్రైస్తవ మతం ప్రవేశించిందనీ. మత ప్రచారార్థం మన దేశానికి చాలామంది మిషనరీలు వచ్చారనీ, ఈ దేశ సంస్కృతికీ, మతాచారాలకూ వ్యతిరేకంగా తమ మతాన్ని ప్రచారం చేయలేమని గ్రహించారనీ, కేవలం అట్టడుగున ఉన్న ప్రజల్ని మాత్రం ఆకర్షించగలిగారనీ వెంకటేశ్వర యూనివర్శిటీ కాలేజి లెక్చరర్ డా॥ ఆనందన్‌గారు 1990 డిసెంబరు 27-వ తేదీన యస్. వి. యూనివర్శిటీ తెలుగు అధ్యయనశాఖ అధ్వర్యంలో జరిగిన దక్షిణ భారత జానపద కళాప్రదర్శనాల సెమినార్ సందర్భంలో ''క్రైస్తవ జానపద ప్రదర్శన కళలు'' అనే పత్రాన్ని సమర్పిస్తూ ఈ క్రింది విధంగా వివరించారు.

17-వ శతాబ్దపు ప్రారంభంలో క్రైస్తవ మత ప్రచారం కోసం ఒక నూతన పంథాను అనుసరించింది. దీనికి ఆద్యుడు. రాబర్టు డి. నొబిలి. ఇతను జెసూట్ పాదరీల సంఘ ప్రతినిధిగా 1606 సంవత్సరంలో దక్షిణ భారతదేశం మధురకు వచ్చాడు.

## వీరప్పనాయకుని కాలంలో:

నొబిలీకి పూర్వం మధురను పాలించిన వీరప్పనాయకుని కాలంలో (1572-95) ఫాదరీ ఫెర్నాండెజ్ పధ్నాలుగు సంవత్సరాలు క్రైస్తవ మత ప్రచారం చేశాడు. ''పరవర్‌లు'' అనే చేపలు పట్టే మత్స్యకారుల్ని మాత్రం క్రైస్తవ మతస్థులుగా మార్చగలిగాడు.

కాని అగ్ర కులాలవారు క్రైస్తవ మతాన్ని స్వీకరించక పోవటానికి ఈ క్రింది కారణాలు అడ్డు వచ్చాయి. క్రైస్తవ మతాన్ని స్వీకరించినవారు హైందవ ఆచారాల్ని విస్మరించటమూ, పరవర్‌లు అనబడే మత్స్యకారులు అంటరానివారై వుండి క్రైస్తవులు కావటమూ, క్రైస్తవ మత ప్రచారకుల్ని నీతినియమాలూ, మానమర్యాదలూ లేని త్రాగుబోతులుగా, గోమాంస భక్షకులుగా మంచివారిని పరంగేలుగా పిలవడం వల్లి అగ్ర కులాలవా రెవ్వరూ క్రైస్తవ మతాన్ని స్వీకరించలేదు.

## మతం కోసం మార్చిన వేషం:

ఈ పరిస్థితుల్ని అర్థం చేసుకొన్న ''నొబిలి'' తన ప్రచారం కోసం తన వేష భాషల్నీ, ఆచార వ్యవహారాల్నీ మార్చివేసి సన్యాసిగా కాషాయ వస్త్రాలను ధరించాడు. జంధ్యం వేసుకున్నాడు. ముఖానికి విభూతిరేఖలు దిద్దాడు. చేతిలో కమండలాన్ని ధరించాడు. శాఖాహారిగా ఒక చిన్న గుడిసెలో కాపురం పెట్టాడు. జగద్గురు తత్వబోధక స్వామిగా ప్రసిద్ధి చెందాడు. బ్రాహ్మణులతో కలిసిమెలిసి తిరిగాడు. ఇలా నొబిలీ క్రైస్తవ మతంలో హైందవ సాంప్రదాయాలకు చోటు సంపాదించాడు. ఆనాటి నుంచి ఈనాటి వరకూ క్రైస్తవ మతంలో హైందవ సాంప్రదాయాలకు సంబంధించిన అంశాలు కొనసాగుతున్నాయి. మధురలో క్రైస్తవ వేదాంత కళాశాల క్రైస్తవ మతాన్ని పూర్తిగా హైందవీకరణం చేయడానికి కృషి చేస్తూవుంది.

క్రైస్తవులు మన దేశ సంస్కృతికి అనుగుణంగా తమ మతాన్ని ప్రబోధించాలనుకున్నారు. తర తరాలుగా వస్తూవున్న ప్రచారసాధనాల్నే ఇందుకు ఎంపిక చేసుకున్నారు. ఇలా అయితే విషయం ప్రజల్లోకి సులభంగా చొచ్చుకుపోతుందని వారి విశ్వాసం. అందుకు అనువుగా మన జానపద కళారూపాల్లో 'హరికథ' 'బుర్ర కథ' 'భజనలు' 'కోలాటాలు' మొదలైనవాటిని ఎంచుకున్నారు.

## హరికథ:

క్రైస్తవ మతానికి చెందిన కథారచయితలు, కథానాయకులు దీనిని కాలక్షేపమనీ, సత్కథా గానమనీ అంటారు. బాపట్లలో 'ఇండియా బైబిల్ మిషను'కు చెందిన షారోను ఆశ్రమ నిర్వాహకులు రెవ రెండు మనోహర కవి వ్రాసిన 'అవతార విలాసం' 1959 లో ప్రచురింపబడింది. దీనిని ఆయన హరికథగా పేర్కొన్నాడు.



క్రైస్తవ కథాగానాన్ని రచించిన ప్రథమ కవి 'పిడతల జాన్ కవి'. (1876-1971) ఈయన భారత పురాణ కథల్ని వినడంవల్ల హరికథల్ని వినటంవల్ల అందులోని మెలకువల్ని తెలుసుకుని బైబిలులోని ఘట్టాలను అనుసరించి హరికథా కాలక్షేపాలుగా మలిచాడు. వాటిలో 'ఆదాం హవ్వలు' 'క్రీస్తు జననం' పేర్కొనదగినది. అలాగే మందపాటి అబ్రహాం భాగవతార్ "ఏసు చరితము" అత్తోట రత్నకవి 'సంసోను దెలీలా' మొదలైనవారు వ్రాసినవి మాత్రమే లభ్యమౌతున్నాయి.

## హరికథలు వ్రాసిన రచయితలు:

బండారు ఇసాక్ భాగవతార్, కంబం జాకబ్, పాటిబండ్ల జాకబ్, పినపాటి జర్నియాబిరిసీడి మోషే కవి, కంచం జాకబ్, చందోలు ఆనంద కవి మొదలైనవారు క్రీస్తు గాథల్ని హరికథలుగా వ్రాస్తున్న ప్రముఖులు. వీరు క్రైస్తవ హరికథల్నే కాక హిందూ పురాణ గాథల్ని కూడ వ్రాయడం చెప్పుకోదగిన విషయమంటారు ఆనందన్‌గారు.

అంతేకాదు-మన పురాణ గాథల్ని హరికథలుగా వ్రాసే రచయితలు. క్రైస్తవ ఇతివృత్తాలను కూడా హరికథలుగా వ్రాస్తున్నారు. అలాంటివారు జిన్నా అప్పారావు, అన్నం నాగభూషణం, చేకూరి లక్ష్మీనారాయణాచార్య, పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు మొదలైనవారు రచనలు చేస్తున్నారు.

గాన విధానం :

హరికథా గానంలో మొదట దైవప్రార్థన వుంటుంది. కథ పాత నిబంధనకు సంబంధించిందైతే యెహోవాను, కొత్త నిబంధనకు సంబంధించిందైతే యేసు క్రీస్తును ప్రార్థించటం మామూలు.

ఉదాహరణకు ప్రార్థన

పరమపావన దేవా, దురితభంజనా
ధరనుత గుణ గణా యతిదీనావనా
వరదా నిను భజయించెద
కరుణ(బోవుము దేవా ॥పరమ॥

(కరుణాసాగర చరిత్ర)
హనుమగుత్తి దేవదానం

తరువాత సభాస్తుతి ఇలా చేయబడుతుంది.

ఆత్మాభిషేకంబు నంది సంఘోన్నతి కొరకు
శ్రమియించు సద్గురువులార
క్రీస్తు నామార్చన నా గీతములో రచియించి
ప్రకటించుచున్నట్టి సుకవులార!
సతతము సువార్తను చాటించి నశించు
ఆత్మను రక్షించు ఆప్తులార!
కవుల గాయకుల సత్కళల బోషింప
స్వధనము వ్యయించు వదాన్యులార.

పేద సాదల ప్రేమతో నాదరించి
దైవవాక్యాలు సారమౌ జీవితమ్ము
గడుపుచున్నట్టి భక్తాగ్రగణ్యులార
సత్కథాగానము వినుడి సభ్యులార...

ఇలా సభాస్తుతి చేసిన తరువాత కథా గానాన్ని చేస్తాడు. కథాంతంలో ఫలశృతి, ఆ తరువాత మంగళం పాడటంతో ముగుస్తుంది.

కోలాటం :

కోలాటాన్ని డిసెంబరులో వచ్చే క్రిస్టమస్ పండుగకూ, పరికోతలప్పుడూ ప్రదర్శిస్తూ వుంటారు. కోలాటంలో పాల్గొనేవారు అందరూ ఒకే రంగుగల వస్త్రాలను ధరిస్తారు. కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. చేతిలో కోలలు ధరించి, ఇద్దరు చొప్పున సరిజోడిగా రెండు కక్ష్యలుగా నిలబడతారు. ఇలా నిలబడినవారు కోపు ప్రారంభం కాగానే వెలుపలి కక్ష్య లోపలికి, లోపలి కక్ష్య వెలుపలికి వచ్చేలా ఆడుతూ, అటూ ఇటూ చిరుతలను తట్టుతూ అభినయిస్తారు.



యేసుక్రీస్తు మహిమను చాటుతూ సరెల్ల సామ్యేల్ సుబ్బయ్య వ్రాసిన కోలాటపు పాట పేర్కొనదగింది.

కీర్తన

కోలలు వేయండి - యేసుని కొనియాడను రండి
మేలులన్నిటికి మూలం బతడని చాల నుతించుచుజాలము చేయక
నృత్యము చేయండి - యేసుని భక్తితొ కొలవండి
సత్యముగా ప్రభువు చావును గెలిచియు
నిత్యము మనతో కూడా వచ్చెనని
పొందుగ లేవండి - యేసుని ముందర నిలవండి

వింత దేవుడని సంతరించుచు
ఎగురుచు పాడండి - యేసుని ఎదలో నుంచండి
సొగసుగ సభలో శుభముల నొసగు
తగిన విధంబున దయ జూపును అని

ఈ విధంగా కోలాటంద్వారా తాము వివరించాలనుకున్న భావాన్ని వ్యక్తం చేస్తారు.

బుర్రకథ :

ప్రజల నుర్రూత యాగించే కళారూపాలలో బుర్రకథ కళారూపం ప్రధాన మైంది. బుర్రకథను గురించి ఆంధ్రదేశంలో తెలియని వారెవరూ లేరు. అలాంటి బుర్రకథను క్రైస్తవులు కూడా వారి మత ప్రచారం కోసం వినియోగించారు. బుర్ర కథ లక్షణాలను గురించి గేరా ప్రేమయ్య అనే బుర్రకథా రచయిత ''తన పండిత రామాబాయి'' అనే బుర్రకథలో ఇలా ఉదహరించాడు.

రగడ

ఘనకవి పండిత సుజనుల్లారా తందానతాన
తోడువంతలు జోరుగ పాడ తందానతాన
జోడు గుమ్మెట్లు తధిమి యనంగ తందానతాన
రాగతాళ గీతాది నృత్యముల తంబుర కథ నేడు వినుడీ.

అని వివరించాడు.

క్రైస్తవ బుర్రకథా రచయితల్లో గేరా ప్రేమయ్య పేర్కొనతగినవాడు. ఆయన నలభై బుర్రకథల్ని రచియించాడు. ఇంకా చిన్నాబత్తిని మైకేల్ కవి, జొన్నకూటి ప్రకాశం, పలుకూరి సత్యానందం, ఈదులమూడి ఐజాక్, తోటకూరి మొదలైనవారు రచయితలుగా కథకులుగా పేరుపొందారు.

బుర్ర కథలు :

అలాగే సి. బెనర్జీ, ధర్మయ్య, మస్తాన్‌రావు, సత్యం బృందం, రెవరెండ్. కె. ఎస్. ప్రకాశరావు, గంగోలు మోజెస్, తలతోటి యోసేపు, బుద్దాల జోసఫ్, పి.హెచ్. పాలస్, పి. ఐజక్, సాధు తోమాస్ సుబ్బయ్య, వి. రత్నం, బి. జాన్ మొదలైనవారు బుర్రకథలు చెపుతూ తమ జీవితాలను సాగిస్తున్నారు.

క్రైస్తవ బుర్రకథలు మూడు విధాలుగా వున్నాయి. అవి పాత నిబంధనకు చెందినవి. క్రొత్త నిబంధనకు చెందినవి. క్రైస్తవ భక్తుల చరిత్రకు చెందిన బుర్ర కథలు.

గేరా ప్రేమయ్య రాసిన నెహెమ్యా చరిత్ర, దావీదు విజయము, యోసేపు చరిత్ర, పలుకూరి సత్యానంద వ్రాసిన ఎలీషా, చిన్నాబత్తిన మైకేల్ వ్రాసిన "వీర సంసోను చరిత్ర" మొదలగునవి పాత నిబంధనకు సంబంధించిన బుర్రకథలు.

పలుకూరి సత్యానందం వ్రాసిన యేసు జన్మము, గేరా ప్రేమయ్య తప్పి పోయిన కుమారుని చరిత్ర. యోహాను శిరచ్ఛేదము, క్రీస్తు శ్రమమరణ పునరుత్థాన ముల కథ, సాధు తోమాస్ సుబ్బయ్య రాసిన మృత్యుంజయుడు మొదలైనవి కొత్త నిబంధనకు చెందిన బుర్రకథలు.



గేరా ప్రేమయ్యగారి సాధు సుందరసింగ్, పండిత రామాబాయి, చిన్నాబత్తిని మైకేల్ కవిగారి బ్రదర్ జోసఫ్ తంబిగారి చరిత్ర. స్లీవశ్రీ వ్రాసిన "అగ్నేసమ్మ చరిత్ర" సాధుతోమాస్ సుబ్బయ్య రాసిన విశ్వజనని మానవుల మాత మొదలైన భక్తుల చరిత్రకు చెందిన బుర్రకథలు.

## బుర్ర కథల్లో ప్రజా సమస్యలు :

క్రైస్తవ కథలు ప్రాచీనమైనవి. వీటిని ఈనాడు కొందరు బుర్రకథలుగా మలిచారు. అందులో ఈనాటి సమాజంలోని కుళ్ళును చెప్పడానికి ప్రయత్నించారు.

గేరా ప్రేమయ్యగారి యోహాను శిరచ్ఛేదము బుర్రకథలో బ్లాకుమార్కెట్టు బంధించబడాలని చెప్పే క్రింది ప్రబోధాన్ని చూడండి.

కట్టుకొనెడి గుడ్డకు బ్లాకు తందాన
పెట్టుకునే దీపానికి బ్లాకు ,,
తిందామంటే తిండికి బ్లాకు ,,
మగ్గిపోయిన బియ్యం బ్లాకు ,,
వుప్పు పప్పులన్నియు బ్లాకు ,,
పంచదారయు బెల్లము బ్లాకు ,,
కట్టెపుల్లల కసలే బ్లాకు ,,
వీధిలో యంగళ్ళన్నీ బ్లాకండో తందాన

ఇలా క్రైస్తవ బుర్ర కథలలో సామాజిక రుగ్మతలను గురించి కూడా ప్రస్తావించారు.

**భజనలు :**

పనిపాటలు అయిపోయిన తరువాత పల్లెల్లో మామూలుగా భజనలు చేస్తూ వుంటారు. వీటిలో చెక్కభజనలు, పండరి భజనలు, హరిభజనలు, శావమూర్ఖ భజనలు మొదలైనవి వున్నాయి. ఈ భజనలన్నీ భారత రామాయణ గాథలకు సంబంధించి భక్తిభావంతో కూడుకున్నవి. ఈ భజన పాటల్ని అనుసరించి క్రైస్తవులు కూడ భక్తితో భజన కీర్తనలు వ్రాశారు.

పండరిపురానికి వెళుతూ పండరి భక్తులు "రంగ ఎంత దూరమో ఎరుగము పండారి" అనే పాటను అనుకరిస్తూ—

ఇక నెంతదూరమో - ఎరుగను కానాన్ పురము
ఎరుగను కానాన్ పురము
ఎరుగను కానాన్ పురము
నడచి నడచియు కాళ్ళు - కడుబొబ్బలెక్కెను
కడుబొబ్బలెక్కెను

అని పాడుతూ, అలాగే మరో పాట

యేసుక్రీస్తు శ్రమావరణాల్ని గూర్చి పాడుతూ ఆయనకు జేజేలు పలికే క్రింది భజన కీర్తన కూడ ఈ కోవలో పేర్కొనదగింది.

ఏడమ్మా మన యేసూ - ఏడనున్నాడో జై
ఏడనున్నాడో ఆ జాడ తెలియదాయె ॥ఏడమ్మా॥
నీ చిన్ని కాళ్ళల్లో - శీలలే నాటిరిగ జై
కారినా రక్తంబూ
కాలువలై పారెనుగా ॥ఏడమ్మా॥

ఇలా ఏసు గాథలకు సంబంధించిన భజన పాటలు ఎన్నో ప్రచారంలో వున్నాయి.

ఇతర కళారూపాల మాదిరే క్రైస్తవులు జానపద కళాప్రదర్శనాలను శుభ సమయాలలోనూ, పెండ్లిండ్ల సమయంలోనూ, పండుగల సమయంలోనూ, మహా మహుల స్మృత్యర్థం జరిపే జన్మదినోత్సవాలలోనూ, క్రైస్తవ మహా సభలు జరిగే సమయాలలోనూ ఈ కళాప్రదర్శనాలను ప్రదర్శిస్తారు. ఈ కళలు హిందూ క్రైస్తవుల సంస్కృతికి దర్పణాలై క్రైస్తవ సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నాయి. క్రైస్తవ సాహిత్యం జానపద కళ లన్నిటిలోనూ ఉండటం గమనించదగిన విషయం.



# తెలంగాణా లత్కోర్ సాబ్

పిట్టలదొర వేషం ఆనాడు బ్రిటిష్‌వాళ్ళ వేషధారణను పోలి వుంటుంది. ఒక విధంగా తెల్లవాళ్ళ వేషాన్నీ, భాషనూ హేళన చేసేటట్లుగానూ వుంటుంది. నాడు సమాజంలో వున్న దుర్మార్గాలను ఎత్తిచూపుతూ హాస్యంతో ప్రజలను వినోదపరుస్తూ విజ్ఞానపర్చే నాటి జానపద కళారూపమే పిట్టలదొర. ఈ వేషాన్ని నాటి పగటి వేషధారు లందరూ ప్రదర్శించేవారు.

## లత్కోర్ సాబ్ :

పిట్టలదొర వేషాన్నే లత్కోర్‌సాబ్ "బుడ్డర్‌ఖాన్" తుపాకిరాముడు అని పిలుస్తారనీ, అది పగటివేషాల్లో ఒక రకమనీ, గ్రామాలలో ప్రదర్శించే పిట్టలదొర వేషగాళ్ళు సమాజంలో వున్న కుళ్ళు విషయాలను హాస్యంతోనూ, వ్యంగ్యరూపం

లోనూ బయటపెడతారు. ఖాకీ ప్యాంటు, లేదా నిక్కరు, చిరిగిన ఖాకీ షర్టు, తలపై దొర టోపీ, ఆ టోపీపైన ఒకప్రక్కగా తెల్లటి ఈక, చేతిలో కట్టె తుపాకీ; మెడలో రుమాలు, ముఖానికంతా తెల్లరంగు పూసుకుని, ఫ్రెంచి కట్ మీసముతో, కాళ్ళకు బూట్లు తొడిగి ఒక దొరలాగా హంగామా చేస్తూ, అడుక్కుంటూ విరామం లేని తన వాగ్ధోరణితో శ్రోతలను చమత్కారంతో ముంచెత్తుతాడు. ఈ వేషాన్ని బ్రిటిష్ ప్రభుత్వ హయాములో 1943 ప్రాంతాల్లో నాటి బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ, ఫాసిస్టు దురాక్రమణను వివరిస్తూ, సాంఘిక దుష్టశక్తుల కార్యక్రమా లను వెల్లడిస్తూ నాటి ఆంధ్ర ప్రజానాట్యమండలి విస్తృతంగా ప్రదర్శించిందని జయ ధీర్ తిరుమలరావు 'ప్రజాసాహితి ప్రత్యేక కళారూపాల' సంచికలో వివరించారు.

తెలంగాణా పిట్టల దొర :



ఈ క్రింద సూచించిన కళారూపం తెలంగాణా గ్రామాల్లో వృత్తి కళాకారులే, తెలంగాణా పోరాటానికి సంబంధించిన సమస్యల నన్నిటినీ పిట్టలదొర వేషంలో పొందువర్చారు.

అంతా అనుకుంటే అవునేమో అనుకున్న ఊరూరు తిరగడం, ఉత్తుత్త మాటలు చెప్పడం దూటీ పొమ్మంటె దుమ్ము రేగంగ కోక జాడిచ్చిన....గిదె నా బ్రతికిన బ్రతుకు నా రాతన్నారు....గీతన్నారు....ఖర్మన్నారు .... దుమ్మన్నారు! కానీ మా రాజీ తెలం గాణాలోని తెగించుకుపోయిన ముసలిముతక తాతలంత తడాకా చూపిస్తుంటే నాకు కూడా రోశంవచ్చి, తుపాకి గట్టిగా పట్టి చివరిలో....పోరాటంలో పోయనేపోయిన....

ఓ యిజై అన్న అంటే అండ్లేమున్న దనుకున్నారు. మా రాజ్! అంతా రైతులు, కూలీలు వింత వింతగ నన్ను జూసింద్రు. ఇదేమి లత్కోరీ సాబ్ ఇట్లు బిచ్చమెత్తుట రాతగాదు. గీతగాదు అంతా నీ చేతులనే ఉన్నదన్నారు. అదేందో అనుకుని నా చేతులు చూచేసరికల్ల అన్నీ గీతలే ఉన్నయి. అప్పుడు నే ననుకున్న మారాజ్.

ఏమయ్యా ఓ సంఘపోల్లు ఎక్కడ చూస్తే ఏమీ లేదు. చేతులు చూసే గీత లున్నాయ్ - చేద్దామంటే భూమి లేదు - ఉందామంటే ఇల్లు లేదు. కొందామంటే పైసా లేదు - తిందామంటే తిండి లేదు.

ఈ సొరాజ్యంలో అప్పుడు అశ్శేమన్నారనుకుంట్రు, ఇదేవి లత్కోరు సాబు, వేల ఎకరాలు పెట్టిచ్చుకున్న దొరల భూమి అందుకే అచ్చింది దేశానికి సాతంత్రం - అట్ల జూస్తే ఆయనకు దున్నరాదు - ఇట్ల జూస్తే నీకు భూమిలేదు. కనుక దున్ను కున్న వాళ్ళు దుక్కి దున్నుకోమన్నరు. తీరా దున్నుకుందా మనుకున్నవరకల్లా ఎదు రుంగ ఉన్న దొర భూమి యెదలు దున్నింది. వాళ్ళే దున్నుకొన్నరు పనికిరాని భూమంతా పడావు పడుంటే ఎట్లనన్న కానీయని....ఎట్లన్న యేగొచ్చని గుండె పెద్దది చేసుకుని గండికాడి ఎకరం భూమి కబ్జచేసిన....నన్ను జూసి మా వూళ్ళోవున్న గొల్ల మల్లయ్య, చల్లి రంగయ్య, మాదిగ ముత్తయ్య, దూదిగ రామయ్య, సాలెం పాపయ్య, మాల గోపయ్య, మంగలి లింగయ్య, చాకలి నర్సయ్య, మేకల గుర వయ్య, మేదమీది రామయ్య, పీకె గోపాలం, ఏకె బడే సాబు జుట్టుకింత పట్టినంత దున్ననే దున్నిన్రు-అల్కనే అల్కిన్రు-అలికితే మారాజ్ - అండ్లేమి పండింది అను కున్నరు....పందుం అలికితె ఇద్దుం పండినయ్ - ఇద్దుంలో కుండెడు తాలు - బండెడు వడిసిలు - లాగుల వొడ్లు - నెత్తిమీద గడ్డి ఈడికి యింత సాలని ఇంటిదారి పదితె కర్నీకం వడ్లకని కాపలాయన రానే వచ్చింద్రు. ఈ ఏడు ఏమీ లేదు - ఇద్దుం అలి గితె తూమెడు పండినయ్.

వచ్చే ఏటికి పడ్డీతో ఇస్తనని కరణం పంతులు కాడికెళ్ళి ఖాతా రాయించి పెట్టుకున్న అంతలోనె యూనియనొచ్చింది. ఇగ నాకేం పర్వఅనుకున్న. పంతులు గింతులు గట్టా చేయిస్తరనుకున్న. పట్టాలేదు గిట్టా లేదు-నెట్టడం మొదలుపెట్టింద్రు- ఎల్లెలు యెదవ-యెదవ నా కొడకా దొరోళ్ళ యిళ్ళకు పిలిచి దొంగ నా కొడక అని - అంగి లిడిపించి-బింగీలు తీయించి తొక్కించి దొబ్బించి తోలిరగ దీయించి ఎల్లెల్లి యెదవనా కొడక, అంటే భూమిలేకుంటనాయె, స్వరాజ్యంల సావుకే వచ్చిందనుకున్న- బతికి బయటపడితే బలుసాకు తిని బతుకవచ్చు ననుకున్నా. ఇంటికెళ్ళి చూద్దునుగద కుండలు కొట్లాడుతున్నయ్, పోరగాండ్లు మూలుగుతున్నారు. పొయ్యిల పిల్లి లేవలేదు- ఇంత జూచి ఇదెట్లనాయ్ భూమి అనివోయి దున్ననే దున్నిన - అల్కనే అల్కిన పంట పండేవరకల్లా నాతంట వాసింది. మరి ఓట్లొచ్చినయ్, ఎడ్ల గుర్తు డబ్బాలకు అసలే వద్దంటున్నరు-ఎన్నికల అత్తికికి తెల్లోడు-పోయ్ నల్లోడు వచ్చనే వచ్చిండు-మెల్లగ మాట తిరగబెట్టి నల్లగ నాటిగస్తి? రాయనేరాస్త్రిను.



# తెలగదాసరులే,
# గంటె భాగవతులు



శాస్త్రీయంగా యక్షగానాలను ప్రదర్శించే కూచిపూడివారు పేరు. జీవనోపాధిగా మిగిలిన ఈ కళను నమ్ముకొని జీవయాత్ర కొనసాగిస్తున్న ఈ సంచార తెగ పేరు. వీరు తెలగ దాసరులు. తెలంగాణాలోని నల్లగొండ, ఖమ్మం, వరంగల్, హైదరాబాదు జిల్లాలలో ఎక్కువగా నివశిస్తున్నారు.

## గంటె భాగవతులు :

వీరిని గంటె భాగవతులని కూడా పిలుస్తారు. పెట్రోమాక్సులైట్లు, ఎలక్ట్రిక్ లైట్లు లేని ఆ రోజుల్లో పెద్ద పెద్ద గరిటెల్లో (అంటే గెంటెల్లో) ఆముదం పోసి అందులో వత్తుల్ని నానబెట్టి వెలిగించి ఆ వెలుగులో వీధి నాటకాలను ప్రదర్శించే వారట. అందుకే వీరికి గంటె భాగవతులనే పేరు కూడా వచ్చింది.

నాగరికత పెరిగిన తరువాత అనేక కళలు ఎలా కాలగర్భంలో కలిసి పొయ్యాయో. ఈ కళ కూడా నానాటికీ నశించిపోతూ వుంది. ప్రయాణ సౌకర్యాలు సరిగా లేని ఆ రోజుల్లో ఈ ప్రదర్శనాలను చూడటానికి పల్లెప్రాంతాల నుండి ప్రజలు తంతోప తండాలుగా వచ్చి ఈ ప్రదర్శనం చూసి ఆనందించేవాళ్ళు అయినా ఈ కళ ఏ ఆదరణా నోచుకోకపోయినా ఇంకా కొనవూపిరితో కొట్టుకుంటూ వుంది.

## వారి ప్రదర్శనాలు :

గంటె భాగవతులు, రామనాటకం. సావిత్రి, సారంగధర, గయోపాఖ్యానం, లక్షణపరిణయం, శశిరేఖాపరిణయం, గరుడాచలం, ప్రహ్లాద, జయంత జయపాల, సిరియాళ, గజగౌరి, అదృష్ట బాలచంద్ర మొదలైన పౌరాణిక జానపద యక్షగానాలను ప్రదర్శిస్తారు.

సంక్రాంతి మొదలు ఉగాదివరకూ రోజువిడిచి రోజు ప్రదర్శనాలు జరుగుతాయి. పల్లెల్లోవున్న మోతుబరి ఆసాములు ఇరవై ముప్పై రూపాయ లిచ్చి, ప్రదర్శనాలను ఏర్పాటు చేస్తారు. గ్రామ ప్రజలందరూ ఉచితంగానే ఈ ప్రదర్శనాలను చూచి ఆనందిస్తారు. పర్వదినాలలో కూలీలు కూడా వీరిచేత నాటకాలు వేయిస్తారు.

## దేశ సంచారులు :

వీరి వీధి నాటకాలు తోలుబొమ్మలాటలను పోలి వుంటాయి. బొమ్మలాటల్లో గందోళిగాడు బంగారక్క బొమ్మల రూపంలో హాస్యాన్ని అందిస్తే, ఈ నాటకాలలో గందోళిగాడు, బంగారక్క పాత్రలను మనుషులే ధరించి హాస్యాన్ని అందిస్తారు.

ప్రతి జట్టుకు పదిమంది కళాకారు లుంటారు. ఒక కుటుంబంగా వుండి ప్రదర్శన లిచ్చుకుంటూ ఒక వూరి నుండి మరో వూరికి పోతూ వుంటారు.



వారి ప్రదర్శనానికి అందగా హార్మోని యంను శృతిగా వాడుకుంటూ మద్దెల తాళాల సహాయంతో వేషధారులు శ్రావ్యంగా కీర్తనలు పాడుతూ ప్రేక్షకులను ఆనందపరుస్తారు.

## నేపథ్యంలో, ఉపోద్ఘాతం :

వీరి ప్రదర్శనాల్లో ఒక పాత్ర రంగ ప్రవేశం చేసేముందు, తెరలోనే చాలాసేపటి వరకూ వుండి ఉపోద్ఘాతం వినిపించటం వీరి సాంప్రదాయం. రంగం మీదనున్న పాత్రధారి ఆలపించే కీర్తనలను పునరుక్తిగా తక్కిన కళాకారులు సామూహికంగా గానంచేస్తారు. కీర్తనలలోని సాహిత్యానికి అనుగుణంగా అభినయిస్తూ, నృత్యంచేస్తూ, ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేస్తారు. పురుషులే స్త్రీ పాత్రలను ధరిస్తారు. వీరి ప్రదర్శనాల్లో పాత్రలు ధరించిన మునిపంపుల గ్రామానికిచెందిన రావుల కోదండం, బసవబోయిన సవారి రాజు నాయకపాత్రల్లోనూ, మాదగాని పాపయ్య స్త్రీ పాత్రలోనూ ప్రసిద్ధులని గర్వంగా చెప్పుకుంటారు.

వీరి స్త్రీలు తట్ట నెత్తిన పెట్టుకుని, అద్దాలు, దువ్వెనలు, సబ్బులు, గాజులు, రిబ్బన్లు, పౌడర్లు, పిన్నులు మొదలైన స్త్రీలకు కావలసిన వస్తువుల్ని అమ్ముకుంటూ, కుటుంబ పోషణ భారాన్ని పంచుకుంటారు.

పూర్వం ఈ భాగవతులకు భూస్వాములు, జమీందారులు మడి మాన్యాలిచ్చి ప్రోత్సహించేవారు. ఈ నాడు ఆ మాన్యాల నన్నిటినీ పోగొట్టుకుని సూన్య హస్తాంతో. దుర్భరమైన పేదరికాన్ని అనుభవిస్తున్నారని ఒక వ్యాసంలో దిలావర్‌గారు ఉదహరించారు.

దాసర్లు :

తెలంగాణాలోని దాసర్లు సర్కారాంధ్రలో దాసర్లు కారు. సర్కారాంధ్రలో భిక్షమెత్తే హరిదాసుళ్ళూ, వైద్యంచేసే హరిజన దాసర్లూ (దాసుళ్ళు) వున్నారు. తెలంగాణాలోనివారు హరిజనులకు గురువులు. వీరిని మిత్తుల అయ్యవార్లు అంటారు. సర్కారాంధ్రలో వైష్ణవ గురువులకు ఎంత గౌరవం వుండేదో, ఈ మిత్తుల అయ్యవార్లకు తెలంగాణా హరిదాసుల్లో అంత గౌరవం వుంది.

వీరు కేవలం గురువులే కాక, వీరిలో చాలామంది కళాకారులు కూడా. వీరు వీథి నాటకాలు ఆడతారు. వీరి ముఖ్య నాటకం గరుడాచలం. వీరివద్ద ఒక విధమైన తంబురా వుంటుంది. దాన్ని సన్నని గజ్జెలతో వాయిస్తారు. దానినుండి తంబురా ధ్వనే కాకుండా, మృదంగ ధ్వని కూడా వస్తుంది. వీరిలో కొంతమంది సాంప్రదాయిక యక్షగానాన్ని కూడా ప్రదర్శిస్తారు.



# పీర్ల పండుగలో పేరెన్నికగన్న ధులా

ధులా అనే కళారూపం, సర్కారు ఆంధ్రదేశంలో కానీ, రాయలసీమ ప్రాంతంలో కానీ ఎక్కడా కనిపించకపోయినా; తెలంగాణా ప్రాంతంలో మాత్రం అధిక ప్రచారంలో వుంది.

ఇది ముఖ్యంగా శ్రమ జీవుల కళారూపమనీ, అంతకంటే ముఖ్యంగా ముస్లింలు జరుపుకునే పీర్లపండుగకు సంబంధించిందనీ, జయధీర్ తిరుమలరావు గారు ప్రజా కళారూపాలు అనే తమ గ్రంథంలో వివరించారు.

ఇది శ్రమజీవుల కళారూపమైనా శ్రమజీవులందరూ ఈ కళారూపంలో పాల్గొన్నట్లు మనకు పెద్ద ఆధారాలులేవు. ఇది అందరూ కలిసి సామూహిక నృత్యంచేస్తారు. పాటకూ, పాటకు సంబంధించిన ఆటకూ సంబంధించిన జానపద కళారూపం.

ధులా కళారూపానికి సంబంధించిన పాటల్లోగానీ, పదాల్లోగానీ అవి అతి చిన్నవిగానూ, అంతకంటే కథావస్తువు అతి చిన్నదిగానూ వుంటుంది.

ముఖ్యంగా మొహరం పండుగల్లో జరిగే పీర్లపండుగలో ధులా ఎక్కువ ప్రచారమైనా, ఆ కళారూపాన్ని తెలంగాణా పోరాట సమయంలో సాయుధ దళాల్లో వున్న ముస్లిం సహోదరులూ, ఇతర శ్రమజీవులూ కూడా ఈ కళారూపాన్ని బాగా

వుపయోగించుకున్నారు. దళాలకు సంబంధించిన క్యాంపులో వున్నవారందరూ వలయాకారంగా నిలబడి, ఒకరు పాటను ప్రారంభించి, ఆ పాటను సామూహికంగా అందరూ అందుకుని, ఆ పాటకు తగిన అడుగులను అందరూ ఒకేరీతిగా క్రమశిక్షణతో లయబద్ధంగా ధులా పాటను పాడుకునేవారు. ధులా కళారూపంలో పాడుకునే పాటలు అనేకం వున్నా ఈ క్రింద వుదహరించిన పాట ఎంతో ప్రచారంలో వుంది.



లంబాడి గన్నెగాడు :

వాని పేరు గన్నెగాడు, లంబాడోడు గన్నెగాడు
వాడిపల్లె దోచినాడు, ఓతపైన ఎక్కినాడు
కొండపోల్లో కొనినాడు - కొండలాగ ఎదిగినాడు
మీర్సాలం చూసినాడు - మీసామె దువ్వినాడు
గూడెంలో పేల్చినాడూ - గుండెంతో చేసినాడు ॥వాని॥
రామ్మడు గూరేసినాడూ - రాళ్ళగుట్ట కెక్కినాడు
పిట్టల్ గూడెం కొట్టినాడు - పిట్లల్లే ఎగిరినాడు
నల్లగొండ తిరిగినాడు - నలుగురితో మెలిగినాడు
పల్లెల్లో తిరిగినాడు - ప్రజల బాధ తెలిసినోడు ॥వాని॥
బుగతాలా చూసినాడు బలుపంతా తీస్తాడాడు
దళాన్ని నడిపినాడు - దొరలనంత దోస్తాడాడు ॥వాని॥
బందూకూ పట్టినాడూ - బరిగీసి నిల్చినాడు
పోకిళ్ళకు ఓర్చాడాడు - పోలీసోళ్ళ మింగుతాడు ॥వాని॥
రైతుల్లో రాజు వాడూ - రాజ్యమె తెస్తాడాడు
కమ్మినిస్టూ కత్తి వాడూ - కలలన్ని పండిస్తాడు ॥వాని॥
మరుసటేడు వస్తాడాడు - మా యిండ్లకే వస్తాడాడు ॥వాని॥

ధులా కళా రూపంలోని పాటలు ఈ విధంగా సాగుతాయి. ప్రజాపోరాటంలో ప్రజాకళాకారులు ఈ పాటలను ప్రజల్లో ప్రచారానికి బాగా ఉపయోగించారు.



# దండిగా ప్రచారమైన దండా గానం

దండా గానమనేది ఇతర ఆంధ్ర జిల్లాలలో ఎక్కడా ప్రచారంలో లేకపోయినా తెలంగాణా ప్రాంత పల్లె ప్రజలలో మాత్రం బాగా ప్రచారంలో వుంది.

దండా గానమనేది అల్లాకేనాం అంటూ పాడే ఫకీర్ల పాటకన్నా కొంత భిన్నంగా వుంటుందనీ, అందులో ఉరుదు పదాలూ, ఉరుదు భాషోచ్ఛారణా తక్కువగా వుంటుందనీ జయధీర్ తిరుమలరావుగారు తమ ప్రజా కళారూపాల గ్రంథంలో వివరిస్తూ, ఈ పాటల్లో మొత్తం తెలంగాణాలో జరిగిన వీరోచిత పోరాటాల చరిత్ర వస్తుందనీ, ఐతే నైజాంలో ముఖ్యంగా పోలీసు చర్య తరువాత ప్రజా జీవితంలో వచ్చిన మార్పులీన్నీ, వారి ఆశయాలనూ, అభిశంసలనూ ఈ గానంలో ప్రతిబింబించారనీ వ్రాశారు.



ఫకీర్ల పాటల్లో కనిపించే సాధారణ పదాలు ఇందులో వుండవు. అయితే తెలంగాణా ప్రజా పోరాట కాలంలో దీనిని ఒక పెద్ద కళారూపంగా మలిచారు. అలాగే పారంపర్యంగా వస్తున్న దండా గాన కళారూప స్వభావాన్ని కొంత మార్చటం కూడ జరిగిందంటారు తిరుమల రావుగారు.

పాటల్లో ప్రజలను వుత్తేజపర్చటానికి మీసాన్ని మెలివేయటం ఆవేశంతో హావభావాలను చూపించడం జరుగుతుంది.

## కళారూపంలో తెచ్చిన మార్పు :

ఫకీరు పాటలకు ప్రధానమైన 'అల్లాకేనాం' అనే పల్లవినే ఈ పాటల్లో పరిహరించారు. ఉరుదు భాష ఉచ్ఛారణను తీసివేశారు.

అందువల్ల ఈ దండాగాన కళారూపాన్ని, అమ్మలు ధరించిన కోయవేషాలతో ప్రదర్శించారని సుద్దాల హనుమంతు తెలిపారు.

దీనిని ప్రదర్శించటానికి ఇద్దరు వ్యక్తులుంటే చాలు. వారు ఎర్రని లుంగీలు ధరించి నల్ల బనీన్లు తొడుక్కుని మోకాలి వరకూ వ్రేలాడే పంచెను నడుముకు కట్టి,

కోర మీసాలు ధరించి మెడలో ఫకీరు పూసల దండను వేసుకుంటారు. ఎర్రని రిబ్బన్ తలకు కట్టుకుంటారు. ముంజేతికి ఇత్తడి గాజులు ధరించి చేతిలో ఒక పొట్టికర్రను దండంగా వుపయోగించి, గాజులున్న చేతితో పట్టుకుని ఆ కట్టితో గాజులను తాళంగా కొడుతూ లయ తప్పకుండా ఒకరి తరువాత ఒకరు గానం సాగిస్తారు.



కుడిచేతితో గాజులు కొడుతూ ఎడమచేతితో రుమాలును వూపుతూ, అదే చేతితో మీసాన్ని మెలివేస్తూ, ప్రజలను ఉత్తేజపరుస్తూ, ఉత్సాహపరుస్తూ పాటలను పాడుతారు. లేదా అమ్ములు ధరించి కోయవేషంతో ప్రదర్శిస్తారు.

## సుద్దాల హనుమంతు విజయ గీతం :

సుద్దాల హనుమంతు ఈ దండాగానాన్ని దీర్ఘంగా నాటి పరిస్థితులను వివరిస్తూ విజయగీతం వ్రాశాడు. ఆ గీతంలోని ముఖ్య విషయాలను ఇక్కడ వివరిస్తున్నాను.

ఓ భారతీయులార మీరు బాగ వినరండీ
భారత కాంగ్రెసు రామరాజ్య మిదండీ
సేవాలుగాను వ్రాసితి నొక పూట వినండీ

అంటూ చెప్పే విషయాలు అపార్థం చేసుకోరనీ, నిజాన్ని తెలుసుకోమనీ, వేషభాషలను చూచి మోసపోవద్దనీ, ప్రజాప్రభుత్వం వస్తుందనీ, కలలు గన్న ప్రజలు కడగండ్లు చూడరంటూ.

పందొమ్మిదివందల నలుబది ఏడాగస్టునా
ప్రజలెల్లరూ ద్వేషించేటి బ్రిటిషు పాలనా
కోటానుకోట్లు ప్రజలు తిరుగుబాటు కతనా
ఖ్యాతిగను రాజ్య మప్పగించిపోయిరిగానా

అంటూ పరాయి పాలన పోయి కాంగ్రెసు ప్రభుత్వం వచ్చిందనీ, ప్రజలందరూ సంతోషించారనీ, ఫ్యాక్టరీలను ఏర్పాటుచేసి గనుల సంపదను వెలికి తీసి ప్రజలందరికీ తిండీ బట్టా, ఉండటానికి ఇల్లూ, దున్నటానికి భూమి, ప్రజలందరికీ సకల సౌకర్యాలూ చేకూరతాయని ఆశించారు. అంటూ

అధికారములో కొచ్చిన నెహ్రూ ప్రభుత్వమూ
విధి తప్పి నడవసాగెనూ దినదిన ప్రమాణమూ
ఐదేళ్ళు గడువవచ్చెను ప్రతి అంశములోనూ
బీదల హక్కుల నన్నిటి బూడిదలో త్రొక్కెనూ

అంటూ నెహ్రూ ప్రభుత్వమూ, ఆ ప్రభుత్వ తాబేదారులూ ప్రజల ఆశలను అడియాసలు చేశారంటూ.

దిన దినం ప్రజల జీవిత మతిభారమయింది
ధనవంతుల భూస్వాముల దోపిడి పెరిగింది
అసాధ్యమైన నిరుద్యోకత అధికమయ్యింది

కర్మాగారములందే పదిలక్షల మంది
కార్మికుల జీవితాల విలువ తగ్గిపోయింది
నిరుపేదగణము ఆత్మహత్యలకు గురి అయింది అని చెపుతూ

తిన తిండిలేక ప్రజలు కష్ట స్థితి కొచ్చారూ
న్యాయమైన హక్కుల కోసం పోరాడుతున్నారు
పోలీసులు దౌర్జన్యంతో ప్రజలను వీరూ
బలవంతముతో నోరు మూయించగలిగారూ.

అని అంటూ 1948 సెప్టెంబరులో నైజాంలో క్రూర రజాకార్లను అణుస్తామంటూ తెలంగాణా అంతా భారత సైన్యాన్ని దించారు. మత పిశాచంతో కొంతమంది హతమై పోయారసీ, రజాకార్ల నాయకులైన రజ్వీ సయదద్భుల్ రహమాన్ యిస్మాయిల్ మొదలైన కసాయి వాళ్ళందరూ పాకిస్థాన్ చేరిన తరువాత ఏ కమ్యూనిష్టులైతే రజాకారుల్ని అణచారో ఆ కమ్యూనిష్టుల్ని నెహ్రూ ప్రభుత్వం ఎలా అణచిందీ సుద్దాల హనుమంతు తన విజయగీతం ద్వారా వివరించాడు.



## వినోదభరితమైన విలువిద్యా ప్రదర్శనలు

ఒకనాడు దేదీప్యమానంగా వెలిగిపోయిన విలువిద్యా ప్రదర్శనలు ఈనాడు మచ్చుకు కూడా కనిపించడంలేదు. ఆదిమ మానవుడు అడవులలో జీవించిన కాలం నుంచీ, ఆ యాకాలాల్లో, ఆయా జాతుల పరిణామాల్లో, రామాయణ భారత భాగవత కథలలో, జానపద కథలలో ఎక్కడ చూచినా, ధనుర్విద్యా ప్రదర్శనాలుగా పిలువబడుతున్న విలువిద్యా ప్రదర్శనాలు, నాటి ఆంధ్రదేశంలో అన్ని కళలతోపాటు ఈ ప్రదర్శనలు కూడ ఎంతో ప్రాముఖ్యం వహించాయి.

### విలువిద్యలో పురాణ పురుషులు :

పురాణ యుగపు కథానాయకుల నుండి, ప్రతి నాయకులూ, రాజాధి రాజులు మొదలు, సామాన్య పౌరులూ, అందరూ విలువిద్యను నేర్చినవారే, అందరికీ నేర్పిన వారే.

ఆదిమ అడవి జాతులుగా పిలువబడి ఈ నాటికీ అడవుల్లో నివశించే గిరిజన జాతుల వరకూ అందరూ విల్లుపట్టి ఆరితేరినవారే. ద్రుపదుని కొలువులో మత్స్య యంత్రాన్ని కొట్టిన అర్జునుడూ, శివధనుస్సును విరిచి సీతను పెళ్ళాడిన రాముడూ, రామలక్ష్మణులు విశ్వామిత్రునివద్ద విలువిద్యను నేర్చినవారే, విలువిద్యను నేర్చిన రాముడు రాక్షసులైన మారీచసుబాహులను, మాయ లేడినీ, చెట్టు చాటునుండి వాలినీ చివరికి రావణునీ వధించింది విలువిద్యతోనే. రామరావణ యుద్ధం ముగిసింది మారణాస్త్రాలతోనే.



ద్రోణాచార్యుల వద్ద కౌరవ పాండవులందరూ విలువిద్యను నేర్చినవారే, అందరూ విల్లును పట్టి ఒకరి నొకరు వధించుకున్నవారే. విలువిద్యలోనే గురువును మించిన శిష్యు డనిపించుకున్నాడు ఏకలవ్యుడు.

ఒక్క మాటలో చెప్పాలంటే మన్యం విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు బ్రిటిష్ ప్రభుత్వాన్ని తన విల్లుతో, విల్లంబుల సైన్యంతో, గడగడలాడించి తుపాకులకు ఎదురు నిల్చి, విల్లుతో ఎందరినో హత మార్చాడు.

## కనుమరుగౌతున్న కళ :

ఇలా చెప్పుకుంటూ పోతే ఏ దేశ చరిత్రలో చూచినా మందుగుండూ, మారణాయుధాలు లేని నాడూ, అందరూ విల్లును బట్టి ఆహారాన్ని సంపాదించుకున్నవారే. విల్లుతో విరోధుల్ని ఎదుర్కొన్నవారే. తుపాకి పట్టిన వారికి ప్రప్రథమంగా గురి చూపి కొట్టడం నేర్పింది విల్లే. అలాంటి విలువిద్య నాగరిక ప్రపంచంలో నానాటికీ కనుమరుగై పోయింది. కేవలం వైరుల నెదిరించటానికే కాకుండా, అదొక నైపుణ్యం గల ఉత్తమ కళారూపంగా కూడా అభివృద్ధి చెందింది. ఈ నానాటికీ కోయలు, చెంచులు, సవరలు, జాతాలు, కొండరెడ్లు, గోండులు మొదలైన అడవి జాతులకు

చెందిన విలుకాండ్రు పేరు చెప్పి ఒక్క దెబ్బతో అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తున్నారు.

## ఆ నాటి ఆదరణ:

ఒకనాడు ఈ విలువిద్యను ఆహారం కోసం జంతువులను వేటాడే సాధనంగా కాక నైపుణ్యంతో కూడిన కళగా తీర్చిదిద్దారు. ఈ నాటికీ ఈ కళ జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ క్రీడల పోటీలలోనూ ప్రవేశపెట్టారు. ఆధునిక ప్రపంచంలో, ప్రపంచ వ్యాప్తంగా ఈ విలువిద్య ఈ నాటికీ ఎంతో ప్రఖ్యాతి వహించింది.

ఒకనాడు ఆంధ్రదేశంలో రాజులూ, జమీందారులూ, ఈ విలువిద్యా ప్రదర్శనలను ఎంతగానో పోషించారు. వారి సమక్షంలోనే పోటీలను నిర్వహించారు. ఉత్తమ విలుకాండ్రకు ఉత్తమ బహుమానాలను బహూకరించేవారు.

ఈ పోటీలకు ఎక్కడెక్కడ విలుకాండ్రందరూ పోటీలకు తయారై వచ్చేవారు. ప్రజలు ఈ ప్రదర్శనాలను చూడటానికి తండోపతండాలుగా వచ్చి విలువిద్యా ప్రదర్శనలు చూచి నివ్వెరపడిపోయేవారు. ప్రదర్శనాలను చూచి వెళ్ళిన యువకులూ బాలురూ విల్లంబులను తయారుచేసుకుని పిట్టల్ని వేటాడేవారు.

## ప్రజలను అలరించింది:

అలాంటి ఈ ధనుర్విద్యా ప్రదర్శనకళ, జానపదకళగా అభివృద్ధి చెందింది. అన్ని కళారూపాలతో పాటు ప్రజలను రంజింప చేసింది. అలాంటి ఈ కళారూపం శిథిలమై కనుమరుగై పోతూ వుంది. ఈ నాడు కనుమరుగై పోతున్న అన్ని జానపద కళారూపాలతో పాటు విలువిద్యా ప్రదర్శనలు కూడ కాలగర్భంలో కలిసిపోతూ వున్నాయి.

ఈ నాటి యువతరానికి రాముడో, ద్రోణాచార్యుడో బాణాలు సంధించారనీ, యుద్ధాలు చేశారనీ టి.వి.లో చూడటమే కాక, ఒకనాడు ఆంధ్రదేశంలో ఈ విలువిద్యలో ఆరితేరిన నిపుణు లున్నారనీ, అత్యద్భుతంగా ప్రదర్శనాలు ప్రజామోదం పొందా యన్న విషయం చాలామందికి తెలియదు. తెలుసుకోవా లనుకునేవారూ లేరు.

## అడవిజాతులవారే ఆరాధిస్తున్నారు:

వారి వారి అవసరాల కోసం, జీవనాధారం కోసం అక్కడక్కడ అడవులలో వున్న గిరిజనులలో మాత్రమే ఈ విలువిద్య బ్రతికివుందే తప్పా, ఆంధ్రదేశంలో

మాత్రం ఈ విలువిద్యా ప్రదర్శనాలు ఎక్కడా ప్రదర్శిస్తున్నట్లు మనకు దాఖలాలు కనిపించవు. కారణం విలువిద్య చాలా కష్టమైంది. ఎంతో సాధన చేస్తేగాని అలవడని విద్య. గిరిజనులు తమ తమ బిడ్డలకు చిన్నతనం నుంచే విలువిద్యను నేర్పుతారు. ఎందుకు? ఒకప్రక్క మాంసాహారం కోసం, జంతువుల వేటకూ, క్రూర మృగాల ప్రమాదాల నుంచీ తప్పించుకోవడానికీ విలువిద్యను ఎంతో భక్తిశ్రద్ధలతో గురువు వద్దనే నేర్చుకుంటారు. ప్రతి తండ్రీ తన బిడ్డకు విలువిద్యను నేర్పుతాడు.

అయితే ఆంధ్రదేశంలో మచ్చుకు అక్కడక్కడా ఈ విలువిద్యా ప్రదర్శనలో నిపుణులైన ఆ తరానికి చెందిన వృద్ధులు కొందరు కనిపిస్తారు. అలా పశ్చిమ గోదావరి జిల్లాలో ఇంకా ఈ విలువిద్య బ్రతికే వుంది. ఈ విద్యను పెంచి పోషించిన వారూ, ఈ నాటికీ బ్రతికిస్తున్నవారూ క్షత్రియులైన రాజులు.



వారి పేరైతే నాకు తెలియదు కాని ఆయన ప్రదర్శించిన విలువిద్యా ప్రదర్శనను మద్రాసు, 'సెంటినరీ హాలు'లో ''కళాభారతి'' వార్షికోత్సవం సందర్భంలో చూచి ఆశ్చర్యపోయాను. కనుచూపు తగ్గిపోతూ వున్న డెబ్బైమూడు సంవత్సరాల వయస్సులో ఆయన ప్రదర్శించిన ప్రదర్శన మది. అది ఒక అద్భుత ప్రదర్శనం. అపూర్వ ప్రదర్శనా నిదర్శనం. హాజరైన మూడువేల మంది ప్రేక్షకులూ, ఆశ్చర్యానందంలో మునిగి పోయారు. ఈ రోజుల్లో ఇంతటి విలువిద్యా నిపుణులున్నారా? అని విస్తుపోయారు. వేనోళ్ళ పొగిడారు. తమ తమ అభినందనాలను తెలియజేసుకున్నారు.

## ఇంతకీ ఆ అద్భుత ప్రదర్శనం :

ఇంతకీ ఆ అద్భుత ప్రదర్శనం ఏమిటి? పైకి వ్రేలాడదీసిన చేప ప్రతిబింబాన్ని క్రింద పళ్ళెంలో వున్న నీళ్ళలో పైన వ్రేలాడదీసిన చేప ప్రతిబింబాన్ని చూచి విల్లును పైకి సూటిగా ఎక్కుపెట్టి అర్జునుడు మత్స్య యంత్రాన్ని కొట్టినట్లు ఒక్క దెబ్బతో పైన వ్రేలాడదీసిన పండును కొట్టాడు రాజుగారు. హాలంతా కరతాళ

ధ్వనులతో దద్దరిల్లిపోయింది. అలా అర్జునుడు కొట్టాడనుకున్నారు. కాని రాజుగారు కొట్టగలరని ఎవరనుకున్నారు? ఇదీ రాజుగారి అపార విలువిద్యా ప్రదర్శన.

అలాగే కళ్ళకు గంతకట్టుకుని దూరంగా ఒక మనిషిని నిలబెట్టి అతని చేతికి దారంతో వ్రేలాడగట్టిన నిమ్మపండు అతనిచేతి కిచ్చి అటూ ఇటూ ఊపు తున్నాడు. అలా వూపుతున్న దారాన్ని రాజుగారు అంబుతో తెగగొట్టాడు. పండు క్రిందకి పడింది.

అలాగే నాలుగు నిమ్మపండ్లకు దారాలు కట్టించి, గుండ్రంగా త్రిప్పమన్నాడు. త్రిప్పుతూ వుండగా అంబుతో నిమ్మపండ్లు కట్టిన నాలుగు దారాలను ఒక్క దెబ్బతో తెగగొట్టాడు. నాలుగు నిమ్మపండ్లూ నేలమీద పడ్డాయి.

అలాగే కండ్లకు గంతకట్టుకున్న మరో ప్రదర్శన దూరంగా ఒక బల్ల చెక్కను నిలబెట్టి ఆ చెక్కమీద గుండ్రని కాగితాన్ని అంటించి, దాని ప్రక్కన చిన్న పుల్లతో శబ్దం చేయమన్నాడు. ఆ శబ్దం ఎక్కడనుంచి వస్తూ వుందో దానిని గమనించి అంబును వదిలాడు. అది సూటిగా వెళ్ళి బల్లచెక్కమీద అంటించి వున్న కాగితం మధ్యలో నాటుకుంది. ఇది శబ్దభేది అని మన పురాణాల్లో విన్నాము.

## ఎన్నో అద్భుతాలు :

అలాగే నిలబడివున్న మనిషి తలమీద నిమ్మపండు వుంచి మనిషికి ఏ ప్రమాదమూ లేకుండా తలమీదనున్న నిమ్మపండుకు అంబును నాటటం.

అలాగే ఒక గోడకు ఒక బల్లచెక్కను ఆనించి. ఆ చెక్కముందు మనిషిని నిలబెట్టి కళ్ళు మూసుకుని నుంచున్న మనిషి చుట్టూ బల్లచెక్కకు బాణాలు సంధించడం.

అలాగే అంబు వేగాన్ని తగు మోతాదులో సంధించటం. మరో అద్భుత ప్రదర్శన. మనిషి నుదుటికి ఒక రూపాయి అంటించి రాజుగారు నాలుగు గజాల దూరంలో నిలబడి నొసటిమీద రూపాయి నుంచుకున్న మనిషికి ప్రమాదం లేకుండా ఆ రూపాయిని తగు మోతాదులో బాణాన్ని సంధించి దానిని పడగొట్టటం.

అలాగా నాలుగు గజాల దూరంలో నిమ్మపండు కట్టిన దారం పుచ్చుకున్న ఒకే మనిషిని నిలబెట్టి తాను వెనుకకు తిరిగి విల్లును వీపు వెనుక సరిగా పెక్కుపెట్టి, దారాన్ని తెగగొట్టటం.

ఇలా ఒకటా రెండా? ఎన్నో అద్భుతాలను రాజుగారు ప్రదర్శించారు. ఆ కొంచెంసేపూ ఆయన అపర అర్జునుడులాగే అందరికీ కనిపించారు. బాణాన్ని సంధించే ప్రతిసారీ, ఏమౌతుందోనన్నంత భయభ్రాంతులయ్యే విధంగా ప్రదర్శనం సాగిపోయింది.

## వీరే రాజుగారు :

రాజుగారు ఆజానబాహువు. నెరసిన గిరిజాల జుట్టు. మెలికలు తిరిగిన బుగ్గ మీసాలు. గ్లాస్కో పంచెను సైకిల్‌కట్టు, నిపుణత్వంతో కూడుకున్న దృఢదీక్ష, కొట్టొచ్చినట్లు కనిపించాయి.

విలువిద్య ఆషామాషా విషయం కాదు. ఎంతో సాధన, పట్టుదల, క్రమ శిక్షణ, ఏకాగ్ర లక్ష్యం వుంటేగాని ఈ విద్యను సాధించడం కష్టం. అలా కష్టపడి ఎందరో ఈ విద్యను సాధించారు. ప్రదర్శించారు. ప్రజల మన్నన లందుకున్నారు.

## ఆదరణ లేని అద్భుత విద్య :

ప్రావీణ్యంతో కూడుకున్న ఈ విలువిద్యకు ఈనాడు ఏ ఆదరణా లేదు. జీవన భృతికోసం, వుత్సవాలలోనూ, సభాసందర్భాలలోనూ ప్రదర్శిస్తున్నారు. యుగయుగాలుగా, తరతరాలుగా ప్రజాజీవితంలో భాగమై పోయి అది ఒక మహోజ్వల కళారూపంగా అభివృద్ధిచెంది, అశేష ప్రజాసామాన్యాన్ని అలరించిన నాటి విలువిద్యను ఒక కళారూపంగా అభివృద్ధిపరచాల్సిన అవసరం ఎంతో వుంది.

ఈనాడు జీవించివున్న వృద్ధ కళాకారుల వద్ద వున్న విద్యను వీడియో తీయడం, వారిని ఆహ్వానించి ఆదరించటం, వృద్ధాప్యంలో వున్న వారికి పెన్‌షన్‌లు ఇవ్వడం, ఆ కళాకారులను కాపాడుకోవటం జరగాలి.



# మరెన్నో కళారూపాలు
# మరెందరో కళాకారులు



# జానపదుల జ్యోతి నృత్యం

రాయలసీమలో తొగట వంశస్థులు భక్తితో తయారుచేసిన జ్యోతిని వెలిగించి నెత్తిమీద పెట్టుకుని చౌడమ్మ దేవతను వర్ణించే పాటల కనుగుణంగా చేసే నృత్యం జ్యోతి నృత్యం. ఈ నృత్యాన్ని, పల్లెల్లో 'జ్యోతుల బోనాలు' అని అంటారు. ఈ నృత్యాన్ని ఏడాదికి ఒకసారి మాత్రమే కుల వృత్తిపరంగా చేస్తూవుంటారు. సేసే కులస్థులంతా ఏకమై నృత్యం చేస్తూ ఋణమో పణమో వసూలు చేస్తారు. (తొగట వంశస్థులే, సేసే కులస్థులు. ఈ నృత్యానికి కంచుతో చేసిన తాళాలు, చేతుల చప్పట్లు వుంటాయి. వీటి కనుగుణంగా పాట ననుసరించి తాళగతిని మార్పు చేస్తూ వుంటారు. పాటలన్నీ శివునిపైనా, చౌడమ్మపైనా వుంటాయి.



జ్యోతిని ఇలా తయారుచేస్తారు :

ఊరు బయట స్థలంలో ఆవుపేడతో అలికి ఒకరు స్నానం చేసి, ఉపవాసం చేసి జ్యోతిని తయారుచేస్తారు. గోధుమపిండిని ముద్దగా కలిపి మధ్యలో ఒక కొత్త గుడ్డను మైనపు వత్తిలా తయారుచేస్తారు. రతి పోసిన తరువాత జ్యోతిని దానిపై వుంచి పూజ చేస్తారు.

కాళ్ళకు గజ్జలు కట్టుకుని, ఎర్రటి గుడ్డను నడుముకు అడ్డగుడ్డలా కట్టుకుంటారు. మెడలో కొన్ని హారాలు వేస్తారు. నుదుట బండారుబొట్టు పెట్టుకుంటారు. అలా జ్యోతిని ఎత్తుకుని వుండగా ఆ జ్యోతి చుట్టూ గుండ్రాకారంగా జనమంతా నిలబడతారు. వీరిలో కొద్దిమంది తాళాలు పట్టుకుని ఉంటారు. అందరూ గుండ్రాకారంగా తిరుగుతూ పాటలు పాడతారు. ఒకరు పాట పాడుతూ వుండగా మిగిలిన వారంతా వంత పాడతారు. జ్యోతి నెత్తుకున్న వ్యక్తి పాట కనుగుణంగా అడుగులు వేస్తుంటాడు. జ్యోతులు రెండు మూడు కూడ వుంటాయి. నడిబజార్లో జ్యోతి నృత్యం జరుగుతూ వుండగా, ఆ జ్యోతికి బలిని ఇస్తూవుంటారు.

గణపతి ప్రార్థన :

ఒకరు జ్యోతిని ఎత్తుకుని నట్టనడుమ నిలబడి పాట కనుగుణంగా, చుట్టూ గుండ్రాకారంగా నిలబడి వున్నవారంతా అడుగులు మారుస్తూ తిరుగుతూ వుండగా గణపతి ప్రార్థన ప్రారంభమౌతుంది.

పార్వతీ పుత్రుని పరమేశ్వరుని సూడ
ఎలుక వాహన మెక్కి వెళ్ళే తన వేడ్క
అమరంగ వెనకయ్యను ఆత్మలో తలచేరు
సంతోషమున కల్గు సకల జనులకును

అంటూ అందరి దేవుళ్ళనూ ప్రార్థించి, చౌడమ్మ కదిలే దృశ్యాన్ని కళ్ళకు కట్టినట్లు పాట త్వర త్వరగా సాగుతుంది. అడుగులు త్వర త్వరగా వేయటం, గుండ్రంగా తిరగటం, జ్యోతి నెత్తుకున్న వ్యక్తి గిరగిరా తిరుగుతూ, కళ్ళు పెద్దవి చేసి చౌడమ్మలా కనిపిస్తాడు. తరువాత ఇలా పాడతారు.

కదిలెను చౌడమయంత తోడను గాంభీర్య నాదములతో
రంతులునే మగరాడు చౌడమ రానువు కదిలెను రమ్యముతో
ఎప్పుడు మనకు ఇచ్చిన వరములు యే కొదువా లేదు
తప్పక కొలవండి దారుని లోపల దైవంబసలే చౌడమ్మ.

ఇలా చౌడమ్మను గూర్చి, ఆమె గొప్పతనాన్ని గూర్చి వేనోళ్ళ పొగుడుతూ అనేక గేయాలు పాడతారు.

## రక్తపు బొట్టు:

జ్యోతి నృత్యం చేసుకుంటూ, పాటలు పాడుకుంటూ నడిబజార్లో వెళుతూ వుండగా భక్తులు ఆమెకు జంతు బలుల్ని ఇస్తూవుంటారు. ఆ చౌడమ్మ దేవతను రక్తపు బొట్టుతో అలంకరిస్తారు. ఒకరే ఒక్క వేటుతో పొట్టేలు తలను నరుకు తాడు. క్రిందబడిన రక్తం దాటుకుంటూ జ్యోతి వెళుతూవుంటుంది. చివరికి దేవత లనూ, చౌడమ్మను స్తుతిస్తూ మంగళం పాడుతారు.

జ్యోతి నృత్యాన్ని చూస్తున్న శ్రోతలు రెండు చేతులెత్తి మ్రొక్కటం, భక్తితో ఇంటి దగ్గరకు వెళ్ళేటప్పుడు టెంకాయలు కొట్టి ఎవరికి వారు బలి ఇస్తారు. స్త్రీలూ, పురుషులూ కూడ గుంపుతో కలిసి నృత్యం చేస్తారు. 'చౌడమ్మా' అంటూ బిగ్గరగా అరుస్తూ చేతులెత్తి మ్రొక్కుతారు. ఇలా నృత్యం చేసే గ్రామాలు — ధర్మవరం, రేగాటివల్లె, పెద్దకోట్ల, డా॥ బిగిచర్ల కృష్ణారెడ్డిగారి సౌజన్యంతో (జానపద నృత్యకళ నుండి.)

# జాలరి నృత్యం

ఈ తరంవారికి తెలియని పడవ పాటలు, జాలరి పాటలు ఎన్నో వున్నాయి. ఇవి కంఠస్థంగానే తప్ప, ఏ గ్రంథంలోనూ పొందుపరచలేదు. నలభై సంవత్సరాల క్రితంవరకూ మన రవాణా అంతా నదుల ద్వారా, కాలువల్లో పడవల ద్వారా జరిగేది. ప్రయాణీకులు కూడ పడవలలోనే ప్రయాణం చేసేవారు. ఈనాడు రవాణా అంతా రైళ్ళద్వారా. లారీలద్వారా జరగటం వల్ల పడవల రవాణా తగ్గిపోయింది. జాలర్లంతా ఈ పడవలద్వారా జీవించేవారు. అయితే ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో పడవల రవాణా సాగుతూనే వుంది.



జాలర్లు పడవల్ని తెరచాపలు గట్టి గాలి వాటాన పడవల్ని నడిపేవారు. గాలి లేనప్పుడు పడవ సరంగులు పడవకు తాడుకట్టి కాలువగట్టున నడుస్తూ లాగేవారు. బరువైన పడవల్ని అతికష్టంగా అరుపులతో, కేకలతో పాటలతో పడవల్ని లాగేవారు.

పాటల్ని లయబద్ధంగా పాడుతూ తాళబద్ధమైన అడుగులతో పాటలు పాడుతూ తమ శ్రమనంతా మర్చిపోయేవారు. పల్లెలు ప్రక్కగా ప్రవహించే ఈ కాలువల్లో పల్లెవారు పాడే పాటలు రాత్రిందివళ్ళు అతి శ్రావ్యంగా వినిపించేవి. వీటిలో శృంగారంపాలు ఎక్కువగా వుండేవి. ప్రకృతిని గురించీ, పరిసరాలను గురించీ పాటలు పాడేవారు.

సంపత్కుమార్ :

పడవసరంగులుగా, జాలరులుగా కొంతమంది వేషాలు ధరించి రంగస్థలం మీద జాలరుల వేషాలతో గడపట్టి పడవ నడపటం, చుక్కాని పట్టటం, తెరచాప ఎత్తటం మొదలైన అభినయాలతో విద్యార్థులు మొదలైనవారు అక్కడక్కడ ప్రదర్శించేవారు.

కాని ఈ జాలరి వేషాన్ని విజయనగరంకు చెందిన డి. వై. సంపత్కుమార్ తన నాట్యప్రదర్శనలతోపాటు ఈ వేషాన్ని అత్యద్భుతంగా ప్రదర్శించి జాతీయ

అంతర్జాతీయ ప్రఖ్యాతి వహించారు. అవార్డుల నందుకున్నారు. ప్రజానాట్యమండలి కళాకారుడుగా ఈ కళారూపాన్ని దేశ మంతటా ప్రదర్శించారు.

ఆంధ్రజాలరిగా ప్రఖ్యాతి వహించిన సంపత్కుమార్ జాలరి వేషం ధరించి ఉదయానే లేచి ఎంతో సంతోషంగా చేపలు పట్టటానికి తన నావతో సముద్రంలోకి వెళతాడు. చేపల కోసం గాలిస్తాడు. ఇంతలో కారుమేఘాలతో తుఫాను కమ్ముకుంటుంది. పడవ వూగిపోతూ వుంటుంది. జాలరి మెలికలు తిరిగిపోతాడు. ఇంతలో ఒక పెద్ద చేప గాలానికి తగుల్కొని జాలర్ని అతలాకుతలం చేస్తుంది. అయినా పట్టు విడవని జాలరి పడవలో తలక్రిందులైపోతూనే ఎంతో కష్టపడి ఆ చేపను ఒడ్డుకు చేర్చటం తుఫానుహోరు తగ్గిపోవటంతో విజయవంతంగా ఆనందంతో గంతు లేస్తాడు. ఈ ప్రదర్శనానికి రంగస్థలం తెరమీద బ్యాక్ ప్రొజక్షన్‌తో సముద్ర హోరుని చూపిస్తారు. ఉరుముల్ని, మెరుపుల్ని లైటింగ్‌తో జిగేలుమనిపిస్తారు. నేపథ్యంలో సన్నివేశాన్ని అనుసరించి తబలా ధ్వనులు అద్భుతంగా సహకరిస్తాయి. ఈ కళారూపాన్ని అత్యద్భుతంగా సృష్టించిన ఘనత సంపత్కుమార్‌కు దక్కుతుంది. ఈ కళారూపానికి సంబంధించిన పడవ పాటల్ని ప్రజా నాట్యమండలి రాష్ట్రదళం జాతీయ సమైక్యతకు ఉపయోగించింది.

# సుగాలీ నృత్యం

సుగాలీలంటే లంబాడీలు. ఈ నృత్యాన్ని, లంబాడీ, బంజారా తాండా నృత్యమనీ పిలుస్తారని, డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు తమ జానపద నృత్య కళాగ్రంథంలో వుదహరించారు.

అయితే వీరు ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనులుగానే మిగిలిపోయారు. పల్లెలకు దూరంగా కొండ కోనల్లో నివసిస్తూ కట్టెలు కొట్టి అమ్ముకుంటూ, కూలిపనులతో జీవనం సాగిస్తారు. వీరు కష్టజీవులు. పండగల్ని, పబ్బాలనూ సాంప్రదాయరీతిలో చేస్తారు.

వీరి వేషధారణలో, స్త్రీలు ప్రత్యేకమైన దుస్తుల్ని ధరిస్తారు. లంబాడీలను చూసిన వారికి వారి వేషధారణ విదితమే....వీరు తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా వున్నా - అనంతపురం జిల్లాలో కూడా వున్నారు; వీరు ధర్మవరం మండలంలో ప్రతి సంవత్సరం కాముని పున్నమిరోజున తప్పకుండా నృత్యం చేస్తారు. మత్తు పానీయాలు బాగా సేవించి స్త్రీలు నృత్యం చేస్తారు.

వీరి నృత్యంలో ముఖ్యంగా చేతులు చూపించటం, వలయాకారంగా తిరగటం చేస్తారు. ఈ నృత్యాన్ని స్త్రీ పురుషులిరువురూ కలిసే చేస్తారు. ఒక పురుషుడు ప్రత్యేకంగా డప్పు కొడతాడు. డప్పు వరుసలకు అనుకూలంగా స్త్రీలు రకరకాల అడుగులు వేస్తూ గుండ్రంగా తిరుగుతారు.



వీరి నృత్య బృందంలో 10 మంది వరకూ పాల్గొంటారు. వారి సంప్రదాయ దుస్తుల్ని ధరిస్తారు, కాళ్ళకు గజ్జెలు కడతారు. చప్పట్లు చరుస్తూ వలయాకారంగా శబ్దానికి అనుగుణంగా నృత్యం చేస్తారు. లయ ప్రకారం చప్పట్లు చరుస్తూ వుంటే మిగతా వారు పాటను ఆలాపిస్తారు.

వీరి పాటలన్నీ వారి గురువైన 'సేవలాక్' మీదనే పాడుతారు. ప్రథమంగా అందరూ నిలబడి ముందుకువంగి చేతులతో చప్పట్లు కొడుతూ ఈ విధంగా పాడతారు.

కోయినారియే కోచళో సోసో
కోయినారియే కూణిన చోడో
కోయినారియే శంక్రనచోడో
కోయినారియే కాయ్ అంకుదీచ
కోయినారియే రవియ్యాదీచ
సుమసోతితి జోర జానలిజో.

అంటూ గిర్రున తిరిగి శరీరాన్ని కిందికి పైకి వంచుతూ లేస్తూ చేతుల్ని పైకెత్తి చప్పట్లు కొడుతూ గుండ్రంగా తిరుగుతూ ఆదే సమయంలో పాడే పాటను ఒకరు పాడుతుండగా, మిగిలిన వారంతా ఈ విధంగా వంత పాడతారు.

బాలే పెంచనే వెంటాపర్ రెడిబోలిరీచ
రెడి బోలరీచక్ జినందేకరేచ
సావుకార్ భీకియ్యార్ చోరలూటోరేచ
బాయే పెంచనే వెంటాపర్ రెడి బోలిరేచ

రెడి బోలిరీచక్ జనండేకరేచ
సావుకార్ హనుమంతరెడ్డిర్ చోరలూటోరేచ.

అంటూ పాటలు పాడుతూ నృత్యం చేస్తారు. సుగాలీలు నివశించే ప్రాంతాన్ని తాండా అంటారు. వీరిని లంబాడీలు అని పిలుస్తారు.

## నామాల సింగని నృత్యం

రాయలసీమలో ఉగాది పండుగకూ, పీర్ల పండుగకూ ఉరుసు సందర్భాలలోనూ, తిరుణాలలోనూ నామాలసింగని నృత్యం చేస్తూవుంటారు.



ముఖానికి నల్లటి బొట్లుపెట్టి ఎఱ్ఱటిరంగు మచ్చల్లాగా అలంకరణచేసి నుదుట నామాలు పెడతారు. నాలుకమీద మరో పెద్ద నాలుకను పెంచి, తలమీద రుమాలు చుట్టి వేపమండల్ని దోపుతారు. రెండు చేతుల్నీ పెనవేస్తూ గొలుసుతో కడతారు. రెండు చేతుల్లోనూ పిడిబాకు లుంటాయి. నడుముకు చుట్టూ దట్టిగుడ్డ కడతారు. ఎఱ్ఱటి సల్లడం తొడుక్కుంటారు. కాళ్ళకు గజ్జెలు కడతారు. ఇలాంటి అలంకరణ చేసిన తరువాత రెండు చేతులకూ, భుజాలకూ నూలు త్రాళ్ళతో రెండుప్రక్కలా పట్టుకుంటారు. తరువాత తప్పెట దరువులకు అనుకూలంగా నామాల సింగడు అడుగులు వేస్తాడు. పగ్గాలు పట్టుకున్నవాళ్ళు అతనికి అనుగుణంగా అడుగులు వేస్తూ తిరుగుతూ వుంటారని, డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు జానపద నృత్యకళలో వివరించారు.

నామాల సింగడు ముఖ్యంగా రెండు చేతుల్ని పైకి ఎత్తుతూ కత్తుల్ని వేగంగా తిప్పుతూ ఒక్కొక్క కాలిని వెనక్కీ ముందుకీ నేలపై తాటిస్తాడు. మీసాలను మెలివేస్తూ వుంటాడు. ఎర్రని నాలుక వ్రేలాడుతూ వుండగా స్మారకం వచ్చినట్లు సోలిపోతాడు. అప్పుడప్పుడు నేలమీద కూర్చుంటూ ఒక్కొక్క కాలిని వెనక్కి చాపుతూ అడుగులు వేస్తాడు. అడుగులు బస్కీలు తీసినట్లుంటాయి. అడుగులకు తగినట్లు తప్పెట వాయిద్యగతులు ఇలా వుంటాయి.

మొదటిసారి—

జెగ్ నకన్
జెగ్ నకన్
జెగ్ నకన్

నామాల సింగడు రెండు కాళ్ళను, రెండు చేతుల్ని ఒక్కసారిగా కదిలుస్తూ గుంపు మధ్యలో వస్తూ వుంటాడు. వెంటనే ఒక్కసారిగా తప్పెట తిరగ మారుస్తాడు.

జెగ్ జెగ్ నకన్
జెగ్ జెగ్ నకన్
జెగ్ జెగ్ నకన్

అలా గుంపులోని స్త్రీ, పురుషులు చూస్తుండగా తప్పెట్లు వెనక్కి వెనక్కి సర్దుకుంటూ, గతులు మార్పు చేసుకుంటూ పోతారు. మూడు లేక ఐదు తప్పెటలు కొడుతూ వుంటారు. అడుగులు బిర బిరా వేసేటప్పుడు తప్పెట గతి మార్చేస్తాడు.

ఇలా తప్పెట గతులు మారుతున్నప్పుడు నామాల సింగడు కొద్దిసేపు విరామం తీసుకుంటారు. అప్పుడు ముఖానికి అడ్డంగా గుడ్డను కప్పుతారు. అతనిపై మరమరాలు చల్లుతారు. ఎర్రనీళ్ళు దిగతీస్తూ పోతారు. ఇవన్నీ చేయటం, నామాల సింగనికి ఎటువంటి ఆటంకాలు రాకుండా చూడాలని చేస్తారట. ఇలా గుంపు అందరికీ చూపించి ఇంటికి వెళ్తాడు. ఈ చరిత్రకు ఈ ప్రాంతంలో ఇలా ప్రచారంలో వుంది.

నామాల సింగడంటే :

నామాల సింగడనే పేరు గలిగిన వ్యక్తి ఈ ప్రాంతంలో దారి దోపిడి చేసేవాడట. సంత కెళ్ళి సరుకులు తీసుకువస్తున్న స్త్రీ, పురుషుల్ని బలవంతంగా బట్టలు ఊడదీయించి కోలాటం వేయించేవాడట. దీనికి చుట్టూ గ్రామస్థులంతా ఏకమై అతన్ని పట్టి బంధించి గ్రామంలో తాళ్ళతో కట్టి పట్టుకుని వచ్చారట. అప్పుడు నాలుక బయటికి వచ్చి వూగుతూ కాళ్ళు తేలిపోయి అలా అలా నేలపై ఈడుస్తూ వచ్చాడట. గ్రామంలోకి వచ్చిన తరువాత చంపేశారట. దీనికి నిదర్శనం ఈ నామాల సింగని నృత్యం. ఈ నాటికీ రాయలసీమ ప్రాంతంలో మొహరం పండుగ నాడు తప్పనిసరిగా చేస్తున్నారట. సింగని వేషంలో పాల్గొనే కళాకారులు—గొట్టూరి ఓబిరెడ్డి, చాకలి కొండన్న, హరిజన గంగప్ప, బోయిల ఆదినారాయణ, హరిజన నాగన్న మొదలైనవారని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు వారి జానపద నృత్యకళలో పేర్కొన్నారు.

# సిద్దీ నృత్యం

హైదరాబాదు ప్రాంతంలోని సిద్దీలు చేసేది సిద్దీ నృత్యమనీ, ఇది జానపద నృత్యం కాదనీ పుట్టుకతో సిద్దీలు, ఆఫ్రికన్లు. 14 వ శతాబ్దం మధ్య భాగంలో (అరబ్బులు, టర్కీలు, ఇరానీలు) మొదలైన ముస్లిం జాతులవారు హైదరాబాదుకు వాని సలగా వలస వచ్చారనీ జానపద నృత్యకళా గ్రంథంలో డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి గారు ఉదహరించారు.

వీరు నైజాం నవాబు సేనల్లో నియమితులై నిజాం ప్రత్యేక అంగరక్షక దళంగా వారు పేరు పొందారు. వీరి నృత్యాల్లో వాటి పూర్వపు ఆఫ్రికా రీతులు ఇంకా నిలిచాయి.

యుద్ధ నృత్యాల్లో ఖడ్గనృత్యం ప్రత్యేకమైనది. ఈ నృత్యాన్ని వివాహ సందర్భాల్లో చేస్తారు. నృత్యం చేసేవారు రంగు రంగుల లుంగీలు ధరించి, నడుముకు బెల్టు బిగించి, బెల్టులో బాకును ధరించి, చేతితో ఖడ్గం పట్టి నృత్యం చేస్తారు. నృత్యకారులు అర్ధ వలయాకారంలో ఏర్పడి వెనుక పాడే వంత పాటకు రక రకాల ఖడ్గ యుద్ధ రీతులు ప్రదర్శిస్తారు. వేగం ఎక్కువయ్యే కొద్దీ నృత్యం పరాకాష్ట నందుకుంటుంది. ఆ సమయంలో నృత్యకారులు బాకుల్ని నోట కరుచుకుని పైకి ఎగురుతారు. నవదంపతుల్ని ఆశీర్వదించే నినాదాలు చేస్తూ నృత్యంతో రంగం అవతలికి వెళతారు. డప్పు వాయిద్యం సిద్దీ నృత్యానికి భిన్నంగా వుంటుంది. దీని రీతి ఎక్కువ ప్రసన్నం. నృత్యం అనటం కంటే వాద్యగోష్టి అనవచ్చు నంటారు కృష్ణారెడ్డిగారు.

# కారువా మేళ నృత్యం

తెలుగు నాట వర్ధిల్లిన జానపద కళారూపాలన్నీ అన్ని ప్రాంతాల్లోనూ ప్రచారంలో వున్నాయి. కొన్ని ముఖ్యమైన కళారూపాలు తప్పా మిగిలినవన్నీ ప్రాంతీయంగా అభివృద్ధి చెందాయి. అలా ప్రాంతీయంగా అభివృద్ధి పొందిన కళారూపం కారువా నృత్యం. ఇది ఒక్క తూర్పు గోదావరి జిల్లాలో మాత్రం ఈ నాటికీ ప్రచారంలో వుందంటారు.

రాధాకృష్ణుల రాసలీలలు మాదిరి సమ సంఖ్యలో ఎనిమిది మంది గోపికలు గాను, మరో ఎనిమిది మంది కృష్ణులుగాను వేషాలు ధరించుకుని, వలయాకారంగా నిలబడి నృత్యం చేస్తూ వుంటే వలయాకారపు మధ్య రాధాకృష్ణులు నాట్యమాడుతూ వుంటారు.

పరుసక్రమంలో కృష్ణుడు, తరువాత గోపిక, మరల కృష్ణుడు, మరల గోపిక. ఇలా గుండ్రంగా నిలబడి నృత్యం చేయడాన్ని కారువా మేళంగా వర్ణించారు. దీనిని గురించి నాట్య శాస్త్రాల్లో 'కర్షణీ' నర్తనంతో పోల్చవచ్చు నంటారు. నటరాజ రామకృష్ణగారు. ఉత్తర భారతదేశంలో ఈ నృత్యం రాసలీలా నృత్యంగా విరాజిల్లుతూ వుంది.

## ప్రదర్శన తీరు:



కారువా నాట్యం కేవలం సంగీత వాయిద్యాల ఆధారంతోనే ప్రదర్శింపబడుతుంది. ఇందులో పాటలు పాడటం చాలా తక్కువ. వాద్య సంగీతం ప్రారంభమై ఉధృత లయతో అంతమొందుతుంది. నృత్యంకూడా ఆ వాయిద్యాల వేగానికి అనుగుణంగా ప్రారంభమై వేగాన్ని పుంజుకుంటుంది. పతాకస్థాయి నందుకున్న తరువాత మళ్ళీ ప్రాథమిక లయకు మారుతుంది.

ఈ నృత్యం గతి ప్రాధాన్యం కలిగినటువంటిది చతురశ్ర, తిశ్ర మిశ్ర గతులు ఈ నాట్యంలో ముఖ్యంగా ప్రయోగించబడతాయి. ఏ గతిలో ఈ నృత్యం ప్రదర్శింపబడినా ముగింపు మాత్రం చతురశ్రంలోనికి వచ్చి ముగుస్తుంది.

## లీలా నర్తనం:

కారువా నాట్యంలో ఒక ప్రత్యేక భాగాన్ని లీలా నర్తనమని పిలుస్తారు.

ఈ నృత్యంలో ముఖ్యంగా రాధాకృష్ణ పాత్రలు ప్రాముఖ్యం వహిస్తాయి. గోపికలూ, కృష్ణులూ నాట్యమాడి నిలబడి పోయిన తరువాత వలయం మధ్యలో వున్న రాధాకృష్ణ పాత్రధారు లిరువురూ నృత్యాన్ని ప్రారంభిస్తారు. వివిధ రకాల విన్యాసాలతో ఆ నృత్యం కనుల పండువుగా వుంటుంది. మధ్య మధ్య కృష్ణుని

చేతిలోని మురళిని రాధ కొంటెగా లాగుకొని, తానే కృష్ణునిగా వేణువును వూదుతూ తానే కృష్ణుడుగా భావాభినయాన్ని చేస్తుంది. దీనిని లీలా నర్తన మంటారు.

ఎనిమిది మందిగాని, పద్దెనిమిది మందిగాని ఎందరున్నా సమసంఖ్యలో పాల్గొని మాత్రమే నృత్యం చేస్తారు. శిథిలమైపోతున్న ఈ కళారూప సంప్రదాయాన్ని కాపాడటం ఎంతైనా అవసరం.

# యామయ్య స్వామి నృత్యం

ఈ నృత్యం ఆంధ్రదేశంలో ఎక్కడా కనిపించదు. ఇది ప్రాంతీయ నృత్యం. ఇలాంటి ప్రాంతీయ నృత్యాలు ఆంధ్రదేశంలో అక్కడక్కడ వున్నా అవి ఎక్కువ ప్రాచుర్యంలోకి రాలేకపోయాయి. స్థానికంగానే పరిమితమైపోయాయి. అలాంటిదే ఈ యామయ్య స్వామి నృత్యం. అనంతపురం జిల్లాలో వుందని డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు తమ జానపద నృత్య కళారూపాలు గ్రంథంలో వివరించారు.



యోగి వేమన శిష్యులమంటూ ఒకప్పుడు కాషాయవస్త్రాలు ధరించి గుఱ్ఱంపై వస్తూవుండగా గుఱ్ఱం ముందుభాగాన గొర్రె పొట్టేలు వచ్చేది. వారు ప్రతి గ్రామాన్నీ పర్యటిస్తూ వెళుతూ వుంటే వీరికి భోజన సదుపాయాలు చేసేవారు.

యామయ్యస్వామి కాషాయ వస్త్రాలు ధరించి గుఱ్ఱం ఎక్కి వడివడిగా వచ్చేవాడు. ముందు పొట్టేలు పరుగెత్తేది. గ్రామస్థు లందరూ అమిత భక్తి శ్రద్ధలతో ఆ దృశ్యాన్ని తిలకించేవారు. గుఱ్ఱం అడుగులతో కదనుత్రొక్కేది. గ్రామ మధ్యలో గుఱ్ఱాన్ని సకిలింపచేసే వారు. ముందరి కాళ్ళను కళ్ళాన్ని లాగిపట్టి పైకి ఎత్తించే వాళ్ళు. ఇలా యామయ్య స్వామే గుఱ్ఱంతో చేయించేవాడు. గుఱ్ఱాన్ని ప్రేక్షకుల ముందు గుండ్రంగా త్రిప్పుతూ వుండేవాడు. ఈ కళారూపం ఇటీవల కాలంలో మరుగున పడిపోయింది. ఇప్పుడు యామయ్య స్వాములు రావడం లేదు.

# సాఖి మేళం

సాఖిమేళం అనే కళారూపం ఆంధ్రదేశంలో ఎక్కడా కనిపించదు. కాని ఒరిస్సా సరిహద్దుల్లో వున్న ఆయా పట్టణాల్లోనూ, పల్లెలలోనూ పైన పేర్కొన్న సాఖి మేళాన్ని ప్రదర్శిస్తూ వుండేవారు. కళాకారు లందరూ ఆంధ్రదేశంలో స్థిరపడిపోయిన ఒరియావారు. దీనినిబట్టి బహుశా ఈ కళారూపం ఒరిస్సాలో బహుళ ప్రచారంలో వుండవచ్చును. ఈ మేళం పేరు సాఖిమేళం. అంటే సఖీ మేళం అని దీని అర్థం. ఈ మేళం మన ప్రాంతాల్లో ప్రదర్శించే దేవదాసీమేళం లాంటిది. వివాహ సమయాల్లో మేజువాణీలు భోగంవారు ఎలా చేసేవారో వీరూ అలానే చేస్తారు. ఇంతకూ ఈ మేళంలోని వారందరూ యుక్త వయస్సులోనున్న యువకులు స్త్రీ పాత్రలను ధరిస్తారు. అందరూ ఇరవై సంవత్సరాల లోపువారే. వారి స్త్రీ పాత్ర వేషధారణ యవ్వనంలోవుండి మిటమిటలాడే అందకత్తెల



అందచందాల్ని మించి వుండేది. వారి స్త్రీ పాత్రల వేషధారణకూ, అభినయానికీ పురుష లందరూ ముగ్ధులైపోయి మేళంలోనివారందరూ స్త్రీలే నన్నంత భ్రమలో పడి పోయేవారట. వారు కొన్ని ఒరియాపాటలు పాడినా, ఎక్కువగా తెలుగు పాటలనే పాడుతారట.

ముఖ్యంగా వివాహ సమయాల్లోనూ, వుత్సవాల సమయాల్లోనూ ప్రదర్శన లిస్తారు. వీరు ఎంతో శ్రావ్యంగా పాడుతారు... సాఖిమేళ ప్రదర్శనమంటే ప్రజలు తండోపతండాలుగా విరగబడి చూసేవారని, ఆ ప్రదర్శనాలను దర్శించిన పెద్ది ఈశ్వరరావుగారు తెలియజేస్తున్నారు.

ఈ మాదిరి కళారూపాన్నే పగటి వేషధారియైన మున్నపువీరయ్యగారి పగటి వేషాల పరంపరలో మన ప్రాంతపు భోగం మేళాన్ని ప్రదర్శించేవారు. అచ్చంగా పైన ఉదహరించి సాఖి మేళానికి నకలుగా వుండేది. అంత అద్భుతంగానూ ప్రదర్శనం వుండేది. ఆ విధంగా వీరయ్యగారు తప్ప మరి ఒకరు ప్రదర్శించేవారు కారు.

అలాంటిదే సాఖిమేళం. ఈ కళారూపానికి ఆ ప్రాంతాలలో కూడా అంతగా ఆదరణ లేకపోవడంవల్ల కనుమరుగైనా ఒకప్పుడు ఒరియా సరిహద్దు ప్రాంతపు ఆంధ్ర ప్రజలందర్నీ అలరించిన కళారూపం.

# గావులాటలు

ఈనాటికంటే ఆనాడు పల్లెప్రాంతాల్లో మూఢనమ్మకాలు ఎక్కువగా వుండేవి. గ్రామంలో కలరా లాంటి ఏ అంటువ్యాధి సోకినా, పశువులకు వ్యాధులు సోకినా అమాంతం గంగానమ్మకో, మహలక్ష్మమ్మకో, మారెమ్మకో, మరిడమ్మకో, మహంకాళికో, నాంచారమ్మకో కోపం వచ్చి ఈ విధంగా జరిగిందనీ, ఇది గ్రామానికి కీడనీ, ఈ గ్రామదేవతల్ని తృప్తి పరిస్తే గ్రామం సుఖంగా వుంటుందనీ ఎంచి జాతర్లూ జంతు బలులూ చేస్తూ వుంటారు.



ఈ జాతర్లలో గణాచార్లు అధిక ప్రాముఖ్యం వహిస్తారు. సాక్షాత్తూ ఆయా దేవతలు వారిలో ప్రవేశించి ఆవేశపూర్వకమైన పూనకంతో నృత్యం చేస్తూ వరాల నడుగుతూ, ఊగిపోతూ, డప్పు వాయిద్యాలకూ, వీరణాలకూ, కొమ్ముబూరలకూ అనుగుణంగా నృత్యం చేస్తారు. ఈ నృత్యం చాలా ఆవేశపూరితంగా వుంటుంది. గణం పూనిన వ్యక్తి ఒక విలక్షణ వ్యక్తిగా కనిపిస్తాడు. సాక్షాత్తూ గ్రామ దేవతలా నే ప్రవర్తిస్తాడు.

తల విరబోసి, వేపమండలు చేతబూని, పసుపుకుంకాలతో అలంకరించుకుని గరగను నెత్తిన బెట్టుకుని విన్యాసం చేస్తాడు. క్రమేపీ గణం తగ్గిన తరువాత లాస్యంగా నృత్యం చేస్తాడు. ఈ గరగలను కొన్నిచోట్ల ఘటంకుండ అంటారు. ఒకో ప్రాంతంలో ఒకోరకంగా పిలుస్తారు. గరగ ఇత్తడితో కుండలా చెయ్యబడుతుంది. కుండ మూతిచుట్టూ పడగ విప్పిన పాము చుట్టబడి వుంటుంది. ఆ గరగకు కుచ్చిళ్ళు పోసి కోకలాగా అలంకరిస్తారు. పసుపు, కుంకుమ వేపఆకులతో అలంకరిస్తారు. ఆ కుండను పవిత్రంగా గ్రామప్రజలు చూస్తారు.

గరగల నెత్తుకుని పూనకంతో ఊగిపోయే వారిని కొన్ని ప్రాంతాల్లో ఆసాదు లంటారు. మరికొన్ని ప్రాంతాల్లో గణాచార్లు అంటారు. అంటే ఆయా దేవతలకు వారే పూజారు లన్నమాట. ఈ పూజారుల పూనకం ఒకోసారి తారాస్థాయికి చేరుకుంటుంది. ఎన్ని కొబ్బరికాయలు కొట్టినా ఎంత సాంబ్రాణిధూపం వేసినా, ఆ మత్తులో నుండి క్రిందకు దిగరు. ఒళ్ళు అలిసిపోయిన తరువాత గారంతట వారే శాంతిస్తారు. వీరిని ప్రజలు సాక్షాత్తు దేవతల్లానే ఆరాధించి గౌరవిస్తారు.

ఈ ప్రదర్శన గ్రామవీధుల్లో జరుగుతుంది. ఈ గణాచార్ల నృత్యాన్ని గావె అంటారు. గణం తగ్గడానికి కోడిపిల్లల్ని అందిస్తారు. వాటిని నోటితో కొరికి రక్తాన్ని రొమ్ము మీదకు జారవిడుస్తారు. ఆ సమయంలో వాయించే ఉధృత వాయిద్యాలు చూపరులకు కూడ ఉద్వేగాన్ని కలిగిస్తాయి. గ్రామమంతా ఈ సందరాల్లో పాల్గొంటారు. తెల్లవార్లూ జాగారం చేస్తారు. ఆ తరువాత ఆ దేవతల్ని గ్రామ పొలిమేరలో వదిలివేస్తారు.

# నూనెగుడ్డలవారు

ఒకో ప్రాంతంలో ఒకో కళారూపం అభివృద్ధి పొందింది. అయితే రాష్ట్ర వ్యాపితంగా ఏ ఒక్క కళారూపమూ వ్యాప్తిలో లేదు. అలా చూసుకున్నప్పుడు, ఈ నూనెగుడ్డలవారు ఎక్కువగా తెలంగాణాలో వున్నారు. వీరిలో కొంత మరాటీతనం కనిపిస్తుంది. అందుకు కారణం మరాటీ కళారూపమైన తమాషాలో ఉపయోగించే ఏకతారను వీరు ఉపయోగిస్తున్నారు.



వీరు రంగు రంగుల అందమైన గుడ్డలమీద, గవ్వల్ని బెల్టులుగా కుట్టి, వరుసలు వరుసలుగా అలంకరిస్తారు. మరో విశేషమేమిటంటే, వీరు ధరించే గుడ్డలు నూనెతో తడిసి వుంటాయి. అందువల్లనే వారికి ప్రత్యేకంగా నూనెగుడ్డలవారు అనే పేరు వచ్చింది.

మెడలో గవ్వల హారాల్ని వరుసలుగా ధరిస్తారు. నుదుట పెద్ద సింధూరపు బొట్టును ధరిస్తారు. తలకు గంభీరమైన తలగుడ్డను చుడతారు, చూపరులకు ఒక విలక్షణమైన వ్యక్తిగా, మంత్రగాడుగా కనిపించే ఇతడు జ్యోతిషాస్త్రీ, గ్రహాల కదలికలను చెప్పడు. అయితే వీరు నోటితో పల్లించే సాహిత్యం మాత్రం, ఒకదానికొకటి పొంతనలేకుండా వుంటుంది. ఈ రకంగా వీరు, ఈ విద్యద్వారా, గ్రామ ప్రజలను ఆకర్షించి, వారికి భవిష్యత్తును చెపుతూ, గ్రహదోషాలను తొలగిస్తూ, యాచనచేస్తూ జీవిస్తున్నారు. వీరికోసం ఎదురుచూసేవారు తెలంగాణా పల్లెలలో ఎంతోమంది వున్నారు.... వీరి వేషధారణే పెద్ద ఆకర్షణ.

# ఫకీరు వేషాలు

ఫకీర్లు ముస్లిం కులంలో ఒక తెగ. వీరు ముఖ్యంగా ముస్లిములనే యాచిస్తారు. ప్రత్యేకంగా వీరు ముస్లిములనే యాచిస్తారు. గనుక, ముస్లిములు వీరిని ఆద రిస్తారు.

అల్లాను సంస్మరిస్తూ, అల్లాకెనాం జపిస్తూ ఇంటింటికీ తిరుగుతూ, ముస్లిము లను ఆశీర్వదిస్తారు. కళారూపాలన్నీ ప్రథమంలో ఒకందుకు ఏర్పడినా తరు వాత అవి వివిధ రీతులుగా ఎలా పరి ణామం చెందాయో ఈ ఫకీరు వేషాలు కూడా అంతే.



వీరు ఒక పెద్ద కంజీరాను చేతిలో ధరించి, తలకు పెద్ద తలపాగా చుట్టి, మెడలో ఫకీరు పూసలు ధరించి, పొడు గాటి లాల్చీలను ధరించి, మొలకు గళ్ళ లుంగీలను ధరిస్తారు. ప్రతి జట్టుకూ ఇద్దరు ముగ్గురు వుంటారు. మధ్యలో పాటకుడు పాట పాడుతూ వుంటే మిగిలిన ఇద్దరూ అల్లాకేనాం అంటూ వంత పలుకుతారు.

ఉదాహరణకు:

| | |
|---|---|
| పాడిపంటల్ సల్‌గుండాలి | ॥అల్లా కెనాం॥ |
| తల్లి పిల్లల్ సల్‌గుండాలి | ,, |
| తల్లీ కొడుకుల్ సల్‌గుండాలి | ,, |
| హిందూ ముస్లిం లంతా | ,, |
| వారు హేకం కావాలండి | ॥అల్లా కెనాం॥ |

అంటూ పాడుతూ, మధ్య మధ్య రక్తి కొరకు కర్రతో చేయబడ్డ, ఒక రకమైన కిర్రుశబ్దంవచ్చే, దానిని చేతిలో ధరిస్తారు. హైస్కూలు కాలేజీ విద్యార్థులు వారి వారి వార్షికోత్సవాలలో, ఈ కళారూపాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. ఈ కళా రూపాన్ని ఆంధ్రప్రజా నాట్యమండలి, హిందూమత సామరస్యం కొరకు ఉపయో గించి ఆంధ్ర ప్రజలలో విశేషంగా ప్రచారం చేశారు.

# చుట్టు కాముడు

పిల్లలు బొడ్డెమ్మ ఆడుతారు. పెద్దలు బతుకమ్మ ఆట ఆడుతారు. ఇందులో నృత్యమూ, పాటా కలసి కట్టుగా వుంటాయి. బొడెమ్మ, బతుకమ్మ, చుట్టకాముడు ఈ మూటి నృత్యగానాలు దాదాపు ఒకేలాగా వుంటాయని, జయధీర్ తిరుమలరావుగారు ప్రజాసాహితి సంచికలో ఉదహరించారు.



ఈ మూడు రూపాలూ, నాట్లువేసే సమయంలోనూ కలుపుతీసే సమయంలోనూ, కోతల సమయంలోనూ, నూర్పిడి సమయంలోనూ ఏర్పడిన స్వరూపాలే.

కలుపుతీసే సమయంలో పాడుకునే పాటనే స్త్రీలు విరామ సమయంలో బతుకమ్మ పాటగా పాడుకుంటారు. రానురాను బతుకమ్మ పాటలో శారీరకమైన పనిపోయి నృత్యం చోటు చేసుకుంది కలుపుతీయడమనే చేతుల శ్రమ చప్పట్లు కొట్టడంగా మారింది.

పనిపాటల్లో శ్రామిక స్త్రీలు తమ జీవితాన్ని పాడుకున్నా, పండుగల సందర్భంలో గౌరమ్మమీదో, బొడ్డెమ్మమీదో పాడుకోక తప్పదు. కాని తెలంగాణా ప్రజాపోరాట కాలంలో, పోరాట జీవిత కథలనే, బతకమ్మ పాటల్లోనూ, చుట్టు కాముడు నృత్యాల్లోనూ ప్రతిబింబించారు.

## శక్తివంతమైన కళారూపం :

తెలంగాణా పోరాట కాలంలో నల్లగొండ జిల్లాలో చుట్టకాముడు చాలా ప్రసిద్ధిపొందింది. నైజాం ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పిస్తూ కుందూరి ఈశ్వర దత్తులాంటివారు కూడా చుట్టకాముడు చాలా శక్తివంతమైన కళారూపంగా పేర్కొన్నారు. స్త్రీలు పాల్గొనే చుట్టకాముడు ఆటకి దగ్గరగా వున్న ధూలా కళారూపాన్ని పురుషులు రాత్రిపూట ప్రదర్శిస్తారు.

## ఉయ్యాల పదం :

పోరాట కాలంలో మల్లు స్వరాజ్యం వ్రాసిన వీరపట్టారెడ్డి ఉయ్యాలో అనీ, ధీర అనంతారెడ్డి ఉయ్యాలో అని చుట్టూ తిరుగుతూ చేసే నృత్యం ఎంతో ఉత్తేజాన్ని కలిగించేది. ఆ పోరాట కాలంలో పాడిన అనేక పాటల్లో, ఉయ్యాలో

అనీ, ఎన్నియాలో అనీ, చందమామా అని వంతలు ఉపయోగించేవారు. ఉయ్యాలో అనడంవల్ల అది ఉయ్యాల పాటకాదు. వంత మాత్రమే. పోరాట కాలంలో ఎక్కువగా, అమరవీరులమీదే ఈ పాత బాణీలతో పాడుకున్నారు. ఉదాహరణకు.

వీరామట్టారెడ్డి ఉయ్యాలో—
ధీర అనంతారెడ్డి ఉయ్యాలో—

అంటూ సాగుతుంది.

# భట్రాజు పొగడ్తలు

ఇప్పటికీ ఒరే ఆ భట్రాజు పొగడ్తలు మానరా అనడం మనం పరిపాటిగా వింటూనే వున్నాం. వెనుకటి మాదిరిగా ఈనాడు భట్రాజులు తక్కువై పోయారు. ఆనాటి ప్రతి రాచకొలువులోనూ భట్రాజులు విధిగా వుండేవారు. కొలువులో వంది మాగధ స్తోత్రాలు చదువుతూ వుండేవారు. ఆనాటి కొలువులో వారొక అలంకారం, వారి రాజుల వంశ చరిత్రనంతా వల్లిస్తూ బిరుదులు చదువుతారు. వీరు ఆశుకవులు. అప్పటి కప్పుడు సన్నివేశ ప్రాధాన్యాన్ననుసరించి పద్యాలు మధురంగా పాడుతారు. వేషధారణను ముచ్చటగా దిద్దుకుంటారు. వీరిని తెలుగులో భట్టు లంటారు. రాజుల కొలువులో వుండటంవల్ల భట్రాజులుగా పేరు సార్థకమై వుండవచ్చు. వీరి పేరు చివర రాజు లేక మూర్తి అనే పదాలను చేర్చుకుంటారు. కాకతీయుల కాలంనుంచీ వీరున్నారు. కాకతీయ సామ్రాజ్యం చితికిపోయిన తరువాత చెల్లాచెదరై వెలమ, కమ్మ, కాపు కులస్తులను ఆశ్రయించారు. చిన్న చిన్న సంస్థానాధీశుల పంచన చేరారు. యుద్ధ యాత్రల్లో వీరు వీర గీతాలను ఆలపించేవారు. వీరమరణం చెందిన వీరుల సాహస కృత్యాలను ఆశువుగా వర్ణిస్తారు. తెలుగు ప్రజల వాస్తవ చరిత్రను పద్య రూపంలో భద్రపర్చినవారు వీరే.



వీరు ఎవరి పోషణలో వుంటారో, వారి ఇళ్ళలో జరిగే పెళ్ళికార్యక్రమంలో పెళ్ళికొడుకును అలంకరించి పెళ్ళిపీటల మీద కూర్చోపెడతారు. తెలుగు సాహిత్యంలో గణనీయమైన కావ్యం వ్రాసి తరువాత వాళ్ళకు వరవళ్ళు పెట్టిన కవి భట్టుమూర్తేనని ఆరుద్రగా రంటారు.

కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలంలో వీరిని భట్టులనే పిలిచేవారు. అందు కుదాహరణ కోలవెన్ను కాకతి గణపతి శాసనంలో కనబడుతూ వుంది. ఆ శాసనంలో దాదాపు 60 పేర్లున్నాయి. వాటిలో అన్నంభట్టు, నారాయణభట్టు, జగదేవభట్టు ఈ విధంగా వున్నాయి. వీరందరికీ అగ్రహారాలిచ్చినట్లు కూడా వుంది.

రాచరికాలు పోయాక, గ్రామాలలోని సంపన్న గృహస్థుల నాశ్రయించి, వారిని ఘనంగా స్తుతిస్తూ జీవయాత్ర గడుపుతున్నారు.

వీరి పొగడ్తలకూ, స్తోత్రాలకూ ఎంతటివారైనా లొంగిపోవాల్సిందే. వీరు ఇద్దరు, ముగ్గురు కలిసి ఒక జట్టుగా చేరి ఒకరి తరువాత మరొకరు పొగడ్తలతో ఉక్కిరి బిక్కిరి చేసి పారితోషికాన్ని పొందుతారు. అయితే వీరి స్తోత్ర పాఠాలు వినడానికి గ్రామీణులు బహుముచ్చట పడతారు. అందుకే మామూలు జీవితంలో ఎవరినైనా పొగడుతూ వుంటే భట్రాజు పొగడ్త పొగుడుతున్నాడురా అంటారు.

# ఎలుగుబంటీ, ఎలుగుబంటి వేషాలూ

దసరా వుత్సవాలకు ఆ తొమ్మిది రోజులూ రకరకాల వేషాలను ప్రదర్శిస్తారు. అలాగే సంక్రాంతి దినాలలో కూడా విచిత్ర వేషాలను ధరించి ఇంటింటికీ తిరిగి ప్రజల నానందపరిచి, వారి నుండి ధాన్యాన్నీ, డబ్బులనూ వసూలు చేసుకుంటారు.



ముఖ్యంగా ఈ వేషాల్లో జంతువులకు సంబంధించిన పులివేషం పిల్లల్నీ పెద్దల్నీ ఎంతో ఆకర్షిస్తుంది. పిల్లలైతే అసలు దగ్గరకు రారు. అలాగే ఎలుగుబంటి వేషం కూడ. ఆనాటి ప్రజలకు వినోద ప్రదర్శనాలు ఇలాంటివే. వీటిని అతి నైపుణ్యంతో కళాత్మకంగా ప్రదర్శిస్తారు. అలాంటి వేషాల్లో ఎలుగుబంటి వేషం కూడ ముఖ్యమైంది. జంతువుల వేషాలను ధరించినవారు ఆ జంతువుల యొక్క పోకడలనూ విన్యాసాలనూ, గంతులనూ, అరుపులనూ చక్కగా అనుకరిస్తారు.

ముఖ్యంగా ఈ ఎలుగుబంటి ముఖాన్ని కాగితపు గుజ్జుతో మోడు చేస్తారు. కొంతమంది అట్టలతో తయారుచేస్తారు. పాత్రధారి యీ మూతిని తలకు ధరిస్తాడు. శరీరమంతా జనపనార పీచును నల్లరంగులో ముంచి ఎండబెట్టి దానిని ఒక గుడ్డమీద కాళ్ళనూ, చేతుల్నీ మొత్తం శరీరాన్నంతా ఆక్రమించేటట్లు చక్కగా కుట్టి ధరిస్తారు. ఎలుగుబంటి నడకనూ, చేష్టలనూ చక్కగా చేస్తారు.

ఒకోసారి నిజమైన ఎలుగుబంటిని కూడ మచ్చికచేసి ఆడిస్తారు. ప్రేక్షకులకు సలాం చేయిస్తారు. దానిచేత గంతులు వేయిస్తారు. ఒక కర్రను అడ్డంపెట్టి ఆ కర్రను దాటిస్తారు. దానితో సర్కసు ఫీట్సును చేయిస్తారు. ఒకోసారి దానిని పిల్లల మీదికి ఉరికిస్తారు. దాని నెత్తిమీద దానితో టోపీ పెట్టిస్తారు. అది గంతులు వేసే టప్పుడు ఆ అడుగులను అనుకరిస్తూ డప్పులను వాయిస్తారు. ఈ డప్పుల వాయిద్యంతో ఊరు ఊరంతా ఆ ప్రదేశానికి కదలి వస్తారు.

అలాగే ఎలుగుబంటి వేషధారులు కూడా నిజమైన ఎలుగుబంటి చేష్టలన్నిటినీ అక్షరాలా అనుకరిస్తారు. నిజమైన ఎలుగుబంటి వెంట్రుకలు జానపదులకు ఎంతో విలువైనవి. ఆ వెంట్రుకల్ని తాయెత్తులలో చుట్టించి మొలలకు కట్టుకుంటారు పురుషులు. స్త్రీలు ఆ తాయెత్తులను మంగళసూత్రం త్రాడులో కడతారు. భయపడిన పిల్లలకు తాయెత్తు కట్టితే, చెడు జబ్బులు రావనీ, గాలిచేష్టలు అంటవనీ పెద్దల నమ్మకం. ఎలుగుబంటిని ముఖ్యంగా ఆడించేవారు ఎక్కువమంది ముస్లిం లంటారు. ఆర్వీయస్ సుందరంగారు — జానపద విజ్ఞానంలో.

కర్నాటకలో కొడగులో హరిజనులు, ముస్లిములు ఎలుగుబంటి వేషాలు ధరిస్తారట. దీపావళి, వినాయక చవితి, మొహరం వంటి పండుగలకు ఈ వేషాలను ధరిస్తారట.

అడవుల్లో సంచరించే ఎలుగుబంటిని ఎంతమంది చూడగలరు. అందుకే ఆ ఎలుగుబంటినీ, ఎలుగుబంటి వేషధారుల్నీ జనం విరగబడి చూస్తారు. ఆనందిస్తారు. వారికి తగిన పారితోషికం ఇచ్చి పంపుతారు. ముఖ్యంగా సంతోష సమయాలలో ఇలాంటి జంతు అనుకరణ వేషాలను ధరిస్తారు. ఒకరకంగా చూస్తే దీనినీ ఒక వినోద కళారూపంగా చెప్పుకోవచ్చు. జానపదుల్ని ఎన్ని కళారూపాలు వినోదపర్చాయో గ్రహించవచ్చును.

# కప్పల కావడి

నా చిన్నతనంలో కప్పలకావడిని చూశాను. ఒక కావడి భుజాన వేసుకుని రెండు ప్రక్కలా రెండు తట్టల్లో కప్పలను పెట్టి అవి ఎగిరిపోకుండా వేపమండలు వేసి ఇద్దరు ముగ్గురు స్త్రీలు బృందంగా ఏర్పడి వానాలమ్మ వచ్చేనూ, వరిచేలు పండేనూ అంటూ పాడుకుంటూ ఇంటింటికీ తిరుగుతూ యాచించేవారు. కప్పలు బెకబెకమంటే

వర్షాలొస్తాయనీ. అలాంటి కప్పల్ని పూజిస్తే వర్షాలొస్తాయనీ నమ్మించేవాళ్ళు. ముఖ్యంగా అనావృష్టి జరిగి వర్షం కోసం రైతులు ఎదురుచూసే సమయంలో వాన దేవుడి కోసం చేసే ఆచారాలలో ఇదొకటి.



అనావృష్టి ప్రాంతమైన రాయలసీమలో వర్షంకోసం ఇలాంటి ఆచారమే వుంది. మానవాతీత శక్తుల్ని సంతోష పెడితే వర్షం కురుస్తుందని వారి నమ్మకం. మట్టి మూకుడులో కప్పలనుంచి వాటిపైన తంగేడాకు వుంచి ఆ మూకుణ్ణి నెత్తిమీద పెట్టుకుని లేదా కావిడిలో పెట్టి వాన దేవా అని పాడుతూ, భిక్షానికి వస్తారు. వర్షలక్ష్మి ఈ రూపంలో వచ్చిందని నమ్మిన స్త్రీలు బిచ్చం వేస్తారు.

కావడి తగిలించుకున్న వారు ఈ క్రింది విధంగా పాడతారని జానపద విజ్ఞానంలో సుందరం గారు ఈ విధంగా ఉదహరించారు.

బూమెమ్మ కడుపునా బుగ బుగా పొగిలింది,<br>
కన్నీటి పొంగులే, పెన్నేటి కాలువా? ఓ వానదేవా?<br>
ఏరులూ చెరువులూ ఏకమై పారల్ల<br>
మా కొంగ్ర పండల్ల<br>
మా కడుపు నిండల్ల ఓ వానదేవా.

అనేది కప్పల కావడి సమయంలో పాడే పాటని 1975 లో దొణప్పగారు ఉదహరించారు.

# సాధనా శూరులు

పద్మశాలీలను మాత్రమే అర్చించే వీరిని సాధనా శూరులని పిలుస్తూ వుంటారు. వీరి ప్రదర్శనాలను అందరికీ ప్రదర్శిస్తారు. ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి సంచారం చేస్తూ ప్రతి గ్రామంలోని పద్మశాలీల అనుమతితో వీరు ప్రదర్శనలు ప్రారంభిస్తారు. వీరి ప్రదర్శన ఇంద్రజాలానికి సంబంధించింది. వీరి ప్రదర్శనం పగటివేళే జరుగుతుంది. దీనిని పగటివేషంగా భావించవచ్చు. వీరి ప్రదర్శన కాలం మూడుగంటల వరకూ వుంటుంది. వీరి రంగస్థలం గ్రామ కూడలిలో వున్న విశాల స్థలంలో జరుగుతుంది. వీరి కళారూపాల సాధనకు నిష్ఠ అవసరమంటారు. వీరి పనులు కనుకట్టు గారడీగా వుంటాయి. ఉదాహరణకు వీరి ప్రదర్శనంలో ఇరువురు

వ్యక్తులు రెండు రేకు పళ్ళెములు తీసుకుని చేతులకు ఏదో ఆకు పసరు పూసుకుని దూరంగా నిలబడతారు. వారు చేతులకు పూసుకున్న పసరు ప్రభావంవల్ల వారి హస్తాల్లో వున్న పళ్ళెములు ఒక్కసారి పైకి ఎగిరి రెండు పళ్ళెములూ కొట్టుకుని మరల యథాస్థానాన్ని చేరుకుంటాయి.



రొమ్ముమీద ఆకు :

అలాగే మరో వ్యక్తి రొమ్ముమీద ఒక ప్రత్యేకమైన ఆకును అతికించి ఆ ఆకును గురిచూచి కొట్టవలసిందిగా ఒక తుపాకిని ప్రేక్షకులలో ఎవరు ముందుకు వస్తే వారి కిచ్చి రొమ్ముమీద ఆకును గురి పెట్టి కొట్టమంటారు. అలా గురిచూచి ఎవరైనా కొట్టినట్టైతే ఆ గుండు రొమ్ములోపలి భాగానికి పోక ఆ ఆకును కొట్టుకుని అక్కడే పడిపోతుంది. ఆ ప్రదేశంలో ఏ విధమైన గాయమూ మనకు కనిపించదు. ఇది కనికట్టో ఆకు పసరు ప్రభావమో లేక ఇంద్రజాలమో మనకు తెలియదు గాని వారు ఇలాంటి ప్రదర్శనలో నిజంగా సాధనాశూరులే. ఈ సాధనా శూరులు ప్రస్తుతం కరీంనగర్ జిల్లాలోని హుజూరాబాద్ తాలూకా వల్లభాపురంలో వున్నారు. ఈ ప్రదర్శన ద్వారా వీరు జానపదులను దిగ్భ్రాంతులను చేస్తారు.

# గంట జంగాలు

శైవ, వీరశైవ మతానికి చెందిన వీరముష్టులూ, జంగాలూ, వారి వారి కళారూపాలే కాకుండా ఒంటరిగా జంగం దేవర వేషంలో ఇంటింటికీ తిరిగి యాచిస్తూ వుంటారు. సాంబసదాశివ, సాంబ సదాశివ, శంభోశంకర అంటూ శంఖాన్ని పూరిస్తూ, నందిమకుటంగా గల గంటను వాయిస్తూ, బసవపురాణంలోని బసవేశ్వరుని సూక్తులను సోదాహరణంగా ఉదహరిస్తారు.



బసవేశ్వరుడుగా వేషధారణను తీర్చిదిద్దుకుంటారు. వారిలో ఎంతో పూజ్యభావం గోచరిస్తుంది. పై నుంచి

క్రిందికి అంగరఖాను తొడుగుతారు. తెల్లని తలగుడ్డను చుడతారు. మెడకు పొడవాటి అంగవస్త్రాన్ని ధరిస్తారు. ముఖానికి గంభీరంగా విభూతి రేఖలను దిద్దుతారు. గంట వాయిస్తూ, శంఖం పూరిస్తూ వచ్చే గంటజంగాన్ని సాక్షాత్తూ బసవేశ్వరుడని ఊహించి ఇంట్లో వారంతా భిక్షను వేస్తారు. భిక్షను స్వీకరిస్తూ మంత్రాన్ని ఉచ్చరిస్తూ విభూతి నిస్తారు. శంభోశంకర అంటూ, గంట చుట్టూ ఒక పుల్లను త్రిప్పుతూ ఓంకార నాదాన్ని పలికిస్తారు. పిన్నలూ, పెద్దలూ అందరూ పూజ్యభావంతో విభూతిని స్వీక రిస్తారు. ఈ రకంగా గంటజంగాలు వీర శైవమతాన్ని ప్రబోధించే ప్రచారకులుగా జీవిస్తూ ఊరూరా తిరుగుతూ వుంటారు.

## సానివారు

ఆంధ్ర దేశంలో దేవదాసీలూ, భోగంసానులూ వుండటం చాలా మందికి తెలుసు.

కాని మరి కొందరు సానులు కూడా జాతి జీవనంలో కళాసంస్కృతులకు దోహదం చేశారు. పూర్వకాలం నుంచీ కొన్ని కులాలలో ఆడపిల్లలను అవివాహితలు గానే విడిచిపెట్టే ఆచారం దేశంలో వుంది. అయితే అవివాహితలు విచ్చలవిడితనం లేకుండా కట్టుబాట్లకు లోబడి సామాజిక కార్యక్రమాలను నెరవేర్చేవారు.

అనాటి మూఢనమ్మకాలతో వున్న గ్రామీణ ప్రజలు నిర్వహించే జాతర్లలో, దేవతల కొలుపుల్లో జరపవలసిన తంతును వీరే నిర్వహించేవారు. ప్రత్యేక నృత్యా లను వీరే చేసేవారు. ఈనాటికీ జక్కులసాని, బసివి, మాతంగి మొదలైనవారి జీవిత చరిత్రలు పరిశీలిస్తే పురాతన సాంఘిక నియమాలవల్లే సానివారిగా ఏర్పడ్డారని తెలుస్తుంది.

క్రిందటి శతాబ్దంలో జనాభా లెక్కలు తీసుకున్నప్పుడు ఆరు తెగల సానులు లెక్కకొచ్చినట్లు ఆరుద్రగారు పరిశీలించారు. వారు "తురకసానులూ, గొల్మసానులూ, భోగంసానులూ, మంగలభోగాలూ, మాదిగభోగాలూ అనే ఆరు తెగల సానులు లెక్కకు వచ్చారు. వీరందరూ నృత్యసంప్రదాయాలను పోషించినవారే.

## జోగాట

ఆంధ్ర దేశంలో ఇతర ప్రాంతాల్లో అంతగా ప్రచారంలో లేని ఈ జోగాట తెలంగాణాలో ప్రచారంలో వుంది. హరిజనులలో ఒక తెగకు సంబంధించినవారే ఈ జోగువారు. వీరు డప్పు వాయిద్యంతోపాటు నృత్యాన్ని చేస్తారు. ఇలా చేసే

వారిని సర్కారాంధ్రదేశంలో మాదిగవారంటారు. వీరు చెప్పులు కుట్టటంతోపాటు చర్మకారులుగా వృత్తిని సాగిస్తారు. చాటింపు వేయడం, జాతర్లకూ, వుత్సవాలకూ డప్పు వాయిద్యాలను వాయించుట చేస్తుంటారు.



తెలంగాణాలో వున్న జోగువారు డప్పుల వాయిద్యంతోపాటు నైపుణ్యంగా నృత్యం చేస్తారు. వారి తెగలో ఎవరైనా మరణిస్తే వారిని శ్మశానవాటికకు వుత్సవంగా తీసుకుపోతూ డప్పుల వాయిద్యంతో నృత్యం చేస్తారు.

కేవలం నృత్యం చేయటమేకాక, నృత్యంతోపాటు గొల్లకలాపంలో మాదిరి పిండోత్పత్తి క్రమాన్ని వివరంగా వివరిస్తారు. జీవుడు మాతృగర్భంలో పిండోత్పత్తిలో ప్రవేశించింది మొదలూ నవ మాసక్రమంలో పిండంయొక్క చలనాన్నీ అభివృద్ధిక్రమాన్నీ వివరిస్తారు.

కేవలం చావు సందర్భాలలోనే కాక సంతోష సందర్భాలలో, వేడుకలలో, వివాహాలలో, ఉత్సవాల్లో కూడ ఈ జోగువారు వారి డప్పుల నృత్య విన్యాసాన్ని ప్రదర్శిస్తారు. ఈ డప్పు వాయిద్యం చూపరులకు ఉత్తేజాన్ని కలుగజేస్తుంది.

# కొలనుపాక, భాగవతులు

ఆంధ్ర ప్రాంతంలో వున్న గంటె భాగవతులకూ, తెలంగాణ గంటెభాగవతులకు వ్యత్యాసం వుంది. ఈ గంటె భాగవతులు కరీంనగర్ జిల్లా కొలనుపాకలో వున్నారు. వీరి ప్రదర్శనమూ రాత్రిపూటే జరుగుతుంది. వీరి ప్రదర్శన సాహిత్యం అంతగా తెలియకపోయినా, వీరి ప్రదర్శనంమాత్రం ప్రాముఖ్యంగా ప్రదర్శించటానికి ఈ గంటెలను ఉపయోగిస్తారు.



వీరి ప్రదర్శనంలో వచ్చే ప్రతి పాత్రధారి చేతిలోనూ ఒక గరిటె వుంటుంది. అందులో చమురుపోసి వత్తి వేసి వెలిగిస్తారు. ప్రతి పాత్రయొక్క హావభావాలూ, ఆంగికచలనాలూ, ఈ గరిటె వెలుతురువల్ల ప్రేక్షకులకు విశదంగా వెల్లడౌతాయి. మధ్య మధ్య నటనను

సాగిస్తూ గంటెలలోని వత్తిని ఎగదోస్తూ వుంటారు. ఈ వత్తుల వెలుతురువల్ల ముఖంలో ప్రతిబింబించే సాత్వికాభినయానికి ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తారు. ప్రాచీనులు ఈ పద్ధతిని ఎక్కువగా అనుసరించేవారు. అంటే ఆ నాటికే ముఖాభినయానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు మనం తెలుసుకోవచ్చు. ప్రతివారి చేతిలోనూ గరిటె వుంటుంది కాబట్టి, ఆ గరిటె ప్రాముఖ్యంతోనే నాటకాలను ప్రదర్శిస్తారు. అందుకే వారిని గరిటె భాగవతులనీ, గంటెభాగవతులనీ పేరు వచ్చింది.

# పగలేసిగాళ్ళు

రాయలసీమ ప్రాంతంలో పగటి వేషగాళ్ళను పగలేసిగాళ్ళని పిలుస్తారని తమ జానపద కళాసంపదలో దొణప్పగారు ఉదహరించారు. వీరు కూడ విప్రవినోదులు లాంటివారు.



దొరవేషం "దొరసాని వేషం", "వడ్డెరవాడు", "బ్రాహ్మణ వితంతువు" మొదలైన వేషాలను ధరించి చమత్కారమైన మాటల తీరుతో ప్రజలను ఆనందింపచేస్తారు.

వీరికి ఒక వూరూ వాడా అని వుండదు. దేశసంచారం చేస్తూ సంవత్సరానికొకసారి వార్షికంగా వచ్చి ప్రదర్శనలిచ్చి పారితోషికాలు పొంది వెళతారు.

ధరించే ఆ యా పాత్రల నడక, మాట యాస, భాషా ఉచ్చారణ వారికి వెన్నతో పెట్టిన విద్య. ప్రతి వేషాన్నీ తీర్చిదిద్దుకుని సహజత్వం వుట్టిపడేలా వుండే అలంకరణ వస్తుసామగ్రిని వారే సమకూర్చుకుంటారు. ఎవరు ఏ మాట మాటాడినా పరిహాస దరహాసంతో సమాధానా లిస్తారు.

# పంబలవారు

సర్కారు ఆంధ్రప్రాంతంలో ఒకప్పుడు విరివిగా జరిగే దేవతల కొలుపుల్లోనూ, జాతర్లలోనూ పంబలవారి కథలు ఎక్కువగా జరుగుతూ వుండేవి. ఈనాటికీ గ్రామదేవతలను కొలిచే ప్రతిచోటా ఈ కథలు జరుగుతూ వున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే ఈ కథలు కనుమరుగు ఔతున్నాయి.

పంబలవారు అయ్యగారి దర్శనానికి చెందిన హరిజనులనీ, వీరి వాయిద్యం పంబజోడనీ, వీరు ఎక్కువగా అంకమ్మ కథలను పాడుతారనీ, వీరు కొలిచే అంకమ్మకు, మారాసపు అంకమ్మ అని పేరనీ వంతలు పంబజోడును వాయిస్తూ శృతికి తిత్తి ఊదుతూవుంటే కథకుడు రాజకుమారువిలా వేషాన్ని ధరించి కుడిచేతితో పెద్ద కత్తినీ, ఎడమ చేతితో అమణాల అనే చిన్న కత్తిని పట్టుకుని వీరావేశంతో చిందులు తొక్కుతూ కథను పాడుతాడనీ, డా॥ తంగిరాల వెంకటసుబ్బారావుగారు జానపదకళోత్సవాల సంచికలో వివరించారు.



# కడ్డీ వాయిద్యం

మిత్తుల అయ్యవార్లనీ, దాసరులనీ పిలువబడే వీరు, ఈ కడ్డీ వాయిద్యంలో ప్రవీణులు. ఈ వాయిద్యం వీణ మాదిరిగా వుంటుందట. వీణ మాదిరే దీనిని కూడ చేతి వ్రేళ్ళతోనే వాయిస్తారు. వీరు ముఖ్యంగా ఈ వాయిద్యం మీద భగవన్నామ సంకీర్తనలను వాయిస్తూ వుంటారు.



ఈ వాయిద్యాన్ని ముందు నిలబెట్టుకుని రెండు సన్నని పుల్లలతో జలతరంగ్ వాయిద్యాన్ని వాయించినట్లు వాయిస్తారు. ఈ స్వర మాధుర్యం ఎంతో మధురంగా వుంటుంది. వీరి వృత్తికి ప్రాణప్రదమైంది ఈ వాయిద్యమే. అయితే ఈ వాయిద్యాన్ని అందరూ వాయించలేరు. దీనికి ప్రత్యేకమైన శిక్షణతోనూ, సాధనతోనూ సాధించవలసిందే. అందువల్లనే ఈ వాద్యకాంద్రలో ప్రవీణులు చాలా తక్కువ. తెలంగాణాలో ఈ వాయిద్యంలో ప్రసిద్ధులైనవారు కరీంనగర్ జిల్లా మెట్టుపల్లి తాలూకాలో వున్నారు. ఈ కళారూపాన్ని శిథిలం కాకముందే రక్షించుకోవడం అవసరం.

# తుమ్మెద పాటలు

దసరా పండుగ వచ్చిందీ అంటే ఆంధ్రదేశపు పల్లెల్లో కూలీ స్త్రీలు చక్కగా రంగు రంగుల చీరలు ధరించి, కొప్పులో బంతిపువ్వులు చుట్టి వయ్యారంగా సీతాకోక చిలుకల్లా మృదుమధురమైన కంఠంతో

రావె రావె నల్ల తుమ్మెదా, మంచి
పాటలెన్నో పాడు తుమ్మెదా
పాండవులు పాండవులు తుమ్మెదా
పంచపాండవులారె తుమ్మెదా.

అంటూ ఇంటింటికీ తిరిగి

కొత్త పంటొచ్చింది తుమ్మెదా
మనకు కరువేమి లేదింక తుమ్మెదా.

అంటూ తుమ్మెదల జట్టుల్లాగా స్త్రీ కూలీలు ఈ కళారూపాన్ని ప్రచారంలోకి తీసుకు వచ్చారు. ఈ పాటలనే ప్రజానాట్యమండలి కరువుపరిస్థితుల ననుసరించి అధిక పంటలు పండించవలసిందిగా రైతుల నుద్బోధించటానికి పాటలు వ్రాసి ప్రచారం చేశారు.

## సాతాని వైష్ణవులు

సాతానులు వైష్ణవమత సంప్రదాయానికి చెందినవారు. శైవం, వీరశైవం ఆంధ్ర దేశంలో విజృంభించిన తరువాత తెలుగుదేశంలో రామానుజుని వైష్ణవం ప్రవేశించింది. వైష్ణవ దేవాలయాల్లో గుడి సేవకులుగా ఒక శూద్ర వర్గం ఏర్పడిందనీ, వారినే సాతానులంటారనీ, ఆరుద్రగారు ప్రజాసాహితి సంచికలో వుదహరించారు.



తమిళంలో "సాత్తదవక" అనే మాట నుండి సాతాని అనే మాట వచ్చింది. సాతాని అంటే మూసుకోని వాడు. సాతానుల్లో ముఖ్యంగా పురుషులు మూడు భాగాలను మూసుకోకూడదట. అవి తలను జుట్టుతో మూయకూడదు. తప్పనిసరిగా గుండు చేయించుకోవాలి, రొమ్మున వున్న జంధ్యాన్ని మూయకూడదు. పంచెను మొల దగ్గర పట్టీతో మూయకూడదు. సాతానులు చక్రాంకితాలు వేయించుకుంటారు. శరీరమంతా సుందరంగా పంగనామాలను ధరిస్తారు. తులసి పేరులను తలచుట్టూ చుట్టుకుంటారు. తులసి హారాలను మెడలో అలంకరించుకుంటారు. గజకర్ణం అనే విసనకర్రను కుడిచేత పట్టుకుని, నెత్తిమీద అక్షయపాత్రను పెట్టుకుని ఆళ్వారుల పాశురాలను పాడుతూ భిక్షాటన చేస్తారు. బలిజవారినీ, కోమట్లనూ యాచిస్తారు. కీర్తనలతో వైష్ణవ ప్రచారం చేస్తారు.

# కొయ్యకాళ్ళ మనుషులు

ఆంధ్ర దేశంలో ఉత్సవాల్లో, జాతర్లలో, పెళ్ళిళ్ళలో బుట్టబొమ్మల ప్రదర్శన చూస్తూనే వున్నాం. అదే మాదిరి కాళ్ళకు కొయ్యలు కట్టుకుని అందరికంటే ఎత్తుగా కనిపిస్తూ ప్రేక్షకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉత్సవ సమయాల్లో నృత్యం చేస్తూ వుంటారు.

తేలికగా వుండే గట్టి కొయ్యలతో కాలికి అమర్చే కొయ్యలను తయారు చేస్తారు. అవి నాలుగడుగులు పొడుగుంటాయి. వాటిని పాదాలకు అమర్చి, గట్టిగా కట్టుకుని మరొకర్ర సహాయంతో కొంచెం దూరం నడుస్తూ ఆలాగే నృత్యం ప్రారంభించి ఎవరి సహాయం లేకుండానే తప్పెటల వాయిద్యానికి అనుకూలంగా అడుగులేస్తూ అభినయిస్తారు. ఇలా నృత్యం చేయటానికి నైపుణ్యం కావాలి. కొయ్యకాళ్ళతో నృత్యం చేస్తూనే కొన్ని విన్యాసాలు చేసి ప్రేక్షకుల్ని రంజింప చేస్తారు.



అలాగే కొంతమంది లంబాడీలూ, ఎరుకసానులూ, కొన్ని కొయ్య బొమ్మలను తయారు చేసి, చేతులతో ఆడిస్తూ, ఆ బొమ్మలకు శృంగారాన్ని కలిగిస్తూ రెండు బొమ్మల మధ్య కలహాన్ని రేపెడుతూ చమత్కారంగా ఆడిస్తారు. ఇలాంటి ఆటలన్నీ ఒకనాటి జానపదుల్ని ఎంతగానో అలరించాయి. ఈనాడివి చాలా అరుదుగా వున్నాయి.

# తెరచీరలవారు

ఆంధ్రదేశంలో తెర చీరలవారని ఒక జాతివా రున్నారు. వారి గోత్రాలనూ, వారి పూర్వవృత్తాంతాలనూ, గాథలనూ చెపుతూ వుంటారు. వీరు సుద్దులను కూడా చెపుతారు.

పై విధానపు తెర బొమ్మల గురించి క్రీడాభిరామంలో ఒక పడతి పల్నాటి వీరచరిత్రను గూర్చి పాడుతూ వున్నదనీ, అక్కడవారి చరిత్ర ఒక చిత్రఫలకం మీద వ్రాయబడెననీ, దానిని గూర్చి ఈ క్రింది విధంగా వర్ణింపబడింది.



కోలదానవు ద్రిక్కటి కూడియున్న  
గచ్చువేసిన చిత్రంపు గద్దె పలక  
వ్రాసినారదె చూడరా వైశ్యరాజ  
శీలబ్రహ్మాది వీర నాసీర చరిత.

(క్రీడాభిరామం 125)

పై ఉదాహరణనుబట్టి పల్నాటి వీరచరిత్రను కాశీకావడిద్వారా, చీరల మీద చిత్రించిన బొమ్మలద్వారా వీరి కథను చెప్పినట్లు వూహించవచ్చును.

# చిన్న మాదిగలు

కేవలం మాల మాదిగలను మాత్రమే యాచించే వీరిని చిన్నమాదిగ లంటారు. పర్కూరు ప్రాంతంలో కూడా ఇలా యాచించేవారున్నారు. చిన్న మాదిగలు ఊరూరా సంచారం చేస్తూ ప్రదర్శిస్తారు. వీరిది పగటి ప్రదర్శనం. వీరి ప్రదర్శనం వీధి భాగవతానికి దగ్గరగా వుంటుంది. వేషధారణ కూడా అంతే. వీరి కథా ఇతివృత్తం చరిత్రాత్మకమైనది. వీరు ఏ గ్రామంలో ఎన్ని ప్రదర్శనాలు ఇచ్చినా ఒక వారం రోజులకన్నా ఎక్కువ ఆ గ్రామంలో వుండరు. ప్రదర్శనలన్నీ ముగిసిన తరువాత చివరి రోజున ఒక తంతు నడుపుతారు. నీచదేవతలను తృప్తిపరచడానికి జంతు బలిచేసి బీభత్సంగా వేషం అలంకరించుకున్న ఒక యువకుడు శౌరాత్ర దేవతల ముందు తాండవం చేస్తాడట. గ్రామ ప్రదక్షిణంచేసి సమీపంలోవున్న చెరువులో స్నానం చేసి తిరిగి ఆ గ్రామానికి రాకుండా వెళ్ళిపోతాడట. ఈ విధంగా ప్రదక్షిణం చేయడంవల్ల పాడిపంటలకు, ప్రజలకు శుభం కలుగుతుందని జానపదుల నమ్మిక.



# అక్కన్న మాదన్నల భాగవత మేళం



గోల్కొండ తానీషా మంత్రులైన అక్కన్న మాదన్నల యాజమాన్యంలోనూ. ఒక భాగవత మేళముండేదని మధురిమంగా పుంశ్చలీ విలాసంలో ఉదహరించబడిందని యశ్వీ జోగారావుగారు తమ యక్షగాన వాఙ్మయంలో వివరించారు.

అక్కన్న మాదన్నల భాగవత మేళం చూచి పూడి భాగవతుల రీతిలోవుండి దేశసంచారం చేసి, ప్రదర్శనాలను ప్రదర్శించింది.

ఈ భాగవత దళం విజయనగరం ఆనెగొంది రాజనగర్లలో నాటకం ప్రదర్శించి నప్పుడు ఆ మేళగాండ్రలో అందగాడైన ఒక స్త్రీ పాత్రధారిని ఆనాటి రాజాగారి సోదరి వలచి వలపించి అతనితో సాంగత్యం జరిపినట్లు ఒక ఐతిహ్యముంది. దీనిని బట్టి ఆ భాగవత దళం ఎంత వుత్తమమో తెలుసుకోవచ్చు.

# సింహాద్రి అప్పన్న సేవ

విశాఖపట్టణానికి అతి సమీపంలో వున్న పుణ్యక్షేత్రం సింహాచలం. సింహాచల క్షేత్రంలో ప్రసిద్ధమైన వరాహనరసింహస్వామి దేవాలయం వుంది. దీనినే



సింహాద్రి అప్పన్నకొండ అంటారు. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ, తూర్పుగోదావరి మొదలైన జిల్లాల ప్రజలకూ అటు ఒరిస్సా ప్రజలకూ ఆరాధ్య పుణ్యక్షేత్రం సింహాచలం.

దేవుడికి పూజచేయటమే సేవ, సింహాచల క్షేత్రానికి మొక్కుబడులు చెల్లించటానికి వచ్చే ప్రజలు ఆచరించేదే సింహాద్రి అప్పన్న సేవ.

వరాహ నరసింహ స్వామిని కీర్తిస్తూ కథకుడు నల్లని వెండి పొన్నుల కర్రను చేతిలో ధరించి మరో చేతిలో నెమలి ఈకల కుంచెను పట్టుకుని కథను చెపుతూ వుండగా తనకు వంతగా వున్న భక్తులందరూ పెద్ద పెద్ద తాళాలను చేత పడతారు. అందరూ జరీ అంచుగల తలపాగలను ధరిస్తారు. బృందంలోని మరికొందరు నూనె గుడ్డలను చుట్టిన కోలలను వెలిగించి పట్టుకుంటారు. ఈ కోలల వెలుగులో పెద్ద పెద్ద తాళాలను మ్రోగిస్తూ బృందం వలయాకారంగా తిరుగుతారు. ప్రధాన కథకుడు చరణం పాడితే, వారు దానిని వంతగా అనుసరిస్తారు. ఇది బృందగానం. హరిహరి నారాయణా ఆదినారాయణా అనే పల్లవిని ప్రారంభిస్తారు.

# మాల జంగాలు



మాల జంగాలనే పంచాలవారు మన బుర్రకథలనే ప్రత్యేక ఫక్కీలో చెపుతారు. వీరి తంబురా నెమలి ఈకలతో అలంకరింపబడి వుంటుంది. వీరు చేతి వుంగరాలతో తంబురా బుర్రను తాళప్రకారం మీటుతూ కథ చెపుతూ వుంటారు. ముఖ్యంగా వీరి కథలు కరుణరస ప్రధానమైనవి. వీరి ప్రదర్శనాలు సాయంత్రం ప్రారంభమై తెల్ల

వార్లూ జరుగుతూ వుంటాయి. వీరు చెప్పే కథాసాహిత్యం ఎటువంటిదో మనకు తగిన ఆధారం గ్రంథరూపంగా లభించదు. వీరి వాయిద్యాలలో డోలు ప్రసిద్ధిచెందిన వాయిద్యం. ఇంకా వీరు ఉపయోగించే వాయిద్య విశేషాలలో ముఖ్యమైనది "జమ లిక". దీనినే జవనిక, జముకు అని పిలవడం కూడా కద్దు. వీరి మరొక వాయిద్యం తుడుం కొమ్ము. వీరిని కొన్ని ప్రాంతాలలో రోజవారని కూడా పిలుస్తూ వుంటారు.

# బాల సంతు వారు

సర్కారాంధ్ర దేశంలో బాలసంతు వారు ఎక్కడా కనిపించకపోయినా, రాయలసీమ తెలంగాణా జిల్లాలలో వీరు ఎక్కువగా కనిపిస్తారు. వీరు వీరగాథల్ని గానం చేస్తారు. వీరిని బాల సంతోషంవారనీ, బాలసంతు వాళ్ళనీ పిలు స్తారు. కర్నూలు ప్రాంతంలో వీరు బొబ్బిలి కథనూ, నవాబుల కథ లనూ గానం చేస్తారు.



ప్రారంభంలో వీరు గంగా గౌరీ సంవాదంవంటి శైవ కథల గానం చేసేవారు తెల్లవారుజామున గంటవాయిద్యంతో గ్రామీణులను మేల్కొలుపుతూ ప్రతిఇంటికీ వెళ్ళి జోస్యం చెప్పి వెళ్ళిపోవటం కూడ వీరి కార్యక్రమం, తరువాత వా రిచ్చిన పారితోషికాన్ని పుచ్చుకుంటారు. ఈ కార్యక్రమమంతా గ్రామస్తులను వినోదపర్చేది.

# మాష్టీలు

మాష్టీలని వీరికి పేరు ఎందుకు వచ్చిందో తెలియదు కానీ, వీరు కథా గానంలో మాలల్నీ, మాదిగల్నీ, గొల్లల్నీ యాచించి బ్రతుకుతూ వుంటారు. వీరిని మాల మాష్టీలని కూడా పిలుస్తారు. వీరు దొమ్మరి వారి లాగే అంగ విన్యాసాలతో పాటు సాము గరిడీలను నిర్వహిస్తారు. ఆనాడు గ్రామీణ ప్రజలకు ఇంతకంటే వినోద కార్యక్రమ మేముంది?



# గరుడ స్తంభం దాసరి

శంఖం, జేగంట, దీపపు సెమ్మె, రాగిచెంబు, హనుమంతుడు బిళ్ళ అనే అయిదు గుర్తులతో యాచించే గాయకులను దాసరు

లంటారు. వీరి దీపపుసెమ్మాని గరుడ స్తంభం అంటారు. కొందరిని శంఖ దాసర్లనీ, కొందరిని గరుడ స్తంభం దాసరులనీ పిలుస్తారు. వీరు గాథలను గానం చేస్తారు.

## ఒడ్డెవారు

ఒడ్డెవారంటే గ్రామాల్లో చెరువుల్నీ, నూతుల్నీ, కాలువల్నీ త్రవ్వేవారు. ఎక్కడ ఆ పనులుంటే అక్కడకు వెళుతూ సంచారం చేస్తారు. కష్టజీవులు, పనిలో నిమగ్నమైనప్పుడు కష్టాన్ని మరిచిపోవడానికి పదాలు పాడుతూ వుంటారు. వాటినే వడ్డె వుప్పర పదా లంటారు. వడ్డెవారికే మరో పేరు వుప్పర, వీరి వెంటే ఎల్లమ్మ దేవత విగ్రహాన్ని తీసుకుపోతూ వుంటారు. ప్రతి సంవత్సరమూ జాతర చేస్తారు. వారి కులంలో వారే పూజారిగా వుంటాడు. జాతర సమయంలో ఆటలతో పాటలతో చిందులు వేస్తారు. వడ్డెవారు పచ్చబొట్లు కూడా పొడుస్తారు.

## పాండవులవారు

మహాభారతగాథను అద్భుతంగా గానం చేస్తూ జీవించే ఒక తెగ హైదరాబాదు ప్రాంతంలో వుంది. ఈ తెగలోని పురుష లందరూ పాండవుల గాథను అత్యద్భుతంగా గానం చేస్తారు. పాండవుల గాథను గానం చేయడంవల్ల వీరిని పాండవుల వారని పిలుస్తూ వుంటారు. మహాభారత గాథలను మినహా మరే గాథలనూ గానం చేయరు. పురుషులు గానం చేస్తే వీరి స్త్రీలు పురుషులకు, స్త్రీలకు, పిల్లలకు పచ్చబొట్లు పొడిచి డబ్బును సంపాదిస్తారు. వీరు ఒక్క తెలంగాణాలో తప్పా ఇతర ఆంధ్రప్రాంతాల్లో ఎక్కడా కనిపించరు.

## ఇంకెన్నో కళారూపాలు

పైన వుదహరించినవే కాక ఇంకెన్నో కళారూపా లున్నాయి. వాటిలో కొన్ని కను మరుగై పోయాయి. మరికొన్ని ఆలనా పాలనా లేకుండా కొనవూపిరితో కొట్టుకుంటున్నాయి. వాటిలో కొన్నిటిని ఈ క్రింద వుదహరిస్తున్నాను.

గొల్లదాసరులు - చెంచుభాగవతులు - డక్కలి కథలు - ఆలాపు పాటలు - ఉయ్యాల పాటలు - ఎరుకల పాటలు - ఎరుకల దాసరి - కాకిపడగలు - నక్కలోళ్ళ నక్కల భాగవతం - నక్కజంగాలు - పటాలవారు పనసలవారు - పందిరిపాట - పూసలోళ్ళ పూసల బలిజ కథలు - బయకాని కథ - బైరాగితత్వాలు - బైరోభజన - మరిద పిచ్చిలు - మందహెచ్చుల కథలు - రెల్లి జట్టులు - రేలపాటలు - వైష్ణవ దాసరి పాటలు - పరికె ముగ్గుల శోది - సాతాని పదాలు.





# అనంతపురం జిల్లా

## పెనుగొండ :

ఒకప్పుడు విజయనగర రాజులు పరిపాలించిన ప్రదేశ మిది. ఇక్కడ నాటక దళాలతో పాటు ప్రాచీన జానపద కళారూపమైన బయలు నాటకాలు ప్రదర్శించ బడ్డాయి.

## హిందూపురం :

అనంతపురం జిల్లా హిందూపూర్ తాలూకాలో ప్రతి గ్రామంలోనూ వీధి నాటకదళమో, తోలుబొమ్మలాట దళమో వుంది. బొమ్మలాట బృందంవారు లేపాక్షి రామాయణాన్ని, గరుడాచల యక్షగానాన్ని ప్రదర్శించేవారు.



## కట్టె బొమ్మలు :

ఇక్కడ కొయ్యబొమ్మలాటలను ప్రదర్శించటం ఒక ప్రత్యేకత, ఈ బొమ్మలు ఆంధ్రదేశంలో మరెక్కడా కనిపించవు. ప్రక్క రాష్ట్రమైన కర్నాటకలో వీటి ప్రభావం వుంది. బహుశా ఆ విధంగా ఈ కట్టెబొమ్మల కళాకారులు అటునుంచి ఇటు వచ్చి స్థిరపడి వుండవచ్చును.

ఈ కట్టె బొమ్మలు కళ్ళతోకూడా అభినయం చేయగలంతటి పనితనాన్ని నిపుణులైన గ్రామ వడ్రంగులు తయారుచేయగలిగేవారు. ఇది ఖర్చుతో కూడుకున్న పని. ఈ కళారూపం చాలాకాలం క్రితమే క్షీణించింది. నలభై సంవత్సరాల క్రితం కొంతమంది వద్ద విడిబొమ్మ లుండేవి. అవి ఇప్పుడు వున్నాయో లేవో చెప్పలేము.

# చిత్తూరు జిల్లా

## కుప్పం :

వీధి నాటకాలను ప్రదర్శించడంలో రాయలసీమ చిత్తూరు జిల్లాలో కుప్పం తాలూకా కుప్పం పట్నానికి సమీపంలో వున్న కొత్త ఇండ్లు అనే గ్రామంలోని శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం చరిత్రాత్మకమైనది.



రాయలసీమలో వీధి నాటకాలను ప్రదర్శించడంలో ఈ నాటక సమాజం తప్పా ఇంత పేరు పొందిన నాటక సమాజం మరొకటి లేదు.

ఈ వీధి నాటక కళాకారులు ఈ వీధి నాటక కళను వంశపారంపర్యంగా కాపాడుతూ వస్తున్నారు. వీరు భారత, రామాయణ, భాగవతాలను మూడింటినీ వివిధ ఘట్టాలుగా విభజించి ప్రదర్శిస్తారు.

పాండవ జననం నుంచి దుర్యోధన వధ వరకూ భారతాన్ని, పాండవ జననం, లక్షగృహ దహనం ఇలా వివిధ ఘట్టాలుగా ప్రదర్శిస్తారు.

అలాగే రామాయణంలో శ్రీరామ జననం, సీతా కళ్యాణం, లంకాదహనం అనే ఘట్టాలను మాత్రం ప్రదర్శిస్తారు.

ఇక భాగవతంలో 'శ్రీ కృష్ణ లీలలు (బాల్యక్రీడలు), వామన చరిత్ర, నరకాసుర వధ అనే ఘట్టాలను మాత్రం ప్రదర్శిస్తారు.

వీరి పూర్వీకులు పై పురాణగాథలన్నిటినీ, సంపూర్ణంగా ప్రదర్శించేవారు. ఈ నాటి కళాకారులు మాత్రం పైన ఉదహరించిన ఆయా ఘట్టాలను మాత్రమే ప్రదర్శిస్తున్నారు. ముఖ్యంగా వీరి భాగవతాలలో స్త్రీ పాత్రలన్నిటినీ పురుషులే ప్రదర్శిస్తారు. వారు అత్యద్భుతంగా అభినయిస్తారు. అది వారి ప్రత్యేకత.

## పసిద్ధ నటులు :

ఈ సమాజంలో అనేకమంది ప్రసిద్ధ నటు లున్నారు. వారిలో నలభై అయిదు సంవత్సరాల వయసు కలిగిన సముద్రాల కె. వెంకటేశ్వర్లు స్త్రీ పాత్రలను అందులో

ముఖ్యంగా నాయికా పాత్రలను అభినయించటంలో సుప్రసిద్ధుడు. అప్పుడప్పుడు శ్రీకృష్ణ పాత్రనూ, సూత్రధారుని పాత్రనూ అవసరాన్నిబట్టి నటిస్తారు.

ముఖ్యంగా ద్రౌపది పాత్ర పోషణలో ఎన్నోచోట్ల ప్రశంసలందుకోవడమే కాక ఘన బహుమతుల్ని కూడ అందుకున్నారు. అంతేకాక, హార్మోనియం వాయించడం లోనూ, మృదంగ వాయిద్యంలోనూ నిపుణులు.



సేదా పెద్దబ్బయ్య ఉదాత్తమైన పురుష పాత్రలను ధరిస్తారు. అవసరాన్నిబట్టి సుధేష్ణ లాంటి స్త్రీ పాత్రలను కూడా ధరిస్తారు.

జి. మునిరత్న ధీరోదాత్త పాత్రలను ప్రదర్శించడంలో ప్రసిద్ధుడు. హరికథలను చెప్పడంలోనూ, సంగీతంలోనూ, హార్మోనియం, ఫిడేలులాంటి వాయిద్యాలను వాయించడంలోనూ నిపుణులు.

మాస్టరు జి. యం. భాగవతులు హార్మోనియం వాయించడంలో ప్రసిద్ధుడు, ఎంతోమందికి హార్మోనీ వాయిద్యాన్ని నేర్పారు. హరికథలు చెప్పడంలో నేర్పరి. పాత్రలను పాత్రోచితంగా నటించగల సమర్థుడు. సంగీత సాహిత్యాలలో మంచి అభినివేశం కలవారు.

ఏభై సంవత్సరాల వయసుగల కోమటి రామచంద్రయ్య సంగీత సాహిత్యాల లోనూ పాత్రోచిత నటనలోనూ అనుభవజ్ఞుడైన నటుడు.

ఇంకా డి. రామకృష్ణయ్య అన్నిరకాల పురుష పాత్రలనూ సమర్థవంతంగా పోషిస్తున్నారు.

టి. ఎన్. లోకనాథం విభిన్న మనస్తత్వాలుగల స్త్రీ పురుష పాత్రలను ధరించటంలోనూ, సూత్రధారి పాత్రను నిర్వహించడంలోనూ సమర్థుడు.

ఎస్. ఎమ్. శేషప్ప వివిధ స్త్రీ పురుష పాత్రలను సమర్థవంతంగా నటించడమే కాక, గంభీరమైన కంఠస్వరం గల నటుడు.

పి. ఎస్. రంగస్వామి స్త్రీ పురుష పాత్రలను ధరించడంలో మేటి. వి. మునివెంకటప్ప స్త్రీ పాత్రల్నీ, హాస్య పాత్రల్నీ చక్కగా పోషిస్తాడు.

ఈ సమాజంలో మరెందరో సహాయ నటులు ఆయా పాత్రలను పోషిస్తూ, హంగుదారులుగా వారి నాటక సమాజాన్ని ముకుటాయమానంగా నిర్వహిస్తున్నారు.



## కర్నూలు జిల్లా

ఈ జిల్లాలో ఒకప్పుడు పౌతకమూరి భాగవతులు ప్రసిద్ధంగా వీధి నాటకాలను ఆడారు. కోటకొండ కపట్రాల గ్రామాలలో చల్లావారు కూచిపూడి పద్ధతిలో బనగానపల్లి నవాబుల ఆవరణలో రాయలసీమలో భాగవత కళను ప్రచారం చేశారు. మరెన్నో బయలు నాటక దళాలు పని చేశాయి.

## నెల్లూరు జిల్లా

నెల్లూరు జిల్లాలో యానాది జాతివా రెక్కువ. వారిలో ఎంతోమంది ఉత్తమ కళాకారులు వుద్భవించారు. పాటలు పాడటం, నృత్యాలు చేయటం, పౌరాణిక గాథలకు సంబంధించిన అనేక భాగవత నాటకాలను వీధినాటకాలుగా ప్రదర్శించారు.

## గుంటూరు జిల్లా

ఒకప్పుడు ఈ జిల్లాలో కీలుబొమ్మలాటలవారు విరివిగా వుండేవారు. వేటపాలెంలో వీధినాటక కళాకారులైన గుట్టి వెంకట శివయ్య, గూడాదత్తుని వెంకటేశ్వరరావు, పి. మాణిక్యం, పాలగారి వెంకటేశ్వర రెడ్డి, యం. ఆంజనేయశర్మ మొదలైనవా రుండేవారు. గుట్టి వెంకట శివయ్య బుర్రకథ దళంగాను, దొడ్డారపు వెంకటస్వామి మేనల్లుడు యల్లమంద జంగం కథకుడుగాను, తమ్మారపు వెంకటస్వామి వీధినాటకాలను ఆడేవారు. దొడ్డారపు వెంకటస్వామి ఆ రోజుల్లో గొప్ప జంగం కథాగాయకుడుగా వెలుగొందాడు.

## కృష్ణా జిల్లా

కూచిపూడి భాగవతులు యక్షగానాలు, వీధినాటకాలు ప్రదర్శించారు ఎంతోమంది పగటి వేషధారు లుండేవారు. అలాగే గడ్డిపాడులో ఎంతోమంది పగటి

వేషధారు లుండేవారు. ఒకప్పుడు ఎన్నో జంగాల బుర్రకథ దళాలు, గొల్లభాగవతులు, మాలభాగవతులు, నంగెగెడ్డలో ఎంతోమంది దేవదాసీ కళాకారిణు లుండేవారు.

## మహబూబ్‌నగర్ జిల్లా

వుప్పేరు, ఇది గద్వాలకు దగ్గరలో నున్న చిన్న గ్రామం. ఇక్కడ ''బయలు నాటకాలకు'' కోలాట సమాజాలకు ప్రసిద్ధి.

బయలు నాటకాలు ''నెక్కటపల్లి'', గిట్టూరు మొదలైన చోట్ల ''కర్రల కోలాటం'', చెక్కభజన సమాజా లున్నాయి. పెద బసవయ్య, వడ్ల వెంకటరామయ్య పేరు పొందిన కళాకారులు.



జడచర్ల దగ్గరలో వున్న అచ్చంపేటలోనూ, అమరబాద్‌లోనూ, చెంచులి నృత్యదళా లున్నాయి. కోలాట దళాలు విరివిగా పని చేశాయి.

పిసిపూర్‌లో హరికథలు చెప్పేవా రున్నారు. మొయిన్‌పేట, పుట్లూ( గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేశాయి.

చెంగోల్, గోనెల్లి, మిట్టబాసపల్లె, కోటబాసిపల్లి, అలంపూర్, ఆగ్‌నూర్, మంచాపూర్, పెద్దిమాల్, కందనెల్లి, బొప్పారం గ్రామాల్లో చిరుతల భజన, కోలాట దళాలు పనిచేశాయి.

పెదమాల్, గోవిందరావుపేట గ్రామాల్లో బుర్రకథ దళాలూ, చెంగోల్ అల్లిపూర్ అగ్‌నూర్, కొత్తబాసపల్లి, కందనెర్లి, పెదమాల్, బొప్పారం గ్రామాల్లో

భాగవత దళాలూ, శంకరరెడ్డిపల్లె, మంతనగౌడ, తట్టిపల్లి మొదలైన గ్రామాలలో లంబాడినృత్య దళాలూ పనిచేశాయి.

వనపర్తిలో సంగీత శాఖలతోపాటు దగ్గరలో వున్న గోపాలపేటలో తోలు బొమ్మలాటవారున్నారు. వనం శేషాచార్యులు, పాపయ్య, టి. గోపాల్—శ్రీమతి రాధమ్మ - వెంకట రామారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

జడచర్లలో భారత సంగీత నాటక కళాశాల నడిచింది. దగ్గరలోనున్న కలువ కుర్తిలో భజన సమాజాలు పనిచేశాయి. అచ్చంపేటలోనూ, అమరబాద్‌లోనూ చెంచుల నృత్యదళాలు పనిచేశాయి.

## హైదరాబాదు

1956 ప్రాంతంలో గిరిజన నృత్యశాఖను గోపాల్‌రాజ్ భట్ స్థాపించారు. ఈ సంస్థలో అధ్యక్షులుగా కాళోజి నారాయణరావు పనిచేశారు.

ఏభై సంవత్సరాల క్రితం గగనమహల్ రోడ్‌లో ఒక యక్షగాన బృంద ముండేది. అలాగే గౌలిగూడాలో శ్రీ రామారావు అధ్వర్యంలో చిరుతల రామాయణం దళం పనిచేస్తూ వుండేది.

నాంపల్లిలో ఒక కోలాట బృందం, ఒక ఒగ్గుకథ బృందం వుండేది. ఆ బృందంలో కందస్వామి, రఘు, రాఘవులు ముఖ్యకళాకారులుగా పనిచేసేవారు.

### హైదరాబాదు జిల్లా

హయత్‌నగర్‌లో లోగడ 'చిరుతల రామాయణం', జడకోపు కోలాట సమాజాలు పనిచేశాయి.

ఈ సమాజంలో 'పుట్టా సత్తెయ్య, యస్. వెంకటాద్రి, హనుమంతయ్య, రత్నమాచారి, వెంకోబారావు, ఏ. రాజయ్య, ఆకుల వీరయ్య, జనగామ శంకరప్ప, ., తిరుపతి మొదలైనవారు పనిచేశారు.

నెత్నూర్, రాజలూరు, తిమ్మాపూరు మొదలైన ఇబ్రహీం పట్నం చుట్టు ప్రక్కలున్న పై గ్రామాల్లో 'యక్షగాన, భజన సమాజాలు పని చేశాయి.

మేడిచల్ చుట్టుప్రక్కల గ్రామాలైన 'రాంపల్లి' 'అలియాబాద్' 'తురక పల్లి' 'మరపల్లి' 'దుండిగాల్' మొదలైన గ్రామాల్లో బుర్రకథ దళాలు పని చేశాయి.

'రాంపల్లి' మేడిచల్' 'పుదూర్' 'యంజాల్-అలియాబాద్' 'యాదరమ్' 'యద్గరపల్లె' 'కిసకొసైగూడ' వడ్డిమట్టి' 'దుండిగాల్' మొదలైనచోట్ల 'చిరుతల భజన' కోలాట దళాలు పనిచేశాయి.



మేడ్చల్‌లో 1952 లో బాలశంకర సమాజం ఏర్పడింది. 'రాంపల్లి' 'అరయా బాద్' 'తురకపల్లి' 'మరపల్లి' 'దుండిగాల్' మొదలైన గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేశాయి.

'రాంపల్లి' 'మేడ్చల్' 'పుదూరు' 'యంజార్' 'అలియాబాద్' 'తురకపల్లి' 'మరపల్లి' 'దుండిగాల్' మొదలైన గ్రామాల్లో భజన సమాజాలు విరివిగా పని చేశాయి. అలాగే షాబాదులో బుర్రకథ దళాలు పనిచేశాయి.

'బూరుగుపల్లి' 'దుగ్గనచెరువు' 'బన్వారం' 'అమరవాది' 'కొల్లాపూర్' 'కోమశెట్టి పల్లె' 'బీల్‌కాల్' 'బుద్దారాంపల్లి గ్రామాల్లో భజనసమాజాలు పని చేశాయి.

## ఇబ్రహీంపట్నం :

ఇక్కడ శంకరనారాయణ భజనమండలి, ఓంకారభజన నాటక సమాజాలు పని చేశాయి.

చుట్టుప్రక్కల గ్రామాలైన 'మహాసురం' 'నెత్నూరు' 'రాచలూరు' 'తిమ్మాపూరు' మొదలైన గ్రామాల్లో యక్షగాన భజన సమాజాలు వున్నాయి. ఈ సమా

జాల్లో బి. రంగారెడ్డి, ఘటం సత్యనారాయణ, మల్లారెడ్డి, బుగ్గ రామదాసు, చంద్ర శేఖరశర్మ మొదలైనవారు పనిచేశారు.

పెదమాల్, గోవిందరావుపేట గ్రామాల్లో బుర్ర కథ దళాలూ.

చెంగోల్, అల్లిపూర్ - అగ్‌నూర్ - కొత్తబాసపల్లె - కందనెర్లి - పెదమాల్- బొబ్బారం గ్రామాల్లో భాగవతదళా లున్నాయి.

శంకరరెడ్డిపల్లి, మంతనగౌడ, తట్టిపల్లి మొదలైనచోట్ల లంబాడి నృత్య దళాలు పని చేశాయి.

రాంపల్లి, దుల్‌పల్లె, అలియాబాద్, తురకపల్లి, యద్గరపల్లె - ఖమరపల్లి, దుండిగాల్ మొదలైనచోట్ల బుర్రకథ దళాలు పనిచేశాయి.



అలాగే రాంపల్లె, దుల్‌పల్లె, మేడ్చల్, పుదూర్, యంజాల్, అలియాబాద్, యాదరమ్, యద్గరపల్లె, కీసర, కౌసహైగుడ, వడ్డెమర్రి, దుండిగాల్ మొదలైన గ్రామాలలో భజన సమాజాలు పనిచేశాయి.

వికారాబాద్ చుట్టుప్రక్కల గ్రామాలైన బూరుగపల్లి, దుర్గంచేరు, అమరాది, కోట్లాపూర్, కోమశెట్టిపల్లె, చిల్‌కాల్, బుధ్ధర, రాంపల్లి మొదలైన గ్రామాలలో భజన సమాజాలూ, కోలాటదళాలూ విరివిగా పనిచేశాయి.

చుట్టుప్రక్కల గ్రామాలైన మొయిన్‌పేట, పొట్లూరు గ్రామాలలో బుర్రకథ దళాలూ, శిరిపూర్ గ్రామంలో హరిదాసులూ, హరికథా గానం చేసేవారూ వుండేవారు.



తాండూరు చుట్టుప్రక్కల గ్రామాలైన చెంగోలి, గోనెల్లి, మిట్టబాసపల్లి, కోడబాసపల్లి, అల్లాపూర్, మంతన గూడ, అగ్నూర్, గోవిందరావుపేట, మంబాపూర్, రుక్మాపూర్, పెద్దిమాలకండనెల్లి, బ్రిధారమ్, బొబ్బారం మొదలైన పల్లెలలో చిరుతల భజన, కోలాటదళాలు పని చేశాయి.

బుద్దారం, పెద్దమాల్, గోవిందరావుపేటలలో బుర్రకథ దళాలు పనిచేశాయి.

చెంగోల్, అల్లాపూర్, మంతనగౌడ, అగ్నూర్, కోటబాసపల్లి, కందనెల్లి, పెడమాల్, బొబ్బారం గ్రామాలలో భాగవతదళాలు పని చేశాయి.

అలాగే షంకర్. రెడ్డిపల్లె. మంతనగౌడ, తట్టెపల్లి, పసహపూర్‌తండా, షైరాంతండా మొదలైన గ్రామాలలో 'లంబాడీ' నృత్యకారు లున్నారు.

## మెదక్ జిల్లా

మెదక్ జిల్లాలో భాగవత దళాలూ, చిరతల రామాయణం ప్రదర్శించే సమాజాలు, కోలాటం మొదలైన జానపద కళారూపాలను ప్రదర్శించే బృందాలు విరివిగా వున్నాయి.



సంగారెడ్డిలో జడకోపు కోలాట సమాజాలు, వీథి భాగవత దళాలు విరివిరా వున్నాయి. సదాశివ పేటలో భాగవత దళాలను పడిగి నారాయణ, మారేపల్లి యజ్ఞ నారాయణ మొదలైన కళాకారులు నిర్మాణయుతంగా నడుపుతున్నారు. శ్రీ గోవింద దాసు అధ్వర్యంలో మూడు చిరుతల భజన సమాజాలు నడిచాయి. మారేపల్లి, సూరారం, నందికుండి, నిజాంపూర్, వెంకటపూర్, తంగడంపల్లె మొదలైన గ్రామాల్లో కూడ చిరుతల రామాయణం భజన సమాజాలు నడిచాయి. ఈ సమాజాల్లో రామకృష్ణ, శంకరరావు, నరసింహారెడ్డి మొదలైన కళాకారులు పనిచేశారు.

జహీరాబాదు తాలూకా బిలాల్‌పూర్‌లో ఒక బుర్రకథ దళం పనిచేసింది. కొహిర్, ముగుదం పల్లి, అజాద్‌గంజ్, దిగ్వాల్, రంజోల్, చీరిక మొదలైన

గ్రామాల్లో వీధి భాగవత దళాలు, తోలుబొమ్మల దళాలు సమర్థవంతంగా పని చేశాయి.

బిలాల్‌పూర్, కొహిర్, రంజోల్ మొదలైన గ్రామాలలో చిరుతల భజన సమాజాలు నడిచాయి.

మీర్జాపూర్ దగ్గర నున్న రామగుండం, చిటికుర్తి గ్రామాల్లో భజన సమాజాలు నడిచాయి. వామనపల్లి, సిద్దపూర్, దోనపల్లి మొదలైన గ్రామాల్లో లంబాడి నృత్య దళాలు పనిచేశాయి.

జోగిపేటకు దగ్గరలో నున్న కనకం పల్లె, పెదపూర్, తికమల్ రామన్నపేట గ్రామాల్లో భాగవత దళాలు పనిచేశాయి.

కనకం పల్లి, పెదపూర్ గ్రామాలలో చిరుతల కోలాటం సమాజాలు నడిచాయి. వాసుదేవ, ఆదెప్ప మొదలైనవారు పనిచేశారు.

## నిజామాబాద్ జిల్లా

నిజామాబాదుకు నలభై మైళ్ళ దూరంలో వున్న బన్సువాడలో భీమశాస్త్రి హరికథ చెప్పడంలో ప్రసిద్ధి వహించారు. అచ్చంపేటలో శ్రీనివాసరావు కోలాట సమా



గాన్ని రైతునగర్‌లో పొట్లూరి వీరభద్రం, రంగనాయకులు, ఒక భాగవత సమాజాన్ని డిపారు.

బిరకూర్, మొహద్ నగరాల్లో భజన పార్టీలు పనిచేశాయి.

బిరకూర్, పిట్లాం గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేశాయి. దుకి, తడికేల్, తిరుమల పూరుల్లో కూడ వీధి భాగవత సమాజాలు పనిచేశాయి.

బోధన్‌కు దగ్గరలో వున్న రుద్రూరు, జహదిగ్మలపూర్‌లో, భజనపార్టీలూ భాగవత సమాజాలూ పనిచేస్తూ వున్నాయి. ఈ సంస్థల్లో కాశీనాథ్, వెంకటేశ్వర్లు, జైపాల్, కోటయ్య, వీరేశమ్, శ్రీమతి వీరేశ్వరమ్ మొదలైన నటీనటులు పని చేశారు.

## ఆదిలాబాదు జిల్లా

ఆదిలాబాద్ జిల్లాలో యప్పలగూడ, బాందా, కప్పరాళ్ళ మొదలైన ప్రదేశాల్లో యక్షగానాలను ప్రదర్శించే సమాజాలు పనిచేశాయి. అదిలాబాద్ తాలూకా సంకిడి గ్రామంలో ఒక డప్పుల నృత్యబృంద ముంది.



ముధోల్ చుట్టుపట్ల గ్రామాలైన భాయనాపి, కొత్తగని, మీర్జాపూర్, తిమ్మాపూర్, దిగమ, సుంకలి, మహాజమ్, చుండి, కోమరిమంజరి, బాసార్ మొదలైన గ్రామాలలో యక్షగాన బృందాలు పనిచేశాయి.

ఘనపురం తాలూకా కన్నపూర్, దస్తురాబాద్, కాలీమడుగు, ఇందనపల్లి, రామోజీపేట మొదలైన ప్రాంతాల్లో యక్షగాన దళాలు పనిచేశాయి. పద్ల నరసింహులు, నరసింహయ్య, గోవిందరావు, వెంకటరెడ్డి మొదలైన కళాకారులు ఈ దళాల్లో పనిచేశారు.

లక్సెట్టిపేట తాలూకా మున్నూర్, పొట్టాయిపల్లె, రాయంపేట, దౌడపల్లె మొదలైన చోట్ల వీధి నాటక సమాజాలు పనిచేశాయి. రాయంపేటలో ఒక బుర్రకథ దళం కూడా వుండేది.

చిన్నూర్ ప్రాంతంలో కొత్తపల్లె, సీలవాయి గ్రామాలలో వీధి భాగవత దళాలూ, వేమనపల్లె, సీనాల్, భీమవరం, మిట్టపల్లె, అదిల్‌పేట, సిర్వా ఆమద్ మొదలైన గ్రామాలలో యక్షగాన దళాలు పనిచేశాయి.

ఈ దళాలలో జక్కిపల్లి కృష్ణయ్య, సాంబయ్య, బిన్‌రెడ్డి మొదలైనవారు పనిచేశారు.

నిర్మల్ హస్తకళలకు ప్రసిద్ధిచెందిన గ్రామం. ఇక్కడ చిరుతల రామాయణం ప్రదర్శించే జానపద కోలాట సమాజం పనిచేసింది. ఇది తెలంగాణాలో ఒక ప్రత్యేకమైన కళారూపం.

# కరీంనగర్ జిల్లా

కరీంనగర్ జిల్లాలో ముస్తురాపూర్, జాగిర్ల, మొగిలిపాలెం, గంగిపల్లి, మానకొండూరు, గోపాలరావు పల్లె, వెదురుగట్టు మొదలైన గ్రామాలలో యక్షగాన దళాలు, తోలుబొమ్మల ఆటలు ఆడే దళాలు పనిచేశాయి.

హుజూరాబాద్‌కు దగ్గరలోనున్న తాటికంటి మొదలైన చోట్ల వీథినాటక దళాలు పనిచేశాయి. హుజూరాబాదుకు ఆరు మైళ్ళ దూరంలో వున్న మాణిక్యాపూర్‌లో విప్రవినోదులు ఒకప్పుడు ముప్పై కుటుంబాల వారున్నారు. పదిహేను మైళ్ళ దూరంలోవున్న వల్లభాపురంలో సాధనాసూరులు పద్మసాలి కుటుంబానికి చెందిన వారున్నారు. ఈ తాలూకాలో ప్రతి గ్రామంలోనూ చిరుతల రామాయణం కళారూపం బహుళ ప్రచారంలో వుంది.



జగిత్యాలకు దగ్గరలో నున్న భీమారం, బల్లికోడూరు, కొండపల్లి, రాయికాల్, ఖాల్‌గడ, ధుల్యాల్, కోడూరు పల్లి మొదలైన చోట్ల యక్షగాన దళాలు పనిచేశాయి. బుగ్గారం గ్రామంలోనూ చిరతల రామాయణం కోలాటం దళాలు విరివిగా వున్నాయి ఒకనాడు.

పైన ఉదహరించిన కళారూపాల్లో వెంకటరెడ్డి, దావూరి వెంకటాచారి, శంకరయ్య, మనోహరాచార్య, లక్ష్మీకాంత శాస్త్రి, పేట కాంతయ్య, చంద్రమౌళి శాస్త్రి, అనంతయ్య మొదలైన కళాకారులు పనిచేశారు.

కరీంనగర్ జిల్లా మంథనిలో చిరుతల రామాయణం భజన సమాజాలు విరివిగా వున్నాయి. మంథనికి దగ్గరలో నున్న మహదేవపూర్‌లో బంజారా దళాలు పనిచేశాయి.

మెట్టుపల్లి తాలూకాలో అనేక గ్రామాల్లో భాగవత దళాలు పనిచేశాయి. ఇటికాల్, సత్తారం, తక్కెడపల్లి, శ్రీకొండ, శ్రీపురం, మానపల్లె, వెల్లుట్ల, మన్నెగూడెం మొదలైన గ్రామాల్లో భాగవత దళాలు పనిచేశాయి.

శిరిసిల్ల తాలూకా బూరుగుపల్లి, హనుమాజి పేట, నూకలదుట్టి గ్రామాల్లో యక్షగాన దళాలు పనిచేశాయి.

సుల్తానాబాదుకు దగ్గరలో కూచిపూడి అనే గ్రామం వుంది. ఇక్కడ కూడ కూచిపూడి నృత్యముంది.

కరీంనగర్ జిల్లాలో యక్షగానం జాతీయస్థాయిలో గుర్తింపు పొందింది. శ్రీ గజవెల్లు వెంకట నర్సు, తీగల గుట్టపల్లి బృందం ఈ ప్రాచీన కళారూపాన్ని ప్రదర్శించారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఒగ్గు కథ బాగా చెప్పే వారిలో మొదటి శ్రేణికి చెందిన వారు శ్రీ మిద్దె రాములు. హనుమాజి పేటకు చెందిన రాములు పదిహేను సంవత్సరాల నుండి తన బృందంతో ఒగ్గుకథలు చెపుతున్నారు. సారంగధర, గంగాగౌరి సంవాదం, నల్లపోచమ్మ, అమెరికా రాజు కథ, కాంభోజ రాజు కథ, భక్తమార్కండేయ కథ, మాంధాత, సిరిదేవి, పెద్దమ్మరాలు, రామాయణ భారత కథలను ఒగ్గుకథలుగా చెప్పారు.

మిద్దె రాములుతో ప్రభుత్వం, వయోజన విద్య, కుటుంబ నియంత్రణ మొదలైన కథలను ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఢిల్లీ, బొంబాయి లాంటి ప్రదేశాల్లో ప్రదర్శనలిప్పించింది. కొత్తపల్లి రాజమల్లయ్య, మాట్ల మల్లేశం మొదలైనవారు కూడా ఒగ్గు కథలను చెపుతూ వుండేవారు.

కరీంనగర్ జిల్లాలలో బుర్రకథలు చెప్పే బృందాలలో ముఖ్యమైనది మానకొండూరు హమనమూర్తి బృందం. ఇందిరాగాంధీ స్మారక అవార్డును కూడా అందుకున్న దళం. అలాగే గట్టు దుద్దెనపల్లి వెదురుగట్టలో కూడా బుర్రకథ దళాలు పని చేశాయి.

ముఖ్యంగా గణపతి నవరాత్రి ఉత్సవాలలోనూ, దసరా వుత్సవాలలోనూ కోలాటం వేయటం. ఆనవాయితీ, కొండాయిపల్లె బృందం కృష్ణలీలలు ప్రదర్శిస్తుంది. ఇంకా రాచపల్లి, వెల్లుల్ల, పెంబట్ల, కోనాపూర్, కొండన్నపల్లె గ్రామాలకు చెందిన బృందాలుకూడ కోలాటాన్ని ప్రదర్శించారు.

## విశాఖపట్నం జిల్లా

విశాఖ జిల్లా మాడుగులకు రెండు మైళ్ళ దూరంలో వున్న గుట్టాలపేట, హుకుంపేట గ్రామాల్లో అడవి జాతులకు సంబంధించిన ప్రజ అనే నృత్యాన్ని చేస్తూ వుంటారు.

అంపోలు - అడ్డవరం:

శ్రీకాకుళానికి నాలుగు మైళ్ళ దూరంలో ఈ రెండు గ్రామాలూ వున్నాయి. ఇక్కడ రంజకవరు అనే ఋంజ వాయిద్య బృందాలు వుండేవి. ఈ వాయిద్యాలు శివపార్వతుల కళ్యాణ సమయాలలో ఉపయోగిస్తారు. వీటి ధ్వని బ్రహ్మాండమైనది. దీనిని ముఖ్యంగా విశ్వబ్రాహ్మణ జాతికి చెందినవారు వాయిస్తూ వుంటారు. వీరు పుష్యమాసంలో ఆయా గ్రామాలు వెళ్ళివస్తూ వుంటారు. ఋంజ కథను మరోచోట ప్రస్తావించటం జరిగింది.

ఋంజ వాయిద్య కళాకారులు వి. ఆంజనేయులు, జంగం సత్యనారాయణ, మిరియాల కోటిలింగం, యస్. యన్. అప్పయ్య మొదలైనవారు.

## విశాఖపట్టణం

విశాఖపట్టణంలో ఎన్నో బుర్రకథ దళాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి కళామతల్లి బుర్రకథ బృందం, రామజోగి పేట, కొమరశ్రీ బుర్రకథ దళం, వెంగళ రావుపేట, భవానీ బుర్రకథబృందం, కుమ్మరి వీధి కనకమహాలక్ష్మి బుర్రకథ దళం, న్యూ కాలనీ, అభ్యుదయ బుర్రకథ బృందం, సీతమ్మపేట విశ్వేశ్వర బుర్రకథ దళం, ఇసుకతోట, నాయుడు మాస్టరు బుర్రకథ దళం, అనకాపల్లి శ్రీనివాసా బుర్రకథ దళం పనిచేశాయి.



శ్రీ అప్పలదాసు "ఇసుకతోట" చుక్కాకుల సూరి బృందం, యస్. కోట మొదలైన బృందాలు జముకుల కథలు చెప్పాయి.

విజయనగరం:

అభ్యుదయ కళామండలి విజయనగరం కుమ్మరి మాష్టారు డి. ఎ. నారాయణ బుర్రకథలను జానపద కళారూపాలను ప్రదర్శించారు. సంపత్కుమార్ బృందం

ఇంద్రజాలరితోపాటు జానపద కళారూపాలను ప్రదర్శించారు. ఇంకా రాఘవకుమార్, కొంగలి సత్యనారాయణమూర్తి, రావుపట్నాయక్ బుర్రకథ దళం, గుండ్రా పద్మనాభరావు, రవికుమార్ దళం - సూర్యప్రకాశ్ బృందం పనిచేశాయి.

యండమూరి అమ్మాజీ బృందం, సామవేదం కోటేశ్వరరావు భాగవతార్, కొలచల ఇందిరాబాల మొదలైనవారు హరికథలు చెప్పటంలో ప్రసిద్ధి చెందారు.

## శ్రీకాకుళం జిల్లా



ఈ జిల్లాలో ఈ క్రింది దళాలు బుర్రకథ దళాలుగా వర్ధిల్లాయి. లలితకళా సమితి బృందం శ్రీకాకుళం అంపోలు లక్ష్మయ్య బృందం, పొందూరు రమణశ్రీ బుర్రకథ దళం, చీపురుపల్లి శ్రీనివాస కథా బృందం నరసన్నపేట.

### తూర్పు వీథిభాగవత బృందాలు :

కానేటి అప్పారావు నర్సీపట్నం, కొచ్చెర్ల బ్రహ్మానందం లక్కవరపుపేట, ఆవల గాంధీబృందం శ్రీరాంపురం, రావులవలస.

## తూర్పుగోదావరి జిల్లా

ఈ జిల్లాలో పగటి వేషధారులు, కోలసంబరం, వీర నాట్యం, తప్పెటగుళ్ళు మొదలైన కళారూపా లున్నాయి. కాకినాడ, మాధవపట్నం, సర్పవరం మొదలైన చోట్ల తోలుబొమ్మలాటల బృందాలున్నాయి. యం. వి. రమణమూర్తి, కృష్ణమూర్తి తోలుబొమ్మలాటలో ప్రసిద్ధులు.

రాజమండ్రిలో వున్న విభూతి భవానీలింగం పగటి వేషాలను ధరించటంలో ప్రసిద్ధులు. వీరికి ప్రత్యేక బృందముంది. తూర్పు గోదావరిజిల్లా పగటివేషధారుల సంఘాన్ని నడుపుతున్నారు.

అలాగే గజపతి నగరంలో తప్పెటగుళ్ళు బృందాలు, ద్రాక్షారామలో జుంజ వాద్యకుల బృందముంది.

# మరి కొందరు కళాకారులు

ఎందరో ఈ కళారంగానికి సేవ చేశారు. వారిలో మరి కొందరిని ఇక్కడ ఉదహరిస్తున్నాను. కరుమజ్జ అప్పారావు విజయనగరం, కత్తిసాములో ఆరితేరిన వారు. నెల్లూరు జిల్లాకు చెందిన కె. కళాధర్, మూకాభినయంచేసే కళాకారుడు.

డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డి అనంతపురం జిల్లా, సుబ్బరావుపేట. చెక్క భజన, జానపద నృత్యకళ, గ్రామీణ సంస్కృతి, ధర్మవరం తాలూకా, జానపద గేయాలు, గ్రంథాల రచయిత, తెలుగు విశ్వవిద్యాలయం జానపద కళల శాఖలో పని చేస్తున్నారు.

ఆమ్మళ్ళ చిన్నగోపీనాథ్ అనంతపురం జిల్లా, అప్పరాచ్చెరువు. జానపద నృత్య కళాకారుడు.

జొజ్జవరపు బసవయ్య కృష్ణాజిల్లా ఉంగుటూరు డప్పు వాయిద్యంలో నిపుణులు.

బొంతలకోటి జగన్నాథ భాగవతార్ విజయనగరం జిల్లా, చింతాడ: తూర్పు వీథిభాగవత కళాకారుడు, కోమటపల్లి.

పోలాప్రగడ జనార్ధనరావు మూకాభినయ నటుడు. సికింద్రాబాదు, తారనాక.

కరణం తిప్పరాజు బి.ఏ., బి.యిడి. హిందూపురం. యక్షగాన కళాకారుడు.

డి. దేవవ్రత్, హనుమకొండ. జానపద కళాకారుడు. కోరాడ పోతప్పదు. శ్రీకాకుళం జిల్లా షేరుమహమ్మదుపురం, తప్పెటగుళ్ళు కళాకారుడు. మానాప్రగడ నరసింహమూర్తి, హైదరాబాదు, జానపద లలితగీతాల గాయకుడు. కురవనాగన్న అనంతపురం, గొరవయ్యల నృత్య కళాకారుడు.

విభూతి భవానీలింగం, పగటి వేషధారుల్లో అగ్రగణ్యుడు. వీరిని గురించి ఇదివరకే వివరించటం జరిగింది. కనకదండు మల్లయ్య తాళ్ళపాక గ్రామం. చెక్క భజనలో నిపుణులు; కలిమిశెట్టి మునెయ్య ప్రొద్దుటూరు; జానపద కళాకారుడు. కలిమిశెట్టి రామశేషయ్య జానపద కళాకారుడు అనంతపురం.

జి. వీణాదేవి, చిత్రకళలో ప్రజ్ఞాశాలి. మల్లేశ్వరం బెంగుళూరు. గిత్తా వెంకటేశ్వరరావు, బండారులంక, గరగనృత్యంలో నిపుణులు. చింతా వెంకటేశ్వర్లు వెలపల్లి. వీరనాట్య బృందాన్ని నడుపుతున్నారు. వీరిని గురించి వీరనాట్యంలో ఉదహరించబడింది. తిరుపతి శేషయ్య గెట్టిపల్లి, యక్షగాన కళాకారుడు. కింతాడ

సన్యాసిరావు భాగవతార్, శిల్పకళలో ప్రావీణ్యుడు. తూర్పుగోదావరి, పెద్దాపురం. సుక్క సత్తెయ్య, ఒగ్గు కథలో నిష్ణాతుడు. ఒగ్గుకథా వివరణలో వీరిని గూర్చి వివరాలు ఇవ్వబడ్డాయి. దికొండ సారంగపాణి, హనుమకొండ - జానపద సంగీత కళాకారుడు. ఏ. సుబ్బయ్యనాయుడు, కుప్పం మండలం, కొత్త ఇండ్లు గ్రామం. వీథినాటకంలో ప్రసిద్ధులు. పిల్లి సుబ్బారావు, గరగ నృత్య కళాకారుడు, కొత్తపేట. సౌమిత్రి జమిస్తాన్‌పూర్, జానపద కళాకారుడు. హరియపురాజు హృషికేశవరావు, కడప జానపద కళాకారుడు.





# జానపద కళారూపాలు
# ప్రజానాట్యమండలి
# ప్రగతిశీల దృక్పథం



నాటకరంగానికి మాతృకలై యుగయుగాలుగా తరతరాల వైభవాన్ని సంతరించుకున్న జానపద కళారూపాలను గురించి, ఈ తరంవారికి చాలామందికి తెలియదనటం అతిశయోక్తి కాదు. అది తరతరాల వైభవం, తరగని వైభవం.

మన నాటకరంగానికి నూరేళ్ళు పూర్తి అయ్యాయి. అలాగే నాటకాలనే వృత్తిగా చేసుకుని జీవిస్తున్న సురభి నాటకరంగం ఏర్పడికూడా నూరు సంవత్సరాలైంది. ఇటీవలనే చలనచిత్ర పరిశ్రమ స్వర్ణోత్సవాలను జరుపుకుంది. ప్రాచీన జానపద కళారూపాలను పునరుద్ధరించి నూతన ప్రయోగంతో ఆధునిక పద్ధతులలో ప్రజల మధ్యకు పోయి కళారూపాలలో ప్రజా సమస్యలను జోడించి నవ చైతన్యం కలిగించిన ప్రజానాట్యమండలి ఏర్పడి నలభై ఆరు సంవత్సరాలైంది.



ప్రజానాట్య మండలి నిర్మాతల్లో ప్రముఖుడు డా॥ రాజారావు

## నూరు సంవత్సరాల ముందు :

అయితే నూరు సంవత్సరాల ముందు నాటకరంగం లేనినాడు మన ప్రజల కున్న కళారూపాలేమిటి? వారంతా ఎలా జీవించారు? వారి విజ్ఞాన వినోద వికాసాలకు

ఉపయోగపడిన కళారూపాలేమిటి? అని మనల్ని మనం ప్రశ్నించుకుంటే మనకు కనిపించేవి ఆనాటి జానపద కళారూపాలే.

జానపద కళారూపాలంటే ఈనాడు చాలమందికి అర్థంకావు. జానపదమంటే పల్లెటూరని, జానపదంలో నివసించేవారు జానపదులనీ, వారు పాడుకునే పాటలుగానీ, ఆటలుగానీ, నృత్యంగానీ, జానపద కళారూపాలని పెద్దలు నిర్వచించారు.

జానపద గేయాలనీ జానపద సాహిత్యమనీ, జానపద వీధి నాటకమనీ, తోలు బొమ్మలనీ, బుర్రకథలనీ, పగటివేషాలనీ, ఇలా ఎన్నో వందలాది జానపద కళా రూపాలు ఆనాడు పల్లె ప్రజలకు విజ్ఞాన వినోదవికాసాన్ని కలిగించాయి.

## ఆంధ్రుల సాంఘిక చరిత్ర :

ఆంధ్రుల సాంఘిక చరిత్ర రెండువేల సంవత్సరాల నాటిది. నాటినుంచి నేటి వరకూ ఆ యా రాజుల కాలాల్లో రకరకాలుగా ఈ జానపద కళలు అభివృద్ధి చెందాయి. శాస్త్రీయ కళలతో పాటు జానపద కళలుకూడా అభివృద్ధి పొందాయి. ప్రజలు ఆదరించారు.

శతాబ్దాలుగా రాజులు పోయినా, రాజ్యాలు మారినా జానపదకళలు మాత్రం ప్రజాహృదయాలలో అలాగే నిలిచివున్నాయి. ఎన్ని ఆటుపోటులు వచ్చినా ప్రజలు వాటిని పోషించారు. కళాకారులను కన్నబిడ్డలుగా చూసుకున్నారు. తెలుగుజాతి గర్వించతగిన కళారూపాలవి.

నాటకం, సినిమా, రేడియో, టెలివిజన్ లాంటి ఆధునిక ప్రక్రియలు రావడంతో ఈనాడు వాటిపట్ల ఆదరణ తగ్గింది. జానపద కళలను పోషించేవారు తగ్గి పోయారు. కళాకారులు కడుపుకోసం, కళలనే పట్టుకుని దేశసంచారులుగా తిరుగుతూ కళాప్రదర్శనాలను ప్రదర్శిస్తూ చాలీచాలని ఆదాయాలతో కడుపు నింపుకుంటూ జీవిస్తున్నారు.

## జాతీయ ఉద్యమం, జాతీయ గీతాలు :

ప్రజా నాట్యమండలి ఏర్పడే నాటికి ముందే ఏర్పడిన వైజ్ఞానిక దళాలు, ప్రాచీన జానపద కళారూపాలను నూతన స్థాయిలో పునరుద్ధరించటానికి ముందే జాతీయోద్యమ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జాతీయ నాయకులు చేపట్టిన ఖాదీ కార్యక్రమమూ, రాట్నం వడకడమూ, సత్యాగ్రహ వుద్యమమూ, మద్యపాన నిషేధమూ, హిందీ వుద్యమమూ, గణేష్ వుత్సవాలూ మొదలైన ఉద్య

మాలు చోటు చేసుకున్నాయి. తద్వారా ఆ వుద్యమాల ప్రచారానికి ప్రజల నాకర్షించి వారిలో జాతీయోద్యమ భావాలు కలిగించాలనీ, అనేకమంది రచయితలూ, కవులూ, గాయకులూ, వారి కలాలనూ, గళాలనూ విప్పి ముందుకు నడిపించారు. ఆ విధంగా ఎన్నో గేయాలను వ్రాశారు. నాటకాలను వ్రాశారు. ప్రదర్శించారు. ఆ విధంగా వారంతా జాతీయోద్యమానికి ఎనలేని సేవలు చేశారు.

ఆకులందున అణగిమణగి కవిత కోకిల పలుకవలెనోయ్ అని గురజాడ అన్నట్లు, అతి నిరాడంబరుడైన స్వాతంత్ర్య సమరయోధుడు గరిమెళ్ళ; మాకొద్దీ తెల్లదొరతనమూ అని, కొల్లాయి గట్టితే నేమీ మా గాంధి కోమటై పుట్టితే నేమీ అంటూ బసవరాజు అప్పారావు ఆగునా జీవాలు సాగునా లోకాలు, రాజుగా మన మెంచి రైతు చూడకపోతే అంటూ సెట్టిపల్లి వెంకటరత్నమూ, శివశివమూర్తి వి గణ నాథా నీవు శివుని కుమారుడవు స్వామినాథా అంటూ అబ్బూరి, తక్కెళ్ళ జగ్గని ధర్మ పన్నాలను, మాలపల్లి ద్వారా చెప్పించిన వున్నవ లక్ష్మీనారాయణ, ఎగరాలి ఎగరాలి మన ఎర్రజండా అంటూ తుమ్మల వెంకట రామయ్యా. మద్దూరి అన్నపూర్ణయ్యా. పి. లోకనాథం, గిరిరాజు రామారావు, వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ అనే త్రిపురనేని రామస్వామి పాటా మొదలైనవే కాక, రాయప్రోలు ఏ దేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమిభారతిని, దువ్వూరు రామిరెడ్డి, కాటూరు వెంకటేశ్వరరావు, కొడాలి ఆంజనేయులు. తుమ్మల సీతారామమూర్తి మొదలైన ఎందరో దేశభక్తి మూర్తీభవించిన మహాకవులు. జాతీయతనూ. దేశభక్తినీ, రైతాంగాన్నీ, కూలీలనూ ప్రబోధిస్తూ ఆచార్య రంగా వెలువరించిన రైతు భజనావళిలో అసంఖ్యాకంగా గేయాలను వ్రాశారు. నాటి జాతీయ సభలలో అద్భుతంగా గానం చేశారు. ప్రజలను వుత్తేజపర్చారు. కార్యోన్ముఖులను చేశారు. ప్రజలను ఉద్యమ కార్యరంగంలోకి దూకేటట్లు చేశారు.

అలాంటి గీతాలను గురజాడ రాఘవశర్మగారు ఆరువందల పేజీల గ్రంథంగా సమకూర్చారు. ఆనాటి వుద్యమంలో వెల్లువగా వచ్చిన గేయాలనూ, పద్యాలనూ గీతాలనూ, భజన పాటలనూ, హరికథలుగా ఎన్నో సంకలనాలు 1922 లో వెలువడ్డాయి.

## ఇలాంటి ఎన్నో గేయ రచనలు:

ఆనాటి ఉద్యమంలో వెల్లువగా వచ్చిన గేయాలనూ, పద్యాలనూ, గీతాలనూ, భజన పాటలనూ హరికథలుగా ఎన్నో సంకలనాలు 1922 లో ఈ క్రిందవిధంగా

వెలువడ్డాయి. అవి మహాత్మాగాంధి ప్రబోధపద్యాలు, అల్లూరు సీతారామరాజు పాటలు, మహాత్ముని ఉద్యమవాణి, స్వరాజ్యాందోళనము, భారతమాత పలుకు, రామదండు భజన పాటలు, గాంధీజీవితము, స్వరాజ్యభక్తి కీర్తనలు, తిలక్ హరికథ, స్వరాజ్య దర్పణం ఇలా ఎన్నో జాతీయగేయ సాహిత్య సంకలనాలు వెలువడ్డాయి.

## జాతీయ నాటకాలు:

ఆ రోజుల్లో చిలకమర్తి, తిరుపతి వెంకటకవులు, భారత గాథలకు చెందిన నాటకాలూ, అలాగే భారత చారిత్రక వీరుల గాథలైన "శివాజీ" "రాణా ప్రతాప్" "మేవాడ శౌర్యాగ్ని" "బొబ్బిలి యుద్ధం" "రోషనార" మొదలైన గాంధీ బోధనలనూ, కాంగ్రెసు వుద్యమాన్ని ప్రబోధించే దామరాజు పుండరీకాక్షుడుగారి పాంచాల పరాభవం, గాంధీ విజయం, గాంధీ మహోదయం మొదలైన నాటకాలే కాక ఆంధ్ర మాత, సంస్కారిణి, స్వరాజ్యపతాకం, చీరాల పేరాలగాంధి మొదలైన నాటకాలను ప్రచారంలోకి తెచ్చారు. అలాగే శ్రీపాదవారి విజయధ్వజ నాటకం, మద్దూరి అన్నపూర్ణయ్య, చిచ్చులపిడుగు, 1957 సిపాయి తిరుగుబాటునాటి మంగళపాండ్యా గాథను ఆమంచర్ల గోపాలరావు మొదలైన రచయితలు చెప్పుకోతగిన నాటకాలను వెలువరించారు. అయితే వీటిలో చాలావరకు ప్రదర్శన యోగ్యం కాలేదు.

## నాటి వైజ్ఞానిక ఉద్యమం :

నాటి సత్యాగ్రహ ఉద్యమంలో ఇలా ఎందరో వారి వారి కవితాధారాలను కురిపించారు....అయితే ఎక్కడి కక్కడే బృందాలుగా, వ్యక్తులుగా వారీ కార్యక్రమం జరిపారు కానీ, రాష్ట్రవ్యాపితంగా ఈ వైజ్ఞానిక కార్యక్రమం సంఘటిత ఉద్యమంగా రూపు దాల్చలేదు.

ఎవరికి వారు ఒకే సమస్య మీద కేంద్రీకరించి స్థానికంగా కథలు, గేయాలను వ్రాసి పాడారుగానీ అవీ రాష్ట్రవ్యాపితం కాలేదు. అలాగే నాగరికత అభివృద్ధి చెందిన సర్కారు ప్రాంతాల పట్టణాలలో ప్రభావితులైన మేధావులు మొదలైనవారు తప్పా ఉవ్వెత్తున గ్రామాలలో ఈ వుద్యమం సాగలేదు. అలా అని పల్లెలకు పోకుండానూ లేదు. నాటి సత్యాగ్రహ ఉద్యమం సాగిన ప్రతి పల్లెటూరులోనూ వలంటీర్లు పాటలను ఉద్వేగంగా పాడి బ్రిటిష్ ప్రభుత్వంమీద వ్యతిరేకతను కలిగించారు. ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్రాయటమూ పాడటమూ సాహసవంతమైన విషయం. అయితే ఒకరిద్దరు రచయితలు "బుర్రకథ - హరికథ -

నాటకంలాంటివి తప్పా ఎక్కువ జానపద కళారూపాల ప్రక్రియలను అనుసరించ లేదు.



ప్రగతిశీల విప్లవ ప్రజాకవి కోగంటి గోపాలకృష్ణయ్యా

## పోరాట రంగస్థలం, ప్రజానాట్యమండలి :

ఆ తరువాత జానపద కళారూపాలను ఒక మలుపు త్రిప్పి నూతన ప్రయోగంతో, నూతన దృక్పథంతో ప్రజాసమస్యలను ప్రతిబింబిస్తూ నాటక రంగస్థలంలో నవకాశాన్ని ఏర్పర్చి, ప్రజలను జాగృతమొనర్చి దేశభక్తిని రగులుకొల్పిన సంస్థ ప్రజానాట్యమండలి.

రాష్ట్రవ్యాపితంగా నిర్మించిన ప్రజానాట్యమండలి ఉత్సాహంకొద్దీ నిర్మించింది కాదు. అది ఒక ఉద్ధృత వాతావరణంలో జన్మించింది.

కేవలం ఆర్థిక లాభాల కోసం నిర్మించింది కాదు ఒక ఉన్నతాశయ ప్రబోధంతో దేశానికీ, ప్రజలకూ సేవ చేయటానికి పుట్టింది.

కళ కోసం కాదనీ, అది ప్రజలకు చెందిన ఆస్తి అనీ చాటింది.

దేశంలో వచ్చిన రాజకీయ కల్లోల వాతావరణంలో రూపొందింది ప్రజా నాట్యమండలి.

ఆంధ్ర నాటకరంగంలో అదివరకు ఏనాడూ కనీ వినీ ఎరుగనంత మహత్తర పరిణామాలను సృష్టించింది. గత చరిత్రకంటే ఈ యుగంలోనే నాట్యకళ సంపూర్ణంగా ప్రజాసామాన్యం వద్దకు పోయిందని చెప్పవచ్చు. ప్రజలయొక్క స్థితిగతులకు అనుకూలంగా వారి కష్టాల్లో పాలుపంచుకుని పరిష్కార మార్గాలను కళారూపాల ద్వారా పరిష్కరించింది ప్రజలు నాటకరంగాన్ని తమ కన్నబిడ్డను ఆదరించినట్లు ఆదరించింది ఈ రోజుల్లోనే.

## బానిసత్వపు రోజులు :

అవి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల బానిసత్వంలో మ్రగ్గుతున్న రోజులు. ఒక ప్రక్క సత్యాగ్రహాలూ, శాసనోల్లంఘనాలూ, లాఠీఛార్జీలూ, జైళ్ళ కటకటాల మధ్య ఎందరో స్వాతంత్ర్య సమరయోధులు నానాబాధలు అనుభవిస్తున్న రోజులు. ప్రతి భారతీయుడూ అంతో ఇంతో జాతీయతాభావాన్నీ దేశభక్తినీ కలిగి వున్న రోజులు. యువకులూ, విద్యార్థులూ, టెర్రరిస్టు విప్లవభావాలతోనూ సోషలిస్టు భావాలతోనూ సమావేశమౌతున్న రోజులు.

## ఉత్తేజం పొందిన యువకులు :

దేశంకోసం ప్రాణా లర్పించిన ఆనాటి విప్లవవీరుల జీవితాల నుంచి ఉత్తేజం పొందిన యువకులూ, విద్యార్థులూ, స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలనీ దేశం యొక్క విముక్తికి పాటుపడాలనీ వేలాది యువకులు నాటి యువజనోద్యమంలోకి ఆకర్షింపబడ్డారు.

1933 లో ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి ఆంధ్ర ప్రజాజీవితంలో ప్రముఖ స్థానాన్ని ఏర్పరచుకుంది. సోషలిజం స్థాపన లక్ష్యంగా రాజకీయ కార్యక్రమాలతోపాటు ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనానికి బహుముఖసేవ చేసింది. మితవాద కాంగ్రెసు విధానాలతో విసిగిపోయిన యువకు లందరూ సోషలిష్టు భావాలతో కమ్యూనిస్టుపార్టీ వైపుకు మొగ్గారు.

పీడిత ప్రజాఉద్యమంతోపాటు కమ్యూనిస్టుపార్టీ సమాజశ్రేయస్సు కాంక్షించడమే సాహిత్యం, కళలపరమావధి అనే ప్రగతిశీల దృక్పథాన్ని రచయితలలో

కలిగించటానికి అభ్యుదయ రచయితల ఉద్యమం ద్వారా కృషి చేసింది. ఈ మార్పును కళారూపాలతో, నాటకరంగంలో సాంస్కృతిక రంగంలో కూడా తీసుకు రావడానికి కమ్యూనిస్టు పార్టీ కృషి చేసింది.

## రెండవ ప్రపంచయుద్ధం :

రెండవ ప్రపంచ యుద్ధం ఫాసిస్టుల ప్రళయ ఆర్భాటాలతో మారుమ్రోగింది. ఫాసిస్టు శక్తులకూ, ప్రజాస్వామిక శక్తులకూ పోరాటమది. ధర్మానికి, అధర్మానికి శాంతికి, అశాంతికి ఘర్షణ దినాలవి. దేశదేశాల ప్రజలు అట్టుడికిపోయారు. మానవ సమాజం యొక్క యుగ యుగాల విజ్ఞానం, సంస్కృతీ పశుబలానికి ఆహుతై పోతూ వుంది. ఏ దేశమైనా, ప్రజలైనా, ఈ భయంకర మారణహోమం నుంచి ఈ అగ్ని జ్వాలల నుంచి బయటపడాలని తహతహలాడే భయంకర దినాలవి.

## స్పందించిన యువచైతన్యం :

ఈ స్థితిలో కళాకారులూ, కవులూ, గాయకులూ ఈ హోమగుండం నుంచి ప్రజలను విముక్తి చేయాలనుకున్నారు. అనాటి యువకులందరూ పేయి కంఠాలెత్తి



బెంగాల్ కరువు బుర్రకథ - నాజరు, పురుషోత్తం, రామకోటి

పిడికిళ్ళను బిగించారు. రాబోయే యుద్ధప్రమాదాన్ని గూర్చి దళాలు దళాలుగా బయలు దేరి ప్రచారం చేయసాగారు. ఈ తీవ్రసంచలనంలో ప్రతి కళాకారుడు దేశభక్తి ప్రపూరితుడై పోయాడు. కవులు గేయాలు వ్రాశారు. గాయకులు కంఠాలు ఎత్తారు. ఆంధ్ర ప్రజాసామాన్యమంతా గాఢనిద్రలోనించి మేల్కొల్పారు.

యుద్ధమేఘాలు కమ్ముకున్న ఆనాడు కృష్ణాజిల్లా గండిగుంటలో రాజకీయాలతో పాటు వైజ్ఞానిక శిక్షణాశిబిరం ప్రారంభమైంది. బందరు కాలేజీలో చదువుతూ కాలేజీ ప్యాట్రీద్రస్సుల్లో తన ప్రతిభా విశేషాలను ఆనాడే వెల్లడించుకున్న కోగంటి గోపాల కృష్ణయ్యగారు స్వాతంత్ర్య భావాలను ప్రబోధిస్తూ బుర్రకథను వ్రాశారు. అంటే అంతకు ముందు బాలనాగమ్మ, కామమ్మ, లక్ష్మమ్మ, బొబ్బిలి యుద్ధం మొదలైన బుర్రకథల స్థానంలో స్వాతంత్ర్య ప్రబోధం కోసం తొలిగా వ్రాసిన బుర్రకథ ఇది. ముగ్గురు యువకులు కలిసి స్వాతంత్ర్య పోరాటాన్ని చిత్రించే ఈ బుర్రకథ ప్రజలను వుత్తేజితులాగించింది. ఆ కథా రచనకూ, ప్రదర్శనకూ వైజ్ఞానిక వుద్యమానికీ, ప్రజానాట్యమండలి ఆవిర్భావానికి ప్రథమంగా కోగంటి ప్రముఖ బాధ్యతలు నిర్వహించారు.

## కోగంటి కోయవేషం :

భద్రాచలం ప్రాంతాలనుండి వచ్చే కోయవేషం గురించి అందరికీ తెలిసిందే. ఆ వేషంద్వారా కోయవేషాన్ని ధరించి కోయభాషలో యుద్ధ బీభత్సాన్ని గూర్చి 1943 మే నె బొంబాయిలో జరిగిన కమ్యూనిష్టు పార్టీ అభ్యుదయ రచయితల మహాసభ లలో వివరించాడు. ఉదాహరణకు ఆ సభలో వున్న డాంగేనీ, బలరాజ్ సహానీనీ చూచి ఓ సామి ఏం: ఈతపిక్కలా బక్కచిక్కి పోయుండావు. నాను ఒక్క ఏరు ముక్క కట్టినానంటే ఇంత లావైపోతావు. నా ఏరు ముక్కంటే ఏమనుకున్నారు హిట్లరూ గిట్లరూ ఎగిరి సావాల. ముస్సోలినీ గిస్సోలినీ తుస్సుమని పోవాల. తిండి దొంగలూ, లంచగొండులూ ఎగిరిపోవాల అంటూ అందర్నీ కడుపుబ్బ నవ్విస్తూ అందర్నీ ఆనందసాగరంలో ముంచివేశారు. ఇలా మన పాత కళారూపాన్ని ఈ విధంగా మలుపు త్రిప్పి, కళారూపాల ప్రగతిశీల దృక్పథానికి దోహదం చేశారు.

## ఫాసిస్టు వ్యతిరేక శిక్షణాశిబిరాలు :

బొంబాయి వెళ్ళివచ్చిన దళం కొత్తఉత్సాహంతో తిరిగి వచ్చింది. 1943 లో కృష్ణా జిల్లా కొడాలిలో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణ శిబిరం జరిగింది. ఆ శిబిరంలో రాజకీయాలతోపాటు నూతన దృక్పథంతో జానపద కళారూపాలలో కూడా కళాకారులు శిక్షణ పొందారు. ఈ శిబిరంలో గొల్లసుద్దులు, పకీరువేషాలు, చెంచువేషాలు, సోది, జంతరుపెట్టె, డప్పుపాటలూ, బృందగానాలూ మొదలైనవి శిక్షణ ఇవ్వబడ్డాయి.

శిక్షణ పొందిన కళాకారుల్లు మిక్కిలినేని, మాచినేని, చదలవాడ, పెరుమాళ్ళు, కేశవ రావు, అమృతయ్య, ఏసుదాసు మొదలైనవారు. కోగంటి, కోసూరి పున్నయ్య శిరివి సెట్టి సుబ్బారావు మొదలైనవారు శిక్షణ ఇచ్చారు.

## ఎన్నో శిబిరాలు :

ఆ శిబిరం తరువాత కృష్ణా జిల్లాలో ఎన్నో శిబిరాలు నడిచాయి. ఎందరో కళాకారులు తయారయ్యారు. ఎన్నో బుర్రకథ దళాలు, పాటలు పాడే దళాలు, చిత్ర విచిత్ర జానపద కళారూపాల దళాలు తయారయ్యాయి. కేవలం పురుషులే కాక స్త్రీల దళాలు, బాలబాలికల దళాలు కూడ ఏర్పడ్డాయి. ముఖ్యంగా గుంటూరు జిల్లాలో, మోటూరు ఉదయం దళం, రష్యన్ వీరనారి టాన్యా బుర్రకథను చెప్పేవారు. అలాగే కొండేపూడి రాధ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజని, దళం అల్లూరి సీతారామరాజు బుర్రకథను అత్యద్భుతంగా చెప్పేవారు.

## ఓ, మిట్టిపడే హిట్లరయ్యా? :

ఓ గుత్తాల గోపిరెడ్డి అనే పాత గేయం బాణీతో హిట్లరును గురించి సుంకర గేయం వెలువడింది.

ఓ, మిట్టిపడే హిట్లరయ్యా
ఏటికి ఎదురీదుచుంటివా ॥ఓ॥

కూలిరాజ్యం కూలదోసి
నీదు రాజ్యం నిలపబోతే
సేనలన్నీ చెదరిపోయేనా ॥ఓ॥

కూలిరైతులపాలి స్వర్గం
నేలమట్టం చేయబోయి
కాలుజారి నేలబడితివా ॥ఓ॥

## అలాగే కోలాట కీర్తన :

మాస్కో పొలిమేరలోనా, మారణయంత్రాలు నిలిపి
మాడ్చివేసెరా రెడార్మీ పూడ్చివేసెరా ॥మా॥

లెనినుగ్రాడులోనా, శత్రువలయము చించి
చీల్చేవేసెరా రెడార్మీ కూల్చేవేసెరా ॥మా॥

మరో కోలాట కీర్తన :

స్టాలినోగ్రాడుదాక సాగిరానిచ్చి నిన్ను
ఎఱ్ఱసేన చుట్టుముట్టి గొత్తికోత కోయుచుండ
హిట్లరూ అబ్బ నా కళ్ళు చల్లబడ్డ వోయి హిట్లరూ ॥స్టా॥

స్టాలినంతోఱ్ఱబట్టి కాలు సేతులంట గట్టి
జర్మనీకి తెస్తుసన్న జ్వరము వదల నిన్ను తన్న
హిట్లరూ ఆహ నీ తిక్క కుదిరిపోయెనోయి హిట్లరూ ॥స్టా॥



మిక్కిలినేని, ఉమామహేశ్వరరావు, మాచినేని బుర్రకథ దళం

హిట్లరు వీధి నాటకం :

వీధి నాటకాలను కూచిపూడివారు ప్రముఖంగా ప్రదర్శిస్తున్న తరుణంలో ఆ స్థాయిలో కోగంటి గోపాలకృష్ణయ్య, హిట్లరు వీధి నాటకాన్ని వ్రాశారు. దీనికి కూచిపూడి వేదాంతం వెంకటేశ్వర్లుగారు శిక్షణ ఇచ్చారు. ఫాసిస్టుల ప్రళయార్భాటాలను ఈ విధంగా చిత్రించారు.

కీర్తన

వెడలె హిట్లరు సభకూ
సూటుబూటు నీటులను చూపుతు
జర్మన్ ఫిటింగ్ అఫ్ కటింగుతో ॥వెడ॥

హిట్లరు పరివారంతో — కీర్తన.

సిద్ధమయ్యె హిట్లరూ - యుద్ధమునకు
ముందు వెనుక మస్సోలిని టోజో
కుడి యడమల గోరింగ్ గోబెల్సులు
బలగముతోడను కొలువుకూటముకు ॥వెడ॥

అంటూ వీధి భాగవత కత్తులో నృత్యం చేస్తూ వుండగా వార్తాహరుడు అపజయ వార్తలు తెస్తాడు. అప్పుడు హిట్లరు.

కీర్తన

వినుడి వినుడి నా వీరప్రతాపము
స్టాలి నెంత స్టాలిన్ గ్రాడెంతరా
పక్ష పక్షముకు లక్షల సైన్యము
అంపెద శత్రుల జంపెద నిక్కము ॥వినుడి॥

ఈ విధంగా హిట్లరు అంతముతో వీధి భాగవతం ముగుస్తుంది. ఇలా ప్రగతిశీల దృక్పథంతో కోగంటి పేరిగాడి రాజ్యం, తెలంగాణా వీధి నాటకం సిమ్లా భాగవతం మొదలైనవే కాక ఎన్నో చిత్ర విచిత్ర జానపద కళారూపాలను ప్రజా సమస్యలను తీర్చిదిద్దే ఎన్నో గేయాలను రచించారు.

తధ్యామయాగురుడ :

నందామయాగురుడ నందామయా అనే ప్రాచీన జానపద గేయ బాణీలో కోగంటి గేయం.

తధ్యామయా మనకు తధ్యామయా
ఇంక అనందజీవితమె తధ్యామయా ॥త॥

సకల మానవజాతి చావు బ్రతుకుల జేర్చు
ఘోరయుద్ధము జరుగుచున్నాదయా ॥త॥

సర్వలోక ప్రజ - సోవియట్‌తో జేరి
స్వేచ్ఛకై పోరాడుతున్నాదయా ॥త॥

తుమ్మెద పాట :

ఆంధ్రదేశంలో దసరా పర్వదినాలలో శ్రామిక జన స్త్రీలు, తుమ్మెద పాటలు పాడుకుంటూ రైతు ఇళ్ళకు వచ్చి పారితోషికాలను పొందుతారు. అదేరీతిలో యుద్ధాన్ని గూర్చి సుంకర గేయం ఇలా వెలువడింది.

పాడవే పాడవే తుమ్మెదా
మంచి పాటలెన్నో పాడు ॥తు॥
పండించు పండించు ॥తు॥
మంచి పంటలను పండించు ॥తు॥
దేశాన చూడవే తుమ్మెదా
పెద్ద తిండి కరువొచ్చింది ॥తు॥

పకీరు గీతాలు :

ముఖ్యంగా పకీర్లు అల్లా నామాన్ని జపిస్తూ మహమ్మదీయులను ఆశీర్వదిస్తూ మహమ్మదు ప్రవక్త బోధనలు ప్రచారం చేస్తూ వారిని మాత్రమే యాచిస్తారు. ఆ గీతాల్లో కోగంటి హిందూ ముస్లిం ఐక్యత గూర్చి ఇలా వివరించాడు.

పాడి పంటల్ సల్‌గుండాలి ॥అల్లాకెనాం॥
తల్లి పిల్లల్ సల్‌గుండాలి ,,
అన్ని జాతుల ప్రజలు ,,
వార్కి హేకం కావాలండి ,,
హిందూ ముస్లిములంత ,,
వార్కి హేకం కావాలండి ,,

క్వారీ పాట :

కొండరాళ్ళను బండరాళ్ళను పగలకొడుతూ శ్రమను మరిచిపోవటానికి ఒక రయం ప్రకారం గొంతులు కలుపుతూ వుంటారు. సుంకర హిందూ ముస్లిం ఐక్య తను ఈ విధంగా ప్రబోధిస్తాడు.

ఓ సాయిబన్నయ్యా ఓ సాయిబన్నయ్యా
నీవూ నే కలిసుండీ నిలిచీపోరాలన్నా



అల్లూరి సీతారామరాజు చారిత్రక దళం: బి రామయ్య, కొండపల్లి రాధ, వి. వర్గీజ

వస్తావా అన్నిటికీ వడ్లకీ గుడ్డకీ
వచ్చి పడ్డది కరువా ఓ సాయిబన్నయ్యా ॥౬॥

చెట్టుందా చేనుందా - పొట్టుందీ ఇద్దరికీ
కరువొచ్చి చస్తున్నాం - కాపోళ్ళా అన్నయ్యా

అంటూ ఆనాటి పేద ప్రజల కష్టాలను వివరిస్తూ కనువిప్పు కలిగించారు.

## గొల్లసుద్దులు :

గొల్లసుద్దులను చెప్పేవారు యాదవ చరిత్రకు సంబంధించిన కృష్ణలీలలు, కాటమరాజు కథ మొదలైనవాటిని సుద్దులవారు ప్రచారం చేస్తూ వుంటారు. ఇది మన ప్రాచీన కళారూపం. ఈ రూపాన్ని ఆనాటి పరిస్థితుల కన్వయిస్తూ కోగంటి

గొల్లల గోత్రాలు గొఱ్ఱల కెఱుక
గొఱ్ఱల గోత్రాలు గొల్లల కెరుక
వీరి వారి గోత్రాలు తోడేళ్ళ కెరుకో

అంటూ ఈ బాణీలో ఫాసిస్టుల యుద్ధాన్ని వివరిస్తూ

తూర్పున ఒక నక్క - తుప్ప తలనక్క ॥ఆ॥
పడమర ఒక నక్క - బక్క చిక్కిన నక్క ,,
ఆ నక్క ఈ నక్క - జనాన్ని మాడ్చే ,,
జపాను ప్రభుత్వానికి పెద్ద బొక్క ,,
జర్మనీ గోత్రాలు - జపాను కెరుక ,,
జపాను గోత్రాలు - జర్మనీ కెరుక
జపాను జర్మనీ గోత్రాలు సోవియట్ కెరుకో

## పడవ పాట :

పంటపొలాల ప్రక్కన ప్రవహించే కాలువల్లో పడవల్ని లాగుతూ పాటపాడే విషయం అందరికీ తెలిసిందే ఆ పాట బాణీలో దేశ సమైక్యతను వివరిస్తూ కోగంటి

పడవెళ్ళి పోవుచున్నదీ
ఐక్యతా పడవెళ్ళిపోవుచున్నదీ
అన్ని జాతులవారి కందుతుందీ పడవ
స్వయంనిర్ణయ సూత్రాన్ని
చాటుతుందీ పడవ ॥పడవెళ్ళి॥

అని దేశ సమైక్యతనూ, స్వయంనిర్ణయ సూత్రాన్ని పడవపాటలో వివరించారు.

సోదె :

ఇంటింటికీ తిరిగి జరిగిన విషయాలనూ, జరగబోయే విషయాలనూ సోదె చెప్పే ఎరుకల స్త్రీలను గురించి అందరికీ తెలిసిన విషయమే. అలాంటి సోదెలో కోగంటి

అంబా పలుకు, జగదాంబా పలుకు, మాయమ్మా పలుకు, కంచి కామాక్షమ్మా పలుకు అంటూ.

ఓయమ్మా మేం పిశాచులం గాదె
పెనుభూతాలం గాదె; మాతృద్రోహులం గాదె
మంత్రగాళ్ళం గాదె పెద్ద దోపిడిగాళ్ళం గాదు
ఫాసిస్టు భూతాలం గాము
నీ గర్భవాసాన పుట్టిన బిడ్డలమండీ
తెలియదే తల్లి
నికృష్టపాలన నిలువునా చెండ
ప్రతిజ్ఞ పట్టామె భారతాంబా మము
గన్నతల్లీ

అంటూ ఎన్నో జాతీయ సమస్యల వరకూ ఏకరువు పెట్టి ప్రేక్షకులకు కనువిప్పు కలిగించేవారు.

బుర్ర కథలు :

నాటి నుండి నేటి వరకూ బహుళప్రచారం పొందిన జంగం కథలు ఈనాడు బుర్రకథలుగా వెలువడుతున్నాయి. ఒకనాడు మత ప్రబోధానికి, ఆధ్యాత్మిక తత్వానికి అనుకూలంగా ఉపయోగపడిన జంగం కథలను దేశభక్తికి ప్రతిబింబాలుగా సుంకర కష్టజీవి, రైతు విజయం, స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం, వీరేశలింగం, అల్లూరి సీతారామ రాజు మొదలైన అనేక బుర్రకథలు రచించారు.

నాజరు బెంగాలీ కరువు బుర్రకథను. పల్నాటి వీరచరిత్రను, బొబ్బిలి యుద్ధం మొదలైన బుర్రకథలను ప్రజానాట్యమండలి కళాకారులైన నాజరు, పురుషోత్తం, రామకోటి, మిక్కిలినేని. మాచినేని, పట్టంసెట్టి, కోసూరి పున్నయ్య, సిరివిసెట్టి, పెరుమాళ్ళు, చదలవాడ, వల్లం, కేశవరావు మొదలైన అనేకమంది కళాకారులు రాష్ట్ర వ్యాపితంగా వ్యాపింపచేశారు.

జముకుల కథలు :

జముకుల కథ కాకతీయుల కాలం నుంచీ బహుళ ప్రచారంలో వుంది. అలాంటి కళారూపాన్ని తీసుకుని గురజాడ వ్రాసిన కన్యక గేయాన్ని జముకుల కథగా మార్చిన వ్యక్తి పీసా లక్ష్మణరావు. విష్ణువర్ధన మహారాజు కన్యకను ఎలా చెరపట్టిందీ, కళింగదేశంలో రాజు చేసే దురంతాలను వర్ణిస్తూ వ్రాసిన ఈ కథలో ప్రస్తుత రాజకీయ సాంఘిక సమస్యలను జోడించి అత్యద్భుతంగా వ్రాసిన కథను, పీసా లక్ష్మణరావు,నరసింహారావు, తొత్తడి సింహాచలం, మిక్కిలినేని, మాచినేని ఉమామహేశ్వరరావుల దళం, కన్యక కథను ఆంధ్రదేశమంతటా నే కాక, మద్రాసు విజయవాడ, ఢిల్లీ మొదలైన రేడియో కేంద్రాలలో కూడ ప్రసారం చేయడం జరిగింది.

జంతరు పెట్టె :

ఆంధ్రదేశంలో పర్వదినాలలో జాతర్లలో, ఈ జంతరు తమాషా చూపిస్తూ పిన్నల్ని, పెద్దల్ని అలరిస్తారు. ఈ కళారూపాన్ని కోగంటి

పైసె తమాష చూడర బాబు
ఏమి లాహెరిగ వున్నదొ చూడు
జంతర్ మంతర్ చూడర బాబు

అనే మకుటాన్ని ఇలా మార్చివేశారు

లాయరమ్మ లాయరో - లాయం పెట్టి చూడర బాబు
ఎంత లాయరుగ వున్నదొ చూడు ,,
భారతదేశపు తీరును చూడు ,,
నల్లధనంతో సంచులు నిండి ,,
కొల్లగొట్టిన ఘనులను చూడు ,,
ధరలను పెంచిన ధనికుల చూడు ,,
బ్రిటీషు తొత్తుల కుట్రలు చూడు ,,
గాంధీతాతా బోధలు చూడు ,,
జిన్నా వేసే ఎత్తులు చూడు ,,

అంటూ నాటి ఆర్థిక రాజకీయ సాంఘిక సమస్యలకు సంబంధించిన ఎన్నో దారుణాలను ప్రజా నాట్యమండలి దళాలు ప్రచారం చేశాయి.



మోటూరు ఉదయం, మహంకాళి లక్ష్మి, చింతల కోటేశ్వరమ్మ. టాన్యా బుర్రకథ దళం

**చెంచులు:**

ఏ వూరు ఏ భామ ||నందాన||
ఎవ్వారి భామవే ,,



కన్యక జముకుల కథ: పట్టంసెట్టి, డా|| మిక్కిలినేని, మాచినేని

వినరోరి నరసిమ్మ ||నందాన||
వుండు గూడెం మాది ,,

చేతిడే ముద్దమ్మ ॥నందాన॥
చెయ్యేత్తి దానాలు ,,

అంటూ భద్రాచల ప్రాంతాల నుండి వచ్చి యాచించి వెళ్ళిపోతూ వుంటారు చెంచులు. ఈ బాణీని ఆసరాగా అయ్యాపు వెంకటకృష్ణయ్య దేశభక్తిని ప్రబోధిస్తూ.

మనది భారతదేశమమ్మా ॥నందానా॥
మనది భారతజాతి తల్లీ ,,
భారతీయులము మనమమ్మా ,,
బానిసలమైనాము తల్లీ ,,
మన బాలచంద్రుడుా ,,
మన ఖడ్గ తిక్కన ,,
మన్యంపు వీరులూ ,,
మన రెడ్డిరాజులూ ,,
తమ శౌర్యమయ రక్త ,,
ధారాస్రవంతిలో ,,
తడిసి మెదిపిన వీర ,,
ధాత్రి యిది మా తల్లి ,,
మనది భారతదేశమమ్మా ,,

ఈ విధంగా ప్రాచీన జానపద కళారూపాలను, ప్రజాపోరాటాల రంగస్థలం ప్రజానాట్యమండలి పునరుజ్జీవింపచేసింది. ఆ విధంగా—బుర్రకథ—జముకులకథ - హరికథ - కోలాటం - జంతరుపెట్టె - చెంచీతపాట - పకీర్లు - సైసై నృత్యం-గొల్లి సుద్దులు - సోది - పిచ్చిగుంటుల కథ - వీధి నాటకం, దప్పుల నృత్యం, దప్పుల కోలాటం, చెక్క భజన, జేగంట భాగవతులు, సమిష్టి నృత్యాలు. బృందగానాలు ఇలా ఎన్నో కళారూపాలను ప్రదర్శించారు. కొన్ని వందల దళాలు, వేలమంది కళాకారులు ఈ కార్యక్రమాలను నిర్వహించారు. ప్రజలలో చైతన్యాన్ని కలిగించారు.

ప్రజా నాట్యమండలి:

ప్రజా నాట్యమండలి కళారూపాలను కొన్ని లక్షలమంది చూశారు. ఆనాటి తెలుగు జాతీయ జీవితంలో ప్రజానాట్యమండలి ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్ర

మించింది. అట్టడుగున పడిపోయిన ప్రాచీన కళారూపాల నన్నిటినీ సంస్కరించింది. ఆంధ్రనాటకరంగచరిత్రలో ఒక మహావిప్లవాన్ని తీసుకు వచ్చింది.

ప్రజా నాట్యమండలి దోపిడిదారుల్నీ, సంఘ విద్రోహుల్నీ సంఘంలో వున్న కుళ్ళునూ, కళారూపాల ద్వారా, పాటల ద్వారా, నాటకాల ద్వారా కడిగి వేసింది. ఈ విధంగా అవతికాలంలోనే ఆంధ్రప్రజలలో నూతన చైతన్యం కలిగించింది.

ప్రజానాట్య మండలి ఉద్యమం మహత్తరమైంది. దాని ఆశయాలు గొప్పవి. దాని పోషకులు ప్రజలు. ప్రజా నాట్యమండలి ఆశయాలను, సంప్రదాయాలను దేశంలో అనేక సంస్థలు అనుసరించాయి.

## అన్న తమ్ముల చీలికలు :

దీర్ఘ చరిత్ర కలిగిన కమ్యూనిస్టుపార్టీ 1964 వ సంవత్సరంలో రాజకీయ విభేదాలతో చీలిపోయింది. కమ్యూనిస్టుపార్టీ, మార్క్సిస్టు పార్టీ, మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ, నక్సల్‌బరీ ఉద్యమంతో ఏర్పడిన నక్సలైట్లు, పీపుల్స్ వార్‌పార్టీ ఇలా కమ్యూనిస్టు పార్టీ చీలికలై పేలికలై ఎన్నో శాఖలుగా విడిపోయారు. ఎవరికి వారు అన్ని రంగాలలోనూ వేరేవేరే సంఘాలను పెట్టుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలిగాను, జననాట్యమండలిగాను, ప్రజాసాహితిగాను ఇలా ఎన్నో సాంస్కృతిక సంఘాలు ఏర్పడి అసలు ప్రజానాట్యమండలి విడిపోయింది.

అలాగే, ప్రజానాట్య మండలికి అండదండలుగా వున్న అభ్యుదయ రచయితల సంఘంలో కూడా చీలికలు వచ్చాయి. 1970 లో విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. ఇలా భారత కమ్యూనిస్టు పార్టీ తరపున ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలి, మార్క్సిస్టులు, ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి జనసాహితి ప్రదర్శనాలు, పీపుల్స్ వార్‌గ్రూపు, జననాట్యమండలి ఇలా గ్రూపులుగా చీలిపోయి, ఎవరి పాలసీకి తగిన విధంగా వారు పాటలనూ, కళారూపాలను సృష్టించుకుని పని చేస్తున్నారు. అందరూ అందరికీ కూడూ, గుడ్డా, వుండటానికి ఇల్లు కావాలనేవారే. దోపిడీ విధానం పోవాలనేవారే, అందరికీ సమానత్వం కావాలనేవారే. అందరి ఆశయాలూ ఒకటే అయినా కలిసిపోయి పనిచేసే విధానం ఎవరి తరపునా కనిపెంచడం లేదు. ఈ నేపథ్యంలో ఎవరికి వారై వారి వారి కార్యక్రమాలను సాగించుకుంటున్నారు.

ఇక్కడ నేను ఏ పార్టీనీ, ఏ సాంస్కృతిక ఉద్యమాన్నీ విమర్శించదలుచుకో లేదు. అయితే పూర్వవైభవం మళ్ళీ పునరావృతం కావాలి. జాగృతి నుంచి మేలుకో

వాలి, అన్ని సాంస్కృతిక సంస్థలూ, ప్రజానాట్యమండలి తరువాత వచ్చినవే. అందరూ ప్రజానాట్యమండలి బాటలోనే నడుస్తున్నారు. ప్రజానాట్యమండలి వారసులే వారు. ఏ ప్రజల కోసం వారు పని చేస్తున్నారో వారినందరినీ నేను అభినందిస్తున్నాను. అందరూ ఆత్మ విమర్శ చేసుకుని ముందుకు నడవాలన్నదే నా కోరిక.

## మాతృసంస్థ ప్రజానాట్యమండలి :

ప్రజా నాట్యమండలి కళారూపాలను కొన్ని లక్షల మంది చూశారు. ఆనాటి తెలుగు జాతీయ జీవితంలో ప్రజానాట్య మండలి ఒక ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది. అట్టడుగున పడిపోయిన ప్రాచీన కళారూపాలనన్నిటినీ సంస్కరించింది. ఆంధ్ర సాంస్కృతికోద్యమంలో మహావిప్లవాన్ని తీసుకు వచ్చింది.

ప్రజానాట్య మండలి దోపిడిదారుల్నీ, సంఘ విద్రోహుల్నీ సంఘంలో వున్న కుళ్ళునూ, కళారూపాల ద్వారా, పాటల ద్వారా, నాటకాల ద్వారా కడిగి వేసింది. ఈ విధంగా అనతికాలంలోనే నూతన చైతన్యం కలిగించింది.

ప్రజానాట్యమండలి ఉద్యమం మహత్తరమైంది. దాని ఆశయాలు గొప్పవి. దాని పోషకులు ప్రజలు. ప్రజానాట్య మండలి ఆశయాలనూ, సంప్రదాయాలనూ దేశంలో అనేక అభ్యుదయ నాటక సంస్థలు అనుసరించాయి. అభ్యుదయ నాటక సమాజాల పేర్లతో ప్రజానాట్య మండలి ఉద్యమం కొత్తరూపు తీసుకుంది. ఆనాటికీ ఈనాటికీ ప్రజానాట్యమండలి అజేయమైంది.

నలభై అయిదు సంవత్సరాల క్రితం స్థాపించబడిన ప్రజానాట్య మండలి ఉద్యమం.... తెలంగాణా పోరాటంలో పని చేసింది. ప్రజానాట్య మండలి కళాకారులు నాటి కాంగ్రెసు ప్రభుత్వ దారుణ హింసాకాండకు గురైనారు. డా॥ రాజారావులాంటి ఉద్యమ నిర్మాతలు ఎందరో అమరులైనారు. వారి పేర్లన్నీ ఇక్కడ ప్రస్తావించడానికి అవకాశం లేకపోయింది. కావాలని ఏ కళాకారుణ్ణీ విస్మరించలేదు. అందరూ మహానుభావులే అందరికీ వందనాలు.



# బంధం - అనుబంధం

# ఆయా రాష్ట్రాల జానపద కళా విన్యాసం

తరతరాలుగా ప్రజల సుస్రూతలూగించిన జానపద కళారూపాలు ప్రజలలో ఎంతటి సంచలనాన్ని కలిగించాయో, అవి ప్రజా జీవితంలో ఎలా పెనవేసుకుపోయాయో, వారి వినోద విజ్ఞాన వికాసాలకు ఎంతగా తోడ్ప డ్డాయో, క్రమానుగతంగా ప్రజాదరణ లేక ఎంతగా శిథిలమై పోయాయో ఈనాడున్న కళారూపాలు ఎలా కృశించిపోతున్నాయో పైన వివరంగా తెలుసు కున్నాం.



అలాగే ఆయా సోదర రాష్ట్రాలలో ఆయా జాతుల, మతాల, భాషల, సాంస్కృతిక వ్యవ హారాల కనుగుణంగా, ఆదిమకాలం నుండి ఆధునిక కాలంవరకూ ఎన్నో జానపద కళారూపాలు అభి వృద్ధి పొందాయి. ప్రజలను ప్రభావితం చేశాయి. మన కళారూపాలను గురించి తెలుసుకోవడంతో పాటు. ఇతర రాష్ట్రాల కళారూపా లను గురించి తెలుసుకోవడం ఎంతో అవసరం.

## కర్ణాటక

మన ఇరుగు పొరుగు రాష్ట్రాలైన తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్ర కళారూపాలకూ ఎంతో సారూప్యముంది. మన రాష్ట్రంలో వున్న కళారూపాలు కొన్ని కన్నడ రాష్ట్రాలలో వున్నాయి. అలాగే తమిళనాడులో వున్నాయి. ఒకప్పుడు ఈ రాష్ట్రాలన్నీ ఒకే రాజుల ఏలుబడిలో వుండటంవల్ల, ఒకే రకమైన కళారూపాలు కూడా అభివృద్ధి చెందివుంటాయి. అలా చూసుకున్నప్పుడు మన తోలుబొమ్మలూ, యక్షగానాలూ, బుట్టబొమ్మలూ, పాములవాడి నృత్యాలూ, కీలుగుఱ్ఱాలూ, హరి కథలూ మొదలైనవి అనేకం వున్నాయి.

ముఖ్యంగా కర్ణాటకలో అత్యంత ప్రాముఖ్యత వహించేవి యక్షగానం, పురవి అట్టం, నందికోళ్ కుణితి, వీరభద్ర కుణితి, రంగద కుణితి, వీరముఖల్ కుణితి, తూరి కుణితి మొదలైనవి ముఖ్యంగా వున్నాయి. కుణితి అంటే నృత్యం. అలాగే 'గారుడీ బొంబె' అన్న కళారూపం చాలా ముఖ్యమైనదంటారు ప్రొఫెసర్ ఎస్. గంగప్పగారు నాట్యకళ, జానపద కళల ప్రత్యేక సంచికలో.

పౌరాణిక సంబంధమైన కళారూపాలలో భాగవత కాలజ్ఞాని, గమకి, కీర్తన కార, ప్రవచనకార. జంగమ. గొరవ. గొండలిగ. కథగార. హాస్యగార, నకలి నట్టువ, బహురూపి, హగలు వేష ఆట. అంటే మన పగటివేషాల మాదిరి. అలాగే కొలిబసవ (గంగిరెద్దాట), మారమ్మ, దాసరాట మొదలైనవన్నీ మన తెలుగుదేశంలో వున్నట్లే వున్నాయి.

## కేరళ

కేరళలో ప్రసిద్ధిగాంచిన నృత్యాలలో కథకళి చాలా ముఖ్యమైంది. దానిని శాస్త్రీయ నృత్యంగానే భావిస్తారు. అలాగే పూజా సమయంలో 'పులయనులు' పూనకం అనే నృత్యాన్నీ, ఓనం పండుగ సమయంలో 'కైకొత్త కళి' అన్న నృత్యాన్నీ, కుమ్మి నృత్యాన్నీ చేస్తారు. తెలుగు దేశంలో వున్నట్లే ఇక్కడ కూడ తోలుబొమ్మలాటలు, కోలాటం. హరికథ మొదలైన కళారూపా లున్నాయి. అలాగే పాలఘాట్ అడవులలో గిరిజనులు చేసే 'ఎవేలకరడి' అనే వేట నృత్యముంది. మలబారు ప్రాంతంలో కఱ్ఱ ముక్కలు పట్టుకుని చేసే 'మొప్లాహ్కళి' నృత్య ముంది. అలాగే మహాభారత యుద్ధ గాథలకు సంబంధించిన 'వెలక్కలి' వీరనృత్య ముంది. కేరళలో అందరినీ ఆకర్షించే పడవ పందాలు వున్నాయి, పందాలు అయిన తరువాత పల్లెల్లో యువతులు 'అట్టపూ' అనే నృత్యం చేస్తారు.

## తమిళనాడు

తమిళనాడులో శాస్త్రీయ నృత్యంగా భరతనాట్యం అధిక ప్రాముఖ్యం వహిస్తూ వుంది. అయితే తమిళ ప్రాంతంలో అధిక ప్రచారంలో వున్న నృత్యం తెరుకూత్తు. ఇది సంగీత ప్రధానమైన జానపద బయలు నాటకం. ద్రౌపదీ హరణం ప్రధాన ఇతి వృత్తం. ముఖ్యంగా దేవాలయాలలో దీనిని ప్రదర్శిస్తారు.

అలాగే 'కొరవంజి' కీలుగుఱ్ఱాల ఆట వుంది. అలంకరించిన ఇత్తడి బిందెను నెత్తిమీద పెట్టుకుని చేసే చిందు నృత్యం కన్నుల పండువుగా వుంటుంది. అలాగే కోలాటం, కుమ్మి, గరగ మొదలైన స్త్రీలుచేసే నృత్యాలు అధికప్రాముఖ్యాన్ని ఇస్తు న్నాయి. ఇవి ఆంధ్రదేశంలోకూడా ప్రచారంలోవున్నాయి.



## మహారాష్ట్ర

ఆంధ్రప్రదేశ్‌లో మాదిరే మహారాష్ట్రంలో తోలు బొమ్మలాటలు, యక్షగానం, హరికథ వున్నాయి. మహా రాష్ట్ర ప్రజలు చూచి ఆనందించే జానపద నాట్యం,

M - 50

తమాషా, ఆరుబయలు రంగస్థలంలో మూడువైపుల తెరువబడి వుంటుంది. విఘ్నేశ్వర ప్రార్థనానంతరం వాద్యబృందంవారు మంచి కోపులో పాటలను వినిపిస్తారు. తరువాత గోపీ నృత్యం వుంటుంది. ఇందులో సంవాదంతో కూడిన నృత్యాలు కొంతవరకు అసభ్యంగా వుంటాయి. సంగీత బాణీలు మంచి రక్తి నిస్తాయి. ఈ నాట్య బృందాన్ని 'ఫడ్' అంటారు. డప్పు, తుంతంన్యా, అనే వాయిద్యాలను వాయిస్తారు. మధ్య మధ్య లావణీకి సంబంధించిన శృంగార, వీర గీతాలను ఆలాపిస్తారు.



మహారాష్ట్రలో దీపక్ నృత్యమూ, లేజిక్ నృత్యమూ బహుళ జనాదరణలో వున్నట్లు డా॥ డి. వై. సంపత్ కుమార్ నాట్యకళ జానపద కళల ప్రత్యేక సంచికలో ఉదహరించారు.

గోకులాష్టమినాడు 'దహిబండి' అనే నృత్యం చేస్తారట. దహి అంటే పెరుగు. పాలూ, పెరుగులను దొంగిలించే శ్రీ కృష్ణ లీలలకు సంబంధించిన నృత్యాలు చేస్తారు.

లలిత ముద్ర అనే నృత్యాన్ని మధ్యయుగం నుంచి సంప్రదాయంగా ప్రదర్శిస్తున్నారు. ఒకనాడు పౌరాణిక గాథలకే ప్రాముఖ్యం వున్నా, ఈనాడు దైనందిన జీవితంలో తారసిల్లే పాత్రలను దృష్టిలో పెట్టుకుని వ్యంగ్యంగా చిత్రిస్తున్నారు. లలిత మంటే నవరాత్రికి జరిగే ఉత్సవాలలో చేసే సంగీత కీర్తనలు.

అలాగే ''గోంఘల్'' నృత్యాన్ని చేస్తారు. ఈ నృత్యాన్ని ప్రదర్శించేవారు "గోంఘల్" అంటూ పాట పాడుతూ నృత్యం చేస్తూ, అంబాదేవిని ప్రార్థిస్తారు. వివాహ సమయాల్లో ఈ ప్రదర్శనాలను ఏర్పాటు చేస్తారు.

''ధోలానాచ్ ''దశావతార'', ''తరవ'', ''కోలయానాచ్'' (జాలరి నృత్యం) రాధానృత్యం. ''దిండి'', ''కూట'', ''త్రిపి'', ''గోపనృత్యం'', ''గౌరీగణపతీనాచ్'', ''శోహడ'' అనే జానపద నృత్యనాటకాలు, బాలికలు చేసే ''ఫుంగడి'' నృత్యాలు మొదలైనవి మహారాష్ట్రలో ప్రసిద్ధి పొందాయి.

## రాజస్థాన్

జానపద కళారూపాలకూ, జానపద నృత్యాలకు రాజస్థాన్ ప్రముఖస్థానం వహించింది. రాజస్థాన్‌లో వివాహ సందర్భాలలో ''ఘోరియా'' అనే నృత్యం

పేరు పొందింది. ఘోరియా అంటే కొయ్య కఱ్ఱలు పట్టుకుని వలయాకారంగా ఏర్పడి, కఱ్ఱలు కొడుతూ లయబద్ధంగా నృత్యాలు చేస్తారు. ఈ నృత్యం ఎంతో ఆకర్షణీయంగానూ, ఉత్తేజకరంగానూ వుంటుందంటారు సంపత్‌కుమార్. అలాగే దేవీ నవరాత్రి సమయాలలో ''గర్బా'' నృత్యం చేస్తారు. రాజపుత్ర స్త్రీలు పాటలు పాడుతూ చేసే ''మొహంలో'', ''ఫందారో'' నృత్యాలు సాంప్రదాయ నృత్యాలుగా వర్ధిల్లాయి. ముఖ్యంగా ఈ నృత్యాలను వివాహ సందర్భాలలో చేస్తారు.

తర్‌తల్వార్ కత్తిసాము నృత్యాన్నీ, ఢోలు నృత్యాన్నీ హోలీపండుగలో గిర్ నృత్యాలను పురుషులు అత్యద్భుతంగా చేస్తారు.

అంతేకాక అజ్మీరులోని ''సస్పేల'' జానపద నృత్యాలనూ మౌంటుఆబూ లోయలలో గిరిజనులు చేసే గరాసియాలనూ, 'ఖయాల్' అనబడే నృత్యనాటకాలను, రాజస్థాన్ ప్రభుత్వం గుర్తించి వాటిని పోషిస్తూ వుంది. భవాయ్ అనే కులంవారు అయిదు వందల సంవత్సరాలుగా ఈ నృత్య నాటకాలను ప్రదర్శిస్తూ వున్నారు. వారి జీవితాలను అందుకే అంకితం చేసి ఆ కళారూపంద్వారానే జీవిస్తున్నారు.

రాజస్థాన్ జానపద నృత్యాలకు పేరెన్నిక గన్న రాష్ట్రం. నెత్తిమీద బిందెలు పెట్టుకుని ఆడే ''తేరాతాలీ'' నృత్యమూ, వెదురు కఱ్ఱలతో తయారు చేసిన గుఱ్ఱాన్ని భుజాలకు తగిలించుకుని ఆడే ''కుచ్చిఘోరి నృత్యం'' పూజా సందర్భాలలో ఆడే గౌరి నృత్యం ప్రశంసించ తగ్గవి.

## అస్సాం

ఎక్కడో ఈశాన్య సరిహద్దు రాష్ట్రమైన సౌరాష్ట్రంలో నాగనృత్యాలు ఎంతో పేరు పొందాయి. ఋతువులకు సంబంధించిన ''వైశాఖి నృత్యం'', ''బిహూ నృత్యం''. ''ఖాళీ నృత్యం'', పగలంతా కష్టపడి సాయం సమయంలో చేసే బగురుంబ నృత్యాలు, పంటల సమయంలో ''మెయ్‌గెనెయ్'' నృత్యాలు, యాషై కొండల్లోనూ, బ్రహ్మపుత్ర లోయలలో చేసే వెదురుగడల నృత్యం, మిజోజాతి గిరిజనులు చేసే ''భౌల్లినృత్యం'', ''గారోనృత్యం'', ''మిరిహుంషారీ నృత్యం'' బోడోజాతివారి యుద్ధనృత్యాలు, ఖైత్యజాతివారి ''లాహా'' అనబడే మత సంబంధమైన నృత్యాలు, నాగాజాతివారి త్రిశూల నృత్యాలు, కోడిపుంజుల పోట్లాట నృత్యాలూ, యుద్ధ నృత్యాలూ ఎంతో ప్రఖ్యాతి వహించాయి.



## మణిపురి

భారతీయ శాస్త్రీయ నృత్యాలలో మణిపురి లాలిత్య నృత్యం ఎంతో ప్రఖ్యాతి వహించిన నృత్యం. అలాగే భక్తిసంబంధమైన "రాసనృత్యం", లాయ్‌హెరోబ, శబల్‌చోంబ్‌బీ-ఖంబడౌయంబి (శివపార్వతుల నృత్యం) "పుంగ్‌చోలం నృత్యం" హోలీపండుగలో చేసే ధాబల్‌ఛోంబీ నృత్యం, గిరిజనుల నృత్యమైన హెలోయ్ నృత్యం, "ముఖోరిలాం" నృత్యం, కబుయ్ నాగజాతివారుచేసే "పైచర్" పౌన్ సాలం, థెండన్‌ఫెయ్‌బోక్ మొదలైన జానపద నృత్యాలు ఎంతగానో ప్రాముఖ్యం వహించాయి.



అలాగే బర్మా సరిహద్దు కొండలలో అడవులలో వున్న "సంగ్‌తం" నాగజాతివారు ఒకరికి గౌరవార్థంచేసే విందులో "నెరిచుంగ్టి" నృత్యమూ. వేటకు బయలుదేరే సమయంలో చేసే "సంగ్‌ఫా నృత్యం" గ్రామాలను దాడిచేసే ముందు "బయక్ సుట్ సుక్" నృత్యాలను చేస్తారు.

భూటాన్ ప్రాంతంలో బౌద్ధమత సాంప్రదాయాలకు అనుగుణంగా కృత్రిమ ముఖాలుగా మాస్కులు ధరించి నృత్యాలు చేస్తారు. ఇవే "లేపాచ్", "షావ్‌ధో" నృత్యాలుగా ప్రసిద్ధి పొందాయి.

## మధ్యప్రదేశ్

మధ్యప్రదేశ్‌లో గోండులు చేసే "కర్మా నృత్యం", భిల్లులుచేసే "జబురియా నృత్యం", "లడా లడీ" నృత్యాలూ ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తాయి.

"కట్‌పుత్లీ" అనే బొమ్మల నృత్యప్రదర్శనం, మధ్యప్రదేశ్‌కు చెందిన జానపద కళారూపాలలో ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. భారత రామాయణగాథల్ని బొమ్మలచేత అభినయం చేయిస్తూ నృత్యం చేయిస్తూ ప్రదర్శిస్తూ వుంటారు.

బస్తరు జిల్లాలో గిరిజనులు పౌర్ణమినాటిరాత్రి "నవరాణి" నృత్యాన్నీ, మాఘమాసంలో "దేవరి" నృత్యాన్నీ. చైత్రమాసంలో "చైత్రదండ" నృత్యాన్నీ, శ్రావణమాసంలో "ఘోంగా" నృత్యాన్నీ చేస్తారు.

## బెంగాల్

బెంగాల్‌లో ఆదిమవాసులు చేసే "సంతాల్" నృత్యమూ, వివాహ సమయాలలో చేసే "గులేరియా" నృత్యమూ, దసరా సందర్భంలో దుర్గాపూజలనాడు చేసే

''బిత్రా'' నృత్యమూ, పంట కోతలు ముగిసిన తరువాత చేసే ''బౌలు'' నృత్యమూ చూడముచ్చటగా వుంటాయంటారు సంపత్‌కుమార్‌గారు.

## పంజాబు

పంజాబు జానపద కళారూపాలలో పేరెన్నిక గన్నదీ, ప్రజలనెక్కువగా ఆకర్షించేదీ భాంగ్రా నృత్యం. గోధుమ విత్తనాలను చల్లే సమయంలో ఎంతో ఆనందంగా సామూహికంగా ఈ భాంగ్రా నృత్యాన్ని చేస్తారు. ఈ నృత్యాన్ని భారత దేశంలో అన్ని ప్రాంతాలవారూ మెచ్చుకోవటమేకాక విదేశీయుల మన్ననలను కూడా అందుకుంది. అలాగే కులూ లోయలో చేసే ఖడ్గ నృత్యం కూడా చెప్పుకోతగిందే! పంజాబులో ప్రత్యేకంగా చేసే ''గిద్ద'' నృత్యమూ, పురుషులు చేసే మరో నృత్యం ''ఝుమర్'' నృత్యమూ చెప్పుకోతగినవి. అలాగే ''జామీర్'', ''ధృస్'', ''సమ్మిలోధి'', ''దమల్'' అన్న నృత్యాలు కూడా చెప్పుకోతగినవి.

## బీహారు

బీహారులో ''హో'' అనే తెగవారు దేవపూజ సమయాల్లో చేసే ''మాఘే'' నృత్యమూ అలాగే వేటలోనూ, యుద్ధసమయాల్లోనూ చేసే ''బా'' నృత్యమూ, వ్యవసాయతరుణంలో చేసే ''జోంనామా'' మొదలైన నృత్యాలు చెప్పుకోతగినవి.

అలాగే ఛోటా నాగపూర్ ప్రాంతంలో ఒరియన్ జాతివారు ''జదుర్'' నృత్యాన్నీ, రాంచీ ప్రాంతపు గిరిజనులు ''ఖరియాల'' నృత్యాన్నీ, ''జిటియా'' నృత్యాన్నీ చేస్తారు.

## ఉత్తరప్రదేశ్

ఉత్తర ప్రదేశ్‌లో ఎక్కువ ప్రచారంలోకి వచ్చిన ''జరాదినటి'' నృత్యం ముఖ్యమైంది. ఈ నృత్యంలో బాలికలు పళ్ళెములను అత్యంత చమత్కారంగా సుందరంగా వ్రేళ్ళమీద త్రిప్పుతూ వయ్యారంగా నృత్యాలు చేస్తారు. అలాగే ఆల్లోరా కొండల్లో ''భోటియా'' గిరిజనులు చేసే ''రంగ్ భంగ్'' నృత్యమూ టెహ్రీగార్వాల్ గిరిజనులు చేసే ''ఛౌపలకేదార'' నృత్యమూ శౌర్యవ్రతాపాలను ప్రదర్శించే పాండవ నృత్యమూ బహుజనాదరణ పొందినవంటారు సంపత్‌కుమార్‌గారు.



## సౌరాష్ట్ర

శ్రీకృష్ణ భగవానుని జీవిత గాథలైన "దాండియా", రాసనృత్యాలు" "కోలాట నృత్యాలు", "పల్లీనృత్యాలు" అలాగే జాలరులు చేసే "పఢర", "మల్హారి" నృత్యాలు హుంటాషాని అనబడే హోలీ నృత్యమూ ఎంతో ప్రఖ్యాతి వహించాయి.

## కాశ్మీరు

కాశ్మీరు ప్రాంతంలో స్త్రీలు చేసే "క్రజీ" నృత్యమూ, బరెడ్వాలో వున్న కైలాస సరస్సువద్ద జరిగే వుత్సవాలలో "గద్దీ" నృత్యమూ సాంప్రదాయ నృత్యాలుగా వర్ధిల్లాయి.

## ఒరిస్సా

ఒరిస్సా మయూర్‌భంజ్ సంస్థానంలో ప్రపంచఖ్యాతి పొంది అనాదిగా వస్తున్న "చౌ" నృత్యాలూ, గ్రామీణ నృత్యాలైన పైర్, గురుద్వాహన్, మాయా శబరి నృత్యాలు ప్రసిద్ధి పొందాయి. 'చౌ' నృత్యం ప్రత్యేకత, ముఖాలకు మాస్కులు తగిలించుకుని నృత్యం చేస్తారు.

ముఖ్యంగా ఒరిస్సాలో గోండులు దున్నపోతు నృత్యం చేయడం చాలా ప్రసిద్ధి అంటారు ఎస్. గంగప్పగారు.



# రచనకు తోడ్పడిన గ్రంథాలు


బసవపురాణం, పండితారాధ్య చరిత్ర — పాల్కురికి సోమనాథుడు

తెలుగు సంస్కృతి - తెలుగు విజ్ఞాన సర్వస్వం — మల్లంపల్లి సోమశేఖర శర్మ

ఆంధ్రుల సాంఘిక చరిత్ర — సురవరం ప్రతాపరెడ్డి

శుకసప్తతి కథలు — కదిరీ పతి

ఆంధ్ర మహాభారతం — తిక్కన

యక్షగాన వాఙ్మయం — డా॥ యస్వీ జోగారావు

క్రీడాభిరామం —

దశావతార చరిత్ర — శ్రీనాథుడు

కాశీ ఖండం — ,,

భీమ ఖండం — ,,

పల్నాటి వీర చరిత్ర — ,,

ఆంధ్రుల చరిత్ర — ఏటుకూరి బలరామమూర్తి

తెలుగు జానపద గేయ సాహిత్యం — డా॥ బి. రామరాజు

మన ప్రాచీన కళలు - పుట్టు పూర్వోత్తరాలు — ఎల్లోరా

జానపద నృత్య కళ — డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి

జానపద కళా సంపద — డా॥ తూమాటి దోణప్ప

జానపద విజ్ఞానం — డా॥ బిట్టు వెంకటేశ్వర్లు

ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి — కంభంపాటి సత్యనారాయణ

ప్రజా వాఙ్మయము — చింతా దీక్షితులు

దక్షిణ భారత శాసనములు —

యక్షగానం, నాట్యకళ — శ్రీనివాస చక్రవర్తి

జానపద నృత్యాలు — నేదునూరి గంగాధరం

కాటమరాజు కథలు — డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

ప్రజా కళారూపాలు — డా॥ జయధీర్ తిరుమలరావు

చక్కె భజన — డా॥ బిట్టు వెంకటేశ్వర్లు

తంజాపుర ఆంధ్ర నాయక చరిత్రము — కురుగంటి సీతారామయ్య

జానపద విజ్ఞానం —ఆర్. వి. యస్. సుందరం

నటరాజ రామకృష్ణ —గ్రంథాలు, వ్యాసాలు

నా చిన్ననాటి ముచ్చట్లు —డా॥ కే. యస్. కేసరి

భాస్కర శతకము —

సంగీతం - నృత్యం - నాటకం —ఆంధ్రప్రదేశ్

1970 - జానపద కళోత్సవాల సంచిక. (నాట్య కళ)

కిన్నెర సంచికలు.

నాట్యకళ పత్రికలు.

ఆంధ్ర పత్రిక - ఆంధ్ర ప్రభ - ఆంధ్రజ్యోతి - విశాలాంధ్ర - ఈనాడు మొదలైన పత్రికలు.

ప్రజా నాట్యమండలి సదస్సు సావనీర్లు.

